## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

Subject

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

Language

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖



మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

శ్రీః

# ప్రస్తావన

ఇతర శాస్త్రాలన్నింటికీ ఉన్నట్లుగానే అర్థశాస్త్రానికి కూడా అతిప్రాచీనమైన చరిత్ర ఉన్నది. అర్థశాస్త్రానికి సంబంధించిన ఈ ప్రాచీన వాఙ్మయంలోని విషయాలన్నీ చక్కగా ఆకళించుకొని, తన అనుభవాన్ని కూడా జోడించి అత్యుత్తమమైన "అర్థ శాస్త్రం" అనే గ్రంథాన్ని రచించిన మహామేధావి కౌటిల్యుడు. కౌటిల్యునికి తలిదండ్రులు పెట్టిన పేరు విష్ణుగుప్తుడు. చణకుని కుమారు డవడం చేత (లేదా 'చణక' అనే ప్రదేశంలో పుట్టడంచేత) చాణక్యుడనే పేరు వచ్చింది. ఈతడు అర్థశాస్త్రంలో కొన్నిచోట్ల కార్యసాధనానికే ప్రాధాన్యం ఇచ్చి కుటిలము లైన మార్గాలు ఉపదేశించినాడనే కారణంచేత 'కౌటిల్యుడు' అనేపేరు తరవాత వచ్చి ఉంటుంది అని కొందరు అంటారు. కౌటిల్యుడు అనేది గోత్రనామం అని శామశాస్త్రిగారి అభిప్రాయము. కొన్ని ప్రకరణాల చివర 'కౌటిల్య' కు బదులు 'కౌటల్య' 'కౌటలీయ' అని కూడ ఉంది.

కౌటిల్యుని గురించీ, అతడు రచించిన అర్థశాస్త్రం గురించీ కొన్ని ప్రాచీన గ్రంథాలలో నిర్దేశాలు ఉన్నా చాలా కాలం వరకూ అది నష్టప్రాయం అయిపోయింది. ఈ అర్థశాస్త్రాన్ని పునరుద్ధరించిన గౌరవం మైసూరు ప్రాచ్యసంశోధనా సంస్థలో అధికారిగా ఉన్న పం. శామశాస్త్రికి దక్కింది. ఆయన ప్రప్రథమంగా ఈ గ్రంథాన్ని గూర్చిన విస్తృత వర్ణనంతో కొన్ని భాగాలు "ఇండియన్ ఎంటిక్వెరీ" లో 1905 లో ప్రకటించారు. 1909లో సంపూర్ణగ్రంథాన్ని చక్కగా సంపాదించి ప్రచురించారు. పాండిత్యపూర్ణమైన భూమికలో కౌటిల్యుడు చంద్రగుప్తుని అమాత్యుడనీ, అతడే అర్థశాస్త్రం రచించినాడనీ, ఆ గ్రంథమే ఇది అనీ సప్రమాణంగా, సయుక్తికంగా ప్రతిపాదించినారు.

ఐతే భారతదేశానికి సంబంధించిన ఇతరగ్రంథాల విషయంలో చేసినట్లుగానే ఈ గ్రంథం విషయంలో కూడా చాలా మంది పాశ్చాత్యులు అనేక సందేహాలు ప్రకటించారు. డా.ఔ వీ ఈ అర్థశాస్త్రం క్రీ.శ. మూడవ శతాబ్దిలో ఎవరో రచించిఉంటారనీ, కౌటిల్యుడనే వాడు కల్పితవ్యక్తి అనీ వ్రాశాడు. ఇంచుమించుగా వింటర్‌నిట్జ్, కీథ్ మొదలైనవారు కూడా ఇలాంటి అభిప్రాయాన్నే వ్యక్తీకరించాడు. ఐతే హిల్‌బ్రాట్, హర్టల్, యాకోబీ, స్మిత్ మొదలైన పండితులు శామశాస్త్రిమతాన్నే సమర్థించారు. డా.జస్‌వాల్, ఔ వీ చెప్పిన ఆక్షేపణలన్నింటికీ సమాధానం చెప్పుతూ ఇంతట ఉద్గ్రంథాన్ని వంచనాగ్రంథం అనడం సాహసమే అవుతుందనీ, కౌటిల్యుడు కల్పితవ్యక్తికాదనీ,

చంద్రగుప్తమౌర్యుని (క్రీ.పూ. 325-273) మహామాత్యుడనీ, క్రీ.పూ.400 ప్రాంతంలో ఈ గ్రంథం రచించినాడనీ ప్రతిపాదించినాడు. శ్రీ జయచంద్ర విద్యాలంకార్, తమ "భారతీయ ఇతిహాస కీ రూపరేఖా" అనే గ్రంథంలో కీథ్ చూపిన యుక్తుల నన్నింటినీ ఖండించి పై మతాన్ని సమర్థించారు.

అతిప్రాచీనకాలంనుంచీ ఈ అర్థశాస్త్రం ప్రభావం ఇతరగ్రంథాలమీద ప్రసరించింది. నిజానికి సంస్కృతసాహిత్యం మీద అర్థశాస్త్ర - కామశాస్త్రాల ప్రభావం ప్రసరించినట్లుగా మరి ఏ ఇతరశాస్త్రాల ప్రభావం ప్రసరించలేదు. వీటి తరవాత చెప్పదగినది వ్యాకరణశాస్త్రం. కామందకుడు తన నీతిసారంలో (క్రీ.శ.400 ప్రాంతం) తాను తన గ్రంథాన్ని అర్థశాస్త్రాన్నే ఆధారంగా తీసుకుని వ్రాస్తున్నట్లు, ఆ అర్థశాస్త్రం రచించినవాడు విష్ణుగుప్తాపరనామధేయుడైన కౌటిల్యుడన్నట్లూ, ఈతడే నందవంశాన్ని నిర్మూలించి మౌర్యచంద్రగుప్తుణ్ణి రాజుగా చేసినట్లు స్పష్టీకరించి ఉన్నాడు. కాళిదాసు-భారవి-మాఘాదుల కావ్యాలపైన కూడా అర్థశాస్త్రప్రభావం చాలాచోట్ల కనబడుతుంది. దండి-బాణభట్టులు ఈ గ్రంథాన్ని ఉట్టంకించి ఉన్నారు. క్రీ.శ.300 ప్రాంతానికి చెందిన పంచతంత్రంలో కూడా చాణక్యుని పేరు పేర్కొనబడింది. క్రీ.శ.600 ప్రాంతానికి చెందిన విశాఖదత్తుడు ముద్రారాక్షసంలో ఈ కౌటిల్యుని చరిత్రనే కథావస్తువుగా తీసికున్నాడు. ఈ విధంగా కౌటిల్యుడు ఆతని అర్థశాస్త్రమూ కూడా అతిప్రాచీనకాలంనుంచీ భారతీయవాఙ్మయంలో స్థిరమైన చోటు చేసుకోవడంలో ఆశ్చర్యం లేదు కాని కొందరు ఏతదీయయాథార్థ్యాన్ని శంకించడమే ఆశ్చర్యజనకంగా ఉంది.

అర్థశాస్త్రంలో 15 అధికరణాలు ఉన్నాయి. ఒక్కొక్క అధికరణం కొన్ని అధ్యాయాలుగా విభజింపబడింది. మొత్తం 150 అధ్యాయాలు ఉన్నాయి. సాధారణంగా ప్రధానవిభాగం అధ్యాయాలుగాను, తదనంతరవిభాగం అధికరణాలుగాను ఉంటుంది. కౌటిల్యుడు చేసిన విభాగం దానికి విరుద్ధంగా ఉన్నది. వాత్స్యాయనుని కామసూత్రంలో అర్థశాస్త్రానుకరణచ్ఛాయలు అధికంగా కనబడుతున్నాయి. అందులో కూడా అధికరణాధ్యాయవిభాగం ఈ విధంగానే ఉన్నది. ఈ రెండు శాస్త్రాల రచయిత ఒకడే అనేవారు కూడా ఉన్నారు. కావ్యమీమాంసలో రాజశేఖరుడు కూడా ఈ పద్ధతినే అవలంబించాడు.

దాదాపు 600 గ్రంథాల (32 అక్షరాలు ఒక గ్రంథం, గద్యగ్రంథమైనా, పద్యగ్రంథమైనా ప్రతి గ్రంథాన్నీ ఈ గ్రంథసంఖ్యతో లెక్కపెట్టడం సంస్కృతశాస్త్ర సంప్ర దాయం) ఈ అర్థశాస్త్రం అతిసులభమైన శైలిలో, సూత్రాల వలె ఉండే చిన్న చిన్న వాక్యాలలో వ్రాయబడింది. అక్కడక్కడ శ్లోకాలు కూడా ఉన్నాయి. ఈ గ్రంథంలో రాజ్యానికి ఉండవలసిన అంగాలూ, పరిపాలనావిధానమూ, సమాజంలో ఉన్న వ్యక్తుల

కర్తవ్యాలూ మొదలైన ఎన్నో విషయాలు స్పష్టంగా, విస్తృతంగా ప్రతిపాదింపబడి ఉన్నాయి.

ప్రాచీన అర్థశాస్త్రవేత్తలైన శుక్ర బృహస్పతులకు నమస్కారం చేసి "నమః శుక్ర బృహస్పతిభ్యామ్" అన్న వాక్యంతో ప్రారంభం అవుతుంది అర్థశాస్త్రం. గ్రంథప్రారంభంలో తాను చెప్పబోయే విషయాల సూచిక నిచ్చినాడు కౌటిల్యుడు. "వినయాధికరణం" అనే మొదటి అధికరణంలో, మొదటి అధ్యాయంలో అన్వీక్షకి, త్రయి, వార్త, దండనీతి అని నాలుగు విద్యలున్నా యని చెప్పి వీటిద్వారా ధర్మాధర్మజ్ఞానం సంపాదించుకోవా లని చెప్పబడింది. సాంఖ్యము, యోగము, లోకాయతము వీటికి అన్వీక్షకి అని పేరు. ఇక్కడ లోకాయతము అనేదానికి లౌకికవిషయజ్ఞానము అనే అర్థం చెపితే యుక్తంగా ఉంటుంది. ఇది సర్వవిద్యలకు ఉపాయ మంటాడు కౌటిల్యుడు.

రెండవ అధ్యాయం :- త్రయి అనగా ఋగ్యజుఃసామవేదాలు. అథర్వవేద-ఇతిహాసవేదాలు కూడా కూడా వేదాలే. నాలుగు వర్ణాల, నాలుగు ఆశ్రమాల సంక్షిప్త పరిచయం.

మూడవ అధ్యాయం :- వార్త అనగా వ్యవసాయము, పశుపాలనము, వర్తకము. దీనివల్ల ధనం సంపాదించాలి. ఇంక దండమనేది అన్వీక్షకీ త్రయీవార్తల యోగక్షేమానికి సాధనం. అందుచేత దండం ప్రధానమైనది. ఐతే కౌటిల్యుని అభిప్రాయం ప్రకారం దండం విషయంలో తీక్ష్ణత్వమూ పనికిరాదు. మృదుత్వమూ పనికిరాదు. తీక్ష్ణంగా దండించే రాజును సన్న్యాసులు మొదలైనవాళ్లు కూడా ద్వేషిస్తారు; ఇంక గృహస్థులమాట చెప్పాలా. మృదుదండన ఇచ్చేరాజుని ప్రజలు లోకువ కడతారు. అసలు దండించేవాడే లేకపోతే సమాజంలో "మాత్స్యన్యాయం" ప్రబలుతుంది. పెద్దచేప చిన్నచేపను మింగేసినట్లు బలవంతుడు దుర్బలుణ్ణి పీడిస్తాడు. అందుచేత అవసరాన్ని బట్టి బాగా ఆలోచించి దండం ఉపయోగించాలి. "తీక్ష్ణదణ్డో హి భూతానాముద్వేజనీయః, మృదుదణ్డః పరిభూయతే, యథార్హదణ్డః పూజ్యః . . . అప్రణీతో హి మాత్స్యన్యాయముద్భావయతి, బలీయానబలం హి గ్రసతే దణ్డధరాభావే" (1.3).

"వృద్ధసంయోగము అనే నాలుగో అధ్యాయంలో రాజు వృద్ధసేవ చేసి వివిధవిద్యలు ఎలా సంపాదించాలో, వినయం ఎలా నేర్చుకోవాలో చెప్పబడింది. రాజ్యం పాలించదలచుకొన్నవాడు కామక్రోధాదులకి లొంగిపోకుండా ఇంద్రియాలను జయించాలి అని చెపుతూ "ఇంద్రియజయము" అనే ఐదో అధ్యాయంలో కామాదులకు లొంగిపోవడం వల్ల నశించిన కొందరు రాజుల్ని ఉదాహరణగా చూపించాడు కౌటిల్యుడు.

"అమాత్యనియుక్తి" అనే ఏడవ అధ్యాయంలో ఎలాంటి వారిని అమాత్యులుగా

నియమించాలి అనే విషయం చర్చించబడింది. "రాజు తనకి బాగా పరిచితులైన సహాధ్యాయులను అమాత్యులుగా నియమిస్తే మంచి" దని భారద్వాజు డన్నాడట. "వాళ్లు లోకువ కడతారు. అందుచేత తనతో సమానవ్యసనాలు, రహస్యమైన అలవాట్లు ఉన్నవాళ్ళను నియమిస్తే వాళ్లు తమను ఎక్కడ బయటపెడతాడో అని రాజుకు భయపడుతూ ఉంటారు" అని విశాలాక్షు డన్నాడట. "తన మర్మాలు వాళ్ళకి తెలుసు కాబట్టి రాజు, వాళ్ళు ఏమి చేసినా నిస్సహాయుడుగా ఉండిపోవలసి వస్తుంది. అందుచేత తనకి ప్రాణాపాయసమయంలో అడ్డుపడిన వాళ్ళని అమాత్యులుగా చేసుకోవాలి రాజు"అని పరాశరు డన్నాడట. "అది రాజభక్తి అయితే కావచ్చును. కాని బుద్ధిగుణం కాదు. అందుచేత ఏవైనా రాజకార్యాలని చక్కగా సామర్థ్యంతో నిర్వహించినవాళ్ళని నియమించాలి" అని పిశును డన్నాడట. "వాళ్ళని కాదు; పితృపితామహక్రమంలో వస్తున్న అమాత్యకుటుంబాలకి చెందినవారిని నియమించాలి" అని హేమదంతుడు అన్నాడట. "వాళ్లు రాజుగారి అధికారాలన్నీ స్వాయత్తం చేసుకొని రాజునే ఆడించడానికి ప్రయత్నిస్తారు. అందుచేత క్రొత్తవాళ్ళని వేసుకుంటే వాళ్లు రాజుకు భయపడుతూ ఉంటారు" అని వాతవ్యాధి అన్నాడట. "అట్లుకాదు; ఎంత శాస్త్రజ్ఞానం ఉన్నా కర్మ నిర్వహణంలో అనుభవం లేనివాడు ఏదైనా చిక్కు సమస్య రాగానే తబ్బిబ్బు అయిపోతాడు. అందుచేత గుణాలకే ప్రాధాన్యం ఇచ్చి అభిజన - ప్రజ్ఞా - శౌచ (Integrity) శౌర్యాను రాగాలు ఉన్నవాళ్ళని అమాత్యులుగా చేసుకోవాలి" అని బాహుదంతీపుత్రుడు అన్నాడట. ఈ విధంగా అందరి మతాలూ చెప్పి "సర్వముపపన్న మితి కౌటిల్యః; కార్యసామర్థ్యాద్ధి పురుషసామర్థ్యం కల్ప్యతే, సామర్థ్యతశ్చ" అని అంటాడు కౌటిల్యుడు. అనగా వీళ్ళందరు చెప్పినదీ నిజమే. ఐతే పనిని పట్టి పురుషుణ్ణి నిర్ణయించుకోవాలి కాని వీడే ఉండాలి; వాడు కాదు అని అనడం మంచిది కాదు అని అర్థం. అందుచేత పైన చెప్పిన అన్ని రకాల వ్యక్తులనుంచి కూడా కార్యానుసారంగా ఎన్నుకొని అమాత్యులను నియమించుకోవాలి. ఐతే వీళ్ళని మంత్రిగా మాత్రం చేసుకోకూడదు అంటాడు.

"విభజ్యామాత్యవిభవం దేశకాలౌ చ కర్మ చ,
అమాత్యాః సర్వ ఏవైతే కార్యాః స్యుర్న తు మన్త్రిణః".

(అర్థశాస్త్రంలో అనేకప్రదేశాలలో ఇలాంటి విషయాలను గూర్చి చర్చించేటప్పుడు కౌటిల్యుడు ఈ విధంగా ప్రాచీనుల అభిప్రాయాలు చెప్పి చివరకు తన అభిప్రాయం చెపుతూ ఉంటాడు.)

దీనిని పట్టి రాజుకు చాలా సన్నిహితంగా మంత్రం (ఆలోచన)చెప్పకలిగినవాడు మంత్రి; చెప్పిన కార్యాలు చేసే వాళ్లు అమాత్యులు అనే భేదం మంత్రి - అమాత్యులలో

నియమించాలి అనే విషయం చర్చించబడింది. "రాజు తనకి బాగా పరిచితులైన సహాధ్యాయులను అమాత్యులుగా నియమిస్తే మంచి" దని భారద్వాజు డన్నాడట. "వాళ్లు లోకువ కడతారు. అందుచేత తనతో సమానవ్యసనాలు, రహస్యమైన అలవాట్లు ఉన్నవాళ్ళను నియమిస్తే వాళ్లు తమను ఎక్కడ బయటపెడతాడో అని రాజుకు భయపడుతూ ఉంటారు" అని విశాలాక్షు డన్నాడట. "తన మర్మాలు వాళ్ళకి తెలుసు కాబట్టి రాజు, వాళ్ళు ఏమి చేసినా నిస్సహాయుడుగా ఉండిపోవలసి వస్తుంది. అందుచేత తనకి ప్రాణాపాయసమయంలో అడ్డుపడిన వాళ్ళని అమాత్యులుగా చేసుకోవాలి రాజు"అని పరాశరు డన్నాడట. "అది రాజభక్తి అయితే కావచ్చును. కాని బుద్ధిగుణం కాదు. అందుచేత ఏవైనా రాజకార్యాలని చక్కగా సామర్థ్యంతో నిర్వహించినవాళ్ళని నియమించాలి" అని పిశును డన్నాడట. "వాళ్ళని కాదు; పితృపితామహక్రమంలో వస్తున్న అమాత్యకుటుంబాలకి చెందినవారిని నియమించాలి" అని హేమదంతుడు అన్నాడట. "వాళ్లు రాజుగారి అధికారాలన్నీ స్వాయత్తం చేసుకొని రాజునే ఆడించడానికి ప్రయత్నిస్తారు. అందుచేత క్రొత్తవాళ్ళని వేసుకుంటే వాళ్లు రాజుకు భయపడుతూ ఉంటారు" అని వాతవ్యాధి అన్నాడట. "అట్లుకాదు; ఎంత శాస్త్రజ్ఞానం ఉన్నా కర్మ నిర్వహణంలో అనుభవం లేనివాడు ఏదైనా చిక్కు సమస్య రాగానే తబ్బిబ్బు అయిపోతాడు. అందుచేత గుణాలకే ప్రాధాన్యం ఇచ్చి అభిజన - ప్రజ్ఞా - శౌచ (Integrity) శౌర్యాను రాగాలు ఉన్నవాళ్ళని అమాత్యులుగా చేసుకోవాలి" అని బాహుదంతీపుత్రుడు అన్నాడట. ఈ విధంగా అందరి మతాలూ చెప్పి "సర్వముపపన్న మితి కౌటిల్యః; కార్యసామర్థ్యాద్ధి పురుషసామర్థ్యం కల్ప్యతే, సామర్థ్యతశ్చ" అని అంటాడు కౌటిల్యుడు. అనగా వీళ్ళందరు చెప్పినదీ నిజమే. ఐతే పనిని పట్టి పురుషుణ్ణి నిర్ణయించుకోవాలి కాని వీడే ఉండాలి; వాడు కాదు అని అనడం మంచిది కాదు అని అర్థం. అందుచేత పైన చెప్పిన అన్ని రకాల వ్యక్తులనుంచి కూడా కార్యానుసారంగా ఎన్నుకొని అమాత్యులను నియమించుకోవాలి. ఐతే వీళ్ళని మంత్రిగా మాత్రం చేసుకోకూడదు అంటాడు.

"విభజ్యామాత్యవిభవం దేశకాలౌ చ కర్మ చ,
అమాత్యాః సర్వ ఏవైతే కార్యాః స్యుర్న తు మన్త్రిణః".

(అర్థశాస్త్రంలో అనేకప్రదేశాలలో ఇలాంటి విషయాలను గూర్చి చర్చించేటప్పుడు కౌటిల్యుడు ఈ విధంగా ప్రాచీనుల అభిప్రాయాలు చెప్పి చివరకు తన అభిప్రాయం చెపుతూ ఉంటాడు.)

దీనిని పట్టి రాజుకు చాలా సన్నిహితంగా మంత్రం (ఆలోచన)చెప్పకలిగినవాడు మంత్రి; చెప్పిన కార్యాలు చేసే వాళ్లు అమాత్యులు అనే భేదం మంత్రి - అమాత్యులలో

ఉన్నట్లు తెలుస్తున్నది. బహుశా అమాత్యుల స్థానం నేటి కార్యదర్శుల స్థానం వంటిది అయి ఉండవచ్చు. ఈ ఘట్టంలోనే ఈ పదాలు వేరు వేరు అర్థాలలో ఉపయోగింపబడినవి.

ఎనిమిదవ అధ్యాయంలో ఎట్టివారిని మంత్రిగాను, పురోహితుడుగాను నియమించాలి అనే విషయం చెప్పబడింది. తన దేశంలో పుట్టినవాడు, సద్వంశంలో పుట్టినవాడు, దుర్గుణాలు లేనివాడు, లలితకళలలో నిపుణుడు, అర్థశాస్త్రజ్ఞుడు, బుద్ధిమంతుడు, ధారణాశక్తి కలవాడు, నేర్పు కలవాడు, ఉత్సాహప్రభావాలు కలవాడు, కష్టాలు వచ్చినా సహించగలవాడు, శుచి యైనవాడు (Man of integrity) స్నేహశీలుడు, దృఢమైన భక్తి కలవాడు, శీల-బల-ఆరోగ్య-గాంభీర్యములు కలవాడు, గర్వం కాని, చాపల్యము కాని లేనివాడు, చూడడానికి బాగుండేవాడు, వైరం తెచ్చిపెట్టనివాడు - ఇట్టివానిని మంత్రిగా నియమించాలి. వేదవేదాంగాలలోను, అథర్వప్రక్రియలోను నిష్ణాతుడై దైవ-మానుష ఉపద్రవాలకి ప్రతీకారం చేయగలిగిన వానిని పురోహితుడుగా నియమించాలి.

ఎరలు చూపి రహస్యంగా అమాత్యుల శౌచాన్ని ఎలా పరీక్షించాలో తొమ్మిదో అధ్యాయంలో చెప్పబడింది. 10, 11 అధ్యాయాలలో గూఢచారుల నియుక్తి, వాళ్ళ పరీక్ష విశదీకరింపబడ్డాయి. రాజు తన రాష్ట్రంలో ఉన్న సామాన్యప్రజలను, ప్రధానులైన ప్రజలను ఏ విధంగా వశంలో ఉంచుకోవాలో 12వ అధ్యాయంలో చెప్పబడింది. శత్రురాజ్యంలో ఉన్న ప్రజలను ఏదో విధంగా మోసగించి తనకు వశం అయేటట్లు చేసుకొనే పద్ధతులు 13వ అధ్యాయంలో చెప్పబడ్డాయి.

"అధికారం" అనే 14వ ప్రకరణం : రాజు ఉత్తములైన మంత్రులతో కలిసి మంత్రణం చెయ్యాలి. మంత్రుల సంఖ్యను గూర్చిన పూర్వాచార్యుల మతాలను చెప్పి చివరకు కౌటిల్యుడు ముగ్గురు - నలుగురు మంత్రులతో ఆలోచించడం మంచిది అని అంటాడు. ఒక్కడితోటే చేస్తే సమస్య తెగదు. ఆ మంత్రి ఎదురుతిరగవచ్చు కూడా. ఇద్దరు మంత్రులతో చేస్తే వాళ్ళిద్దరూ సులభంగా ఏకం అయి రాజును పెడదారి పట్టించవచ్చును. నలుగు రుంటేనే చాలావరకు ఈ ప్రమాదాలు ఉండవు. మంత్రాలకి ఐదు అంగాలట :-

"కర్మణామారమ్భోపాయః, పురుషద్రవ్యసంపత్,
దేశకాలవిభాగః, వినిపాతప్రతీకారః,
కార్యసిద్ధిరితి పఞ్చాఙ్గో మన్త్రః"

"పనులు చేపట్టడానికి ఉపాయము, పురుషబల-ధనబలాలు, దేశకాలాల విభాగము, విఘ్నాలకి ప్రతిక్రియ, కార్యసిద్ధి" మంత్రిపరిషత్తులో ఎంతమంది ఉండాలి అని ప్రశ్న. పన్నెండుగురు ఉండాలని మనుమతానుయాయులు, పదహారుగురు అని బృహస్పతిమతంవాళ్ళు, ఇరవై మంది అని శుక్రాచార్యమతంవాళ్లు, సామర్థ్యాన్ని పట్టి సంఖ్యానిర్ణయమని కౌటిల్యుడు. దగ్గర ఉన్నవాళ్ళని పిలిపించి వాళ్ళతో మంతనాలు చెయ్యాలి. దూరంగా ఉన్నవాళ్ళతో లేఖలద్వారా సంప్రతించాలి. ఈ సందర్భంలో, ఇంద్రుడు సహస్రాక్షు డెందు కయ్యాడో చెపుతూ కౌటిల్యుడు ఒక వాక్యం వ్రాస్తాడు -

"ఇన్ద్రస్య హి మన్త్రిపరిషదృషీణాం సహస్రమ్,
స తచ్చక్షుః. తస్మాదిమం ద్వ్యక్షం సహస్రాక్షమాహుః".

ఇంద్రుడి మంత్రిపరిషత్తులో వెయ్యిమంది ఋషులు ఉండేవారట. వాళ్ళే ఆయనికి నేత్రాలు. అందుచేత అతడు అసలు రెండు నేత్రాలవాడే అయినా సహస్రాక్షు డనే పేరు వచ్చినదట.

15వ అధ్యాయంలో దూతలు, వాళ్ళ లక్షణాలు వివరించబడ్డాయి. "రాజపుత్ర దర్శనం" అనే 16వ అధ్యాయంలో, రాజు తన పుత్రులను ఎలా పెంచుకోవాలో, వాళ్ళనుండి తిరుగుబాటు ప్రమాదము రాకుండా ఎలా చూచుకోవాలో చెప్పబడింది. అవసరమైతే వాళ్ళను కూడా ఎలా నశింపచెయ్యాలో చెప్పబడింది. తండ్రి అనుమానాలకి గురి అయిన రాజపుత్రుడు ఏమి చెయ్యాలో 17వ అధ్యాయంలో చెప్పబడింది.

రాజు పగలు ఎనిమిది భాగాలుగానూ, రాత్రి ఎనిమిది భాగాలుగానూ విభజించి ఏ ఏ పనులు (రాజ్యకార్యాలూ, స్వీయకార్యాలూ) చెయ్యాలో 18వ అధ్యాయంలో వర్ణింపబడింది. రాజ్యవ్యవహారాలు చూచేటప్పుడు తన దగ్గరికి వచ్చేవాళ్ళ నెవరినీ ఆపకుండా అందరితోటి కలవాలట. అట్లా కాకపోతే ప్రజలకోపానికి గురి అవుతాడు. ఆత్యయికకార్యాలు ఏవైనా (Urgent work) ఉంటే వెంటనే చూడాలి. కాలాతిపాతం (Postponement) చేయకూడదు. అలా చేస్తే ఆ పని కృచ్ఛ్రసాధ్యం (అతి కష్టం మీద సాధించతగినది) ఐనా అవుతుంది లేదా అసాధ్యం అయిపోతుంది.

"సర్వమాత్యయికం కార్యం శృణుయాన్నాతిపాతయేత్,
కృచ్ఛ్రసాధ్యమతిక్రాన్తమసాధ్యం వా విజాయతే".

ప్రజల సుఖంలోనే రాజు సుఖం ఉన్నది; ప్రజల హితంలోనే రాజు హితం ఉన్నది. రాజుకు తనకు ప్రియమైనది హితం కాదు. ప్రజలకు ప్రియమైనదే రాజుకు కూడ హితము.

"ప్రజాసుఖే సుఖం రాజ్ఞః ప్రజానాం చ హితే హితమ్,

నాత్మప్రియం హితం రాజ్ఞః ప్రజానాం తు ప్రియం హితమ్".

"నిశాన్తప్రణిధి" అనే 19వ అధ్యాయంలో రాజు తన ప్రాసాదంలోను, అంతఃపురంలోను ఎట్టి జాగ్రత్తలను తీసుకోవలెనో, విషాదులవలన ఎలా రక్షించుకోవలెనో చెప్పబడింది. కోటలోనికి వచ్చే ప్రతివస్తువునూ, బైటికి వెళ్ళే ప్రతివస్తువును కూడా రిజిస్టరులో ఎక్కించుకోవాలి. ప్రతి వస్తువుమీదా రాజముద్ర ఉండాలి.

"సర్వం చావేక్షితం ద్రవ్యం నిబద్ధాగమనిర్గమమ్,

నిర్గచ్ఛేదధిగచ్ఛేద్వా ముద్రాసంక్రాన్తభూమికమ్".

"ఆత్మరక్షితకం" అనే 20వ అధ్యాయంలో రాజు స్వీయరక్షణం విషయంలో ఎట్టి జాగ్రత్తలను తీసుకోవాలో చెప్పబడింది. ఎంతో పరిచయం ఉన్నవాళ్ళని కాని దగ్గరికి రానీయకూడదు. అన్నాదులలో విషం కలిపితే తెలుసుకొనే ఉపాయాలు వివరించబడ్డాయి. ధరించే వస్త్రాలంకారాదులను కూడా బాగా పరీక్షించి ధరించాలి. యానోద్యానాదులలో కూడా ఎంతో మెలకువగా ఉండాలి.

రెండవ అధికరణానికి "జనపదనివేశము" అని పేరు. మొదటి అధ్యాయంలో గ్రామాల నిర్మాణము, జలమార్గసేత్వాది నిర్మాణము మొదలైన విషయాలు చెప్పబడ్డాయి. బాల-వృద్ధ-వ్యాధిగ్రస్త-అనాథులను రాజు పోషించాలి. చిన్నపిల్లవాడు పెద్దవాడయేవరకూ అతని ఆస్తిని గ్రామస్తులు కాపాడాలి. భార్యను, పిల్లలనూ, తల్లిదండ్రులనూ, అప్రాప్తవ్యవహారాలైన (మైనర్లయిన) సోదరులనూ, అవివాహితలైన చెల్లెండ్రను, భర్తలు లేని సోదరీలను, శక్తి ఉండికూడా పోషించనివాళ్ళని శిక్షించాలి. ఐతే పైన చెప్పినవాళ్ళు పతితు లయినట్లయితే పోషించకపోయినా తప్పు లేదు. తల్లినిమాత్రం పతితయైనా పోషించవలసినదే. కుటుంబానికి దారి చూపించకుండా ఎవడైనా సంన్యసించినా, స్త్రీకి సంన్యాసం ఇప్పించినా వానిని శిక్షించాలి. వానప్రస్థులున్నా తప్పు లేదు కాని గ్రామంలో సంన్యాసుల్ని ఉండనివ్వకూడదు. సహకారసంఘాలు తప్ప మరే సంఘాలుకాని సంస్థలుకాని ఉండకూడదు. ఉద్యానాలు కాని విహారశాలలు కాని, నటనర్తక గాయకాదులు కాని గ్రామాలలో ఉండకూడదు. వాళ్ళవల్ల వ్యవసాయానికి విఘ్నం కలుగుతుంది.

"భూమిచ్ఛిద్రవిధానం" అనేది రెండవ అధ్యాయం. వ్యవసాయానికి ఉపయోగించని భూములను పశుగ్రాసం కోసం విడిచి పెట్టాలి. రెండు క్రోసుల (4మైళ్లు) ప్రమాణం గల అరణ్యభాగాన్ని బ్రాహ్మణులు వేదాధ్యయన-యజ్ఞాద్యనుష్ఠానాలు చేసుకోవడానికి విడిచిపెట్టాలి. అనేక వృక్షాలూ, గోళ్లూ కోరలూ తీసివేసిన మృగాలూ

ఉన్న వనాన్ని రాజుకి విహారంకోసం ఏర్పరచుకోవాలి. వివిధదేశాలలో ఉండే మృగాలతో ఒక మృగవనం (Zoo) ఏర్పాటు చేయాలి. రాష్ట్రం పొలిమేరలలో ఏనుగులతో నిండిన దట్టమైన నాగవనం నిర్మించాలి.

దుర్గవిధానము, దుర్గనివేశము అనే 3,4 అధ్యాయాలలో జలదుర్గ-పర్వతదుర్గ-ధాన్వన (ఎడారి) దుర్గ-వనదుర్గాల నిర్మాణమూ, వాటిలో వివిధగృహాల నిర్మాణమూ, బాటలు వేయడము మొదలైన అంశాలు వివరింపబడ్డాయి. "సన్నిధాతృనిచయకర్మ" అనే ఐదో అధ్యాయంలో కోశగృహనిర్మాణమూ, కోశాధ్యక్షుని కర్తవ్యాలూ వివరింపబడ్డాయి. ఎవరైనా చెడ్డనాణాలు తెచ్చినప్పుడు పరీక్షించి, వాటిని అక్కడనే ఛేదించివేసి, ఆ తెచ్చిన వానిని కఠినంగా దండించాలి. ధాన్యాదులలో కల్తీసరుకు తెచ్చిన వానిని కూడా దండించాలి. కోశాధ్యక్షుడు బైటనుంచి ఎంత ఆదాయం వచ్చిందో, నగరంనుంచి ఎంత వచ్చినదో, ఎంత వ్యయమై ఎంత మిగిలిందో నూరుసంవత్సరాల లెక్కలు కూడా వెంటనే చెప్పగలిగిన స్థితిలో ఉండాలి.

"బాహ్యమభ్యన్తరం చాయం విద్యాద్వర్షశతాదపి,
యథా పృష్టో న సజ్జేత వ్యయశేషం చ దర్శయేత్".

"సమాహర్తృసముదయప్రస్థాపనం" అనే 6వ అధ్యాయంలో సమాహర్త (Collector of Taxes) చేయవలసిన విధులు, "అక్షపటలగాణనిక్యాధికారం" అనే 7వ అధ్యాయంలో అక్షపటలం (Account Office) లో గాణనిక్యుడు (Superintendent of Accounts) చేయవలసిన గణనపుస్తకాలను భద్రపరచడంవంటి విధులు, 8వ అధ్యాయంలో రాష్ట్రద్రవ్యాన్ని అపహరించే అధికారులకు ఇచ్చే దండమూ వివరించబడ్డాయి. రాజధనాన్ని అధికారులు ఏ విధంగా కాజేస్తూ ఉంటారో చెపుతూ అందుకు వాళ్లు అవలంబించే 40 ఉపాయాలు (రిజిష్టర్లు సరిగా వ్రాయకపోవడం, లెక్కలు తారుమారుచేయడం వంటివి) వర్ణింపబడ్డాయి.

9వ అధ్యాయములో అధ్యక్షుల మీద (Heads of the Departments) సర్వదా నిఘా వేసి ఉండాలనీ, డబ్బులో మసిలేవాళ్లు డబ్బు తినకుండా ఉండలేరు కాబట్టి చాలా జాగ్రత్తగా పర్యవేక్షిస్తూ ఉండాలనీ చెప్పబడింది. విషమైనా, తేనెయైనా నాలిక మొదటిదాకా వెళ్ళినతరువాత దానిని మింగకుండా ఉండడము ఎంత అశక్యమో, డబ్బు మధ్య మసలే రాజాధికారులు కొద్దిగానో గొప్పగానో తినకుండా ఉండలేరట.

"యథా హ్యనాస్వాదయితుం న శక్యం జిహ్వాతలస్థం మధు వా విషం వా,
అర్థస్తథాహ్యర్థచరేణ రాజ్ఞః స్వల్పోఽప్యనాస్వాదయితుం న శక్యః".

"శాసనాధికారం" అనే 10 వ అధ్యాయంలో రాజ్య పరిపాలనకు సంబంధించిన

వివిధశాసనాలు వ్రాయించే పద్ధతి చెప్పబడింది. ఈ సందర్భంలో భాషకి సంబంధించిన విషయాలు కూడా కొన్ని చెప్పబడ్డాయి. లింగ-వచన-కారక-క్రియాదులు సరిగా ప్రయోగించకుండా చేసే అపశబ్దాలను పరిహరించాలి. సంప్లవం అనే దోషం అనగా వర్గాన్ని (Punctuation mark) ఉంచవలసిన చోట ఉంచక, ఉంచకూడనిచోట ఉంచడం వంటి దోషం లేకుండా చూచుకోవాలట.

"కోశప్రవేశ్యరత్నపరీక్ష" అనే 11వ అధ్యాయంలో కోశాధ్యక్షుడు ఏ ఏ వస్తువులను కోశంలోనికి తీసుకొనవచ్చునో చెప్పబడింది. ఈ సందర్భంలో వివిధ రత్నజాతులూ, అగరుచందనాదివస్తువులూ, వివిధవస్త్రాదులూ వర్ణించబడినాయి.

"ఆకరకర్మాన్తప్రవర్తనం" అనే 12వ అధ్యాయంలో వివిధఖనిజాల సంగ్రహమూ, విక్రయమూ, "అక్షశాలాయాం సువర్ణాధ్యక్షః" అనే 13వ అధ్యాయంలో సువర్ణాధ్యక్షుడు వెండి బంగారాల విషయంలో తీసుకోవలసిన ప్రత్యేకమైన జాగ్రత్తలూ చెప్పబడ్డాయి. 14వ అధ్యాయంలో-సౌవర్ణికుడు (రాజ్యంలో ఉండే ప్రధానస్వర్ణకారుడు) ప్రజలకు అలంకారాలు ఏ విధంగా చేయించి ఇవ్వాలి అనే విషయమూ, ప్రసంగవశంచేత స్వర్ణకారులు సువర్ణాన్ని అపహరించడానికి అవలంబించే విధానాలు వివరింపబడ్డాయి. 15వ అధ్యాయంలో కోష్ఠాగారాధ్యక్షుడు (కొఠారి) వివిధ ధాన్యాదులను సేకరించేటప్పుడు అవలంబించవలసిన పద్ధతులు, వాటి ప్రమాణ -మూల్యనిర్ణయాదులు చెప్పబడినవి. 16వ అధ్యాయంలో పణ్యాధ్యక్షుడు (Chief supervisor of markets) వివిధ వస్తువులను ఏ విధంగా సేకరించాలో, ఏ విధంగా విక్రయించాలో వివరింపబడింది. దీనినిపట్టి వర్తకవ్యాపారం అంతా చాలావరకు ప్రభుత్వం ద్వారానే జరిగేదన్నట్లు తెలుస్తూన్నది. 17వ అధ్యాయంలో కుప్యాధ్యక్షుని (Head of the forest department) కర్తవ్యాలూ, అడవుల్లో లభించే మంచి కఱ్ఱ ఇచ్చే, ఉత్తమజాతి వృక్షాలూ, ఇతరవస్తువులూ వర్ణింపబడ్డాయి. 18వ అధ్యాయంలో వివిధ ఆయుధాల వర్ణనచేసి, ఆయుధాగారాధ్యక్షుని కర్తవ్యాలు నిరూపించబడ్డాయి. 19వ అధ్యాయంలో తూకాలూ, కొలతలు పరీక్షించే అధికారి (పౌతవాధ్యక్షుడు) కర్తవ్యాలు, ధరలు నిర్ణయించే విధానమూ చెప్పబడ్డాయి. 20వ అధ్యాయంలో మానాధ్యక్షుడు దేశకాలాల కొలతలు తెలుసుకొని ఉండాలి అని చెప్పి ఆ కొలతలన్నీ ఇవ్వబడ్డాయి. 21వ అధ్యాయంలో శుల్కాధ్యక్షుని (అమ్మకం పన్నుల అధికారి) కర్తవ్యాలు చెప్పబడ్డాయి. శుల్కవ్యవహారాధ్యాయం (22)లో ఏ వస్తువు మీద ఎంత శుల్కం వెయ్యాలో చెప్పబడింది. సూత్రాధ్యక్షాధ్యాయం(23)లో అనేక రకాలైన దారాలు, వాటిధరలు, త్రాళ్ల మొదలైన వాటిని గూర్చి చెప్పబడింది. ఈ

విషయాలన్నీ పర్యవేక్షించే రాజకీయాధికారి "సూత్రాధ్యక్షుడు". సీతాధ్యక్షాధ్యాయంలో (24) వ్యవసాయానికి సంబంధించిన విషయాలు చర్చించబడినవి. సీతాధ్యక్షుడు అన్ని వృక్షాలకీ, సస్యాదులకీ సంబంధించిన బీజాలను భద్రపరచి ఉంచాలి. తగినవారికి ఇచ్చి చల్లించాలి. వ్యవసాయం చేయించడానికి ప్రభుత్వానికి శక్యం కాని భూములను సగం పంట ఇచ్చేటట్లు నిర్ణయించి దున్నుకునే వాళ్ళకి ఇవ్వాలి. ఎవరైనా స్వయంగా తాము నిర్మించిన చెరువులు మొదలైనవాటినుండి నీరు తీసుకొని పండిస్తే వాళ్లు 5వ వంతు రాజుకు ఇవ్వాలి. స్రోతోయంత్రంద్వారా (నీళ్ల తోడే యాతాము వంటిది) నీరు పారించి పండిస్తే మూడవ వంతు ఇవ్వాలి. నదీ-సర స్తటాక-కూపాదుల నుంచి నీరు తీసికొని పండిస్తే నాల్గవ వంతు ఇవ్వాలి.

25వ అధ్యాయంలో సురాధ్యక్షుని కర్తవ్యాలు చెప్పబడ్డాయి. కల్లు తయారుచేసే ప్రదేశాలు పర్యవేక్షిస్తూ ఉండాలి. కొన్నిచోట్ల అవసరానుగుణంగా కల్లుదుకాణాలు తెరిపించాలి. ఆ స్థానాలలో తప్ప మరెచ్చటనైనా కల్లు తయారుచేసేవారికి 600 పణాల దండం విధించాలి. మంచివాళ్ళే అన్న పేరున్న వాళ్లు కుడుబంలో నాల్గవ వంతుగాని, సగం కాని, ఒక కుడుబం కాని, ప్రస్థం కాని, అర్ధప్రస్థం కాని సురను తమతో తీసుకొని వెళ్ళవచ్చు. ఇతరులు పానాగారాలలోనే త్రాగాలి. ఈ ప్రదేశాలలో చాలామంది దొంగలు దొరుకుతారు కాబట్టి వాళ్ళమీద ఒక కన్ను వేసి ఉంచాలి. పానాగారాలలో చాలా గదులు, శయానాసనాదులూ గంధమాల్యోదకాదులూ ఏర్పాటు చెయ్యాలి. ఈ సందర్భంలో అనేక రకాల మద్యాలు వర్ణించబడినాయి.

26వ అధ్యాయంలో సూనాధ్యక్షుడు (మాంస విక్రయశాలల పర్యవేక్షణాధికారి) చేయవలసిన కర్తవ్యాలు, మాంసపరీక్ష మొదలైనవి చెప్పబడినాయి. నిషేధించబడిన అరణ్యాదులలో ఉన్న పశుపక్ష్యాదులను చంపేవారిని తీక్ష్ణంగా దండించాలి. 27వ అధ్యాయంలో వేశ్యలు, వారి పర్యవేక్షణం మొదలైన విషయాలు చెప్పబడినాయి. ఈ విషయాల అధికారి గణికాధ్యక్షుడు. రాజు అవసరాన్ని పట్టి సంజ్ఞలూ, (వేషాలు) అనేక భాషలూ తెలిసిన నటనర్తకాదుల భార్యలను తన వశం చేసుకొని,శత్రువుల వినాశనానికి ఉపయోగించుకోవాలి.

"సంజ్ఞాభాషాన్తరజ్ఞాశ్చ స్త్రియస్తేషామనాత్మసు,
చారఘాతప్రమాదార్థం ప్రయోజ్యా బన్ధువాహనాః".

నదీ సముద్రాదులలో నావలను నడిపేవాళ్ళను పర్యవేక్షించి వాళ్ళ దగ్గర సుంకాలు తీసుకొనేవాడు నావాధ్యక్షుడు. అతని కర్తవ్యాలని గూర్చి 28వ అధ్యాయంలో

చెప్పబడింది. 29-33 అధ్యాయాలకు వరసగా "గోధ్యక్షః" "అశ్వాధ్యక్షః" "హస్త్యధ్యక్షః" " హస్త్యధ్యక్షః-హస్తిప్రచారశ్చ" "రథాధ్యక్షః-సేనాపతి ప్రచారశ్చ " అని పేర్లు. గోవులు, అశ్వాలు, ఏనుగులు, రథాలు వీటికి సంబంధించి అధికారుల కర్తవ్యాలు, వాటిలో భేదాలు, వాటి పోషణాదులు వర్ణించబడినాయి. "ముద్రాధ్యక్ష ః-వివీతాధ్యక్షః' ' అనే 34వ అధ్యాయంలో ముద్రాధ్యక్షుని(రాజుగారి సీలు ఉపయోగించే అధికారి ) అధికారాలు చెప్పబడ్డాయి. నగరంలో ప్రవేశించేవారికైనా, నగరంనుంచి బైటకు వెళ్ళేవారికైనా ఒక మాషం (ఒక నాణెము) తీసుకొని ముద్ర (పాస్) ఇవ్వాలి. ముద్రలేకపోయినా, తప్పుడు ముద్ర చూపించినా అట్టివారు దండనార్హులు. విదేశీయులైతే అధికదండం. వివీతాధ్యక్షుడనగా అడవులలో సంచరించేవారిమీద నిఘా ఉంచే అధికారి.

"సమాహర్తృప్రచారం" అనే 35వ అధ్యాయంలో సమాహర్త (Revenue Collector)చేయవలసిన పనులు చెప్పబడ్డాయి. తన క్రింద ఉన్న జనపదాన్ని నాలుగు భాగాలుగా విభజించి వాటికి సంబంధించిన విషయాలన్నీ (ధాన్య-పశు-హిరణ్యాలు,పన్ను మొదలైనవి) ఇది ఇంత అని నిబంధింపచేయాలి (రిజిష్టర్ ఎక్కించాలి). అతని క్రింద గోపుడనే అధికారి, ఐదు గ్రామాలను కాని పది గ్రామాలు కాని పర్యవేక్షించాలి. ఇతడు గ్రామం పొలిమేరలు, దున్నే భూమి, పొలాలు, ఆరామాలు, తోటలు, గృహాలు, చైత్యాలు, దేవాలయాలు, వంతెనలు, శ్మశానాలు, సత్రాలు, చలివెందళ్లు, పుణ్యస్థానాలు, అన్నక్షేత్రాలు, మార్గాలు(రోడ్లు)మొదలైన ఆయా గ్రామాలకు సంబంధించిన వివరాలన్నీ తెలుసుకొని ఉంచుకోవాలి. ఇంత మంది చాతుర్వర్ణ్యాల వాళ్లు ఉన్నారు. ఇన్ని పశువులున్నాయి. ఇంత బంగారం ఉన్నది. ఇంతమంది విష్టులు (వెట్టివాళ్లు) ఉన్నారు. ఇంత పన్ను వస్తుంది -ఇలాంటి విషయాలన్నీ తెలుసుకోవాలి. ఎవరు ఏ వృత్తితో జీవిస్తున్నారో, ఆడవాళ్లు ఏ పనులు చేస్తారో, పురుషులు ఏ పనులు చేస్తారో, బాలవృద్ధాదులు ఏమి చేస్తారో తెలుసుకోవాలి. జనపదంయొక్క నాల్గవ భాగం స్థానికుడనే అధికారి పర్యవేక్షణలో ఉంటుంది. అపరాధులను శిక్షించడానికి ప్రదేష్టలు అనే అధికారులు గోపులకీ, స్థానికులకీ సహాయంగా ఉండాలి. సమాహర్త అనేక వేషాలలో గూఢచారులను పంపించి గ్రామాలలో ఏమి ఏమి జరుగుతున్నదో కనిపెడుతూ ఉండాలి.

నగరాధ్యక్షుడు 'నాగరికుడు'. అతడూ, అతని క్రింది అధికారులైన స్థానికుడు, గోపుడు చేయవలసిన పనులు 36వ అధ్యాయంలో చెప్పబడ్డాయి.

ధర్మశాలాధికారి పాషండులకి, బాటసారులకీ చోటు ఇచ్చేముందు స్థానికునికి చెప్పాలి. శిల్పులు వర్తకులు మొదలైనవాళ్లు క్రొత్తవాళ్ళకు తమ ఇళ్ళల్లో చోటు ఇవ్వవచ్చు కాని దేశకాలాలకి విరుద్ధంగా వ్యాపారం చేసేవాళ్ళూ ఇతరుల వస్తువులతో వ్యాపారం చేసేవాళ్ళూ ఎవరైనా వస్తే అధికారులకి తెలపాలి. మద్య మాంసాదులు అమ్మేవాళ్ళూ, అన్నం అమ్మేవాళ్ళూ (హోటలువాళ్లు) వేశ్యలు తమ పరిచితులను ఇంట్లో ఉంచుకోవచ్చు. అతివ్యయం చేసేవాళ్ళు ఎవరైనా వస్తే అధికారులకి తెలపాలి. ఇలాంటి నియమాలు ఎన్నో చెప్పబడినాయి. ఇళ్లు కాలుతున్నప్పుడు అక్కడ ఉండికూడా ఆర్పడానికి వెళ్ళనివాళ్ళని దండించాలి. ఇంటికి నిప్పు అంటించినవానికి వధ దండం. రథ్య (రోడ్డు) మీద బూడిద పోసినా, మురికినీరు వదలినా, పుణ్యస్థాన-ఉదకస్థానాదులను మలమూత్రాలచేత కలుషితం చేసినా దండించాలి. పిల్లి, కుక్క, నకులము, సర్పము మొదలైనవాటి మృతశరీరాలను గాడిద మొదలైనవాటి మృతశరీరాలను నగర మధ్యంలో వదలినా, నిర్ణీతమైన దారిని కాకుండా మరొక మార్గంలో శవాన్ని తీసుకొని వెళ్లినా దండించాలి. రాత్రి ప్రారంభంలో ఆరు గడియల తరవాత చివర ఆరు గడియలు రాత్రి ఉన్నప్పుడు రెండు పర్యాయాలు రాజప్రాసాదందగ్గర తూర్యశబ్దం చేయబడుతుంది. రాత్రి ఆ రెండు రాత్రిఘోషాల మధ్యకాలంలో రాజప్రాసాదప్రాంతంలో తిరిగేవాళ్లు దండనీయులు. నాగరికుడు ప్రతిరోజు జలస్థలమార్గాలూ, సురంగ మార్గాలూ, ప్రాకారాలు, గోపురాలు మొదలైనవాటిని పర్యవేక్షిస్తూ ఉండాలి. నడవడిక బాగున్న ఖైదీలనూ, కొందరిని ఏదో ఒక పనిచేయించుకొన్న తరవాతా విడిచిపెడుతూ ఉండాలి.

మూడవ అధికారణానికి "ధర్మస్థీయం" అని పేరు. మొదటి అధ్యాయంలో ధర్మస్థులైన ముగ్గురు అమాత్యులు కలిసి జనపదసంధి (గ్రామాలసీమ) సంగ్రహణ (పది గ్రామాల కేంద్రం) ద్రోణముఖ (400 గ్రామాల కేంద్రం) స్థానీయా (800 గ్రామాల కేంద్రం) లలో ప్రజల వ్యవహారాలు చూడాలి. ఏ వ్యవహారాలు గ్రాహ్యాలో ఏవి కావో ముందుగా నిర్ణయించుకోవాలి. వాదిప్రతివాదులు చెప్పే మాటలు యథాతథంగా వ్రాసుకోవాలి. సాక్షుల్ని పరీక్షించాలి. తప్పుడు సాక్ష్యం చెప్పేవాళ్ళని శిక్షించాలి. రెండవ అధ్యాయంలో వివాహ-స్త్రీధనాదులను గూర్చి చెప్పబడింది. మన్వాదిధర్మశాస్త్రాలలో చెప్పినట్లుగా బ్రాహ్మ-ప్రాజాపత్య-ఆర్ష-దైవ-గాంధర్వ-ఆసుర-రాక్షస-పైశాచా లనే ఎనిమిది విధాలైన వివాహాలు చెప్పబడ్డాయి. 'వృత్తి' అనీ 'ఆబంధ్యం' అనీ స్త్రీధనం రెండు విధాలు. రెండు వేలకి తక్కువ కాకుండా (మామగారు మొదలైనవాళ్లు) ఏర్పరచినది వృత్తి. అలంకారాలు ఆబంధ్యం. దీని విషయంలో ఇంత ఉండాలని నియమం లేదు.

భర్త మరణించిన స్త్రీ ధర్మకర్మపరురాలై ఉండాలనుకున్నప్పుడు కొంత ప్రీతిధనం (ప్రేమపూర్వకంగా ఇచ్చే ధనం) కలిపి ఆమె ధనాన్ని ఆమెకు ఇచ్చివేయాలి. ఇలా తీసుకున్న తరవాత కొంత కాలానికి ఆమె పునర్వివాహం చేసుకొనేపక్షంలో తాను తీసుకున్న ధనాన్ని వడ్డీతో సహా (మొదటి) భర్త బంధువులకి ఇచ్చివేయాలి. ఐతే ఆమె కుటుంబం కావాలనే ఉద్దేశ్యంతో పునర్వివాహం చేసుకుంటూన్న పక్షంలో మామగారూ భర్తా ఇచ్చిన ధనాన్ని వివాహసమయంలో ఆమెకు ఇవ్వాలి. మామగారి ఇష్టం లేకుండా పునర్వివాహం చేసుకొనే స్త్రీకి ఆ ధనం ఇవ్వవలసిన పనిలేదు. ఈ పునర్వివాహం జ్ఞాతులద్వారా అయినపక్షంలో ఆ జ్ఞాతులే ఆమెకు ధనం ఇవ్వాలి. పునర్వివాహం చేసుకొనే స్త్రీకి భర్త ఆస్తిమీద అధికారం ఉండదు. ధర్మబుద్ధి కలదైతే, అనగా పునర్వివాహం చేసుకొనని పక్షాన ఉంటుంది. పుత్రవతియైన స్త్రీ పుత్రుల పోషణాదులకోసమే పునర్వివాహం చేసుకుంటూన్న పక్షంలో ఆ ధనాన్ని పుత్రుల పేర నిర్దిష్టం చెయ్యాలి. ఎవరైనా ఒక స్త్రీ చాలామంది పురుషుల ద్వారా చాలా మంది పుత్రులను కన్న పక్షాన ఏ తండ్రివల్ల వచ్చిన ధనాన్ని ఆ పుత్రుడికే ఇవ్వాలి. ఐతే పుత్రులు లేని స్త్రీ పతివ్రతాధర్మం ప్రకారం పునర్వివాహం చేసుకొనని పక్షంలో పెద్దవాళ్ళదగ్గర ఉంటూ చివరివరకూ తన ధనం అనుభవించవచ్చు. చివరికి అది దాయాదులకి చెందుతుంది. భర్త జీవించి ఉండగా మరణించిన స్త్రీయొక్క ధనాన్ని పుత్రులూ పుత్రికలూ పంచుకోవాలి. పుత్రులు లేని పక్షాన పుత్రికలకే చెందుతుంది ఆ ధనం. ఎవరూ లేకపోతే భర్తకి చెందుతుంది. వివాహసమయంలో కట్నంగా ఇచ్చిన సొమ్మును (ఆ స్త్రీ మరణించినపుడు) పుట్టింటివాళ్లు తీసుకొనవచ్చును. ఈ విధంగా స్త్రీ ధనానికి సంబంధించిన కొన్ని విషయాలు చెప్పబడ్డాయి. భార్యకి పిల్లలు పుట్టకపోతే భర్త ఎనిమిది సంవత్సరాలు వేచి ఉండాలి. మృతశిశువును కనిన పక్షాన పది సంవత్సరాలు, ఆడపిల్లలనే కనిన పక్షాన 12 సంవత్సరాలూ నిరీక్షించి, అప్పటికీ పుత్రులు కలగకపోతే రెండవ భార్యను వివాహం చేసుకోవచ్చును. దీనికి విరుద్ధంగా ప్రవర్తించినవాడు శిక్షార్హుడు.

భార్య నీచుడూ, పరదేశప్రవాసి, రాజద్రోహి, ప్రాణఘాతకుడు, పతితుడు, నపుంసకుడు అయిన భర్తతో వివాహవిచ్ఛేదం చేసుకోవచ్చును.

"నీచత్వం పరదేశం వా ప్రస్థితో రాజకిల్బిషీ,
ప్రాణాభిహన్తా పతితస్త్యాజ్యః క్లీబోఽపి వా పతిః".

మూడవ అధ్యాయంలో భార్యాభర్తలు పరస్పరము అతిక్రమించకూడదని చెప్పి అట్లా చేసిన పక్షాన ఇవ్వవలసిన శిక్షలు చెప్పబడినాయి. కౌటిల్యుని ప్రకారం స్త్రీకి 12 సంవత్సరాల వయస్సు, పురుషునికి 16 సంవత్సరాల వయస్సు వచ్చినతరువాత వాళ్ళు ప్రాప్తవ్యవహారులు (Majors) అవుతారు. అప్పటినుంచీ వాళ్లు రాజశాసనానికి కట్టుబడి ఉండవలసిందే - "ద్వాదశవర్షా స్త్రీ ప్రాప్తవ్యవహారా భవతి షోడశవర్షః పుమాన్".

నాల్గవ అధ్యాయంలో కూడా పరస్త్రీ-పరపురుషుల సంపర్కం ఏర్పరచుకొన్న పురుషస్త్రీలకు వివిధ దండాలు చెప్పబడ్డాయి. హ్రస్వప్రవాసంలోనూ, దీర్ఘప్రవాసంలోనూ ఉన్న భర్తకోసం ఒక స్త్రీ ఎంతకాలం పాటు వేచి ఉండాలో విస్తృతంగా చెప్పి తరవాత ఆమె పునర్వివాహం చేసుకొనవచ్చు నని చెప్పబడింది. ఋతుకాలాన్ని వ్యర్థం చేసి పుత్రులను కనకుండా ఉండడం "ధర్మవధ" అని కౌటిల్యుని అభిప్రాయం - "తీర్థోపరోధో హి ధర్మవధః ఇతి కౌటిల్యః".

ఐదవ అధ్యాయంలో దాయవిభాగం చెప్పబడింది. తలిదండ్రులు కాని, తండ్రికాని జీవించి ఉన్నంతకాలం పుత్రులకు ఆస్తిమీద అధికారం లేదు. తరవాతనే వాళ్లు దాయవిభాగం చేసుకోవాలి. 6,7 అధ్యాయాలలో దాయవిభాగసందర్భంలో అనేక విధాలైన పుత్రులు, ఎవరికి ఎంత భాగం రావాలి - ఇలాంటి విషయాలు చెప్పబడ్డాయి.

ఎనిమిదవ అధ్యాయంలో వాస్తుకు సంబంధించిన వివాదాలను గూర్చి చెప్పబడింది. గృహము, పొలాలు, ఆరామాలు, సేతుబంధాలు, చెరువులు, గట్లు వీటి కన్నింటికీ వాస్తు వని పేరు. వీటికి సంబంధించిన వివాదాలను సామంతుడు (గ్రామాధికారి) పరిష్కరించాలి. వాస్తువిక్రయాన్ని గూర్చి చెప్పే తొమ్మిదవ అధ్యాయంలో వాస్తువును అమ్మదలచినవాడు ముందుగా గ్రామాధికారికీ, ధనికుడికీ చెప్పి వాళ్ళకి అవసరం లేని పక్షాన ఇతరులకు అమ్మాలి. సరిహద్దులను గూర్చిన తగాదాల విషయం కూడా చర్చించ బడింది. 10వ అధ్యాయంలో వాస్తుకు సంబంధించిన తగాదాలలో ఎంత జుర్మానా వెయ్యాలి-ఇలాంటి విషయాలు చర్చించబడ్డాయి. కర్షకుడు గ్రామంలోనికి వచ్చి దున్నని పక్షాన ఆ గ్రామస్థులు అతనికి జుర్మానా వెయ్యాలి. కార్మికుడు పని చేయనంటే వాడికి ఇచ్చే కూలికి రెట్టింపు జుర్మానా. చందా ఇవ్వనివానికి రెట్టింపు జుర్మానా. సామూహిక పానభోజనాల కోసం ధనం ఇవ్వనివానికి కూడా రెట్టింపు జుర్మానా. ఏవైనా సార్వజనిక మనోరంజనం కోసం చేసే ప్రదర్శనాలకొరకు చందా ఇవ్వనివానినీ అతని

కుటుంబాన్నీ కూడా దానిలో పాల్గొననీయకూడదు. రహస్యంగా (దాన్ని) చూచినా, విన్నా రెట్టింపు జుర్మానా. సర్వహితకర మైన పనిలో పాల్గొనక పోయినా అంతే జుర్మానా. ఎవడైనా ఒక వ్యక్తి గ్రామంలో సార్వజనికహితం కోసం ఏదైనా చెపితే అతని మాట గ్రామస్థు లందరూ వినాలి. అలా చేయకపోతే 12 పణాలు జుర్మానా. వాళ్ళంతా కలిసి అతనిని కొట్టినట్లయితే ఒక్కొక్కరికి అపరాధానికి రెట్టింపు దండం. చంపితే ఇంకా ఎక్కువ - "సర్వహితమేకస్య బ్రువతః కుర్యురాజ్ఞామ్, అకరణే ద్వాదశపణో దణ్డః, తం చేత్సంభూయ వా హన్యుః పృథగేషామపరాధద్విగుణో దణ్డః, ఉపహన్తృషు విశిష్టః". దేశజాతి - కులసంఘాల విషయంలో కూడా ఇంతే. దేశహితం చేసేవాళ్లకి రాజు అండగా ఉండాలి.

"రాజా దేశహితాన్ సేతూన్ కుర్వతాం పథి సంక్రమాన్
గ్రామశోభాశ్చ రక్షాశ్చ తేషాం ప్రియహితం చరేత్".

11వ అధ్యాయంలో ఋణాన్ని గూర్చి చెప్పబడింది. నెలకి 100 పణాలకి $1^1/_4$ పణాల వడ్డీ తీసుకోవచ్చు. వ్యాపారం కోసం తీసుకొనే ఋణం ఐతే 5 పణాలు, అడవులలో వ్యాపారం చేసేవాళ్ళనుంచి 10 పణాలు, సముద్రవ్యాపారస్థులదగ్గర 20 పణాలు వడ్డీ తీసుకొనవచ్చు. అంతకు మించినట్లయితే ధనికుణ్ణి (అప్పు ఇచ్చినవాడు) ధారణికుణ్ణి (అప్పు తీసుకున్నవాడు) సాక్షులని కూడా దండించాలి. 10 సంవత్సరాలు దాటితే కాలదోషం పడుతుంది. దీనికి కొన్ని మినహాయింపులు ఉన్నాయి. ధనికుడు బాలుడైనా, వృద్ధుడైనా, ప్రవాసియైనా, రోగార్తుడైనా కాలదోషం లేదు. 12వ అధ్యాయంలో 'ఉపనిధి' (దాచడానికి ఇచ్చిన వస్తువు) ఆధి (తాకట్టు పెట్టినది), "యాచితకం" (ఎరువు తీసుకున్న వస్తువు), 'అవక్రీతకం' (అద్దెకు తీసుకున్నవస్తువు), "నిక్షేపము" (దాచడానికి ఇచ్చినధనం), మొదలైనవాటిని గూర్చిన వ్యవహారాలు చెప్పబడినాయి. సాధారణంగా శిల్పులు అశుచులు అనగా మోసం చేస్తారు. వాళ్ళదగ్గర నుంచి నిక్షేపాన్ని మామూలుగా రాబట్టుకోవడం కష్టం అంటాడు కౌటిల్యుడు. "అశుచయో హి కారవః, నైషాం కరణపూర్వో నిక్షేపధర్మః".

13వ అధ్యాయంలో 'దాస' (Slave) వ్యవహారాన్ని గూర్చి చెప్పబడింది. మ్లేచ్ఛు లను దాసులుగా చేసినా తప్పు లేదు కాని ఆర్యులైన బ్రాహ్మణ-క్షత్రియ-వైశ్య-శూద్రుల్ని వాళ్ళ కుటుంబాలవాళ్ళు దాసులుగా అమ్మితే వాళ్ళని దండించాలి. "ఉదరదాసవర్జ మార్యప్రాణమప్రాప్తవ్యవహారం శూద్రం విక్రయాదానం నయతః స్వజనస్య

ద్వాదశపణో దణ్డః, వైశ్యం ద్విగుణః, క్షత్రియం త్రిగుణః, బ్రాహ్మణం చతుర్గుణః." దేశోపద్రవాది పరిస్థితులను పట్టి ఒకప్పుడు వాళ్లుకూడా దాసులు కావచ్చును. దాసులచేత ఏ పనులు చేయించుకోవాలి. ఏవి చేయించకూడదు. వాళ్ళ విడుదల, వాళ్ళ ధనం మొదలైన విషయాలు చర్చించబడ్డాయి. కర్మకారులూ, వాళ్ళ జీతాలూ, వాళ్ళ కర్తవ్యాలూ, యజ్ఞం చేయించే యాజకులకూ, యజమానుడికీ (యజ్ఞం చేసేవాడు) మధ్య కలిగే వ్యవహారాలు మొదలైన విషయాలు 14వ అధ్యాయంలో చెప్పబడ్డాయి.

15వ అధ్యాయానికి పేరు "విక్రీతక్రీతానుశయము." అమ్మిన వస్తువును ఇవ్వని విక్రేత, కొన్న వస్తువును తీసుకొనని క్రేతా కూడా దండ్యులే. కన్యలో ఉన్న గుప్త దోషాన్ని చెప్పకుండా వివాహం చేసినవానికి 96 పణాలదండం. వరుని దోషాలు చెప్పకుండా వివాహం చేసినవానికి రెట్టింపు దండం. బ్రాహ్మణక్షత్రియవైశ్యులలో వివాహం అయిన దంటే దానికి మార్పులేదు. శూద్రులు ప్రథమసంయోగానంతరం కూడా భార్యాభర్తలు విడిపోవచ్చును. మొదటి మూడు వర్ణాలవాళ్లు కూడా సంయోగ సమయంలో లైంగికదోషా లేవైనా బయటపడినప్పుడు వాళ్లు విడిపోవచ్చు. పిల్లలు పుట్టినతరవాత మాత్రం ఇంక కుదరదు. 16వ అధ్యాయంలో ఇస్తానన్నది ఇవ్వకపోవడం (దత్తస్యానపాకర్మ), పరులసొత్తు విక్రయించడం, స్వస్వాభిసంబంధము (సొత్తుమీద అధికారము) మొదలైన విషయాలు చర్చించబడినాయి. పది సంవత్సరాలపాటు ఇతరుల అధీనంలో ఉంచితే ఆ వస్తువు వారిదే అయిపోతుంది. వాస్తువు (ఇల్లు మొదలైనవి) అద్దెకు ఇరవై సంవత్సరాలపాటు ఎవరిక్రింద ఉంటుందో వారి సొత్తు అయిపోతుంది. 17వ అధ్యాయంలో బలాత్కారంగా చేసే దోపిడీ, మారణం మొదలైనవాటికి దండం చెప్పబడింది. ఈలాటి కార్యాలకి "సాహసం" అని పేరు. వాక్పారుష్యము (తిట్టడం), దండపారుష్యము (కొట్టడం) మొదలైనవాటికి ఇవ్వవలసిన శిక్షలు 18, 19 అధ్యాయాలలో చెప్పబడ్డాయి. ఎవరైనా ఒంటికంటివానిని, కుంటివానిని పట్టుకొని "ఆహా! నీ నేత్రదంతాదులు ఎంత అందంగా ఉన్నాయి" అని అంటూ పరిహసిస్తూ చేసే వాక్పారుష్యానికి 12 పణాలు దండం. "శోభనాక్షిదన్త ఇతి కాణఖంజాదీనాం స్తుతినిందాయాం ద్వాదశపణో దణ్డః".

20 వ అధ్యాయంలో ద్యూతగృహాలను ఏ విధంగా నడపాలో, పర్యవేక్షించాలో, అక్కడ వచ్చే వివాదాలను ఏవిధంగా పరిష్కరించాలో చెప్పబడింది. ఈ అధ్యాయంలో "ప్రకీర్ణకం "(Miscellaneous) అనే పేరుతో మరికొన్ని దండాలు కూడా చెప్పబడ్డాయి.

వ్యవహారాలను చూడడంతో పాటు ధర్మస్థులు (ధర్మాధికారులు) వ్యవహారానికి రాజాలనివాళ్లు-దేవ-బ్రాహ్మణ-తపస్వి-స్త్రీ-బాల-వృద్ధ-వ్యాధిగ్రస్త-అనాథాదులు ఎవరైనా కష్టాలలో ఉంటే వాళ్ళ వ్యవహారాలు స్వయంగానే పరిష్కరించాలి. దేశమూ, కాలమూ మొదలైన ఏవేవో వంకలు పెట్టి వాళ్ళకి కష్టం కలిగించకూడదు. విద్యా-బుద్ధి-పౌరుషాలు కలవారినీ, ఉత్తమవంశీయుల్నీ, పండితులనీ, మంచిపనులు చేసేవారినీ గౌరవించాలి.

నాల్గవ అధికరణానికి "కంటకశోధనం' అనగా సమాజవిద్రోహులను శిక్షించడం అని పేరు.ముగ్గురు ప్రదేష్టలు (Commissioners), ముగ్గురు అమాత్యులు కంటకశోధనం చెయ్యాలి. మొదటి అధ్యాయంలో ప్రజలను మోసగించి వాళ్ళకి కష్టం కలిగించే సాలీలు, చాకళ్లు, సువర్ణకారులు, లోహకారులు, వైద్యులు, నటనర్తకాదులు మొదలైనవాళ్ళని గూర్చి చెప్పబడింది. చాకళ్లు ఇతరుల వస్త్రాలు ధరించకూడదట. వాళ్లెప్పుడూ ముద్గరచిహ్నం గల వస్త్రాలే ధరించాలట. మరొక వస్త్రం ధరిస్తే దండనార్హులు. వైద్యుడు 'ప్రాణాబాధికాన్ని' (Serious case) చేపట్టేటప్పుడు ముందుగా అధికారులకు తెలపాలట. అట్లా చేయకపోయినా, తప్పుడు మందు ఇచ్చినా దండనార్హుడవుతాడు. "వర్తకులు, శిల్పులు, నటనర్తకాదులు, భిక్షుకులు, ప్రచ్ఛన్న విద్యలతో మోసం చేసేవాళ్ళూ - వీళ్ళందరు దొంగలని చెప్పబడని దొంగలు. దేశపీడకులను అదుపులో ఉంచాలి.'

"ఏవం చోరానచోరాఖ్యాన్ వణిక్కారుకుశీలవాన్,

భిక్షుకాన్ కుహకాంశ్చాన్యాన్ వారయేద్దేశపీడనాత్.'

రెండవ అధ్యాయంలో సంస్థాధ్యక్షుడు (వ్యాపారసంస్థల అధికారి) వర్తకులు మంచి వస్తువులను, తగిన ధరలకు అమ్మేటట్లుగాను, ఎక్కువ లాభం తీసుకోకుండాను చూడాలని చెప్పబడింది. మూడవ అధ్యాయంలో దైవంవల్ల వచ్చే ఎనిమిది విధాలైన మహాభయాలనుంచి జనపదాన్ని ఎలా రక్షించాలో చెప్పబడింది. అగ్ని, ఉదకం, వ్యాధి, దుర్భిక్షం, ఎలుకలు, క్రూరమృగాలు, సర్పాలు, రాక్షసులు అనేవి ఎనిమిది మహాభయాలు. వీటి నివారణకోసం ఇతర ప్రయత్నాలతోపాటు అథర్వవేదోక్తప్రక్రియలు కూడా చెయ్యాలి.

అనేక వేషాలలో ఉన్న గూఢచారులనూ, సిద్ధపురుషుల మని చెప్పి కొన్ని తమాషాలు చేయకలిగిన వారినీ పంపించి ప్రజాకంటకులైన అధికారులనూ, దొంగలనూ వశీకరణవిద్యతో మోసం చేసేవాళ్ళనీ, కూటముద్రలు (నాణాలు) తయారు చేసే

వాళ్ళనీ, రసప్రయోగంచేత ఇతరులను చంపేవాళ్ళనీ, ఎలా పట్టించాలో నాలుగు - అయిదు అధ్యాయాలలో చెప్పబడింది. శంకింప తగినవాళ్ళను గుర్తించడం, దొంగిలించిన సొమ్ము గుర్తించడం, దొంగలను గుర్తించడం మొదలైన విషయాలు ఆరవ అధ్యాయంలో చెప్పబడ్డాయి. ఏడవ అధ్యాయం "ఆశుమృతకపరీక్ష (Post mortum) పరీక్షించి గుర్తించిన దొంగలకు వివిధదండనలు 8వ అధ్యాయంలో చెప్పబడ్డాయి. అపరాధాలు చేసిన బ్రాహ్మడికి శారీరకమైన దండనం ఇవ్వకూడదు. వాడు పతితుడని గుర్తుగా ఉండడం కోసం అతని లలాటంమీద ముద్రలు వేసి దేశం నుంచి వెడలగొట్టాలి. దొంగతనానికి కుక్కముద్ర, మనుష్యులను చంపినందుకు మొండెము ముద్ర గురుభార్యాగమనం చేస్తే భగముద్ర, సురాపానం చేస్తే మద్యధ్వజముద్ర వెయ్యాలి. దేశంనుంచి వెళ్ళగొట్టని పక్షంలో గనులలో పని చేయించాలి. తొమ్మిదవ అధ్యాయంలో ఆ యా శాఖలకు అధ్యక్షులైన అధికారులమీదా, వారిక్రింద పనిచేసే చిన్న ఉద్యోగస్థులమీదా, సమాహర్తలు, ప్రదేష్టలూ కూడా పర్యవేక్షణం చేస్తూ వాళ్ళు అధికారదుర్వినియోగం చేయకుండా ఉండేటట్లు చూడాలని చెప్పబడింది. కొన్ని విధాల దొంగతనాలు చేసిన వాళ్ళని కొన్ని అవయవాలని ఖండించి దండించాలని "ఏకాంగవధనిష్క్రయము' అనే పదవ అధ్యాయంలో చెప్పబడింది. 11, 12 అధ్యాయాలలో చంపడము, అంతఃపురదూషణము, స్త్రీమానభంగము మొదలైన అపరాధాలకి వధ, అంగచ్ఛేదము మొదలైన దండాలు విధింపబడినవి. అభక్ష్యములూ, అపేయములూ అయిన వస్తువులను బ్రాహ్మణ క్షత్రియాదులచేత తినిపించడము, ఇతరుల ఇళ్ళల్లో ప్రవేశించడమూ, అర్ధరాత్రివేళ ప్రాకారం ఎక్కి దాటి ఇంటిలోనికి (తన ఇంటిలోనికైనా) ప్రవేశించడం, గోడ గట్టి లేకపోవడంచేతా, బండిచక్రాలు సరిగా లేకపోవుట చేతా, గోడలు సరిగా కప్పకపోవడంచేతా ఎవరి మృత్యువుకైనా కారణం అవడం వంటి అపరాధాలకు, అగమ్యాగమనానికి ఎలాంటి శిక్ష ఇవ్వాలో 13వ అధ్యాయంలో చెప్పబడింది.

ఐదవ అధికరణానికి పేరు "యోగవృత్తము.' మొదటి అధ్యాయంలో తనకు అడ్డు తగులుతారని అనిపించిన తన వాళ్ళను ఇతరులను కూడా కపటోపాయాలచేత ఎట్లా సంహరించాలో చెప్పబడింది. రెండవ అధ్యాయంలో కోశాన్ని నింపే ఉపాయాలు, మూడవ అధ్యాయంలో ఆయా భృత్యుల కివ్వవలసిన జీతాలు చెప్పబడినవి. రాజసేవకులు రాజువద్ద ఎలా మసలుకోవాలో, రాజు చిత్తవృత్తిని ఎలా అనుసరించి ఉండాలో 4,5 అధ్యాయాలలో వివరించబడింది. ఆరవ అధ్యాయం :- రాజు మరణించినా

కూడా ఆ విషయం ఎవరికీ తెలియకుండా గోప్యంగా ఉంచి మంత్రి తగిన రాజకుమారుణ్ణి రాజుగా చేసి సామంతాదులందరూ అనుకూలంగా ఉండేటట్లు చెయ్యాలి. రాజపుత్రులు లేని పక్షంలో గర్భవతియైన రాజభార్యకు కాని, రాజకన్యకు కాని, రాజ్యాధికారం ఇవ్వాలి. లేదా రాజకుమారియందు సమానజాతీయుని ద్వారా పుత్రోత్పాదనం చేయించి వానిని రాజు చెయ్యాలి. "కన్యాయాం సమానజాతీయా దపత్యముత్పాద్య వాభిషిఞ్చేత్".

ఆరవ అధికరణం మండలయోన్యధికరణం. మొదటి అధ్యాయం :- రాజ్యానికి స్వామి (రాజు), అమాత్యులు, జనపదము, దుర్గము, కోశము, దండము (సేన), మిత్రులు అని ప్రకృతులు ఏడు. వీటి లక్షణాలు. రెండవ అధ్యాయం పేరు "శమవ్యాయామికం.' యోగక్షేమాలు శమ-వ్యాయామాలమీద ఆధారపడి ఉంటాయి. ఆ యా పనులకై తగిన అధికారులను నియమించడం వ్యాయామం. ఆ ఫలితాలను అనుభవించడానికి తగిన వాతావరణాన్ని సృష్టించడం శమం. ఈ రెండింటికీ ఆధారం షాడ్గుణ్యం. "నయ ' "అపనయాలు ' మనిషి చేతిలో ఉంటాయి. "అయ ' "అన యాలు ' దైవాధీనాలు. లోకయాత్రని ఈ దైవమానుషాలే నడిపిస్తూ ఉంటాయి. కనబడ కుండా పని చేసేది దైవం, దైవం ద్వారా ఇష్టఫలం లభిస్తే అది అయం. అనిష్టం లభిస్తే అనయం. కనబడుతూ పని చేసేది మానుషం. దానివల్ల యోగక్షేమాల లాభం నయం; వాటి విఘాతం అపనయం. దైవాన్ని గూర్చి మనం చేసేది ఏమీ లేదు కాబట్టి మానుష్యాన్ని గూర్చి జాగర్త పడాలి. ఆత్మసంపన్నుడూ, ద్రవ్యసంపన్నుడూ, ప్రకృతిసంపన్నుడూ ఐన నీతిమార్గాన్ని అవలంబించే రాజు "విజిగీషువు '. అతని నలుమూలలా సరిహద్దులలో ఉన్న రాజులు అరిప్రకృతి. ఆ రాజుల రాజ్యాలకి అవతల ఉన్నవాళ్లు మిత్రప్రకృతి. ఈ విధంగా తన సరిహద్దులో ఉన్నవాడు అరి ; దానికి అవతలవాడు మిత్రుడు; దానికి అవతల ఉన్నవాడు అరిమిత్రుడు. దానికి అవతల ఉన్నవాడు మిత్రమిత్రుడు. దానికి అవతల ఉన్నవాడు అరిమిత్రమిత్రుడు. విజయ యాత్రకి వెళ్ళదలచిన రాజుకు ఈ విధంగా ఎదుట ఐదు విధాల రాజులు ఉంటారు. అదే విధంగా వెనక - మొదట పార్ష్ణిగ్రాహుడు, వాని వెనక ఆక్రందుడు, వాని వెనక పార్ష్ణిగ్రాహాసారుడు, వాని వెనక ఆక్రందాసారుడు ఉంటారు. ఈ విధంగా విజిగీషువుతో కలిపి 10 మంది రాజులకి " రాజమండలము ' అని పేరు. ఈ విధంగా సహజ శత్రువులు, కృత్రిమశత్రువులు, సహజమిత్రులు, కృత్రిమమిత్రులు మొదలయిన విభేదాలు ఎన్నో వర్ణింపబడినవి.

ఏడవ అధికరణం "షాడ్గుణ్యాధికరణం.' మొదటి అధ్యాయము :- సంధి-విగ్రహ-ఆసన-యాన-సంశ్రయ-ద్వైధీభావాలకి "షాడ్గుణ్యం ' అని పేరు. కొన్ని షరతులమీద ఇద్దరురాజులు కలవడం సంధి. అపకారం చెయ్యడం విగ్రహం. ఉపేక్షించడం ఆసనం. దండెత్తడం యానం. స్వాత్మార్పణం చేయడం (లొంగి పోవడం) సంశ్రయం. సంధి-విగ్రహాలు రెండింటితోటి పని జరిపించడం ద్వైధీభావం. ఏడు అధ్యాయాల ఈ సప్తమాధికరణంలో రాజు ఈ రాజమండలంలోని రాజులతో ఎప్పుడు ఎలా ప్రవర్తించాలి, ఈ షాడ్గుణ్యాన్ని ఏ విధంగా ఉపయోగించాలి అన్న విషయాలు విస్తృతంగా వివరింపబడ్డాయి. అవపరమైనప్పుడు కపటయుద్ధం కూడా చేయవచ్చునని కౌటిల్యుడు చెప్పి ఉన్నాడు.

ఎనిమిదవ అధికరణం "వ్యసనాధికారికం '. ప్రథమాధ్యాయంలో పైన చెప్పిన ప్రకృతులకు కలిగే వ్యసనాలూ, వాటి ప్రతీకారమూ చెప్పబడ్డాయి. రెండవ అధ్యాయంలో రాజుకూ రాజ్యానికీ కలిగే వ్యసనాలు చెప్పబడ్డాయి. " అభ్యంతర కోపం ' (లోపల ఉన్న తిరుగుబాటు) అనీ బాహ్యాకోపం అనీ కోపం రెండు విధాలు. అందు అభ్యంతరకోపం చాలా ప్రమాదకరమైనది. ఆనాడు అక్కడక్కడ ద్వైరాజ్యమూ, వైరాజ్యమూ మొదలైన పరిపాలనాపద్ధతు లుండేవి. ఇద్దరు రాజులుండడం ద్వైరాజ్యం. రాజే లేక ప్రజాపాలనమైతే వైరాజ్యం. వైరాజ్యంకంటె కొంత వరకు ద్వైరాజ్యమే మంచి దంటాడు కౌటిల్యుడు. మూడవ అధ్యాయంలో పురుషుల వ్యసనాలు చెప్పబడ్డాయి. కోపంవల్ల వాక్పారుష్యము, అర్థదూషణము (ధనం విషయంలో అన్యాయాచరణము) దండపారుష్యము అనే వ్యసనాలూ, కామం వల్ల వేట, ద్యూతము, స్త్రీలు, పానము అనే వ్యసనాలూ కలుగుతాయి.

నాల్గవ అధ్యాయం :- దైవంవల్ల కొన్ని అగ్నిపీడాదులైన ఆపదలు కలుగుతూ ఉంటాయి. చిన్న ఉద్యోగస్థులు పెద్ద అధికారులు-వీళ్ళలో చిన్నవాళ్లు ఆపదలో చిక్కుకున్నా అంతగా ప్రమాదం లేదు. ఎందుచేత నంటే అలాంటివాళ్లు చాలామంది లభిస్తారు. పెద్దవాళ్ళు పోకుండా చూచుకోవాలి. ఎందుచేతనంటే కొన్ని వేలమందిలో ఒక్కడు మాత్రమే అలాంటివాడు లభిస్తాడు. 'దేశవిహారం' (ప్రజలందరూ ఆనందవిలాసాలతో కాలం గడపడం)రాజవిహారం-వీటిలో 'రాజవిహారం' దేశానికి నష్టం కలిగిస్తుంది. దేశవిహారంవల్ల కొంత వ్యయం జరిగినా దాని వల్ల ప్రజలకి విశ్రాంతి లభించి ఇంకా ఎక్కువ పని చేయకలుగుతారు. ఇలాంటి విషయాలు ఈ అధ్యాయంలో

చాలా చెప్పబడినవి. సైన్యవ్యసనం కలగకుండాను, మిత్రవ్యసనం కలగకుండాను చూచుకొనవలెనని 5వ అధ్యాయంలో చెప్పబడింది. సైన్య-మిత్రవ్యసనం అనగా వాళ్ళకి రాజుమీద ద్వేషం కలగడం.

తొమ్మిదవ అధికరణానికి "అభియాస్యత్కర్మ' అని పేరు. జిగీషువు పరునిపై దండెత్తి వెళ్ళ దలచినపుడు చూసుకోవలసిన విషయాలు ఈ అధికరణంలో చెప్పబడ్డాయి. ఇందులో ఉన్న తొమ్మిది అధ్యాయాలలో ప్రసంగవశంచేత కొన్ని ప్రధానమైన ఇతరవిషయాలు కూడా చెప్పబడ్డాయి. ప్రభావం (సైన్యబలాదికం) కంటె కూడా మంత్రశక్తి (ఆలోచనాశక్తి) గొప్పది. హిమవత్పర్వతంనుంచి దక్షిణసముద్రం వరకూ వ్యాపించి, తూర్పుపడమరలకు వెయ్యియోజనాల పరిమాణం గల దేశం చక్రవర్తి క్షేత్రం. అనగా ఆ భూమండలానికి అధిపతియైనవాడు చక్రవర్తి యని కౌటిల్యుడు మొదటి అధ్యాయంలో చెప్పినాడు. రెండవ అధ్యాయం-మూలబలము, (రాజధాని రక్షణం కొరకు స్థిరంగా ఏర్పరచిన సేన) భృతక (జీతం ఇచ్చే) బలము, శ్రేణీబలము (వేరు వేరు పనులకోసం తయారుచేసిన సేన) మిత్రబలం, శత్రుబలం (లొంగిపోయిన శత్రువునుండి తీసుకున్న సేన), అటవీబలము అనే వివిధ బలాలని సమకూర్చుకొని యుద్ధానికి బయలుదేరాలి. మూడవ అధ్యాయం :- తాను అటు వెళ్ళిన తరువాత వెనకనుంచి రాజధానిలో ఏ ఉపద్రవాలూ రాకుండా, చూచుకొని, ప్రకృతికోపానికి ప్రతిక్రియ చేసుకోవాలి. "సూచీముఖా హ్యనర్థాః ఇతి లోకప్రవాదః ' "అనర్థాలు ప్రారంభంలో ఎప్పుడూ చిన్నవిగానే ఉంటాయి ' అని లోకోక్తి ఉన్నది కదా అంటాడు చాణక్యుడు. అందుచేత చిన్న విషయాన్ని కూడా ఉపేక్ష చెయ్యకూడదు. నాల్గవ అధ్యాయం :- లాభనష్టాలు బాగా ఆలోచించుకొని ఏమాత్రం లాభం ఉన్నదని తోచినా నిస్సంశయంగా ముందుకు దూకాలి. ఆ సందర్భంలో లాభవిఘ్నాలను వివరించాడు- "లాభవిఘ్నాః-కామః, కోపః, సాధ్వసం (పిరికి తనం), కారుణ్యం, హ్రీః (సిగ్గు), అనార్యభావః (విశ్వాసఘాతుకత్వం), మానః (అహంకారం), సానుక్రోశతా (ఎక్కువజాలి), పరలోకాపేక్షా (పరలోకభయం) దామ్భికత్వం, అత్యాశిత్వం (దురాశ), దైన్యం, అసూయా, హస్తగతావమానః (చేతికి చిక్కిన దాని విషయంలో చిన్నచూపు), దౌరాత్మికం (దుష్టస్వభావం,) అవిశ్వాసః, భయం, అనికరః (శత్రువును తిరస్కరించకపోవడం), శీతోష్ణవర్షాణామాక్షమ్యం, మంగలతిథినక్షత్రేష్టిత్వమితి (మంచి ముహూర్తంకోసం చూస్తూ ఉండడం).

"నక్షత్రమతిపృచ్ఛన్తం బాలమర్థోఽతివర్తతే,

అర్థో హ్యర్థస్య నక్షత్రం కిం కరిష్యన్తి తారకాః '

ఎక్కువగా నక్షత్రాలను గూర్చి ఆలోచిస్తూ కూర్చున్నవాని అర్థం (లాభం) చెయ్యిజారిపోతుంది. అర్థం సాధించడానికి కావలసిన నక్షత్రం అర్థమే. తారకలు ఏం చేస్తాయి.

"నాధనాః ప్రాప్నువన్త్యర్థాన్ నరా యత్నశతైరపి,

అర్థైరర్థాః ప్రబధ్యన్తే గజాః ప్రతిగజైరివ. '

"ధనం లేనివాళ్లు ఎన్ని ప్రయత్నాలు చేసినా అర్థాన్ని సంపాదించలేరు. ఏనుగును మరొక ఏనుగు సహాయంతో బంధించినట్టు అర్థాన్ని అర్థంతోనే బంధించాలి. ''

ఐదవ అధ్యాయం : సంధ్యాదులను సరిగా ప్రయోగించక పోతే అనేక ఆపదలు వస్తాయి. అందుచేత వాటి ప్రయోగంలో అప్రమత్తుడుగా ఉండాలి. ఆరు, ఏడు అధ్యాయాలు :- రాజద్రోహులవల్లా, శత్రువులవల్లా వచ్చే ఆపదలు వాటి ప్రతిక్రియలు. అర్థానర్థసంశయాలకి సంబంధించిన ఆపదలు వాటి ప్రతిక్రియలు.

పదవ అధికరణం "సాంగ్రామికాధికరణం '-యుద్ధంకోసం సేనానివేశమూ, పరసేనాస్కందనమూ, సైన్యంవెనక వైద్యులు, సైనికుల ఆనందంకోసమై స్త్రీలు, ఇతరవస్తువులూ తీసికొని వెళ్ళడం, చతురంగబలాల మోహరింపు, యుద్ధరంగంలో రాజు ఉండవలసిన స్థానము, వివిధవ్యూహాలు-ఈ విషయాలన్నీ ఈ అధికరణంలో వర్ణింపబడ్డాయి. 'సంఘవృత్తం' అనే 11వ అధ్యాయంలో సంఘరాజ్యాలలో (గణతంత్ర రాజ్యాలలో) భేదాలు కల్పించే ఉపాయాలు చెప్పబడ్డాయి.

"ఆబలీయసాధికరణం ' అనే 12వ అధికరణంలో దుర్బలుడు బలవంతుడైనవానికి లొంగిపోవడం విషయంలో అభిప్రాయభేదాలు చెప్పబడ్డాయి. దుర్బలుడు తాత్కాలికంగా సంధి చేసికొని సమయానికి వేచి ఉండడం మంచిది. సమయానుకూలంగా బలవంతుడైనవాని శత్రువులతో సంధి చేసికొని బలవంతుణ్ణి నశింపచెయ్యాలి. ఈ అధికరణం నాల్గవ అధ్యాయంలో రహస్యంగా శత్రురాజ్యంలో ప్రవేశించి శస్త్ర-అగ్ని-రస (విషపూరిత రసాయనాలు) ప్రయోగం చేసి ఆ రాజ్యంలో అల్లకల్లోలం పుట్టించే పద్ధతులు చెప్పబడ్డాయి. అదే విధంగా శత్రురాజును

శస్త్రవిషప్రయోగాదికూటోపాయాలచేత, దేవాలయాదులలో ఉన్నప్పుడూ చంపే విధానం ఐదవ అధ్యాయంలో చెప్పబడింది.

"దుర్గలంభోపాయము ' అనే 13వ అధికరణంలో అనేక రూపాలలో ఉన్న గూఢచారులనూ,జటాధారులై నాలుగువందల సంవత్సరాల వయస్సు కలవారం అని చెపుతూ, శిష్యమండలి పరివృతులైన "యోగు ' లను శత్రుదుర్గంలోనికి ప్రవేశపెట్టించడం, శ్మశానవృక్షాదులపైన దాగి పిశాచాదులు అరుస్తున్నట్లుగా అరుస్తూ మాకు ఈ పూజలు కావాలి, ఆ పూజలు కావాలి, లేకపోతే రాజ్యాన్ని కబళించివేస్తాం - ఈ విధంగా పలికించడం, ఆహారాదుల సరఫరా లేకుండా ఆపివేయడం వంటి ఉపాయాల చేత దుర్గాన్ని ఆక్రమించుకొనే విధానం వర్ణింపబడింది.

"ఔపనిషదికం ' అనేది 14వ ప్రకరణం. చాతుర్వర్ణ్యాన్ని రక్షించడానికై రాజు అధార్మికుల విషయంలో ఈ ఔపనిషదిక ప్రక్రియ ప్రయోగించాలంటాడు కౌటిల్యుడు. "చాతుర్వర్ణ్యరక్షార్థమౌపనిషదికమధర్మిష్ఠేషు ప్రయుఞ్జీత '. మొదటి మూడు అధ్యాయాలలో చచ్చిన కప్పలు, పాములు, ఎలుకలూ వంటి జంతువులనూ, ఇతర పదార్థాలనూ కలిపి వివిధరోగాలు కలిగించే ప్రాణహానికరాలైన విషాలను ఎట్లు తయారుచేయాలో, ఎలా ప్రయోగించాలో విస్తృతంగా వర్ణింపబడింది. కొన్ని అభిచారిక ప్రయోగాలు కూడా వివరింపబడినవి. వీటితో శత్రువులను సంహరించి స్వజనాన్ని రక్షించుకోవాలి రాజు.

"మన్త్రభైషజ్యసంయుక్తా యోగా మాయాకృతాశ్చ యే,

ఉపహన్యాదమిత్రాం స్తైః స్వజనం చాభిపాలయేత్. '

నాల్గవ అధ్యాయంలో వీటికి కొన్ని విరుగుళ్ళు కూడా చెప్పబడ్డాయి.

చివరి అధికరణం "తంత్రయుక్తి. ' ఇందులో అర్థశాస్త్ర విషయాలు, విషయప్రతిపాదనపద్ధతీ సంక్షిప్తంగా ఒక అధ్యాయంలో ప్రతిపాదింపబడినవి. దీని ప్రారంభంలో "అర్థశాస్త్రం ' అనే పదానికి నిర్వచనం చెపుతూ "మనుష్యాణాం వృత్తిరర్థః; మనుష్యవతీ భూమిరిత్యర్థః. తస్యాః పృథివ్యాః లాభపాలనోపాయః శాస్త్రమర్థశాస్త్రమితి " అని వ్రాసినాడు. "మనుష్యుల జీవనవిధానానికి 'అర్థం' అని పేరు. అనగా మనుష్యులతో కూడిన భూమి. ఆ భూమిని సంపాదించి పాలించే ఉపాయాన్ని బోధించే శాస్త్రం అర్థశాస్త్రం. '

"ఈ శాస్త్రం ధర్మార్థకామాలని ప్రవర్తింపచేసి రక్షిస్తుంది. అధర్మ-అనర్థ-విద్వేషాలని తొలగిస్తుంది '.

"ధర్మ మర్థం చ కామం చ ప్రవర్తయతి పాతి చ,

అధర్మానర్థవిద్వేషానిదం శాస్త్రం నిహన్తి చ '.

"ఎవడైతే పట్టుదలతో శాస్త్రాన్నీ, శస్త్రాన్నీ, నంద రాజులచేతుల్లో ఉన్న భూమిని కూడా ఒకేసారి ఉద్ధరించినాడో అతనిచేత ఈ శాస్త్రం రచింపబడింది '. "ప్రాచీన ఆచార్యులలో ఎన్నో అభిప్రాయభేదాలు ఉండడంచేత వాటి నన్నింటినీ పరిశీలించి విష్ణుగుప్తుడే స్వయంగా సూత్రమూ, భాష్యమూ కూడా రచించినాడు ' అని అంటూ కౌటిల్యుడు ఈ శాస్త్రాన్ని ముగించినాడు.

"యేన శాస్త్రం చ శస్త్రం చ నన్దరాజగతా చ భూః,

అమర్షేణోద్ధృతాన్యాశు తేన శాస్త్రమిదం కృతమ్. '

"దృష్ట్వా విప్రతిపత్తిం బహుధా శాస్త్రేషు భాష్యకారాణామ్,

స్వయమేవ విష్ణుగుప్తశ్చకార సూత్రం చ భాష్యం చ. '

ఈవిధంగా అత్యద్భుతమైన అర్థశాస్త్రాన్ని రచించిన మహామేధావి కౌటిల్యుడు, రీతి (theory)మాత్రమే కాకుండా ప్రయోగం (Practice) కూడా తెలిసిన కార్యదక్షుడు. అందుచేత ఈ అర్థశాస్త్రానికి ఒక ప్రత్యేకమైన స్థానం ఉన్నది. సేనాసన్నివేశాలూ, యుద్ధవిధానాలూ వంటి కొన్ని అంశాలు తప్ప మిగిలిన అన్ని విషయాలు కూడా అనాడు ఎంత ఆచరణయోగ్యాలుగా ఉండేవో, ఈ నాటికీ ఏనాటికీ కూడా అవి ఆ విధంగానే ఉంటాయి. అంత మహోన్నతదశలో ఉన్న నందసామ్రాజ్యాన్ని సమూలంగా నాశనం చేసి మౌర్యసామ్రాజ్యాన్ని స్థాపించి ప్రధానామాత్యుడుగా రాజ్యపాలనా కార్యక్రమాన్ని నిరాఘాటంగా నిర్వహించిన కర్మణ్యుడు వ్రాసిన గ్రంథానికి ఇంతటి త్రైకాలికప్రాశస్త్యం ఉన్నదంటే ఆశ్చర్యం లేదు.

కౌటిల్యుడు అరిస్టాటల్‌కి సమకాలికుడు. అరిస్టాటల్ మహావిజేత అయిన అలెగ్జాండర్‌కు గురువు. అయితే కౌటిల్యుడు మౌర్యవంశీయప్రథమచక్రవర్తియైన చంద్రగుప్తునికి గురువు, రాజ్యస్థాపకుడు, మంత్రీ కూడాను. కౌటిల్యుని భావాలలోనూ, అరిస్టాటల్ భావాలలోనూ అక్కడక్కడ కొన్ని సామ్యాలు ఉండడం గమనార్హమైనది.

ప్లేటో శిష్యుడైన అరిస్టోటల్ క్రీ.పూ. 335లో అథెన్సు నగరంలో ఒక విద్యాలయం నెలకొల్పి అక్కడ ఉండగా "రాజనీతి" ( Politics) అనే పేరుతో ఐదు వేరు వేరు సమయాలలో పుస్తకాలు వ్రాశాడు. రాజనీతికి వైయక్తికజీవితంమీద అత్యధికమైన అధికారం ఉన్నదనీ, దీనిమీదనే ఇతరశాస్త్రాలూ, కళలూ మొదలైనవి ఆధారపడి ఉన్నాయనీ ఆయన సిద్ధాంతీకరించాడు. దండనీతియే అన్ని శాస్త్రాలకీ ఆధారం అని కౌటిల్యుడు నొక్కి వక్కాణించాడు. రాజనీతి అనేది ఏదో విధంగా రాజ్యం నడపడానికి కాదు ; సమాజంలో ఉత్తమమైన ఆదర్శాలనూ, నైతికప్రవృత్తినీ నెలకొల్పడమే దాని ప్రధానలక్ష్యం అని అరిస్టోటల్ అభిప్రాయం. ఇది, ధర్మాన్ని ఆధారంగా చేసుకొని అర్థ-కామాలకు పుష్టి చేకూర్చడం రాజు ప్రధానకర్తవ్యం అనే కౌటిల్యుని అభిప్రాయానికి చాలా సన్నిహితంగా ఉన్నది.

అరిస్టోటల్ అభిప్రాయం ప్రకారం రాజ్యం అత్యుత్తమమైన రాజ్యాంగవిధానం ద్వారా పాలింపబడాలి. అధికారులు కార్యనిర్వహణదక్షులైనంత మాత్రంచేత ప్రయోజనం లేదు. సద్గుణాలు కలవారుగా కూడా ఉండాలి. రాజ్యపాలకులు సుస్థిరంగా ఉంటేనే దీనిని సాధించడానికి శక్యం అవుతుంది.

కౌటిల్యుడు కూడా తన చుట్టు ప్రక్కల సంఘరాజ్యాలలోని లోపాలను, దౌర్బల్యాలనూ గురించి 'రాజ్యం సుస్థిరంగా ఉండాలంటే ఒక వ్యక్తి సర్వాధికారిగా ఉండాలి; అప్పుడే రాజ్యం యోగక్షేమాన్వితంగా ఉంటుందని' అంటాడు. ఒక ఘట్టంలో గణతంత్రరాజ్యాలను గూర్చి వ్రాస్తూ - ఐకమత్యం ఉన్నంతవరకూ ఇవి చాలా బలిష్ఠంగానే ఉంటాయి. కాని ఇవి దుర్బలాలు అవడానికే ఎక్కువ అవకాశాలున్నాయి. ఎందుచేతనంటే - ఇలాంటి రాజ్యాలలో బాధ్యత వహించేవాడు ఒక్కడూ ఉండడు - అని అంటాడు కౌటిల్యుడు. పాలింప తగినవారికంటె ఎక్కువగా పాలకులను దృష్టిలో పెట్టుకుని వ్రాయబడిన రాజనీతిగ్రంథం అర్థశాస్త్రం. దీనిని పట్టి - రాజ్యంలో మాత్స్యన్యాయం ప్రబలకుండా రాజ్యాన్నంతటినీ ఒక్క నియమబద్ధక్రియంలో, సుఖ సంతోషాలతో నిండిన జీవనపద్ధతిలో నడిపించడమే రాజుయొక్క ప్రధానలక్షణంగా ఉండాలి అని కౌటిల్యుని అభిప్రాయంగా తెలుస్తుంది.

క్రీ.పూ. 600-323 ప్రాంతంలో భారతదేశంలో స్వయంపాలనాధికారం గల ఎన్నో రాజ్యసంఘాలు లేదా సంఘరాజ్యాలు ఉంగేవి. వీటికీ ఆనాడు గ్రీసు-ఇటలీ దేశాలలో ఉండే (సంఘు) నగర రాజ్యాలకీ చాలా పోలికలు ఉన్నాయి. ఇవి ఆనాడు భారతదేశంతో ప్రప్రథమంగా ప్రజాప్రభుత్వస్థాపనం కోసం చేసిన ప్రయత్నానికి

చిహ్నాలు.

సింధునదీతీరప్రాంతంలో అగ్రశ్రేణులు : ముచికర్ణికులు, అంబిస్తులు, వసతులు మొదలైన గణతంత్రప్రభుత్వం నడిపిన సంఘాలు (Tribes) ఉండేవి. పశ్చిమాన కాంభోజులు, కటులు, సౌభూతులు, యౌధేయులు, సిబులు, మాల్వులు, క్షుద్రకులు అనే మహాశూరులైన జనుల సంఘాలు ఉండేవి. కుకురులు, కురులు, పాంచాలులు అనే గణరాజ్యాలు, అంతకు పూర్వం వృష్ణులు ఉండేవారని కౌటిల్యుడు స్పష్టంగా చెప్పి ఉన్నాడు. అదే విధంగా అతనికాలంలో, నేటి బెంగాలు-బీహారు ప్రాంతాలలో సాక్యులు, కోలూలులు, మల్లులు, భగ్గులు, మోరియులు మొదలైన గణరాజ్యాలు ఉండేవి. ఈ సంఘాల పరిపాలన అతి విస్తృత సంఖ్యాకులైన సభ్యులు గల సభలద్వారా నడపబడేది. వృజిక సంఘంలో 7707 గురు రాజులు (సభ్యులు), శక సంఘములో 500 మంది సభ్యులు, యౌధేయ సంఘంలో 5000 మంది సభ్యులు, అంబష్ఠసంఘంలో వయోవృద్ధులూ ఉండేవారు. రాజ్యపాలన అంతా వీళ్ళ చేతులలో ఉండేది. గ్రీసులోని నగర రాజ్యాలలో (City States) ఉన్నట్లుగానే తీర్మానాలు ప్రవేశపెట్టడం, మతదానం, తీర్మానాలు చేయడం మొదలైన విషయాలలో అతిజటిలమైన నియమనిబంధనలు ఉండేవి. రాజును ఎన్నుకోవడం న్యాయవ్యవస్థ మొదలైన విషయాలలో ఇక్కడ ఉన్న పద్ధతులకీ గ్రీసులో ఉండే పద్ధతులకీ చాలా పోలికలు ఉండేవి. గ్రీసులోని స్పార్టా గణతంత్రరాజ్యంలో ఇద్దరు రాజులు ఉండేవారు. అట్టి ద్వైరాజ్యం భారతదేశంలో కూడ ఉండేదని కౌటిల్యుడు స్పష్టంగా చెప్పి ఉన్నాడు. ప్రజలకు చాలా స్వాతంత్ర్యం ఉండేది. ఐతే అచిరకాలంలోనే, ఈ సంఘరాజ్యాలు గ్రీసునగరరాజ్యాలవలె అనేకరకాలైన ఆంతరంగికవిభేదాలవలన కలిగిన ద్వేషాలు, పాలకుల స్వార్థపరత్వమూ, అసూయా మొదలయినవాటిచేత దుర్బలాలైపోయినాయి. దీనికి తోడు బౌద్ధ-జైన-భాగవత మతాలు ఇంకా విభేదాలకి దారితీసినవి. ఇళ్ళూ, సమాజమూ విడిచిపెట్టి ప్రజలు ఏదో అజ్ఞాతప్రపంచాన్ని అన్వేషించడం కోసం ప్రయత్నాలు ప్రారంభించారు. దీనితో సంఘాల ఐకమత్యమూ బలమూ దెబ్బతిన్నాయి.

అరిస్టోటల్ వలెనే కౌటిల్యుడు కూడ సంఘరాజ్యాలు చాలా సంఘటితంగానూ బలవత్తరంగానూ ఉంటాయని ప్రశంసించినాడు. " సంఘా హి సంహతత్వాదధృష్యాః పరేషామ్ ' (XI. I) - ఐతే నిపుణుడైన రాజు ఒక సంఘానికి మరొక సంఘానికి విరోధం కల్పించి ఆ రెండూ దుర్బల మయిపోయేటట్లుగా చెయ్యాలి. ఈ సంఘరాజ్యాలు

బలంగా ఉన్న పక్షంలో సామదానాలచేత వాటి సహాయం సంపాదించుకొనడం రాజుకు ఎంతయినా అవసరం అంటాడు కౌటిల్యుడు. ఏమైనా - ఒక వ్యక్తి రాజదండభయం లేనంతవరకూ తన కర్తవ్యాలను ఏ విధంగా సరిగా నిర్వర్తించడో అదేవిధంగా సంఘాలుకూడ తాము ఏ పరిస్థితులలోనైనా ఒక ప్రభువుయొక్క ఆజ్ఞను మన్నించి తీరాలి అనే మాట లేకపోవడంచేత చాలాకాలం పాటు సుసంఘటితంగా ఉండజాలవనీ అందుచేత "చతురంతమహీపాలత్వం' అనే ప్రధానాదర్శం గల ఐకరాజ్యమే ( ఒకే రాజు ఉండడం) మంచిదనీ కౌటిల్యుని అభిప్రాయము.

రాజును గూర్చీ రాజుయొక్క కర్తవ్యాలను గూర్చీ అర్థశాస్త్రాదులలో ఉన్న నియమనిబంధనాలనుపట్టి చూస్తే రాజు కూడా నిరంకుశంగా ప్రవర్తింపజాలడనీ అతడుకూడ వేతనం తీసుకొనే ఒక ప్రజాసేవకుని వంటివాడేననీ స్పష్టమవుతుంది. అతని కుటుంబంలోని పరిజనానికి కూడ కౌటిల్యుడు జీతం నిర్ణయించి ఉన్నాడు. యువరాజు - రాజమాత- రాజమహిషి మొదలైనవాళ్ళకి సంవత్సరానికి జీతం 48,000. ఈ విధంగా ఆ యా అధికారులకు నిర్ణయించబడింది (ఐదవ అధికరణం). పేరుకి 'స్వామి' అని అన్నా రాజుయొక్క అధికారాలన్నీ అపరాధులను శిక్షించడం వరకే సీమితమై ఉన్నాయి. అడుగడుగునా అమాత్య మతానుసరణము, ప్రజాక్షేమదృష్టి, ధర్మం అనే అడ్డంకులు విధింపబడి ఉన్నాయి. ఈ విధంగా రాజు ప్రజలశ్రేయస్సును ప్రధానలక్ష్యముగా ఉంచుకొని త్రయీధర్మాన్ని పరిరక్షించాలని కౌటిల్యుని అర్థశాస్త్ర సారాంశము.

బౌద్ధ-జైనమతాలు ఆవిర్భవించిన ఒకటి రెండు శతాబ్దుల లోపుగా కౌటిల్యుడు జనించినాడు. ఇంకా అప్పటికి కూడా వైదిక కర్మకలాపాలు జరుగుతూ ఉండేవి. అగ్నిష్టోమము, మధ్యమోపసదము, అహర్గణము, బృహస్పతిసవనము, రాజసూయము మొదలైనవి అర్థశాస్త్రంలో పేర్కొనబడినవి. అథర్వప్రోక్తమైన అభిచారయోగాల ప్రయోగం కూడా విస్తృతప్రచారంలో ఉండేది. దేశోపద్రవాలని తొలగించడం కోసం అగ్ని-యమ-వరుణ-అశ్వినీదేవతా-వైశ్రవణ-జయంతులను పూజించాలని అంటాడు కౌటిల్యుడు. వైజయంతుడు - వైశ్రవణుడు - అపరాజితుడు - దుర్గ - అప్రతిహత - శివుడు - విష్ణువు మొదలైన ఇతర దేవతలను కూడా కోటలో స్థాపించి పూజించాలి. బౌద్ధమతం ఉపదేశించిన అహింసాసిద్ధాంతసన్న్యాసాదులవల్ల దేశం ఎంత దుర్బలం అయిపోతుందో మొట్టమొదట గ్రహించినవాడు కౌటిల్యుడు. సన్న్యాసం స్వీకరించడం కంటె దేశరక్షణ

కోసం గృహస్థుడుగా ఉండడం మంచిదంటాడు. కుటుంబ పోషణకు కావలసిన ఏర్పాట్లు చేయకుండా సన్న్యాసం తీసుకొనే వాళ్ళనీ, స్త్రీలకి సన్న్యాసం ఇప్పించేవాళ్ళనీ దండించాలని శాసించాడు. సన్న్యాసులు గ్రామంలో నివసిస్తే గ్రామస్థులు కూడా అకర్మణ్యులై పోతారనే భయంచేత వాళ్ళకి గ్రామనివాసం నిషేధించినాడు.

సాధారణంగా కౌటిల్యుణ్ణి మాకియవెల్లితో పోలుస్తూండడం అలవాటు. 1494లో ఫ్రాన్సు ఇటలీమీద దండయాత్ర చేసినది మొదలు ఫ్లారెన్స్ అనేక బాధలకు గురి అయింది. తరువాతి 20 సంవత్సరాలలో ఆ నగరరాజ్యం గణరాజ్యం చేయబడింది. మళ్ళీ ఫ్రాన్స్ దాడిచెయ్యడంతో ఆ ఫ్లారిన్స్ పరిపాలనావిధానాదికం అంతా అస్తవ్యస్తం అయిపోయింది. ఇలాంటి పరిస్థితులను కళ్ళారా చూచిన మాకియవెల్లి మానసికస్థితి ఎలా ఉంటుందో మనం ఊహించుకోవచ్చును. అతని అభిప్రాయము ప్రకారం ప్రపంచం ఇంతకంటె మంచిదవుతుందనే ఆశ లేదు. ఇంతకంటె చెడ్డదీ కాకపోవచ్చు. ఎల్లప్పుడూ ఇది ఇలా ఉండేదే. ఒకమాటు జరిగిన మంచివిషయాలైనా, చెడ్డవిషయాలైనా మాటిమాటికీ జరుగుతూ ఉండవచ్చును. మానవు డెప్పుడూ స్వార్థపరుడే. సామాజికశ్రేయస్సు అనే దృష్టి లేకుండా స్వలాభం కోసమే ప్రయత్నిస్తూ ఉంటాడు. మానవుడు కృతఘ్నుడు, వంచకుడు, చపలస్వభావుడు, పిరికిపంద, దురాశాపరుడు. అవసరాన్ని పట్టి మాత్రమే మంచితనం చూపిస్తూ ఉంటాడు. అందుచేత చక్రవర్తి మానవుణ్ణి భయపెట్టి పరిపాలించాలి కాని అతనిలో ప్రేమభావాన్ని పుట్టించి పాలించడం అనేది కల్ల. ఇలాంటి నిరాశావాదం (Pessimism) ఈతని 'రాజు' ('Prince')అనే గ్రంథంలో కనబడుతుంది. సంపూర్ణాధిపత్యం సాధించడం కోసం ఎలాంటి సాధనాన్నైనా అవలంబించవచ్చు ననేది ఈయన సిద్ధాంతము.

జాగర్తగా పరిశీలిస్తే కౌటిల్యుడికీ, ఈతనికీ ఏ విధమైన పోలికలూ లేవనే విషయం స్పష్టం అవుతుంది. కౌటిల్యుడు దండానికి ప్రాధాన్యం ఇచ్చినా అపరాధాన్ని మించిన దండాన్ని నిషేధించాడు. ధర్మానికీ, అర్థానికీ, కామానికీ సమప్రాధాన్యం ఇస్తూ శాంతిని పరిరక్షించడమే రాజుయొక్క ప్రధానకర్తవ్యం. ఈ శాంతిసాధనం అనే పరమాదర్శం కేవలం భయపెట్టడం వల్ల సాధ్యం అయేది కాదు. ప్రజల మనఃపూర్వకమైన సహకారంవల్ల మాత్రమే సాధ్యం అవుతుంది. వర్ణధర్మం, ఆశ్రమధర్మం ఈ రెండింటినీ జాగర్తగా పరిరక్షిస్తే సమాజానికి శ్రేయస్సు లభిస్తుందని నమ్మిన వ్యక్తి కౌటిల్యుడు.

వర్ణధర్మం సాంఘికాభివృద్ధికి హేతువైతే ఆశ్రమధర్మం వైయక్తికసమున్నతికి

సాధనం అని నమ్మిన రోజులు అవి. బహుశా వర్ణధర్మం అనేది జన్మతః సిద్ధము అనేమాట వదిలేస్తే (వేదకాలంలో ఆ విధంగానే ఉండేదని విమర్శకుల అభిప్రాయము.) ఇది ఈనాడుకూడా కొంతవరకూ ఉపయోగకరం కావచ్చునేమో. ఇలాంటి ప్రధానమైన భేదం ఉండడంచేత కౌటిల్యుణ్ణి మాకియవెల్లితో పోల్చడం అంత యుక్తం కాదు. తన కాలంలో ఫ్లారెన్సునగరరాజ్యవ్యవస్థ ఛిన్నాభిన్నం అవడం చూచి మాకియవెల్లి ప్రభావితుడయినట్టుగా ఆనాటి కొన్ని సంఘరాజ్య - గణరాజ్యాలలోని పరిస్థితులను చూచి కౌటిల్యుడు ప్రభావితుడై ఏకరాజరాజ్యస్థాపనాన్ని సమర్థించి ఉండవచ్చు. అంతవరకే వారిద్దరి మధ్యా ఉన్న పోలిక. ఈలాంటి సామ్యవైషమ్యాలను ఇటు కౌటిల్యుడికీ, అటు ఇతరదేశరాజ్యశాస్త్రనిపుణులకీ మధ్య ఎన్నో చూపవచ్చును.

అయితే ఇక్కడ ఒక ఊహకి అవకాశం లేకపోలేదు. మాకియవెల్లి కౌటిల్యుని అర్థశాస్త్రం చేత ప్రభావితుడై తాను రచించిన "ది ప్రిన్స్' అనే గ్రంథంలో రాజకీయ కుటిలత్వం విషయంలో కౌటిల్యునికంటె ఒక అడుగు ముందుకు వెళ్లి ఉంటాడు. పాశ్చాత్యులు ప్రప్రథమంగా భారతదేశంలో పదిహేనవశతాబ్దంలో అడుగుపెట్టారు. పోర్చుగీసువాళ్లు 1498లో కాలీకట్‌కు జలమార్గం ప్రారంభించారు. దాదాపు పదిహేను సంవత్సరాల తరవాత మాకియవెల్లి "ది పిన్స్' రచించాడు. ఆనాడు ఇంత స్వల్ప కాలంలో అర్థశాస్త్రం మాయికవెల్లి చేతులలోనికి వెడుతుందా అని సందేహం కలగవచ్చు. ఆ విషయం సందిగ్ధమే అయినా అంతకు పూర్వమే అర్థశాస్త్రాదులు అరేబియన్ దేశాల ద్వారా పాశ్చాత్యదేశాలకి వెళ్లడానికి అవకాశం లేకపోలేదు. పెర్శియన్, అరబిక్ భాషానువాదాల ద్వారా ఎనిమిదవ శతాబ్దం ప్రాంతంలోనే పంచతంత్రం పాశ్చాత్యదేశాలకి వెళ్లిన దని పండితులు సప్రమాణంగా నిరూపించారు. అలాంటప్పుడు ఆ యా కాలాలలో ఇతరశాస్త్రగ్రంథాలు కూడా అక్కడికి చేరి ఉండడం అసంభావ్యం కాదు. రెండువేలఐదువందల సంవత్సరాల పూర్వం నాటి శుల్బసూత్రంలోని జ్యామితికి (భూమికొలతకు) సంబంధించిన ఒక సూత్రం పైథాగరస్ థీరం అనే పేరుతో ప్రసిద్ధిలోనికి తెచ్చుకొన్నారు పాశ్చాత్యులు. పదకొండు-పన్నెండు శతాబ్దులకు చెందిన లీలావతి గణితంలో ఉన్న గురుత్వాకర్షణ శక్తి సిద్ధాంతం న్యూటన్ పేరుతో చలామణీ అయిపోతూన్నది. గణితశాస్త్రానికి, ఖగోళశాస్త్రానికి, వేదాంతశాస్త్రానికి, అలంకారశాస్త్రానికి, ఇంకా ఎన్నోశాస్త్రాలకీ సంబంధించిన ఎన్నో అతిప్రాచీనమైన విషయాలు మొన్నమొన్నటి పాశ్చాత్యపండితులు కనుగొన్నట్లుగా చాటుకుంటున్నారు. మన భారతీయ మహామేధాసంపన్నులు కూడా అలాగే ప్రచారం చేస్తున్నారు.

భారతదేశీయులకు ఎప్పుడు చూచినా పారలౌకికచింత మాత్రమే తప్ప ఐహికమైన రాజ్యపాలనాదివిషయాలలో ఏమాత్రం జ్ఞానం లేదు అని ఒక నియమబద్ధమైన పద్ధతిలో పాశ్చాత్యపండితు లందరూ ప్రచారం చేస్తూ ఆనందిస్తూన్న రోజులలో హటాత్తుగా ఈ అర్థశాస్త్రం బైట పడడంతో ఏమి చేయాలో తోచక వాళ్లు అనేకవాదాలు, నిరర్థకాలైన వాదాలు లేవదీశారు. అవన్నీ ఎంత అర్థవిహీనమైనవో జాగర్తగా పరిశీలిస్తే అందరికీ తెలుస్తుంది. చివరికి నిష్పాక్షికదృష్టి గల కొందరు పాశ్చాత్యపండితులే ఆ వాదాలన్నీ త్రోసి పుచ్చడం గమనార్హం. కౌటిల్యునికి పూర్వమే ఎన్నో శతాబ్దాలనుంచి అర్థశాస్త్ర సంప్రదాయం అవిచ్ఛిన్నంగా వస్తూన్న దనే విషం కౌటిల్యుడు అక్కడక్కడ చేసిన మతభేదనిర్దేశాలను పట్టి స్పష్టంగా తెలుస్తున్నది. ప్రతి భారతీయుడు గర్వించవలసిన విషయం ఇది.

'అర్థశాస్త్రం' అనగానే దీనిలో కేవలం ఆర్థికవ్యవహారాలు మాత్రమే చర్చించబడతాయి; అనగా ఇది నేటి ఎకనామిక్స్ వంటిది అనే భ్రాంతి కలుగుతుంది. 'అర్థ' పదానికి కౌటిల్యుడు చెప్పిన అర్థం "మనుష్యుల జీవనవిధానం, మరొకవిధానంగా చెప్పాలంటే 'అర్థం' అనగా "మనుష్యులున్న భూమి ' ("దేశమంటే మట్టి కాదోయ్ దేశమంటే మనుషులోయ్ ' కదా!) అని పైన చూచి ఉన్నాం. అందుచేత దేశానికి, మానవసమాజానికి, సంబంధించిన అన్ని విషయాలు కూడా దీనిలో చర్చించబడి ఉన్నాయి. రాజులు, ప్రజలు, మంత్రులు, అమాత్యులు, రాజ్యంలోని ఆ యా శాఖలు, వాటి అధిపతులు, పాలనావిధానాలు, సాంఘికవ్యవస్థలు, అపరాధాలు, దండాలు, వ్యవసాయం, వర్తకం, పన్నులు, గ్రామనగరాలు, అరణ్యాలు, వృక్షాలు, మృగాలు, రసాయనశాస్త్రం, ఆయుర్వేదం, రాజ్యవిస్తరణ, రాజ్యసంరక్షణ, ఒకటేమిటి రాష్ట్రస్వరూపం -పరిపాలనాదులకి సంబంధించిన అన్ని విషయాలూ కూడ చర్చించబడ్డాయి. నిజానికి ఈ విషయా లన్నీ ఒక్క ఈ గ్రంథం పరిధిలోనికి వస్తాయా అని కొందరికి సందేహం కలగవచ్చు. ఆనాటి పద్ధతి అది. యాభై సంవత్సరాలు వెనుకకు తిరిగి చూస్తే ఈనాడు విశ్వవిద్యాలయాలో ఉన్నన్ని శాఖలు ఆనాడు ఉండేవి కావు. పొలిటికల్‌సైన్స్, పబ్లిక్ అడ్మినిస్ట్రేషన్ మొదలైనవి చరిత్రశాఖాంతర్గతంగా ఉండేవి. సైన్స్‌లలో కేవలం ఫిజిక్స్, కెమిస్ట్రీ, జువాలజీవంటివి మాత్రమే ఉండేవి. ఇప్పుడు కొత్తగా పేర్లు పెట్టి స్వతంత్ర విషయాలుగా బోధించబడే వన్నీ వాటిలోనే అంతర్గతంగా ఉండేవి. ఏవో కొన్ని సౌకర్యాలను దృష్టిలో పెట్టుకొనడంవల్లా, ఒకప్పుడు రాజ్యవిస్తరణాభిలాషవల్లా వేరు

వేరు సబ్జెక్టులు ఏర్పరచబడుతున్నాయి. ఈ విషయా లన్నీ ఎలా ఉన్నా అర్థశాస్త్రం మాత్రం ఒక చిన్న ప్రాచీన భారతీయలౌకికవిషయవిశ్వకోశం అని చెప్పడంలో సందేహం లేదు.

విదేశీయపరిపాలనం స్థిరంగా నెలకొల్పబడడానికి పూర్వం భారతదేశంలో ఆ యా రాజ్యాల పాలనావిధానం అర్థశాస్త్రానుసారమే జరిగే దని చెప్పడానికి ఆధారా లున్నాయి. శివాజీ రాజ్యపాలనావిధానం అర్థశాస్త్రానుసారం జరిగిం దని ప్రొఫెసర్ యస్. ఆర్. కులకర్ణి "శివకాలీన రాజనీతి అణి రణనీతి ' అనే మరాఠీభాషలో రచించిన గ్రంథంలో సప్రమాణంగా నిరూపించారు. విదేశీయపరిపాలనాగమనానంతరం కూడా ఎన్నో పరిపాలనాదులకు సంబంధించిన అంశాలు (అర్థశాస్త్రంలో చెప్పినవి) ఈనాటి వరకు అనువర్తిస్తూనే ఉన్నాయి. ఇవన్నీ పరిశీలిస్తూంటే భారతీయులకు పరిపాలనా విధానమే తెలియదు అని అంటూ కొందరు విదేశీయులు, అన్యమతస్థులు, తన్మానస పుత్రులైన ఆధునికపండితంమన్యులు చేసే ప్రచారం ఎంత హాస్యాస్పద మైనదో స్పష్టం అవుతుంది. ఇందుకు ఎవరినీ తప్పుపట్ట పని లేదు. మూలగ్రంథాలు చదవకపోవడం, చదివినా కొన్ని పూర్వకృతనిర్ణయాలతో చదవడం - ఇవే ఇందుకు మూలకారణం.

ఈ అర్థశాస్త్రానికి మహామహోపాధ్యాయ టి. గణపతిశాస్త్రిగారు 'శ్రీమూలం' అనే చక్కని సంస్కృతవ్యాఖ్య రచించి దానితో తొలిసారిగా 1923 సంవత్సరంలో తిరువనంతపురం నుంచి ఈ గ్రంథం ప్రకటించారు. ఈ వ్యాఖ్య చాల ప్రామాణికమైన వ్యాఖ్య. దీనిని విస్తృతటీకాసహితమైన ఆంగ్లభాషానువాదంతో ప్రొఫెసర్ ఆర్.పి. కాంగ్లే బొంబాయి విశ్వవిద్యాలయంనుండి 1960 సంవత్సరంలో ప్రచురించారు. ప్రొ.కాంగ్లే మ.మ.గణపతిశాస్త్రిగారి వ్యాఖ్యనే కాక చాలమంది పాశ్చాత్యుల అనువాదాలు కూడ పరిశీలించి తమ గ్రంథం వెలువరించారు. ఇది ప్రామాణికమైన గ్రంథం. అర్థశాస్త్రంలోని భాషా, శైలీ కూడా చాల ప్రాచీనమైనవి. వ్యాఖ్యానసహాయం లేకపోతే ఈ గ్రంథం పూర్తిగా అర్థం కాదు. ఈ ఆంధ్రభాషానువాదంలో పై రెండు గ్రంథాలసహాయం గ్రహించబడింది. ఈ గ్రంథాల సహాయం లేకపోతే నావంటివానికి ఏతదనువాద-వ్యాఖ్యారచన సాధ్య మయేది కాదు. పై గ్రంథాలలో ఎక్కడనైనా అర్థభేదాలు వచ్చినప్పుడు చాలాచోట్ల కాంగ్లే చెప్పిన అర్థాన్ని, కొన్ని చోట్ల నాకు నచ్చిన అర్థాన్నీ గ్రహించడం జరిగింది. కొన్నిచోట్ల ఇద్దరి అభిప్రాయాలు చూపబడ్డాయి. ఈ గ్రంథంలో ప్రతిపాదించిన అనేక విషయాలలో కొన్నింటిని గ్రహించి విస్తృతాలైన వివేచనాత్మక గ్రంథాలు రచించడానికి అవకాశం

శ్రీః

# కౌటిలీయమ్ అర్థశాస్త్రమ్

## విషయసూచిక

శ్రీః

ఓం స్వస్తి శ్రీగణేశాయ నమః

# కౌటిలీయమ్ అర్థశాస్త్రమ్

పుల్లెల శ్రీరామచన్ద్రేణ విరచితయా బాలానన్దిన్యాఖ్యయా
ఆన్ధ్రభాషావ్యాఖ్యయా సముల్లసితమ్.

## వినయాధికారికమ్ - ప్రథమమ్ అధికరణమ్

### ప్రథమోఽధ్యాయః రాజవృత్తిః

### ప్రకరణాధికరణసముద్దేశః

ఓం నమః శుక్రబృహస్పతిభ్యామ్.

మూలమ్. పృథివ్యాః లాభే పాలనే చ యావన్త్యర్థశాస్త్రాణి పూర్వాచార్యైః ప్రస్థాపితాని ప్రాయశః తాని సంహృత్య ఏకమిదమ్ అర్థశాస్త్రం కృతమ్.

అథ బాలానన్దినీవ్యాఖ్యాయాః ప్రారమ్భః

వ్యాఖ్య. నత్వా శ్రీతాతపాదాద్యాన్ శాస్త్రమన్త్రాదిసద్గురూన్,
కౌటిలీయార్థశాస్త్రం తద్ వ్యాకరోమ్యాన్ధ్రభాషయా.

ఓం శుక్రాచార్యునకు బృహస్పతికి నమస్కారము.

"చాణక్యుడు" అనే నామాంతరం గల కౌటిల్యుడు లేదా కౌటల్యుడు (అయనకు విష్ణుగుప్తు డని కూడ మరొక పేరు) అర్థశాస్త్రం రచించడానికి ప్రారంభించి ఆ కార్యం నిర్విఘ్నంగా కొనసాగడానికై బ్రహ్మవిష్ణుశివాత్మకమైన "ఓం" కారాన్ని ఉచ్చరించి అర్థశాస్త్ర ప్రవర్తకులైన ఆచార్యులలో కూటస్థులైన శుక్రాచార్యునకు, బృహస్పతికి నమస్కరిస్తున్నాడు. శుక్రాచార్యుడు రాక్షసుల గురువు. ఇతడు రచించిన అర్థశాస్త్రానికి "ఔశనసం" అని పేరు. దాని సంగ్రహమే "శుక్రనీతి". బృహస్పతి రచించిన గ్రంథానికి "బార్హస్పత్యం" అని పేరు.

పృథివ్యా ఇతి :- భూమిని సంపాదించడానికి, దానిని పాలించడానికి పూర్వాచార్యులు ఎన్ని అర్థశాస్త్రాలు ప్రచారంలోనికి తీసికొనివచ్చారో (రచించి ఉన్నారో) వాటిని అన్నింటినీ చాలా వరకు ఒక చోట చేర్చి, అనగా ఆ గ్రంథాలనుంచి విషయాలు సేకరించి, ఈ అర్థశాస్త్రం రచించబడింది.

అవతారిక :- ఈ అర్థశాస్త్రంలో మొత్తం పదిహేను అధికరణాలు ఉన్నాయి. ప్రకరణా లనే పేరుతో వీటి అవాంతరవిభాగం చేయబడింది. మొత్తం ప్రకరణాల సంఖ్య ఒకవంద ఎనభై (180). వాటిలోని విషయాలను వివరిస్తున్నాడు.

మూ. తస్యాయం ప్రకరణాధికరణసముద్దేశః - 1. విద్యాసముద్దేశః 2.వృద్ధసంయోగః 3. ఇన్ద్రియజయః 4. అమాత్యోత్పత్తిః 5. మన్త్రిపురోహితోత్పత్తిః 6. ఉపధాభిః శౌచాశౌచజ్ఞాన మమాత్యానామ్ 7. గూఢపురుషోత్పత్తిః 8.గూఢపురుషప్రణిధిః 9. స్వవిషయే కృత్యాకృత్యపక్షరక్షణమ్ 10. పరవిషయే కృత్యాకృత్యపక్షోపగ్రహః 11. మన్త్రాధికారః 12. దూతప్రణిధిః 13.రాజపుత్రరక్షణమ్ 14. అవరుద్ధవృత్తమ్ 15. అవరుద్ధే చ వృత్తిః 16. రాజప్రణిధిః 17. నిశాన్తప్రణిధిః 18. ఆత్మరక్షితకమ్ ఇతి వినయాధికారికం ప్రథమాధికరణమ్.

## మొదటి అధికరణం - వినయాధికారికం

వ్యా. తస్యేతి :- ఇది (చెప్పబడనున్నది) ఆ అర్థశాస్త్రంలోని ప్రకరణాధికరణాల సముద్దేశం. వివిధవిషయాలను ప్రతిపాదించే శాస్త్రగ్రంథాలలో శాస్త్రకారులు కొన్ని పద్ధతులు అవలంబిస్తారు. ముందు చెప్పదలచిన విషయాల పేర్లు చెపుతారు. దీనికి 'ఉద్దేశం' అని పేరు. తరువాత వాటి లక్షణాలు వివరించి పిమ్మట పరీక్ష చేస్తారు. "త్రివిధా(ఽ)స్య శాస్త్రస్య ప్రవృత్తిః- ఉద్దేశో, లక్షణం, పరీక్షా చేతి. తత్ర ఉద్దేశస్తు నామ మాత్రేణ వస్తుసంకీర్తనమ్ (తర్కభాష పే. 5). ఇక్కడ సముద్దేశం అనగా ఉద్దేశమే. ఇది ఈనాడు మనం గ్రంథారంభంలో ఇచ్చే విషయసూచిక వంటిది.

1. విద్యలను గూర్చిన విచారం, 2. పెద్దల సహవాసం, 3. ఇంద్రియాలను అదుపులో ఉంచుకొనడం, 4. అమాత్యుల పుట్టుక, అనగా అమాత్యులను నియమించడం, 5. మంత్రి పురోహితుల ఉత్పత్తి (నియమించడం), 6.రహస్యోపాయా

లతో అమాత్యుల నడవడికను (న్యాయానుసారం ప్రవర్తిస్తున్నారా, న్యాయవిరుద్ధంగా ప్రవర్తిస్తున్నారా అనే విషయాన్ని) పరీక్షించడం, 7. గూఢచారుల ఉత్పత్తి (స్వరూపస్వభావాదికం), 8. గూఢచారులను ఆ యా కార్యాలకై నియోగించడం, 9. తన దేశంలో ఉన్న కృత్యులను (కోపం ఉన్నవాళ్లను, లుబ్ధులను) అకృత్యులను గూర్చి తెలిసికొని సంరక్షించుకొనడం, 10. పరుల దేశంలోని కృత్యాకృత్యపక్షాలను తన వైపు త్రిప్పుకొనడం (శత్రురాజ్యంలోని క్రుద్ధలుబ్ధలనూ, ఇతరులనూ కూడా తనకు అనుకూలంగా చేసికొనడం), 11. మంత్రాధికారం, 12. దూతలను ఆ యా పనులమీద పంపడం, 13. రాజపుత్రులనుండి రక్షణం, 14. రాజుకు అనుకూలంగా ఉండని రాజపుత్రుల ప్రవృత్తి, 15. అట్టి రాజపుత్రుల విషయంలో రాజు అవలంబించవలసిన ప్రవృత్తి, 16. రాజు కర్తవ్యం, 17. రాజప్రాసాదంలో పాటించవలసిన నియమాలు, 18.రాజు తనను తాను రక్షించుకొనడం. ఇది వినయాధికారికం అనే మొదటి ప్రకరణం. వినయం అనగా రాజుకు కావలసిన విద్యాభ్యాసాదికం. ట్రైనింగు. దానికి సంబంధించినది వినయాధికారికం.

మూ. 1. జనపదవినివేశః 2. భూమిచ్ఛిద్రాపిధానమ్ 3. దుర్గవిధానమ్ 4. దుర్గవినివేశః 5. సంనిధాతృనిచయకర్మ 6.సమాహర్తృసముదయప్రస్థాపనమ్ 7.అక్షపటలే గాణనిక్యాధికారః 8. సముదయస్య యుక్తాపహృతస్య ప్రత్యానయనమ్ 9. ఉపయుక్తపరీక్షా 10. శాసనాధికారః 11.కోశప్రవేశ్యరత్నపరీక్షా 12. ఆకరకర్మాన్తప్రవర్తనమ్ 13. అక్షశాలాయాం సువర్ణాధ్యక్షః 14. విశిఖాయాం సౌవర్ణికప్రచారః 15. కోష్ఠాగారాధ్యక్షః 16.పణ్యా ధ్యక్షః 17. కుప్యాధ్యక్షః 18.ఆయుధాగారాధ్యక్షః 19.తులామానపౌతవమ్ 20.దేశకాలమానమ్ 21.శుల్కాధ్యక్షః 22. సూత్రాధ్యక్షః 23. సీతాధ్యక్షః 24.సురాధ్యక్షః 25.సూనాధ్యక్షః 26. గణికాధ్యక్షః 27.నావధ్యక్షః 28.గోధ్యక్షః 29.అశ్వాధ్యక్షః 30.హస్త్యధ్యక్షః 31. రథాధ్యక్షః 32. పత్త్యధ్యక్షః 33. సేనాపతి ప్రచారః 34.ముద్రాధ్యక్షః 35. వినీతాధ్యక్షః 36. సమాహర్తృ ప్రచారః 37.గృహపతిక వైదేహక తాపసవ్యఞ్జనాః ప్రణిధయః 38. నాగరిక ప్రణిధిః ఇత్యధ్యక్షప్రచారో ద్వితీయమధికరణమ్.

## రెండవ అధికరణం - అధ్యక్షప్రచారం

వ్యా. 1.గ్రామప్రాంతాల వ్యవస్థ చేయడం 2. వ్యవసాయానికి అనుగుణంగా లేని భూమిని అందుకు అనుగుణంగా చేయడం 3. దుర్గనిర్మాణం 4. దుర్గాలలో నగర నిర్మాణం 5. సంనిధాత (director of stores) కోష్ఠాలను (stores) భద్రపరచడం 6.సమాహర్త (administrator) సముదయానికి (పన్నుల వసూలుకు) తగు ఏర్పాట్లు చేయడం 7. అక్షపటలం (audit office) లో గాణనికుడు (auditor) చేయవలసిన పని 8. అధికారులు అపహరించిన ప్రభుత్వానికి చెందిన సొత్తును వాళ్లనుండి రాబట్టడం 9. ఉద్యోగుల పనులు పర్యవేక్షిస్తూ ఉండడం 10. రాజశాసనాలు 11.ధనాగారంలోనికి చేర్చవలసిన విలువైన వస్తువుల పరీక్ష 12. గనులు, కార్యశాలలు ప్రారంభించడం 13. అక్షశాల (workshop) లో సువర్ణపర్యవేక్షకుడు 14. విశిఖ (అంగడి వీథి market-street) లో బంగారం పని చేసేవాని ప్రచారం (activity) 15.ధాన్యాదులు నిలవచేసే కోష్ఠాగారాల పర్యవేక్షకుడు 16. వర్తకానికి అధ్యక్షుడు 17. అడవులనుండి లభించే సొత్తుకు అధ్యక్షుడు 18. ఆయుధాగారాధ్యక్షుడు 19. తూకాలను కొలతలను స్థిరీకరించడం 20. దేశానికి కాలానికీ సంబంధించిన ప్రమాణాల నిర్ణయం 21. పన్నులు వసూలు చేసే శాఖకు అధ్యక్షుడు 22. వస్త్రాల నిర్మాణానికి (Textiles) సంబంధించిన అధ్యక్షుడు 23. వ్యవసాయశాఖకు అధ్యక్షుడు 24. మద్యశాలల అధ్యక్షుడు 25.కసాయి దుకాణాల అధ్యక్షుడు 26. వేశ్యాగృహాల పర్యవేక్షకుడు 27. నౌకాధ్యక్షుడు 28.పశుసంపద అధ్యక్షుడు 29. అశ్వాధ్యక్షుడు 30. గజాధ్యక్షుడు 31. రథాధ్యక్షుడు 32. పదాతి (కాలిబంటుల) అధ్యక్షుడు 33. సేనాపతి ప్రచారం (activity) 34. ముద్రాధ్యక్షుడు (Superintendent of pass ports) 35. పచ్చికబీళ్ల అధ్యక్షుడు 36. సమాహర్త (administrator) యొక్క ప్రచారం (activity) 37. గృహస్థుల వేషాలు, వర్తకుల వేషాలు, సంన్యాసుల వేషాలు ధరించి సంచరించే గూఢచారులు 38. నగరపర్యవేక్షకుని (city mayor) కి సంబంధించిన నియమాలు - ఇవి అధ్యక్షప్రచారం (ఆయా శాఖల అధిపతుల కార్యకలాపాలు - activities ) అనే రెండవ అధికరణం. రెండవ అధికరణంలో ఈ విషయాలు ఉన్నాయని అర్థం.

మూ. 1. వ్యవహారస్థాపనా 2. వివాదపదనిబన్ధః 3. వివాహసంయుక్తమ్ 4. దాయవిభాగః 5. వాస్తుకమ్ 6. సమయస్యానపాకర్మ 7. ఋణాదానమ్

8. ఔపనిధికమ్ 9. దాసకర్మకరకల్పః 10. సంభూయసముత్థానమ్ 11.విక్రీతక్రీతానుశయః 12. దత్తస్యానపాకర్మ 13. అస్వామివిక్రయః 14.స్వస్వామిసంబన్ధః 15. సాహసమ్ 16. వాక్పారుష్యమ్ 17. దణ్డపారుష్యమ్ 18. ద్యూతసమాహ్వయమ్ 19. ప్రకీర్ణకాని ఇతి ధర్మస్థీయం తృతీయ మధికరణమ్.

## మూడవ అధికరణం - ధర్మస్థీయం

వ్యా. 1. ఏ విధమైన వ్యవహారం (Transaction, litigation) సిద్ధిస్తుందో, ఏది సిద్ధించదో నిర్ణయించడం 2. వివాదాన్ని కోర్టు ముందు ఉంచడం (filing of law-suits) 3. వివాహాన్ని గూర్చి 4. ఆస్తి పంపకాలు 5. స్థిరాస్తి (immovable property) 6. కట్టుబాటు లేదా ఒప్పందం (convension) అతిక్రమించకపోవడం 7. అప్పు తీర్చకపోవడం 8. నిక్షేపాన్ని (deposits) గూర్చి 9. దాసులకు, కర్మచారులకు సంబంధించిన నియమం 10. వాటాదారులుగా ఏర్పడడం (undertakings in partnership) 11.అమ్మినదాని విషయంలోను, కొన్నదాని విషయంలోను పశ్చాత్తాపం అనగా మాట వెనుకకు తీసికోవడం (Recession) 12. ఇస్తానని మాట ఇచ్చి ఇవ్వకపోవడం 13. స్వామి కానివాడు అమ్మడం అనగా తనది కానిదానిని అమ్మడం 14. సొమ్ము-సొమ్ముగలవాడు అనే సంబంధం (ownership) 15. బలాత్కారంగా ఆక్రమించడం (forcible seizure) 16. పరుషంగా మాటలాడడం - మాటలతో పీడించడం 17. శారీరకంగా పీడించడం 18.జూదంలో పందెం ఒడ్డడం 19. ఇంకా చిన్న చిన్న విషయాలు (miscellaneous) - ఇది ధర్మస్థీయం, అనగా ధర్మం నిర్ణయించే న్యాయాధీశునికి సంబంధించిన విషయాలు ఉన్న, మూడవ అధికరణం.

మూ. 1. కారుకరక్షణమ్ 2. వైదేహకరక్షణమ్ 3.ఉపనిపాతప్రతీకారః 4. గూఢాజీవినాం రక్షా 5. సిద్ధవ్యఞ్జనైర్మాణవప్రకాశనమ్ 6.శఙ్కారూప కర్మాభిగ్రహః 7. ఆశుమృతకపరీక్షా 8. వాక్యకర్మానుయోగః 9.సర్వాధికరణ రక్షణమ్ 10. ఏకాఙ్గవధనిష్క్రయః 11. శుద్ధశ్చిత్రశ్చ దణ్డకల్పః 12.కన్యాప్రకర్మ 13. అతిచారదణ్డః 14. ఇతి కణ్టకశోధనం చతుర్థమధికరణమ్.

## నాల్గవ అధికరణం - కంటకశోధనం

## సమాజంలోని ముళ్లు పెకలించివేయడం (చీడపురుగుల్ని ఏరివేయడం)

వ్యా. 1. ప్రజల్ని శిల్పులనుండి రక్షించడం 2. వర్తకులనుండి రక్షించడం 3.ప్రకృతివైపరీత్యాదులు సంభవించినపుడు వాటికి ప్రతిక్రియ చేయడం 4. రహస్యమైన ఆదాయం ఉన్నవాళ్లనుండి రక్షించడం 5. సంన్యాసుల వేషంలో ఉన్నవారి సహాయంతో అపరాధుల్ని పట్టుకొనడం 6. దొంగలు మొదలైన వాళ్లను సొత్తుతో పట్టుకొన్నా, వాళ్లు చేసిన పని ఆచూకీ తెలిసినా, సంశయం కలగగానే నిర్బంధించడం 7. హటాత్తుగా మరణించినవాని పరీక్ష 8. ప్రశ్నించడం ద్వారా పరీక్షించడం, పీడించడం ద్వారా పరీక్షించడం 9. అధికారు లందరినుండీ రక్షించడం 10. ఒక అవయవాన్ని తీసివేయడానికి బదులు కొంత జరిమానా విధించడం 11. పీడనం లేని మరణశిక్ష, శరీరాన్ని పీడించే మరణశిక్ష 12. కన్యాదూషణం 13. చేయకూడని పనులు చేసినందుకు దండనం. ఇది కంటకశోధనం అనే నాల్గవ అధికరణం.

మూ. దాణ్డకర్మికమ్ 2. కోశాభిసంహరణమ్ 3. భృత్యభరణీయమ్ 4.అనుజీవివృత్తమ్ 5. సామయాచారికమ్ 6. రాజ్యప్రతిసన్ధానమ్ 7. ఏకైశ్వర్యమ్ ఇతి యోగవృత్తం పఞ్చమమధికరణమ్.

## ఐదవ అధికరణం - యోగవృత్తం; రహస్యంగా చేయవలసిన పనులు

వ్యా. 1. రహస్యంగా దండించడాన్ని గూర్చి చెప్పేది 2. ధనాగారాన్ని నింపడాన్ని గూర్చి 3. సేవకుల జీతాలను గూర్చి 4. ఆశ్రయించి జీవించేవాళ్ల నడవడికను గూర్చి 5. ఎవరు ఎప్పుడు ఎలా నడుచుకోవాలో చెప్పేది 6. రాజ్యపాలనం కొనసాగించడాన్ని గూర్చి 7. ఒకనికే రాజ్యాధికారం అనే విషయాన్ని గూర్చి. ఇది యోగవృత్తం అనే ఐదవ అధికరణం.

మూ. 1. ప్రకృతిసంపదః 2. శమవ్యాయామికమ్ ఇతి మణ్డలయోనిః షష్ఠమ్ అధికరణమ్.

## ఆరవ అధికరణం - మండలాన్ని గూర్చినది

వ్యా. 1. ప్రకృతుల సంపద (అభివృద్ధి లేదా ఉన్నతస్థితి) 2. శమానికి (రాజ్యంలో శాంతికి), వ్యాయామానికీ (అనగా కార్యనిర్వహణానికి activity ) సంబంధించినది. ఇది మండలానికి (circle of kings) సంబంధించిన ఆరవ అధికరణం.

మూ. షాడ్గుణ్యసముద్దేశః 2. క్షయస్థానవృద్ధినిశ్చయః 3. సంశ్రయవృత్తిః 4. సమహీనజ్యాయసాం గుణాభినివేశః 5. హీనసంధయః 6. విగృహ్యాసనమ్ 7. సంధాయాసనమ్ 8. విగృహ్యయానమ్ 9. సంధాయయానమ్ 10.సంభూయప్రయాణమ్ 11. యాతవ్యామిత్రయోరభిగ్రహచిన్తా 12.క్షయలోభవిరాగహేతవః ప్రకృతీనామ్ 13. సామవాయికవిపరిమర్శః 14.సంహితప్రయాణికమ్ 15. పరిపణితాపరిపణితాపసృతాశ్చ సంధయః 16. ద్వైధీభావికాః సంధివిక్రమాః 17. యాతవ్యవృత్తిః 18.అనుగ్రాహ్యామిత్ర విశేషాః 19. మిత్రహిరణ్యభూమిసంధయః 20. పార్ష్ణిగ్రాహచిన్తా 21. హీనశక్తి పూరణమ్ 22. బలవతా విగృహ్యోపరోధహేతవః 23.దణ్డోపనతవృత్తమ్ 24. దణ్డోపనాయివృత్తమ్ 25. సంధికర్మ 26.సంధిమోక్షః 27. మధ్యమచరితమ్ 28. ఉదాసీనచరితమ్ 29.మణ్డలచరితమ్ ఇతి షాడ్గుణ్యం సప్తమమధి కరణమ్.

## ఏడవ అధికరణం - షాడ్గుణ్యానికి సంబంధించినది

వ్యా. 1. సంధి మొదలైన ఆరు గుణాల సంక్షిప్తనిరూపణం 2. క్షయం, నిలకడగా ఉండడం, అభివృద్ధి-వీటి నిశ్చయం 3. ఆశ్రయించేటప్పుడు చేయవలసిన విధానం 4.సమానబలం కలవాడు, దుర్బలుడు, అధికబలుడు (అయిన రాజు) వ్యవహరించ వలసిన పద్ధతి 5. దుర్బలుడు చేసికొనవలసిన సంధి 6. విరోధం పెట్టుకొని ప్రశాంతంగా ఉండడం 7. సంధి చేసికొని ప్రశాంతంగా ఉండడం 8. విరోధం అవలంబించి చేసే యుద్ధయాత్ర 9. సంధి చేసికొని యానం (సైన్యం నడపడం) చెయ్యడం 10. (ఇతరరాజులతో) కలిసి యుద్ధయాత్ర చేయడం 11. ఎదిరించవలసిన వానిమీదికి, సహజశత్రువుమీదికి దండెత్తడాన్ని గూర్చి ఆలోచించడం 12. ప్రకృతులలో క్షయమూ,

లోభమూ, విరాగం (రాజుమీద ప్రేమ లోపించడం) వీటికి కారణాలు 13.మిత్రులందరూ కలవడాన్ని గూర్చిన ఆలోచన 14. ఒప్పందం ప్రకారం ఇద్దరు రాజులు మూడవవానిపై దండెత్తడం 15. కొన్ని షరతులు పెట్టుకొని చేసికొన్న సంధి, ఏ షరతులూ లేని సంధి, తననుంచి ఏ కారణంచేతనైనా దూరం అయిపోయినవానితో సంధి 16. విధాన ద్వైవిధ్యంవల్ల సంధీ, యుద్ధమూ 17. యుద్ధానికి వచ్చే శత్రువుచేత ఎదిరింపబడనున్నవాడు చేయవలసిన విధానము 18. అనుగ్రహించవలసిన ఆ యా మిత్రులు (ఏ మిత్రులకు సహాయం చెయ్యాలి) 19. మిత్రసంధి (Pact for securing an ally), హిరణ్యసంధి (Pact for securing money), భూమిసంధి (Pact for securing land), కర్మసంధి (Pact for securing an undertaking) 20. పార్ష్ణి గ్రాహుణ్ణిగూర్చి అనగా వెనుకనుండి వచ్చి దాడి చేసే వానినిగూర్చి, ఆలోచన 21.తగ్గిపోయిన శక్తిని మరల పుంజుకొనడం 22. బలవంతునితో విరోధం పెట్టుకొని దుర్గంలో నిలదొక్కుకొని ఉండడానికి కారణాలు 23. సైన్యంతో పాటు లొంగిపోయే రాజు అనుసరించవలసిన విధానం 24. సైన్యంతో సహా శత్రురాజును లొంగదీసుకొన్నవాడు అనుసరించవలసిన విధానం 25. సంధి చేసుకొనడం 26. సంధికోసం జామీనుగా తీసికొన్నవానిని విడిపించుకొనడం (Liberation of the hostage) మధ్యవర్తిగా ఉన్న (లేదా మధ్య ఉన్న) రాజుయొక్క ప్రవృత్తి 28. ఉదాసీనుడుగా ఉన్నవాని ప్రవృత్తి 29. మండలం విషయంలో ప్రవృత్తి. ఇది షాడ్గుణ్యానికి సంబంధించిన ఏడవ అధికరణం.

మూ. 1. ప్రకృతివ్యసనవర్గః 2. రాజరాజ్యయోర్వ్యసనచిన్తా 3.పురుషవ్యసనవర్గః 4.పీడనవర్గః 5. స్తమ్భనవర్గః 6. కోశసంగవర్గః 7.బలవ్యసనవర్గః 8.మిత్రవ్యసనవర్గః ఇతి వ్యసనాధికారికమ్ అష్టమమధికరణమ్.

## ఎనిమిదవ అధికరణం - ఆపదలను గూర్చినది

వ్యా. 1. ప్రకృతులకు వచ్చే ఆపదల వర్గం 2. రాజుకు, రాజ్యానికి కలిగే ఆపదలను గూర్చిన ఆలోచన 3. పురుషుని వ్యసనాల (చెడ్డగుణాల) వర్గం 4. అగ్ని జలాదిపీడనాల వర్గం 5. రాజకార్యాలను స్తంభింపచేసేవాటి వర్గం 6. ధనాగారానికి ధనం చేర్చకపోవడానికి కారణాల వర్గం 7. సైన్యానికి వచ్చే ఆపదల వర్గం 8. మిత్రుల ఆపదల వర్గం. ఇది వ్యసనాలను గూర్చిన ఎనిమిదవ అధికరణం.

మూ. శక్తిదేశకాలబలాబలజ్ఞానమ్ 2. యాత్రాకాలాః 3.బలోపాదాన కాలాః 4.సన్నాహగుణాః 5. ప్రతిబలకర్మ 6. పశ్చాత్కోపచిన్తా 7. బాహ్యాభ్యన్తరప్రకృతికోపప్రతీకారః 8. క్షయవ్యయలాభవిపరిమర్శః 9.బాహ్యాభ్యన్తరాశ్చాపదః 10. దూష్యశత్రుసంయుక్తాః 11.అర్థానర్థసంశయయుక్తాః 12. తాసాముపాయవికల్పజాః సిద్ధయః ఇత్యభియాస్యత్కర్మ నవమమధికరణమ్.

## తొమ్మిదవ అధికరణం - జైత్రయాత్రకి వెళ్లేవాని కర్మ

వ్యా. 1. యుద్ధయాత్రకు వెళ్లే ముందు తనయొక్క ఇతరులయొక్క శక్తి, దేశం, కాలం వీటి బలాబలాలను తెలిసికొనడం 2. యుద్ధయాత్రకు తగిన కాలాలు 3. వివిధ సైన్యాలను సేకరించే కాలాలు 4. వివిధసైన్యాలను యుద్ధానికి సిద్ధం చేయడంలోని గుణాలు 5. శత్రుసైన్యాన్ని ఎదిరించగలిగిన సైన్యాన్నిసిద్ధం చేసుకొనడం 6.వెనకనుండి వచ్చే ఉపద్రవాలను గూర్చిన ఆలోచన 7. రాజ్యం బైటా లోపలా కలగడానికి అవకాశం ఉన్న ప్రకృతుల తిరుగుబాటుకు ప్రతిక్రియ 8. నష్టం, వ్యయం, లాభం వీటిని గూర్చిన విమర్శ 9. బైటా లోపలా ఉన్నవారి (అధికారుల) నుండి వచ్చే ఆపదలు 10. ద్రోహులకు, శత్రువులకు సంబంధించినవి, వాళ్లనుండి కలిగేవి (ఆపదలు) 11. ప్రయోజనాలతోను (advantages) అనర్థాలతోను (disadvantages), సంశయంతోను (uncertainty) సంబంధించిన (అపాయాలు) 12. వేరు వేరు ఉపాయాలు అవలంబించి ఈ అపాయాలను అధిగమించడం. ఇది అభియాస్యత్కర్మకు సంబంధించిన తొమ్మిదవ అధికరణం.

మూ. 1. స్కన్ధావారనివేశః 2. స్కన్ధావారప్రయాణమ్ 3.బలవ్యసనావస్కన్దకాలరక్షణమ్ 4. కూటయుద్ధవికల్పాః 5.స్వసైన్యోత్సాహనమ్ 6. స్వబలాన్యబలవ్యాయోగః 7. యుద్ధభూమయః 8. పత్త్యశ్వరథహస్తికర్మాణి 9. పక్షకక్షోరస్యానాం బలాగ్రతో వ్యూహవిభాగః 10. సారఫల్గుబలవిభాగః 11. పత్త్యశ్వరథహస్తియుద్ధాని 12.దణ్డభోగమణ్డలాసంహతవ్యూహవ్యూహనమ్ 13. తస్య ప్రతివ్యూహసంస్థాపనమ్ ఇతి సాంగ్రామికం దశమమధికరణమ్.

## పదవ అధికరణం - యుద్ధానికి సంబంధించినది

వ్యా. 1. సైన్యాన్ని నివేశించడం (నిలపడం) 2. స్కంధావారంనుంచి బయలుదేరడం 3. సైన్యానికి ఏదైనా ఆపద వచ్చిన కాలంలోను, ఆక్రమణసమయంలోను రక్షించడం 4. అనేకవిధాలైన కపటయుద్ధాలు 5. తన సైన్యానికి ఉత్సాహం కలిగించడం 6. తన సైన్యం శత్రుసైన్యంతో తలబడేటట్లు చేయడం 7. యుద్ధానికి తగిన ప్రదేశాలు 8.కాలిబంట్లు, గుఱ్ఱపు సవారులు, రథికులు, గజారూఢులు చేయవలసిన పనులు 9.రెక్కల దగ్గర, ప్రక్కలా, మధ్యభాగంలోను సైన్యాలను వ్యూహాలుగా ఏర్పరచడం (పక్షం అనగా సైన్యం ముందుభాగంలో వెలుపలకు ఉన్న సైన్యం. కక్షం అనగా వెనుక వైపున పార్శ్వభాగాలు. ఉరస్ అనగా మధ్యభాగం) 10. బలమైన సైన్యాన్ని దుర్బలమైన సైన్యాన్నీ విభజించి ఆ యా స్థానాలలో ఉంచడం 11. కాలిబంటులు, ఆశ్వికులు, రథికులు, గజారూఢులు వీళ్ల యుద్ధాలు 12. దండవ్యూహం (సైన్యాన్ని కఱ్ఱ ఆకారంలో నిలపడం) సర్పవ్యూహం, మండలవ్యూహం, అసంహతవ్యూహం (వేరువేరుగా చేసి నిలపడం) 13. వీటిని ఎదిరించడానికి తగినట్లుగా వ్యూహాలు రచించడం- ఇది యుద్ధానికి సంబంధించిన విషయాలున్న పదవ అధికరణం.

మూ. 1. భేదోపాదానాని 2. ఉపాంశుదణ్డః ఇతి సంఘవృత్త మేకాదశమధికరణమ్.

## పదకొండవ అధికరణం - సంఘరాజ్యాలకి (oligarchy) సంబంధించినది

వ్యా. 1. సంఘరాజ్యాలలో పరస్పరం భేదభావాలు కలిగించే ఉపాయాల ప్రయోగం. 2. రహస్యంగా దండించడం (నశింపచేయడం). ఇది సంఘవృత్తం అనే పదకొండవ అధికరణం.

మూ. 1. దూతకర్మ 2. మన్త్రయుద్ధమ్ 3. సేనాముఖ్యవధః 4. మణ్డల ప్రోత్సాహనమ్ 5. శస్త్రాగ్నిరసప్రణిధయః 6. వీవధాసార ప్రసారవధః 7.యోగాతి సంధానమ్ 8. దణ్డాతిసంధానమ్ 9. ఏకవిజయః ఇత్యాబలీయసం ద్వాదశ మధికరణమ్.




## పన్నెండవ అధికరణం - దుర్బలుడు ఏమి చేయాలో చెప్పేది.

వ్యా. 1. దూతను పంపడం 2. మంత్రంతో (రాజకీయపు ఎత్తులతో Diplomacy) యుద్ధం చెయ్యడం 3. శత్రుసేనానాయకుణ్ణి చంపించివేయడం 4.రహస్యంగా మండలాన్ని (రాజసముదాయాన్ని) ప్రోత్సహించడం 5. రహస్యంగా ఆయుధ ప్రయోగం, అగ్నిప్రయోగం, విషప్రయోగం చేయడం 6. శత్రువు రాజ్యంలోనికి ఏ సరుకులూ వెళ్లకుండా చేయడం (''వివధం' లేదా ''వీవధం' ఆహారపదార్థాల రాక, ''ఆసారం' అనగా మిత్రుల సైన్యం రావడం, ''ప్రసారం' అనగా అడవులనుండి నగరంలోనికి తీసికొని వచ్చే కట్టెలు మొదలైనవి) 7. కపటోపాయం చేత మోసగించడం 8. వధాదులచేత ఓడించడం 9. ఒంటరిగా ఉన్నవానిని ఓడించడం. ఇది చాలా దుర్బలుడైనవాడు చేయవలసిన విధానం చెప్పే పన్నెండవ అధికరణం.

మూ. 1. ఉపజాపః 2. యోగవామనమ్ 3. అపసర్పప్రణిధిః 4.పర్యుపాసనకర్మ 5. అవమర్దః 6. లబ్ధప్రశమనమ్ ఇతి దుర్గలమ్భోపాయః త్రయోదశమధికరణమ్.



## పదమూడవ అధికరణం - దుర్గలమ్భోపాయం
## (శత్రుదుర్గాన్ని ఆక్రమించే ఉపాయం)

వ్యా. 1. భేదోపాయం ప్రయోగించి అంతఃకలహాలు పుట్టించడం 2. ఆ యా ఉపాయాల చేత దుర్గంనుంచి బైటకు రప్పించడం 3. రహస్యంగా కొందరిని దుర్గంలో ప్రవేశపెట్టడం 4. దుర్గాన్ని ముట్టడించడం 5. దుర్గాన్ని బలాత్కారంగా ఆక్రమించడం 6. ఆక్రమించిన దుర్గంలో శాంతి నెలకొల్పడం. ఇది దుర్గలంభోపాయం అనే పదమూడవ అధికరణం.



మూ. 1. పరఘాతప్రయోగః 2. ప్రలమ్భనమ్ 3. స్వబలోపఘాత ప్రతీకారః ఇత్యౌపనిషదం చతుర్దశమధికరణమ్.

## పద్నాల్గవ అధికరణం- ఔపనిషదం
## (శత్రుజయోపాయరహస్యాలు చెప్పేది)

వ్యా.1. శత్రుసైన్యాన్ని రహస్యంగా చంపే పద్ధతులు అవలంబించడం 2. ఔషధ - మంత్రాదిప్రయోగాల ద్వారా శత్రువును మోసంచేయడం 3. తన సైన్యానికి జరిగిన నష్టానికి ప్రతిక్రియ చేసుకొనడం - ఇది ఔపనిషదం అనే పద్నాల్గవ అధికరణం.

మూ. తన్త్రయుక్తయః. ఇతి తన్త్రయుక్తిః పఞ్చదశమధికరణమ్.

## పదిహేనవ అధికరణం - తంత్రయుక్తి

వ్యా. తంత్రయుక్తులు అనగా ఈ శాస్త్రంలో ఉపయోగించిన విషయప్రతిపాదన పద్ధతులు. ఇది తంత్రయుక్తి అనే పదిహేనవ అధికరణం.

మూ. శాస్త్రసముద్దేశః పఞ్చదశాధికరణాని, సపఞ్చాశదధ్యాయశతమ్, సాశీతిప్రకరణశతమ్, షట్ శ్లోకసహస్రాణీతి.

శ్లో. సుఖగ్రహణవిజ్ఞేయం తత్త్వార్థపదనిశ్చితమ్,
కౌటిల్యేన కృతం శాస్త్రం విముక్తగ్రన్థవిస్తరమ్.

*ఇతి కౌటిలీయార్థశాస్త్రే వినయాధికారికే ప్రథమాధికరణే*
*ప్రథమోఽధ్యాయః రాజవృత్తిః.*

వ్యా. ఇదీ శాస్త్రసముద్దేశం - అధికరణాలు పదిహేను, అధ్యాయాలు నూటయాభై, ప్రకరణాలు నూటఎనభై. మొత్తం ఈ శాస్త్రం ప్రమాణం ఆరువేల శ్లోకాలు.

వి. ఈనాడు మనం ఈ వ్యాసంలో 500 పదాలు లేదా 800 పదాలు ఉండాలి అని లెక్కపెట్టినట్లుగా గ్రంథాలను శ్లోకాలలో లెక్కపెట్టే పద్ధతి ఒకటి ఉంది. శ్లోకానికి ముప్పై రెండు అక్షరాలు. ఆ విధంగా ఒక గ్రంథంలో ఉన్న అక్షరాలను 32 తో భాగించగా వచ్చిన సంఖ్య శ్లోకసంఖ్య అవుతుంది. ఈ విధంగా ఈ గ్రంథంలోని అక్షరాలన్నీ 32 తో భాగించగా 6000 శ్లోకాలు వస్తాయి. అందుచేత దీనిని 6000 శ్లోకాల గ్రంథం అంటారు.

**సుఖేతి** :- కౌటిల్యుడు రచించిన ఈ శాస్త్రం నేర్చుకోవడానికీ, అర్థం చేసుకోవడానికీ చాలా సులభమైనది. సిద్ధాంతాలు, పదాలు, అర్థాలూ కూడా ఏ విధమైన సందేహాలకీ తావు లేకుండా సునిశ్చితంగా ఉంటాయి. అనవసరమైన విస్తరం లేదు.

*"బాలానందిని" అనే కౌటిలీయార్థశాస్త్రాంధ్రవ్యాఖ్యానంలో, వినయాధికారికమైన మొదటి అధికరణంలో రాజవృత్తి అనే ప్రథమాధ్యాయం సమాప్తం.*

# అథ ద్వితీయోఽధ్యాయః

## ప్రథమం ప్రకరణమ్ - విద్యాసముద్దేశః; తత్ర ఆన్వీక్షికీస్థాపనా

మూ. 1. ఆన్వీక్షికీ, త్రయీ, వార్తా, దణ్డనీతిశ్చేతి విద్యాః.

2. త్రయీ వార్తా దణ్డనీతిశ్చేతి మానవాః; త్రయీవిశేషో హ్యాన్వీక్షికీతి.

3. వార్తా దణ్డనీతిశ్చేతి బార్హస్పత్యాః, సంవరణమాత్రం హి త్రయీ లోకయాత్రావిద ఇతి.

4. దణ్డనీతిరేకా విద్యేత్యౌశనసాః, తస్యాం హి సర్వవిద్యారమ్భాః ప్రతిబద్ధా ఇతి.

5. చతస్ర ఏవ విద్యా ఇతి కౌటిల్యః. తాభిర్ధర్మార్థౌ యద్ విద్యాత్ తత్ విద్యానాం విద్యాత్వమ్.

వ్యా. ఆన్వీక్షికి, త్రయి, వార్త, దండనీతి అనేవి విద్యలు.

వి. పదార్థాల స్వరూపాన్ని యుక్తులచేత (హేతువులచేత) పరీక్షించే విద్య ఆన్వీక్షికి (Philosophy). ఋగ్యజుఃసామవేదాలు 'త్రయి'. కృషి (వ్యవసాయం), పశుపాలన, వర్తకం వీటికి వార్త (Economics) అని పేరు. "దణ్డనీతి అనగా రాజనీతి (Political Science).

2. త్రయి,వార్త, దండనీతి ఈ మూడే విద్యలు అని మానవులు. త్రయిలో ఒక విశేషమే (భేదమే) ఆన్వీక్షికి కదా?

వి. ఈ గ్రంథంలో మానవులు అని నిర్దేశింపబడిన చోటల్లా మానవఅర్థశాస్త్రం అనే ఒక ప్రాచీన అర్థశాస్త్రాన్ని అనుసరించేవారు అని అర్థం. అంతేకాని ఇది మనుస్మృతికి నిర్దేశం కాదు.

3. వార్త, దండనీతి అనేవే విద్యలు అని బార్హస్పత్యులు, అనగా బృహస్పతి రచించిన అర్థశాస్త్రాన్ని అనుసరించేవారు. లోకయాత్ర, అనగా లోకవ్యవహారం, తెలిసిన వానికి త్రయి కేవలం ఆచ్ఛాదనం మాత్రమే.

వి. లోకవ్యవహారం ఎంత బాగా తెలిసినవాడైనా అతనికి త్రయీజ్ఞానం లేకపోతే వానిని లోకులు నాస్తికుడు అంటారు. అలా అనిపించుకొనకుండా ఉండడం కోసం త్రయి అనేది పైన వేసుకునే ముసుగు మాత్రమే. లోకవ్యవహారానికి దానివల్ల ప్రయోజనం ఏదీ లేదు అని వాళ్ల అభిప్రాయం.

3.దండనీతి ఒక్కటే విద్య అని ఔశనసులు. ఎందువలన అనగా సమస్తమైన ఇతర విద్యల ఆరంభాలు అనగా యోగక్షేమాలు, ఆ దండనీతిమీదనే ఆధారపడి ఉన్నాయి.

వి. ఔశనసు లనగా శుక్రాచార్యుడు రచించిన అర్థశాస్త్రం అనుసరించేవాళ్లు.

4. మొదట చెప్పిన నాలుగు విద్యలే విద్యలు అని కౌటిల్యుని అభిప్రాయం. (మానవుడు) వాటి సాహాయ్యంతో ధర్మార్థాలను తెలుసుకుంటాడు కాబట్టి ఆ విద్యలు 'విద్యలు' అని చెప్పబడుతున్నాయి.

వి. విద్య అనగా ఏదైనా ఒక విషయం తెలుసుకొనడానికి సాధనం అయినది అని అర్థం. కౌటిల్యుడు ఒక విషయాన్ని గూర్చి చర్చించేటప్పుడు ఇతరుల అభిప్రాయాలు ముందుగా చెప్పి ""కాని కౌటిల్యుడు ఇలా అంటాడు" అని అంటూ, తన పేరు ప్రథమ పురుషలో నిర్దేశిస్తూ, తన మతం చెపుతూ ఉంటాడు.

మూ. సాంఖ్యమ్, యోగః, లోకాయతం చేత్యాన్వీక్షికీ. ధర్మాధర్మౌ త్రయ్యామ్. అర్థానర్థౌ వార్తాయామ్. నయాపనయౌ దణ్డనీత్యామ్. బలాబలే చైతాసాం హేతుభిరన్వీక్షమాణా ఆన్వీక్షికీ లోకస్యోపకరోతి, వ్యసనేఽభ్యుదయే చ బుద్ధి మవస్థాపయతి; ప్రజ్ఞావాక్యక్రియావైశారద్యం చ కరోతి.

శ్లో. ప్రదీపః సర్వవిద్యానాముపాయః సర్వకర్మణామ్,
ఆశ్రయః సర్వధర్మాణాం శశ్వదాన్వీక్షికీ మతా.

*ఇతి కౌటిలీయార్థశాస్త్రే వినయాధికారికే ప్రథమాధికరణే ద్వితీయోఽధ్యాయః*
*విద్యాసముద్దేశే ఆన్వీక్షికీస్థాపనా.*

**వ్యా.** సాంఖ్యం, యోగం, లోకాయతం అనేవి ఆన్వీక్షికి. త్రయియందు (వేదత్రయంలో) ధర్మాధర్మాలు (చెప్పబడ్డాయి). వార్తలో అర్థానర్థాలు (లాభనష్టాలు) చర్చించబడతాయి. దండనీతిలో నీతిమార్గం అవినీతిమార్గం (చర్చించబడతాయి). హేతువులచేత, అనగా యుక్తులచేత, ఈ విద్యలలో బలాబలాలను పరీక్షించి ఆన్వీక్షికి లోకాలకు ఉపకారం చేస్తుంది. వ్యసనసమయంలో అయినా, అభివృద్ధిసమయంలో

అయినా బుద్ధిని నిలకడగా ఉండేటట్లు చేస్తుంది. ప్రజ్ఞావైశారద్యాన్ని, అనగా బుద్ధిలో, ఆలోచనలలో సామర్థ్యాన్నీ, మాటలలో నేర్పునూ, పనులలో సామర్థ్యాన్నీ కలిగిస్తుంది.

vi. సాంఖ్యయోగాలు భారతదేశంలో అతిప్రాచీనకాలంనుంచీ ప్రచారంలో ఉన్న దర్శనాలు. ఒకదానితో ఒకటి దగ్గర సంబంధం ఉన్నవి. ఆత్మస్వరూపాదులను బోధిస్తాయి. లోకాయతం అనేది నేడు ఒక నాస్తికమతంగా పరిగణింపబడుతున్నది. పరలోకాదులలో నమ్మకం లేక ఇహలోకవ్యవహారాలకే ప్రాధాన్యం ఇచ్చేవాళ్ళు లోకాయతులని ఈనాడు మన కున్న అభిప్రాయం. అయితే ప్రాచీనకాలంలో ఇది కూడా ఒక గౌరవాస్పదమైన విద్యావిశేషంగా పరిగణింపబడే దన్నట్లు అర్థశాస్త్రాదిగ్రంథాల నుండి తెలుస్తూన్నది.

2. "ఈ ఆన్వీక్షికి ఎల్లప్పుడూ అన్ని విద్యలకీ దీపం అనీ, అన్ని కర్మలకీ ఉపాయం అనీ, సకలధర్మాలకీ ఆశ్రయం అనీ పెద్దలు చెపుతారు."

*"బాలానందిని అనే కౌటిలీయార్థశాస్త్రాంధ్రవ్యాఖ్యానంలో వినయాధికారికం అనే మొదటి అధికరణంలో విద్యాసముద్దేశంలో ఆన్వీక్షికీస్థాపన అనే విషయం ప్రతిపాదించే ద్వితీయాధ్యాయం సమాప్తం.*

## అథ తృతీయో ఽధ్యాయః

### ప్రథమే ప్రకరణే - విద్యాసముద్దేశః; తత్ర త్రయీస్థాపనా

మూ. 1. సామర్గ్యజుర్వేదాః త్రయః త్రయీ, అథర్వవేదేతిహాసవేదౌ చ వేదాః. శిక్షా, కల్పో, వ్యాకరణమ్, నిరుక్తమ్, ఛన్దోవిచితిః, జ్యోతిషమితి చాఙ్గాని.

2. ఏష త్రయీధర్మశ్చతుర్ణాం వర్ణానామ్ ఆశ్రమాణాం చ స్వధర్మ స్థాపనాదౌపకారికః.

3. స్వధర్మో బ్రాహ్మణస్య అధ్యయనమ్, అధ్యాపనమ్, యజనమ్, యాజనమ్, దానమ్, ప్రతిగ్రహశ్చేతి. క్షత్రియస్య అధ్యయనమ్, యజనమ్, దానమ్, శస్త్రాజీవః, భూతరక్షణం చ. వైశ్యస్యాధ్యయనమ్, యజనమ్, దానమ్, కృషిపాశుపాల్యే, వాణిజ్యా చ. శూద్రస్య ద్విజాతిశుశ్రూషా, వార్తా, కారుకుశీలవకర్మ చ.

వ్యా. సామవేదం, ఋగ్వేదం, యజుర్వేదం అనే మూడు వేదాలు "త్రయి". ఈ త్రయి అథర్వవేదము, ఇతిహాసవేదమూ - ఇవన్నీ వేదాలు. శిక్ష (వర్ణాలను ఎలా ఉచ్చరించాలో చెప్పే శాస్త్రం), కల్పం ( ఆ యా యజ్ఞాలు చేసే విధానాన్ని బోధించే శాస్త్రం), వ్యాకరణం, నిరుక్తం (పదాల నిర్వచనాన్ని చెప్పే శాస్త్రం), ఛందఃశాస్త్రం, జ్యోతిషం - ఈ ఆరూ వేదాంగాలు.

2. వేదత్రయంలో చెప్పిన ఈ ధర్మం నాలుగు వర్ణాలవాళ్లని, నాలుగు ఆశ్రమాల వాళ్లనీ తమ తమ ధర్మాలలో నిలపడం ద్వారా (సమాజానికి) ఉపకారం చేస్తుంది.

3. వేదాధ్యయనం, వేదాలు బోధించడం, యజ్ఞాలు చెయ్యడం, యజ్ఞాలు చేయించడం, దానం (ఇవ్వడం), ఎవరైనా ఇస్తే తీసికొనడం ఇది బ్రాహ్మణుని స్వధర్మం. వేదాధ్యయనం, యజ్ఞాలు చేయడం, దానం చెయ్యడం, ఆయుధాలు జీవనోపాధిగా చేసుకొనడం, ప్రజలను, ఇతరప్రాణులను రక్షించడం క్షత్రియుని స్వధర్మం. వేదాధ్యయనం, యజ్ఞాలు చేయడం, దానాలు చేయడం, వ్యవసాయం, పశుపోషణ, వర్తకం ఇవి వైశ్యుని స్వధర్మం. ద్విజుల (బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యుల)కు సేవ చేయడం, వార్త, శిల్పాలు, గాన, నటనాదులు శూద్రుని స్వధర్మం.

వి. కారుః=శిల్పి. కఱ్ఱలు, రాళ్లు, లోహాలు మొదలైన వాటితో పని చేసేవాడు. కుశీలవః=పాటలు పాడుతూ, వేషాలు వేస్తూ, స్తోత్రాలు చేస్తూ సంచరించేవాడు.

మూ. 1. గృహస్థస్య స్వకర్మాజీవః, తుల్యైరసమానర్షిభిః వైవాహ్యమ్, ఋతుగామిత్వమ్, దేవపిత్రతిథిభృత్యేషు త్యాగః శేషభోజనం చ.

2. బ్రహ్మచారిణః స్వాధ్యాయః, అగ్నికార్యాభిషేకౌ, భైక్షవ్రతత్వమ్, ఆచార్యే ప్రాణాన్తికీ వృత్తిః, తదభావే గురుపుత్రే సబ్రహ్మచారిణి వా.

3. వానప్రస్థస్య బ్రహ్మచర్యం, భూమౌ శయ్యా, జటాజినధారణమ్, అగ్నిహోత్రాభిషేకౌ, దేవతాపిత్రతిథిపూజా వన్యశ్చాహారః.

4. పరివ్రాజకస్య సంయతేన్ద్రియత్వమ్, అనారమ్భః, నిష్కించనత్వమ్, సంగత్యాగః, భైక్షమ్ అనేకత్ర, అరణ్యవాసో, బాహ్యాభ్యన్తరం చ శౌచమ్.

వ్యా. 1. తనకు విధించిన కర్మను జీవనోపాధిగా గ్రహించడం, సమానమైన ఋషులు లేని అనగా సగోత్రులు లేదా గోత్రాలలో ఋషులు కలిసినవారు కాని, తనతో సమానమైన వాళ్లతో వివాహసంబంధం, ఋతుకాలాలలోనే భార్యాసంగమం చేయడం

దేవతలకు, పితృదేవతలకు, అతిథులకు, భృత్యులకు అనగా తన పోషణపై ఆధారపడి ఉన్న వాళ్లకు ఇచ్చి మిగిలినది తినడం, ఇది గృహస్థుని ధర్మం.

2. స్వాధ్యాయాధ్యయనం, అగ్నికార్యం (ప్రాతఃకాలం సాయంకాలం అగ్నిపూజ చేయడం, మూడు పూటలా స్నానం చేయడం, భిక్షావృత్తి అవలంబించడం, జీవితాంతంవరకు ఆచార్యగృహంలో ఉంటూ ఆచార్యునికి సేవ చేయడం, ఆచార్యుడు లేకపోతే ఆతని పుత్రునికి గాని, తన వేదశాఖ ఏదో అదే స్వశాఖగా గల వృద్ధునికి గాని సేవ చేస్తూ ఉండడం బ్రహ్మచారికి స్వధర్మం.

వి. వేదాధ్యయనం పూర్తి అయేవరకు గురుకులంలో ఉండే బ్రహ్మచారి ఉపకుర్వాణబ్రహ్మచారి. తరువాత ఆతడు గృహస్థాశ్రమంలో ప్రవేశించవచ్చు. గృహస్థాశ్రమంలో ఇచ్ఛ లేనివాడు పైన చెప్పినట్లు ఆజీవితాంతం గురుశుశ్రూష చేస్తూ బ్రహ్మచర్యాశ్రమంలోనే ఉండిపోవచ్చును. అతడు నైష్ఠికబ్రహ్మచారి.

3. బ్రహ్మచర్యం పాటించడం, నేలమీద శయనించడం, జటలు, అజినమూ (లేడిచర్మా) ధరించడం, అగ్నిహోత్రం చేయడం, మూడు పూట్లా స్నానం, దేవతలను, పితృదేవతలను, అతిథులను పూజించడం, వనంలో లభించే వస్తువులు మాత్రమే ఆహారంగా భుజించడం ఇది వానప్రస్థుని స్వధర్మం.

4. ఇంద్రియాలను అదుపులో ఉంచుకొనడం, ఏ పనులూ ప్రారంభించక పోవడం, కొంచెము కూడా ధనం లేకపోవడం, సంగం విడిచిపెట్టడం, అనేకగృహాలకు లేదా గ్రామాలకు వెళ్ళి భిక్షం సంపాదించడం, అరణ్యంలో నివసించడం, శరీరం బైటా, లోపలా కూడా అనగా శరీరాన్ని, మనస్సును మాటలను కూడా శుచిగా ఉంచుకొనడం ఇది సంన్యాసికి స్వధర్మం.

మూ. 1. సర్వేషామహింసా, సత్యం, శౌచమఅనసూయా, ఆనృశంస్యం క్షమా చ.

2. స్వధర్మః స్వర్గాయ ఆనన్త్యాయ చ. తస్యాతిక్రమే లోకః సంకరాదుచ్ఛిద్యేత.

3. శ్లో. తస్మాత్ స్వధర్మం భూతానాం రాజా న వ్యభిచారయేత్,
స్వధర్మం సందధానో హి ప్రేత్య చేహ చ నన్దతి.
వ్యవస్థితార్యమర్యాదః కృతవర్ణాశ్రమస్థితిః,
త్రయ్యా హి రక్షితో లోకః ప్రసీదతి న సీదతి.

ఇతి కౌటిలీయార్థశాస్త్రే వినయాధికారికే ప్రథమాధికరణే తృతీయోఽధ్యాయః
విద్యాసముద్దేశే త్రయీస్థాపనా.

వ్యా. 1. అహింస, సత్యమూ, మనోవాక్కాయముల శుచిత్వము, అసూయ లేకపోవడం, క్రూరత్వం లేకపోవడం, ఓర్పు అనేవి అందరికీ ధర్మాలే. స్వధర్మాన్ని ఆచరించడం వల్ల స్వర్గం, అనంతమైన ఆనందమూ లభిస్తాయి. స్వధర్మాన్ని అతిక్రమిస్తే సాంకర్యంవల్ల లోకం నశిస్తుంది.

2. అందువలన రాజు ప్రజలలో ఎవరూ స్వధర్మాన్ని విడవకుండా ఉండేటట్లు చూడాలి. స్వధర్మం ఆచరించేవాడు ఇహలోకంలోను మరణానంతరమూ కూడా సంతోషంతో ఉంటాడు.

సంరక్షించబడిన పూజ్యములైన కట్టుబాట్లు గలదై, వర్ణాశ్రమస్థితిని కాపాడుతూన్న లోకం వేదత్రయంచేత రక్షించబడుతూ సుఖంగా ఉంటుంది. ఎన్నటికీ నశించదు.

*"బాలానందిని" అను కౌటిలీయార్థశాస్త్రాంధ్రవ్యాఖ్యానంలో వినయాధికారికమైన మొదటి అధికరణంలో, విద్యాసముద్దేశంలో త్రయీస్థాపన అను మూడవ అధ్యాయం సమాప్తం.*

## అథ చతుర్థోఽధ్యాయః

### ప్రథమే ప్రకరణే విద్యాసముద్దేశే వార్తాదణ్డనీతిస్థాపనా

మూ. కృషిపాశుపాల్యే వణిజ్యా చ వార్తా, ధాన్యపశుహిరణ్యకుప్య విష్టిప్రదానా దౌపకారికీ, తయా స్వపక్షం పరపక్షం చ వశీకరోతి దణ్డకోశాభ్యామ్.

వ్యా. వ్యవసాయం, పశువుల పాలనం, వర్తకం ఈ మూడింటికీ "వార్త" అని పేరు. ఇది ధాన్యమూ, పశువులూ, బంగారమూ, కుప్యమూ, కర్మకరులూ వీటిని సంపాదించి పెట్టడం ద్వారా ఉపయోగిస్తుంది. కోశదండాల ద్వారా స్వపక్షాన్నీ, పరపక్షాన్నీ కూడా వశంలో ఉంచుతుంది.

వి. వెండిబంగారాలు మినహా మిగిలిన ధాతువులు, అరణ్యంలో లభించే వెదురూ ఇతరములైన కఱ్ఱలు మొదలైనవి - వీటికి 'కుప్యం' అని పేరు. దండం అనగా, ఇక్కడ, సేన అని అర్థం.

మూ. అన్వీక్షకీత్రయీవార్తానాం యోగక్షేమసాధనో దణ్డః. తస్య

నీతిర్దణ్డనీతిః. అలబ్ధలాభార్థా, లబ్ధపరిరక్షణీ, రక్షితవివర్ధినీ, వృద్ధస్య తీర్థేషు ప్రతిపాదనీ చ. తస్యామాయత్తా లోకయాత్రా. తస్మాల్లోకయాత్రార్థీ నిత్య ముద్యతదణ్డః స్యాత్. న హ్యేవంవిధం వశోపనయన మస్తి భూతానాం యథా దణ్డః ఇత్యాచార్యాః.

వ్యా. అన్వీక్షికి, త్రయి, వార్త వీటి యోగక్షేమాలకి సాధన మైనది దండం. అనగా దండభయం ఉంటేనే లోకంలో జనులు పై విషయాల మీద తగిన శ్రద్ధ చూపుతారు. ఆ దండాన్ని గూర్చి చెప్పేది, లేదా ఆ దండం ప్రయోగించే విధానం "దండనీతి". ఇది ఇంతకు ముందు సంపాదించనిదానిని సంపాదించడానికీ, సంపాదించినదానిని రక్షించు కొనడానికీ, రక్షించుకొన్నదానిని వృద్ధి చేయడానికీ, వృద్ధిచేసిన దానిని తీర్థములకు ఇవ్వడానికీ ఉపకరిస్తుంది. లోకయాత్ర అంతా దండనీతిమీదనే ఆధారపడి ఉంటుంది. అందువలన లోకయాత్ర సరిగా నడవాలనుకొనే రాజు ఎల్లపుడూ ఈ దండాన్ని ఎత్తి పట్టుకొని ఉండాలి. ప్రజల్ని వశంలో ఉంచుకొనడానికి దండాన్ని మించిన మరొక సాధనం లేదు అని కొందరు ఆచార్యులు అన్నారు.

వి. 'తీర్థం' అనగా ఎవ రెవరికి ధనం ఇవ్వాలో, అనగా ఏ ఏ పనులకై ధనం ఖర్చుపెట్టాలో అది. ఇక్కడ దండం అనగా శిక్ష (Punishment) అని అర్థం.

మూ. నేతి కౌటిల్యః. తీక్ష్ణదణ్డో హి భూతానాముద్వేజనీయః, మృదు దణ్డః పరిభూయతే. యథార్హదణ్డః పూజ్యః. సువిజ్ఞాతప్రణీతో హి దణ్డః ప్రజాః ధర్మార్థకామైర్యోజయతి. దుష్ప్రణీతః కామక్రోధాభ్యామ్, అజ్ఞానాత్ వానప్రస్థపరివ్రాజకానపి కోపయతి, కిమఙ్గ పునర్గృహస్థాన్. అప్రణీతో హి మాత్స్యన్యాయముద్భావయతి; బలీయానబలం హి గ్రసతే దణ్డధరాభావే. తేన గుప్తః ప్రభవతీతి.

వ్యా. అట్లు కాదు అని కౌటిల్యుడు. దండానికి అంత ప్రాధాన్యం ఇవ్వకూడదు అని అర్థం. తీక్ష్ణంగా శిక్షించేవాడు ప్రజలకు ఉద్వేగం, భయంతో కూడిన ద్వేషం, కలిగిస్తాడు. మృదువుగా దండించేవాడు తిరస్కరించబడతాడు (ప్రజలకి లోకువ అవుతాడు). ఎంత అవసరమో అంత దండప్రయోగం చేసేవాడు పూజింపదగిన వాడవుతాడు. బాగా తెలిసికొని (యథాశాస్త్రంగా) ప్రయోగించబడిన దండం ప్రజలకు ధర్మార్థ కామాలను అందజేస్తుంది. కామక్రోధాలచేతగాని, తెలివితక్కువతనంచేతగాని చెడ్డగా ప్రయోగించబడిన దండం వానప్రస్థులకు, సంన్యాసులకుకూడా కోపం కలిగిస్తుంది.

(వాళ్లు కూడా ఎదురు తిరిగేటట్లు చేస్తుంది). ఇంక గృహస్థుల మాట చెప్పాలా? అసలే విధించని దండం, అసలే దండం విధించకపోతే అది (సమాజంలో) మాత్స్యన్యాయాన్ని ప్రవర్తింపచేస్తుంది. దండధరుడు (శిక్షించేవాడు) లేకపోతే ఎక్కువ బలం ఉన్నవాడు దుర్బలుణ్ణి మింగివేస్తాడు. (తగువిధంగా ప్రయోగించిన) దండంచేత రక్షింపబడిన దుర్బలుడు కూడా సమర్థుడవుతాడు. బలవంతుడు అవుతాడు.

వి. చిన్న చేపను పెద్ద చేప మింగేస్తుంది. ఇదే మాత్స్యన్యాయం.

శ్లో. చతుర్వర్ణాశ్రమో లోకో రాజ్ఞా దణ్డేన పాలితః,
స్వధర్మకర్మాభిరతో వర్తతే స్వేషు వేశ్మసు.

*ఇతి కౌటిలీయార్థశాస్త్రే వినయాధికారికే ప్రథమాధికరణే చతుర్థోఽధ్యాయః*
*విద్యాసముద్దేశః సమాప్తః.*

వ్యా. "తగువిధమైన దండప్రయోగం చేస్తూ రాజుచేత పాలించబడే చతుర్వర్ణ-చతురాశ్రమరూపమైన ఈ లోకం తన ధర్మం పాటిస్తూ తమ ఇండ్లల్లో సుఖంగా ఉంటుంది". దండం లేకపోతే ఎవరిళ్లల్లో వాళ్లుకూడా సుఖంగా ఉండజాలరని భావం.

"బాలానందిని" అనే కౌటిలీయార్థశాస్త్రాంధ్రవ్యాఖ్యానంలో వినయాధికారికమైన ప్రథమాధికరణంలో నాల్గవ అధ్యాయం, విద్యాసముద్దేశంలో వార్తాస్థాపన, దండనీతిస్థాపన సమాప్తం

## విద్యాసముద్దేశం సమాప్తం.

## అథ పఞ్చమోధ్యాయః

### ద్వితీయే ప్రకరణే వృద్ధసంయోగః

మూ. 1. తస్మాద్దణ్డమూలాస్తిస్రో విద్యాః. వినయమూలో దణ్డః ప్రాణభృతాం యోగక్షేమావహః.

2. కృతకః స్వాభావికశ్చ వినయః. క్రియా హి ద్రవ్యం వినయతి నాద్రవ్యమ్. శుశ్రూషాశ్రవణగ్రహణధారణవిజ్ఞానోహాపోహతత్త్వాభినివిష్టబుద్ధిం విద్యా వినయతి, నేతరమ్.

3. విద్యానాం తు యథాస్వమ్ ఆచార్యప్రామాణ్యాద్ వినయః నియమశ్చ.

వ్యా. 1. అందువలన ఆన్వీక్షికి, త్రయి, వార్త అనే మూడు విద్యలు దండం (దండనీతి) మీద ఆధారపడి ఉంటాయి. వినయంమీద అనగా శాస్త్రజ్ఞానం మీద, ఆధారపడిన, శాస్త్రజ్ఞానంతో కూడిన దండం మానవులకు యోగక్షేమాలను ఇస్తుంది.

2. కృత్రిమమూ, అనగా ప్రయత్నం చేసి సంపాదించినదీ, స్వాభావికమూ, అనగా సహజంగా అప్రయత్నంగా వచ్చినదీ, అని వినయం రెండు విధాలు. క్రియ (శాస్త్రాభ్యాసాదికం) ద్రవ్యాన్ని (యోగ్యత ఉన్న వ్యక్తిని) సంస్కరిస్తుంది కాని అద్రవ్యాన్ని (ఏ మాత్రమూ యోగ్యత లేనివానిని) సంస్కరించదు. (ఉదాహరణకి శాణంతో రాయగా రాయగా వజ్రానికి మెరుపు వస్తుంది కాని మట్టిబెడ్డకు రాదు).శుశ్రూష (వినాలనే కోరిక), వినడం, గ్రహించడం, ధారణం (మరిచిపోకుండా ఉండడం), విజ్ఞానం (ధరించిన విషయాలలో ఏది సాధ్యము, ఏది అసాధ్యము అనే జ్ఞానం), ఊహ (మాటలలో చెప్పనిదానిని అనుమానప్రమాణాదులచే తెలుసుకొనడం), అపోహ(యుక్తివిరుద్ధమైన దానిని విడిచివేయడం), యథార్థాన్ని తెలుసుకొనాలనే పట్టుదల-ఇవి ఉన్నవానికే విద్య వినయాన్ని సంపాదిస్తుంది కాని ఇవి లేనివానికి ఉపయోగించదు.

3. విద్యల విషయంలో, ఆ యా విద్యల స్వరూపాన్ని పట్టి, ఆచార్యుని ప్రామాణ్యాన్ని పట్టి (ఆ విద్యను బోధించే ఆచార్యుడు ఏ పద్ధతిలో ఉండాలని చెపుతాడో దానిని అనుసరించి) వినయమూ (Training), నియమమూ ఉంటాయి.

వి. స్పష్టంగా చెప్పబడని దానిని ఊహించుకోవడం 'ఊహ'. యుక్తికి విరుద్ధమైనదానిని త్యజించడం 'అపోహ'.

మూ. వృత్తచౌలకర్మా లిపిం, సంఖ్యానం చోపయుఞ్జీత. వృత్తోపనయస్త్రయీమాన్వీక్షికీం చ శిష్టేభ్యః, వార్తామధ్యక్షేభ్యః, దణ్డనీతిం చ వక్తృప్రయోక్తృభ్యః.

వ్యా. చౌలకర్మ పూర్తి అయినవాడు (రాజకుమారుడు). లిపీ, గణితమూ నియమపూర్వకంగా అభ్యసించాలి. ఉపనయనం అయిన తరువాత ఆ యా శాస్త్రాలలో నిష్ణాతులైన శిష్టులనుండి త్రయిని, ఆన్వీక్షికిని, ఆ యా శాఖాధ్యక్షులనుండి వార్తను, విషయాన్ని బోధించగలిగియుండి ఆ శాస్త్రం ప్రయోగం (Putting in practice) కూడా తెలిసినవాళ్లనుండి దండనీతినీ నియమపూర్వకంగా అభ్యసించాలి.

వి. బాలునికి మూడవ సంవత్సరంలో కాని, ఐదవ సంవత్సరంలో కాని చేసే

ఒక వైదికసంస్కారం 'చౌలం'. ఈనాటి పుట్టువెండ్రుకలు తీయించడం వంటిది.

మూ. బ్రహ్మచర్యం చ ఆషోడశాద్ వర్షాత్. అతో గోదానమ్, దారకర్మ చ. అస్య నిత్యశ్చ విద్యావృద్ధసంయోగో వినయవృద్ధ్యర్థమ్; తన్మూలత్వాత్ వినయస్య.

వ్యా. పదహారు సంవత్సరాల వయసువ్వవరకు బ్రహ్మచర్యాశ్రమం. అటుపిమ్మట గోదానవ్రతము; వివాహము. వివాహానంతరం కూడా వినయవృద్ధికోసం విద్యావృద్ధుల సహవాసం నిత్యమూ ఉండాలి. ఎందుచేత ననగా వినయానికి విద్యావృద్ధుల సాంగత్యమే మూలం.

వి. 'గోదానవ్రతం' అనగా బ్రహ్మచర్యాశ్రమం తరవాత గృహస్థాశ్రమంలో ప్రవేశించే ముందు చేసికొనే ఒక వ్రతం. "గావః ద్యన్తే ఖణ్డ్యన్తే అస్మిన్ ఇతి గోదానమ్" కేశాలు ఖండించే వ్రత మని అర్థం. బ్రహ్మచారిగా ఉన్నపుడు కేశాలు ఖండించుకొనగూడదు. ఈ వ్రతం స్నాతకానికి అంగం. ఇక్కడ వినయం అనగా అణకువ, శాస్త్రసంస్కారం అని అర్థాలు (Discipline).

మూ. 1. పూర్వమహర్భాగం హస్త్యశ్వరథప్రహరణవిద్యాసు వినయం గచ్ఛేత్, పశ్చిమ మితిహాసశ్రవణే. పురాణమ్, ఇతివృత్తమ్, ఆఖ్యాయికా, ఉదాహరణమ్, ధర్మశాస్త్రమ్, అర్థశాస్త్రం చేతి ఇతిహాసః. శేషమహోరాత్రభాగమ్ అపూర్వగ్రహణమ్, గృహీతపరిచయం చ కుర్యాత్, అగృహీతానామ్ ఆభీక్ష్ణ్యశ్రవణం చ.

2. శ్రుతాద్ధి ప్రజ్ఞోపజాయతే, ప్రజ్ఞాయా యోగః, యోగాత్ ఆత్మవత్తేతి విద్యాసామర్థ్యమ్.

వ్యా. పగటి మొదటి భాగంలో (ప్రారంభంలో) ఏనుగులను, గుఱ్ఱాలను, రథాలను నడపడంలోను, ఆయుధవిద్యయందూ శిక్షణ పొందాలి. చివరి భాగంలో ఇతిహాసాలు వినడంలో శిక్షణ పొందాలి. పురాణమూ (బ్రహ్మపురాణాదికం), ఇతివృత్తం (రామాయణ భారతాదికం), ఆఖ్యాయిక (దివ్యపురుషుల చరిత్ర, మనుష్యుల చరిత్ర మొ.) ఉదాహరణం (తంత్రాఖ్యాయిక-పంచతంత్రం మొదలైనవి), ధర్మశాస్త్రం, అర్థశాస్త్రం ఇవన్నీ "ఇతిహాసం". మిగిలిన పగటి భాగాన్ని (మధ్యభాగాన్ని), అవకాశం లభించిన రాత్రిభాగాన్ని పూర్తిగా కొత్త విషయాలు తెలుసుకొనడానికీ, తెలిసినదానిని గట్టి

పరచుకొనడానికి (గృహీతపరిచయానికి), బాగా తెలియనివాటిని గూర్చి మాటిమాటికీ వినడానికీ వినియోగించాలి.

2. వివిధశాస్త్రాల అధ్యయనంవల్ల ప్రజ్ఞ (మూడు కాలాలకీ సంబంధించిన విషయాల జ్ఞానం) కలుగుతుంది. ప్రజ్ఞవల్ల యోగం (శాస్త్రంలో చెప్పిన విషయాల అనుష్ఠానంలో శ్రద్ధ-Practical application) కలుగుతుంది. యోగంవల్ల ఆత్మవత్త (ఆత్మవిశ్వాసం, ఆత్మనిగ్రహం - self possession) కలుగుతుంది. ఇదే విద్యలవల్ల కలిగే సామర్థ్యం.

**శ్లో. విద్యావినీతో రాజా హి ప్రజానాం వినయే రతః,**
**అనన్యాం పృథివీం భుంక్తే సర్వభూతహితే రతః.**

*ఇతి కౌటిలీయార్థశాస్త్రే వినయాధికారికే ప్రథమాధికరణే పఞ్చమోఽధ్యాయః వృద్ధసంయోగః..*

వ్యా. తాను విద్యలలో శిక్షితుడై, సకలభూతములకు హితాన్ని చేయడంలో ఆసక్తి కలిగి, ప్రజలకు శిక్షణ ఇవ్వడంలో శ్రద్ధ గల రాజు మరొక రాజు లేని భూమిని పరిపాలిస్తాడు. అనగా ఏకచ్ఛత్రాధిపత్యం సాగిస్తాడు.

*'బాలానందిని" అనే కౌటిలీయార్థశాస్త్రాంధ్రవ్యాఖ్యానమునందు వినయాధికారికమైన ప్రథమాధికరణంలో 'వృద్ధసంయోగం' అనే పంచమాధ్యాయం సమాప్తం.*

# అథ షష్ఠోఽధ్యాయః

## తృతీయే ప్రకరణే - ఇన్ద్రియజయః కామాదిషడ్రిపువర్జనం చ

మూ. విద్యావినయహేతురిన్ద్రియజయః కామక్రోధలోభమానమదహర్షత్యాగాత్ కార్యః. కర్ణత్వగక్షిజిహ్వాఘ్రాణేన్ద్రియాణాం శబ్దస్పర్శరూపరసగన్ధేష్వవిప్రతిపత్తిః ఇన్ద్రియజయః, శాస్త్రార్థానుష్ఠానం వా. కృత్స్నం హి శాస్త్రమిదమ్ ఇన్ద్రియజయః.

వ్యా. విద్యవల్ల కలిగే వినయానికి హేతువైన ఇంద్రియజయాన్ని కామ-క్రోధ-లోభ(దురాశ)-మాన(నేను గొప్పవాడ ననే బుద్ధి)-మద(ధనాదులవలన కలిగిన

మధ్యమసాహసదండం. అభియుక్తుడు ఇవ్వవలసిన సొమ్ము కూడా ఈ విడిచినవాడు, లేదా విడిపించినవాడు ఇవ్వాలి. బంధనాగారంనుంచి విడిచిపెట్టినా, విడిపించినా సర్వస్వం హరించి మరణదండం విధించాలి.

4. న్యాయాధిపతికి గాని, ప్రదేష్టకు గాని తెలపకుండా ఖైదీని తిరగడానికి అనుమతించిన బంధనాగారాధ్యక్షునికి (Jail superintendent) ఇరవైనాలుగు పణాల దండం. వానిచేత పని చేయిస్తే రెట్టింపు దండం. మరొక చోటికి మార్చినా, అన్నపానాలు ఇవ్వకపోయినా తొంబైఆరు పణాల దండం, వానికి శరీరపీడ కలిగించినా, వానినుంచి లంచం తీసుకున్నా మధ్యమసాహసదండం. వానిని చంపితే వెయ్యి పణాలు దండం.

మూ. 1. పరిగృహీతాం దాసీమ్, ఆహితికాం వా సంరుద్ధికామధిచరతః పూర్వః సాహసదణ్డః. చోరడామరికభార్యాం మధ్యమః. సంరుద్ధికామ్ ఆర్యాముత్తమః. సంరుద్ధస్య వా తత్రైవ ఘాతః. తదేవాక్షణగృహీతాయామార్యా యాం విద్యాత్. దాస్యాం పూర్వః సాహసదణ్డః.

2. చారకమభిత్త్వా నిష్పాతయతో మధ్యమః. భిత్త్వా వధః. బన్ధనాగారాత్ సర్వస్వం వధశ్చ.

3. శ్లో. ఏవమర్థచరాన్ పూర్వం రాజా దణ్డేన శోధయేత్,
శోధయేయుశ్చ శుద్ధాస్తే పౌరజానపదాన్ దమైః.

ఇతి కౌటిలీయార్థశాస్త్రే కణ్టకశోధనే చతుర్థాధికరణే నవమోఽధ్యాయః
సర్వాధికరణరక్షణమ్, ఆదితః షడశీతితమః.

వ్యా. 1. జైలులో ఉన్న, వివాహితయైన దాసీతో గాని, తాకట్టు పెట్టిన స్త్రీతో గాని వ్యభిచరించిన జైలరుకి పూర్వసాహసదండం. చోరుని భార్యతోను, దొమ్మీ చేసినవాని భార్యతోను వ్యభిచరిస్తే మధ్యమసాహసదండం. జైలులో ఉంచిన ఆర్యస్త్రీతో వ్యభిచరిస్తే ఉత్తమసాహసదండం. జైలులో శిక్ష అనుభవిస్తున్నవాడు అలాంటి పని చేస్తే అక్కడనే వానిని వధించాలి. నిషిద్ధమైన సమయంలో బంధించబడిన ఆర్యస్త్రీ విషయంలో వ్యభిచరించినా కూడ వధదండమే అని గ్రహించాలి. దాసి విషయంలో పూర్వ సాహసదండం.

2. చారకాన్ని భేదించకుండా బద్ధుణ్ణి బైటకు పంపినవానికి మధ్యమదండం. భేదించిపంపిన వానికి మరణదండం. బంధనాగారంనుండి విడిపించినవానికి సర్వస్వహరణము వధ కూడ దండం.

3. రాజు ఈ విధంగా తన దగ్గర పని చేసే అధికారుల్ని ముందుగా తగిన దండంచేత శోధించాలి. (సరిగా ప్రవర్తించేటట్లు) చెయ్యాలి. ఈ విధంగా శుద్ధులైన అధికారులు పౌరులను,జానపదులను దండాలు విధించి శోధింపచెయ్యాలి.

"బాలానందిని" అను కౌటిలీయార్థశాస్త్రంలో కంటకశోధనం అనే నాల్గవ అధికరణంలో సర్వాధికరణరక్షణం అనే నవమాధ్యాయం, ప్రారంభంనుంచి ఎనభైఆరవ అధ్యాయం సమాప్తం.

# అథ దశమోఽధ్యాయః

## పఞ్చాశీతితమం ప్రకరణమ్. ఏకాఙ్గవధనిష్క్రయః

## (ఒక అవయవం ఛేదించినందుకు నిష్క్రయం, దానికి బదులు జుర్మానా చెల్లించడం)

మూ. 1. తీర్థఘాతగ్రన్థిభేదోర్ధ్వకరణానాం ప్రథమేఽపరాధే సందంశచ్ఛేదనం చతుష్పఞ్చాశత్పణో వా దణ్డః. ద్వితీయే ఛేదనం పణస్య శత్యో వా దణ్డః. తృతీయే దక్షిణహస్తవధః చతుఃశతో వా దణ్డః. చతుర్థే యథాకామీ వధః.

2. పఞ్చవింశతిపణావరేషు కుక్కుటనకులమార్జారశ్వసూకరస్తేయేషు హింసాయాం వా చతుష్పఞ్చాశత్పణో దణ్డః, నాసాగ్రచ్ఛేదనం వా. చణ్డాలారణ్యచరాణామర్ధదణ్డాః.

3. పాశజాలకూటావపాతేషు బద్ధానాం మృగపశుపక్షివ్యాలమత్స్యానామాదానే తచ్చ తావచ్చ దణ్డః.

వ్యా. 1. పవిత్రక్షేత్రాలలో దొంగతనం చేసినవానికి, జేబుదొంగకు, ఊర్ధ్వకరునికి (ఇంటి కప్పుకు రంధ్రం చేసినవాడు - గ.శా. ఏ వస్తువైనా ఎత్తికొనిపోయినవాడు - కాంగ్లే) మొదటి అపరాధంలో బొటనవ్రేలు చూపుడు వ్రేలు ఛేదించడం, లేదా యాభైనాలుగు పణాల దండం. రెండవ అపరాధానికి పణాన్ని (ఐదు వ్రేళ్లను) ఛేదించడం లేదా నూరు పణాలు దండం; మూడవమారు అపరాధానికి కుడిచేయి తెగగొట్టడం లేదా నాలుగు

వందల పణాల దండం. నాల్గవమారు అపరాధానికి ఇష్టంవచ్చిన విధంగా వధ అనగా చిత్రవధ గాని, మామూలువధ గాని, దండం.

2. కోళ్లు, ముంగిసలు, పిల్లులు, కుక్కలు, పందులు - వీటిని హరించినవానికి, వీటిని హింసించినవానికీ వాటి ఖరీదు ఇరవైయైదు పణాలకు తక్కువ ఉన్నట్లయితే యాభైనాలుగు పణాల దండం. లేదా ముక్కు చివరి భాగం ఖండించడం దండం. చండాలులకు, అరణ్యంలో సంచరించేవాళ్లకూ సగం (ఇరవైయేడు పణాలు) దండం.

3. పాశాలచేత (ఉరిత్రాళ్లచేత), వలలచేత కూటావపాతాలచేత (పైకి చెత్తా చెదారం కప్పిన గోతులలో పడే టట్లు చేయడంచేత) బంధించబడిన లేళ్లను,పశువులను, పక్షులను, ఏనుగులను, చేపలను అపహరిస్తే వాటి మూల్యంతో పాటు దానితో సమానమైన ధనం కూడా దండం.

మూ. 1. మృగద్రవ్యవనాత్ మృగద్రవ్యాపహారే శత్యో దణ్డః. బిమ్బవిహారమృగపక్షిస్తేయే హింసాయాం వా ద్విగుణో దణ్డః.

2. కారుశిల్పికుశీలవతపస్వినాం క్షుద్రకద్రవ్యాపహారే శత్యో దణ్డః. స్థూలకద్రవ్యాపహారే ద్విశతః. కృషిద్రవ్యాపహారే చ.

3. దుర్గమకృతప్రవేశస్య ప్రవిశతః, ప్రాకారచ్ఛిద్రాద్వా నిక్షేపం గృహీత్వాపసరతః కన్ధరావధో ద్విశతో వా దణ్డః.

4. చక్రయుక్తాం నావం క్షుద్రపశుం వాపహరతః ఏకపాదవధః, త్రిశతో వా దణ్డః.

5. కూటకాకణ్యక్షారలాశలాకాహస్తవిషమకారిణః ఏకహస్తవధః, చతుఃశతో వా దణ్డః.

6. స్తేనపారదారికయోః సాచివ్యకర్మణి స్త్రియాః సంగృహీతాయాశ్చ కర్ణనాసాచ్ఛేదనం, పఞ్చశతో వా దణ్డః, పుంసో ద్విగుణః.

7. మహాపశుమేకం దాసం దాసీం వా అపహరతః, ప్రేతభాణ్డం వా విక్రీణానస్య ద్విపాదవధః, షట్ఛతో వా దణ్డః.

వ్యా. 1. లేళ్లను సంరక్షించే వనాలనుంచి లేళ్లను, చందనాదిద్రవ్యా లున్న వనాలనుంచి ఆ ద్రవ్యాలను అపహరిస్తే నూరు పణాల దండం. వినోదార్థం పెంచుతున్న లేళ్లను, పక్షులను అపహరించినా, హింసించినా రెండు వందల పణాల దండం.

2. చేతిపనివాళ్లు, శిల్పులు, కుశీలవులు, తాపసులు - వీళ్ల చిన్న చిన్న వస్తువులను అపహరిస్తే నూరు పణాల దండం. పెద్ద వస్తువులను అపహరిస్తే రెండు వందల పణాల దండం. వ్యవసాయం పనిముట్లను అపహరిస్తే కూడ రెండు వందల పణాల దండం.

3. అనుమతి లేకుండా దుర్గంలో ప్రవేశించినవానికి, దాచడానికి ఇచ్చిన నిక్షేపాన్ని తీసికొని ప్రాకారానికి రంధ్రంచేసి పారిపోతున్నవానికీ కంధరావధ (మణవలమీద ఉన్న నరాలను ఛేదించడం), లేదా రెండు వందల పణాల దండం.

4. బండిని, నావను లేదా చిన్న పశువును హరించినవానికి ఒక పాదం తెగగొట్టడం లేదా మూడు వందల పణాలు దండం.

5. జూదంలో ఉపయోగించడానికి నకిలీ కాకిణీలు, పాచికలు, అరలు, శలాకలు తయారుచేసినవానికి, ఆడేటప్పుడు హస్తలాఘవంచేత పందెం తారుమారు చేసినవానికి ఒక హస్తం ఛేదించాలి. లేదా నాలుగు వందల పణాలు దండం.

6. దొంగకి, పరభార్యాగమనం చేసినవానికీ సహాయం చేసిన స్త్రీకి, వ్యభిచారంలో పట్టుబడిన స్త్రీకి చెవులు, ముక్కు ఛేదించడం దండం, లేదా ఐదు వందల పణాల దండం. పురుషునికి రెట్టింపు దండం.

7. ఒక పెద్ద పశువును గాని, దాసుని గాని, దాసీని గాని అపహరించినవానికి, శవంమీద కప్పిన వస్త్రాదులను అమ్మినవానికి ఆరు వందల పణాల దండం.

మూ. 1. వర్ణోత్తమానాం, గురూణాం హస్తపాదలఙ్ఘనే, రాజయానవాహనాద్యారోహణే చ ఏకహస్తపాదవధః సప్తశతో వా దణ్డః.

2. శూద్రస్య బ్రాహ్మణవాదినః దేవద్రవ్యమవస్తృణతః, రాజద్విష్టమాదిశతో ద్వినేత్రభేదినశ్చ యోగాఞ్జనేన అన్ధత్వమ్ అష్టశతో వా దణ్డః.

3. చోరం పారదారికం వా మోక్షయతః రాజశాసనమ్ ఊనమ్ అతిరిక్తం వా లిఖతః, కన్యాం దాసీం వా సహిరణ్యమపహరతః, కూటవ్యవహారిణః, విమాంసవిక్రయిణశ్చ వామహస్తద్విపాదవధో నవశతో వా దణ్డః. మానుషమాంసవిక్రయే వధః.

4. దేవపశుప్రతిమామనుష్యక్షేత్రగృహహిరణ్యసువర్ణరత్నసస్యాపహారిణః ఉత్తమో దణ్డః శుద్ధవధో వా.

వ్యా. 1. పై వర్ణాల వాళ్లని గాని, పెద్దవాళ్లను గాని చేతితో కొట్టినా, కాలితో

తన్నినా, రాజుకు చెందిన యానం (రథాదికం) వాహనం(అశ్వాదికం) ఎక్కినా ఒక చెయ్యి ఒక పాదం నరికివెయ్యాలి. లేదా ఏడు వందల పణాల దండం.

2. బ్రాహ్మణుడను అని చెప్పుకొనే శూద్రునికి, దేవతాద్రవ్యం రహస్యంగా అపహరించినవానికి, రాజుకు వ్యతిరేకంగా ఆజ్ఞ ఇచ్చినవానికి (కాంగ్లే), రాజుకు రాజ్యానికి ఆపద రానున్న దని చెప్పే జ్యోతిష్కుడు మొదలైనవానికి (గ.శా.); ఇతరుల రెండు కళ్లు పొడిచినవానికి యోగాంజనంచేత (ఒక రకమైన కాటుకచేత) గ్రుడ్డివానినిగా చేయడం లేదా ఎనిమిది వందల పణాల దండం.

3. దొంగను గాని పరభార్యాగామిని గాని విడిపించినవానికి, రాజశాసనాన్ని (చెప్పినదానికి) తక్కువగా కాని ఎక్కువగా కాని వ్రాసినవానికి, కన్యను గాని, దాసీని గాని ధనసమేతంగా హరించినవానికి, మోసం వ్యాపారం చేసేవానికి, అపరిశుద్ధమైన మాంసం అమ్మేవానికి (కాంగ్లే) తినకూడని నక్కమాసం మొదలైన మాంసం అమ్మేవానికి ఎడమ చెయ్యి, రెండు పాదాలు తెగగొట్టడం లేదా తొమ్మిదివందల పణాలు దండం. మనిషి మాంసం అమ్మినవానికి మరణదండం.

4. దేవాలయాలకు సంబంధించిన పశువులను, విగ్రహాలను, మనుష్యులను పొలాలను, ఇళ్లను, ధనాన్ని, బంగారాన్ని, రత్నాలను, సస్యాన్ని అపహరించినవానికి ఉత్తమసాహసదండం లేదా మామూలు (చిత్రవధ కాకుండా) మరణదండం.

శ్లో. పురుషం చాపరాధం చ కారణం గురులాఘవమ్,
అనుబన్ధం తదాత్వం చ దేశకాలే సమీక్ష్య చ.
ఉత్తమావరమధ్యత్వం ప్రదేష్టా దణ్డకర్మణి,
రాజ్ఞశ్చ ప్రకృతీనాం చ కల్పయేదన్తరా స్థితః.

ఇతి కౌటిలీయార్థశాస్త్రే కణ్టకశోధనే చతుర్థాధికరణే దశమోఽధ్యాయః
ఏకాఙ్గవధనిష్క్రయః ఆదితః సప్తాశీతితమః.

వ్యా. 1. ప్రదేష్ట (మేజిస్ట్రేట్) రాజుకీ ప్రజలకీ మధ్య మధ్యస్థభావంతో ఉంటూ, అపరాధం చేసిన పురుషుణ్ణి, అపరాధస్వభావాన్ని, కారణాన్ని, దానిలో ఉండే అధికత్వాన్ని అల్పత్వాన్ని, (దండించడంవల్ల) తరవాత రాబోయే ఫలితాలను, తాత్కాలికములైన ఫలితాలను, దేశాన్నీ, కాలాన్నీ బాగా పరిశీలించి ఉత్తమదండం విధించాలా, మధ్యమ దండం విధించాలా, సాధారణమైన దండం విధించాలా అనే విషయం నిర్ణయించాలి.

"బాలానందిని" అను కౌటిలీయార్థశాస్త్రాంధ్రవ్యాఖ్యానంలో కంటకశోధనం అనే చతుర్థాధికరణంలో ఏకాంగవధనిష్క్రయం అనే పదవ అధ్యాయం, ప్రారంభంనుంచి ఎనభైయేడవ అధ్యాయం సమాప్తం.

# అథ ఏకాదశోఽధ్యాయః

## షడశీతితమం ప్రకరణమ్ - శుద్ధః చిత్రశ్చ దణ్డకల్పః (పీడించకుండా చంపడం, పీడించి చంపడం)

మూ. 1. కలహే ఘ్నతః పురుషం చిత్రో ఘాతః, సప్తరాత్రస్యాన్తః మృతే శుద్ధవధః. పక్షస్యాన్తరుత్తమః. మాసస్యాన్తః పఞ్చశతః, సముత్థానవ్యయశ్చ.

2. శస్త్రేణ ప్రహరత ఉత్తమో దణ్డః. మదేన హస్తవధః. మోహేన ద్విశతః. వధే వధః.

3. ప్రహారేణ గర్భం పాతయత ఉత్తమో దణ్డః. భైషజ్యేన మధ్యమః. పరిక్లేశేన పూర్వః సాహసదణ్డః.

4. ప్రసభం స్త్రీపురుషఘాతకాభిసారకనిగ్రాహకావఘోషకావస్కన్దకోపవేధకాన్ పథి వేశ్మప్రతిరోధకాన్ రాజహస్త్యశ్వరథానాం హింసకాన్ స్తేనాన్ వా శూలమారోహయేయుః.

వ్యా. 1. కలహంలో ఒక పురుషుణ్ణి చంపినవానికి చిత్రవధ దండం. కొట్టబడినవాడు ఏడు రోజులలో మరణిస్తే కొట్టిన వానికి శుద్ధవధ దండం. పదిహేను రోజుల్లో మరణిస్తే ఉత్తమసాహసదండం. నెలలోగా మరణిస్తే ఐదు వందల పణాల దండం: వైద్యం ఖర్చులు కూడా ఇవ్వాలి.

2. ఆయుధంచేత మరొకనిని కొట్టినవానికి ఉత్తమసాహసదండం. మదంచేత కొట్టినవానికి చెయ్యి నరికివేయడం దండం. అజ్ఞానంచేత కొట్టినవానికి రెండు వందల పణాల దండం. కొట్టబడినవాడు మరణిస్తే కొట్టినవానికి మరణదండం.

3. దెబ్బకొట్టడం ద్వారా గర్భస్రావం కలిగించినవానికి ఉత్తమసాహసదండం. మందు ఇచ్చి గర్భస్రావం చేయించినవానికి మధ్యమసాహసదండం. కష్టమైన పని చేయించి గర్భస్రావం కలిగించినవానికి పూర్వసాహసదండం.

4. పురుషుణ్ణి గాని స్త్రీని గాని బలాత్కారంగా (బలప్రయోగం చేసి) కొట్టినవాళ్లని, వాళ్లమీదకి బలంతో ఎదిరించడానికై వెళ్లినవాళ్లని, వాళ్లను పట్టుకొన్నవాళ్లని, వాళ్లని చంపుతా నని భయపెట్టినవాళ్లని, ఆక్రమించినవాళ్లని, ఆయుధాదులతో గ్రుచ్చినవాళ్లని, మార్గాలలో దోపిడీ చేసేవాళ్లని, ఇళ్లమీద పడి దోచుకొనేవాళ్లని, రాజుకు సంబంధించిన ఏనుగులకు, గుఱ్ఱాలకు, రథాలకు హింస కలిగించినవాళ్లని, వాటిని అపహరించినవాళ్లని, శూలంమీద ఎక్కించాలి (కొరత వెయ్యాలి).

మూ. 1. యశ్చైనాన్ దహేదపనయేద్వా స తమేవ దణ్డం లభేత; సాహసముత్తమం వా.

2. హింస్రస్తేనానాం భక్తవాసోపకరణాగ్నిమన్త్రదానవైయాపృత్యకర్మసు ఉత్తమో దణ్డః. పరిభాషణమవిజ్ఞానే హింస్రస్తేనానాం పుత్రదారమసమన్త్రం విసృజేత్; సమన్త్రమాదదీత.

3. రాజ్యకాముకమ్, అన్తఃపురప్రధర్షకమ్; అటవ్యమిత్రోత్సాహకం, దుర్గరాష్ట్రదణ్డకోపకం వా శిరోహస్తప్రాదీపికం ఘాతయేత్.

4. బ్రాహ్మణం తమః ప్రవేశయేత్.

5. మాతృపితృభ్రాత్రాచార్యతపస్విఘాతకం వా త్వక్ఛిరఃప్రాదీపికం ఘాతయేత్. తేషామాక్రోశే జిహ్వాచ్ఛేదః. అఙ్గాభిరదనే తదఙ్గాన్మోచ్యః.

6. యదృచ్ఛాఘాతే పుంసః,పశుయూథస్తేయే చ శుద్ధవధః. దశావరం చ యూథం విద్యాత్.

వ్యా. 1. కొరతవేసి చంపబడినవాళ్లకు దహనసంస్కారం చేసినవానికి, వాళ్లను శూలంనుంచి క్రిందికి దింపినవాళ్లకీ కూడ ఆ శూలారోపణమే దండం; లేదా ఉత్తమసాహసదండం.

2. ప్రాణఘాతకులకు, దొంగలకు ఎవరైనా అన్నం పెట్టినా, నివాసం ఇచ్చినా, సాధనాలు సమకూర్చినా, అగ్ని ఇచ్చినా, ఆలోచనలు చెప్పినా, సేవ చేసినా వాళ్లకు ఉత్తమసాహసదండం. తెలియకచేస్తే మందలించి వదిలివేయాలి. హత్యలు దొంగతనాలు చేసేవాళ్ల పుత్రులు భార్యలు ఆ పనులతో ఏమీ సంబంధం లేనివాళ్లయితే వాళ్లని విడిచిపెట్టాలి (ఏమీ చేయకూడదు). ఆ పనులతో సంబంధం ఉంటే వాళ్లని కూడా బంధించి దండించాలి.

3. రాజ్యం ఆక్రమించాలి అనుకొనేవాణ్ణి, రాజాంతఃపురాన్ని ప్రధర్షించేవానిని (బలాత్కారంగా గాని, రహస్యంగా గాని అంతఃపురంలో ప్రవేశించినవానిని) దుర్గంలోను, రాష్ట్రంలోను, సైన్యంలోను తిరుగుబాటు కలిగించినవానిని తలమీద, చేతులమీద నిప్పుపెట్టి కాలుస్తూ చంపించాలి.

4. పై అపరాధాలు చేసినవాడు బ్రాహ్మడైతే వానిని తిరిగి పైకిరాని విధంగా చీకటి కొట్లో పడవెయ్యాలి.

5. తల్లిని, తండ్రిని, పుత్రుణ్ణి, సోదరుణ్ణి, గురువును లేదా, తపస్సుచేసికొనేవానిని చంపినవానిని చర్మ ఒలిచివేసిన శిరస్సుమీద నిప్పుపెట్టి చంపించాలి. పైవాళ్లలో ఎవరినైనా తిట్టినవాని నాలుక ఛేదించాలి. వాళ్ల ఏదైనా ఒక అవయవంమీద గోళ్లు మొదలైనవాటిచేత వాతలు పడే టట్లు చేస్తే ఏ అవయవంమీద అలాంటిది కలిగించాడో (అలా చేసినవాని) ఆ అవయవాన్ని ఛేదించాలి.

6. ఒక మనిషిని దైవవశంచేత చంపినా, పశువుల యూథం (మంద) అపహరించినా శుద్ధవధ దండం. కనీసం పది పశువు లున్నది 'యూథం' అని తెలుసుకోవాలి.

మూ. 1. ఉదకధారణం సేతుం భిన్దతః తత్రై వాప్సు నిమజ్జనమ్. అనుదకముత్తమః సాహసదణ్డః. భగ్నోత్సృష్టకం మధ్యమః.

2. విషదాయకం పురుషం స్త్రియం చ పురుషఘ్నీమ్ అపః ప్రవేశయేత్ అగర్భిణీమ్. గర్భిణీం మాసావరప్రజాతామ్.

3. పతిగురుప్రజాఘాతికామ్, అగ్నివిషదాం, సంధిచ్ఛేదికాం వా గోభిః పాదయేత్.

4. వివీతక్షేత్రఖలవేశ్మద్రవ్యహస్తివనాదీపికమగ్నినా దాహయేత్.

5. రాజాక్రోశకమన్త్రభేదకయోః అనిష్టప్రవృత్తికస్య బ్రాహ్మణమహాన సావలేహినశ్చ జిహ్వాముత్పాటయేత్.

6. ప్రహరణావరణస్తేనమ్ అనాయుధీయమ్ ఇషుభిర్ఘాతయేత్. ఆయుధీయస్యోత్తమః.

వ్యా. 1. నీళ్లు పైకి వెళ్లిపోకుండా అడ్డంగా ఉన్న సేతువును (ఆనకట్టను) బ్రద్దలుకొట్టినవానిని అక్కడనే నీళ్లలో ముంచి వధించాలి. నీళ్లు లేని సేతువును

ఛేదించినవానికి ఉత్తమసాహసదండం. పూర్వమే భగ్నమై విడిచివేయబడినదానిని ఛేదిస్తే మధ్యమసాహసదండం.

2. విషం పెట్టిన పురుషుణ్ణి, పురుషుణ్ణి చంపిన స్త్రీని, ఆమె గర్భవతి కాకపోతే నీళ్లల్లో ముంచి వధించాలి. గర్భిణి అయిన స్త్రీని, ప్రసవించిన తరవాత కనీసం ఒక నెల ఆగి ఆ విధంగా వధించాలి.

3. భర్తను, పూజ్యులైన తలిదండ్రులు, అత్తమామలు మొదలైనవాళ్లను, సంతానాన్ని చంపిన స్త్రీని, ఇళ్లకు నిప్పు అంటించిన స్త్రీని, విషం పెట్టినదానిని, కన్నం తవ్వి దొంగతనం చేసిన స్త్రీని ఎడ్లచేత తొక్కించి చంపించాలి.

4. పచ్చికబీళ్లకు, పొలాలకు, కళ్లాలకు, ఇళ్లకు, వస్తువులకు, గజవనాలకు నిప్పుపెట్టి కాల్చినవానిని అగ్నిలో పడవేసి చంపాలి.

5. రాజును నిందించేవాడు, రహస్యమైన ఆలోచనలు బైట పెట్టినవాడు,రాజును గూర్చి చెడ్డ పుకార్లు సృష్టించినవాడు,బ్రాహ్మణుని వంటింటినుండి ఆహారం అపహరించి తిన్నవాడు - వీళ్ల నాలుకలు పెకిలింపచెయ్యాలి.

6. ఆయుధాలు, కవచాలు దొంగిలించినవానిని, వాడు ఆయుధీయుడు (యుద్ధభటుడు) కాకపోతే, బాణాలచేత చంపించాలి. యుద్ధభటుడైతే ఉత్తమ సాహస దండం విధించాలి.

మూ. 1. మేఢ్రఫలోపఘాతినః తదేవ ఛేదయేత్.

2. జిహ్వానాసోపఘాతే సందంశవధః.

3. శ్లో. ఏతే శాస్త్రేష్వనుగతాః క్లేశదణ్డాః మహాత్మనామ్,
అక్లిష్టానాం తు పాపానాం ధర్మ్యః శుద్ధవధః స్మృతః.

ఇతి కౌటిలీయార్థశాస్త్రే కణ్టకశోధనే చతుర్థాధికరణే ఏకాదశోఽధ్యాయః శుద్ధః చిత్రశ్చ దణ్డకల్పః, ఆదితః అష్టాశీతితమః.

వ్యా. 1. ఇతరుని మేఢ్రఅండాలకు దెబ్బ కలిగించినవాని మేఢ్రఫలాలు తీసివేయించాలి.

2. ఇతరుల నాలుకకు, ముక్కుకు దెబ్బ తగల్చినవాని జిహ్వానాసికలు ఛేదించాలి.

3. ఈ విధమైన శరీరక్లేశం కలిగించే దండాలు మహాత్ముల శాస్త్రగ్రంథాలలో చెప్పబడ్డాయి. బాధాకరాలు కాని అపరాధాలకు శుద్ధవధ ధర్మసంమత మైనదిగా చెప్పబడినది.

"బాలానందిని" అను కౌటలీయార్థశాస్త్రాంధ్రవ్యాఖ్యానంలో కంటకశోధనం అనే నాల్గవ అధికరణంలో శుద్ధచిత్రదండకల్పం అనే పదకొండవ అధ్యాయం, ప్రారంభంనుంచి ఎనభైఎనిమిదవ అధ్యాయం సమాప్తం.

## అథ ద్వాదశోఽధ్యాయః

### సప్తాశీతితమం ప్రకరణమ్ - కన్యాప్రకర్మ (కన్యామానభంగం)

మూ. 1. సవర్ణామప్రాప్తఫలాం కన్యాం ప్రకుర్వతో హస్తవధః, చతుఃశతో వా దణ్డః. మృతాయాం వధః.

2. ప్రాప్తఫలాం ప్రకుర్వతః మధ్యమాగ్రప్రదేశనీవధో ద్విశతో వా దణ్డః. పితుశ్చావహీనం దద్యాత్.

3. న చ ప్రాకామ్యమకామాయాం లభేత. సకామాయాం చతుష్పఞ్చాశత్పణో దణ్డః, స్త్రియస్త్వర్ధదణ్డః.

4. పరశుల్కావరుద్ధాయాం హస్తవధః చతుఃశతో వా దణ్డః, శుల్కదానం చ.

5. సప్తార్తవప్రజాతాం వరణాదూర్ధ్వమలభమానాం ప్రకృత్య ప్రకామీ స్యాత్, న చ పితురవహీనం దద్యాత్. ఋతుప్రతిరోధిభిః స్వామ్యాదపక్రామతి.

వ్యా. 1. రజస్వల కాని ఒకే వర్ణానికి చెందిన కన్యను మానభంగం చేసినవానికి చేతులు నరికివేయడం గాని, నాలుగు వందల పణాలు గాని దండం. ఆమె మరణిస్తే మరణదండం.

2. రజస్వలను మానభంగం చేస్తే మధ్యవేలు, చూపుడువేలు ఛేదించాలి; లేదా రెండు వందలపణాల దండం.తండ్రికి అవహీనం (నష్టం=Compensation) అడిగినంతా ఇవ్వాలి.

3 ఆమె ఇచ్ఛ లేనిదై నపుడు ఆ పురుషునకు పూర్తి సంతృప్తి కలగదు అని ఇది కేవలం ఉపదేశం(గ.శా.). ఆమె ఇష్టపడకపోతే ఆమెను వివాహం చేసుకొనే అధికారం ఉండదు (కాంగ్లే). ఆమె ఇష్టపడితే యాభైనాలుగు పణాల దండం, స్త్రీకి దానిలో సగం దండం.

4. మరొక రెవరైన ఆమె నిమిత్తం శుల్కం ఇచ్చి ఉండగా ఆమెను దూషిస్తే (మానభంగం చేస్తే) చేతులు తెగగొట్టడం లేదా నాలుగు వందల పణాలు దండం. శుల్కం ఇచ్చినవానికి ఆ శుల్కం కూడా ఈ కన్యాదూషకుడు ఇవ్వాలి.

5. వివాహనిర్ణయం అయిన తరవాత ఏడు ఆర్తవాలవరకు కూడ ఆమె తన దగ్గరకు రానప్పుడు ఆ నిర్ణయించుకొన్న వరుడు ఆమెను బలాత్కరించినా ఆమెమీద అధికారం కలవా డవుతాడు. తండ్రికి అవహీనం ఇవ్వవలసిన పని లేదు. ఋతుకాలాలను వ్యర్థం చేయడంచేత తండ్రి ఆమెమీద నున్న స్వామిత్వాన్ని కోల్పోతాడు.

మూ. 1. త్రివర్షప్రజాతార్తవాయాస్తుల్యో గన్తుమదోషః. తతః పరమ తుల్యో ఽప్యనలఙ్కృతాయాః.పితృద్రవ్యాదానే స్తేయం భజేత.

2. పరముద్దిశ్య అన్యస్య విన్దతః ద్విశతో దణ్డః. న చ ప్రాకామ్యమకామాయాం లభేత.

3. కన్యామన్యాం ప్రదర్శ్య అన్యాం ప్రయచ్ఛతః శత్యో దణ్డః తుల్యాయామ్. హీనాయాం ద్విగుణః.

4. ప్రకర్మణ్యకుమార్యాశ్చతుష్పఞ్చాశత్పణో దణ్డః, శుల్కవ్యయకర్మణీ చ ప్రతిదద్యాత్. అవస్థాయ తజ్జాతం పశ్చాత్ కృత్వా ద్విగుణం దద్యాత్.

5. అన్యశోణితోపధానే ద్విశతో దణ్డః, మిథ్యాభిశంసినశ్చ పుంసః. శుల్కవ్యయకర్మణీ చ జీయేత. న చ ప్రాకామ్యమకామాయాం లభేత.

వ్యా. 1. మూడు సంవత్సరాల క్రితమే ఋతుమతి అయిన స్త్రీ సమానవర్ణం కల పురుషుణ్ణి పొందినా దోషం లేదు. మూడు సంవత్సరాల తరవాత సమానవర్ణం కానివానిని పొందినా దోషం లేదు. అలంకారాలు ధరించిన స్త్రీ (అనగా తండ్రి ధనంతో కూడిన స్త్రీ) మాత్రం అలా చేయకూడదు. తండ్రి ధనాన్ని కూడా తీసికొని వెళ్లిన కన్య దొంగకు విధించే దండం పొందుతుంది.

2. ఒక కన్యను ఒకనికొరకు అడిగి తానే ఆమెను పొందినవానికి రెండు వందల పణాల దండం. ఆమెకు ఇష్టం లేకపోతే వానికి ఆమెమీద అధికారం ఉండదు.

3. ఒక కన్యను ఇస్తా నని చూపించి మరొక కన్యను ఇచ్చేవానికి, ఆమె ఇస్తా నన్న కన్యతో సమానురాలైతే, వంద పణాల దండం. ఆమెకంటె హీన(తక్కువది) అయితే రెట్టింపు దండం.

4. కుమారి(అవివాహిత) కాని, అనగా వివాహిత అయి ఉండి భర్తృసంయోగం

జరగని, స్త్రీ మరొకనితో సంబంధం ఏర్పరచుకుంటే ఆమెకు యాభైనాలుగు పణాల దండం. శుల్కం ఖర్చులూ కూడ మొదటివానికి ఇవ్వాలి. ఆ విధంగా (శుల్కవ్యయాలు ఇస్తానని) అంగీకరించి అలా చేయని స్త్రీ రెట్టింపు (వివాహమాడినవానికి) చెల్లించాలి.

5. తాను రజస్వల కాకపోయినా (వస్త్రాదులయందు) మరొక శోణితాన్ని చూపిన స్త్రీకి రెండు వందల పణాల దండం. ఒక స్త్రీ (భార్య) కన్యాత్వాన్ని కోల్పోయింది (ఇతరునితో సంబంధం పెట్టుకొన్నది) అని అసత్యమైన ఆరోపణ చేసే భర్తకు కూడ అదే దండం. వానినుంచి శుల్కం ఖర్చులూ రాబట్టాలి. ఆ స్త్రీకి ఇష్టం లేకపోతే ఆతనికి ఆమెమీద అధికారం ఉండదు.

మూ. 1. స్త్రీ ప్రకృతా సకామా సమానా ద్వాదశపణం దణ్డం దద్యాత్, ప్రకర్త్రీ ద్విగుణమ్. అకామాయాః శత్యో దణ్డః. ఆత్మరాగార్థం శుల్కదానం చ. స్వయం ప్రకృతా రాజదాస్యం గచ్ఛేత్.

2. బహిర్గ్రామస్య ప్రకృతాయాం మిథ్యాభిశంసనే చ ద్విగుణో దణ్డః.

3. ప్రసహ్య కన్యామపహరతో ద్విశతః, ససువర్ణాముత్తమః, బహూనాం కన్యాపహారిణాం పృథక్ యథోక్తాః దణ్డాః.

4. గణికాదుహితరం ప్రకుర్వతః చతుష్పఞ్చాశత్పణో దణ్డః శుల్కం మాతుర్భోగః షోడశగుణః.

5. దాసస్య దాస్యా వా దుహితరమ్ అదాసీం ప్రకుర్వతః చతుర్వింశతిపణో దణ్డః, శుల్కాబన్ధ్యదానం చ. నిష్క్రయానురూపాం దాసీం ప్రకుర్వతః ద్వాదశపణో దణ్డః వస్త్రాబన్ధ్యదానం చ.

6. సాచివ్యావకాశదానే కర్తృసమో దణ్డః.

వ్యా. 1. ఇష్టపడి, మరొక స్త్రీచేత, అంగులీక్షేపాదులచేత క్షతయోని అయిన, సమానవర్ణానికి చెందిన కన్య పన్నెండు పణాల దండం ఇవ్వాలి. ఆమెను క్షతయోని చేసిన స్త్రీ ఇరవైనాలుగు పణాల దండం ఇవ్వాలి. ఇచ్ఛ లేని కన్యను కేవలం తనకు ఆనందంకోసం క్షతయోనినిగా చేసిన స్త్రీకి నూరు పణాల దండం, ఆమె శుల్కం కూడా ఇవ్వాలి. స్వయంగానే క్షతయోనిత్వాన్ని చేసికొన్న స్త్రీ (కన్య) రాజుదగ్గర దాసిగా ఉండాలి.

2. కన్యకు గ్రామం వెలుపల మానభంగం చేసినా, మానభంగం చేయకపోయినా చేసినట్లు అసత్యమైన అభిశంసనం చేసినా రెట్టింపు దండం.

3. కన్యను బలాత్కారంగా ఎత్తికొనిపోయినవానికి రెండు వందల పణాల

దండం. ఆభరణాలతో ఉన్న కన్యను బలాత్కారంగా ఎత్తికొనిపోతే ఉత్తమసాహసదండం. చాలమంది కలిసి ఒక కన్యను అపహరించిన ట్లయితే వాళ్లందరికీ పైన చెప్పిన దండాలు వేరు వేరుగా విధించాలి.

4. గణిక కుమార్తెను క్షతయోనిని చేసినవానికి యాభైనాలుగు పణాల దండం. తల్లికి ఒక పర్యాయానికి ఎంత భోగం ఇవ్వాలో దానికి పదహారు రెట్లు భోగం శుల్కంగా ఇవ్వాలి.

5. తాను దాసి కాని దాసుని కూతురును గాని, దాసి కూతురును గాని క్షతయోనిని చేసిన వానికి ఇరవైనాలుగు పణాల దండం; ఆమెకు శుల్కం, ఆభరణాలు కూడా ఇవ్వాలి. నిష్క్రయానికి (బాకీ ఉన్న సొమ్ము ఇచ్చి విడుదల పొందడానికి) అనురూపంగా ఉన్న దాసీని మానభంగం చేసినవానికి పన్నెండు పణాల దండం, వస్త్రాలు, అభరణాలు కూడా ఇవ్వాలి.

6. కన్యామానభంగానికి సలహాలు ఇచ్చినా, చోటు ఇచ్చినా మానభంగం చేసినవానికి ఎంత దండమో అంత దండం విధించాలి.

మూ. 1. ప్రోషితపతికామపచరన్తీం పతిబన్ధుః తత్పురుషో వా సంగృహ్ణీయాత్. సంగృహీతా పతిమాకాఙ్క్షేత. పతిశ్చేత్ క్షమేత విసృజ్యేతో భయమ్. అక్షమాయాం స్త్రియాః కర్ణనాసాచ్ఛేదనమ్; వధం జారశ్చ ప్రాప్నుయాత్.

2. జారం చోర ఇత్యభిహరతః పఞ్చశతో దణ్డః. హిరణ్యేన ముఞ్చతః తదష్టగుణః.

3. కేశాకేశికం సంగ్రహణమ్. ఉపలిఙ్గనాద్వా శరీరోపభోగానాం, తజ్జాతేభ్యః స్త్రీవచనాద్వా.

4. పరచక్రాటవీహృతామ్, ఓఘప్రవ్యూఢామ్ అరణ్యేషు దుర్భిక్షే వా త్యక్తాం ప్రేతభావోత్సృష్టాం వా పరస్త్రియం నిస్తారయిత్వా యథాసంభాషితం సముపభుఞ్జీత. జాతివిశిష్టామ్, అకామామ్, అపత్యవతీం నిష్క్రయేణ దద్యాత్.

వ్యా. 1. భర్త ప్రవాసం వెళ్లినప్పుడు వ్యభిచారం చేస్తున్న స్త్రీని భర్తబంధువు గాని, ఆతని భృత్యుడు గాని అదుపులో ఉంచాలి.ఆ విధంగా వాళ్లచేత అదుపులో ఉంచబడినదై భర్త కోసం నిరీక్షించాలి. తిరిగి వచ్చిన భర్త క్షమించినట్లయితే ఆ స్త్రీనీ, జారుణ్ణీ ఇద్దరినీ కూడ విడిచివెయ్యాలి. అతడు క్షమించకపోతే ఆ స్త్రీకి చెవులు ముక్కు

ఛేదించాలి. జారునికి మరణదండం విధించాలి.

2. జారుణ్ణి (జారత్వం కప్పిపుచ్చడానికై) చోరుడని అన్నవానికి ఐదు వందల పణాల దండం. ధనం తీసికొని జారుణ్ణి విడిచిపెట్టినవానికి దానికి (తీసుకొన్నదానికి) ఎనిమిది రెట్లు జుర్మానా.

3. ఇద్దరి జుట్టులూ నలగడాన్ని పట్టి వాళ్ల సంభోగాన్ని నిర్ణయించాలి. శరీరంమీద కనబడే భోగచిహ్నాలను పట్టి ఊహించాలి లేదా ఆ విషయాలలో నిపుణులైన వాళ్లనుండి (తజ్జాత=expert) లేదా స్త్రీ మాటలను పట్టి నిర్ణయించాలి.

4. శత్రురాజ్యంనుంచి, అడవినుంచి తీసికొని రాబడినది, లేదా ప్రవాహంలో కొట్టుకొనివచ్చినది, లేదా దుర్భిక్షసమయంలో అరణ్యాలలో విడవబడినది, మరణించినదని తలచి విడవబడినది అయిన పరస్త్రీని ఆ ఆపదలనుండి రక్షించి, ఆమెతో మాటలాడుకొనిన విధంగా అనుభవించవచ్చును. కాని ఆమె తనకంటె ఉత్తమజాతి కలదైనా, ఇష్టపడకపోయినా, పిల్లలు కలదైనా నిష్క్రయం(ముదరా) తీసికొని ఆమె బంధువులకు తిరిగి ఇచ్చివేయాలి.

శ్లో. చోరహస్తాన్నదీవేగాద్దుర్భిక్షాద్దేశవిభ్రమాత్,
నిస్తారయిత్వా కాన్తారాన్నష్టాం త్యక్తాం మృతేతి వా.
భుఞ్జీత స్త్రియమన్యేషాం యథాసంభాషితం నరః,
న తు రాజప్రతాపేన ప్రముక్తాం స్వజనేన వా.
న చోత్తమాం న చాకామాం పూర్వాపత్యవతీం న చ,
ఈదృశీం త్వనురూపేణ నిష్క్రయేణాపవాహయేత్.

ఇతి కౌటలీయార్థశాస్త్రే కణ్టకశోధనే చతుర్థాధికరణే ద్వాదశోఽధ్యాయః కన్యాప్రకర్మ ఆదిత ఏకోననవతితమః.

వ్యా. దొంగలనుండి, నదీవేగంనుండి, దుర్భిక్షంనుండి, దేశోపద్రవంనుండి, అడవినుండి రక్షింపబడిన పరస్త్రీని, తప్పిపోయినదానిని, మరణించిన దని విడవబడినదానిని ఆమెతో కుదుర్చుకొన్న అంగీకారం ప్రకారం పురుషుడు అనుభవించవచ్చును. కాని రాజుయొక్క ప్రతాపంచేత రక్షించబడినదానిని, తన బంధుజనంచేత రక్షించబడినదానిని (కాంగ్లే), రాజుయొక్క కోపంచేత విడవబడినదానిని (బహిష్కరించబడినదానిని), బంధువులచేత బహిష్కరించబడినదానిని (గ.శా.)

ఉత్తమవర్ణం గలదానిని, ఇష్టం లేనిదానిని, సంతానం కలదానిని అనుభవించగూడదు. అలాంటి స్త్రీని తగిన నిష్క్రయం తీసుకొని పంపివెయ్యాలి.

'బాలానందిని' అను కౌటలీయార్థశాస్త్రాంధ్రవ్యాఖ్యానంలో కంటకశోధనం అనే నాల్గవ అధికరణంలో కన్యాప్రకర్మ అనే పన్నెండవ అధ్యాయం, ప్రారంభంనుంచి ఎనభైతొమ్మిదవ అధ్యాయం సమాప్తం.

# అథ త్రయోదశోఽధ్యాయః

## అష్టాశీతితమం ప్రకరణమ్ - అతిచారదణ్డః
## (చేయకూడనిపనులకు దండం.)

మూ. 1. బ్రాహ్మణమపేయమభక్ష్యం వా సంఘాసయతః ఉత్తమో దణ్డః, క్షత్రియం మధ్యమః, వైశ్యం పూర్వః సాహసదణ్డః, శూద్రం చతుష్పఞ్చాశత్పణో దణ్డః.

2. స్వయం గ్రసితారః నిర్విషయాః కార్యాః.

3. పరగృహాభిగమనే దివా పూర్వః సాహసదణ్డః, రాత్రౌ మధ్యమః. దివా రాత్రౌ వా సశస్త్రస్య ప్రవిశత ఉత్తమో దణ్డః.

4. భిక్షుకవైదేహకౌ మత్తోన్మత్తౌ బలాదాపది చాతిసన్నికృష్టాః ప్రవృత్తప్రవేశాశ్చ అదణ్డ్యాః, అన్యత్ర ప్రతిషేధాత్.

5. స్వవేశ్మనః విరాత్రాదూర్ధ్వం పరివార్యమారోహతః పూర్వః సాహసదణ్డః. పరవేశ్మనో మధ్యమః. గ్రామారామావటభేదినశ్చ.

వ్యా. 1. పానం చేయదగనిదానిని బ్రాహ్మణునిచేత తాగించినా, తినదగని దానిని తినిపించినా ఉత్తమసాహసదండం. క్షత్రియునిచేత త్రాగించినా, తినిపించినా మధ్యమసాహసదండం; వైశ్యునిచేత త్రాగించినా తినిపించినా పూర్వసాహసదండం. శూద్రునిచేత త్రాగించినా తినిపించినా యాభైనాలుగు పణాల దండం.

2. త్రాగకూడనిదానిని తామే త్రాగే వాళ్లను, తినగూడని దానిని తినేవాళ్లను దేశం నుంచి బహిష్కరించాలి.

3. పగలు ఇతరుల ఇంటిలోనికి ప్రవేశించేవానికి పూర్వసాహసదండం. రాత్రి ప్రవేశించేవానికి మధ్యమసాహసదండం. పగలైనా రాత్రైనా ఆయుధంతో ప్రవేశించేవానికి ఉత్తమసాహసదండం.

4. సంన్యాసులు, వర్తకులు, మద్యమదంలో ఉన్నవాళ్లు, ఉన్మత్తులు ప్రవేశించినా చాలా దగ్గరగా నివసించే చుట్టుప్రక్కలవాళ్లు ఏదైనా బలాత్కారం జరిగే టప్పుడు, ఆపత్సమయంలోను ప్రవేశించినా, మామూలుగా ప్రవేశించడం అలవాటున్న బంధువులు మొదలైనవాళ్లు ప్రవేశించినా దండించకూడదు.రావద్దన్నప్పుడు కూడా ప్రవేశిస్తే మాత్రం వాళ్లు కూడ దండింపదగినవారే.

5. జాము రాత్రి దాటిన తరవాత తన ఇంటి ప్రాకారాదులను ఎక్కినవానికి పూర్వసాహసదండం. ఇతరగృహప్రాకారాదులను ఎక్కినవానికి మధ్యమసాహసదండం, గ్రామం చుట్టూ ఉన్న కంచెను, ఉద్యానం చుట్టూ ఉన్న కంచెను ఛేదించినవానికి కూడ మధ్యమసాహసదండం.

మూ. 1. గ్రామేష్వన్తః సార్థికాః జ్ఞాతసారా వసేయుః. ముషితం ప్రవాసితం చైషామ్ అనిర్గతం రాత్రౌ గ్రామస్వామీ దద్యాత్. గ్రామాన్తేషు వా ముషితం, ప్రవాసితం, వివీతాధ్యక్షో దద్యాత్. అవివీతానాం చోరరజ్జుకః. తథాప్యసుప్తానాం, సీమావరోధవిచయం దద్యుః. అసీమావరోధే పఞ్చగ్రామీ దశగ్రామీ వా.

2. దుర్బలం వేశ్మ, శకటమ్ అనుత్తబ్ధమూర్ధస్తమ్భం, శస్త్రమ్ అనపాశ్రయమ్, అప్రతిచ్ఛన్నం, శ్వభ్రం, కూపం, కూటావపాతం వా కృత్వా హింసాయాం దణ్డపారుష్యం విద్యాత్.

3. వృక్షచ్ఛేదనే, దమ్యరశ్మిహరణే చతుష్పదానామదాన్తసేవనే వాహనే కాష్ఠలోష్టపాషాణదణ్డబాణ బాహువిక్షేపణేషు, యానే(న)హస్తినా చ సంఘట్టనే, 'అపేహి' ఇతి సంక్రోశన్ అదణ్డ్యః.

వ్యా. 1. సార్థికులు (గుంపులుగా తిరిగే వర్తకులు) తమ దగ్గర ఏ విధమైన ఖరీదైన సరుకు ఉన్నదో గ్రామాధిపతికి తెలిపి గ్రామంలో నివసించాలి. వాళ్ల వస్తువులలో అపహరించబడిన దానిని, మరొకచోటికి తీసికొనివెళ్లబడిన దానిని (గ.శా.)

చంపబడినదానిని (కాంగ్లే), అది రాత్రి బైటకు తీసికొనివెళ్లబడకపోతే, గ్రామాధికారి వాళ్లకి ఇవ్వాలి. గ్రామాల సరిహద్దులలో అపహరించబడినదానిని, మరొక చోటకు తీసికొనిపోయినదానిని వివీతాధ్యక్షుడు ఇవ్వాలి. వివీతం కాని స్థానాలలో అట్లు జరిగితే చోరరజ్జుకుడు (చోరులను పట్టుకొనడానికి నియుక్తుడైన అధికారి) ఇవ్వాలి. అలా చేసినా కూడ రక్షించబడని వస్తువుల విషయంలో, ఇక్కడినుంచి ఇక్కడివరకు అని ఒక హద్దు ఏర్పరచి, ఆ ప్రదేశంలో ఆ వస్తువులను గూర్చి (ఇళ్లు సోదాచేసి) వెదకడానికి గ్రామస్థులు అవకాశం ఇవ్వాలి. సీమావరోధం లేని పక్షంలో (అలాంటి సరిహద్దు ఏర్పాటు లేని పక్షంలో) ఆ విధంగా పోయిన వస్తువులను పంచగ్రామాధికారి కాని, దశగ్రామాధికారి గాని ఇవ్వాలి.

2. బలం లేని ఇల్లు కట్టి, బండికి పైన కట్టవలసిన రాటలు (స్తంభాలు) గట్టిగా కట్టక, ఆయుధాలకు తొడుగు (ఆచ్ఛాదనం) లేక, గోతిని పూడ్చక, (పాడుపడిన) నూతిని పూడ్చక, మోసం చేసే గొయ్యి త్రవ్వి (గోతిమీద కనబడకుండా చెత్తా చెదారం కప్పి ఉంచి) ఇతరులకు హింస కలిగిస్తే దండపారుష్యానికి విధించే దండం విధించాలి.

3. చెట్టు నరుకుతున్నప్పుడు, దమ్యమైన (పని నేర్పే) పశువులను (అశ్వాదులను) త్రాళ్లు కట్టి తీసికొని వెడుతున్నప్పుడు, నాలుగు కాళ్ల జంతువులలో దాంతం కాని (పూర్తిగా అభ్యాసం ఇవ్వని) జంతువును కట్టిన వాహనంమీద వెళ్లేటప్పుడు, కఱ్ఱలు, మట్టి బెడ్డలు, రాళ్లు, పాడవైన కఱ్ఱలు( దండాలు) బాణాలు, బాహువులు విసిరే టప్పుడు బండి ఎక్కి లేదా ఏనుగును ఎక్కి వెళ్లేటప్పుడు "దూరంగా తప్పుకోండి" అని అరుస్తున్నా కూడ ఎవరికైనా వాటివల్ల దెబ్బ తగిలితే అలా తగలడానికి కారణమైనవానిని దండించగూడదు.

మూ. 1. హస్తినా రోషితేన హతో ద్రోణాన్నం, కుమ్భం, మాల్యానులేప నం, దన్తప్రమార్జనం చ పటం దద్యాత్. అశ్వమేధావభృథస్నానేన తుల్యో హస్తినా వధ ఇతి పాదప్రక్షాలనమ్. ఉదాసీనవధే యాతురుత్తమో దణ్డః.

2. శృఙ్గిణా దంష్ట్రిణా వా హింస్యమానమ్ అమోక్షయతః స్వామినః పూర్వః సాహసదణ్డః. ప్రతిక్రుష్టస్య ద్విగుణః.

3. శృఙ్గిదంష్ట్రిభ్యామన్యోన్యం ఘాతయతః తచ్చ తావచ్చ దణ్డః.

4. దేవపశుమ్, ఋషభమ్, ఉక్షాణం, గోకుమారీం వా వాహయతః పఞ్చశతో దణ్డః. ప్రవాసయతః ఉత్తమః.

5. లోమదోహవాహనప్రజననోపకారిణాం క్షుద్రపశూనామాదానే తచ్చ తావచ్చ దణ్డః. ప్రవాసనే చ, అన్యత్ర దేవపితృకార్యేభ్యః.

వ్యా. 1. ఏనుగుకు కోపం కలిగించి దానిచేత చంపబడాలని కోరుకొనేవాడు ఆ విధంగా చంపబడితే ఆ ఏనుగుకు ఒక ద్రోణం అన్నం, ఒక మద్యకుంభం, పుష్పమాలలు, శరీరానికి పూసే సుగంధద్రవ్యం, దంతాలు తుడవడానికి (రక్తం) ఒక వస్త్రం ఇవ్వాలి (ఇచ్చే ఏర్పాటు చెయ్యాలి. ఏనుగుచేత చావడం అనేది అశ్వమేధయాగం పూర్తి అయిన తరవాత అవభృథస్నానం చేయడం వంటి పవిత్రమైన పని. అందుచేతనే ఏనుగుకు ఇది పాదప్రక్షాలనం అనగా పూజ. ఉదాసీనుణ్ణి (అలాంటి కోరిక లేక మార్గంలో నడిచి పోయేవానిని) ఏనుగు చంపుతే మావటివానికి ఉత్తమసహసదండం.

2. కొమ్ము లున్న ఎద్దు మొదలైనవాటి చేత గాని, కోరలున్న కుక్క మొదలైన వాటిచేత గాని హింసించబడుతున్నవానిని విడిపించని వాటి స్వామికి పూర్వసాహసదండం. నివారించుము అని అరచినా కూడ విడిపించని స్వామికి రెట్టింపు దండం.

3. కొమ్ములున్న పశువును, కోర లున్న జంతువును ఒకదానిచేత మరొక దానిని చంపించినవానికి అలా చచ్చినవాటి ఖరీదు, ఆ ఖరీదులో సమానమైన ధనం దండం.

4. దేవతలకు సంబంధించిన పశువుచేత, ఎద్దుచేత, దేవతాపశువులకు పిల్లలను పుట్టించగలిగిన పురుషపశువు (ఆబోతు మొ.) చేత, దూడలు కనని చిన్న ఆవుచేత ఏమైనా మోయించినవానికి ఐదువందల పణాల దండం.చంపినవానికి ఉత్తమసాహసదండం.

5. రోమాలకి, పాలు పిదకడానికి, వాహనంగా ఉపయోగించడానికీ, పిల్లలు పుట్టించడానికి ఉపకరించే చిన్న పశువులను అపహరిస్తే వాటి ఖరీదు, దానితో సమానమైన ధనమూ దండం. దేవపితృకార్యాలకు తప్ప మరొక కారణంచేత వాటిని చంపినా కూడ పైన చెప్పిన దండమే.

మూ. 1. ఛిన్ననస్యం, భగ్నయుగం, తిర్యక్ప్రతిముఖాగతం చ ప్రత్యాసరద్వా చక్రయుక్తం యానపశుమనుష్యసంబాధే వా హింసాయా

మ దణ్డ్యః. అన్యథా యథోక్తం మానుషప్రాణిహింసాయాం దణ్డమభ్యావహేత్. అమానుషప్రాణివధే ప్రాణిదానం చ.

2. బాలే యాతరి యానస్థః స్వామీ దణ్డ్యః. అస్వామిని యానస్థః ప్రాప్తవ్యవహారో వా యాతా. బాలాధిష్ఠితమ్, అపురుషం వా యానం రాజా హరేత్.

3. కృత్యాభిచారాభ్యాం యత్పరమాపాదయేత్, తదాపాదయితవ్యః.

4. కామం భార్యాయామనిచ్ఛన్త్యాం కన్యాయాం వా దారార్థినాం భర్తరి భార్యాయాం వా సంవననకరణమ్. అన్యథా హింసాయాం మధ్యమః సాహసదణ్డః.

5. మాతాపిత్రోర్భగినీం, మాతులానీమ్, ఆచార్యానీం, స్నుషాం, దుహితరం, భగినీం వాతిచరతస్త్రిలిఙ్గచ్ఛేదనం వధశ్చ. సకామా తదేవ లభేత. దాసపరిచారకాహితకభుక్తా చ.

వ్యా. 1. బండికి కట్టిన ఎద్దుల ముక్కు త్రాళ్లు తెగిపోయినా, కాడి విరిగిపోయినా, బండి అడ్డంగాను ఎదురుగాను వచ్చినా, వెనుకకు వెళ్లినా, బళ్లు, పశువులు, మనుష్యులు వీళ్లతో ఇరుకుగా ఉన్న ప్రదేశంలోనైనా (ఆ బండివల్ల) మనుష్యులకు పశువులకు హింస కలిగినా కూడ బండి త్రోలేవానిని దండింపకూడదు. ఇతరపరిస్థితులలో మనుష్యులకు ప్రాణులకు హింస కలిగినప్పుడు చెప్పబడిన దండం విధించాలి. మనుష్యుడు కాని మరొక ప్రాణి ఏదైనా మరణిస్తే ఆ ప్రాణిని ఇవ్వాలి.

2. బండి తోలేవాడు బాలుడైతే బండిలో ఉన్న స్వామిని దండించాలి. స్వామి బండిలో లేకపోతే యానంలో ఉన్న ప్రాప్తవ్యవహారుణ్ణి (మైనారిటీ దాటినవానిని) గాని, బండి తోలేవానిని గాని శిక్షించాలి. బాలుడు తోలుచున్న, లేదా ఎవరూ లేకుండా వెళ్లిపోతూన్న బండిని రాజు తీసికొనాలి.

3. కృత్యాప్రయోగంచేత (ఏవో కర్మలు చేసి ఒక చెడ్డ శక్తిని పుట్టించి దానిని ఎదుటివాని మీద ప్రయోగించడం కృత్యాప్రయోగం)

, అభిచారక్రియలచేత (చేతబడులచేత) పరులకు ఏ విధమైన అపకారం కలిగిస్తాడో, అలాంటి అపకారమే కృత్యాప్రయోగాభిచారాలు చేసినవానికి కలిగించాలి.

4. భార్య ఇష్టపడనప్పుడు(భర్తకు అనుకూలంగా ఉండనప్పుడు) భర్త ఆమె విషయంలోను, కన్య ఇష్టపడ నప్పుడు ఆమెను వివాహం చేసికొనాలని కోరేవాడు ఆమె విషయంలోను, భర్త అనుకూలుడుగా ఉండనప్పుడు భార్య భర్త విషయంలోను, సంవననం (వశీకరణమంత్రతంత్రాదిప్రయోగం చేసినా తప్పు లేదు). ఇతరుల విషయంలో సంవననాదికంచేత హింస చేస్తే మాత్రం మధ్యమసాహసదండం.

5. తలిదండ్రుల సోదరిని, మేనమామ భార్యను, గురుభార్యను, కోడలిని, కుమార్తెను, లేదా సోదరిని మానభంగం చేసినవానికి మూడు లింగాలు (మేహనాండాలు) ఛేదించి మరణదండం విధించాలి. స్త్రీకూడ ఇష్టపడితే ఆమెకు మూడు లింగాలు (స్తనగోప్యస్థానాలు) ఛేదించి మరణదండం విధించాలి. దాసునిచేత, పరిచారకునిచేత, తాకట్టుపెట్టబడిన వానిచేత అనుభవించబడిన స్త్రీకి కూడ అదే దండం.

మూ. 1. బ్రాహ్మణ్యామగుప్తాయాం క్షత్రియస్య ఉత్తమః. సర్వస్వం వైశ్యస్య. శూద్రః కటాగ్నినా దహ్యేత. సర్వత్ర రాజభార్యాగమనే కుమ్భీపాకః.

2. శ్వపాకీగమనే కృతకబన్ధాఙ్కః పరవిషయం గచ్ఛేత్; శ్వపాకత్వం వా శూద్రః. శ్వపాకస్యార్యాగమనే వధః, స్త్రియాః కర్ణనాసాచ్ఛేదనమ్.

3. ప్రవ్రజితాగమనే చతుర్వింశతిపణో దణ్డః. సకామా తదేవ లభేత.

4. రూపాజీవాయాః ప్రసహ్యోపభోగే ద్వాదశపణో దణ్డః.

5. బహూనామేకామధిచరతాం పృథక్ చతుర్వింశతిపణో దణ్డః.

6. స్త్రియమయోనౌ గచ్ఛతః పూర్వసాహసదణ్డః. పురుషమధిమేహతశ్చ.

వ్యా.1. అరక్షితురాలైన బ్రాహ్మణస్త్రీని పొందిన క్షత్రియునికి ఉత్తమసాహస దండం; వైశ్యునికి వాని సర్వస్వం హరించడం దండం; శూద్రుణ్ణి గడ్డిమంటలో పడవేసి కాల్చివేయాలి. ఎవరైనా రాజభార్యాసంగమం చేస్తే కుంభీపాకం (మంగలంలో - పెద్దబాణలిలో, పడవేసి వేయించి చంపడం) దండం.

2. శ్వపాకస్త్రీని పొందినవానికి నుదుట మనిషిమొండెం గుర్తు వేసి ఇతరదేశానికి పంపివేయాలి. అతడు శూద్రుడైతే శ్వపాకుడైపోతాడు. శ్వపాకుడు ఆర్యస్త్రీని పొందితే మరణదండం. స్త్రీకి చెవులు ముక్కు ఛేదించాలి.

3. ఇల్లు వదలి వెళ్లిపోయిన స్త్రీని పొందితే ఇరవైనాలుగు పణాల దండం. ఆమె ఇష్టపడితే ఆమెకు కూడ అదే దండం.

4. వేశ్యను బలాత్కరించి సంభోగం చేస్తే పన్నెండు పణాల దండం.

5. చాలమంది కలిసి ఒక స్త్రీని మానభంగం చేస్తే ఒక్కొక్కనికి ఇరవైనాలుగు పణాల చొప్పున దండం.

6. స్త్రీతో యోనికంటె భిన్నమైన స్థానంలో కలిసినవానికి పూర్వసాహస దండం.పురుషునిమీదికి ఎక్కి చెడ్డగా ప్రవర్తించినవానికి కూడ పూర్వసాహసదండం.

శ్లో. మైథునే ద్వాదశపణః తిర్యగ్యోనిష్వనాత్మనః,
దైవతప్రతిమానాం చ గమనే ద్విగుణః స్మృతః.

వ్యా. 1. ఆవులు, గేదెలు మొదలైన తిర్యగ్జంతువులయందు మైథునం చేసే బుద్ధిహీనునకు పన్నెండు పణాల దండం.దేవతావిగ్రహాలతో మైథునం చేసినవానికి ఇరవైనాలుగు పణాల దండం.

శ్లో. అదణ్డ్యదణ్డనే రాజ్ఞో దణ్డస్త్రింశద్గుణోఽమ్భసి,
వరుణాయ ప్రదాతవ్యో బ్రాహ్మణేభ్యస్తతః పరమ్.

వ్యా. శిక్షించతగనివాళ్లను శిక్షించిన రాజు తాను విధించిన దండానికి ముప్పై రెట్లు దండం వరుణునికి చెల్లించాలి. దానిని నీళ్లల్లో వెయ్యాలి. తరవాత బ్రాహ్మణులకు ఇవ్వాలి.

శ్లో. తేన తత్పూయతే పాపం రాజ్ఞో దణ్డాపచారజమ్,
శాస్తా హి వరుణో రాజ్ఞాం మిథ్యావ్యాచరతాం నృషు.

ఇతి కౌటలీయార్థశాస్త్రే కణ్టకశోధనే చతుర్థాధికరణే త్రయోదశోఽధ్యాయః, అతిచారదణ్డః, ఆదితః నవతితమః ఏతావతా కౌటలీయార్థశాస్త్రస్య కణ్టకశోధనం చతుర్థమధికరణం సమాప్తమ్.

వ్యా. ఆ విధంగా చేయడంచేత దండాన్ని చెడ్డగా విధించడంవల్ల రాజుకు కలిగిన పాపం నశిస్తుంది, మానవుల విషయంలో అధర్మంగా ప్రవర్తించే రాజులకు శిక్ష విధించేవాడు వరుణుడు.

"బాలానందిని" అను కౌటిలీయార్థశాస్త్రాంధ్రవ్యాఖ్యానంలో కంటకశోధనం అనే నాల్గవ అధికరణంలో అతిచారదండం అనే పదమూడవ అధ్యాయం ప్రారంభంనుంచి తొంభైయవ అధ్యాయం సమాప్తం. కౌటిలీయార్థశాస్త్రంలో కంటకశోధనం అనే నాల్గవ అధికరణం ఇంతటితో సమాప్తం.

# అథ యోగవృత్తమ్ - పఞ్చమమధికరణమ్

## ప్రథమోఽధ్యాయః.

## ఏకోననవతితమం ప్రకరణమ్ - దాణ్డకార్మికమ్
## (రహస్యవధచేసేవిధానం **Inflection of Secret Punishment**).

మూ.1. దుర్గరాష్ట్రయోః కణ్టకశోధనముక్తమ్, రాజరాజ్యయోర్వక్ష్యామః.

2. రాజానమవగృహ్యోపజీవినః శత్రుసాధారణా వా యే ముఖ్యాస్తేషు గూఢపురుషప్రణిధిః కృత్యపక్షోపగ్రహో వా సిద్ధిః. యథోక్తం పురస్తాత్ ఉపజాపః అపసర్పో వా. యథా చ పారగ్రామికే వక్ష్యామః.

వ్యా.1. దుర్గరాష్ట్రాలలో కంటకశోధనం చెప్పబడింది. ఇప్పుడు రాజ - రాజ్యాలలో కంటకశోధనం చెప్పగలము.

2. రాజును తమ చెప్పుచేతలలో ఉంచుకొన్నవాళ్లు శత్రువులకు కూడ సాధారణులైనవాళ్లు అనగా శత్రువులతో కూడ సంబంధాలు పెట్టుకొని రాజునుంచి శత్రువునుంచీ కూడ వేతనం గ్రహించే ఉభయవేతనులు అయిన ప్రధాన, అధికారుల విషయంలో గూఢచారులద్వారా రహస్యపరీక్ష, లేదా కృత్యపక్షాన్ని అనగా ఏవైనా ప్రలోభనాలచేత తన వైపుకు త్రిప్పుకొనడానికి శక్యమైన వాళ్లను లొంగదీసుకొనడం సిద్ధి. అనగా వాళ్లనుండి ఆపద రాకుండా చూసుకొనే ఉపాయం. పూర్వం చెప్పినట్లు వాళ్లలో ఉపజాపం (రహస్యంగా ఒకరిమీద ఒకరికి ద్వేషం కలిగించేటట్లు చేయడం) లేదా గూఢచారిప్రయోగం, పారగ్రామికంలో (శత్రునగరాన్ని ఆక్రమించే విధానాన్ని గూర్చిన ప్రకరణంలో) ఎట్లు చెప్పనున్నామో అట్లు చేయడం సిద్ధి.

మూ. 1. రాజ్యోపఘాతినస్తు వల్లభాః సంహతాః వా యే ముఖ్యాః ప్రకాశమశక్యాః ప్రతిషేద్ధుం దూష్యాః; తేషు ధర్మరుచిరుపాంశుదణ్డం. ప్రయుఞ్జీత.

2. దూష్యమహామాత్రభ్రాతరం సత్కృతం సత్రీ ప్రోత్సాహ్య రాజానం దర్శయేత్. తం రాజా దూష్యద్రవ్యభోగాతిసర్గేణ దూష్యే విక్రమయేత్. శస్త్రేణ రసేన వా విక్రాన్తం తత్రైవ ఘాతయేత్; భ్రాతృఘాతకోఽయమితి.

3. తేన పారశవః పరిచారికాపుత్రశ్చ వ్యాఖ్యాతౌ.

వ్యా. 1. రాజ్యద్రోహులైన ఏ ప్రధానాధికారులు ప్రజలకు ఇష్టు లవడంచేత గాని, అందరూ కలిసి కట్టుగా ఉండడంచేత గాని ప్రకాశంగా (అనగా అందరికీ వాళ్లకీ కూడ తెలిసిన పద్ధతిలో) నివారించడానికి శక్యం కాకుండా ఉంటారో, కాని తప్పక ఏదో విధంగా నశింపచేయవలసినవాళ్లుగా ఉంటారో అలాంటివాళ్ల విషయంలో ధర్మంలో రుచి (ఆసక్తి) గల రాజు రహస్యదండం ప్రయోగించాలి.

2. గూఢచారి దూష్యుడైన మహామాత్రుని (పెద్ద అధికారి) సోదరుణ్ణి గౌరవించి, ప్రోత్సహించి ఆతనిని రాజు దగ్గరికి తీసికొని వెళ్లి రాజదర్శనం చేయించాలి. రాజు ఆతనికి, దూష్యుడైన అధికారి ద్రవ్యాన్ని అనుభవించడానికి అనుమతి ఇచ్చి వాని విషయంలో విక్రమింపచెయ్యాలి. (వానిని ఎదిరించే టట్లు చెయ్యాలి). అప్పుడు ఆ మహామాత్రుడు రసప్రయోగంచేత గాని ఆయుధంచేత గాని తన ఆస్తిని ఆక్రమించిన సోదరుణ్ణి చంపిన ట్లయితే అప్పుడు రాజు వెంటనే "ఇతడు సోదరుణ్ణి చంపాడు" అని చెప్పి ఆ నేరానికి మరణదండం విధించి చంపివెయ్యాలి.

3. దీనిచేత పారశవుడు (అసవర్ణస్త్రీయందు పుట్టిన పుత్రుడు) పరిచారికా పుత్రుడు వ్యాఖ్యానింపబడినట్లే. అనగా మహామాత్రుని పారశవుణ్ణి, పరిచారికాపుత్రుణ్ణి తండ్రి ఆస్తిని ఆక్రమించడానికి ప్రోత్సహించి, మహామాత్రుడు వాళ్లని చంపినట్లయితే, ఇతడు పుత్రుల్ని చంపాడు అనే నేరంమీద ఆ మహామాత్రుణ్ణి చంపించాలి.

మూ.1. దూష్యం మహామాత్రం వా సత్రిప్రోత్సాహితో భ్రాతా దాయం యాచేత. తం దూష్యగృహప్రతిద్వారి రాత్రావుపశయానమ్, అన్యత్ర వా వసన్తం తీక్ష్ణః హత్వా బ్రూయాత్ - "హతోఽయం దాయకాముకః" ఇతి. తతః హతపక్షం పరిగృహ్య ఇతరం నిగృహ్ణీయాత్.

2. దూష్యసమీపస్థా వా సత్రిణః భ్రాతరం దాయం యాచమానం ఘాతేన పరిభర్త్సయేయుః. తం రాత్రావితి సమానమ్.

3. దూష్యమహామాత్రయోర్వా యః పుత్రః పితుః, పితా వా పుత్రస్య దారానధిచరతి భ్రాతా వా భ్రాతుః తయోః కాపటికముఖః కలహః పూర్వేణ వ్యాఖ్యాతః.

4. దూష్యమహామాత్రపుత్రమాత్మసంభావితం వా సత్రీ - "రాజపుత్రస్త్వం శత్రుభయాదిహ న్యస్తోఽసి" ఇత్యుపచరేత్. ప్రతిపన్నం రాజా

రహసి పూజయేత్- "ప్రాప్తయౌవరాజ్యకాలం త్వాం మహామాత్రభయా న్నాభిషి ఞ్చామి" ఇతి. తం సత్త్రీ మహామాత్రవధే నియోజయేత్. విక్రాన్తం తత్రైవ ఘాతయేత్ - "పితృఘాతకోఽయమ్" ఇతి.

వ్యా. 1. గూఢచారిచేత ప్రోత్సహించబడినవాడై దూష్యుడైన మహామాత్రుని సోదరుడు ఆతని దగ్గరికి వెళ్లి "ఆస్తిలో నా వాటా నా కియ్యి" అని అడగాలి. అతడు ఆ మహామాత్రుని ఇంటి ఎదుట ఇంటి ద్వారం దగ్గర రాత్రి నిద్రిస్తూన్నప్పుడు తీక్ష్ణుడు వానిని చంపివేసి "దాయం కావాలంటూన్నందుకు వీనిని చంపాను" అని చెప్పాలి. అప్పుడు రాజు చంపబడినవాని పక్షం చేరి దూష్యుడైన మహామాత్రుణ్ణి నిగ్రహించాలి.

2. లేదా దూష్యుడైన మహామాత్రుని దగ్గర (ఆతని మనుష్యుల రూపంలో) ఉన్న సత్రులు దాయం అడగడానికి వచ్చిన సోదరుణ్ణి "ఇలా అడిగినందుకు చంపేస్తాం; చూచుకో?" అని భయపెట్టాలి. వానిని రాత్రి చంపివేసి "దాయం అడిగినందుకు ఇలా చేశాను" అని చెప్పించి దూష్యుడైన మహామాత్రుణ్ణి నిగ్రహించాలి.

3. దూష్యులైన ఇద్దరు మహామాత్రులలో పుత్రునికి తండ్రి భార్యతోను, తండ్రికి పుత్రుని భార్యతోను, సోదరునకు సోదరుని భార్యతోను సంబంధం ఉన్నట్లయితే కాపటికుల (గూఢచారుల) ద్వారా వాళ్లకి కలహం కలిగించి పైన చెప్పి నట్లు ఇద్దరినీ చంపించాలి.

4. సత్రి (గూఢచారి) దూష్యమహామాత్రుని ఆత్మసంభావితుడైన (తానేదో చాల గొప్పవాడని అనుకొనే) పుత్రునితో- "వాస్తవంలో నువ్వు రాజపుత్రుడవు; శత్రువులవల్ల భయంచేత నిన్ను ఇక్కడ ఉంచారు" అని చెప్పి నమ్మించాలి. ఆ మాట నమ్మిన ఆతనిని రహస్యంగా రాజు గౌరవించాలి- "నీకు యౌవరాజ్యం ఇచ్చే వయస్సు వచ్చినా మహామాత్రునికి భయపడి యౌవరాజ్యాభిషిక్తుణ్ణి చేయలేదు" అని చెప్పాలి. సత్రి ఆ మహామాత్రుణ్ణి చంపడానికి ఆతనిని ప్రేరేపించాలి. మహామాత్రుణ్ణి అతడు చంపినవెంటనే "ఇతడు తండ్రిని చంపాడు" అని చాటించి వానిని అక్కడి కక్కడనే చంపించాలి.

మూ. 1. భిక్షుకీ వా దూష్యభార్యాం సాంవననికీభిః ఓషధీభిః సంవాస్య రసేనాతిసందధ్యాత్. ఇత్యాప్యప్రయోగః.

2. దూష్యమహామాత్రమ్ అటవీం పరగ్రామం వా హన్తుం కాన్తారవ్యవ హితే వా దేశే రాష్ట్రపాలమన్తపాలం వా స్థాపయితుం, నాగరస్థానం వా కుపిత మవగ్రహీతుమ్,సార్థాతివాహ్యం ప్రత్యన్తే వా సప్రత్యాదేశమాదాతుం, ఫల్గుబలం

తీక్ష్ణయుక్తం ప్రేషయేత్. రాత్రౌ దివా వా యుద్ధే ప్రవృత్తే తీక్ష్ణాః ప్రతిరోధకవ్యఞ్జనా వా హన్యుః - అభియోగే హతః ఇతి.

వ్యా. 1. భిక్షుకి (బౌద్ధసంన్యాసిని వేషంలో ఉన్న గూఢచారిణి) నా దగ్గర వశీకరణానికి ఉపయోగించే ఓషధులు ఉన్నా యని చెప్పి దూష్యమహామాత్రుని భార్యకు నమ్మకం కలిగించి విషప్రయోగం ద్వారా వాళ్లని మోసగించాలి. ఇది ఆప్యప్రయోగం - దగ్గర ఉన్న బంధువులు మొదలైనవాళ్లని ప్రయోగించడం.

2. అడవిలో ఉన్నవాళ్లని చంపడానికి గాని, శత్రునగరంలో ఉన్నవాళ్లని చంపడానికి గాని, దారి మధ్య మహారణ్యం ఉన్న దేశంలో రాష్ట్రపాలుణ్ణి లేదా అంతపాలుణ్ణి (సరిహద్దులు రక్షించేవానిని) స్థాపించడానికి గాని, నగరస్థానంలో (నగరాధిపతి అధీనంలో ఉన్న ప్రదేశంలో) తిరుగుబాటును అణచివేయడానికిగాని, సరిహద్దులో ఉన్న సప్రత్యాదేయం అయిన అనగా ఆక్రమించినా కూడా శత్రువుచేత అనాయాసంగా మళ్లీ ఆక్రమించడానికి వీలైన, సార్థాతివాహ్యాన్ని (వర్తకసంఘమార్గాన్ని) ఆక్రమించడానికి గాని తీక్ష్ణులు (ఘాతకులు) ఉన్న చిన్న సైన్యంతో పంపాలి. రాత్రి కాని పగలు గాని యుద్ధం జరిగినప్పుడు దొంగల వేషాలలో ఉన్న తీక్ష్ణులు ఆ దూష్యమహామాత్రుణ్ణి చంపివేసి యుద్ధంలో చనిపోయా డని చెప్పాలి.

మూ. 1. యాత్రావిహారగతో వా దూష్యమహామాత్రాన్ దర్శనాయాహ్వ యేత్. తే గూఢశస్త్రైః తీక్ష్ణైః సహ ప్రవిష్టాః మధ్యమకక్ష్యాయామ్ ఆత్మవిచయ మన్తః ప్రవేశనార్థం దద్యుః.తతో దౌవారికాభిగృహీతాః తీక్ష్ణాః "దూష్యప్రయుక్తాః స్మః" ఇతి బ్రూయుః. తే తదభివిఖ్యాప్య దూష్యాన్ హన్యుః. తీక్ష్ణస్థానే చాన్యే వధ్యాః.

2. బహిర్విహారగతో వా దూష్యాన్ ఆసన్నావాసాన్ పూజయేత్. తేషాం దేవీవ్యఞ్జనా వా దుఃస్త్రీ రాత్రావావాసేషు గృహ్యేతేతి సమానం పూర్వేణ.

3. దూష్యమహామాత్రం వా "సూదో భక్షకరో వా తే శోభనః" ఇతి స్తవేన భక్షభోజ్యం యాచేత, బహిర్వా క్వచిదధ్వగతః పానీయమ్. తదుభయం రసేన యోజయిత్వా ప్రతిస్వాదనే తావేవ ఉపయోజయేత్. తదభివిఖ్యాప్య 'రసదౌ' ఇతి ఘాతయేత్.

వ్యా. 1. లేదా రాజు విహార యాత్రకు వెళ్ళినప్పుడు దూష్యమహామాత్రులను

దర్శనం కోసం పిలిపించాలి. వాళ్లు రాజుగారి దర్శనంకోసం వచ్చినప్పుడు వాళ్లతో పాటు శస్త్రాలను రహస్యంగా దాచుకొని ఉన్న, (ముందుగానే రాజుచేత ఆ విధంగా చేయడానికి నిర్దేశించబడిన) తీక్ష్ణులు కూడా ప్రవేశించి మధ్యమకక్ష్యలో (హాలులో) లోపలికి (రాజు ఉన్న కక్ష్యలోనికి) వెళ్లడానికి ముందు తమ అన్వేషణను (ఆయుధాలు మొదలైనవి ఏవీ లేవు కదా అనే పరీక్షను (security check) చేయించుకోవాలి. అప్పుడు (వాళ్ల దగ్గర రహస్యంగా దాచిన ఆయుధాలు ఉండడంచేత) ద్వారరక్షకులు వాళ్లను పట్టుకొనగా "ఈ మహామాత్రులు మమ్మల్ని ప్రయోగించారు, అనగా రాజును చంపడం కోసం మమ్మల్ని ఏర్పరచారు" అని చెప్పాలి. ఆ విషయం ప్రకటించి ఆ దౌవారికులు దూష్య మహామాత్రులను చంపివేయాలి. తీక్ష్ణులకు బదులు మరెవరినైనా చంపాలి.

2. లేదా - విహారార్థం బైటకు వెళ్లిన రాజు దూష్యమహామాత్రులకు కూడ తన నివాసం దగ్గరనే నివాసం ఏర్పరచి గౌరవించాలి. రాత్రి దేవి (రాజభార్య) వేషంలో ఉన్న ఒక దుష్టస్త్రీ (కులట) వాళ్ల నివాసాలలో పట్టుబడాలి. తరవాత ఇతడు రాజభార్యాభిలాషి అని ప్రకటించి వెంటనే ఆ మహామాత్రుణ్ణి చంపివేయాలి.

3. లేదా - "మీ వంటవాడు లేదా భక్ష్యాలు తయారుచేసేవాడు భక్ష్యాలు చాలా బాగా చేస్తాడు" అని ఆ దూష్యమహామాత్రుణ్ణి ప్రశంసించి ఏవైనా భక్ష్యాలు పంపమని అతనిని అడగాలి. లేదా బైట ఎక్కడ నైనా మార్గమధ్యంలో ఉన్నప్పుడు పానీయం తెప్పించ మని అడగాలి. ఆ భక్ష్యభోజ్యాలలోను పానీయంలోను కూడ విషం కలిపి ముందు మీరు తీసికొని రుచిచూడండి అని అవి తీసికొని వచ్చినవాళ్లు రుచి చూచే టట్లు చెయ్యాలి. అప్పుడు "వీళ్లు విషం ఇచ్చారు" అని ప్రకటించి ఆ మహామాత్రుల్ని చంపించాలి.

మూ. 1. అభిచారశీలం వా సిద్ధవ్యఞ్జనో గోధాకూర్మకర్కటకూటానాం లక్షణ్యానామ్ అన్యతమప్రాశనేన మనోరథానవాప్స్యసీతి గ్రాహయేత్. ప్రతిపన్నం కర్మణి రసేన లోహముసలైర్వా ఘాతయేత్ కర్మవ్యాపదా హత ఇతి.

2. చికిత్సకవ్యఞ్జనో వా దౌరాత్మికమసాధ్యం వా వ్యాధిం దూష్యస్య స్థాపయిత్వా భైషజ్యాహారయోగేషు రసేనాతిసందధ్యాత్.

3. సూదారాలికవ్యఞ్జనా వా ప్రణిహితాః దూష్యం రసేన అతి సందధ్యుః. ఇత్యుపనిషత్ప్రతిషేధః.

వ్యా. 1. లేదా అభిచారం చేసే అలవా టున్న దూష్యమహామాత్రుని దగ్గరకు, మంత్రసిద్ధి ఉన్న సిద్ధుని వేషంలో ఉన్న గూఢచారి చేరి "మంచి లక్షణా లున్న, (శ్మశానాగ్నిలో హోమం చేయగా మిగిలిన) ఉడుమును గాని, తాబేలును గాని, పీతనుగాని, కొమ్ములు విరిగిన ఎద్దును గాని తిన్నట్లయితే నీ కోరిక లన్నీ తీరు తాయి'' అని చెప్పి ఆ పని చేయడానికి ఒప్పించాలి. అందుకు అంగీకరించిన వానిని విషంచేత గాని, ఇనప రోకళ్లచేత గాని (గాయాలు పైకి తెలియకుండా) చంపించి కర్మలో పొరబాటు చేయడంచేత మరణించా డని ప్రకటించాలి.

2. లేదా వైద్యుని వేషంలో ఉన్న గూఢచారి నీవు ఏదో చెడ్డ పని చేయడంచేత ఫలానా వ్యాధి వచ్చినది, లేదా చికిత్స చేయడానికి సాధ్యం కాని వ్యాధి వచ్చింది అని స్థాపించి మందులోను ఆహారంలోను విషం కలిపి చంపివేయాలి.

3. వంటవాళ్లుగా గాని, అరాలికులుగా (అన్నం వడ్డించేవాళ్లుగా) గాని చేరిన గూఢచారులు దూష్యుణ్ణి విషంచేత చంపివేయాలి. ఇది రహస్యమార్గాలలో దూష్యమహామాత్రులను అణచివేసే విధానం.

మూ. 1. ఉభయదూష్యప్రతిషేధస్తు - యత్ర దూష్యః ప్రతిషేద్ధవ్యః తత్ర దూష్యమేవ ఫల్గుబలతీక్ష్ణయుక్తం ప్రేషయేత్ - "గచ్ఛాముష్మిన్ రాష్ట్రే వా సైన్యముత్థాపయ హిరణ్యం వా, వల్లభాద్వా హిరణ్యమాహారయ, వల్లభకన్యాం వా ప్రసహ్యానయ. దుర్గసేతువణిక్పథశూన్యనివేశఖనిద్రవ్యహస్తివన కర్మణామన్యతమం వా కారయ, రాష్ట్రపాల్యమన్తపాల్యం వా యశ్చ త్వా ప్రతిషేధయేత్, న వా తే సాహాయ్యం దద్యాత్ స బన్ధవ్యః స్యాత్" ఇతి. తథైవ ఇతరేషాం ప్రేషయేత్- "అముష్యావినయః ప్రతిషేద్ధవ్యః'' ఇతి. తమేతేషు కలహస్థానేషు కర్మప్రతిఘాతేషు వా వివదమానం తీక్ష్ణాః శస్త్రం పాతయిత్వా ప్రచ్ఛన్నం హన్యుః. తేన దోషేణ ఇతరే నియన్తవ్యాః.

2. పురాణాం, గ్రామాణాం, కులానాం వా దూష్యాణాం సీమాక్షేత్రఖలవేశ్మమర్యాదాసు ద్రవ్యోపకరణసస్యవాహనహింసాసు ప్రేక్షాకృత్యోత్సవేషు వా సముత్పన్నే కలహే తీక్ష్ణైః ఉత్పాదితే వా తీక్ష్ణాః శస్త్రం పాతయిత్వా బ్రూయుః- "ఏవం క్రియన్తే యేఽమునా కలహాయన్తే" ఇతి. తేన దోషేణ ఇతరే నియన్తవ్యాః.

వ్యా. 1. ఇద్దరు దూష్యుల్ని ఒకే ప్రయత్నంచేత అణచివేసే విధానం ఎట్లనగా- ఒక దూష్యుణ్ణి అణిచివేయవలసి ఉన్న దేశానికి తక్కువ సేన, కొంతమంది తీక్ష్ణులు ఉన్న మరొక దూష్యుణ్ణి ఇలా చెప్పి పంపాలి-"నువ్వు వెళ్లి, ఫలానా దుర్గంలో లేదా ఫలానా రాష్ట్రంలో, సైన్యాన్ని సమ కూర్చు; లేదా ధనం వసూలు చెయ్యి. అక్కడ ఉన్న వల్లభునినుంచి (అధ్యక్షునినుంచి - గ.శా; ఇష్టుడైనవానినుండి - కాంగ్లే) ధనం వసూలు చెయ్యి. లేదా వాని కుమార్తెను బలాత్కారంగా పట్టుకొని తీసికొని రా. లేదా అక్కడ దుర్గం గాని, సేతువు గాని, వర్తకులకు మార్గం గాని, శూన్యప్రదేశంలో గృహావాసాదినిర్మాణం కాని, గనులలో పని గాని, గజవనంలో చేయవలసిన కర్మ గాని, చేయించు, లేదా రాష్ట్రపాలనకర్మగాని, అంతపాలనకర్మ (సరిహద్దుల రక్షణం) గాని చేయించు. ఈ పనులు నువ్వు చేస్తున్నప్పుడు నీ కెవరైనా అడ్డు తగిలినా, నీకు సహాయపడకపోయినా వానిని బంధించాలి." అదే విధంగా అక్కడ ఉన్న దూష్యమహామాత్రునికి- "ఫలానావాడు మీ ప్రాంతంలో ఏమైనా అవినయం (చేయరాని పని) చేస్తే వానిని నువ్వు అడ్డుకోవాలి" అని ఆజ్ఞ పంపాలి. అప్పుడు కలహానికి హేతువులైన పనులు జరుగుతున్నప్పుడు, లేదా పనులకు అఘాతం కలిగినప్పుడు కలహిస్తున్న దూష్యమహామాత్రుణ్ణి తీక్ష్ణులు రహస్యంగా శస్త్రప్రయోగం చేసి చంపివేయాలి. ఈవిధమైన అపరాధం చేసినందుకు మిగిలిన వాళ్లని (అక్కడ ఉన్న దూష్యుల్ని) కూడా చంపివేయాలి.

2. దూష్యులైన (రాజ్యవిరోధులైన) పట్టణాలలో గాని, గ్రామాలలో గాని, కుటుంబాలలో గాని పురాదుల సరిహద్దులు, పొలాలు, కళ్లాలు, ఇళ్లు మొదలైనవాటి సరిహద్దులు వీటి విషయంలోను, ద్రవ్యాలు, సాధనాలు(పనిముట్లు మొదలైనవి), సస్యాలు, వాహనాలు, వీటికి హింస కలిగినప్పుడు, నాటకాది ప్రదర్శనలలోను, వివాహోద్యుత్సవాలలోను కలహాలు కలిగినప్పుడు, లేదా తీక్ష్ణులు కలహాలు పుట్టించినప్పుడు ఆ తీక్ష్ణులు శస్త్రప్రయోగం చేసి కొందరిని చంపివేసి (దూష్యుల పక్షాన ఉండి చంపివేసి నట్లు అభినయిస్తూ) "ఇతనితో కలహం పెట్టుకొన్నవారిని ఇలాగే చేస్తాం" అని ప్రకటించాలి. ఆ విధంగా ఇతరులను చంపించా రనే నేరానికి మిగిలిన దూష్యుల్ని రాజు నిగ్రహించాలి.

మూ. 1. యేషాం వా దూష్యాణాం జాతమూలాః కలహాః తేషాం క్షేత్రఖలవేశ్మాని ఆదీపయిత్వా బన్ధుసంబన్ధిషు వాహనేషు వా తీక్ష్ణాః శస్త్రం పాతయిత్వా తథైవ బ్రూయుః- "అమునా ప్రయుక్తాః స్మః" ఇతి. తేన దోషేణ

ఇతరే నియన్తవ్యాః.

2. దుర్గరాష్ట్రదూష్యాన్ వా సత్రిణః పరస్పరస్యావేశనికాన్ కారయేయుః. తత్ర రసదాః రసం దద్యుః, తేన దోషేణ ఇతరే నియన్తవ్యాః

3. భిక్షుకీ వా దూష్యరాష్ట్రముఖ్యం దూష్యరాష్ట్రముఖ్యస్య భార్యా, స్నుషా, దుహితా వా కామయత ఇత్యుపజపేత్. ప్రతిపన్నస్య ఆభరణమాదాయ స్వామినే దర్శయేత్- "అసౌ తే ముఖ్యో యౌవనోత్సిక్తో భార్యాం, స్నుషాం, దుహితరం వాభిమన్యతే" ఇతి. తయోః కలహో రాత్రౌ -ఇతి సమానమ్.

వ్యా. 1. ఏ దూష్యుల (రాజద్రోహుల) కలహాలకు ఏ పంట భూములు, కళ్లాలు, ఇళ్లు మూలకారణంగా ఉంటాయో వాళ్ల ఆ క్షేత్రాదులను అగ్నిచేత దహించి లేదా వాళ్ల బంధువులను శస్త్రాలచేత చంపి తీక్ష్ణులు "ఈ పనిచేయడానికి వీళ్లచేత ప్రోత్సహింపబడ్డాము" అని చెప్పాలి. ఆ దోషంచేత ఇతరదూష్యులను నిగ్రహించాలి.

2. లేదా సత్రులు(గూఢపురుషులు) దుర్గాలలోను రాష్ట్రంలోను ఉన్న రాజద్రోహులైన మహామాత్రులను పరస్పరం అతిథులుగా అయే టట్లు ఏర్పాటు చేయ్యాలి. విషం ఇచ్చేవాళ్లు అక్కడ అతిథులకు విషం పెట్టాలి. ఆ నేరానికి ఇతరదూష్యుల్ని నిగ్రహించాలి.

3. లేదా భిక్షుకి(సంన్యాసిని) దూష్యుడైన ఒక రాష్ట్రముఖ్యునివద్ద చేరి (మరొక దూష్యరాష్ట్రముఖ్యుణ్ణి గూర్చి చెపుతూ) "ఫలానా రాష్ట్రముఖ్యుని భార్య లేదా కోడలు, లేదా కూతురు నిన్ను కోరుతున్నది" అని రహస్యంగా చెప్పి నమ్మించాలి. అతడు నమ్మి అంగీకరించిన తరవాత అతడిచ్చిన (తనను కామించే స్త్రీకి ఇమ్మని ఇచ్చిన) ఆభరణాలు ఆ ప్రభువుకు (మొదటి దూష్యరాష్ట్రముఖ్యునికి) చూపించి- "యౌవనంతో గర్వించి ఉన్న ఆ రాష్ట్రముఖ్యుడు నీ భార్యను, నీ కోడలిని, నీ కూతురును కోరుచున్నాడు" అని చెప్పాలి. వాళ్లకి రాత్రి కలహం ఏర్పడిన తరవాత - మిగిలినది పైన చెప్పినట్లే- తీక్ష్ణులు ఒకనిని చంపగా అలా చంపించిన నేరానికి రాజు రెండవవానిని చంపించాలి.

మూ. 1. దూష్యదణ్డోపనతేషు తు యువరాజః సేనాపతిర్వా కించిద పకృత్య అపక్రాన్తో విక్రమేత. తతో రాజా దూష్యదణ్డోపనతానేవ ప్రేషయేత్ ఫల్గుబలతీక్ష్ణయుక్తా నితి సమానాః సర్వ ఏవ యోగాః. తేషాం చ పుత్రేషు అనుక్షిపత్సు యో నిర్వికారః స పితృదాయం లభేత. ఏవమస్య

పుత్రపౌత్రాననువర్తతే రాజ్యమపాస్తపురుషదోషమితి.

2. శ్లో. స్వపక్షే పరపక్షే వా తూష్ణీం దణ్డం ప్రయోజయేత్,
ఆయత్యాం చ తదాత్వే చ క్షమావానవిశఙ్కితః.

ఇతి కౌటలీయార్థశాస్త్రే యోగవృత్తే పఞ్చమాధికరణే ప్రథమోఽధ్యాయః, ఆదిత ఏకనవతితమః.

వ్యా. 1. దూష్యులైన (రాజవిద్రోహులైన) సామంతాదులు తమ సైన్యంతో లొంగిపోయినప్పుడు, యువరాజు గాని, సేనాపతి గాని కొంచెం అపకారం చేసి, దూరంగా వెళ్లిపోయి (రాజు విషయంలోను లొంగిపోయిన సామంతాదుల విషయంలోను) విరోధం వహించి ప్రవర్తించాలి. అప్పుడు రాజు వాని (రాజకుమారుని లేదా సేనాపతిని) లొంగదీసికొనవలసినదిగా దూష్యదండోపనతులనే (సైన్యంతో పాటు లొంగిపోయిన రాజద్రోహులైన సామంతాదులనే) చిన్న సైన్యంతో, వాళ్లలో కొంతమంది తీక్ష్ణులను కూడ చేర్చి, పంపాలి. తరవాత పద్ధతు లన్నీ వెనుక చెప్పినట్లే. అనగా తీక్ష్ణులు దూష్యుల్ని రహస్యంగా చంపివేయాలి. ఆ దోషం మరొకరిమీద మోపి వాళ్లని నిగ్రహించడం మొదలైనవి వెనుక చెప్పినట్లే. అలా చంపబడినవాళ్ల పుత్రులలో చావగా మిగిలిన వాళ్లలో వికారం లేని వానికి (రాజుకు అనుకూలంగా ఉంటా డనుకొనేవానికి) పితృదాయం(తండ్రి ఆస్తి- రాజ్యం) లభించాలి. ఏ రాజు ఈ విధంగా తనకు ఎదురుతిరుగు తారనే భయం ఉన్న మహామాత్రాదులను రహస్యోపాయాలతో రూపుమాపుతాడో అతని రాజ్యంలో పురుషదోషా లన్నీ (పురుషులవల్ల కలిగే ఆపద లన్నీ నశించి) ఆ రాజ్యం పుత్రులకూ పౌత్రులకూ కూడ సంక్రమిస్తుంది.

2. రాజు తత్కాలమందూ, భవిష్యత్తులోనూ కూడ ఓర్పును ప్రదర్శిస్తూ, ఏ మాత్రమూ సందేహించకుండా తన పక్షంవాళ్ల విషయంలోను, పరపక్షంవాళ్ల విషయంలోనూ కూడ రహస్యదండం ప్రయోగించాలి.

"బాలానందిని" అను కౌటిలీయార్థశాస్త్రాంధ్రవ్యాఖ్యానంలో యోగవృత్తం అనే పంచమాధికరణంలో దాండకర్మికం అను ప్రథమాధ్యాయం, ప్రారంభంనుంచి తొంభైఒకటవ అధ్యాయం సమాప్తం.

# అథ ద్వితీయోఽధ్యాయః

## నవతితమం ప్రకరణమ్ - కోశాభిసంహరణమ్

## (ధనాగారాన్ని నింపుతూ ఉండడం)

మూ. 1. కోశమకోశః ప్రత్యుత్పన్నార్థకృచ్ఛ్రః సంగృహ్ణీయాత్.

2. జనపదం మహాన్తమల్పప్రమాణం వా దేవమాతృకం ప్రభూతధాన్యం ధాన్యస్యాంశం తృతీయం చతుర్థం వా యాచేత; యథాసారమధ్యమవరం వా.

3. దుర్గసేతుకర్మవణిక్పథశూన్యనివేశఖనిద్రవ్యహస్తివనకర్మోపకారిణం ప్రత్యన్తమ్, అల్పప్రమాణం వా న యాచేత.

4. ధాన్యపశుహిరణ్యాది నివిశమానాయ దద్యాత్. చతుర్థమంశం ధాన్యానాం బీజభక్తశుద్ధం చ హిరణ్యేన క్రీణీయాత్.

వ్యా.1. కోశం క్షీణించిన రాజు ఎదురుచూడని ఆర్థికమైన ఇబ్బందులు వచ్చినప్పుడు కోశాన్ని పెంచడానికి ప్రయత్నించాలి.

2. దేవమాతృకం కాని, అనగా వర్షాలమీదనే ఆధారపడినది కాని, అధికమైన పంటలు పండే జనపదంనుంచి, అది పెద్దదైనా చిన్నదైనా, మూడవ భాగం గాని, నాల్గవ భాగం గాని ధాన్యం అడిగి తీసికోవాలి. మధ్యరకం జనపదంనుంచి, తక్కువరకమైన జనపదంనుంచి దాని శక్తిని అనుసరించి ధాన్యం అడిగి తీసికోవాలి.

3. దుర్గనిర్మాణంలోను, సేతునిర్మాణంలోను, వర్తకుల మార్గం నిర్మించడంలోను, శూన్యప్రదేశాలలోను, మనుష్యావాసనిర్మాణంలోను, గనుల పనులలోను, ఇతర ద్రవ్యాలు సమకూర్చే పనిలోను, గజవనసంరక్షణకర్మలోను ఉపకరిస్తూన్న సరిహద్దులలోని గ్రామంనుంచి గాని, చిన్నగ్రామంనుంచి గాని ధాన్యాదులు అడగకూడదు.

4. కొత్త జనవాసం నిర్మిస్తూన్నవానికి రాజు ధాన్యం, పశువులు, ధనం మొదలైనవి ఇవ్వాలి. అలాంటివాని దగ్గర నుండి విత్తనాలకు, ఆహారానికి కావలసినది పోగా మిగిలిన ధాన్యాలలో నాల్గవ వంతు కొని తీసికోవాలి.

మూ. 1. అరణ్యజాతం శ్రోత్రియస్వం చ పరిహరేత్. తదప్యనుగ్రహేణ క్రీణీయాత్.

2. తస్యాకరణే సమాహర్తృపురుషాః గ్రీష్మే కర్షకాణాముద్వాపం కారయేయుః. ప్రమాదావస్కన్నస్యాత్యయం ద్విగుణముదాహరన్తో బీజకాలే బీజలేఖ్యం కుర్యుః. నిష్పన్నే హరితపక్వాదానం వారయేయుః, అన్యత్ర శాకకటభఙ్గముష్టిభ్యామ్- దేవపితృపూజాదానార్థం గవార్థం వా. భిక్షుకగ్రామభృత కార్థం చ రాశిమూలం పరిహరేయుః.

3. స్వసస్యాపహారిణః ప్రతిపాతః అష్టగుణః. పరసస్యాపహారిణః పఞ్చాశద్గుణః, సీతాత్యయః స్వవర్గస్య, బాహ్యస్య తు వధః.

వ్యా. 1. అరణ్యంలో పండిన ధాన్యాలు, వేదాధ్యయనం చేసిన బ్రాహ్మణుని ధాన్యం పరిహరించాలి; అవి తీసికొనగూడదు. వాళ్లకు ఏదైనా ప్రయోజనం ఉంటుం దంటే ధనం ఇచ్చి కొనాలి.

2. పైన చెప్పిన విధంగా చేయకపోతే లేదా పైన చెప్పిన ఉపాయాలు ఫలించకపోతే సమాహర్త మనుష్యులు (గోపులు, స్థానికులు) గ్రీష్మఋతువులో వ్యవసాయదారులకు ఉపకరించడానికి భూమి దున్ని విత్తనాలు చల్లడానికి సిద్ధం చెయ్యాలి. విత్తనాలు చల్లే కాలంలో - కర్షకుల అజాగర్తచేత నష్టం కలిగితే రెట్టింపు దండం(పెనాల్టీ) విధించబడుతుంది అని ఉదాహరిస్తూ బీజాలకు సంబంధించిన కాగితాలు వ్రాయాలి. పంట వచ్చిన తరవాత పచ్చిదిగా ఉన్నదానిని గాని, పండినదానిని గాని వాళ్లు (కర్షకులు) తీసికొనకుండా నివారించాలి. దేవపూజకొరకు, పితృకార్యంకొరకు, ఆవుకొరకు గుప్పెడు కూరగాయలు, చేతిలో ఇమిడే సస్యమూ తీసికొన్నా అనుమతించాలి. ధాన్యరాశి మొదట్లో మిగిలిన పోయిన దానిని భిక్షుకులకొరకు, గ్రామం నౌకర్లకొరకు విడిచిపెట్టాలి.

3. తాను దున్నిన భూమినుంచి సస్యం అపహరించినవానికి, అపహరించినదానికి ఎనిమిది రెట్లు దండం. పరులు దున్నిన భూమినుంచి సస్యం అపహరించినవానికి యాభైరెట్లు సీతాత్యయం (వ్యవసాయం భూమినుంచి హరించినందుకు దండం - పెనాల్టీ); ఇది అలా అపహరించినవాడు అదే వర్గానికి (class) చెందినవాడైతే దండం. బైటనుండి వచ్చి అపహరిస్తే వానికి మరణదండం.

మూ.1. చతుర్థమంశం ధాన్యానాం షష్ఠం వన్యానాం తూలలాక్షాక్షౌమ

వల్కకార్పాసరోమకౌశేయకౌషధగన్ధపుష్పఫలశాకపణ్యానాం కాష్ఠవేణుమాంస వల్లూరాణాం చ గృహ్ణీయుః. దన్తాజినస్యార్ధమ్, అనిసృష్టం విక్రీణానస్య పూర్వః సాహసదణ్డః. ఇతి కర్షకేషు ప్రణయః.

2. సువర్ణరజతవజ్రమణిముక్తాప్రవాళాశ్వహస్తిపణ్యాః పఞ్చాశత్కరాః. సూత్రవస్త్రతామ్రవృత్తకంసగన్ధభైషజ్యశీధుపణ్యాః చత్వారింశత్కరాః. ధాన్యరసలోహపణ్యాః శకటవ్యవహారిణశ్చ త్రింశత్కరాః. కాచవ్యవహారిణో మహాకారవశ్చ వింశతికరాః. క్షుద్రకారవో బన్ధకీపోషకాశ్చ దశకరాః. కాష్ఠవేణు పాషాణమృద్భాణ్డపక్వాన్నహరితపణ్యాః పఞ్చకరాః. కుశీలవా రూపాజీవాశ్చ వేతనార్ధం దద్యుః. హిరణ్యకరం కర్మణ్యానాహారయేయుః. న చైషాం కంచిద పరాధం పరిహరేయుః. తే హ్యపరగృహీతమభినీయ విక్రీణీరన్ ఇతి వ్యవహారిషు ప్రణయః.

వ్యా. 1. ధాన్యాలలో నాల్గవ భాగం, అరణ్యంలో లభించే వస్తువులు లేదా ధాన్యాలలో ఆరవ భాగం తీసికొనాలి. దూది, లక్క, పట్టువస్త్రం, చెట్ల నారబట్టలు, నూలుబట్టలు, ఉన్నిబట్టలు, పట్టుపురుగులనుండి తీసిన పట్టుతో నేసిన బట్టలు, ఓషధులు, గంధద్రవ్యాలు, పుష్పాలు, ఫలాలు, కూరలు - ఈ పణ్యాలలోను, కఱ్ఱలు, వెదుళ్ళు, మాంసం, శుష్కమాంసం- ఈ పణ్యాలలోను ఆరవ వంతు తీసికొనాలి. దంతాలలోను, మృగచర్మాలలోను సగం తీసికోవాలి. అనుమతి లేకుండా పై వస్తువులు అమ్ముతున్నవానికి పూర్వసాహసదండం. ఇది వ్యవసాయదారులనుండి అడిగి పన్ను గ్రహించవలసిన విధానం.

2. బంగారం, వెండి, వజ్రాలు, మణులు, ముత్యాలు, పగడాలు, గుఱ్ఱాలు, ఏనుగులు, అమ్మేవాళ్లు యాభైయవ వంతు పన్నుగా చెల్లించాలి. నూలు, వస్త్రాలు, రాగి, ఉక్కు, కంచు, సుగంధద్రవ్యాలు, వైద్యానికి ఉపయోగించే ఔషధాదులు, మద్యం అమ్మేవాళ్లు నలభైయవ వంతు పన్నుగా కట్టాలి. ధాన్యం, రసాలు (నెయ్యి మొ.), లోహాలు అమ్మేవాళ్లు బండ్లమీద సామానులు వేసికొని వెళ్లి వర్తకం చేసేవాళ్లు ముప్పైయవ వంతు పన్నుగా కట్టాలి. గాజు వర్తకం చేసేవాళ్లు పెద్ద పనివాళ్లు (బంగారం పని, ఓడలు నిర్మించడం మొదలైన పనులు చేసేవాళ్లు) ఇరవైయవ వంతు పన్నుగా చెల్లించాలి. చిన్న చేతిపనివాళ్లు, కులటలను పోషించేవాళ్లు పదవ వంతు పన్ను చెల్లించాలి. కఱ్ఱ, వెదుళ్లు, ఱాళ్లు, మట్టి పాత్రలు, వండిన ఆహారపదార్థాలు, పచ్చని వస్తువులు(కూరగాయలు)

అమ్మేవాళ్లు ఐదవవంతు పన్నుగా చెల్లించాలి. కుశీలవులు (నటనర్తకాదులు) వేశ్యలు తమకు లభించిన వేతనంలో సగం పన్నుగా చెల్లించాలి. కుశీలవులు (నటనర్తకాదులు) వేశ్యలు తమకు లభించిన వేతనంలో సగం పన్నుగా చెల్లించాలి. పనిలో నేర్పుగలవాళ్ల దగ్గరనుండి పన్ను ధనరూపంలో తీసికోవాలి. వీళ్లు ఏ చిన్న అపరాధం చేసినా విడవకూడదు. ఎందువల్ల ననగా వీళ్లు ఇతరుల వస్తువులు అని చెప్పి అమ్ముతూంటారు. వర్తకులను అడిగి పన్ను తీసుకొనే పద్ధతి ఇది.

మూ. 1. కుక్కుటసూకరమర్ధం దద్యాత్ క్షుద్రపశవః షడ్భాగమ్. గోమహిషాశ్వతరఖరోష్ట్రాశ్చ దశభాగమ్. బన్ధకీపోషకాః రాజప్రేష్యాభిః పరమరూప యౌవనాభిః కోశం సంహరేయుః. ఇతి యోనిపోషకేషు ప్రణయః.

2. సకృదేవ, న ద్విః ప్రయోజ్యః. తస్యాకరణే వా సమాహర్తా కార్యమపదిశ్య పౌరజానపదాన్ భిక్షేత. యోగపురుషాశ్చాత్ర పూర్వమతిమాత్రం దద్యుః. ఏతేన ప్రదేశేన రాజా పౌరజానపదాన్ భిక్షేత. కాపటికాశ్చ ఏనానల్పం ప్రయచ్ఛతః కుత్సయేయుః. సారతో వా హిరణ్యమాఢ్యాన్ యాచేత. యథోపకారం వా స్వవశా వా యదుపహరేయుః, స్థానచ్ఛత్రవేష్టనవిభూషాశ్చైషాం హిరణ్యేన ప్రయచ్ఛేత్. పాషణ్డసంఘద్రవ్యమ్ అశ్రోత్రియభోగ్యం దేవద్రవ్యం వా కృత్యకరాః ప్రేతస్య దగ్ధగృహస్య వా హస్తే న్యస్తమిత్యుపహరేయుః.

వ్యా. 1. కోళ్లు, పందులు పెంచేవాళ్లు సగం పన్నుగా ఇవ్వాలి. చిన్న పశువులను పెంచేవాళ్లు ఆరవ వంతు ఇవ్వాలి. గోవులు, మహిషాలు, కంచరగాడిదలు, గాడిదలు, ఒంటెలు పెంచేవాళ్లు పదవ వంతు ఇవ్వాలి. కులటలను పోషించేవాళ్లు మంచి రూపం, యౌవనం ఉన్న, రాజపరిచారికలుగా పనిచేసే స్త్రీలతో కోశాన్ని నింపాలి. ఇది ప్రాణులను పోషించేవాళ్లని అడిగి పన్ను తీసుకొనే పద్ధతి.

2. ఈ ప్రణయకరం ఒకే మాటు విధించాలి. గాని అనేకపర్యాయాలు విధించకూడదు. ఈ విధంగా పన్నులు విధించినా పనులు జరగకపోతే సమాహర్త (administrator) ఫలానా పని చేయవలసి ఉందని చెప్పి పౌరులనూ, జానపదులనూ ధనం ఇమ్మని అడగాలి. యోగపురుషులు (ముందుగానే మాటలాడుకొని ఉంచుకొన్న గూఢచారులవంటి వాళ్లు) ఆ పని నిమిత్తం “ఇదిగో మేం ఇచ్చే చందా” అని చెప్పి ముందుగా పెద్ద మొత్తాలు చందాలుగా ఇవ్వాలి. “ఇదిగో వీళ్లు ఇంత ఇచ్చారు” అని

చెప్పి రాజు పౌరులను జానపదులను ధనం ఇమ్మని అడగాలి. కాపటికులు (రాజుచేతనే నియుక్తులైన కొందరు కపటవేషధారులు) తక్కువ ధనం ఇచ్చేవాళ్లని "ఇదేమిటి! మీవంటి వాళ్లు కూడ ఇంతేనా ఇచ్చేది?" అని నిందించాలి. లేదా రాజు ధనవంతులను పిలిపించి వాళ్ల శక్తిని పట్టి ధనం అడగాలి. లేదా వాళ్లకి రాజువల్ల లభించే లాభాన్ని పట్టి లేదా వాళ్ల శక్తిని అనుసరించి ఎవరు ఎంత ధనం ఇస్తే అంత ధనం తీసుకోవాలి. రాజు ధనం తీసుకొని ధనికులకు ఏదైనా అధికారం, శ్వేతచ్ఛత్రం, శిరోవేష్టనం, అలంకారాలు ఇస్తూ ఉండాలి. కృత్యకరులు (రాజకృత్యాలు చేసే అధికారులు) పాషండసంఘాల ద్రవ్యము(కాంగ్లే) పాషండుల ద్రవ్యము సంఘాల ద్రవ్యమూ (గ.శా.) వేదపండితులచేత అనుభవించబడని దేవతాద్రవ్యమూ, "ఇది ఎవని చేతిలో న్యాసంగా ఉంచబడినదో అతడు మరణించినాడు లేదా అతని గృహం కాలిపోయినది" అని చెప్పి తీసికొనివచ్చి రాజుకు ఇవ్వాలి.

మూ. 1. దేవతాధ్యక్షః దుర్గరాష్ట్రదేవతానాం యథాస్వమ్ ఏకస్థం కోశం కుర్యాత్. తథైవ చాహరేత్. దైవతచైత్యం సిద్ధపుణ్యస్థానభౌమవాదికం వా రాత్రౌ ఉత్థాప్య యాత్రాసమాజాభ్యామ్ ఆజీవేత్. చైత్యోపవనవృక్షేణ వా దేవతాభిగమనమ్ ఆర్తవపుష్పఫలయుక్తేన ఖ్యాపయేత్. మనుష్యకరం వా వృక్షే రక్షోభయం ప్రరూపయిత్వా సిద్ధవ్యఞ్జనాః పౌరజానపదానాం హిరణ్యేన ప్రతికుర్యుః. సురుఙ్గాయుక్తే వా కూపే నాగమనియతశిరస్కం హిరణ్యోపహారేణ దర్శయేత్, నాగప్రతిమాయామన్తశ్ఛన్నాయామ్. చైత్యచ్ఛిద్రే వల్మీకచ్ఛిద్రే వా సర్పదర్శనే ఆహారేణ ప్రతిబద్ధసంజ్ఞం కృత్వా శ్రద్దధానానాం దర్శయేత్. అశ్రద్ధధానానామ్ ఆచమనప్రోక్షణేషు రసమవపాయ్య దేవతాభిశాపం బ్రూయాత్. అభిత్యక్తం వా దంశయిత్వా యోగదర్శనప్రతీకారేణ వా కోశాభిసంహరణం కుర్యాత్.

2. వైదేహకవ్యఞ్జనో వా ప్రభూతపణ్యాన్తేవాసీ వ్యవహరేత. స యదా పణ్యమూల్యే నిక్షేపప్రయోగైః ఉపచితః స్యాత్ తదైనం రాత్రౌ మోషయేత్.

వ్యా. 1. దేవతాధ్యక్షుడు (Commissioner of Temples) దుర్గంలోను రాష్ట్రంలోను ఉన్న దేవతల (దేవాలయాల) ధనాన్ని వేరు వేరుగా ఒకే చోట ఉండేటట్లు

చెయ్యాలి. అదే విధంగా (ఒకే చోట చేర్చిన రెండు మొత్తాల్నీ) రాజుకు సమర్పించాలి. రాత్రికి రాత్రి ఏదైనా ఒక దైవతచైత్యం (దేవతాస్థానమైన వేదిక మొదలైనది) గాని, ప్రసిద్ధమైన పుణ్యప్రదేశంలో భూమిని బ్రద్దలుకొట్టుకొని వచ్చిన లింగం ఇత్యాది వాదాలు (ప్రవాదాలు) గల స్థానం గాని (భౌమవాదికం) బయలుదేరదీసి (ఇక్కడ హటాత్తుగా ఒక దేవతాస్థానమైన వేదిక ఆవిర్భవించింది; ఇక్కడ శివలింగం భూమిని బ్రద్దలుకొట్టుకొని వచ్చినది అనే పుకారు పుట్టించి) జాతరలు, జనసమాజాలు ఏర్పరచి దానివల్ల వచ్చే ధనంమీద జీవించాలి (ధనం సంపాదించాలి). కాలం కాని కాలంలో పుష్పాలు ఫలాలు వచ్చిన చైత్యం దగ్గర ఉన్న ఉద్యానంలోని వృక్షం చూపించి ఆ వృక్షంమీద దేవత నివసిస్తూన్నది అని అందరికీ తెలపాలి. మంత్రసిద్ధుల వేషంలో ఉన్నవాళ్లు "ఈ చెట్టు మీద రాక్షసు డున్నాడు; రోజు ఒక మనిషిని పన్నుగా (భక్ష్యంగా) అడుగుతున్నాడు" అని భయం పుట్టించి పౌరులనుండి జానపదులనుండి ధనం తీసుకొని ఆ ఆపదకు ప్రతిక్రియ చెయ్యాలి. ప్రక్క సురంగం ఉన్న నూతిలో రహస్యంగా ఒక నాగప్రతిమను ఉంచి రెండు లేదా అధికమైన తలలు గల సర్పాన్ని చూపి అలా చూచినందుకు ధనం వసూలు చెయ్యాలి. చైత్యం గోడ రంధ్రంలో గాని, పుట్టలో గాని ఆకస్మికంగా సర్పం కనబడిన నప్పుడు దానికి ఏదో మత్తు కలిగించే ఆహారం ఇచ్చి కదలకుండా చేసి నమ్మేవాళ్లకు చూపాలి. (తన ప్రభావం అన్నట్లు చెప్పి ధనం తీసుకోవాలి). నమ్మనివాళ్లకి ఆచమనంలోను, తలమీద చల్లే నీళ్లలోను విషం కలిపి తాగించి "చూచారా, దేవతల శాపంచేత మీకు ఇలా జరిగింది" అని చెప్పాలి; లేదా వధించతగినవానిని పాముచేత కరిపించి దేవతాశాపంవల్ల ఇలా జరిగింది అని చెప్పాలి. లేదా ఏవైనా ఉత్పాతాలు (ఆపదలు రాబోయే సూచనలు) కనబడి నప్పుడు వాటికి ప్రతిక్రియలు చేయించి కోశం నింపాలి.

2. వర్తకుని వేషంలో ఉన్న గూఢచారి అత్యధికమైన పణ్యవస్తువులతోను, చాలామంది కర్మచారులతోను వర్తకం నడిపించాలి. అతడు చాలా పెద్ద వర్తకు డని నమ్మి ప్రజలు అతని దగ్గర రాబోయే పణ్యవస్తువుల మూల్యంగా ధనం ఉంచగా అతని దగ్గర ప్రజల ధనం బాగా చేరినప్పుడు రాత్రి అతని ఇంట్లో దొంగతనం చేయించాలి. (ప్రజల ధనం అంతా అపహరించాలి).

మూ.1. ఏతేన రూపదర్శకః సువర్ణకారశ్చ వ్యాఖ్యాతౌ.

2. వైదేహకవ్యఞ్జనో వా ప్రఖ్యాతవ్యవహారః ప్రహవణనిమిత్తం

యాచితకమ్ అవక్రీతకం వా రూప్యసువర్ణభాణ్డమనేకం గృహ్ణీయాత్. సమాజే వా సర్వపణ్యసందోహేన ప్రభూతం హిరణ్యసువర్ణమృణం గృహ్ణీయాత్, ప్రతిభాణ్డమూల్యం చ. తదుభయం రాత్రౌ మోషయేత్.

3. సాధ్వీవ్యఞ్జనాభిః స్త్రీభిః దూష్యానున్మాదయిత్వా, తాసామేవ వేశ్మస్వభిగృహ్య సర్వస్వాన్యాహరేయుః.

4. దూష్యకుల్యానాం వా వివాదే ప్రత్యుత్పన్నే రసదాః ప్రణిహితాః రసం దద్యుః. తేన దోషేణ ఇతరే పర్యాదాతవ్యాః.

వ్యా. 1. దీనిచేత రూపదర్శకుడు (నాణాలు పరీక్షించేవాడు), సువర్ణకారుడు వ్యాఖ్యానింపబడినారు. అనగా పరీక్షించడంకోసం నాణాలు తన దగ్గర పోగుచేసికొని ఉన్న రూపకదర్శకుణ్ణి, ఆభరణాదిరచనకొరకు సువర్ణం తీసికొని ఉన్న సువర్ణకారుణ్ణి మోసగించి రాత్రి వాళ్ల ధనం అపహరించాలి. అని అర్థం.

2. వర్తకుని వేషంలో ఉన్న, మంచి వ్యాపారం ఉన్నవాడుగా ప్రసిద్ధి పొందిన గూఢచారి ప్రహవణం (తుష్టిభోజనం feast on festive occasions) కొరకు చాల ఎక్కువగా వెండి సామాను, బంగారం సామాను ఎరువు తీసికోవాలి లేదా అద్దెకు తీసికోవాలి. లేదా మనుష్యుల సమాజంలో తన దగ్గర పణ్యవస్తువు లన్నీ ప్రదర్శించి ప్రజలనుంచి ఋణంగా ధనమూ, బంగారమూ తీసికోవాలి. తాను వాళ్లకి మరునాడు ఇవ్వబోయే వస్తువుల ఖరీదు కూడా తీసికోవాలి. ఆ రెండు రకాలైన ధనమూ కూడ రాత్రి అపహరింపచేయాలి. దొంగలు పడి అపహరించి నట్లు నాటకం ఆడి కోశానికి చేర్చాలి. అని అర్థం.

3. ఉత్తమస్త్రీల వేషాలలో ఉన్న స్త్రీలచేత దూష్యులకు (రాజ్యద్రోహులకు) అత్యధికమైన అనురాగం కలిగించి, వాళ్లను ఆ స్త్రీల గృహాలలో పట్టుకొని వాళ్ల సర్వస్వం హరించాలి.

4. రాజద్రోహుల కుటుంబాలకు చెందినవాళ్ల మధ్య ఏదైనా వివాదం ఏర్పడి నప్పుడు రహస్యంగా పంపబడిన రసదులు(విషం పెట్టేవాళ్లు) కొందరికి విషం పెట్టాలి. ఆ అపరాధం వీళ్లే చేశా రని ప్రకటించి మిగిలినవాళ్ల సర్వస్వం హరించాలి.

మూ.1. దూష్యమభిత్యక్తో వా శ్రద్ధేయాపదేశం పణ్యం హిరణ్యనిక్షేప

మృణప్రయోగం దాయం వా యాచేత. దాసశబ్దేన దూష్యమాలమ్బేత. భార్యా మస్య స్నుషాం దుహితరం వా దాసీశబ్దేన భార్యాశబ్దేన వా. తం దూష్యగృహ ప్రతిద్వారి రాత్రావుపశయానమన్యత్ర వా వసన్తం తీక్ష్ణో హత్వా బ్రూయాత్- "హతోఽయమిత్థం కాముకః" ఇతి. తేన దోషేణ ఇతరే పర్యాదాతవ్యాః.

2. సిద్ధవ్యఞ్జనో వా దూష్యం జమ్భకవిద్యాభిః ప్రలోభయిత్వా బ్రూయాత్- "అక్షయం హిరణ్యం రాజద్వారికం స్త్రీహృదయమ్, అరివ్యాధికరమ్ అయుష్యం పుత్రీయం వా కర్మ జానామి" ఇతి. ప్రతిపన్నం చైత్యస్థానే రాత్రౌ ప్రభూతసురామాంసగన్ధమ్ ఉపహారం కారయేత్, ఏకరూపం చాత్ర హిరణ్యం పూర్వనిఖాతమ్, ప్రేతాఙ్గం ప్రేతశిశుర్వా యత్ర నిహితః స్యాత్ తతో హిరణ్య మస్య దర్శయేదత్యల్పమితి చ బ్రూయాత్- "ప్రభూతహిరణ్యహేతోః పున రుపహారః కర్తవ్య ఇతి, స్వయమేవైతేన హిరణ్యేన శ్వోభూతే ప్రభూతమ్ ఔపహారికం క్రీణీహి" ఇతి. తేన హిరణ్యేన ఔపహారికక్రయే గృహ్యేత.

వ్యా. 1. లేదా ఒక అభిత్యక్తుడు (వధ్యుడు) తనకు చాలా దగ్గరివాడు అని లోకంచేత నమ్మించడానికి తగిన రాజద్రోహి దగ్గరికి వెళ్లి పణ్యం కాని, ధననిక్షేపం కాని, ఋణం కాని, దాయం కాని ఇమ్మని అడగాలి. ఇతడు నా దాసుడు అని (ఆ దూష్యుణ్ణి) గాని, ఈమె నా దాసి లేదా భార్య అని ఆ దూష్యుని భార్యను గాని, కోడలిని గాని, కూతురును గాని, గూర్చి ప్రచారం చేస్తూండాలి. ఆ రాత్రి ఆ దూష్యుని ఇంటి వాకిటి ముందు నిద్రపోతూన్న వధ్యుణ్ణి తీక్ష్ణుడు చంపివేసి "ఇలాంటి కోరికలు కోరడంచేత ఇతడు చంపబడ్డాడు'" అని చెప్పి వెళ్లిపోవాలి. ఆ అపరాధాన్ని పురస్కరించుకొని ఇతరుల (దూష్యుల) సర్వస్వం హరించాలి.

2. లేదా మంత్రసిద్ధుని వేషంలో ఉన్న గూఢచారి మాయావిద్యలచేత దూష్యుణ్ణి ప్రలోభపెట్టి-"నాకు అక్షయమైన ధనం సంపాదించే విద్య,రాజుతో సంబంధం ఏర్పరచకలిగిన విద్య, స్త్రీ హృదయాన్ని ఆకర్షించే విద్య, శత్రువులకు వ్యాధులు కలిగించే విద్య, ఆయుర్దాయం వృద్ధిపొందించే విద్య, పుత్రులు పుట్టే విద్యా తెలు సును" అని చెప్పాలి. వానికి నమ్మకం కలిగిన తరవాత రాత్రి చైత్యస్థానం (శ్మశానాదిస్థానం) దగ్గరకు తీసికొని వెళ్లి వానిచేత అత్యధికమైన మద్యం, మాంసం, గంధద్రవ్యాలు ఉన్న

బలి ఇప్పించాలి. అక్కడ అంతకు ముందే ఒక నాణెం పాతి ఉంచాలి ఆ ప్రదేశంలో తవ్వి ఏదైనా ఒక శవం అవయవాన్నీ, చిన్న పిల్లవాని శవాన్ని పైకి తీసి చూపించి. తరవాత ఆ ధనాన్ని (నాణెం) చూపించాలి. "ఇప్పుడు మనకు చాలా అల్పమైన హిరణ్యం(ధనం) మాత్రమే దొరికింది, చాలా ధనం దొరకాలంటే మళ్లీ ఉపహారం(బలి) ఇవ్వాలి నువ్వే స్వయంగా తెల్లవారగానే వెళ్లి ఈ హిరణ్యంతో అత్యధికమైన బలి సామగ్రి కొని తీసికొని రా" అని చెప్పి పంపాలి. ఆ ధనంతో ఔపహారికం (బలిద్రవ్యాలు) కొంటూన్నప్పుడు రాజపురుషులు వానిని బంధించాలి.

మూ. 1. మాతృవ్యఞ్జనయా వా "పుత్రో మే త్వయా హతః" ఇతి అవరూపితః స్యాత్.

2. సంసిద్ధమేవాస్య రాత్రియాగే వనయాగే వనక్రీడాయాం వా ప్రవృత్తాయాం తీక్ష్ణాః విశస్య అభిత్యక్తమ్ అతినయేయుః.

3. దూష్యస్య వా భృతకవ్యఞ్జనో వేతనహిరణ్యే కూటరూపం ప్రక్షిప్య ప్రరూపయేత్.

4. కర్మకారవ్యఞ్జనో గృహే కర్మ కుర్వాణః స్తేనకూటరూపకారకోప కరణమ్ ఉపనిదధ్యాత్. చికిత్సకవ్యఞ్జనో వా గరమగరాపదేశేన.

వ్యా. 1. ఎవరైనా ఒక స్త్రీ (గూఢచారిణిగా పనిచేసేది) "ఇతడు నా పుత్రుణ్ణి చంపివేసినాడు" అని దూష్యునిమీద నేరం మోపాలి.

2. దూష్యుడు రాత్రి యాగంలో గాని, వనంలో యాగంలో గాని, వనక్రీడలో కాని ఉన్నప్పుడు తీక్ష్ణులు అభిత్యక్తుణ్ణి (మరణదండం విధించబడి ఉన్న మనిషిని) చంపివేసి దూష్యుడు రాత్రియాగాదులు జరుపుచున్న చోటికి ఆ శవం చేర్చాలి. (దూష్యుడే చంపి నట్లు ఆరోపించి దూష్యుణ్ణి నిగ్రహించాలి).

3. గూఢచారి దూష్యుని దగ్గర నౌకరుగా చేరి అతడు ఇచ్చిన జీతంలో నకిలీ నాణెం కలిపి, "నా కిది ఇత డిచ్చాడు" అని చెప్పాలి. (అందుకు దూష్యుణ్ణి శిక్షించాలి.).

4. కర్మకారవేషంలో (పనివాడుగా) గూఢచారి దూష్యుని గృహంలో పనిచేస్తూ, దొంగలు ఉపయోగించే సాధనాలు, నకిలీ నాణాలు తయారుచేసే సాధనాలు వాని ఇంట్లో చేర్చాలి. లేదా వైద్యుని వేషంలో ప్రవేశించిన గూఢచారి విషం కాదని చెప్పి

(మందు అని చెప్పి) విషం ఆ దూష్యుని ఇంట్లో ఉంచాలి. (ఈ వస్తువులు పట్టుకొని రాజభటులు వానిని శిక్షించాలి).

మూ. 1. ప్రత్యాసన్నో వా దూష్యస్య సత్రీ ప్రణిహితమ్ అభిషేకభాణ్డమ్ అమిత్రశాసనం చ కాపటికముఖేన ఆచక్షీత, కారణంచ బ్రూయాత్.

2. ఏవం దూష్యేషు అధార్మికేషు చ వర్తేత; నేతరేషు.

3. శ్లో. పక్వం పక్వమివారామాత్ ఫలం రాజ్యాదవాప్నుయాత్,
ఆత్మచ్ఛేదభయాదామం వర్జయేత్ కోపకారకమ్.

ఇతి కౌటలీయార్థశాస్త్రే యోగవృత్తే పఞ్చమాధికరణే ద్వితీయోఽధ్యాయః
కోశాభిసంహరణమ్, ఆదితో ద్వినవతితమః.

వ్యా. 1. దూష్యుని దగ్గరగా ఉండే (బంధువు గాని మిత్రుడు గాని అయిన) సత్రి (గూఢచారి) వాని ఇంట్లో రాజ్యాభిషేకసామగ్రిని, శత్రురాజు లేఖను రహస్యంగా ఉంచి కాపటికుల (గూఢచారుల) ద్వారా ఇవి వీని ఇంట్లో ఉన్నాయి. ఇందుకు కారణం ఇది- (అనగా రాజును చంపించి శత్రురాజుకు రాజ్యాభిషేకం చేసే ప్రయత్నంలో ఉన్నాడు అని చెప్పాలి. ఆవిధంగా ఆ దూష్యుణ్ణి నిగ్రహించాలి. అని అర్థం).

2. రాజు దూష్యుల (రాజద్రోహుల)విషయంలోను, అధార్మికుల విషయంలోను మాత్రమే ఇలాంటి వన్నీ చేయించాలి. ఇతరుల విషయంలో చేయించగూడదు.

3. తోటలోని పండ్లను, ముగ్గినదానిని ముగ్గినట్లు కోసిన విధంగా, రాజు ఫలోన్ముఖంగా (శ్రమకరంగా లేని) ధనం మాత్రమే సేకరించాలి. పచ్చికాయలు కోయ కూడదు, దానివల్ల ప్రజలలో కోపం కలుగుతుంది (తిరుగుబాటు వస్తుంది), తనకే ముప్పు ఏర్పడుతుంది.

"బాలానందిని" అను కౌటలీయార్థశాస్త్రాంధ్రవ్యాఖ్యానంలో యోగవృత్తం అనే పంచమాధికరణంలో కోశాభిసంహరణం అనే రెండవ అధ్యాయం, ప్రారంభంనుంచి తొంభైరెండవ అధ్యాయం సమాప్తం.

# అథ తృతీయోఽధ్యాయః

## ఏకనవతితమం ప్రకరణమ్ - భృత్యభరణీయమ్

## (భృత్యుల జీతాలు **salaries of the State servants**)

మూ. 1. దుర్గజనపదశక్త్యా భృత్యకర్మ సముదయపాదేన స్థాపయేత్; కార్యసాధనసహేన వా భృత్యలాభేన, శరీరమవేక్షేత; న ధర్మార్థౌ పీడయేత్.

2. ఋత్విగాచార్యమన్త్రిపురోహితసేనాపతియువరాజమాతృ రాజమహిష్యోఽష్టచత్వారింశత్సాహస్రాః. ఏతావతా భరణే నానాస్వాద్యత్వమ్ అకోపకం చైషాం భవతి.

3. దౌవారికాన్తర్వంశికప్రశాస్త్రృసమాహర్తృసంనిధాతారః చతుర్వింశతి సాహస్రాః. ఏతావతా కర్మణ్యా భవన్తి.

4. కుమారకుమారమాతృనాయకపౌరవ్యావహారికకార్మాన్తికమన్త్రి పరిషద్రాష్ట్రపాలాన్తపాలాశ్చ ద్వాదశసాహస్రాః. స్వామిపరిబన్ధసహాయా హ్యేతా వతా భవన్తి.

వ్యా. 1. భృత్యుల జీతాలు దుర్గం శక్తిని, జనపదం శక్తిని పట్టీ, సముదయంలో (మొత్తం ధనాదాయంలో) నాల్గవవంతు ఉండే టట్లుగాని, భృత్యులు వాళ్ల వాళ్ల పనులు చక్కగా నిర్వహించేట్లు చేసే విధంగాగాని నిర్ణయించాలి. శరీరాన్ని అనగా ఆయశరీరాన్ని, రాబడిని, పరీక్షించుకోవాలి. ధర్మానికి అర్థానికి పీడ కలగనీయకూడదు.

2. ఋత్విక్కులు, ఆచార్యులు, మంత్రులు, పురోహితులు, సేనాపతి, యువరాజు, రాజమాత, రాజమహిషి (పట్టపురాణి) - వీళ్లకి (సంవత్సరానికి) నలభైఎనిమిది వేల పణాల భృతి ఇవ్వాలి.

3. ద్వారపాలకులు, అంతఃపురాధికారి, ప్రశాస్త (Director of labour corps.) సమాహర్త (Administrator), సంనిధాత (Director of stores) - వీళ్లకి (సంవత్సరానికి) ఇరవైనాలుగువేల పణాలు జీతం. ఈ మాత్రం ఇస్తే వీళ్లు తమ తమ పనులను శ్రద్ధాసక్తులతో చేస్తారు.

4. రాజపుత్రులు, వాళ్ల తల్లులు, నాయకుడు (Commandent),

పౌరవ్యావహారికుడు (City-judge), కర్మాంతికుడు (Director of Factories), మంత్రిపరిషత్సభ్యులు (పన్నెండుగురు అమాత్యులు), రాష్ట్రపాలుడు (Provincial officer), అంతపాలుడు (Frontier officer)- వీళ్లకు సంవత్సరానికి పన్నెండువేల పణాల జీతం. ఈ మాత్రం జీతం ఇస్తే వీళ్లు ప్రభువుయొక్క పరిబంధం (బలాన్ని చేకూర్చే పరివారంలో - entourage) సహాయులుగా ఉంటారు.

మూ. 1. శ్రేణీముఖ్యాః,హస్త్యశ్వరథముఖ్యాః, ప్రదేష్టారశ్చ అష్టసాహస్రాః. స్వవర్గానుకర్షిణో హ్యేతావతా భవన్తి.

2. పత్త్యశ్వరథహస్త్యధ్యక్షాః ద్రవ్యహస్తివనపాలాశ్చ చతుస్సాహస్రాః.

3. రథికానీకస్థచికిత్సకాశ్వదమకవర్ధకాదయో యోనిపోషకాశ్చ ద్విసాహస్రాః.

4. కార్తాన్తికనైమిత్తికమౌహూర్తికపౌరాణికసూతమాగధాః పురోహితపురుషాః సర్వాధ్యక్షాశ్చ సాహస్రాః.

5. శిల్పవన్తః పాదాతాః సంఖ్యాయకలేఖకాదివర్గః పఞ్చశతాః.

వ్యా. 1. శ్రేణీముఖ్యులు (ఆ యా శిల్పిగణాల ముఖ్యులు, గ.శా. కొందరు సైనికుల సముదాయంయొక్క అధిపతులు. కాంగ్లే), గజముఖ్యులు, అశ్వముఖ్యులు, రథముఖ్యులు,ప్రదేష్టలు (Magistrates)- వీళ్లకు (సంవత్సరానికి) ఎనిమిదివేల పణాల జీతం. ఇంతమాత్రం జీతం ఇస్తే వీళ్లు తమ క్రింద నున్నవాళ్లచేత చెప్పిన పనులు చేయించుకొన కలిగినవా ళ్లవుతారు.

2. కాలిబంటుల అధ్యక్షులు (Superitendents), అశ్వాధ్యక్షులు, గజాధ్యక్షులు, ఆ యా ద్రవ్యాలు లభించే వనాలను గజవనాలను పాలించేవాళ్లు-వీళ్లకు సంవత్సరానికి నాలుగు వేల పణాలు జీతం.

3. రథికులు (రథంమీదనుండి యుద్ధంచేసేవారు గ.శా., రథశిక్షకులు కాంగ్లే) గజశిక్షకులు, వైద్యులు, అశ్వశిక్షకులు, వడ్రంగులు, కోళ్లు, పందులు మొదలైన వాటిని పోషించేవాళ్లు - వీళ్లకు రెండువేల పణాలు జీతం.

4. కార్తాంతికుడు (సాముద్రికశాస్త్రనిపుణుడు), నైమిత్తికుడు (శకునాలు

చెప్పేవాడు), మౌహూర్తికుడు(జ్యోతిష్కుడు), పౌరాణికుడు, సూతుడు (సారథి), మాగధుడు (స్తుతిపాఠకుడు), పురోహితునితో ఉంటూ పౌరోహిత్యానికి సంబంధించిన పనులలో సహాయపడేవాళ్లు, సూనాధ్యక్ష - సూత్రాధ్యక్షాదులైన అందరు అధ్యక్షులు (Superintendents) వీళ్లకు (సంవత్సరానికి) వెయ్యి పణాలు జీతం.

5. కాలిబంటులుగా శిక్షణ పొందినవాళ్లు, గణకులు, లేఖకులు మొదలైనవాళ్ల సంఘాలు (సంఘాల సభ్యులు) -వీళ్లకు ఐదు వందల పణాల జీతం.

మూ. 1 .కుశీలవాస్తు అర్ధతృతీయశతాః. ద్విగుణవేతనాశ్చైషాం తూర్యకరాః.

2. కారుశిల్పినో వింశతిశతికాః.

3. చతుష్పదద్విపదపరిచారకపారికర్మికౌపస్థాయికపాలకవిష్టిబన్ధకాః షష్టివేతనాః ఆర్యయుక్తారోహకమాణవకశైలఖనకాః సర్వోపస్థాయినశ్చ.

4. ఆచార్యాః విద్యావన్తశ్చ పూజావేతనాని యథార్హం లభేరన్. పఞ్చశతావరం సహస్రపరమ్.

5. దశపణికో యోజనే దూతః మధ్యమః. దశోత్తరే ద్విగుణవేతన ఆయోజనశతాదితి.

6. సమానవిద్యేభ్యః త్రిగుణవేతనో రాజా రాజసూయాదిషు క్రతుషు.

7. రాజ్ఞః సారథిః సాహస్రః.

8. కాపటికోదాస్థితగృహపతికవైదేహకతాపసవ్యఞ్జనాః సాహస్రాః.

వ్యా. 1. కుశీలవుల జీతం రెండు వందల యాభై పణాలు, వీళ్లలో తూర్యకరుల (వాద్యాలు మ్రోగించేవాళ్ల గ.శా. వాద్యాలు తయారుచేసేవాళ్ల, కాంగ్లే) జీతం రెట్టింపు (ఐదు వందల పణాలు)

2. కారువులకు (పనులు చేసేవాళ్లకు) శిల్పులకు నూటఇరవై పణాల జీతం.

3. చతుష్పాజ్జంతువులయొక్క, మనుష్యులయొక్క పరిచారకులు, పారికర్మికుడు (అలంకరించేవాడు), ఔపస్థాయికుడు (శరీరపరిచారకుడు), పాలకుడు, విష్టి (గ్రామనౌకరు), బంధకులు (కూలివాళ్లు) వీళ్లకు అరవై పణాలు జీతం. (విష్టిబంధ

కులు అనగా పనిచేసేవాళ్లమీద అజమాయిషీ చేసేవాళ్లు అని కాంగ్లే). అర్యుల పర్య వేక్షణలో ఉన్న అశ్వాద్యారోహకులు, దోపిడిదొంగలు, కొండలు తవ్వేవాళ్లు, అందరికీ పనులు చేసేవాళ్లు-వీళ్లకి కూడ అరవై పణాల వేతనం.

4. ఆచార్యులకు (ఉపాధ్యాయులకు) విద్యావంతులకు వాళ్ల అర్హతను పట్టి ఐదువందలు తగ్గకుండా, వెయ్యి మించకుండా పూజావేతనం (గౌరవవేతనం= honorarium) ఇవ్వాలి.

5. మధ్యరకం వేగంలో ప్రయాణం చేసే దూతకు పది యోజనాలవరకు యోజనానికి పది పణాల చొప్పున వేతనం. పది యోజనాలు దాటి నూరు యోజనాలవరకు యోజనానికి ఇరవై పణాల చొప్పున జీతం.

6. రాజసూయం మొదలైన క్రతువులలో రాజుకు, అనగా రాజుకు ప్రతినిధిగా ఉన్న అధ్వర్యుడు అనే ఋత్విక్కుకు, సమానవిద్యావంతులైన ఇతర ఋత్విక్కుల కంటె మూడు రెట్లు వేతనం (దక్షిణ) ఇవ్వాలి.

7. రాజు సారథికి వెయ్యి పణాల జీతం.

8. కాపటికులు (కపటం చేసేవాళ్లు), ఉదాస్థితులు (సంన్యాసాశ్రమంనుంచి భ్రష్టులైనవాళ్లు), గృహస్థులు, వర్తకులు, తాపసులు - ఈ వేషాలలో ఉన్న గూఢచారులకు వెయ్యి పణాలజీతం.

మూ. 1. గ్రామభృతకసత్రితీక్ష్ణరసదభిక్షుక్యః పఞ్చశతాః.

2. చారసంచారిణోఽర్ధతృతీయశతాః ప్రయాసవృద్ధవేతనా వా.

3. శతవర్గసహస్రవర్గాణామ్ అధ్యక్షాః భక్తవేతనలాభమ్, ఆదేశం, విక్షేపం చ కుర్యుః. అవిక్షేపో రాజపరిగ్రహదుర్గరాష్ట్రరక్షావేక్షణేషు చ. నిత్య ముఖ్యాః స్యుః అనేకముఖ్యాశ్చ.

4. కర్మసు మృతానాం పుత్రదారాః భక్తవేతనం లభేరన్. బాలవృద్ధవ్యాధితాశ్చైషామనుగ్రాహ్యాః. ప్రేతవ్యాధితసూతికాకృత్యేషు చైషామర్థమానకర్మ కుర్యాత్.

5. అల్పకోశః కుప్యపశుక్షేత్రాణి దద్యాత్; అల్పం చ హిరణ్యమ్.

శూన్యం వా నివేశయితుమభ్యుత్థితో హిరణ్యమేవ దద్యాత్; న గ్రామం గ్రామ సజాతవ్యవహారస్థాపనార్థమ్.

వ్యా. 1. గ్రామంచేత పోషింపబడే చాకళ్ళ మొదలైనవారికి, సత్రులు (రహస్యకార్యకర్తలు) తీక్ష్ణులు (ఘాతకులు), రసదులు (విషం ఇచ్చేవాళ్లు), సంన్యాసినులు - వీళ్లకు ఐదు వందల పణాల జీతం.

2. గూఢచారికార్యాలకోసం చరించేవాళ్లకు రెండువందల యాభై పణాల జీతం. లేదా వాళ్ల శ్రమను పట్టి వేతనం పెంచాలి.

3. నూరుగురు సైనికుల గణానికి అధ్యక్షులుగా ఉన్నవాళ్లు, వెయ్యిమంది సైనికుల గణానికి అధ్యక్షులుగా ఉన్నవాళ్లు తమ క్రిందనున్న సైనికుల బత్తాలు, జీతాలుపెంచుతూ, చేయవలసిన పనులను గూర్చి ఆదేశా లిస్తూ, పని లేనప్పుడు పంపివేస్తూ ఉండాలి. రాజుకు సంబంధించిన ఆస్తులను, దుర్గాలను, రాష్ట్రాన్నీ రక్షించడంలోను, పర్యవేక్షించడంలోను ఉన్నవాళ్లకు పనినుంచి దూరంగా ఉండడం అనేది ఉండదు. అనగా వాళ్లు షష్టిగడియలూ రక్షణకార్యం చేస్తూండాలి అని అర్థం. వంద సంఖ్యలోను, వేయి సంఖ్యలోను ఉన్న సైనికుల ముఖ్యులు (ప్రధానులు) నిత్యులై (Permanent) ఉండాలి; చాలామంది ఉండాలి (కాంగ్లే). ఈ సైనికులు ఎల్లప్పుడు తమ పై అధికారుల చెప్పుచేతలలోనే ఉండాలి కాని స్వతంత్రులుగా వ్యవహరించకూడదు (గ.శా.)

4. రాజకార్యంలో (సర్వీసులో ఉండగా) మరణించినవాళ్ల పుత్రులకు భార్యలకు రాజు అన్నమూ, జీతమూ ఇవ్వాలి. వాళ్లకి సంబంధించిన బాలులను, వృద్ధులను, రోగంతో బాధపడుతున్నవాళ్లను అనుగ్రహించాలి (వాళ్లకి సంరక్షణ ఏర్పరచాలి). వీళ్ల కుటుంబాలలో ఎవరైనా మరణించినా, జబ్బుపడినా, ప్రసవించినా అప్పుడు జరిగే పనులలో ఆర్థికసహాయం చేసి గౌరవించాలి.

5. కోశం అల్పంగా ఉన్న రాజు జీతాలు ఇవ్వవలసిన వాళ్లకి కుప్యం, పశువులు,పొలాలు ఇవ్వాలి: ధనం అల్పంగా ఇవ్వాలి. శూన్యప్రదేశంలో గ్రామం నెల కొల్పడంకొరకు ప్రయత్నించే రాజు అక్కడికి వెళ్లి నివసించబోయేవాళ్లకి ధనం మాత్రమే ఇవ్వాలి కాని గ్రామం వాళ్లకి ఇచ్చివేయకూడదు. అట్లు చేయడం ఎందు కనగా - గ్రామంలో రాబోయే అనేకవిధాలైన వ్యవహారాలను స్థిరీకరించడం కోసం ముందుగానే

వాళ్లకు గ్రామంమీద పొలాలమీద అధికారం ఇస్తే చాలా కాలంనుంచి వచ్చే నియమాలకు భంగం కలిగి వాళ్లు సరిగా పని చేయరు అని భావం.

మూ. 1. ఏతేన భృతానామభృతానాం చ విద్యాకర్మభ్యాం భక్తవేతన విశేషం చ కుర్యాత్. షష్టివేతనస్యాఢకం కృత్వా హిరణ్యానురూపం భక్తం కుర్యాత్.

2. పత్త్యశ్వరథద్విపాః సూర్యోదయే బహిః సంధిదివసవర్జం శిల్పయోగ్యాః కుర్యుః. తేషు రాజా నిత్యయుక్తః స్యాత్. అభీక్ష్ణం చైషాం శిల్పదర్శనం కుర్యాత్. కృతనరేన్ద్రాఙ్కం శస్త్రావరణమాయుధాగారం ప్రవేశయేత్. అశస్త్రాశ్చరేయుః అన్యత్ర ముద్రానుజ్ఞాతాత్. నష్టం వినష్టం వా ద్విగుణం దద్యాత్. విధ్వస్తగణనాం చ కుర్యాత్.

3. సార్థికానాంశస్త్రావరణమన్తపాలా గృహ్ణీయుః, సముద్రమవచారయేయుర్వా. యాత్రామభ్యుత్థితో వా సేనాముద్యోజయేత్. తతో వైదేహకవ్యఞ్జనాః సర్వపణ్యాన్యాయుధీయేభ్యః యాత్రాకాలే ద్విగుణప్రత్యాదేయాని దద్యుః. ఏవం రాజపణ్యవిక్రయో వేతనప్రత్యాదానం చ భవతి.

వ్యా. 1. ఈ విధంగా రాజు భృతులకు (Permanent-servants) అభృతులకు (తాత్కాలికకర్మకరులకు Casual servants) వాళ్ల విద్యను, కర్మను పట్టి భక్తం (బత్తెం, ఆహారం) లోను, వేతనంలోను విశేషం కనబరుస్తూ ఉండాలి. అరవై పణాల వేతనం తీసుకొనేవానికి ఒక ఆఢకం బియ్యం - ఈ విధంగా జీతంగా ఇచ్చే ధనానికి అనుగుణంగా భక్తం ఇవ్వాలి.

2. పూర్ణిమ, అమావాస్య మొదలైన సంధిదివసాలలో తప్ప కాలిబంట్లు, అశ్వాలు, గజాలు సూర్యోదయసమయంలో నగరానికి వెలుపల శిక్షణాభ్యాసం (Practice in their works) చెయ్యాలి. (శిల్పయోగ్యాః=విచిత్రమైన శస్త్రచర్యాశిక్షలు గ.శా.). రాజు ఎల్లప్పుడు కాలిబంట్లు మొదలైనవాళ్లచేత కవాదు చేయించడంలో శ్రద్ధ చూపాలి. వాళ్ల నేర్పు చాల అధికంగా ఉండేటట్లు చెయ్యాలి. ఆయుధాలను, కవచాలను రాజముద్ర వేసి ఆయుధాగారంలో చేర్చాలి. రాజముద్ర ద్వారా అనుజ్ఞ పొందిన రక్షకభటాదులు తప్ప మిగిలిన పౌరు లందరూ బైట తిరిగే టప్పుడు ఆయుధా లేవీ

తీసికొని వెళ్లకూడదు. ఆయుధకవచాలలో ఏదైనా పాడయినా,పోయినా అందుకు కారణమైనవాడు దానికి రెట్టింపు ఇవ్వాలి. పోయిన ఆయుధాదుల లెక్క జాగర్తగా ఉంచాలి.

3. అంతపాలులు(సరిహద్దులు రక్షించేవాళ్లు) సార్థికులవద్ద (గుంపుగా తిరిగే విదేశీయవర్తకులవద్ద) ఉన్న ఆయుధాలు కవచాలు స్వాధీనం చేసుకోవాలి. లేదా వాటికి సీళ్లు వేసి తీసికొని వెళ్లడానికి అనుమతించాలి. లేదా రాజు యుద్ధయాత్రకు బయలు దేరి సేనను లేవదీయాలి. అప్పుడు వర్తకుల వేషంలో ఉన్న గూఢచారులు యాత్రాసమయంలో అవసరమయ్యే అన్ని సరుకులూ ఆ సరుకులు కావలసిన సైనికులకు "మీరు తరవాత వీటికి రెట్టింపు ఇవ్వాలి" అని చెప్పి ఇవ్వాలి. ఇలా చేయడంవల్ల రాజు దగ్గర నిల్వఉన్న పణ్యాలు ఖర్చు అవుతాయి, యోధులకు ఇచ్చిన వేతనం కూడా తిరిగివస్తుంది.

మూ. 1. ఏవమవేక్షితాయవ్యయః కోశదణ్డవ్యసనం నాప్నోతి. ఇతి భక్తవేతనవికల్పః.

2. శ్లో. సత్త్రిణశ్చాయుధీయానాం వైశ్యాః కారుకుశీలవాః,
దణ్డవృద్ధాశ్చ జానీయుః శౌచాశౌచమతన్ద్రితాః.

ఇతి కౌటిలీయార్థశాస్త్రే యోగవృత్తే పఞ్చమాధికరణే తృతీయోఽధ్యాయః
భృత్యభరణీయమ్. ఆదితస్త్రినవతితమః.

వ్యా. 1. ఈ విధంగా ఆయవ్యయాలను పర్యవేక్షించుకుంటూ ఉండే రాజు కోశం విషయంలోను, సైన్యం విషయంలోను ఆపదను పొందడు. ఇది భక్తానికీ వేతనానికీ సంబంధించిన విధానం.

2. సత్త్రులు, వేశ్యాస్త్రీలు, కర్మకారులు, కుశీలవులు, సైన్యంలో ఉన్న పెద్దవాళ్లు (Senior army officers) సావధానచిత్తులై సైనికుల శౌచాశౌచాలను (రాజభక్తితో ఉన్నారా లేదా అనే విషయాన్ని) తెలుసుకొంటూ ఉండాలి.

"బాలానందిని" అను కౌటలీయార్థశాస్త్రాంధ్రవ్యాఖ్యానంలో యోగవృత్తం అనే
పంచమాధికరణంలో భృత్యభరణీయం అనే మూడవ అధ్యాయం, ప్రారంభంనుండి
తొంభైమూడవ అధ్యాయం సమాప్తం.

# అథ చతుర్థోఽధ్యాయః

## ద్వినవతితమం ప్రకరణమ్ - అనుజీవివృత్తమ్

## (రాజాశ్రితుల నడవడిక)

మూ. 1. లోకయాత్రావిత్ రాజానమ్ ఆత్మద్రవ్యప్రకృతిసంపన్నం ప్రియహితద్వారేణ ఆశ్రయేత. యం వా మన్యేత - యథాహమాశ్రయేప్సుః ఏవమసౌ వినయేప్సుః, ఆభిగామికగుణయుక్త ఇతి, ద్రవ్యప్రకృతిహీనమ ప్యేనమాశ్రయేత న త్వేవానాత్మసంపన్నమ్. అనాత్మవాన్ హి నీతిశాస్త్రద్వేషాత్ అనర్థ్యసంయోగాద్వా ప్రాప్యాపి మహదైశ్వర్యం న భవతి.

2. ఆత్మవతి లబ్ధావకాశః శాస్త్రానుయోగం దద్యాత్. అవిసంవాదాద్ధి స్థానస్థైర్యమవాప్నోతి. మతికర్మసు పృష్టః తదాత్వే చ ఆయత్యాం చ ధర్మార్థసంయుక్తం సమర్థం ప్రవీణవదపరిషద్భీరుః కథయేత్. ఈప్సితః పణేత - "ధర్మార్థానుయోగమ్ అవిశిష్టేషు బలవత్సంయుక్తేషు దణ్డధారణం మత్సంయోగే తదాత్వే చ దణ్డధారణమితి న కుర్యాః. పక్షం, వృత్తిం, గుహ్యం చ మే నోపహన్యాః. సంజ్ఞయా చ త్వాం కామక్రోధదణ్డనేషు వారయే యమ్" ఇతి.

వ్యా. 1. లోకవ్యవహారం తెలిసినవాడు రాజుకు ప్రియుడు, హితుడు అయిన పురుషుని ద్వారా ఆత్మసంపన్నుడు (అత్యుత్తమస్వభావం కలవాడు), ద్రవ్యప్రకృతిసంపన్నుడు (అనేకవిధాలైన ఉత్తమము లైన భౌతికవిషయాలు ఉన్నవాడు) అయిన రాజును ఆశ్రయించాలి లేదా - "మంచి ఆశ్రయం కావాలని నేను ఎలా కోరుకుంటున్నానో అదే విధంగా ఇతడు వినయం (ట్రైనింగ్) కావాలని కోరుకుంటున్నాడు. దగ్గరకు చేరడానికి తగిన సద్గుణాలు ఉన్నవాడు" అని ఎవరిని గూర్చి అనుకుంటాడో అలాంటి రాజు ద్రవ్యప్రకృతిహీనుడైనా, ఆతనిని ఆశ్రయించాలి. అంతే కాని ఆత్మసంపద లేనివానిని మాత్రం ఆశ్రయించగూడదు, ఎందువల్ల ననగా ఆత్మసంపద లేనివాడు గొప్ప ఐశ్వర్యం పొందినా కూడ నీతిశాస్త్రంమీద ద్వేషంవల్ల గాని, చెడ్డవాళ్లతో సహవాసంవల్ల గాని నశిస్తాడు.

2. ఆత్మసంపద ఉన్న రాజును ఆశ్రయించిన పిమ్మట అవకాశం వచ్చినప్పుడల్లా తన కున్న నీతిశాస్త్రపరిచయాన్ని గూర్చి ఆతనికి తెలిసే టట్లు చెయ్యాలి. ఎందువల్ల ననగా - తాను చెప్పినది శాస్త్రవిరుద్ధం కాదు అని నిరూపించిన ట్లయితే అధికారంలో స్థిరత్వాన్ని పొందకలుగుతాడు. బుద్ధిబలంచేత నిర్ణయించవలసిన కర్మల విషయంలో రాజు అడిగి నప్పుడు తాత్కాలికంగాను, భవిష్యత్తులోను కూడా ధర్మార్థాలకు అనుగుణంగా ఉండే తగిన సలహా, మంచి నేర్పుకలవాడు వలె, పరిషత్తును చూచి ఏ మాత్రం జంకూ గొంకూ లేకుండా, ఇవ్వాలి. ఆ రాజుకు ఇష్టుడైన తరవాత ఆతనితో- "మంచి గుణాలు లేని వాళ్లను నువ్వు ధర్మార్థాలను గూర్చి అడగకూడదు. బలవంతులతో సంబంధం ఉన్నవాళ్ల విషయంలో దండప్రయోగం చేయకూడదు. నాకు సంబంధించినవాళ్ల విషయంలో వెంటనే(తొందరపడి) దండప్రయోగం చేయకూడదు. నా పక్షానికి (నావైపువాళ్లకి) నా వృత్తికి నా రహస్యానికి ఉపఘాతం కలిగించకూడదు. నువ్వు కామంచేత, క్రోధంచేత తొందరపడి దండం విధిస్తూన్నప్పుడు నేను నిన్ను సంజ్ఞలచేత (కన్ను మీటడం మొ.) నివారిస్తూంటాను". అని ఒక విధమైన ఒప్పందం కుదుర్చుకోవాలి.

మూ. ఆయుక్త ప్రదిష్టాయాం భూమౌ అనుజ్ఞాతః ప్రవిశేత్. ఉపవిశేచ్చ పార్శ్వతః సంనికృష్టవిప్రకృష్టః. పరాసనం, విగృహ్య కథనమ్, అసభ్యమ్, అప్రత్యక్షమ్ అశ్రద్ధేయమ్ అనృతం చ వాక్యమ్, ఉచ్చైరనర్మణి హాసం, వాతష్ఠీవనే చ శబ్దవతీ న కుర్యాత్. మిథః కథనమన్యేన, జనావాదే ద్వన్ద్వకథనం, రాజ్ఞో వేషమ్ ఉద్ధతకుహకానాం చ, రత్నాతిశయప్రకాశాభ్యర్థనమ్, ఏకాక్ష్యోష్ఠ నిర్భోగమ్, భ్రుకుటీకర్మ, వాక్యావక్షేపణం చ బ్రువతి. బలవత్సంయుక్తవిరోధం స్త్రీభిః స్త్రీదర్శిభిః సామన్తదూతైః ద్వేషాపక్షావక్షిప్తానర్థ్యైశ్చ ప్రతిసంసర్గమ్, ఏకార్థచర్యాం, సంఘాతం చ వర్జయేత్.

వ్యా. అధికారులు ప్రవేశించడానికి తగిన ప్రదేశంలోనికి ముందుగా రాజానుమతి పొంది ప్రవేశించాలి. రాజు ప్రక్క దగ్గరగా కాకుండా, దూరంగా కాకుండా మరొక ఆసనం మీద (రాజు కూర్చున్నది కాక మరొకటి) కూర్చోవాలి. రాజు చెప్పినదానిని ఖండిస్తూ మాట్లాడకూడదు. అసభ్యమైన (అశ్లీలమైన) మాటలు పలకకూడదు. తాను ప్రత్యక్షంగా చూడనిదానిని గూర్చి మాట్లాడకూడదు. నమ్మడానికి శక్యం కానిది, అసత్యమూ అయిన మాట పలకకూడదు. నవ్వడానికి కారణం ఏదీ లేనప్పుడు బిగ్గరగా నవ్వకూడదు.

సశబ్దంగా వాయువిసర్జనం, కాండ్రించి ఉమ్మివేయడం చేయకూడదు. పక్కవానితో రహస్యంగా మాట్లాడకూడదు.ఏదో విషయాన్ని గూర్చి చర్చిస్తూన్నప్పుడు విరోధకరమైన మాట మాట్లాడకూడదు. రాజు వేషంతో సమానమైన వేషం గాని, ఉద్ధతవేషం (కొట్టొచ్చినట్లు కనబడే వేషం) గాని, మోసగాళ్ల వేషం కాని ధరించకూడదు. ఏదైన రత్నం కాని, ప్రత్యేకమైన అనుగ్రహం గాని, అందరి ముందూ రాజును అడగకూడదు. ఒక కన్ను కొట్టడం లేదా మూయడం, పెదవి వంకరచేయడం, కనుబొమ్మలు విరవడం, రాజు మాటలాడుచున్నప్పుడు మాటకి అడ్డం రావడం చేయకూడదు. బలవంతులతో సంబంధం ఉన్నవాళ్లతో విరోధం పెట్టుకొనగూడదు. స్త్రీలతోను, స్త్రీలను ఎక్కువగా చూచేవాళ్లతోను, సామంతరాజుల దూతలతోను, శత్రుపక్షానికి చెందినవాళ్లతోను, పదభ్రష్టులుగా చేయబడినవాళ్లతోను, అనర్థానికి హేతువైనవాళ్లతోను, సంబంధం పెట్టుకోవడం గాని కలిసి పనిచేయడం గాని, కలవడం గాని చేయకూడదు.

శ్లో. అహీనకాలం రాజార్థం స్వార్థం ప్రియహితైః సహ,
పరార్థం దేశకాలే చ బ్రూయాద్ధర్మార్థసంహితమ్.

వ్యా. రాజుకు ఉపకరించే విషయాన్ని అతని ప్రియులు హితులు ఉన్నప్పుడు వాళ్లతో కలిసి వెంటనే రాజుకు చెప్పాలి. తనకు సంబంధించిన విషయాన్ని, ఇతరులకు సంబంధించిన విషయాన్నీ తగిన దేశమూ కాలమూ చూచుకొని, ధర్మార్థాలకు విరుద్ధం కాని విధంగా చెప్పాలి.

శ్లో. పృష్టః ప్రియహితం బ్రూయాన్నబ్రూయాదహితం ప్రియమ్,
అప్రియం వా హితం బ్రూయాచ్ఛృణ్వతోఽనుమతో మిథః.

వ్యా. రాజు ఏదైన సలహా అడిగి నప్పుడు ఇష్టమూ హితమూ (లాభకరమూ) అయిన మాట చెప్పాలి. హితం కాని ప్రియవాక్యం పలకకూడదు. అతడు వింటాడు అనుకొన్నప్పుడు అతని అనుమతి తీసికొని, రహస్యప్రదేశంలో, అప్రియమైనా హితమైనదానిని చెప్పాలి.

శ్లో. తూష్ణీం వా ప్రతివాక్యే స్యాద్వేష్యాదీంశ్చ న వర్ణయేత్,
అప్రియా అపి దక్షాః స్యుస్తద్భావాద్యే బహిష్కృతాః.
అనర్థ్యాశ్చ ప్రియా దృష్టాశ్చిత్తజ్ఞానానువర్తినః,
అభిహాస్యేష్వభిహసేద్ ఘోరహాసాంశ్చ వర్జయేత్.

వ్యా. లేదా (అప్రియమైన) సమాధానం చెప్పవలసివచ్చినప్పుడు ఏమీ మాట్లాడకుండా ఉండాలి. ఆతని శత్రువులు మొదలైనవాళ్లను ఆతని ఎదట వర్ణించకూడదు. కొంతమంది ఎంత సమర్థులైనా ఆతని భావంనుండి బహిష్కరింపబడిన ట్లయితే అప్రియులే అవుతారు. అందుచేత అలాంటివాళ్ల మాట రాజుముందు తీసికొనిరాకూడదు. కొంతమంది అనర్థం కలిగించేవాళ్లే అయినా ఆతని చిత్తాన్ని అనుసరించి ప్రవర్తించే నేర్పు గలవా ళ్లవడంచేత ఆతనికి ఇష్టు లవడం చూస్తున్నాం. నవ్వడానికి తగిన సందర్భాలు వచ్చినప్పుడు నవ్వాలి; కాని భయంకరంగా నవ్వకూడదు.

శ్లో. పరాత్ సంక్రామయేద్ఘోరం న చ ఘోరం స్వయం (పరే)వదేత్,
తితిక్షేతాత్మనశ్చైవ క్షమావాన్ పృథివీసమః.

వ్యా. ఘోరమైన విషయం రాజుకు చెప్పవలసివచ్చినప్పుడు అది పరులచేత చెప్పించాలి; తాను చెప్పకూడదు. తనకు ఏదైనా ఘోరవిషయం సంభవించినప్పుడు భూమి వలె ఓర్పుతో సహించాలి. (గ.శా.). రాజు పలికే భయంకరమైన మాటలను ఇతరులనుండి వెనుకకు త్రిప్పివేయాలి. అనగా వాటిని అంతగా పట్టించుకొనవద్దు అని వాళ్లకు నచ్చచెప్పాలి. ఎన్నడూ తాను ఘోరమైన వాక్కు పలకకూడదు. ఎవరైనా తన విషయంలో ఘోరవాక్కు ప్రయోగించినా సహించాలి (కాంగ్లే).

శ్లో. ఆత్మరక్షా హి సతతం పూర్వం కార్యా విజానతా,
అగ్నావివ హి సంప్రోక్తా వృత్తీ రాజోపజీవినామ్.

వ్యా. అన్నీ తెలుసుకొని ముందుగా ఆత్మరక్షణ చేసికోవాలి. ఎందుచేత ననగా రాజును ఆశ్రయించినవాళ్ల ప్రవృత్తి అగ్నితో చెలగాటం వంటి దని చెప్పబడింది.

శ్లో. ఏకదేశం దహేదగ్నిః శరీరం వా పరం గతః,
సపుత్రదారం రాజా తు ఘాతయేద్వర్ధయేత వా.

ఇతి కౌటలీయార్థశాస్త్రే యోగవృత్తే పఞ్చమాధికరణే చతుర్థోఽధ్యాయః
అనుజీవివృత్తమ్, ఆదితశ్చతుర్నవతితమః.

వ్యా. పరునిమీద పడిన అగ్ని వాని కొంత దేహాన్ని కాల్చవచ్చు లేదా మొత్తం దేహాన్ని కాల్చవచ్చు. కాని రాజు తలుచుకుంటే ఒక మనిషిని భార్యాపుత్రాదిసహితంగా నశింపచేస్తాడు లేదా అభివృద్ధిలోనికి తీసికొనివస్తాడు.

"బాలానందిని" అను కౌటలీయార్థశాస్త్రాంధ్రవ్యాఖ్యానంలో యోగవృత్తం అనే పంచమాధికరణంలో అనుజీవివృత్తం అనే నాల్గవఅధ్యాయం, ప్రారంభంనుంచి తొంభైనాల్గవ అధ్యాయం సమాప్తం.

# అథ పఞ్చమో ఽధ్యాయః.

## త్రినవతితమం ప్రకరణమ్ - సమయాచారికమ్

## (నియమాల ప్రకారం నడవడం **Proper Behaviour for a Courtier**)

మూ.1. నియుక్తః కర్మసు వ్యయవిశుద్ధముదయం దర్శయేత్.

2. ఆభ్యన్తరం, బాహ్యం, గుహ్యం, ప్రకాశమ్, ఆత్యయికమ్, ఉపేక్షితవ్యం వా కార్యం "ఇదమేవమ్" ఇతి విశేషయేచ్ఛ.

3. మృగయాద్యూతమద్యస్త్రీషు ప్రసక్తం వానువర్తేత ప్రశంసాభిః. ఆసన్నశ్చాస్య వ్యసనోపఘాతే ప్రయతేత. పరోపజాపాతిసంధానోపధిభ్యశ్చ రక్షేత్.

4. ఇఙ్గితాకారౌ చాస్య లక్షయేత్. కామద్వేషహర్షదైన్యవ్యవసాయభయద్వన్ద్వవిపర్యాసమిఙ్గితాకారాభ్యాం హి మన్త్రసంవరణార్థమాచరన్తి ప్రాజ్ఞాః.

వ్యా. 1. ఆ యా కర్మలయందు నియుక్తుడైన అధికారి ఆదాయంలో ఖర్చులుపోగా లాభం చూపించాలి.

2. ఏ కార్యం ఆభ్యంతరమో (దుర్గానికి సంబంధించినదో) ఏది బాహ్యమో (జనపదాదులకు సంబంధించినదో), ఏది రహస్యమో ఏది కాదో, ఏది అత్యయికమో (వెంటనే చూడదగినదో) ఏది కొంతకాలం ఉపేక్షించదగినదో అలాంటికార్యాన్ని గూర్చి "ఇది ఇట్లు" అని స్పష్టంగా (వ్రాతపూర్వకంగా) విశదీకరించాలి.

3. వేటయందు, మద్యపానమునందు, స్త్రీలయందు ఆసక్తుడైన రాజును ప్రశంసిస్తూ అనుసరించి ఉండాలి. (అనుకూలంగా మాట్లాడాలి).ఆతనికి బాగా దగ్గర అయినప్పుడు ఈ వ్యసనాలను తొలగించడానికి ప్రయత్నించాలి. శత్రువులు చేసే ఉపజాపం (భేదం) నుంచి, వంచననుంచి, ఉపధి (రహస్యంగా చేసే రసప్రయోగాదులనుండి) రాజును రక్షిస్తూ ఉండాలి.

4. రాజుయొక్క ఇంగితాన్ని (మామూలుగా లేని చేష్టలను), ఆకారాన్ని (ముఖరాగాదులను) పరీక్షించి తెలుసుకోవాలి. ఎందువల్ల ననగా -బుద్ధిశాలులు మనస్సులో ఉన్న ఆలోచనలు కప్పిపుచ్చడం కోసం తమ ఇంగితాకారాలచేత ఇష్టం

అనిష్టం, సంతోషం-దైన్యం, దృఢనిశ్చయం-భయం అనే ద్వంద్వాలలో ఒకదానిని మరొక విధంగా ప్రదర్శిస్తూంటారు.

మూ. 1. దర్శనే ప్రసీదతి. వాక్యం ప్రతిగృహ్ణాతి. ఆసనం దదాతి. వివిక్తే దర్శయతే; శఙ్కాస్థానే నాతిశఙ్కతే. కథాయాం రమతే. పరజ్ఞాప్యేష్వపేక్షతే. పథ్యముక్తం సహతే. స్మయమానో నియుఙ్క్తే హస్తేన స్పృశతి. శ్లాఘ్యే న ఉపహసతి. పరోక్షే గుణం బ్రవీతి. భక్ష్యేషు స్మరతి. సహవిహారం యాతి.వ్యసనేఽభ్యవపద్యతే. తద్భక్తాన్ పూజయతి. గుహ్యమాచష్టే. మానం వర్ధయతి. అర్థం కరోతి. అనర్థం ప్రతిహన్తి. ఇతి తుష్టజ్ఞానమ్.

2. ఏతదేవ విపరీతమతుష్టస్య. భూయశ్చ వక్ష్యామః- సందర్శనే కోపః, వాక్యస్య అశ్రవణప్రతిషేధే, ఆసనచక్షుషోరదానమ్, వర్ణస్వరభేదః, ఏకాక్షిభ్రుకుట్యోష్ఠనిర్భోగః, స్వేదశ్చ, శ్వాసస్మితానామస్థానోత్పత్తిః, పరిమన్త్రణమ్, అకస్మాత్ వ్రజనమ్, వర్ధనమ్ అన్యస్య, భూమిగాత్రవిలేఖనమ్, అన్యస్యోపతోదనమ్, విద్యావర్ణదేశకుత్సా, సమనిన్దా, ప్రతిదోషనిన్దా, ప్రతిలోమస్తవః, సుకృతానవేక్షణం,దుష్కృతానుకీర్తనమ్, పృష్ఠావధానమ్, అతిత్యాగః, మిథ్యాభిభాషణమ్, రాజదర్శినాం చ తద్వృత్తాన్యత్వమ్.

వ్యా. 1. దర్శనం అయి నప్పుడు (కనబడి నప్పుడు) సంతోషిస్తాడు. చెప్పిన మాట వింటాడు. ఆసనం ఇస్తాడు. రహస్యప్రదేశంలో దర్శనం ఇస్తాడు. శంకించవలసిన పరిస్థితులలో కూడ ఎక్కువ శంకించడు. సంభాషణలో ఆసక్తి చూపుతాడు. ఇతరులు ఏదైనా నివేదించడానికి వచ్చి నప్పుడు కూడ ఇతడు (ఇష్టుడు) అక్కడనే ఉండడాన్ని అంగీకరిస్తాడు (గ.శా.). కాంగ్లే "పరిజ్ఞాప్యేషు" అనే పాఠం గ్రహించి ఆతడు నివేదించే విషయాలలో ఆదరం చూపుతాడు అని అర్థం వివరించాడు. ఏదైనా హితం బోధించి నప్పుడు సహిస్తాడు (కాదనడు). "ఫలానా పని చెయ్యి" అన్ని నవ్వుతూ ఆజ్ఞాపిస్తాడు. హస్తంచేత స్పృశిస్తాడు. శ్లాఘించదగిన విషయంలో పరిహసించడు (కాంగ్లే). "శ్లాఘ్యేన అని పదచ్ఛేదంచేత శ్లాఘించదగిన పని చేసినందుకు వాని ఎదుటనే పరిహాసం చేస్తాడు (గ.శా.). పరోక్షంలో గుణాలను మెచ్చుకుంటాడు. భక్ష్యాలలో స్మరిస్తాడు. (ఏదైనా భక్షించే టప్పుడు అతడు కూడా ఉంటే బాగుండును అని స్మరించి పిలిపిస్తాడు). కలిసి విహారానికి వెడతాడు. కష్టాలు వచ్చినప్పుడు ఆదుకుంటాడు. వానియందు భక్తి

కలవాళ్లను గౌరవిస్తాడు. రహస్యం చెపుతాడు. గౌరవం పెంచుతాడు. ధనం ఇస్తాడు లేదా కావలసిన పని చేస్తాడు. అనర్థాన్ని తొలగిస్తాడు. ఇది రాజు తన విషయంలో సుముఖంగా ఉన్నాడు అని గ్రహించడానికి ఉపయోగించే అంశాలు.

2. మంత్రి మొదలైన సేవకుల విషయంలో సంతుష్టుడు కాని రాజుయొక్క ప్రవర్తన పైన చెప్పిన దానికి విపరీతంగా ఉంటుంది. ఇంకా కొన్ని విషయాలు చెప్తాం- చూడగానే కోపంగా ఉండడం, మాట వినకపోవడం లేదా మధ్యలో, మాటలాడవద్దని నిషేధించడం, ఆసనం ఇవ్వకపోవడం,అతని వైపు చూడకపోవడం, ముఖాదుల రంగులోను స్వరంలోను మార్పు, ఓర చూపు, కనుబొమ్మల విరుపు, పెదవి విరుపు, చెమట, కారణం లేకుండా శ్వాస దీర్ఘంగా పీల్చడం, చిరునవ్వు నవ్వడం, పక్కవానితో ఆలోచన చేయడం, అకస్మాత్తుగా వెళ్లిపోవడం, మరొకనికి అభివృద్ధి కలిగించడం, నేలమీద దేహంమీద గోళ్లతో గీస్తూ ఉండడం, మరొకనిని వీనికి విరుద్ధంగా ప్రేరేపించడం, వాని విద్యను వర్ణాన్ని దేశాన్ని నిందించడం, వానితో సముడైనవానిని నిందించడం, ప్రతీదోషాన్ని ఉట్టంకిస్తూ నిందించడం, వీనికి ప్రతికూలుడుగా ఉన్నవానిని మెచ్చుకోవడం, ఇతడు చేసిన మంచి పనిని గుర్తించకపోవడం, చెడ్డపనులను ఏకరవు పెట్టడం, అతడు తిరిగివెళ్లిపోతూన్నప్పుడు వాని వెనుకవైపు చూడడం,ఎన్ని మాట్లు వచ్చినా ఏదో ఒక వంక చెప్పి పంపివేయడం, అసత్యం చెప్పడం (కాంగ్లే) మనస్సులో సరియైన భావం లేకుండా మాటలాడడం, ఎక్కువగా రాజును కలిసే వాళ్లల్లో వీని విషయంలో వేరు వేరు విధాలైన ప్రవృత్తి ఉండడం (ఇవి రాజు అప్రసన్నుడుగా ఉన్నా డని తెలుసుకొనడానికి గుర్తులు).

మూ. 1. వృత్తివికారం చావేక్షేతాప్యమానుషాణామ్.

2. అయముచ్చైః సిఞ్చతీతి కాత్యాయనః ప్రవవ్రాజ.

3. క్రౌఞ్చో ఽపసవ్యమ్ ఇతి కణిఙ్కో భారద్వాజః.

4. తృణమితి దీర్ఘశ్చారాయణః.

5. శీతా శాటీతి ఘోటముఖః.

6. హస్తీ ప్రత్యౌక్షీదితి కిఞ్జల్కః.

7. రథాశ్వం ప్రాశంసీదితి పిశునః.

8. ప్రతిరవణే శునః పిశునపుత్రః ఇతి.

వ్యా. 1. మనుష్యభిన్నము లైన పశుపక్ష్యాదుల ప్రవర్తనలోని వికారాన్ని కూడ పరీక్షిస్తూ ఉండాలి. ఇంక మనుష్యుల ప్రవృత్తిలోని వికారం మాట చెప్పాలా అని భావం.

2. ఇతడు నామీద పడే టట్లు ఎత్తుగా నీళ్లు చల్లుచున్నాడు అని తెలుసుకొని కాత్యాయను డనే మంత్రి రాజును విడిచి వెళ్లిపోయాడు. ఆ కథ ఇది -పూర్వం పౌండ్రదేశంలో సోమదత్తు డనే రాజు తన కుమారు డేదో అపరాధం చేయగా వానిని కారాగారంలో బంధించా లని మంత్రి అయిన కాత్యాయనునితో ఆలోచించాడు. ఈ విషయం ఇంగితాకారాలచేత ఆ పుత్రుని పక్షంవాళ్లు తెలుసుకొని వానిని మరొకచోటికి తీసికొనిపోయారు. ఈ మంత్రం బైటపెట్టినవాడు మంత్రియే అనే అభిప్రాయంతో అతనిని వధించవలసిందిగా రాజు సేవకులను ఆజ్ఞాపించాడు. ఆ ఆజ్ఞను గూర్చి రహస్యంగా విన్న ఒక నీళ్లు చల్లేవాడు కాత్యాయనుడు వస్తూన్నప్పుడు నీళ్లు పైకి పడే టట్లు చల్లడం ప్రారంభించాడు. నామీద నీళ్లు ఎక్కడ పడతాయో అనే భయంచేత నిన్నటివరకు నీళ్లు చాల జాగర్తగా చల్లేవాడు, ఈనాడు ఈ విధంగా నామీద పడే టట్లు చల్లుతున్నాడు; ఈతని ప్రవర్తనలోని వికారం చూస్తే ఏదో రాజకోపకారణం ఉండి ఉంటుంది అని గ్రహించి అతడు రాజును విడిచి వెళ్లిపోయాడు.

3. క్రౌంచపక్షి అపసవ్యంగా వెళ్లడం చూచి భరద్వాజగోత్రుడైన కణింకుడు రాజును విడిచి వెళ్ళిపోయాడు. ఆ కథ ఇది - పూర్వం కోసలదేశంలో కణింకు డనే అర్థశాస్త్రపండితుడు పరంతపు డనే రాజును ఆశ్రయించుకొని ఉండేవాడు. అతడు రాజగృహానికి వచ్చినప్పుడల్లా ప్రతిరోజూ క్రౌంచపక్షి ప్రదక్షిణంగా (ఎడమనుంచి కుడివైపు) వెళ్ళేది. ఒకనాడు రాజు అంతఃపురంలో ఉండగా కణింకుడు రావడంచేత రాజుకు కోపం వచ్చి అతనిని నిందించాడు. ఆ నిందను విన్న క్రౌంచపక్షి కణింకునికి అపసవ్యంగా వెళ్ళింది. దానిని పట్టి రాజుకు తనమీద కోపం వచ్చిన దని ఊహించుకొని కణింకుడు రాజును విడిచి వెళ్లిపోయాడు.

4. గడ్డిపరక అని తెలుసుకొని చారాయణగోత్రుడైన దీర్ఘుడు రాజును విడచి వెళ్లిపోయాడు. ఆ కథ ఇది - పూర్వం మగధదేశంలో ఒక బాలుడైన రాజకుమారుడు రాజయ్యాడు. ఆతని ఆచార్యుడైన దీర్ఘుడు ఆతని తండ్రికి చాల ప్రియుడైన పండితుడు. ఆతడు వచ్చి నప్పు డల్లా రాజమాత తన భర్తమీద ఉన్న గౌరవంచేత ఆతనికి ప్రత్యుత్థానాదుల ద్వారా చాల మర్యాదలు చేస్తూండేది. వయస్సు వచ్చిన తరవాత ఆ రాజుకు తన తల్లి ఆ దీర్ఘునికి ఆ విధంగా ఉపచారం చేయడం నచ్చలేదు. ఒకరోజున- "ఈ బ్రాహ్మణునికి ఇంతగా ఎందుకు ఉపచారం చేస్తున్నావు?" అని తల్లిని అడిగాడు.

"ఇతడు మన ఆచార్యుడు; గొప్ప పండితుడు. నీ తండ్రికి చాల ఇష్టమైనవాడు. అందుచేత నువ్వుకూడా ఈయనను గౌరవించాలి. నువ్వు అన్నం వస్త్రం మొదలైనవి ఇస్తూ ఈయనను పూజించాలి" అని తల్లి చెప్పింది. ఆ మాటలు విని అతడు వెంటనే అన్నంమీద గడ్డి కప్పి దీర్ఘునికి ఇచ్చాడు, దానితో "ఇతనికి నామీద ఆదరం లేదు" అని దీర్ఘుడు అతనిని విడచి వెళ్లిపోయాడు.

5. ఘోటముఖు డనే ఆచార్యుడు వస్త్రం చల్లగా ఉండడం చూచి రాజును విడిచి వెళ్లిపోయాడు. ఆ కథ ఇది- అవంతిదేశంలో ఘోటముఖుడనే పండితుడు అంశుమంతు డనే రాజుయొక్క పుత్రునికి నీతివిద్య ఉపదేశిస్తూ అక్కడ నివసించేవాడు. ఒకనాడు రాజుకు ఆ ఘోటముఖునిమీద చాల కోపం వచ్చింది. గురుభక్తి గల ఆ రాజపుత్రుడు ఏదో విధంగా గురువును రక్షించడం కోసం - స్నానం చేసి రోజూ కంఠంమీద వేసికొని వచ్చే వస్త్రాన్ని చల్లగా ఉన్న దని కంఠంమీద ధరించకుండా చేతితో పట్టుకొని గురువుదగ్గరకి వచ్చాడు. ఇది ఏదో రాజకోపసూచకం అని గ్రహించి ఘోటముఖుడు ఆ నగరం విడిచి వెళ్లిపోయాడు.

6. ఏనుగ నీళ్లు చల్లిం దని కింజల్కుడు రాజును విడిచిపోయాడు. ఆ కథ ఇది- కింజల్కు డనే ఒక ఆచార్యుడు వంగదేశరాజైన శతానందుణ్ణి ఆశ్రయించుకొని ఉండేవాడు. అతడు ప్రతిరోజూ రాజప్రాసాదానికి వచ్చి నప్పుడు రాజు ఎక్కే ఏనుగు ఆతనిని ఒకవిధంగా పలకరిస్తూండేది. అతడు కూడ దానిని లాలనచేసి లోపలికి వెడుతూండేవాడు. ఒక రోజున ఆ గజాన్ని ఎక్కిన రాజు ఆ ఆచార్యునివిషయంలో ద్రోహం తలపెట్టాడు. ఆ విషయం తెలుసుకొన్న ఏనుగ తొండం నిండా నీళ్లు నింపుకొని ఆ ఆచార్యుణ్ణి తడిపివేసింది. దానిని పట్టి రాజుకు తనమీద ఏదో ఆగ్రహం కలిగిం దని గ్రహించి కింజల్కుడు అక్కడినుండి వెళ్లిపోయాడు.

7. రథానికి కట్టిన గుఱ్ఱాన్ని ప్రశంసించాడు అని పిశునుడు రాజును విడిచి వెళ్లిపోయాడు. పిశును డనే ఆచార్యుడు ఉజ్జయినీరాజైన ప్రద్యోతుని పుత్రుడైన పాలకునికి నీతివిద్య నేర్పాడు. చదువు పూర్తి అయిపోయిన తరవాత పిశునుని కిచ్చిన ధనం అంతా అపహరించా లని రాజు ఆలోచించాడు. ఈ విషయం విన్న రాజపుత్రుడు ఆచార్యునికి ద్రోహం కలగకూడ దని నిర్ణయించుకొని మంచి గుఱ్ఱం కట్టిన రథంమీద ఆచార్యుడి దగ్గరికి వెళ్లి "ఈ గుఱ్ఱం రోజుకు ముప్పై యోజనాలు ప్రయాణం చేయ గలదు" అని ప్రశంసించాడు. ఇది తనను వెళ్లిపొమ్మని సూచన అని గ్రహించి పిశునుడు అక్కడినుండి వెళ్లిపోయాడు.

8. కుక్క తనకు ఎదురుగా తిరిగి మొరగడం విని పిశునపుత్రుడు రాజును విడచి వెళ్లిపోయాడు. ఆ కథ ఇది-పిశును డనే ఆచార్యుని పుత్రుడు బాల్యంలోనే సకలనీతిశాస్త్రతత్త్వాలు తెలిసికొని ఒక రాజు దగ్గర ఉన్నాడు. రాజు కూడ ఇతడు మంచి విద్వాంసుడు అని ఆతనికి అనుకూలుడుగానే ఉన్నాడు. ఒకనాడు రాజుకు ఒక ఆలోచన వచ్చింది-"ఇతడు ఇంకా బాలుడు; మంత్రిపదవికి తగినవాడు కాడు. తగిన వయస్సు వచ్చేవరకు ఇతనిని బంధించి సంరక్షించాలి. అలా చేయకపోతే మరొక చోటికి వెళ్లిపోతాడు." ఆ ఆలోచన విన్న కుక్క పిశునపుత్రుని ఎదుట మొరగడం ప్రారంభించింది. ఇది ఏదో రాజచిత్తవికారాన్ని సూచిస్తున్నది అని గ్రహించి అతడు వెంటనే అక్కడినుండి వెళ్లిపోయాడు. (ఈ కథలు గణపతిశాస్త్రిగారి వ్యాఖ్యలో ఉన్నాయి).

మూ.1. అర్థమానావక్షేపే చ పరిత్యాగః. స్వామిశీలమ్, ఆత్మనశ్చ కిల్బిషముపలభ్య వా ప్రతికుర్వీత.మిత్రముపకృష్టం వాస్య గచ్ఛేత్.

2. శ్లో. తత్రస్థో దోషనిర్ఘాతం మిత్రైర్భర్తరి చాచరేత్,
తతో భర్తరి జీవేద్వా మృతే వా పునరావ్రజేత్.

ఇతి కౌటలీయార్థశాస్త్రే యోగవృత్తే పఞ్చమాధికరణే పఞ్చమోఽధ్యాయః సమయాచారికమ్, ఆదితః పఞ్చనవతితమః.

వ్యా. 1. అర్థానికీ, మానానికీ భంగం కలిగినప్పుడు ఆ రాజును విడిచివేయాలి. లేదా రాజుయొక్క స్వభావాన్ని, తనవల్ల జరిగిన అపరాధాన్ని పర్యాలోచించి,రాజును విడవకుండా, తగు విధంగా ప్రతిక్రియ చేసుకోవాలి. లేదా తన ప్రభువుకు సంనిహితుడైన ఆతని మిత్రుణ్ణి ఆశ్రయించాలి. ఆతని ద్వారా రాజుకు తనయందు కలిగిన కోపాన్ని ఉపశమింపచెయ్యాలి అని అర్థం.

2. దుర్గంలోనే ఉంటూ మిత్రుల ద్వారా రాజు విషయంలో తన వల్ల జరిగిన అపరాధానికి ప్రతిక్రియ చేసుకోవాలి. తరవాత ప్రభువు జీవించి ఉన్నా, ఆతని మరణా నంతరమైనా తిరిగి స్వస్థానానికి రావాలి.

"బాలానందిని" అను కౌటలీయార్థశాస్త్రాంధ్రవ్యాఖ్యానంలో యోగవృత్తం అనే పంచమాధికరణంలో సమయాచారికం అనే పంచమాధ్యాయం, ప్రారంభంనుంచి తొంభైఐదవ అధ్యాయం సమాప్తం.

# అథ షష్ఠోఽధ్యాయః

## చతుర్నవతిపఞ్చనవతితమే ప్రకరణే - రాజ్యప్రతిసంధానమేకైశ్వర్యం చ (రాజ్యం కొనసాగుట, ఒకే ప్రభుత్వం కొనసాగుట. Continuance of the Kingdom, Continuous Sovereignty)

మూ.1. రాజవ్యసన మేవ మమాత్యః ప్రతికుర్వీత. ప్రాగేవ మరణాబాధ భయాత్ రాజ్ఞః ప్రియహితోపగ్రహేణ మాసద్విమాసానన్తరం దర్శనం స్థాపయేత్- "దేశపీడాపహమ్, అమిత్రాపహమ్, ఆయుష్యం పుత్రీయం వా కర్మ రాజా సాధయతి" ఇత్యపదేశేన రాజవ్యఞ్జనమనురూపవేలాయాం ప్రకృతీనాం దర్శయేత్; మిత్రామిత్రదూతానాం చ. తైశ్చ యథోచితాం సంభాషామ్ అమాత్యముఖో గచ్ఛేత్. దౌవారికాన్తర్వంశికముఖశ్చ యథోక్తం రాజప్రణిధి మనువర్తయేత్. అపకారిషు చ హేడం ప్రసాదం వా ప్రకృతికాన్తం దర్శయేత్. ప్రసాదమేవ ఉపకారిషు.

2. ఆప్తపురుషాధిష్ఠితౌ దుర్గప్రత్యన్తస్థౌ వా కోశదణ్డావేకస్థౌ కారయేత్; కుల్యకుమారముఖ్యాంశ్చ అన్యాపదేశేన.

వ్యా. 1. రాజుకు కొంచెం కాలంలో మరణం రానున్నది అని తోచినప్పుడు అమాత్యుడు దానికి తగిన ప్రతిక్రియ (ముందు జాగ్రత్త) ఈ విధంగా చెయ్యాలి. మరణ భాధ రాక మునుపే రాజుకు ప్రియులైన వాళ్లనీ, హితులైనవాళ్లనీ కూడగట్టుకొని- "రాజు దేశపీడ తొలగించడానికి శత్రువులను నశింపచేయడానికి, ఆయుర్దాయం వృద్ధిపొందడానికి లేదా పుత్రులు కలగడానికి కర్మలు చేస్తున్నాడు" అనే మిషచేత మాసానికి లేదా రెండు మాసాలకు ఒక సారి రాజుగారి దర్శనం ప్రకృతులకు మిత్రుల దూతలకు, అమిత్రుల దూతలకు తగిన సమయంలో, అనగా స్పష్టంగా గుర్తించడానికి శక్యం కాని, వెలుతురు తక్కువగా ఉన్న, సమయంలో, రాజు వలె ఉన్న ఒక వ్యక్తిని కూర్చుండబెట్టి (రాజుగారు దర్శనం ఇస్తున్నారు అని చెప్పి) దర్శనం చేయించాలి. "ఆ రాజు" వాళ్లతో స్వయంగా మాట్లాడకుండా అమాత్యుల ద్వారా తగు విధంగా సంభాషణ చెయ్యాలి. రాజు ప్రతి

రోజూ చేయవలసిన పనులను ఆ యా దివససమయాలలో ద్వారపాలకుల ద్వారా, అంతఃపురాధికారుల ద్వారా నిర్వర్తించాలి. ప్రకృతులకు ఇష్టం అయ్యే విధంగా అపకారం చేసినవాళ్ల విషయంలో అనాదరం గాని అనుగ్రహం గాని చూపించాలి. ఉపకారం చేసినవాళ్ల విషయంలో అనుగ్రహం మాత్రమే ప్రదర్శించాలి.

2. దుర్గంలోను, సరిహద్దులలోను ఉన్న కోశాన్ని, సైన్యాన్నీ ఆప్తపురుషుల పర్యవేక్షణలో ఒక చోటికి చేర్చాలి. అదే విధంగా ఏదో ఒక వంక పెట్టి ఉత్తమవంశంలో పుట్టినవాళ్లను రాజకుమారులను, ప్రధానులైన అధికారులను కూడ ఒక చోటికి చేర్చాలి.

మూ. 1. యశ్చ ముఖ్యః పక్షవాన్ దుర్గాటవీస్థో వా వైగుణ్యం భజేత తముపగ్రాహయేత్, బహ్వాబాధాం వా యాత్రాం ప్రేషయేత్, మిత్రకులం వా.

2. యస్మాచ్చ సామన్తాదాబాధం పశ్యేత్ తమ్ ఉత్సవవివాహహస్తిబన్ధనాశ్వపణ్యభూమిప్రదానాపదేశేన అవగ్రాహయేత్, స్వమిత్రేణ వా. తతః సంధిమదూష్యం కారయేత్.

3. ఆటవికామిత్రైర్వా వైరం గ్రాహయేత్. తత్కులీనమవరుద్ధం వా భూమ్యేకదేశేన ఉపగ్రాహయేత్.

4. కుల్యకుమారోపగ్రహం కృత్వా వా కుమారమభిషిక్తమేవ దర్శయేత్. దాణ్డకార్మికవద్వా రాజ్యకణ్టకానుద్ధృత్య రాజ్యం కారయేత్.

5. యది వా కశ్చిన్ముఖ్యః సామన్తాదీనామన్యతమః కోపం భజేత తమ్-"ఏహి రాజానం త్వాం కరిష్యామి" ఇత్యావాహయిత్వా ఘాతయేత్. ఆపత్ప్రతీకారేణ వా సాధయేత్.

వ్యా. 1. దుర్గంలో గాని (గ.శా.) రాష్ట్రసరిహద్దులలో గాని (కాంగ్లే), అరణ్యంలో గాని ఉన్న ఏ ముఖ్యాధికారియైనా పక్షబలం కలవాడై ఉండి ఏమైనా వికారం చూపినట్లయితే వానితో మంచితనం చేసుకోవాలి. లేదా అనేకమైన సంకటాలు కలగడానికి అవకాశా లున్న యాత్రకు (దూరదేశం) పంపాలి. లేదా మిత్రుని దగ్గరికి పంపాలి.

2. ఎవరైనా సామంతరాజు బాధ కలిగిస్తా డనే శంక కలిగినప్పుడు ఆతనిని ఉత్సవం, వివాహం, గజాలను పట్టుకొనడం, గుఱ్ఱాలు కొనే స్థానం, భూమి ఇవ్వడం మొదలైన వంకమీద లేదా వాని మిత్రుని ద్వారానే వశం చేసుకోవాలి. తరవాత ఆతనితో ఏనాటికీ విచ్ఛేదం కలిగించడానికి శక్యం కాని సంధి చేసుకోవాలి.

3. లేదా ఆ సామంతునికి ఆటవికులతో గాని, శత్రువులతో గాని వైరం కలిగేటట్లు చెయ్యాలి. లేదా ఆ సామంతుని వంశానికి చెందినవానిని గాని, అవరుద్ధుణ్ణి (తండ్రితో పడని వాని పుత్రుణ్ణి గాని), రాజ్యంలో కొంత భాగం నీకిస్తాం అని ప్రలోభపెట్టి వాని ద్వారా ఆ సామంతరాజును వశం చేసుకోవాలి.

4. (ఇంతవరకు చెప్పినది రాజు మరణించడానికి పూర్వం చేయవలసిన పనులు. రాజు మరణించిన ట్లయితే ఆ వార్త వెంటనే పైకి పొక్కనీయకుండా) - రాజవంశీయుల్ని, కుమారుల్ని (ఇతర రాజపుత్రులను) ప్రధానాధికారులను ఒప్పించి ఒక రాజకుమారుడికి రాజ్యాభిషేకం చేసివేసి తరవాతనే ఆతనిని ప్రకృతులకు చూపించాలి. దాండకార్మికప్రకరణంలో చెప్పిన విధంగా రాజ్యకంటకాలను (రాజ్యంలో బాధలు సృష్టించేవాళ్ల నందరినీ) పెకిలించివేసి (రాజపుత్రునిచేత) రాజ్యం చేయించాలి.

5. సామంతాదులలో ముఖ్యుడైనవాడు ఎవరైనా తిరుగుబాటు చేస్తే - "నిన్ను రాజును చేస్తాను; రా" అని పిలిపించి చంపించాలి. లేదా (అతడు అలా పిలిచినా రాకపోతే) ఆపత్ప్రతీకార పద్ధతులు (ఆపదలను తొలగించుకొనే పద్ధతులు) ఉపయోగించి వానిని అణగద్రొక్కాలి.

మూ. 1. యువరాజే వా క్రమేణ రాజ్యభారమారోప్య రాజవ్యసనం ఖ్యాపయేత్.

2. పరభూమౌ రాజవ్యసనే మిత్రేణ అమిత్రవ్యఞ్జనేన శత్రోః సంధిమవస్థాప్య అపగచ్ఛేత్. సామన్తాదీనామన్యతమం వాస్య దుర్గే స్థాపయిత్వా అపగచ్ఛేత్. కుమారమభిషిచ్య వా ప్రతివ్యూహేత. పరేణాభియుక్తో వా యథో క్తమాపత్ప్రతీకారం కుర్యాత్.

3. ఏవమేకైశ్వర్యమమాత్యః కారయేదితి కౌటల్యః.

4. నైవమితి భారద్వాజః. ప్రమ్రియమాణే వా రాజని అమాత్యః కుల్యకుమారముఖ్యాన్ పరస్పరం ముఖ్యేషు వా విక్రామయేత్. విక్రాన్తం ప్రకృతికోపేన ఘాతయేత్. కుల్యకుమారముఖ్యానుపాంశుదణ్డేన వా సాధయిత్వా స్వయం రాజ్యం గృహ్ణీయాత్. రాజ్యకారణాద్ధి పితా పుత్రాన్ పుత్రాశ్చ పితరమభిద్రుహ్యన్తి; కిమఙ్గ పునరమాత్యప్రకృతిర్హి ఏకప్రగ్రహో

రాజ్యస్య. తత్ స్వయముత్థితం నావమన్యేత. స్వయమారూఢా హి స్త్రీ త్యజ్యమానా అభిశపతీతి లోకప్రవాదః.

5. శ్లో. కాలశ్చ సకృదభ్యేతి యం నరం కాలకాఙ్క్షిణమ్,
దుర్లభః స పునస్తస్య కాలః కర్మచికీర్షతః.

వ్యా. 1. (రాజు ఉండగానే ఒక కుమారుణ్ణి యువరాజుగా చేసి ఉన్నట్లయితే) ఆ యువరాజుకు రాజ్యభారం మెల్ల మెల్లగా అప్పగించి, తరవాత రాజమరణాన్ని గూర్చి అందరికీ చెప్పాలి.

2. శత్రువు భూమిలో (అనగా శత్రురాజ్యంలో యుద్ధంలో) రాజు మరణించిన ట్లయితే తన రాజుకు మిత్రుడైన మరొక రాజున్ను శత్రు వని చెప్పి, ఆతనితో, (తన రాజును చంపిన) శత్రువునకు సంధిచేయించి తాను వెనుకకు వచ్చివేయాలి. లేదా వాని (శత్రువురాజుయొక్క) దుర్గంలో సామంతాదులలో ఒకనిని ఉంచి, తాను బైటకు (తన రాజ్యంలోనికి) వచ్చివేయాలి. లేదా రాజకుమారునికి పట్టాభిషేకం చేసి ఆ శత్రువును ఎదిరించాలి. శత్రువు తనమీదికి యుద్ధానికి వస్తే చెప్పబడిన విధంగా (వెనుక చెప్పబడిన విధంగా, ముందు చెప్పబోవు విధంగా) ఆపదలకు ప్రతిక్రియ చేసుకోవాలి.

3. ఈ విధంగా అమాత్యుడు ఒకే రాజపుత్రుని క్రింద రాజ్యం అంతా ఉండే టట్లు చెయ్యాలి అని కౌటల్యుని అభిప్రాయం.

4. "ఇది యుక్తం కాదు" అని భారద్వాజుడు అంటాడు. రాజు మరణించ నున్నప్పుడు అమాత్యుడు రాజవంశానికి చెందినవాళ్లకీ, రాజకుమారులకీ, ముఖ్యులైన అధికారులకీ మధ్య కలహం పుట్టించి ఒకరి నొకరు నశింపచేసికొనే టట్లు చెయ్యాలి. లేదా ముఖ్యాధికారుల విషయంలో కుల్యకుమారాదులు ఎదురు తిరిగే టట్లు చెయ్యాలి. పరాక్రమించినవానిని, ప్రకృతులలో ప్రకోపం కలిగించి చంపివేయాలి. లేదా రాజవంశీయులను, రాజకుమారులను, అధికారప్రముఖులను రహస్యోపాయాలచేత చంపించి తాను రాజ్యం వశం చేసుకోవాలి. రాజ్యం కోసం తండ్రి పుత్రుల్నీ, పుత్రులు తండ్రినీ, చంపిస్తారు కదా? అలాంటప్పుడు రాజ్యాన్ని అంతనీ ఒంటరిగా నడిపించే అమాత్యుడనే ప్రకృతి రాజ్యాన్ని అపహరించడంలో తప్పు ఏముంది? అందుచేత అమాత్యుడు అప్రయత్నంగా వచ్చిన రాజ్యాన్ని అవమానించకూడదు(కాదనకూడదు). స్వయంగా వచ్చి మీద పడిన స్త్రీని విడిచిపెడితే ఆమె శపిస్తుం దని లోకంలో సామెత ఉన్నది. అదే విధంగా లక్ష్మి వస్తూన్నప్పుడు కాదనకూడదు అని భావం.

5. "కాలంకోసం వేచి ఉన్న మనిషికి ఆ కాలం (అవకాశం) జీవితంలో ఒక

మాటే లభిస్తుంది. ఏదో పని సాధించాలనుకునేవానికి ఆ అవకాశం మరొక మారు లభించమంటే లభించదు".

మూ. 1. ప్రకృతికోపకమ్, అధర్మిష్ఠమ్, అనైకాన్తికం చైతదితి కౌటల్యః. రాజపుత్రమాత్మసంపన్నం రాజ్యే స్థాపయేత్.సంపన్నాభావే వ్యసనినం కుమారం, రాజకన్యాం, గర్భిణీం దేవీం వా పురస్కృత్య మహామాత్రాన్ సంనిపాత్య బ్రూయాత్- "అయం వో నిక్షేపః; పితరమస్య అవేక్షధ్వం, సత్త్వాభిజనమాత్మనశ్చ. ధ్వజమాత్రోఽయమ్, భవన్త ఏవ స్వామినః, కథం వా క్రియతామ్" ఇతి.

2. ఏవం బ్రువాణం యోగపురుషాః బ్రూయుః-"కోఽన్యో భవత్పురోగాదస్మాద్ రాజ్ఞః చాతుర్వర్ణ్యమర్హతి పాలయితుమ్?" ఇతి. తథేత్యమాత్యః కుమారం, రాజకన్యాం, గర్భిణీం దేవీం వాధికుర్వీత; బన్ధు సంబన్ధినాం, మిత్రామిత్రదూతానాం చ దర్శయేత్.

వ్యా. 1. "ఇలా చేయడం ప్రకృతులలో తిరుగుబాటు కలిగిస్తుంది, ఇది అధర్మ మైన పని; దీని వల్ల సత్ఫలితం కలుగుతుం దనే నమ్మకం కూడ లేదు" అని కౌటల్యుడు అంటున్నాడు. ఆత్మసంపన్నుడైన రాజపుత్రుడు లేకపోతే వ్యసనాసక్తుడైనా ఒక రాజపుత్రుణ్ణి గాని, రాజపుత్రికను గాని, గర్భవతియైన రాజభార్యను (పట్టమహిషిని) గాని ఎదుట ఉంచి మహామాత్రుల నందరినీ పిలిపించి- "ఇది మీ నిక్షేపం (రక్షించవలసినదిగా మీకు అప్పగించిన వ్యక్తి). మీరు ఇతని తండ్రి ముఖం చూడండి. మీ పరాక్రమాన్ని, కులాన్నీ కూడ గుర్తు ఉంచుకొనండి. ఇతడు కేవలం ధ్వజం (చిహ్నం) వంటివాడు, మీరే ప్రభువులు, ఏమి చేస్తే బాగుంటుందో చెప్పండి" అని చెప్పాలి.

2. అమాత్యుడు ఇలా చెపుతూన్నప్పుడు వాళ్లల్లో ఉన్న యోగపురుషులు (ముందుగానే మాటలాడి ఉంచిన గూఢపురుషులు)- "నువ్వు ముందు ఉండి కార్యాలన్నీ నడిపిస్తూన్న ఈ రాజు తప్ప మరెవ్వరు చాతుర్వర్ణ్యరూపమైన రాజ్యాన్ని పాలించగలరు?" అని అనాలి. సరే అని అమాత్యుడు రాజకుమారుణ్ణి గాని, రాజకుమారిని గాని, గర్భవతియైన దేవిని గాని అధికారంలో స్థాపించాలి. బంధువులకు, సంబంధులకు, మిత్రుల దూతలకు, అమిత్రుల దూతలకు అధికారంలో స్థాపించబడిన ఆ వ్యక్తిని చూపాలి.

మూ. 1. భక్తవేతనవిశేషమ్ అమాత్యానామాయుధీయానాం చ

కారయేత్. భూయశ్చాయం వృద్ధః కరిష్యతీతి బ్రూయాత్. ఏవం దుర్గరాష్ట్ర ముఖ్యానాభాషేత; యథార్హం మిత్రామిత్రపక్షమ్. వినయకర్మణి చ కుమారస్య ప్రయతేత. కన్యాయాం సమానజాతీయాదపత్యముత్పాద్య వాభిషిఞ్చేత్. మాతుశ్చిత్తక్షోభభయాత్ కుల్యమ్, అల్పసత్త్వం, ఛాత్రం చ లక్షణ్యమ్ ఉపని దధ్యాత్. ఋతౌ చైనాం రక్షేత్. న చాత్మార్థం కంచిదుత్కృష్టమ్ ఉపభోగం కారయేత్. రాజార్థం తు యానవాహనాభరణవస్త్రస్త్రీవేశ్మపరివాపాన్ కారయేత్.

వ్యా. 1. అమాత్యులకు, సైనికులకు అన్నమూ, జీతమూ పెంచాలి. ఈ రాజు పెద్దవాడైన తరవాత ఇంకా పెంచుతా డని చెప్పాలి. దుర్గంలోని ముఖ్యాధికారులతోను, రాష్ట్రంలోని ముఖ్యాధికారులతోను ఈ విధంగానే మాటలాడాలి. మిత్రపక్షంవాళ్లతోను, అమిత్రపక్షంవాళ్లతోను కూడ తగు విధంగా మాటలాడి సంబంధాలు నెలకొల్పాలి. రాజ్యాభిషిక్తుడైన రాజకుమారునికి ఆ యా శాస్త్రాలలో శిక్షణ ఇవ్వడానికి ప్రయత్నించాలి. లేదా కన్యయైన రాజకుమారియందు సమానజాతీయుడైన పురుషుని ద్వారా పుత్రుడు కలిగేటట్లు చేసి వానిని రాజ్యాభిషిక్తుణ్ణి చెయ్యాలి. ఆ రాజకుమారుని తల్లియొక్క చిత్తం చెడిపోకుండా ఉండడం కోసం మంచికులంలో పుట్టినవాడు, అల్పమైన బలం (ధైర్యాదులు) కలవాడు, ఉత్తమలక్షణాలు ఉన్నవాడు అయిన ఛాత్రుణ్ణి (చిన్న పిల్లవానిని) ఆమె దగ్గర ఉంచాలి. (అలాంటి బ్రాహ్మణబాలుణ్ణి ఆమె దగ్గర ఉంచితే అతడు దేవతాపూజాదులు చేయిస్తూ, పురాణాదులు చదివి వినిపిస్తూ ఆమె చిత్తం చలించకుండా చేస్తా డని గ.శా.). ఋతుకాలాలలో ఈమెను రక్షించాలి (ఆ సమయంలో చిత్తం చలించి ఆమె మరొకసంతానం మరొకరి ద్వారా కంటే రాజ్యానికి ముప్పు వాటిల్లుతుంది. కాంగ్లే), అమాత్యుడు తనకోసం అని అధికమైన సుఖసాధనా లేవీ సమకూర్చుకొనగూడదు. రాజుకోసం అయితే విశేషంగా రథాదియానాలు, వాహనాలు, అభరణాలు, వస్త్రాలు, స్త్రీలు, గృహాలు, పరివాపాలు (శయనాసనాదులు Furniture) ఏర్పరచాలి.

శ్లో. యౌవనస్థం తు యాచేత విశ్రమం చిత్తకారణాత్,
పరిత్యజేదతుష్యన్తం తుష్యన్తం చానుపాలయేత్.

వ్యా. 1. అలా రాజ్యాభిషిక్తుడైనవాడు యౌవనవంతుడైన తరవాత ఆతని అభిప్రాయం తెలుసుకోవడంకొరకు "నేనింక విశ్రాంతి తీసుకొంటాను" అని అడగాలి.

తన విషయంలో సంతోషం (సదభిప్రాయం) లేనివానిని విడిచి వెళ్లిపోవాలి. సంతోషం ఉన్నట్లయితే ఆతనిదగ్గరనే ఉండి సంరక్షించాలి.

శ్లో. నివేద్య పుత్రరక్షార్థం గూఢసారపరిగ్రహాన్,
అరణ్యం దీర్ఘసత్రం వా సేవేతారుచ్యతాం గతః.

వ్యా. రాజకుమారుని ఆదరం కోల్పోయిన అమాత్యుడు ఆ రాజకుమారుణ్ణి రక్షించడానికి రహస్యరక్షకభటులను ఏర్పరచి (కాంగ్లే), ఆ రాజకుమారునికి "వీళ్లు గూఢచారులు, ఇది సారవంతమైన సైన్యం, ఇది నీ తండ్రితాతలనుండి వస్తూన్న మూలధనాదికం" అని చెప్పి (గ.శా), తపస్సు చేసికొనడానికి అరణ్యానికి వెళ్లిపోవాలి. లేదా అతిదీర్ఘకాలం కొనసాగే యజ్ఞం తలబెట్టి దాని నిమిత్తం వెళ్లిపోవాలి.

శ్లో. ముఖ్యైరవగృహీతం వా రాజానం తత్ప్రియాశ్రితః,
ఇతిహాసపురాణాభ్యాం బోధయేదర్థశాస్త్రవిత్.

వ్యా. రాజు ప్రధానాధికారులకు వశుడైపోయినప్పుడు అర్థశాస్త్రవేత్తయైన అమాత్యుడు ఆ రాజుకు ఇష్టులైనవాళ్ల సహాయం కూడా తీసికొని, ఇతిహాసాలచేత (చారిత్రకవిషయాలను బోధించడంచేత) పురాణాలచేత సన్మార్గం ఉపదేశించాలి.

శ్లో. సిద్ధవ్యఞ్జనరూపో వా యోగమాస్థాయ పార్థివమ్,
లభేత లబ్ధ్వా దూష్యేషు దాణ్డకార్మికమాచరేత్.

ఇతి కౌటలీయార్థశాస్త్రే యోగవృత్తే పఞ్చమాధికరణే షష్ఠోఽధ్యాయః,
రాజ్యప్రతిసంధానమ్, ఏకైశ్వర్యమ్,ఆదితః షణ్ణవతితమః.

ఏతావతా కౌటలీయస్యార్థశాస్త్రస్య యోగవృత్తం పఞ్చమమధికరణం సమాప్తమ్.

వ్యా. లేదా మంత్రసిద్ధుని వేషం ధరించి, రహస్యమైన ప్రక్రియ లేవేవో చేస్తూ రాజును వశంచేసుకొని రాజద్రోహులను దాండకార్మికప్రకరణంలో చెప్పిన విధానంచేత రూపుమాపాలి.

"బాలానందిని" అను కౌటలీయార్థశాస్త్రాంధ్రవ్యాఖ్యానంలో యోగవృత్తం అనే పంచమాధికరణంలో రాజ్యప్రతిసంధానం, ఏకైశ్వర్యం అనే ఆరవ అధ్యాయం, ప్రారంభంనుంచి తొంబైఆరవ అధ్యాయం సమాప్తం. దీనితో కౌటలీయార్థశాస్త్రంలోని యోగవృత్తం అనే ఐదవ అధికరణం సమాప్తం.

# అథ మణ్డలయోనిః - షష్ఠమధికరణమ్.

## ప్రథమోఽధ్యాయః

## షణ్ణవతితమం ప్రకరణమ్ ప్రకృతిసంపదః

### మండలయోని (ఆధారభూతమైన రాజమండలం - **Circle of kings as the Basis**)

### ప్రకృతిసంపదలు (**Excellences of the Consituent Elements**)

అవతారిక :- ఇంతవరకు వైనయికాధికరణం మొదలు ఐదు అధికరణాలలో తంత్రభాగం చెప్పబడింది. ఇప్పుడు ఆవాపం ప్రారంభించ బడుతున్నది. తన రాష్ట్రంలో చేయవలసిన కార్యకలాపానికి తంత్రం అని పేరు. పరరాష్ట్రాల విషయంలో అనుసరించవలసిన పద్ధతి ఆవాపం. ఈ అధికరణానికి మండలయోని అని పేరు. మండలం అనగా విజిగీషువు (జయించాలనే కోరిక గల రాజు - సాధారణంగా ఏ రాజును గూర్చి చర్చ జరుగుతుందో ఆతనిని విజిగీషువు అనడం అలవాటు. ఒక రాజును కేంద్రంగా తీసికొని వానిని పట్టి శత్రుమిత్రాదివ్యవస్థ చేయబడుతుంది కదా). ఆ మిత్రుడు, మధ్యముడు, ఉదాసీనుడు అని మండలానికి నాలుగు అవయవాలు. ఇది రాబోయే అధికరణంలో చెప్పబోయే షాడ్గుణ్యానికి మూలం గాన దీనికి 'మండలయోని' అనగా మండలరూపమైన షాడ్గుణ్యనికి యోని అని పేరు.

మూ. 1. స్వామ్యమాత్యజనపదదుర్గకోశదణ్డమిత్రాణి ప్రకృతయః.

2. తత్ర స్వామిసంపత్ - మహాకులీనః, దైవబుద్ధిసత్త్వసంపన్నః, వృద్ధదర్శీ, ధార్మికః, సత్యవాక్, అవిసంవాదకః, కృతజ్ఞః, స్థూలలక్షః, మహోత్సాహః, అదీర్ఘసూత్రః, శక్యసామన్తః, దృఢబుద్ధిః, అక్షుద్రపరిషత్కః, వినయకామః ఇత్యాభిగామికా గుణాః.

3. శుశ్రూషాశ్రవణగ్రహణధారణవిజ్ఞానోహాపోహతత్త్వాభినివేశాః ప్రజ్ఞాగుణాః.

4. శౌర్యమమర్షః శీఘ్రతా, దాక్ష్యం చోత్సాహగుణాః.

వ్యా. 1. స్వామి (అమాత్యాదులైన ఐదు ప్రకృతుల అధిపతి), అమాత్యులు, జనపదం (దేశం), దుర్గం, కోశం, సైన్యం, మిత్రులు- ఇవి ప్రకృతులు.

2. ఈ ఏడు ప్రకృతులలో స్వామిరూపప్రకృతి కుండవలసిన గుణసంపద ఏదనగా -గొప్ప వంశంలో పుట్టినవాడు, దైవసంపద ఉన్నవాడు (తలచిన పనులు అనాయాసంగా సాధించకలగడం మొదలైనవాటిని పట్టి వీనికి పూర్వజన్మకృత పుణ్యరూపమైన దైవసంపద ఉన్న దని ఊహించాలి). బుద్ధిసంపద ఉన్నవాడు, బలసంపన్నుడు, వృద్ధుల (ఆ యా విషయాలలో మంచి జ్ఞానం ఉన్నవాళ్ల) దర్శనం చేసేవాడు, ధార్మికుడు, సత్యమే పలికేవాడు, అవిసంవాదకుడు (మాటలలోను చేతలలోను భేదం లేనివాడు) కృతజ్ఞుడు, ఉదారస్వభావం గలవాడు, గొప్ప ఉత్సాహం కలవాడు, దీర్ఘాలోచన చేస్తూనే ఉండకుండా శీఘ్రంగా నిర్ణయాలు తీసికొనే వాడు, సామంతులను తన క్రింద ఉంచుకొనగలవాడు, దృఢమైన బుద్ధి గలవాడు (స్థిరమైన నిశ్చయం కలవాడు), నీచబుద్ధులు లేని పరివారం కలవాడు, వినయంగా ఉండాలనే కోరిక గలవాడు - స్వామి ఈ విధంగా ఉండాలి. ఇవి ఆభిగామికగుణాలు. అనగా అందరూ దగ్గరికి వెళ్లదగిన స్వామి కుండవలసిన గుణాలు (కాంగ్లే).సహజమైన గుణాలు అని కూడ చెప్పవచ్చును.

3. శుశ్రూష (ఇతరులు చెప్పేది వినాలనే కోరిక,) వినడం, చెప్పిన విషయం గ్రహించడం, గ్రహించినదానిని జ్ఞాపకం ఉంచుకొనడం, విశేషాలను గ్రహించడం, ఊహ (తెలిసిన విషయంలో ఉన్న యుక్తిని గ్రహించడం), అపోహ (దుష్టమైన పక్షాన్ని విడిచివేయడం), యథార్థం తెలుసుకోవా లనే పట్టుదల - ఇవి స్వామిలో ఉండవలసిన బుద్ధికి సంబంధించిన గుణాలు.

3. శౌర్యం, పట్టుదల, పనులు చేయడంలో శీఘ్రత్వం, సమర్థత్వం (నేర్పు) అనేవి స్వామిలో ఉండవలసిన ఉత్సాహగుణాలు.

మూ. 1. వాగ్మీ ప్రగల్భః, స్మృతిమతిబలవాన్, ఉదగ్రః, స్వవగ్రహః, కృతశిల్పః, అవ్యసనః, దణ్డనాయీ, ఉపకారాపకారయోః దృష్టప్రతీకారీ, హ్రీమాన్, ఆపత్ప్రకృత్యోః వినియోక్తా, దీర్ఘదూరదర్శీ, దేశకాలపురుషకార కార్యప్రధానః, సంధివిక్రమత్యాగసంయమపణపరచ్ఛిద్రవిభాగీ, సంవృతః, అదీనాభిహాస్యజిహ్మభ్రుకుటీక్షణః, కామక్రోధలోభస్తమ్భచాపలోపతాప పైశున్యహీనః, శక్లః, స్మితోదగ్రాభిభాషీ, వృద్ధోపదేశాచారః ఇత్యాత్మసంపత్.

2. అమాత్యసంపదుక్తా పురస్తాత్.

వ్యా. 1. మాటలలో నేర్పరి, ప్రగల్భుడు (సభాకంపం లేనివాడు), స్మృతి, మతి (రాబోయే దానిని గూర్చిన జ్ఞానం) బలం (దేహేంద్రియాదిబలం) ఉన్నవాడు, చెడ్డపనినుంచి అనాయాసంగా వెనుకకు మరల్చడానికి శక్యమైనవాడు, గజారోహణం, అశ్వారోహణం, ఆయుధప్రయోగం మొదలైన శిల్పాలలో ప్రవీణుడు, దుర్వ్యసనాలు లేనివాడు, సైన్యాన్ని నడపగలవాడు, ఉపకారాపకారాలకు శాస్త్రంలో చెప్పిన రీతిలో ప్రతిక్రియ చేసేవాడు, సిగ్గుగలవాడు (చెడ్డపనులు చెయడానికి సంకోచించేవాడు), ఆపత్సమయాలలోను, సాధారణపరిస్థితులలోను తగు విధంగా ప్రవర్తించేవాడు, చాల దీర్ఘంగా దూరంగా ఆలోచించగలినవాడు, తగిన దేశంలో, తగిన కాలంలో పురుషప్రయత్నంచేత కార్యం సాధించడానికి ప్రాధాన్యం ఇచ్చేవాడు, ఎప్పుడు సంధి చేసుకోవాలో - ఎప్పుడు పరాక్రమం చూపాలో, ఎప్పుడు దానం చెయ్యాలో , ఎప్పుడు ఏమీ ఇవ్వకుండా ఆపివేయాలో, పణం (అనగా సంధి షరతులను) శత్రువుల లోపాలను గుర్తించగలిగినవాడు, బాగా రక్షించబడినవాడు, వెకిలిగా నవ్వనివాడు, వంకర చూపులు, కనుబొమ్మల విరుపులు లేనివాడు, దురాశ, క్రోధం, లోభం, మొండితనం, చపలత్వం, బాధించే స్వభావం, చాడీలు చెప్పడం లేనివాడు, శక్లుడు (ప్రియంగా మాటలాడేవాడు) చిరునవ్వుతో ఉదగ్రంగా (హుందాతనంతో) మాటలాడేవాడు, పెద్దలు చెప్పినట్లుగా నడుచుకొనేవాడు - ఈ విధంగా ఉండడం ఆత్మసంపద.

2. అమాత్యసంపద వెనక చెప్పబడింది.

మూ. 1. మధ్యే చాన్తే చ స్థానవానాత్మధారణః, పరధారణశ్చాపది, స్వారక్షః, స్వాజీవః, శత్రుద్వేషీ, శక్యసామన్తః, పఙ్కపాషాణోషరవిషమకణ్టక శ్రేణీవ్యాలమృగాటవీహీనః, కాన్తః, సీతాఖనిద్రవ్యహస్తివనవాన్, గవ్యః, పౌరుషేయః, గుప్తగోచరః, పశుమాన్, అదేవమాతృకః, వారిస్థలపథాభ్యాము పేతః, సారచిత్రబహుపణ్యః, దణ్డకరసహః, కర్మశీలకర్షకః, అబాలిశస్వామీ, అవరవర్ణప్రాయః భక్తశుచిమనుష్య ఇతి జనపదసంపత్.

2. దుర్గసంపదుక్తా పురస్తాత్.

3. ధర్మాధిగతః పూర్వం స్వయం వా హేమరూప్యప్రాయః, చిత్రస్థూల

రత్నహిరణ్యః దీర్ఘామప్యాపదమ్ అనాయతిం సహేతేతి కోశసంపత్.

వ్యా. 1. మధ్యయందు, సరిహద్దులందు దృఢమైన స్థానాలు (దుర్గాదులు) కలది, తన ప్రజలు, బైటనుంచి వచ్చేవాళ్లు నివసించడానికి తగిన విధంగా ఆహారపానీయాదులు కలది, ఆపత్సమయంలో మంచి రక్షణ కలది లేదా అనాయాసంగా రక్షించడానికి తగినది, సులభమైన జీవనోపాధులు ఉన్నది, శత్రువులను ద్వేషించేది, లొంగదీయడానికి తగిన సామంతులు గలది, బురద, రాళ్లు, చవటనేల, ఎగుడుదిగుడు భూమి, ముళ్లు, శ్రేణులు (ఎత్తైన దిబ్బలు) క్రూరమృగవనాలు, లేళ్లు నివసించే వనాలు లేనిది, మనోహరంగా ఉండేది, వ్యవసాయభూములు, గనులు, వివిధవస్తువులు లభించే వనాలు, గజవనాలు ఉన్నది, గోవులతో నిండినది, లేదా గోవులకు హితమైనది, మంచి పురుషు లున్నది, సంరక్షించబడిన బీళ్లు గలది, పశువు లున్నది, దేవమాతృకం (వర్షాలమీద ఆధారపడేది) కానిది, జలమార్గాలు, స్థలమార్గాలు ఉన్నది, శ్రేష్ఠమైన వివిధములైన అనేక పణ్యవస్తువులు గలది, దండకరం (దండంగా పన్ను) విధించినా భరించగలది, ఎల్లప్పుడు పనులు చేసే అలవాటు గల వ్యవసాయదారులు గలది, బుద్ధిమంతులైన స్వాములు (యజమానులు) గలది, క్రింది వర్ణాలవాళ్లు ఎక్కువగా ఉన్నది, రాజభక్తీ, నిజాయతీ ఉన్న మనుష్యులు గలది - ఈ విధంగా జనపదం ఉండడం జనపదసంపద.

2. దుర్గసంపద వెనుక చెప్పబడింది.

3. తన పూర్వికులచేత గాని, తన చేత గాని ధర్మానుసారం పొందబడినది, బంగారము వెండీ అధికంగా ఉన్నది, అనేకవిధాలైన పెద్ద మణులు,నాణాలు ఉన్నది, చాల కాలంపాటు ఉండే కరువు మొదలైన ఆపదను, క్రొత్తగా ధనం చేరకపోవడాన్ని తట్టుకోగలిగినది - ఈ విధంగా కోశం ఉండడం కోశసంపద.

మూ. 1. పితృపైతామహో, నిత్యో, వశ్యః, తుష్టభృతపుత్రదారః, ప్రవాసేష్వపి సంపాదితః, సర్వత్ర అప్రతిహతః, దుఃఖసహః, బహుయుద్ధః, సర్వయుద్ధప్రహరణవిద్యావిశారదః సహవృద్ధిక్షయకత్వాత్ అద్వైధ్యః, క్షత్రప్రాయ ఇతి దణ్డసంపత్.

2. పితృపైతామహం, నిత్యం, వశ్యమ్, అద్వైధ్యం, మహత్, లఘుసముత్థమ్ ఇతి మిత్రసంపత్.

3. అరాజబీజీ, లుబ్ధః, క్షుద్రపరిషత్కః, విరక్తప్రకృతిః, అన్యాయవృత్తిః, అయుక్తః, వ్యసనీ, నిరుత్సాహః, దైవప్రమాణః, యత్కిఞ్చనకారీ, అగతిః, అననుబన్ధః, క్లీబః, నిత్యాపకారీ, చేత్యమిత్రసంపత్. ఏవంభూతో హి యః శత్రుః సుఖః సముచ్ఛేత్తుం భవతి..

వ్యా. 1. తండ్రితాతలనుండి అనుస్యూతంగా వచ్చుచున్నది, నిత్యమైనది, లొంగి ఉండేది, సంతోషించే విధంగా రాజుచేత పోషించబడిన పుత్రులు, భార్యలు కలది, ప్రవాససమయాలలో కూడ బాగా ఏర్పరచబడిన భోజనవాసాది సౌఖ్యములు గలది, ఎక్కడా అడ్డు లేనిది, శ్రమను ఓర్చుకొనగలిగినది, చాలా యుద్ధాలలో పాల్గొన్నది, సమస్తమైన యుద్ధాలలో ఉపయోగించే ఆయుధాల విద్యలలో ప్రావీణ్యం కలది, వృద్ధిలో నైనా క్షయంలోనైనా (సుఖదుఃఖాలలో) పాలు పంచుకొనేదవడంచేత భేదం కల్పించడానికి శక్యం కానిది, క్షత్రియులు ఎక్కువగా గలది - సైన్యం ఈ విధంగా ఉంటే అది దండసంపద.

2. తండ్రి తాతలనుండి అనుస్యూతంగా వస్తున్నది, నిత్యమైనది, వశంలో ఉండేది, భేదభావం కల్పించడానికి శక్యం కానిది, గొప్పది, అతిశీఘ్రమైన సముత్థానం కలది అనగా అతిశీఘ్రకాలంలో పనిచేయడానికి పూన్కొనేది - ఈ విధంగా ఉన్న మిత్రులుండడం మిత్రసంపద.

3. రాజబీజం వల్ల పుట్టనివాడు, లుబ్ధుడు, నీచమైన పరిషత్తు (పరివారం) కలవాడు, ప్రకృతుల (ప్రజల లేదా మంత్రి మొదలైన ప్రకృతుల) ప్రేమను చూరగొనని వాడు, అన్యాయమైన ప్రవృత్తి గలవాడు, యుక్తశీలుడు కాని వాడు, దుర్వ్యసనాలు ఉన్నవాడు, ఉత్సాహం లేనివాడు, దైవంమీద ఆధారపడినవాడు, ఏదో విధంగా పనులు చేసేవాడు, మరొక గతి లేనివాడు, అనుబంధం (కూడా ఉండవలసిన సహాయకజనం) లేనివాడు, ధైర్యం లేనివాడు, నిత్యమూ ఇతరులకు అపకారం చేసేవాడు - ఈ విధమైన శత్రు వుండడం అమిత్రసంపద. ఎందువల్ల ననగా ఈ విధమైన శత్రువును అనాయాసంగా పెకిలించివేయవచ్చును.

శ్లో. అరివర్జాః ప్రకృతయః సప్తైతాః స్వగుణోదయాః,
ఉక్తాః ప్రత్యఙ్గభూతాస్తాః ప్రకృతా రాజసంపదః.

వ్యా. అమిత్రుడు తప్ప ఈ ఏడు ప్రకృతులు వాటి వాటి మంచి గుణాలచేత అభివృద్ధి గలవిగా చెప్పబడినవి. ప్రకృతములైన అనగా తమ తమ విధులను చక్కగా నిర్వహించే, ఆ ప్రకృతులు రాజుయొక్క సంపదకు (అభివృద్ధికి) అంగాలుగా అవుతాయి. రాజుయొక్క అభివృద్ధికి కారకములు అవుతాయి.

శ్లో. సంపాదయత్యసంపన్నాః ప్రకృతీరాత్మవాన్ నృపః,
వివృద్ధాశ్చానురక్తాశ్చ ప్రకృతీర్హ న్త్యనాత్మవాన్.

వ్యా. ఆత్మగుణసంపన్నుడైన రాజు అసంపన్నులైన (కావలసిన సద్గుణా లన్నీ లేని) ప్రకృతులను కూడ సంపన్నులనుగా చేయకలుగుతాడు. ఆత్మగుణవిహీనుడైన రాజు మంచి గుణాలతో వృద్ధిపొందినవాళ్లు, అనురక్తులూ అయిన ప్రకృతులు కూడ చెడిపోయే టట్లు చేస్తాడు.

శ్లో. తతః సదుష్టప్రకృతిశ్చాతురన్తోఽప్యనాత్మవాన్,
హన్యతే వా ప్రకృతిభిర్యాతి వా ద్విషతాం వశమ్.

వ్యా. అందువల్ల ప్రకృతులు దుష్టులై తాను కూడ అనాత్మవంతుడైన రాజు చతుః సముద్రాంతభూమండలానికి ప్రభువైనా కూడ ప్రకృతులచేత నశింపచేయబడతాడు లేదా శత్రువులకు వశుడైపోతాడు.

శ్లో. ఆత్మవాంస్త్వల్పదేశోఽపి యుక్తః ప్రకృతిసంపదా,
నయజ్ఞః పృథివీం కృత్స్నాం జయత్యేవ న హీయతే.

ఇతి కౌటలీయార్థశాస్త్రే మణ్డలయోనౌ షష్ఠాధికరణే ప్రథమోఽధ్యాయః
ప్రకృతిసంపదః, ఆదితః సప్తనవతితమః.

వ్యా. ఆత్మవంతుడై యుండి ప్రకృతిసంపదతో కూడిన, నీతిశాస్త్రవేత్త యైన రాజు చిన్న దేశం మాత్రమే కలవాడైనా కూడ సమస్త భూమిని జయించితీరుతాడు; ఎప్పటికీ నశించడు.

"బాలానందిని" అను కౌటలీయార్థశాస్త్రాంధ్రవ్యాఖ్యానంలో మండలయోని అనే షష్ఠాధికరణంలో ప్రకృతిసంపదలు అను ప్రథమాధ్యాయం, ప్రారంభంనుంచి తొంభైఏడవ అధ్యాయం సమాప్తం.

# అథ ద్వితీయో ఽధ్యాయః

## సప్తనవతితమం ప్రకరణమ్ - శమవ్యాయామికమ్
## (శాంతికార్యాచరణం = **peace and Tranquility**).

మూ. 1. శమవ్యాయామౌ యోగక్షేమయోర్యోనిః.

2. కర్మారమ్భాణాం యోగారాధనో వ్యాయామః. కర్మఫలోపభోగానాం క్షేమారాధనః శమః.

3. శమవ్యాయామయోర్యోనిః షాడ్గుణ్యమ్.

4. క్షయః స్థానం వృద్ధిరిత్యుదయాస్తస్య.

5. మానుషం నయానయౌ; దైవమయానయౌ.

వ్యా. 1. శమవ్యాయామాలు యోగక్షేమాలకు కారణం.

2. తలబెట్టి ప్రారంభించిన పనుల పరిసమాప్తిని సంపాదించేది వ్యాయామం. పూర్తి చేసిన పనులవల్ల కలిగే ఫలాలను ఏ బాధలు లేకుండా అనుభవింపచేసేది శమం.

3. శమానికీ వ్యాయామానికీ కారణ మైనది షాడ్గుణ్యం.

4. క్షయం, స్థానం (ఉన్నది ఉన్నట్లు ఉండడం), అభివృద్ధి అనేవి ఆ షాడ్గుణ్యం యొక్క ఫలాలు.

5 మనుష్యుల ప్రయత్నం నయం (నీతియుక్తం), అపనయం (నీతివిరుద్ధం) అని రెండు విధాలు. దైవకృతమైన కర్మ అయం (శుభకరము), అనయం (అశుభకరం) అని రెండు విధాలు. (ఈ మానుషదైవాలు షాడ్గుణ్యోదయానికి కారణం అని అర్థం).

మూ. 1. దైవమానుషం హి కర్మ లోకం యాపయతి. అదృష్టకారితం దైవమ్. తస్మిన్ ఇష్టేన ఫలేన యోగః అయః. అనిష్టేన అనయః.

2. దృష్టకారితం మానుషమ్. తస్మిన్ యోగక్షేమనిష్పత్తిర్నయః, విపత్తిరనయః, తచ్చిన్త్యమ్. అచిన్త్యం దైవమితి.

3. రాజా ఆత్మద్రవ్యప్రకృతిసంపన్నః నయస్యాధిష్ఠానం విజిగీషుః. తస్య సమన్తతో మణ్డలీభూతాః భూమ్యనన్తరా అరిప్రకృతిః. తథైవ భూమ్యేకాన్తరా మిత్రప్రకృతిః.

వ్యా. 1. దైవంవల్ల జరిగే పని, మనుష్యయత్నం వల్ల జరిగే పని ఈ రెండే లోకాన్ని నడిపిస్తున్నాయి కదా? మనకు కనబడని దానిచేత (ఏదో ఒక శక్తిచేత, ధర్మాధర్మాదుల చేత) చేయించబడినది దైవం. దైవకృతకర్మవల్ల ఇష్టఫలం లభిస్తే అది (అయం), అనిష్టఫలం లభిస్తే అది (అనయం).

2. కనబడేదానిచేత చేయించబడినది 'మానుషం'. ఆ మానుషం ద్వారా యోగక్షేమాల లాభం 'నయం'. ఆపద లభించడం 'అనయం'. మానుషకర్మ ప్రత్యక్షంగా కనబడేది అవడంచేత దానిని గూర్చి ముందుగా ఆలోచించవచ్చును. దైవకృతకర్మను గూర్చి ఆలోచించడానికి శక్యం కాదు.

3. ఆత్మసంపద, అమాత్యాదిద్రవ్యప్రకృతిసంపద ఉండి విజిగీషువైన (జయించాలనే అభిలాష గల) రాజు నయానికి అధిష్ఠానం (ఆశ్రయం) అయినవాడు. విజిగీషువుకు నాల్గు మూలలా మండలంగా, దేశం ప్రక్కనే (సరిహద్దులలో) మండలంగా ఉన్నది 'అరిప్రకృతి'. తన దేశంనుంచి ఒక దేశం వ్యవధానంతో (ఒక దేశానికి అవతల) ఉన్న మండలం "మిత్రప్రకృతి".

మూ. 1. అరిసంపద్యుక్తః సామన్తః శత్రుః. వ్యసనీ యాతవ్యః. అనపాశ్రయో దుర్బలాశ్రయో వా ఉచ్ఛేదనీయః. విపర్యయే పీడనీయః, కర్శనీయో వా. ఇత్యరివిశేషాః.

2. తస్మాన్మిత్రమ్ అరిమిత్రం మిత్రమిత్రం, అరిమిత్రమిత్రం చ ఆనన్తర్యేణ భూమీనాం ప్రసజ్యతే పురస్తాత్. పశ్చాత్ పార్ష్ణిగ్రాహః, ఆక్రన్దః, పార్ష్ణిగ్రాహాసారః, ఆక్రన్దాసార ఇతి.

3. భూమ్యనన్తరః ప్రకృత్యమిత్రః తుల్యాభిజనః సహజః. విరుద్ధో విరోధయితా వా కృత్రిమః.

వ్యా. 1. "అరాజబీజీ" ఇత్యాదివిధమైన వెనుక చెప్పిన అరిసంపద ఉన్న

సామంతుడు శత్రువు. అతడు దుర్వ్యసనా లున్నవా డైతే లేదా కష్టాలలో ఉన్న ట్లయితే వాని మీదకు యుద్ధయాత్రకు వెళ్లాలి. అతడు ఆశ్రయం లేనివాడైనా, దుర్బలమైన ఆశ్రయం కలవాడైనా వానిని పూర్తిగా రూపుమాపాలి. అలా కాకపోతే (మంచి ఆశ్రయం ఉన్నవాడైతే) పీడించాలి, దుర్బలు డయ్యే టట్లు చెయ్యాలి. ఈ విధంగా యాతవ్యుడు, ఉచ్ఛేదనీయుడు, పీడనీయుడు, కర్శనీయుడు అని నాలుగు శత్రుభేదాలు.

2. శత్రువుకు అవతల ఉన్న రాజు 'మిత్రుడు'. వానికి (మిత్రరాజుకు) అవతల ఉన్నవాడు 'శత్రుమిత్రుడు'. వానికి అవతల ఉన్నవాడు 'మిత్రమిత్రుడు'. వానికి అవతల ఉన్నవాడు 'శత్రుమిత్రమిత్రుడు'. ఈ విధంగా విజిగీషువుయొక్క రాజ్యానికి (దేశానికి) ఎదుట ఉన్న రాజ్యాల (దేశాల) ఆనంతర్యాన్ని (ఒక దాని ప్రక్క మరొకటి ఉండడాన్ని) పట్టి ఇవి (మిత్రత్వాదులు) ఏర్పడతాయి.విజిగీషువునకు వెనుక దేశంలో ఉన్న రాజు "పార్ష్ణిగ్రాహుడు'(శత్రువు), వాని వెనక ఉన్నవాడు 'ఆక్రందుడు'(మిత్రుడు) వాని వెనక ఉన్నవాడు పార్ష్ణిగ్రాహాసారుడు' (శత్రుమిత్రుడు). వాని వెనక ఉన్నవాడు 'ఆక్రందాసారుడు' (మిత్రమిత్రుడు). విజిగీషువును మధ్య ఉన్నట్లు గ్రహించినప్పుడు మొత్తం పదిమంది రాజుల మండలం (దశరాజమండలం). మధ్య విజిగీషువు, వాని ముందు శత్రువు మొదలైన ఐదుగురు రాజులు, వెనుక పార్ష్ణిగ్రాహుడు మొదలైన నలుగురు రాజులు, విజిగీషువు తన ముందు ఉన్న శత్రువుతో యుద్ధం చేస్తున్నప్పుడు వెనుకనుండి వచ్చి విజిగీషురాజ్యంలో బాధకల్పించేవాడు పార్ష్ణిగ్రాహుడు. ఇతడు విజిగీషుని శత్రువుకు మిత్రుడు. పార్ష్ణిగ్రాహుడు ఆ విధంగా విజిగీషువుకు బాధ కల్పించకుండా అడ్డుకొనేవాడు ఆక్రందుడు. అతడు విజిగీషుని శత్రువుకు శత్రువవడం చేత మిత్రుడు. విజిగీషువునకు సహాయం చేయకుండా వీనిని అడ్డుకొనేవాడు పార్ష్ణి గ్రహాసారుడు. ఇతడు విజిగీషుని శత్రుమిత్రుడు. వానిని అడ్డుకొనేవాడు ఆక్రందాసారుడు. ఇతడు విజిగీషుని శత్రుమిత్రశత్రువు.

3. సరిహద్దు దేశంలో ఉన్నవాడు ప్రకృతిచేతనే (స్వభావంచేతనే) అమిత్రుడు. తనతో సమానమైన పుట్టుక కలవాడు అనగా ఒకే రాజవంశంలో పుట్టడంచేత రాజ్యంమీద అధికారాన్ని సంపాదించడం కోసం ప్రయత్నించేవాడు సహజుడు. (వీళ్లిద్దరూ కూడ సహజశత్రువులు. గ.శా.) తాత్కాలికంగా తనతో విరోధం పెట్టుకొన్నవాడు, మరొకరిని విరోధించే టట్లు ప్రేరేపించినవాడు కృత్రిమశత్రువు.

మూ. 1. భూమ్యేకాన్తరం ప్రకృతిమిత్రం మాతాపితృసంబన్ధం సహజమ్,

ధనజీవితహేతోః ఆశ్రితం కృత్రిమమితి.

2. అరివిజిగీష్వోః భూమ్యనన్తరః సంహతాసంహతయోః అనుగ్రహ సమర్థః నిగ్రహే చ అసంహతయోః మధ్యమః.

3. అరివిజిగీషుమధ్యానాం బహిః ప్రకృతిభ్యో బలవత్తరః సంహతా సంహతానామ్ అరివిజిగీషుమధ్యమానామనుగ్రహే సమర్థో నిగ్రహే చ అసంహతానామ్ ఉదాసీనః ఇతి ప్రకృతయః.

4. విజిగీషుర్మిత్రం మిత్రమిత్రం ప్రకృతయస్తిస్రః. తాః పఞ్చభిః అమాత్యజనపదదుర్గకోశదణ్డప్రకృతిభిః ఏకైకశః సంయుక్తాః మణ్డలమష్టా దశకం భవతి. అనేన మణ్డలపృథక్త్వం వ్యాఖ్యాతమరిమధ్యమోదాసీనానామ్.

వ్యా. 1. తనరాజ్యం తరవాత ఉన్న రాజ్యానికి అవతల రాజ్యంలో ఉన్నవాడు ప్రకృతిమిత్రుడు (స్వాభావికమిత్రుడు). ధనంకోసం కాని, జీవితంకోసం కాని ఆశ్రయించినవాడు కృత్రిమమిత్రుడు.

2. విజిగీషువు రాజ్యానికి, అతని శత్రువుయొక్క రాజ్యానికి సరిహద్దులో ఉన్నవాడు, వాళ్లిద్దరూ సంధి చేసికొని కలిసి ఉన్నా, కలవకపోయినా వాళ్లని అనుగ్రహించడానికి (సహాయం చేయడానికి) సమర్థుడు, వాళ్లు కలవ నప్పుడు ఇద్దర్నీ కూడ నిగ్రహించడానికి సమర్థుడు అయిన రాజు మధ్యముడు, (నిజానికి సరిహద్దులో ఉన్నవాడవడంచేత) శత్రువే అయినా అతడు అనుసరించిన విధానాన్ని పట్టి అతడు మధ్యముడు).

3. విజిగీషు-శత్రు-మధ్యములకు బైట ఉన్నవాడు, వాళ్ల ప్రకృతులకంటె ఎక్కువ బలం ఉన్నవాడు, ఆ అరివిజిగీషుమధ్యములు కలిసి ఉన్నా కలిసి లేకపోయినా వాళ్లని అనుగ్రహించడానికి సమర్థుడు, వాళ్లు కలిసి లేనప్పుడు వాళ్లని నిగ్రహించడానికి సమర్థుడూ అయిన రాజు "ఉదాసీనుడు". ఈ విధంగా పన్నెండు విధాలైన రాజప్రకృతులను గూర్చి చెప్పబడింది.

4. విజిగీషువు, మిత్రుడు, మిత్రమిత్రుడు అని విజిగీషువుకు సంబంధించిన ప్రకృతులు మూడు. ఆ ముగ్గురిలోనూ ఒక్కొక్కరికి అమాత్యులు, జనపదం, దుర్గం, కోశం, దండం అనే ప్రకృతులు కలిస్తే మూడు ఆర్లు పద్దెనిమిది ఒక మండలంగా

ఏర్పడుతుంది. అనగా విజిగీషువు వాని ఐదు ప్రకృతులు-మొత్తం ఆరు ప్రకృతులు. వాని మిత్రుడు ఆతని పంచప్రకృతులు -మొత్తం ఆరు. మిత్రమిత్రుడు వాని పంచప్రకృతులు-మొత్తం ఆరు. ఈ విధంగా విజిగీషు-మిత్ర-మిత్రమిత్రులు మొత్తం పద్దెనిమిది కలిసి ఒక మండలం అని అర్థం. ఇదే విధంగా శత్రు-మధ్యమ-ఉదాసీనులు వాళ్ల ప్రకృతులూ కలిసి అదొక అష్టాదశకమండలం ఏర్పడుతుంది.

మూ. 1. ఏవం చతుర్మణ్డలసంక్షేపః. ద్వాదశ రాజప్రకృతయః, షష్టిః ద్రవ్యప్రకృతయః సంక్షేపేణ ద్విసప్తతిః.

2. తాసాం యథాస్వం సంపదః.

3. శక్తిః సిద్ధిశ్చ. బలం శక్తిః. సుఖం సిద్ధిః.

4. శక్తిస్త్రివిధా-జ్ఞానబలం మన్త్రశక్తిః, కోశదణ్డబలం ప్రభుశక్తిః, విక్రమబలమ్ ఉత్సాహశక్తిః.

5. ఏవం సిద్ధిః త్రివిధైవ-మన్త్రశక్తిసాధ్యా మన్త్రసిద్ధిః, ప్రభుశక్తిసాధ్యా ప్రభుసిద్ధిః, ఉత్సాహశక్తిసాధ్యా ఉత్సాహసిద్ధిరితి.

6. తాభిః అభ్యుచ్చితో జ్యాయాన్ భవతి. అపచితో హీనః. తుల్యశక్తిః సమః. తస్మాత్ శక్తిం సిద్ధిం చ ఘటేతాత్మన్యావేశయితుమ్. సాధారణో వా ద్రవ్యప్రకృతిష్వానన్తర్యేణ శౌచవశేన వా. దూష్యామిత్రాభ్యాం వా అపక్రష్టుం యతేత.

వ్యా. 1. ఈ విధంగా సంక్షిప్తంగా నాలుగు మండలాలు చెప్పబడినవి. పన్నెండు రాజరూపులైన ప్రకృతులు, అరవై అమాత్యాది ద్రవ్యప్రకృతులు - ఇవి సంక్షేపంగా డెబ్బైరెండు.

2. ఆ యా ప్రకృతులకు సంబంధించిన సంపదలు వెనుకనే చెప్పబడినవి

3. శక్తి, సిద్ధి చెప్పబడుచున్నవి. 'శక్తి' అనగా బలం. 'సిద్ధి' అనగా సుఖం.

4. శక్తి మూడు విధాలు. జ్ఞానం యొక్క బలం 'మంత్రశక్తి', కోశ-సైన్యాల బలం 'ప్రభుశక్తి'. పరాక్రమం చూపడంలో బలం 'ఉత్సాహశక్తి'.

5. ఈ విధంగా సిద్ధి కూడ మూడు విధాలు. మంత్రశక్తిచేత సాధించదగిన సిద్ధి

'మంత్రసిద్ధి'. ప్రభుశక్తిచేత సాధించదగిన సిద్ధి 'ప్రభుసిద్ధి'. ఉత్సాహశక్తిచేత సాధించదగిన సిద్ధి 'ఉత్సాహసిద్ధి'.

6. ఈ శక్తులచేత వృద్ధి పొందింపబడిన రాజు శ్రేష్ఠుడు అవుతాడు. అవి లోపించిన వాడు హీనుడు అవుతాడు. శక్తులలో హెచ్చుతగ్గులు లేనివాడు సముడు. అందువల్ల రాజు తనలో శక్తిని, సిద్ధినీ సమకూర్చుకొనుటకు ప్రయత్నం చెయ్యాలి. సాధారణుడైతే అనగా తనలో ఎట్టి శక్తిసిద్ధులున్నాయో అట్టివే శత్రువులో ఉంటే, అమాత్య-జనపద-దుర్గాదిక్రమంలో తన ప్రకృతులలో శక్తిసిద్ధులను పెంపొందించడానికి ప్రయత్నించాలి. ఈ ప్రకృతులలో ఎవరికి ఎక్కువ శుచిత్వం (మంచితనం, ఉత్తమత్వం, విశ్వాసపాత్రత్వం) ఉందో వాళ్లలో శక్తిసిద్ధులను పెంపొందించాలి. లేదా దూష్యుల (రాజద్రోహుల) లోను అమిత్రులలోను ఉన్న శక్తిసిద్ధులను తగ్గించడానికి ప్రయత్నించాలి.

మూ. 1. యది వా పశ్యేత్ - "అమిత్రో మే శక్తియుక్తో వాగ్దణ్డపారుష్యార్థ దూషణైః ప్రకృతీరుపహనిష్యతి, సిద్ధియుక్తో వా మృగయామద్యద్యూతస్త్రీభిః ప్రమాదం గమిష్యతి, స విరక్తప్రకృతిః, ఉపక్షీణః, ప్రమత్తో వా సాధ్యో మే భవిష్యతి. విగ్రహాభియుక్తో వా సర్వసన్దోహేన ఏకస్థః అదుర్గస్థో వా స్థాస్యతి. స సంహతసైన్యః మిత్రదుర్గవియుక్తః సాధ్యో మే భవిష్యతి. బలవాన్వా రాజా పరతః శత్రుముచ్ఛేత్తుకామస్తముచ్ఛిద్య న మాముచ్ఛిన్ద్యాత్" ఇతి, "బలవతా ప్రార్థితస్య మే విపన్నకర్మారమ్భస్య వా సాహాయ్యం దాస్యతి మధ్యమలిప్సాయాం చ" ఇతి ఏవమాదిషు కారణేషు అమిత్రస్యాపి శక్తిం సిద్ధిం చేచ్ఛేత్.

వ్యా. 1. క్రింద చెప్పబోయే పరిస్థితులలో విజిగీషువు తన శత్రువునకు కూడ శక్తి-సిద్ధులు ఉండాలని కోరుకోవాలి. ఎప్పు డనగా - "ఈ నా శత్రువు శక్తియుక్తుడై వాక్పారుష్యంచేత దండపారుష్యంచేత అర్థదూషణాలచేత (అన్యాయంగా ధనం లాగికొనడంచేత) ప్రకృతులకు అపకారం చేస్తాడు. లేదా సిద్ధియుక్తుడైతే వేట, జూదం, మద్యం, స్త్రీలు- ఈ వ్యసనాలలో పడిపోతాడు. అప్పుడు వాని విషయంలో ప్రకృతులకు వైముఖ్యం ఏర్పడుతుంది. ఈ విధంగా క్షీణదశలో ఉన్న లేదా ఏమరిపాటుతో ఉన్న వీనిని అనాయాసంగా జయించవచ్చును" అని అనుకొన్నప్పుడు, లేదా - "నేను వీనితో విరోధం పెట్టుకొని ఎదిరించి నప్పుడు ఇతడు సమస్తసైన్యంతో కలిసి ఒక చోట ఉంటాడు; దుర్గంలో ఉండడు, అట్టి పరిస్థితిలో ఒక చోట సైన్యం అంతా చేరి ఉండి

మిత్రులకీ, దుర్గానికీ దూరంగా ఉన్న వానిని నేను అనాయాసంగా జయించ వచ్చును" అనుకొన్నప్పుడు, లేదా అవతల నున్న ఒక బలవంతుడైన రాజు నా శత్రువును నశింపచేసే ఆలోచనలో ఉన్నాడు, అతడు వానిని నశింపచేసి నన్ను కూడా నశింపచేయవచ్చును (అందుచేత శత్రువుకు శక్తిసిద్ధులు ఉండడమే మంచిది) అని అనుకొన్నప్పుడు, లేదా ఎవడైన బలవంతుడైన రాజు నన్ను ఆక్రమించే టప్పుడు నా కర్మలు ఆరంభాలు దెబ్బతిని ఉన్న సమయంలో నేను ఎవరినైనా మధ్యముణ్ణి ఆశ్రయించాలి అనుకొనే టప్పుడు ఇతడు (ఈ శత్రువు) నన్ను ఆదుకొంటాడు అని అనుకొన్నప్పుడు- ఈ విధమైన కారణాలు ఉన్నప్పుడు అమిత్రునికి కూడ శక్తి-సిద్ధులు ఉండా లని కోరుకోవాలి.

శ్లో. నేమిమేకాన్తరాన్ రాజ్ఞః కృత్వా చానన్తరాన్తరాన్,
నాభిమాత్మానమాయచ్ఛేత్ నేతా ప్రకృతిమణ్డలే.

వ్యా. ద్వాదశరాజమండలానికి నాయకుడైన విజిగీషువు తన దేశానికి ఒక దేశం వ్యవధానంలో ఉన్నవాళ్లని చక్రం అంచుగాను, తనదేశానికి సరిహద్దులలో ఉన్నవాళ్లని ఆకులు గాను చేసి ప్రకృతిమండలం అనే చక్రానికి తనను నాభిస్థానంలోఉండే టట్లు చేసికోవాలి.

శ్లో. మధ్యే హ్యుపహితః శత్రుర్నేతుర్మిత్రస్య చోభయోః,
ఉచ్ఛేద్యః పీడనీయో వా బలవానపి జాయతే.

ఇతి కౌటలీయార్థశాస్త్రే మణ్డలయోనౌ షష్ఠాధికరణే ద్వితీయోఽధ్యాయః, శమవ్యాయామికమ్, ఆదితః అష్టనవతితమః. ఏతావతా కౌటలీయార్థశాస్త్రస్య మణ్డలయోనిః షష్ఠమధికరణం సమాప్తమ్.

వ్యా. నాయకునికీ, వాని మిత్రునికీ - వీరిద్దరికీ మధ్య ఉన్న శత్రువు, ఎంత బలవంతు డైనా పూర్తిగా పెకిలించివేయడానికి గాని, పీడించడానికి గాని శక్యమైనవాడుగా ఉంటాడు. అలాంటివానిని ఎక్కువగా పీడించవచ్చు, చివరికి పెకిలించివేయవచ్చును కూడ అని అర్థం.

"బాలానందిని" అను కౌటిలీయార్థశాస్త్రాంధ్రవ్యాఖ్యానంలో మండలయోని అను ఆరవ అధికరణంలో శమవ్యాయామికం అను రెండవ అధ్యాయం, ప్రారంభంనుంచి తొంభైఎనిమిదవ అధ్యాయం సమాప్తం. కౌటిలీయార్థశాస్త్రంలో మండలయోని అను షష్ఠాధికరణం సమాప్తం.

# అథ షాడ్గుణ్యమ్ - సప్తమమధికరణమ్

## ప్రథమోఽధ్యాయః

### అష్టనవతితమ, ఏకోనశతతమప్రకరణే - షాడ్గుణ్యసముద్దేశః క్షయస్థానవృద్ధినిశ్చయశ్చ (The six Measures of Foreign Policy) షాడ్గుణ్యసముద్దేశం (Enumeration of Six Measures of Foreign Policy) -క్షయ-స్థాన-వృద్ధులనిశ్చయం (Determination of (Measures in) Decline, Stable Condition and Advancement)

మూ. 1. షాడ్గుణ్యస్య ప్రకృతిమణ్డలం యోనిః.

2. సంధివిగ్రహాసనయానసంశ్రయద్వైధీభావాః షాడ్గుణ్యమ్ ఇత్యాచార్యాః.

3. ద్వైగుణ్యమ్ ఇతి వాతవ్యాధిః, సంధివిగ్రహాభ్యాం హి షాడ్గుణ్యం సంపద్యతే ఇతి.

4. షాడ్గుణ్యమేవైతదవస్థాభేదాత్ ఇతి కౌటల్యః.

5. తత్ర పణబన్ధః సంధిః, అపకారో విగ్రహః, ఉపేక్షణమాసనమ్, అభ్యుచ్చయో యానమ్, పరార్పణం సంశ్రయః, సంధివిగ్రహోపాదానం ద్వైధభావ ఇతి షడ్గుణాః.

వ్యా. 1. సంధి మొదలైన ఆరు గుణాలకు స్వామ్యాదులైన ఐదు ప్రకృతులు, ద్వాదశరాజమండలమూ మూలకారణం.

2. సంధి, విగ్రహం, ఆసనం, యానం, సంశ్రయం, ద్వైధీభావం ఇవి ఆరూ 'షాడ్గుణ్యం' అని ప్రాచీనాచార్యులు చెప్పినారు.

3. సంధి, విగ్రహం అనే రెండు గుణాలే ప్రధానమైనవి; ఎందువల్ల ననగా సంధివిగ్రహాలచేత షాడ్గుణ్యం ఏర్పడుతుంది, అనగా ఆసనం మొదలైన నాలుగు సంధివిగ్రహాలచేతనే ఏర్పడతాయి గాన వాటిలోనే అంతర్గతాలు అని వాతవ్యాధి అనే ఆచార్యుని అభిప్రాయం. (ఈ వాతవ్యాధి ఉద్ధవుడు కావచ్చును).

4. అవస్థలలో, (పరిస్థితులలో) భేదం ఉండడంచేత ఆరు గుణాలు వేరు వేరు. అందుచేత షాడ్గుణ్యాన్నే అంగీకరించా లని కౌటల్యుని అభిప్రాయం.

5. వాటిలో - 'సంధి' అనగా ఒప్పందం కుదుర్చుకొనడం. అపకారం చేయడం "విగ్రహం'. సంధి చేసికొనకుండా, అపకారం చేయకుండా ఉండడం 'ఆసనం'. శక్తినీ దేశకాలాదులలో అభివృద్ధిని సంపాదించడం 'యానం'. ఈ విధమైన అభివృద్ధి ఉన్నప్పుడే శత్రువుమీదికి దండెత్తి వెళ్లడం కుదురుతుంది గాన దీనికి యానం అని పేరు పెట్టబడింది. యానం అనగా అర్థం దండెత్తి వెళ్లడం. శత్రువు బలవంతు డైనప్పుడు తనను వానికి సమర్పించడం (లొంగిపోవడం) సంశ్రయం. లేదా సహాయం కోరి మరొక బలవంతుణ్ణి ఆశ్రయించడం సంశ్రయం. సంధివిగ్రహాలు రెండింటినీ నడిపించడం అనగా ఒక శత్రువుతో సంధి చేసికొని రెండవ శత్రువుతో వైరం కొనసాగించడం ద్వైధీభావం. ఈ విధంగా గుణాలు ఆరు.

మూ. 1. పరస్మాద్ధీయమానః సందధీత. అభ్యుచ్చీయమానః విగృహ్ణీయాత్. న మాం పరో, నాహం పరముపహన్తుం శక్తః ఇత్యాసీత. గుణాతిశయయుక్తో యాయాత్. శక్తిహీనః సంశ్రయేత. సహాయసాధ్యే కార్యే ద్వైధీభావం గచ్ఛేత్. ఇతి గుణావస్థాపనమ్.

2. తేషాం యస్మిన్ వా గుణే స్థితః పశ్యేత్ "ఇహస్థః శక్ష్యామి దుర్గ సేతుకర్మవణిక్పథశూన్యనివేశఖనిద్రవ్యహస్తివనకర్మాణ్యాత్మనః ప్రవర్తయితుం పరస్య చైతాన్యుపహన్తుమ్" ఇతి తమాతిష్ఠేత్. సా వృద్ధిః.

వ్యా. 1. పరునికంటె తాను దుర్బలు డైపోతున్నప్పుడు సంధి చేసికొనాలి. వానికంటె అభివృద్ధిలో ఉన్నప్పుడు (బలవంతుడైనప్పుడు) వానితో విరోధం కొనసాగించాలి. "నన్ను శత్రువు ఏమీ చేయజాలడు; నేను శత్రువును ఏమీ చేయజాలను అని అనుకొన్నప్పుడు ఏమీ చేయకుండా (సంధివిగ్రహాలు చేయకుండా) ఊరక ఉండాలి. శత్రువుకంటె అధికగుణా లున్నప్పుడు వాని మీదికి దండెత్తి వెళ్లాలి. శక్తి లేనివాడు బలవంతుణ్ణి ఆశ్రయించాలి. సహాయం ఉంటేనే కార్యం సాధించడానికి శక్యం అవుతుంది అనే పరిస్థితిలో ద్వైధీభావం ఆచరించాలి. ఈ విధంగా ఆ యా గుణాలు అనుసరించే విధానం చెప్పబడింది.

2. ఈ గుణాలలో ఏ గుణాన్ని ఆశ్రయిస్తే -"ఈ గుణాన్ని అనుసరించడంవల్ల నా దుర్గాలకు, సేతువులకు సంబంధించిన పనులను, వర్తకుల మార్గాలను (వ్యాపార

మార్గాలను) శూన్యప్రదేశాలలో గ్రామాదినిర్మాణాలను, గనులకు, ద్రవ్యవనాలకు, గజవనాలకు సంబంధించిన పనులను సాధించడానికి శక్యం అవుతుంది; పరునికి సంబంధించిన ఈ పనులు జరగకుండా చేయడానికి వీలవుతుంది" అని అనుకుంటాడో ఆ గుణాన్ని అనుసరించాలి. ఇదే "వృద్ధి".

మూ. 1. "ఆశుతరా మే వృద్ధిః, భూయస్తరా వృద్ధ్యుదయతరా వా భవిష్యతి; విపరీతా పరస్య" ఇతి జ్ఞాత్వా పరవృద్ధిముపేక్షేత. తుల్యకాలఫలోదయాయాం వృద్ధౌ సంధిముపేయాత్.

2. యస్మిన్ వా గుణే స్థితః స్వకర్మణాముపఘాతం పశ్యేన్నేతరస్య తస్మిన్ న తిష్ఠేత్. ఏష క్షయః.

3. చిరేణాల్పతరం వృద్ధ్యుదయతరం వా క్షేష్యే, విపరీతం పర ఇతి జ్ఞాత్వా క్షయముపేక్షేత.

4. తుల్యకాలఫలోదయే వా క్షయే సంధిముపేయాత్.

5. యస్మిన్ వా గుణే స్థితః స్వకర్మవృద్ధిం క్షయం వా నాభిపశ్యేత్ ఏతత్ స్థానమ్.

6. హ్రస్వతరం వృద్ధ్యుదయతరం వా స్థాస్యామి, విపరీతం పర ఇతి జ్ఞాత్వా స్థానముపేక్షేత.

7. తుల్యకాలఫలోదయే వా స్థానే సంధిముపేయాత్ ఇత్యాచార్యాః.

8. నైతద్విభాషితమ్ ఇతి కౌటల్యః.

వ్యా. 1. "నాకు వృద్ధి శీఘ్రంగా కలగబోతుంది; పరునికి ఆలస్యంగా కలగబోతుంది, నాకు వృద్ధి అధికంగా కలగబోతుంది, పరునికి అల్పంగా కలగబోతుంది; నాకు వృద్ధి తరవాత వృద్ధి అవిచ్ఛిన్నంగా కలగబోతుంది. పరునికి వృద్ధి కలిగినా అవిచ్ఛిన్నంగా కలగదు" ఈ విధంగా కనబడినప్పుడు (ఈ విధమైన మూడు పరిస్థితులలోను) శత్రువుకు వృద్ధి కలుగుతున్నా ఉపేక్షించవచ్చును. తనకు పరునికీ కూడ వృద్ధి ఒకే సమయంలో ఒకే విధమైన ఫలం లభించే రీతిలో కలగబోతున్నది అని గుర్తించినపుడు సంధి చేసుకోవాలి.

2. ఏ గుణాన్ని ఆశ్రయించడంవల్ల తన పనులకు విఘాతం కలుగుతుందో, పరుని పనులకు విఘాతం కలగదో ఆ గుణాన్ని ఆశ్రయించకూడదు, అలా ఆశ్రయించడం క్షయం (క్షయానికి హేతువు).

3. "నాకు చాలా కాలం తరవాత అత్యల్పమైన క్షయం కలుగుతుంది. శత్రువుకు అతిశీఘ్రకాలంలోనే అధికమైన క్షయం కలుగుతుంది. నాకు క్షయం కలిగినా వెంటనే వృద్ధి కలుగుతుంది, శత్రువుకు క్షయం తరవాత క్షయం అన్న రీతిలో క్షయమే కలుగుతూ ఉంటుంది" అని గ్రహించినప్పుడు (తనకు తాత్కాలికంగా కలిగే) క్షయాన్ని ఉపేక్షించవచ్చును.

4. తనకు శత్రువుకు కూడ క్షయం ఒకే సమయంలో కలుగుతుంది అని గాని లేదా దానివల్ల కలిగే ఫలం కూడా తుల్యంగానే ఉంటుంది అని కాని తోచినప్పుడు సంధి చేసుకోవాలి.

5. ఏ గుణాన్ని ఆశ్రయించడంచేత తన కర్మలకు వృద్ధి కాని క్షయం కాని కలగదో అలాంటి గుణాన్ని ఆశ్రయించి ఉండడం 'స్థానం'.

6. "ఈ విధమైన 'స్థానం' నేను అత్యల్పకాలమే చేస్తాను, పరుడు చాలకాలం చేస్తాడు. నేను చేసే 'స్థానం' వల్ల వృద్ధి తరవాత వృద్ధి అనే రీతిలో వృద్ధి కలుగుతుంది; పరునకు అలా కలగదు" అని తోచినప్పుడు స్థానాన్ని ఉపేక్షించవచ్చును.

7. స్థానం తనకు పరునికీ ఒకే కాలంలో జరిగినా, లేదా దాని ఫలం సమంగానే ఉన్నా సంధి చేసుకోవాలి అని ఆచార్యులు చెప్పి ఉన్నారు.

8. దీనిని ఎవరూ కాదనరు అని కౌటల్యుని అభిప్రాయం.

మూ. 1. యది వా పశ్యేత్- "సంధౌ స్థితః మహాఫలైః స్వకర్మభిః పరకర్మాణ్యుపహనిష్యామి, మహాఫలాని వా స్వకర్మాణ్యుపభోక్ష్యే. పరకర్మాణి వా, సంధివిశ్వాసేన వా యోగోపనిషత్ప్రణిధిభిః పరకర్మాణ్యుపహనిష్యామి, సుఖం వా సానుగ్రహపరిహారసౌకర్యం ఫలలాభభూయస్త్వేన స్వకర్మణాం పరకర్మయోగావహం జనమాస్రావయిష్యామి, బలినాతిమాత్రేణ వా సంహితః పరః స్వకర్మోపఘాతం ప్రాప్స్యతి, యేన వా విగృహీతో మయా సంధత్తే తేన అస్య విగ్రహం దీర్ఘం కరిష్యామి, మయా వా సంహితస్య మద్ద్వేషిణో జనపదం పీడయిష్యతి, పరోపహతో వాస్య జనపదో మామాగమిష్యతి; తతః కర్మసు వృద్ధిం ప్రాప్స్యామి, విపన్నకర్మారమ్భో వా తాభ్యాం సంహితః కర్మసు వృద్ధిం ప్రాప్స్యామి, శత్రుప్రతిబద్ధం వా శత్రుణా సంధిం కృత్వా మణ్డలం భేత్స్యామి, భిన్నమవాప్స్యామి; దణ్డానుగ్రహేణ వా శత్రుముపగృహ్య

మణ్డలలిప్సాయాం విద్వేషం గ్రాహయిష్యామి, విద్విష్టం తేనైవ ఘాతయి ష్యామి'' ఇతి సంధినా వృద్ధిమాతిష్ఠేత్.

వ్యా. సంధిలో ఉన్నవాడనై (సంధి చేసికొన్నవాడనై) గొప్ప ఫలములు గల దుర్గసేతుఖన్యాదులైన నా కర్మలచేత పరుని కర్మలను నశింపచేస్తాను. లేదా మహాఫలములు గల నా కర్మలను అనుభవిస్తాను, లేదా సంధి చేసుకుంటే పరుని కర్మలను అనుభవించ కలుగుతాను. లేదా సంధిచేత విశ్వాసం కలిగించి యోగప్రణిధులచేత (గూఢపురుషతీక్ష్ణాదుల ప్రయోగం చేత) ఉపనిషత్ప్రణిధులచేత (విష-ధూమ-జలదూషణాదులచేత) పరుని కర్మలను నశింపచేస్తాను. లేదా పరుని కర్మలు చేస్తూన్నవారికి బీజాదులను ఇవ్వడం మొదలైన అనుగ్రహమూ, పన్ను మినహాయింపు మొదలైన సౌకర్యాలూ చూపి, వాళ్లు నా రాజ్యంలో చేసే పనులకు ఎక్కువ ఫలం లభిస్తుం దని ఆశ పెట్టి వాళ్ల నందరినీ నా రాజ్యానికి రప్పిస్తాను. లేదా బలవంతుడైన మరొక శత్రువుతో ఎక్కువ ధనం మొదలైనవి వానికి ఇవ్వడం ద్వారా సంధి చేసుకొన్న నా శత్రువు తన కర్మలలో నష్టపోతాడు. లేదా ఎవనితో విరోధం కలవాడై నాతో సంధి చేసికొన్నాడో వానితో వీని కున్న విరోధం పెరిగే టట్లు చేస్తాను. లేదా ఇతడు (ఇప్పుడు నాతో సంధి చేసికొన్న శత్రువు) నాతో పూర్వం సంధి చేసికొని ఉన్న నా (మరొక) శత్రువుయొక్క జనపదాన్ని పీడిస్తాడు. లేదా పరునిచేత పీడించబడిన వీని జనపదం చివరికి నాకు లభిస్తుంది. అప్పుడు నేను కర్మలలో ఇంకా వృద్ధి పొందకలుగుతాడు. లేదా ప్రారంభించిన పను లన్నీ చెడిపోయి కష్టాలలో ఉన్న శత్రువు నా కర్మల విషయంలో అడ్డుతగలడానికి ప్రయత్నించడు.లేదా ఈ శత్రువు ఇతరుని సహాయంతో కర్మారంభం చేసిన ట్లయితే వాళ్లిద్దరితోను సంధి చేసికొని నా కర్మలలో వృద్ధి పొందకలుగుతాను. లేదా వీనితో సంధిచేసికొనివీనితో సంబంధించి ఉన్న రాజమండలాన్ని ఛేదిస్తాను, అవిధంగా ఛేదించబడినవానిని లొంగదీసుకుంటాను. లేదా సైన్యం ఇవ్వడం ద్వారా శత్రువును గ్రహించి (నా వైపు ఉండే టట్లు చేసికొని) అతడు మండలం పొందడం కోసం ప్రయత్నిస్తే ఆ మండలానికి వీని విషయంలో ద్వేషం కలిగిస్తాను. లేదా వీనితో మరొకడు ద్వేషం ఉన్నవాడైతే వానిచేతనే వీనిని చంపిస్తాను. ఈ విధంగా తలచినట్లయితే అనగా ఇలాంటి పరిస్థితులలో ఉన్నట్లయితే, శత్రువుతో సంధి చేసుకొని వృద్ధిని పొందడానికి ప్రయత్నించాలి.

మూ. 1. యది వా మన్యేత ''ఆయుధీయప్రాయః శ్రేణీప్రాయో వా

స్వకర్మోపఘాతం వా త్రాతుమ్" ఇతి బలవన్తమాశ్రితః స్వకర్మానుష్ఠానేన క్షయాత్ స్థానం స్థానాద్ వృద్ధిం ఆకాఙ్క్షేత.

3. యది వా మన్యేత - 'సంధినైకతః స్వకర్మాణి ప్రవర్తయిష్యామి; విగ్రహేణైకతః పరకర్మాణ్యుపహనిష్యామి ఇతి' ద్వైధీభావేన వృద్ధిమాతిష్ఠేత్.

వ్యా. 1. లేదా - "నేను యానం చేసి నట్లయితే (యుద్ధానికి వెళ్లినట్లయితే) శత్రువుయొక్క కర్మలను నశింపచేయవచ్చును, నా కర్మలకు విఘాతం కలగకుండా రక్షణానికి తగిన అన్ని ఏర్పాట్లు చేసుకొని ఉన్నాను" అని అనుకొన్నప్పుడు యానం ద్వారా వృద్ధిని సంపాదించడానికి ప్రయత్నించాలి.

2. లేదా - "నేను శత్రుకర్మలకు విఘాతం చేయజాలను; నా కర్మలకు విఘాతం కలుగుతే రక్షించుకొనే స్థితిలో లేను" అని అనుకొన్నప్పుడు బలవంతుడైన మరొక రాజును ఆశ్రయించి తన కర్మలను పూర్తిచేసుకొంటూ క్షయంనుంచి (క్షీణస్థితినుంచి) స్థానాన్ని (నిలకడను) సంపాదించి, స్థానం ద్వారా వృద్ధి సంపాదించడానికి ప్రయత్నించాలి.

3. లేదా - "ఒక ప్రక్క (ఒక శత్రువుతో) సంధి చేసుకొని నా పనులు పూర్తి చేసుకుంటాను. మరొక ప్రక్క (మరొకనితో) వైరం కొనసాగిస్తూ వాని కర్మలకు విఘాతం కలిగిస్తాను" అని అనుకొన్నట్లయితే ద్వైధీభావంచేత అభివృద్ధి పొందడానికి ప్రయత్నించాలి.

శ్లో. ఏవం షడ్భిర్గుణైరేతైః స్థితః ప్రకృతిమణ్డలే,
పర్యేషేత క్షయాత్ స్థానం స్థానాద్వృద్ధిం చ కర్మసు.

ఇతి కౌటలీయార్థశాస్త్రే షాడ్గుణ్యే సప్తమాధికరణే ప్రథమోధ్యాయః
షాడ్గుణ్యసముద్దేశః క్షయస్థానవృద్ధినిశ్చయశ్చ. ఆదితో నవనవతితమః.

వ్యా. ప్రకృతిమండలంలో ఉన్న రాజు ఈ విధంగా ఈ ఆరు గుణాలను అనుసరిస్తూ క్షీణదశనుండి స్థానాన్ని (నిలకడను), స్థానంనుండి (స్థానం ద్వారా) తన కర్మలలో వృద్ధినీ సంపాదించడానికి ప్రయత్నించాలి.

"బాలానందిని" అను కౌటలీయార్థశాస్త్రాంధ్రవ్యాఖ్యానంలో షాడ్గుణ్యం అనే సప్తమాధికరణంలో షాడ్గుణ్యసముద్దేశం, క్షయస్థానవృద్ధినిశ్చయం అనే ప్రథమాధ్యాయం, ప్రారంభంనుంచి తొంభైతొమ్మిదవ అధ్యాయం సమాప్తం.

# అథ ద్వితీయోఽధ్యాయః

## శతతమం ప్రకరణమ్ - సంశ్రయవృత్తిః
## (బలవంతుణ్ణి ఆశ్రయించే విధానం)

మూ. 1. సంధివిగ్రహయోః తుల్యాయాం వృద్ధౌ సంధిముపేయాత్. విగ్రహే హి క్షయవ్యయప్రవాసప్రత్యవాయా భవన్తి.

2. తేన ఆసనయానయోః ఆసనం వ్యాఖ్యాతమ్.

3. ద్వైధీభావసంశ్రయయోః ద్వైధీభావం గచ్ఛేత్. ద్వైధీభూతో హి స్వకర్మప్రధానః ఆత్మన ఏవోపకరోతి. సంశ్రితస్తు పరస్యోపకరోతి నాత్మనః.

4. యద్బలః సామన్తః తద్విశిష్టబలమాశ్రయేత. తద్విశిష్టబలాభావే తమేవాశ్రితః కోశదణ్డభూమీనామన్యతమేన అస్యోపకర్తుమదృష్టః ప్రయతేత. మహాదోషో హి విశిష్టసమాగమః రాజ్ఞామన్యత్రారివిగృహీతాత్.

5. అశక్యే దణ్డోపనతవత్ వర్తేత.

వ్యా. 1. సంధి చేసుకొన్నా విరోధం కొనసాగించినా తన అభివృద్ధి సమంగానే ఉంటుంది అనుకొన్నప్పుడు సంధియే చేసుకోవాలి. విరోధం పెట్టుకుంటే క్షయం, వ్యయం, స్వస్థానం విడిచి వెళ్లే అవసరం రావడం, ఇతరమైన ఆపదలు కలగడానికి అవకాశాలు ఉంటాయి కదా?

2. దీనిని పట్టి ఆసన-యానాలలో యానంకంటె ఆసనమే మంచి దని చెప్పినట్లయినది.

3. ద్వైధీభావ-సంశ్రయాలలో ద్వైధీభావాన్ని అనుసరించాలి. ద్వైధీభావం అనుసరించేవాడు తన కర్మలకే ప్రాధాన్యం ఇవ్వడంచేత తనకే ఉపకారం చేసుకొన్నవా డవుతాడు. బలవంతుణ్ణి ఆశ్రయిస్తే వానికే ఉపకారం చేసినవా డవుతాడు, తనకు కాదు.

4. సామంతుడు తన కెంత బలం ఉన్నదో అంతకంటె ఎక్కువ బలం ఉన్న మరొక రాజును ఆశ్రయించాలి. అలాంటి రాజు లభించ నప్పుడు తనను బాధిస్తూన్న శత్రువునే ఆశ్రయించాలి. వానికి కనబడకుండానే ఉంటూ వానికి ధనం కాని, సైన్యం

కాని, భూమి కాని ఇచ్చి ఉపకరించడానికి ప్రయత్నించాలి. రాజు తనకంటె ఎక్కువ బలం కలవానిని ప్రత్యక్షంగా కలుస్తే చాలా అపాయాలకి దారి తీస్తుంది. ఆ శత్రువుతో యుద్ధం చేస్తున్నప్పుడు మాత్రం కలవడం ఎలాగా తప్పదు.

5. ఇలా దూరంగా ఉండి ఆశ్రయించడం కుదరకపోతే సైన్యంతో పాటు లొంగిపోయినవాడు వలె వాని దగ్గరనే బాగా వంగి ఉండాలి.

మూ. 1. యదా చాస్య ప్రాణహరం వ్యాధిమ్, అన్తఃకోపం, శత్రువృద్ధిం, మిత్రవ్యసనమ్ ఉపస్థితం వా తన్నిమిత్తామాత్మనశ్చ వృద్ధిం పశ్యేత్ తదా సంభావ్యవ్యాధిధర్మకార్యాపదేశేన అపయాయాత్. స్వవిషయస్థో వా నోపగచ్ఛేత్. ఆసన్నో వాస్య ఛిద్రేషు ప్రహరేత్.

2. బలీయసోర్వా మధ్యగతః త్రాణసమర్థమాశ్రయేత్ యస్య వా అనన్తర్ధిః స్యాత్. ఉభౌ వా కపాలసంశ్రయః తిష్ఠేత్. మూలహరమితరస్య ఇతరమ్ అపదిశన్ భేదముభయోర్వా పరస్పరాపదేశం ప్రయుఞ్జీత, భిన్నయోరుపాంశుదణ్డమ్.

వ్యా. 1. తాను సేవిస్తూన్న బలవంతుడైన రాజుకు ప్రాణాలు హరించే వ్యాధి వచ్చిందనిగాని, ప్రజలలో అంతఃకోపం (తిరుగుబాటు) కలగబోతూన్న దని గాని, వాని శత్రువులకు వృద్ధి కలగ నున్న దని గాని, వాని మిత్రులకు కష్టాలు వస్తున్నా యని గాని కనబడినప్పుడు, అట్టి పరిస్థితులలో తనకు అభివృద్ధి కలుగుతుం దనే నమ్మిక కుదర నప్పుడు తనకు వ్యాధి రాబోతున్న దని గాని, లేదా ఏదో ఒక ధర్మకార్యం చేయవలసి ఉన్న దని గాని వంక బెట్టి వానిని విడిచి వెళ్లిపోవాలి. తన దేశంలోనే ఉన్నట్లయితే అతడు రమ్మని కబురు పంపినా కూడ ఏదో వంక చెప్పి, వానివద్దకు వెళ్లగూడదు. లేదా దగ్గరనే ఉండి ఛిద్రాలలో (ఆతనిలో కొన్ని దౌర్బల్యాలు కలిగినప్పుడు) దెబ్బతీయాలి.

2. ఇద్దరు బలవంతుల మధ్య నున్నవాడు వాళ్లలో ఎవడు తనకు రక్షణ ఇవ్వడానికి సమర్థుడో వానిని ఆశ్రయించాలి. ఇద్దరూ సమానబలవంతులే అయినప్పుడు తనకు దగ్గర ఉన్నవానిని ఆశ్రయించాలి.లేదా ఇద్దరినీ ఆశ్రయించాలి. అయితే వాళ్లతో కపాలసంధి చేసికొని ఉండాలి. "నువ్వు నన్ను రక్షించకపోతే అతడు నన్ను బాధి స్తాడు" అని ఒకనికి తెలియకుండా ఒకనికి చెప్పి ఇద్దరినీ ఆశ్రయించడం 'కపాలసంధి' "ఇతడు నీ మూలధనాన్నే అపహరిస్తున్నాడు" అని ఒకనిని గూర్చి మరొకనితో

రహస్యంగా చెపుతూ వాళ్లలో ఒకనిమీద రెండవవానికి అవిశ్వాసం కలిగే విధంగా భేదం కలిగించాలి. ఈ విధంగా భేదం కల్పించి రహస్యంగా వాళ్లిద్దరినీ నశింపచెయ్యాలి.

మూ. 1. పార్శ్వస్థో వా బలస్థయోరాసన్నభయాత్ ప్రతికుర్వీత. దుర్గాపాశ్రయో వా ద్వైధీభూతస్తిష్ఠేత్. సంధివిగ్రహక్రమహేతుభిర్వా చేష్టేత. దూష్యామిత్రాటవికానుభయోరుపగృహ్ణీయాత్. ఏతయోరన్యతరం గచ్ఛంస్తైరేవాన్యతరస్య వ్యసనే ప్రహరేత్. ద్వాభ్యాముపహితో వా మణ్డలాపాశ్రయః తిష్ఠేత్. మధ్యమముదాసీనం వా సంశ్రయేత. తేన సహైకముపగృహ్య ఇతరముచ్ఛిన్ద్యాత్. ఉభౌ వా.

2. ద్వాభ్యాముచ్ఛిన్నో వా మధ్యమోదాసీనయోః తత్పక్షీయాణాం వా రాజ్ఞాం న్యాయవృత్తిమాశ్రయేత. తుల్యానాం వా యస్య ప్రకృతయః సుఖ్యేయురేనం, యత్రస్థో వా శక్నుయాదాత్మానముద్ధర్తుం, యత్ర పూర్వపురుషోచితా గతిః ఆసన్నః సంబన్ధో వా మిత్రాణి భూయాంసీతి శక్తిమన్తి వా భవేయుః.

వ్యా. 1. ఇద్దరు బలవంతుల దగ్గర ఉన్నవాడు వాళ్లల్లో ఎవనినుంచి భయం దగ్గరపడుతుందో ఆ భయానికి ముందుగా ప్రతిక్రియ చేసుకోవాలి. లేదా దుర్గాన్ని ఆశ్రయించి ద్వైధీభావం (ఒకనితో ప్రచ్ఛన్నంగా సంధిచేసుకొని మరొకనితో వైరం కొనసాగించడం) చెయ్యాలి. లేదా సంధి చేసికొనడానికీ, విగ్రహం నడిపించడానికీ తగిన హేతువులను పట్టి అవి కొనసాగించాలి. ఆ ఇద్దరి శత్రువుల దూష్యులను (రాజద్రోహులను), అటవీఅధిపతులను చేరదీయాలి. ఆ ఇద్దరు శత్రువులలో ఒకనిమీదికి యుద్ధానికి వెళ్లి, రెండవవాడు కష్టాలలో ఉన్న సమయం చూచి వానిని దూష్యులచేత ఆటవికులచేత నశింపచెయ్యాలి. ఇద్దరు శత్రువులూ పీడించినట్లయితే రాజమండలాన్ని ఆశ్రయించాలి. లేదా మధ్యముడైన రాజును గాని, ఉదాసీనుడైన రాజును గాని ఆశ్రయించాలి. వాని సహాయంతో ఒక శత్రువును దానాదులచేత వశం చేసికొని రెండవవానిని నశింపచెయ్యాలి. శక్యమైతే ఇద్దరినీ కూడ నశింపచెయ్యాలి.

2. ఇద్దరు శత్రువులచేత పీడింపబడినవాడు మధ్యమ-ఉదాసీన రాజులలో గాని, వాళ్ల పక్షానికి చెందిన రాజులలో గాని న్యాయమైన ప్రవృత్తి గల వానిని ఆశ్రయించాలి. పైన చెప్పిన వాళ్లందరూ న్యాయప్రవృత్తి కలవారే అయిన పక్షంలోఎవని ప్రకృతులు తనకు సుఖం కలిగిస్తారో ఆ రాజును ఆశ్రయించాలి. లేదా ఏ రాజు దగ్గర

ఉంటే తనను ఉద్ధరించుకొనకలుగుతాడో ఆతనిని ఆశ్రయించాలి. లేదా ఏ రాజుతో తన పూర్వీకులకు రాకపోకలు ఉండేవో వానిని గాని, ఎవనితో దగ్గర సంబంధం (బాంధవ్యాదికం) ఉన్నదో వానిని గాని, ఎవనికి శక్తి మంతులైన చాలమంది మిత్రులున్నారో వానిని గాని ఆశ్రయించాలి.

శ్లో. ప్రియో యస్య భవేద్యో వా ప్రియో౽స్య కతరస్తయోః,
ప్రియో యస్య స తం గచ్ఛేదిత్యాశ్రయగతిః పరా.

*ఇతి కౌటలీయార్థశాస్త్రే షాడ్గుణ్యే సప్తమాధికరణే ద్వితీయో౽ధ్యాయః*
*సంశ్రయవృత్తిః ఆదితః శతతమః.*

వ్యా. తాను ఎవరికి ప్రియుడో (ఇష్టుడో), ఎవడు తనకు ప్రియుడో ఆ ఇద్దరిలో ఎవరిని ఆశ్రయించాలి? వీరిద్దరిలో తాను ఎవనికి ఇష్టుడో వానిని ఆశ్రయించాలి. ఇది ఉత్తమమైన ఆశ్రయించే విధానం.

"బాలానందిని" అను కౌటలీయార్థశాస్త్రాంధ్రవ్యాఖ్యలో షాడ్గుణ్యం అనే సప్తమాధికరణంలో సంశ్రయవృత్తి అనే రెండవ అధ్యాయం, ప్రారంభంనుండి నూరవ అధ్యాయం సమాప్తం

## అథ తృతీయో౽ధ్యాయః

### ఏకోత్తర-ద్వ్యుత్తరశతతమప్రకరణే. సమహీనజ్యాయసాం గుణాభినివేశః హీనసంధయశ్చ (సమబలం కలవానితోను, తనకంటె దుర్బలుడుగా ఉన్నవానితోను, అధికబలవంతునితోను ఆ యా గుణాల ప్రయోగం.) (దుర్బలుడు చేసుకొనవలసిన సంధి విధానాలు)

మూ. 1. విజిగీషుః శక్త్యపేక్షః షాడ్గుణ్యముపయుఞ్జీత. సమజ్యాయోభ్యాం సంధీయేత. హీనేన విగృహ్ణీయాత్. విగృహీతో హి జ్యాయసా హస్తినా పాదయుద్ధమివాభ్యుపైతి. సమేన చామం పాత్రమ్ ఆమేన ఆహతమివ ఉభయతః క్షయం కరోతి. కుమ్భేనేవాశ్మా హీనేనైకాన్తసిద్ధిమవాప్నోతి.

2. జ్యాయాంశ్చేన్న సంధిమిచ్ఛేత్, దణ్డోపనతవృతమాబలీయసం వా యోగమాతిష్ఠేత్.

3. సమశ్చేన్న సంధిమిచ్ఛేత్, యావన్మాత్రమపకుర్యాత్ తావన్మాత్ర మస్య ప్రత్యపకుర్యాత్. తేజో హి సంధానకారణమ్,నాతప్తం లోహం లోహేన సంధత్తే ఇతి.

4. హీనశ్చేత్ సర్వత్రానుప్రణతస్తిష్ఠేత్; సంధిముపేయాత్. ఆరణ్యోఽగ్ని రివ హి దుఃఖామర్షజం హి తేజో విక్రమయతి మణ్డలస్య చానుగ్రాహ్యో భవతి.

వ్యా. 1. విజిగీషువు తన కున్న శక్తిని అనుసరించి షాడ్గుణ్యం ప్రయోగించాలి. సమబలం కలవానితోను, ఎక్కువ బలం ఉన్నవానితోను సంధిచేసుకోవాలి. తనకంటె తక్కువ బలం ఉన్నవానితో విరోధం కొనసాగించాలి. బలవంతునితో విరోధం పెట్టుకొనడం పాదచారిగా ఉండి ఏనుగుతో యుద్ధం చేసినట్లు ఉంటుంది. సమునితో విరోధం పెట్టుకుంటే కాల్చని మట్టి కుండను అలాంటి మరొక కుండతో డీకొట్టించి నట్లు ఇరు పక్షాల వారికీ నాశం కలిగిస్తుంది. హీనునితో విరోధం పెట్టుకొనడం వల్ల రాయిని కుండతో డీకొట్టించినప్పుడు వలె తప్పక సిద్ధిని పొందుతాడు.

2. తనకంటె ఎక్కువ బలం కలవాడు సంధి చేసికొనడానికి అంగీకరించకపోతే దండోపనతప్రకరణంలో చెప్పిన విధానం గాని, ఆబలీయసయోగాధికరణంలో చెప్పిన విధానం గాని అనుసరించాలి.

3. సముడు సంధి చేసికొనడానికి ఇష్టపడకపోతే అతడు తనకు ఎంత అపకారం చేస్తాడో అంత అపకారమే వానికి చెయ్యాలి. అప్పుడు అతడు సంధికి వస్తాడు అని అర్థం. ఎందువల్లననగా- సంధి ఏర్పడడానికి కారణం తేజస్సే- లోహాన్ని బాగా కాలిస్తేనే కాని మరొక లోహం ముక్కతో అతుకుకొనదు కదా?

4. హీనుడు అన్ని విషయాలలోను వంగి ఉన్నట్లయితే వానితో గూడ సంధి చేసుకొనాలి. ఆ విధంగా వానితో సంధిచేసికొనకపోతే దుఃఖంవల్ల కోపం వల్లా కలిగిన తేజస్సు దావాగ్ని వలె ఏనాటి కైనా అతడుపరాక్రమించే టట్లు చేస్తుంది. లేదా అతడు రాజమండలానికి అనుగ్రహపాత్రు డౌతాడు. అనగా ఇంత అణగిఉన్నా కూడ ఇతనిని ఆ రాజు పీడిస్తున్నాడు; అందుచేత ఇతనికి సహాయం చెయ్యాలి అనే భావం రాజమండలంలో కలగవచ్చు.

మూ. 1. సంహితశ్చేత్ - "పరప్రకృతయో లుబ్ధక్షీణాపచరితాః ప్రత్యాదాన

భయాద్వా నోపగచ్ఛన్తి" ఇతి పశ్యేత్ హీనోఽపి విగృహ్ణీయాత్.

2. విగృహీతశ్చేత్ - "పరప్రకృతయో లుబ్ధక్షీణాపచరితాః విగ్రహోద్విగ్నా వా మాం నోపగచ్ఛన్తి" ఇతి పశ్యేత్; జ్యాయానపి సన్ధీయేత; విగ్రహోద్వేగం వా శమయేత్. "వ్యసనయౌగపద్యే గురువ్యసనోఽస్మి, లఘువ్యసనః పరః సుఖేన ప్రతికృత్య వ్యసనమాత్మనః అభియుఞ్జ్యాత్" ఇతి పశ్యేత్. జ్యాయానపి సంధీయేత.

3. సంధివిగ్రహయోశ్చేత్ పరకర్శనమాత్మోపచయం వా నాభిపశ్యేత్ జ్యాయానప్యాసీత.

వ్యా. 1. సంధి చేసికొన్న హీనుడైన విజిగీషువు కూడ- "శత్రువుయొక్క ప్రకృతులు లుబ్ధులై క్షీణస్థితిలో ఉండి తిరుగుబాటుచేయడానికి సిద్ధంగా ఉండడంచేత గాని, నాదగ్గరికి వస్తే మళ్లీ తమ రాజు తీసికొని వెళ్లిపోతాడు అనే భయంచేత గాని, నా దగ్గరకి రావడంలేదు" అని చూచిన ట్లయితే అట్టి పరిస్థితులలో బలవంతునితో కూడ విరోధం పెట్టుకోవచ్చును.

2. విగ్రహం అవలంబించి ఉన్న బలవంతుడైన విజిగీషువు కూడ- "శత్రువుయొక్క ప్రకృతులు లుబ్ధులై క్షీణదశలో ఉండి తిరుగుబాటు చేసేవారుగా ఉండడంచేత గాని, విగ్రహంచేత విసుగు చెంది ఉండడంచేత గాని నన్ను చేరడంలేదు" అని చూచినప్పుడు (భావించినప్పుడు) (దుర్బలునితో కూడ) సంధి చేసుకోవాలి; లేదా విగ్రహంవల్ల కలిగిన ఉద్వేగాన్ని (భయాన్ని) తగ్గించాలి. అదే విధంగా " మా ఇద్దరికీ వ్యసనం ఒకే కాలంలో వచ్చినది. అయితే నా వ్యసనం అధికంగా ఉంది;పరుని వ్యసనం స్వల్పంగా ఉంది. అందుచేత పరుడు తన వ్యసనానికి అనాయాసంగా ప్రతిక్రియ చేసుకొని నామీదికి రావచ్చును" అని అనుకొన్నప్పుడు కూడ, బలవంతుడైన విజిగీషువు కూడ దుర్బలునితో సంధి చేసుకోవాలి.

3. సంధి చేసుకున్నా, విగ్రహం అవలంబించినా పరునికి దుర్బలత్వం గాని తనకు అభివృద్ధి గాని వచ్చే టట్లు లేదు అని చూచి నప్పుడు బలవంతుడైన విజిగీషువు కూడ సంధివిగ్రహాలు మాని ఆసనం అవలంబించాలి.

మూ. 1. పరవ్యసనమప్రతికార్యం చేత్ పశ్యేత్ హీనోఽప్యభియాయాత్.

2. అప్రతికార్యాసన్నవ్యసనో వా జ్యాయానపి సంశ్రయేత.

3. సంధినా ఏకతః విగ్రహేణ ఏకతశ్చేత్ కార్యసిద్ధిం పశ్యేత్ జ్యాయానపి ద్వైధీభూతస్తిష్ఠేదితి.

4. ఏవం సమస్య షాడ్గుణ్యోపయోగః.

వ్యా. 1. పరుడు ప్రతిక్రియ చేయడానికి శక్యం కాని కష్టాలలో ఉన్నాడు అని చూచి నప్పుడు హీనుడు కూడ యుద్ధానికి వెళ్లాలి.

2. తనకు ప్రతిక్రియ చేయడానికి శక్యం కాని గొప్ప ఆపద దగ్గరలోనే రానున్నది అని చూచి నప్పుడు బలవంతుడు కూడ ఆశ్రయించాలి.

3. ఒక ప్రక్క సంధి చేసికొని, మరొక ప్రక్క విగ్రహం నెరపడంచేత తనకు కార్యసిద్ధి కలుగుతుంది అని అనుకొన్నప్పుడు బలవంతుడు కూడ ద్వైధీభావం అవలంబించాలి.

4. సముడు (బలశాలి లేదా దుర్బలుడు కానివాడు) కూడ షాడ్గుణ్యాన్ని ఈ విధంగానే ఉపయోగించాలి.

మూ. 1. తత్ర తు ప్రతివిశేషః-

2. శ్లో. ప్రవృత్తచక్రేణాక్రాన్తో రాజ్ఞా బలవతాఽబలః,
సంధినోపనమేత్తూర్ణం కోశదణ్డాత్మభూమిభిః.

వ్యా. 1. వాటిలో కూడ కొన్ని విశేషాలు ఎట్లనగా- బలవంతుడైన రాజు సైన్యముతో వచ్చి ఆక్రమించినపుడు దుర్బలుడైన రాజు వెంటనే ఆతనికి కోశమూ, సైన్యమూ, భూమీ ఇచ్చి, తనను కూడ సమర్పించి సంధి చేసికొని లొంగిఉండాలి.

శ్లో. స్వయం సంఖ్యాతదణ్డేన దణ్డస్య విభవేన వా,
ఉపస్థాతవ్యమిత్యేష సన్ధిరాత్మామిషో మతః.

వ్యా. ఆ రాజు ఎంత సైన్యం కావా లని అడుగుతాడో అంత సైన్యం గాని, తన శక్తిని పట్టి ఇవ్వగలిగిన సైన్యం గాని ఇచ్చి వానిని సేవించాలి. దీనికి "ఆత్మామిషసంధి" (తననే ఆహారంగా ఇచ్చిన సంధి) అని పేరు.

శ్లో. సేనాపతికుమారాభ్యాముపస్థాతవ్యమిత్యయమ్,
పురుషాన్తరసంధిః స్యాన్నాత్మనేత్యాత్మరక్షణః.

వ్యా. "సేనాపతి, రాజకుమారుడు తగిన పరివారంతో వచ్చి మాకు సేవలు

అందిస్తూ ఉండాలి" అని బలవంతుడు చేసిన షరతుకు అంగీకరించి చేసుకొన్న సంధి "పురుషాంతరసంధి'. దీని ప్రకారం లొంగిపోయిన రాజు స్వయంగా వెళ్లవలసిన పని లేదు గాన ఇది "ఆత్మరక్షణసంధి" అనగా తనను రక్షించుకొన్న సంధి.

శ్లో. ఏకేనాన్యత్ర యాతవ్యం స్వయం దణ్డేన వేత్యయమ్,
అదృష్టపురుషః సంధిర్దణ్డముఖ్యాత్మరక్షకః.

వ్యా. 1. శత్రువు పనులను సాధించడానికి తానొక్కడే గాని, సైన్యం కాని వెళ్లాలి అని చేసుకొన్న సంధి "అదృష్టపురుషసంధి"; శత్రువుకు తాను కనబడ నవసరం లేని సంధి. ఈ సంధివల్ల సేనాధిపతికి, తనకూ కూడ రక్షణం ఉంటుంది.

శ్లో. ముఖ్యస్త్రీబన్ధనం కుర్యాత్ పూర్వయోః పశ్చిమే త్వరిమ్,
సాధయేద్ గూఢమిత్యేతే దణ్డోపనతసంధయః.

వ్యా. మొదటి రెండు సంధులలో (పురుషాంతర - అదృష్టపురుషసంధులలో) ప్రధానులైన వ్యక్తులతో స్త్రీసంబంధం, అనగా వివాహసంబంధం, ఏర్పరచుకోవాలి. చివరిదైన అదృష్టపురుషసంధి చేసుకొన్నప్పుడు రహస్యంగా శత్రువును రూపుమాపాలి. ఈ మూడు సంధులు "దండోపనతసంధులు" (సైన్యం ఇచ్చి లొంగి ఉండే సంధులు) అని చెప్పబడుచున్నవి.

శ్లో. కోశదానేన శేషాణాం ప్రకృతీనాం విమోక్షణమ్,
పరిక్రయో భవేత్సంధిః స ఏవ చ యథాసుఖమ్.
స్కన్ధోపనేయో బహుధా జ్ఞేయః సంధిరుపగ్రహః,
నిరుద్ధో దేశకాలాభ్యామత్యయః స్యాదుపగ్రహః.

వ్యా. యుద్ధంలో మరణించగా మిగిలిన ప్రకృతులను విడిపించుకొనడం కొరకు శత్రువుకు ధనం ఇచ్చి చేసుకొన్న సంధి "పరిక్రయసంధి". ఆ ధనాన్ని సులభమైన చాలా వాయిదాలలో చెల్లించే టట్లు చేసుకొన్న సంధి "ఉపగ్రహసంధి". ఫలానా దేశంలో ఫలానా కాలంలో ధనం చెల్లిస్తాను అని చేసుకొన్న ఉపగ్రహసంధియే "అత్యయసంధి"

శ్లో. విషహ్యాదానాదాయత్యాం క్షమః స్త్రీబన్ధనాదపి,
సువర్ణసంధిర్విశ్వాసాదేకీభావగతో భవేత్.

వ్యా. ఇవ్వకలిగినంత ధనాన్ని మాత్రమే ఇవ్వడంవల్ల, స్త్రీవివాహసంబంధంవల్ల ఈ సంధి భవిష్యత్తులో లాభం చేకూరుస్తుంది, అందుచేత ఇది "సువర్ణసంధి". ఈ సంధివల్ల ఐకమత్యం ఏర్పడి పరస్పరవిశ్వాసం కూడ పెరుగుతుంది.

శ్లో. విపరీతః కపాలః స్యాదత్యాదానాభిభాషితః,
పూర్వయోః ప్రణయేత్ కుప్యం గస్త్యశ్వం వా గరాన్వితమ్.

వ్యా. దీనికి విపరీతమైన సంధి, అనగా అత్యధికమైన ధనం ఒకే పర్యాయం వెంటనే ఇవ్వాలి అని చెప్పి చేసుకొన్న సంధి కపాలసంధి. దీనిలో చాలా ధనం ఇవ్వవలసి ఉండడం వల్ల ఈ పేరు పెట్టబడింది. (కపాలసంధి అనగా కుండ బ్రద్దలు కొట్టి నట్లు కఠినంగా ప్రవర్తిస్తూ చేసుకొన్న సంధి అని అర్థం). పైన చెప్పిన నాలుగు కోశోపనత సంధులలోని మొదటి రెండు సంధులలో (పరిక్రయ - ఉపగ్రహసంధులలో) ఓడిపోయినవాడు విషంతో కూడిన అరణ్యలభ్యవస్తువులను, గజాశ్వాలను శత్రువుకు ఇవ్వాలి.

శ్లో. తృతీయే ప్రణయేదర్థం కథయన్ కర్మణాం క్షయమ్,
తిష్ఠేచ్చతుర్థ ఇత్యేతే కోశోపనతసంధయః.

వ్యా. మూడవదైన సువర్ణసంధిలో చెప్పిన ప్రకారం ధనం ఇచ్చివేయాలి. నాల్గవదైన కపాలసంధిలో "నా తలబెట్టిన పను లన్నీ చెడిపోయాయి. ఇంత ఎక్కువ ధనం ఇవ్వజాలను'' అని అంటూ కాలక్షేపం చెయ్యాలి. ఈ నాల్గింటికి "కోశోపనతసంధులు" అని పేరు.

శ్లో. భూమ్యేకదేశత్యాగేన దేశప్రకృతిరక్షణమ్,
ఆదిష్టసంధిస్తత్రేష్టో గూఢస్తేనోపఘాతినః.

వ్యా. తన రాజ్యంలోని కొంత భాగాన్ని ఇచ్చివేసి మిగిలిన దేశాన్ని, ప్రకృతులనూ రక్షించడం కోసం చేసికొన్న సంధి ఆదిష్టసంధి. ఇలా ఇచ్చివేసిన భూభాగంలో గూఢచారులు దొంగలు మొదలైనవాళ్ల ద్వారా బాధలు కలిగించి తిరిగి తన రాజ్యంలో కలుపుకొన గల సామర్థ్యం ఉన్నవాడు ఈ సంధి చేసుకోవాలి.

శ్లో. భూమీనామాత్తసారాణాం మూలవర్జం ప్రణామనమ్,
ఉచ్ఛిన్నసంధిస్తత్రైష పరవ్యసనకాఙ్క్షిణః.

వ్యా. దుర్గం, రాజధాని మొదలైన ప్రధానభూములు తప్ప మిగిలిన భూములలోని సారం అంతా తీసివేసికొని వాటిని ఇచ్చి చేసుకొన్న సంధి "ఉచ్ఛిన్నసంధి". అచిరకాలంలో శత్రువుకు వ్యసనం రానున్నది అనే నమ్మకం కలవాడు ఈ సంధి చేసుకోవాలి.

శ్లో. ఫలదానేన భూమీనాం మోక్షణం స్యాదవక్రయః,
ఫలాతిభుక్తో భూమిభ్యః సంధిః స పరదూషణః.

వ్యా. భూమినుంచి లభించే ఫలాన్ని ఇచ్చివేసి ఆ భూములను విడిపించుకొనడం "అవక్రయసంధి". భూములనుంచి ఎంత ఫలం లభిస్తుందో దానికంటె అధికంగా వసూలు చేసి చేసుకొన్న సంధి "పరదూషణసంధి".

శ్లో. కుర్యాదవేక్షణం పూర్వో పశ్చిమౌ త్వాబలీయసమ్,
ఆదాయ ఫలమిత్యేతే దేశోపనతసంధయః.

వ్యా. పైన చెప్పిన మొదటి రెండు సంధులలో (అదిష్ట - ఉచ్ఛిన్న సంధులలో) శత్రువు ఎప్పుడు ఆపదలలో చిక్కుకుంటాడా అని చూస్తూ నిరీక్షించాలి. చివరి అవక్రయ-ఫలాతిభుక్తసంధులలో ఆబలీయసాధికరణంలో చెప్ప నున్న పద్ధతులు అవలంబించి భూమినుండి వచ్చే ఫలం తానే అనుభవించాలి. ఇవి "దేశోపనతసంధులు".

శ్లో. స్వకార్యాణాం వశేనైతే దేశే కాలే చ భాషితాః,
ఆబలీయసికాః కార్యాస్త్రివిధా హీనసంధయః.

ఇతి కౌటలీయార్థశాస్త్రే షాడ్గుణ్యే సప్తమాధికరణే తృతీయోఽధ్యాయః
సమహీనజ్యాయసాం గుణాభినివేశో హీనసంధయః, ఆదిత ఏకశతతమః.

వ్యా. ఈ హీనసంధులు దుర్బలులచేత తమ కార్యాలను, దేశాన్ని,కాలాన్నీ అనుసరించి ఆచరించతగినవిగా చెప్పబడినవి.

"బాలానందిని" అను కౌటలీయార్థశాస్త్రాంధ్రవ్యాఖ్యానమునందు షాడ్గుణ్యం అనే సప్తమాధికరణమునందు సమహీనబలవంతుల గుణాభినివేశము, హీనసంధులు అను మూడవ అధ్యాయం, ప్రారంభంనుండి నూటఒకటవ అధ్యాయం సమాప్తం.

# అథ చతుర్థోఽధ్యాయః

త్రిశతతమం ప్రకరణమ్ - విగృహ్యాసనమ్, చతుఃశతతమం ప్రకరణమ్- సంధాయాసనమ్ - పఞ్చశతతమం ప్రకరణమ్ - విగృహ్యాయానమ్ - షట్‌శతతమం ప్రకరణమ్ - సంధాయయానమ్ - సప్తశతతమం ప్రకరణమ్ - సంభూయ ప్రయాణమ్. (విగ్రహం అవలంబించి కూర్చొనడం; సంధి చేసుకొని కూర్చొనడం; విగ్రహం అవలంబించి దండెత్తడం, సంధి చేసికొన్నతరవాత దండెత్తడం, మరికొందరు రాజులతో కలిసి దండెత్తడం).

మూ. 1. సంధివిగ్రహయోరాసనం యానం చ వ్యాఖ్యాతమ్. స్థానమ్, ఆసనమ్, ఉపేక్షణం చేత్యాసనపర్యాయాః.

2. విశేషస్తు గుణైకదేశే స్థానమ్. స్వవృద్ధిప్రాప్త్యర్థమాసనమ్. ఉపాయానామప్రయోగ ఉపేక్షణమితి.

3. సంధానకామయోరరివిజిగీష్వోః ఉపహన్తుమశక్తయోః విగృహ్యాసనం సంధాయ వా.

వ్యా. 1. సంధి-విగ్రహాలలో ఆసనము, యానము ఇప్పుడు చెప్పబడుచున్నవి. 'స్థానం, ఆసనం, ఉపేక్షణం అనేవి పర్యాయపదాలు.

2. వీటిలోని స్వల్ప భేదం ఏమనగా - కొంచెం లాభం కలుగుతుం దనే అభిప్రాయంతో శాంతంగా ఉండిపోవడం 'స్థానం'. తనకు అభివృద్ధి కలగడంకోసం శాంతంగా ఉండిపోవడం 'ఆసనం'. ఏ ఉపాయాలూ ప్రయోగించకుండా శాంతంగా ఉండి పోవడం 'ఉపేక్షణం'.

3. విజిగీషువు, శత్రువు, ఒకరి నొకరు ఏమీ చేయజాల నప్పుడు, సంధి చేసుకోవా లని కోరిక ఉన్నవా రైతే వాళ్లు విగ్రహం చేస్తూ కాని, సంధి చేసికొని గాని ఆసనం చెయ్యాలి.

మూ. 1. యదా వా పశ్యేత్ - "స్వదణ్డైర్మిత్రాటవీదణ్డైర్వా సమం జ్యాయాంసం వా కర్శయితు ముత్సహే" ఇతి, తదా కృతబాహ్యాభ్యన్తరకృత్యః

విగృహ్య ఆసీత.

2.యదా వా పశ్యేత్ -"ఉత్సాహయుక్తాః మే ప్రకృతయః సంహతాః వివృద్ధాః స్వకర్మాణ్యవ్యాహతాశ్చరిష్యన్తి పరస్య వా కర్మాణ్యుపహనిష్యన్తి" ఇతి తదా విగృహ్యాసీత.

3. యదా వా పశ్యేత్"పరస్యాపచరితాః క్షీణాః లుబ్ధాః,స్వచక్రస్తేనాటవీ వ్యథితా వా ప్రకృతయః స్వయముపజాపేన వా మామేష్యన్తీతి, సంపన్నా మే వార్తా, విపన్నా పరస్య, తస్య ప్రకృతయో దుర్భిక్షోపహతాః మామేష్యన్తి; విపన్నా మే వార్తా, సంపన్నా పరస్య, తం మే ప్రకృతయో న గమిష్యన్తి, విగృహ్య చాస్య ధాన్యపశుహిరణ్యాన్యాహరిష్యామి; స్వపణ్యోపఘాతీతి వా పరపణ్యాని నివర్తయిష్యామి, పరవణిక్పథాద్వా సారవన్తి మామేష్యన్తి,విగృహీతే నేతరం, దూష్యామిత్రాటవీనిగ్రహం వా విగృహీతో న కరిష్యతి, తైరేవ వా విగ్రహం ప్రాప్స్యతి, మిత్రం మే మిత్రభావీ అభిప్రయాతః బహ్వాల్పకాలం తనుక్షయవ్యయమర్థం ప్రాప్స్యతి, గుణవతీ మాదేయాం వా భూమిం సర్వసందోహేన వా మామనాదృత్య ప్రయాతుకామః కథం న యాయాత్" ఇతి పరవృద్ధిప్రతిఘాతార్థం ప్రతాపార్థం చ విగృహ్యాసీత.

వ్యా. 1. నా సైన్యాలతోగాని, మిత్రసైన్యాల సహాయంతో గాని, ఆటవికసైన్య సహాయంతో గాని, నాతో సముణ్ణీ, నాకంటె బలవంతుణ్ణీ కూడ కృశింపచేయగలను అని భావించి నప్పుడు స్వదేశానికి ఇతరుల దేశాలకి సంబంధించిన పను లన్నీ పూర్తి చేసి (సమ-జ్యాయాంసులతో) విగ్రహించి ఆసనం చెయ్యాలి.

2. నా ప్రకృతులు మంచి ఉత్సాహంతో ఉన్నారు. కలిసి కట్టుగా ఉన్నారు. అభివృద్ధిలో ఉన్నారు. ఎలాంటి అడ్డంకులూ లేకుండా తమ కార్యాలు చేయగలరు, లేదా పరుల కర్మలను నశింపచేయగలరు అని అనుకొన్నప్పుడు కూడ శత్రువుతో విరోధం పెట్టుకొని ఆసనం చెయ్యాలి.

3. పరుని ప్రకృతులు తమ రాజుచేత అవమానించబడి, క్షీణులై ధనాశతో ఉన్నారు. లేదా తమ చక్రంచేత (సైన్యంచేత), దొంగలచేత,ఆటవికులచేత పీడింపబడి

ఉన్నారు. వాళ్లు స్వయంగానే గాని, లేదా ఉపజాపంచేత (రహస్యంగా రెచ్చగొట్టడంచేత) గాని నావైపు వచ్చేస్తారు అనిగాని, నా వార్త (కృషివాణిజ్యాదికం) సంపన్నంగా ఉంది; పరుని వార్త ఆపదలలో ఉన్నది, అందుచేత శత్రువుయొక్క ప్రకృతులు దుర్భిక్షాదిపీడితులై నావైపు వస్తారు అని గాని, నా వార్త విపన్నమైన (చెడ్డ పరిస్థితులలో) ఉన్నది, శత్రువు వార్త సంపన్నమై ఉన్నది; అయినా కూడ నా ప్రకృతులు శత్రువు వైపు వెళ్లరు., వాని ధాన్యం, ధనం, పశువులు బలాత్కారంగా తీసుకొనివస్తాను అని గాని, నా పణ్యాలకు (నా దేశంలో పుట్టించిన వస్తువులకు) నష్టం కలిగిస్తున్నాయి, అందుచేత పరుల పణ్యాలను తిరిగి పంపివేస్తాను అని గాని, వానితో విరోధం పెట్టుకొన్నట్లయితే వాని (శత్రువుయొక్క) వాణిజ్యమార్గంనుండి శ్రేష్ఠమైన సరుకు లన్నీ నా రాజ్యంలోనికి వస్తాయి, వాని రాజ్యంలోనికి వెళ్లవు అని గాని, వానితో విగ్రహం పెట్టుకుంటే దూష్యులను, అమిత్రులను, ఆటవికులను అతడు నిగ్రహించజాలడు లేదా వాళ్లతో విరోధం పొందుతాడు అని గాని, నాకు మంచి మిత్రుడు కానున్న నా మిత్రునిమీదికి ఈ శత్రువు దండెత్తి వెళ్లి చాల తక్కువ కాలంలో, తక్కువ నష్టంతో, తక్కువ వ్యయంతో అధికమైన లాభాన్ని పొందుతాడు అని కాని, ఇతడు నన్ను లెక్కచేయక సకలసైన్యబలంతో మంచి గుణాలు గల భూమిని ఆక్రమించుకొనడానికై వెళ్లనున్నాడు, వీనిని అలా వెళ్లనీయకూడదు అని గాని అనుకొన్నప్పుడు శత్రువుకు వృద్ధి కలగకుండా చేయడానికీ, తన ప్రతాపం చూపడానికీ వానితో విరోధించి ఆసనం చెయ్యాలి.

మూ. 1. తతో హి ప్రత్యావృత్తో గ్రసతే ఇత్యాచార్యాః.

2. నేతి కౌటల్యః. కర్శనమాత్రమస్య కుర్యాదవ్యసనినః. పరవృద్ధ్యా తు వృద్ధః సముచ్ఛేదనమ్.

3. ఏవం పరస్య యాతవ్యోఽస్మై సాహాయ్య మవినష్టః ప్రయచ్ఛేత్. తస్మాత్ సర్వసన్దోహప్రకృతం విగృహ్యాసీత.

4. విగృహ్యాసనప్రాతిలోమ్యే సన్ధాయాసీత.

5. విగృహ్యాసనహేతుభిరభ్యుచ్ఛ్రితః సర్వసన్దోహవర్జం విగృహ్య యాయాత్.

వ్యా. 1. మరొకనిమీదికి దండెత్తి వెడుతున్నవానికి అవరోధం కలిగించి వానితో

విగ్రహం పెట్టుకుంటే అతడు వెనుకకు తిరిగి వీనినే మింగేస్తాడు. అందుచేత వానితో విగ్రహం నెరపగూడదు అని ప్రాచీనాచార్యుల మతం.

2. అది యుక్తం కాదు; అతడు తిరిగి వచ్చినా కూడ వ్యసనంలో (కష్టాలలో) లేని ఈ విజిగీషువుకు కర్శనం మాత్రమే (కొంచెం దౌర్బల్యం) చేయకలుగుతాడు గాని పూర్తిగా పెకిలించవేయజాలడు. వానిని అడ్డుకొనని పక్షంలో మరొక శత్రువును జయించి తద్వారా వృద్ధి పొందిన శత్రువు ఈ విజిగీషువును పూర్తిగా పెకిలించివేస్తాడు అని కౌటల్యుని అభిప్రాయం.

3. మరొకని మీదికి దండెత్తి వెడుతున్నవానితో విగృహ్యాసనం అవలంబించిన విజగీషువుకు నశించని అతడు (ఎవనిమీదికి ఆ శత్రువు సర్వబలంతో దండెత్తి వెడతాడో అతడు) సాహాయ్యం చేస్తాడు. అందుచేత సమస్తబలంతో మరొకనిపైకి దండెత్తి వెళ్లే వానితో విగ్రహం వహించి ఆసనం చెయ్యాలి.

4. విగ్రహం చేస్తూ ఆసనాన్ని అవలంబించడానికి తగిన పైన చెప్పిన హేతువులకు విరుద్ధమైన పరిస్థితులలో సంధి చేసికొని ఆసనం చెయ్యాలి.

5. విగృహ్యాసనానికి తగిన హేతువులచేత బలం పుంజుకొన్న విజిగీషువు విరోధం అవలంబించి శత్రువుమీదికి దండెత్తి వెళ్లాలి. కాని సమస్తసైన్యాన్నీ యుద్ధసంనద్ధం చేసిన శత్రువుమీదికి మాత్రం వెళ్లకూడదు.

మూ. 1. యదా వా పశ్యేత్- "వ్యసనీ పరః, ప్రకృతివ్యసనం వాస్య శేషప్రకృతిభిః అప్రతికార్యమ్, స్వచక్రపీడితా విరక్తా వాస్య ప్రకృతయః కర్శితాః నిరుత్సాహాః పరస్పరాద్ భిన్నాః శక్యా లోభయితుమ్, అగ్న్యుదకవ్యాధిమరకదుర్భిక్షనిమిత్తమక్షీణయుగ్యపురుషనిచయరక్షావిధానః పరః" ఇతి తదా యాయాత్.

2. యదా వా పశ్యేత్- "మిత్రమాక్రన్దశ్చ మే శూరవృద్ధానురక్తప్రకృతిర్విపరీతప్రకృతిః పరః పార్ష్ణిగ్రాహాసారశ్చ, శక్ష్యామి మిత్రేణ ఆసారమాక్రన్దేన పార్ష్ణిగ్రాహం వా విగృహ్య యాతుమ్ ఇతి తదా విగృహ్య యాయాత్.

వ్యా. 1. "శత్రువు కష్టాలలో ఉన్నాడు. లేదా ఇతని కొందరు ప్రకృతులకు కలిగిన వ్యసనాన్ని మిగిలిన ప్రకృతులు తొలగించజాలరు. లేదా వీని ప్రకృతులు

స్వసైన్యంచేతనే పీడించబడినవారై విరక్తులుగా ఉన్నారు; దుర్బలులై పోయి ఉత్సాహవిహీనులై ఉన్నారు. ఒకరితో ఒకరికి భేదభావంతో ఉన్న వీళ్లని లోభపెట్టడం చాలా సులభం. లేదా వీని భారవాహకపశువులు, మనుష్యులు, భాండాగారాలు, కోట మొదలైన రక్షాసంవిధానమూ అగ్నిచేత వరదలచేత, వ్యాధులచేత, అంటురోగాలచేత, దుర్భిక్షం చేత క్షీణించిపోయాయి" అని చూచినప్పుడు వానితో విగ్రహం సాగించి దండెత్తి వెళ్లాలి.

2. ఎధుట ఉన్న నా మిత్రునియొక్క, ఆక్రందునియొక్క (వెనుక నున్న మిత్రునియొక్క) ప్రకృతులు శూరులై అభివృద్ధితో, రాజు మీద అనురాగవంతులై ఉన్నారు. శత్రువు పార్ష్ణిగ్రాహుడు (నా వెనుక ఉన్న శత్రువు), ఆసారుడు (నా వెనకు ఉన్న శత్రువు యొక్క మిత్రుడు) -వీళ్ల ప్రకృతులు శౌర్యం లేనివారై, అభివృద్ధి లేక తమ రాజు విషయంలో విరక్తులై ఉన్నారు; అందుచేత నా మిత్రుణ్ణి ఆసారునితోను, ఆక్రందుణ్ణి పార్ష్ణిగ్రాహునితోను యుద్ధానికి పురిగొల్పి నేను శత్రువుమీదికి దండెత్తి వెళ్లకలుగుతాను " అని అనుకొన్నప్పుడు విగ్రహం అవలంబించి యుద్ధానికి వెళ్లాలి.

మూ. 1. యదా వా ఫలమేకహార్యమల్పకాలం పశ్యేత్ తదా పార్ష్ణిగ్రాహాసారాభ్యాం విగృహ్య యాయాత్.

2. విపర్యయే సంధాయ యాయాత్.

3. యది వా పశ్యేత్- "న శక్యమేకేన యాతుమ్; అవశ్యం చ యాతవ్యమ్" ఇతి తదా సమహీనజ్యాయోభిః సామవాయికైః సంభూయ యాయాత్. ఏకత్ర నిర్దిష్టేనాంశేన అనేకత్ర అనిర్దిష్టేనాంశేన. తేషామసమవాయే దణ్డమన్యతమస్మిన్ నివిష్టాంశేన యాచేత. సంభూయాభిగమనేన వా నిర్విశ్యేత. ధ్రువే లాభే నిర్దిష్టేన అంశేన అధ్రువే లాభాంశేన.

4. శ్లో. అంశో దణ్డసమః పూర్వః ప్రయాససమ ఉత్తమః,
విలోపో వా యథాలాభం ప్రక్షేపసమ ఏవ వా.

*ఇతి కౌటలీయార్థశాస్త్రే షాడ్గుణ్యే సప్తమాధికరణే చతుర్థోఽధ్యాయః విగృహ్యాసనం, సంధాయాసనం, విగృహ్యాయానం, సంధాయయానం, సంభూయప్రయాణమ్, ఆదితో ద్విశతతమః.*

వ్యా. 1. స్వల్పకాలంలో, ఫలం అంతా తనకే లభిస్తుంది అని అనుకొన్నప్పుడు పార్ష్ణిగ్రాహునితోను, ఆసారునితోను కూడ విగ్రహం పెట్టుకొని శత్రువుమీదికి యుద్ధానికి వెళ్లాలి.

2. పరిస్థితి ఇందుకు విరుద్ధంగా ఉంటే, అనగా చాలా కాలానికి గాని ఫలం లభించదు. అది కూడ తన కొక్కనికే లభించదు అనుకొన్నప్పుడు, వాళ్లతో (పార్ష్ణిగ్రాహాసారులతో) సంధి చేసికొని శత్రువుమీదికి యుద్ధానికి వెళ్లాలి.

3. "నేను ఒక్కడనే యుద్ధానికి వెళ్లజాలను;కాని తప్పకుండా యుద్ధయాత్ర చేయవలసిన ఉన్నది" అని అనుకొన్నప్పుడు తనతో సముడైన రాజుతోను,తక్కువ వానితోను బలవంతుడైనవానితోను ఒక సంఘంగా ఏర్పడి వాళ్లతో కలిసి యుద్ధయాత్రకు వెళ్లాలి. ఒక దేశంమీదికి యుద్ధానికి వెడితే "జయించిన దానిలో ఇంత భాగం ఇస్తాను" అని నిర్దేశించాలి. అనేకదేశాలమీదికి యుద్ధానికి వెడితే "ఇంత వాటా" అని నిర్ధారణ చేయకూడదు. ఆ రాజులు (తనతో) కలవకపోతే "యుద్ధానంతరం నీకు ఇంత వాటా ఇస్తాను; నాకు ఇంత సైన్యం ఎరువు ఇయ్యి" అని వాళ్లలో ఒకనిని అడగాలి. లేదా "నువ్వు నా కిప్పుడు సహాయం చేస్తే నేను నీకు అవసరం వచ్చినప్పుడు నీతో కలిసి యుద్ధయాత్రకు వస్తాను" అని చెప్పి ఆ రాజుల సహాయం తీసుకోవాలి. ఈ యుద్ధంవల్ల ఇంత లాభం తప్పక లభిస్తుంది అనుకొన్నప్పుడు "నీకు ఇంత వాటా ఇస్తాను" అని చెప్పి, లాభం నిశ్చితం కానప్పుడు "నీకు కొంత వాటా ఇస్తాను" అని చెప్పి ఒప్పందం చేసుకోవాలి.

4. సంభూయయానంలో (కొందరు రాజులు కలిసి ఒకనిమీదికి యుద్ధానికి వెళ్లినప్పుడు) ఆ రాజులు ఎంతెంత సైన్యం పంపారో దానిని పట్టి లాభం పంచుకొనడం అనేది మొదటి పక్షం. ఎవళ్లు ఎంత శ్రమపడ్డారో ఆ శ్రమను పట్టి పంచుకొనడం ఉత్తమపక్షం. లేదా ఎవరు ఎంత దోచుకుంటే అది వాళ్ల వాటాగా తీసికోవాలి. లేదా ఆ యుద్ధం కోసం ఎవరు ఎంత ధనం ఖర్చుపెట్టారో దానిని పట్టి వాటాలు వేసుకోవాలి.

"బాలానందిని" అను కౌటలీయార్థశాస్త్రాంధ్రవ్యాఖ్యానంలో షాడ్గుణ్యం అనే సప్తమాధికరణంలో 'విగృహ్యాసనం', 'సంధాయాసనం', 'విగృహ్యాయానం', 'సంధాయయానం', 'సంభూయప్రయాణం' అను విషయాలకు సంబంధించిన నాల్గవ అధ్యాయం, ప్రారంభంనుంచి నూటరెండవ అధ్యాయం సమాప్తం.

# అథ పఞ్చమోऽధ్యాయః

## అష్టశతతమం ప్రకరణమ్ - యాతవ్యామిత్రయోరభిగ్రహచిన్తా.

## నవశతతమం ప్రకరణమ్ - క్షయలోభవిరాగహేతవః ప్రకృతీనామ్.

## దశశతతమం ప్రకరణమ్ - సామవాయికవిపరిమర్శః

(యాతవ్యుణ్ణి (దుర్బలుడైన దగ్గర శత్రువును) లొంగదీసుకొనడానికి సంబంధించిన ఆలోచన. ప్రకృతులు క్షీణించడానికి, దురాశ కలవా రవడానికి, రాజు విషయంలో వైముఖ్యం చెందడానికీ కారణాలు, ఒక సంఘం (Confederation) గా ఏర్పడిన రాజులను గూర్చిన విమర్శ).

మూ. 1. తుల్యసామన్తవ్యసనే యాతవ్యమమిత్రం వేత్యమిత్రమభియాయాత్, తత్సిద్ధౌ యాతవ్యమ్. అమిత్రసిద్ధౌ హి యాతవ్యః సాహాయ్యం దద్యాన్నామిత్రో యాతవ్యసిద్ధౌ.

2. గురువ్యసనం యాతవ్యం, లఘువ్యసనమమిత్రం వేతి గురువ్యసనం సౌకర్యతో యాయాదిత్యాచార్యాః. నేతి కౌటల్యః, లఘువ్యసనమమిత్రం యాయాత్.లఘ్వపి హి వ్యసనమభియుక్తస్య కృచ్ఛ్రం భవతి.సత్యం గుర్వపి గురుతరం భవతి. అనభియుక్తస్తు లఘువ్యసనః సుఖేన వ్యసనం ప్రతికృత్యామిత్రో యాతవ్యమభిసరేత్.పార్ష్ణిం గృహ్ణీయాత్.

వ్యా. 1. వెనుక చెప్పిన అరిసంపద కలిగి ఉండి కష్టాలలో ఉన్నవాడు 'యాతవ్యుడు' (దండెత్తి వెళ్లవలసినవాడు). నిత్యం అపకారం చేస్తూండే సామంతుడు "అమిత్రుడు" అని 'యాతవ్య', 'అమిత్రుల' భేదం. యాతవ్యుడు అమిత్రుడు అయిన ఇద్దరు సామంతులు సమానమైన వ్యసనంలోనే ఉన్నప్పుడు ఎవనిమీదికి దండెత్తి వెళ్లాలనగా - అమిత్రునిమీదికే వెళ్లాలి. వానిని లొంగతీసుకొన్న తరవాత యాతవ్యునిమీదికి వెళ్లాలి. ఎందువల్ల ననగా - అమిత్రుణ్ణి వశం చేసుకొనడంలో యాతవ్యుడు సహాయం చేస్తాడు కాని యాతవ్యుణ్ణి లొంగదీసికొనడానికి అమిత్రుడు సహాయం చేయడు.

2. యాతవ్యుడు అధికమైన కష్టాలలోను, అమిత్రుడు అల్పమైన కష్టాలలోను

ఉన్నప్పుడు సులభంగా జయించా లంటే అధికవ్యసనాలలో ఉన్నవానిమీదికే వెళ్లాలి అని ఆచార్యుల మతం. అది యుక్తం కా దని కౌటల్యుడు అంటాడు. లఘువ్యసనుడైన అమిత్రునిమీదికే వెళ్లాలి. అతనిని ముట్టడించగానే వాని వ్యసనం (అంతకుముందు) లఘువైనా కూడ పెద్దది అవుతుంది. యాతవ్యుని గురువైన వ్యసనం వానిని ముట్టడిస్తే గురుతరం (ఇంకా అధికం) అవుతుంది అనే మాట నిజమే అయినా (ముందుగా యాతవ్యునిమీదికి వెళ్లగూడదు). ఎందుచేత ననగా లఘువ్యసనంలో ఉన్న అమిత్రుడు ఏదో ఉపాయంచేత అనాయాసంగా ఆ వ్యసనానికి ప్రతిక్రియ చేసుకొని యాతవ్యునికి సహాయం చేయవచ్చును, లేదా (విజిగీషువు యొక్క) వెనుకనుండి ఆక్రమించుకొనవచ్చు. (అందుచేత లఘువ్యసనంలో ఉన్నవాడైనా అమిత్రునిమీదకే ముందుగా వెళ్లా లని కౌటల్యుని అభిప్రాయం).

మూ. 1.యాతవ్యయౌగపద్యే గురువ్యసనం న్యాయవృత్తికం, లఘు వ్యసనమన్యాయవృత్తిం విరక్తప్రకృతిం వేతి విరక్తప్రకృతిం యాయాత్. గురు వ్యసనం న్యాయవృత్తిమభియుక్తం ప్రకృతయోఽనుగృహ్ణన్తి. లఘువ్యసనమ న్యాయవృత్తిముపేక్షన్తే. విరక్తా బలవన్తమప్యుచ్ఛిన్దన్తి. తస్మాత్ విరక్తప్రకృతిమేవ యాయాత్.

2. క్షీణలుబ్ధప్రకృతిమపచరితప్రకృతిం వేతి - క్షీణలుబ్ధప్రకృతిం యాయాత్. క్షీణలుబ్ధా హి ప్రకృతయః సుఖేనోపజాపం పీడాం వోపగచ్ఛన్తి, నాపచరితాః ప్రధానావగ్రహసాధ్యా ఇత్యాచార్యాః.నేతి కౌటల్యః. క్షీణలుబ్ధాహి ప్రకృతయో భర్తరి స్నిగ్ధా భర్తృహితే తిష్ఠన్తి, ఉపజాపం వా విసంవాదయన్తి, అనురాగే సార్వగుణ్యమితి. తస్మాదపచరితప్రకృతిమేవ యాయాత్.

వ్యా. 1. చాలామంది యాతవ్యులు ఉన్నప్పుడు ఎక్కువ కష్టాలలో ఉన్న న్యాయప్రవృత్తి గల యాతవ్యునిమీదికి దండెత్తి వెళ్లాలా, తక్కువ కష్టాలలో ఉన్న అన్యాయప్రవృత్తి గల యాతవ్యుని మీదికి వెళ్లాలా, విరక్తులైన ప్రకృతులు గల యాతవ్యునిమీదకు వెళ్లాలా అనే ప్రశ్న ఉదయించినప్పుడు విరక్తప్రకృతి (ప్రకృతుల మంచితనాన్ని కోల్పోయినవాని) మీదకే వెళ్లాలి. గురువ్యసనవంతుడైన న్యాయప్రవృత్తి కలవాడు అభియుక్తు డైనప్పుడు (శత్రువుచేత పీడింపబడినప్పుడు) అతనిని ప్రకృతులు

అనుగ్రహిస్తారు, (సహాయపడతారు). లఘువ్యసనుడైన అన్యాయవృత్తియైనవానిని ప్రకృతులు ఉపేక్షిస్తారు.వాని విషయంలో పట్టించుకొనరు. విరక్తులైన ప్రకృతులు బలవంతుణ్ణి కూడా నశింపచేస్తారు. అందువల్ల విరక్తప్రకృతిమీదికే యుద్ధానికి వెళ్లాలి.

2. క్షీణులు, లుబ్ధులు అయిన ప్రకృతులు కలవానిమీదికి ముందు యుద్ధానికి వెళ్లాలా ప్రకృతులకు అపకారం చేసి వాళ్ల కోపానికి గురి అయినవానిమీదికి వెళ్లాలా అన్నప్పుడు క్షీణలుబ్ధప్రకృతిమీదికే యుద్ధానికి వెళ్ళాలి. ఎందువల్ల ననగా క్షీణులు లుబ్ధులు అయిన ప్రకృతులను అనాయాసంగా ఉపజాపం చేయడానికీ (రహస్యంగా రెచ్చగొట్టడానికీ) పీడించడానికి శక్యం అవుతారు. అపచరితుల ఉపజాపం, పీడ చెయ్యా లంటే ప్రధానవ్యక్తులను వశంచేసికొనడం ద్వారా మాత్రమే సాధ్యం అవుతుంది. అని ఆచార్యుల అభిప్రాయం. అది యుక్తం కాదు; ఎందువల్ల ననగా క్షీణులు, లుబ్ధులూ అయిన ప్రకృతులు ప్రభువు విషయంలో భక్తితో ఉంటారు. ప్రభువు హితం ఆచరిస్తారు. ప్రభువు విషయంలో అనురాగంతో ఉంటే అన్ని సత్ఫలితాలు పొందవచ్చును అనే అభిప్రాయంతో వాళ్లలో అసంతృప్తిని కలిగించా లనే ప్రయత్నాన్ని (ఉపజాపం) విఫలం చేస్తారు. అందువల్ల అపచరితప్రకృతిమీదికే యుద్ధానికి వెళ్లాలి అని కౌటిల్యుని అభిప్రాయం.

మూ. బలవన్తమన్యాయవృత్తిం దుర్బలం వా న్యాయవృత్తిమితి బలవన్తమన్యాయవృత్తిం యాయాత్. బలవన్తమన్యాయవృత్తిమ్ అభియుక్తం ప్రకృతయః నానుగృహ్ణన్తి, నిష్పాతయన్తి, అమిత్రం వాస్య భజన్తే. దుర్బలం తు న్యాయవృత్తిమభియుక్తం ప్రకృతయః పరిగృహ్ణన్తి; అనునిష్పతన్తి వా.

వ్యా. అన్యాయంగా ప్రవర్తించే బలవంతుడైన శత్రువుమీదికి ముందు యుద్ధానికి వెళ్లాలా లేక న్యాయప్రవృత్తి గల దుర్బలుని మీదికి వెళ్లాలా అన్నప్పుడు అన్యాయవృత్తి యైన బలవంతునిమీదికే వెళ్లాలి. ఎందువల్ల ననగా అన్యాయవృత్తి యైన బలవంతుడు ముట్టడించబడినపుడు వానికి ప్రకృతులు సహాయం చేయరు. దుర్గాదులనుండి వానిని పైకి గెంటివేస్తార్లు లేదా వాని శత్రువును ఆశ్రయిస్తారు. న్యాయవృత్తి గల దుర్బలుడు అభియుక్తు డైనప్పుడు ప్రకృతులు ఆదుకొంటారు. అతనితో పాటు తాము కూడ బైటకు వచ్చేస్తారు.

శ్లో. అవక్షేపేణ హి సతామసతాం ప్రగ్రహేణ చ,
అభూతానాం చ హింసానామధర్మ్యాణాం ప్రవర్తనైః,
ఉచితానాం చరిత్రాణాం ధర్మిష్ఠానాం నివర్తనైః,
అధర్మస్య ప్రసఙ్గేన ధర్మస్యావగ్రహేణ చ,
అకార్యాణాం చ కరణైః కార్యాణాం చ ప్రణాశనైః,
అప్రదానైశ్చ దేయానామదేయానాం చ సాధనైః,
అదణ్డనైశ్చ దణ్డ్యానాం దణ్డ్యానాం చణ్డదణ్డనైః,
అగ్రాహ్యాణాముపగ్రాహై ర్గ్రాహ్యాణాం చానభిగ్రహైః,
అనర్థ్యానాం చ కరణైరర్థ్యానాం చ విఘాతనైః,
అరక్షణైశ్చ చోరేభ్యః స్వయం చ పరిమోషణైః,
పాతైః పురుషకారాణాం కర్మణాం గుణదూషణైః,
ఉపఘాతైః ప్రధానానాం మాన్యానాం చావమాననైః,
విరోధనైశ్చ వృద్ధానాం వైషమ్యేణానృతేన చ,
కృతస్యాప్రతికారేణ స్థితస్యాకరణేన చ,
రాజ్ఞః ప్రమాదాలస్యాభ్యాం యోగక్షేమవధేన చ,
ప్రకృతీనాం క్షయో లోభో వైరాగ్యం చోపజాయతే.
క్షీణాః ప్రకృతయో లోభం లుబ్ధా యాన్తి విరాగతామ్,
విరక్తా యాన్త్యమిత్రం వా భర్తారం ఘ్నన్తి వా స్వయమ్.

వ్యా. ప్రకృతులు - క్షీణులు, లుబ్ధులూ, విరక్తులూ అవడానికి కారణాలు చెపుతున్నాడు - రాజు - మంచివాళ్లని దూరంగా ఉంచడంచేత, చెడ్డవాళ్లని దగ్గరికి చేరదీయడం చేత, అనుచితాలైన, ధర్మవిరుద్ధాలైన హింసలను ప్రవర్తింపచేయడంచేత, ఉచితములైన, ధర్మసంమతములైన చరిత్రలను (నడవడికలను) తొలగించడంచేత, అధర్మానికి చేయూత ఇవ్వడం చేత, ధర్మాన్ని ఎండగట్టడంచేత, చేయకూడని పనులు చేయడంచేత, చేయవలసిన పనులకు విఘాతం కలిగించడంచేత, భృత్యాదులకు ఇవ్వవలసిన ధనాదులు ఇవ్వకపోవడంచేత, ప్రజలు ఇవ్వవలసిన పని లేని ధనాదులను బలాత్కారంగా వాళ్లనుంచి రాబట్టడంచేత, దండింపదగనివాళ్లని దండించడంచేత,

దండించదగిన వాళ్లని తీవ్రంగా దండించడంచేత, నిర్బంధించదగనివాళ్లని నిర్బంధించడంచేత, నిర్బంధించ దగినవాళ్లని నిర్బంధించకపోవడంచేత, లాభకరములు కాని సంధ్యాదులు చేయడంచేత, లాభకరమైనవి చేయకపోవడంచేత, దొంగలనుండి రక్షించకపోవడం చేత, తానే ప్రజల సొమ్ములు అపహరించడంచేత, పురుషప్రయత్నాలకి విఘాతం కలిగించడంచేత, బాగా చేసిన పనుల గుణాలను దూషించడంచేత, ప్రధానులైన అధికారులు వాళ్ల పనులు సరిగా నిర్వహించకుండా అడ్డుతగలడంచేత, గౌరవించదగిన వాళ్లని అవమానించడంచేత, పెద్దవాళ్లతో విరోధం కల్పించుకొనడం చేత, కొందరి విషయంలో పక్షపాతబుద్ధి చూపుతూ అందరినీ సమంగా చూడకపోవడం చేత, అసత్యం పలకడంచేత, ఇతరులు చేసిన ఉపకారానికి ప్రత్యుపకారం చేయకపోవడంచేత, చేబట్టిన పని పూర్తి చేయకపోవడం చేత, పొరబాట్లు చేస్తూండడంచేత, సోమరితనం చేత, యోగక్షేమాలకు విఘాతం కలిగించడంచేత ప్రకృతులలో క్షయం, లోభం రాజు విషయంలో వైరాగ్యమూ కలుగుతాయి. క్షీణించిన ప్రకృతులలో ధనాశ పెరుగుతుంది. అలా ధనాశ పెరగడంతో వాళ్లు రాజు విషయంలో వైరాగ్యం చెందుతారు. ఇలా వైరాగ్యం చెందినవాళ్లు శత్రుపక్షానికైనా వెళ్లిపోతారు లేదా తామే రాజును చంపివేస్తారు.

మూ. 1. తస్మాత్ ప్రకృతీనాం క్షయలోభవిరాగకారణాని నోత్పాదయేత్. ఉత్పన్నాని వా సద్యః ప్రతికుర్వీత.

2. క్షీణాః, లుబ్ధాః, విరక్తా వా ప్రకృతయ ఇతి - క్షీణాః పీడనోచ్ఛేదన భయాత్ సద్యః సంధిం యుద్ధం నిష్పతనం వా రోచయన్తే. లుబ్ధాః లోభేనా సంతుష్టాః పరోపజాపం లిప్సన్తే. విరక్తాః పరాభియోగమభ్యుత్తిష్ఠన్తే.

3. తాసాం హిరణ్యధాన్యక్షయః సర్వోపఘాతీ కృచ్ఛ్రప్రతీకారశ్చ. యోగ్యపురుషక్షయో హిరణ్యధాన్యసాధ్యః.

4. లోభ ఐకదేశికో ముఖ్యాయత్తః పరార్థేషు శక్యః ప్రతిహన్తుమాదాతుం వా.

5. విరాగః ప్రధానావగ్రహసాధ్యః. నిష్ప్రధానా హి ప్రకృతయః భోగ్యా భవన్తి అనుపజాప్యాశ్చ అన్యేషామ్. అనాపత్సహాస్తు ప్రకృతిముఖ్యప్రగ్రహైస్తు బహుధా భిన్నా గుప్తా భవన్త్యాపత్సహాయాశ్చ.

వ్యా. 1. అందువల్ల ప్రకృతులలో క్షయము, లోభము, వైరాగ్యమూ కలిగే కారణాలను పుట్టనివ్వకూడదు. అలాంటి కారణా లేవైనా పుట్టినా వెంటనే వాటికి ప్రతిక్రియ చెయ్యాలి.

2. క్షీణులు, లుబ్ధులు, విరక్తులు అయిన ప్రకృతులలో క్షీణులు శత్రువువల్ల పీడ కలుగుతుంది. తమను శత్రువు పూర్తిగా నశింపచేయవచ్చును అనే భయంచేత శత్రువు తమ రాజుమీదికి దండెత్తి రాగానే వెంటనే సంధిచేసుకోవాలని గాని, యుద్ధం చెయ్యాలని గాని, దుర్గనుంచి బైటకు వెళ్లిపోవాలని గాని అనుకుంటారు. లుబ్ధులైన ప్రకృతులు లోభం కలవాళ్లవడంచేత ఎల్లప్పుడు (తమ రాజు విషయంలో) అసంతుష్టులు గానే ఉంటూ శత్రువు చేసే ఉపజాపానికి (అంతః క్రోధం కలిగించడానికి) లొంగిపోతారు. విరక్తులైన ప్రకృతులు శత్రువు వచ్చి ముట్టడించి నప్పుడు ఆ శత్రువుతో పాటు తాము కూడా తమ రాజుకు ఎదురుతిరుగుతారు.

3. ప్రకృతుల ధనధాన్యాలు నశిస్తే దానివల్ల అందరికీ (రాజ్యానికంతకీ) ముప్పు వాటిల్లుతుంది; దానికి ప్రతిక్రియ చేయడం కష్టం అవుతుంది. అశ్వవృషభాది పశువులకు పురుషులకు వినాశం కలిగినా ఆ లోపాన్ని ధనధాన్యాలచేత పూడ్చుకొనవచ్చు.

4. లోభం ప్రధానాధికారులు మొదలైన కొందరు ప్రకృతులలో మాత్రమే ఉన్నప్పుడు ఆ లోభం శత్రువు ధనం విషయంలో ప్రసరించే టట్లు చేయవచ్చును; లేదా ఇతరోపాయాలచేత దానిని తొలగించవచ్చును.

5. ప్రధానపురుషులను (నాయకులను) వశంలోఉంచుకొంటే ప్రకృతుల విరాగాన్ని తొలగించవచ్చును. ఎందువల్ల ననగా నాయకులు లేని ప్రకృతులచేత పనులు బాగా చేయించుకొనవచ్చును; వాళ్లు శత్రువులు చేసే ఉపజాపాలకి కూడా లొంగరు. అయితే అలాంటి (నాయకులు లేని) ప్రకృతులు ఏవైనా ఆపదలు కలిగితే మాత్రం తట్టుకొనజాలరు. ప్రకృతిముఖ్యుల (నాయకుల) చెప్పుచేతలలో ఉన్న ప్రకృతులు మాత్రం అనేకసంఘాలుగా విడదీయబడినవారై రక్షింపబడతారు; ఆపదలలో సహాయపడతారు(ఆపదలు వస్తే తట్టుకుంటారు).

మూ. 1. సామవాయికానామపి సంధివిగ్రహకారణాన్యవేక్ష్య శక్తిశౌచ యుక్తేన సంభూయ యాయాత్. శక్తిమాన్ హి పార్ష్ణిగ్రహణే యాత్రాసాహాయ్య దానే వా శక్తః శుచిః సిద్ధౌ చాసిద్ధౌ చ యథాస్థితకారీతి.

2. తేషాం జ్యాయసైకేన ద్వాభ్యాం సమాభ్యాం వా సంభూయ

యాతవ్యమితి ద్వాభ్యాం సమాభ్యాం శ్రేయః. జ్యాయసా హ్యవగృహీతశ్చరతి. సమాభ్యామతిసంధానాధిక్యే వా తౌ హి సుఖౌ భేదయితుమ్, దుష్టశ్చైకో ద్వాభ్యాం నియన్తుం భేదోపగ్రహం చోపగన్తుమితి.

3. సమేనైకేన ద్వాభ్యాం హీనాభ్యాం వేతి - ద్వాభ్యాం హీనాభ్యాం శ్రేయః. తౌ హి ద్వికార్యసాధకౌ వశ్యౌ చ భవతః.

వ్యా. 1. విజిగీషువుతో కలిసి యుద్ధాదులు చేసే ఇతర రాజులు 'సామవాయికులు'. ఆ సామవాయికులలో కూడ సంధికి విగ్రహానికి తగిన కారణాలను జాగర్తగా పరీక్షించి శక్తి, శౌచము(నిజాయితీ) ఉన్నవానితో కలిసి శత్రువుపైకి దండెత్తి వెళ్లాలి. ఎందువల్ల ననగా శక్తిమంతుడైన సామవాయికుడు శత్రువుయొక్క వెనుక భాగాన్ని గ్రహించడంలోను అనగా శత్రువు ముందుకు వచ్చి యుద్ధం చేస్తూండగా వెనుకనుంచి వెళ్లి వాని రాజ్యాన్ని ఆక్రమించడానికీ, (విజిగీషువు యుద్ధం చేస్తూన్నప్పుడు వాని వెనుకనుంచి వచ్చి ఎవరూ వాని రాజ్యం ఆక్రమించకుండా చూడడానికీ, గ.శా.) యుద్ధయాత్రలో సాహాయ్యం ఇవ్వడానికీ సమర్థుడై ఉంటాడు. శుచియైన సామవాయికుడు జయం లభించినా లభించకపోయినా ఉన్నది ఉన్నట్లుగా ఉండే టట్లు చూస్తాడు.

2. సామవాయికులలో బలవంతుడైన రాజుతో కలిసి వెళ్లాలా సములైన ఇద్దరు రాజులతో కలిసి యుద్ధానికి వెళ్లాలా అన్నప్పుడు సములైన ఇద్దరితో కలిసి వెళ్లడమే మంచిది. ఎందువల్ల ననగా- తనకంటె బలవంతుడైన రాజుతో కలిసి వెడితే వానికి వంగి ప్రవర్తించాలి. ఇద్దరు సములతో కలిసి వెళ్లినప్పుడు తానే వాళ్లమీద అధికారం చలాయించి ఆధిక్యం సంపాదించవచ్చు. వాళ్లవల్ల ఏమైనా అపకారం కలుగుతుంది అని శంక కలిగి నప్పుడు వాళ్లిద్దరి మధ్యా భేదభావం పుట్టించవచ్చు. వాళ్లల్లో ఒకడు దుష్టుడైతే తాను, రెండవ వాడూ కలిసి వానిని నిగ్రహించవచ్చు, లేదా భేదోపాయంచేత వానిని అణచివేయవచ్చు.

3. తనతో సముడైన ఒకనితో కలిసి యుద్ధానికి వెళ్లాలా ఇద్దరు హీనులతో కలిసి వెళ్లాలా అన్నప్పుడు ఇద్దరు హీనులతో (తనకంటె తక్కువబలం ఉన్నవాళ్లతో) కలిసి వెళ్లడం మంచిది. ఎందువల్ల ననగా వాళ్లు రెండు పనులు (వెనుక ముందూ రక్షణ కల్పించడం అనే రెండు పనులు) చేస్తారు, తనకు వశులై ఉంటారు.

మూ. 1. కార్యసిద్ధౌ తు-

శ్లో. కృతార్థాజ్జ్యాయసో గూఢః సాపదేశమపస్రవేత్,
అశుచేః శుచివృత్తాత్తు ప్రతీక్షేతావిసర్జనాత్.

వ్యా. కార్యం సిద్ధించిన తరవాత- "తలబెట్టిన పని పూర్తి చేసిన అధిక బలవంతుడైన సామవాయికుడు అశుచి (నిజాయితీలేనివాడు) అయితే ఏదో వంకపెట్టి రహస్యంగా వానినుంచి దూరంగా వెళ్లిపోవాలి. అతడు శుచియే అయితే అతడు వెళ్లమనే వరకు నిరీక్షించాలి.

శ్లో. సత్రాదపసరేద్యత్తః కలత్రమపనీయ వా,
సమాదపి హి లబ్ధార్థాత్ విశ్వస్తస్య భయం భవేత్.

వ్యా. లేదా సత్రంనుంచి (దుర్గం మొదలైన సంకటప్రదేశంఃగ.శా. అపాయకరమైన ప్రదేశం-కాంగ్లే) ప్రయత్నపూర్వకంగా తన స్త్రీజనాదులను (జాగర్తగా రక్షించదగిన వాళ్ల నందరినీ-గ.శా.) తొలగించి దూరంగా వెళ్లిపోవాలి. కార్యం సాధించిన (అశుచియైన) సమునివల్ల కూడ, వానిని ఎక్కువగా విశ్వసిస్తే భయం కలగవచ్చు.

శ్లో. జ్యాయస్త్వే చాపి లబ్ధార్థః సమో విపరికల్పతే,
అభ్యుచ్చితశ్చావిశ్వాస్యో వృద్ధిశ్చిత్తవికారిణీ.

వ్యా. సముడు కూడ కార్యం సాధించిన పిమ్మట బలవంతుడై విపరీతంగా ప్రవర్తించవచ్చు. అభివృద్ధి పొందినవానిని విశ్వసించకూడదు. ఎందువల్ల ననగా అభివృద్ధి చిత్తంలో వికారం పుట్టిస్తుంది.

శ్లో. విశిష్టాదల్పమప్యంశం లబ్ధ్వా తుష్టముఖో వ్రజేత్,
అనంశో వా తతోఽస్యాజ్కే ప్రహృత్య ద్విగుణం హరేత్.

వ్యా. తనకంటె ఎక్కువ బలం గల సామవాయికుడు యుద్ధంలో జయం లభించిన తరవాత చాలా అల్పమైన భాగం ఇచ్చినా, అసలు ఏమీ ఇవ్వకపోయినా కూడ సంతోషిస్తున్నట్లు ముఖం చూపుతూ వెళ్లిపోవాలి. సమయం దొరికి నప్పుడు వానిమీద దెబ్బతీసి రెట్టింపు భాగం తీసుకోవాలి.

శ్లో. కృతార్థస్తు స్వయం నేతా విసృజేత్ సామవాయికాన్,
అపి జీయేత న జయేన్మణ్డలేష్టస్తథాభవేత్.

ఇతి కౌటలీయార్థశాస్త్రే షాడ్గుణ్యే సప్తమాధికరణే పఞ్చమోఽధ్యాయః, యాతవ్యామిత్రయోరభిగ్రహచిన్తా, క్షయలోభవిరాగహేతవః. ప్రకృతీనాం చ సామవాయికవిపరిమర్శః, ఆదితస్త్రిశతతమః.

వ్యా. స్వయంగా యుద్ధంలో నేతృత్వం వహించిన విజిగీషువు జయం లభించిన తరవాత సామవాయికుల నందరినీ సగౌరవంగా పంపాలి. వాటాలలో తానే తక్కువ వాటా తీసికోవాలి కాని ఇతరులకు తక్కువ వాటాలు ఇవ్వకూడదు. ఇలా ప్రవర్తించడంవల్ల రాజమండలానికి ప్రీతిపాత్రు డౌతాడు.

"బాలానందిని" అను కౌటలీయార్థశాస్త్రాంధ్రవ్యాఖ్యానంలో షాడ్గుణ్యం అనే సప్తమాధికరణంలో యాతవ్యామిత్రుల అభిగ్రహాన్ని గూర్చిన ఆలోచన, ప్రకృతుల క్షయ-లోభ-విరాగాలకు హేతువులు, సామవాయిక విపరిమర్శం అనే ఐదవ అధ్యాయం ప్రారంభంనుండి నూటమూడవ అధ్యాయం సమాప్తం.

## అథ షష్ఠోఽధ్యాయః

### ఏకాదశశతతమం ప్రకరణం - సంహితప్రాయణికమ్

### ద్వాదశశతతమం ప్రకరణం - పరిపణితాపరిపణితాపసృతాః సంధయః

(సంధిచేసికొన్న ఇద్దరు విజిగీషువులు యాతవ్యునిమీదికి వేరు దిక్కులనుండి యుద్ధానికి వెళ్లడం, పరిపణిత - అపరిపణిత - అపసృతసంధులు)

మూ. 1. విజిగీషుర్ద్వితీయాం ప్రకృతిమేవమతిసందధ్యాత్. సామన్తం సంహితప్రయాణే యోజయేత్- "త్వమితో యాహి; అహమితో యాస్యామి, సమానో లాభః" ఇతి.

2. లాభసామ్యే సంధిః. వైషమ్యే విక్రమః.

3. సంధిః పరిపణితశ్చ అపరిపణితశ్చ.

4. త్వమేతం దేశం యాహి అహమిమం దేశం యాస్యామీతి పరిపణితదేశః.

5. త్వమేతావన్తం కాలం చేష్టస్వ, అహమేతావన్తం కాలం చేష్టిష్యే ఇతి పరిపణితకాలః.

6. త్వమేతావత్ కార్యం సాధయ, అహమేతావత్ కార్యం సాధయిష్యామీతి పరిపణితార్థః.

వ్యా. 1. విజిగీషువు రాజమండలంలోని రెండవ ప్రకృతియైన రాజును ఈ విధంగా వంచించాలి. అతడు సామంతునితో (దగ్గర ఉన్న రాజుతో) ముందుగా సంధి చేసికొని "నువ్వు ఈ ప్రక్కనుంచి యుద్ధానికి వెళ్లు; నేను ఈ ప్రక్కనుంచి యుద్ధానికి వెడతాను. లాభం సమంగా పంచుకుందాం" అని చెప్పి యుద్ధయాత్రకు పంపాలి.

2. లాభం సమంగా ఉంటే సంధి, లాభంలో వైషమ్యం ఉంటే పరాక్రమం చూపాలి.

3. పరిపణితసంధి, అపరిపణితసంధి అని సంధి రెండు విధాలు.

4."నువ్వు ఈ దేశానికి వెళ్లు; నేను ఈ దేశానికి వెడతాను" అని దేశాన్ని గూర్చి మాట్లాడుకొన్న సంధి పరిపణితదేశసంధి.

5. "నువ్వు ఇంత కాలం చెయ్యి, నేను ఇంత కాలం చేస్తాను" అని కాలాన్ని గూర్చి మాట్లాడుకొని చేసికొన్న సంధి పరిపణితకాలసంధి.

6. "నువ్వు ఇంత పని చెయ్యాలి, నేను ఇంత చేస్తాను" అని పనిని గూర్చి నిర్ణయించుకొన్న సంధి పరిపణితార్థసంధి.

మూ. 1. యది వా మన్యేత- "శైలవననదీదుర్గమటవీవ్యవహితం భిన్నధాన్యపురుషవీవధాసారమ్, అయవసేన్ధనోదకమ్, అవిజ్ఞాతం ప్రకృష్టమన్యభావదేశీయం వా సైన్యవ్యాయామానామలబ్ధభౌమం వా దేశం పరో యాస్యతి, విపరీతమహమ్" ఇతి ఏతస్మిన్ విశేషే పరిపణితదేశం సంధిముపేయాత్.

2. యది వా మన్యేత "ప్రవర్షోష్ణశీతమ్, అతివ్యాధిప్రాయమ్, ఉపక్షీణాహారోపభోగం, సైన్యవ్యాయామానాం చ ఔపరోధికం, కార్యసాధనానామ్ ఊనమ్, అతిరిక్తం వా కాలం పరః చేష్టిష్యతే, విపరీతమహమ్" ఇత్యేతస్మిన్ విశేషే పరిపణితకాలం సంధిముపేయాత్.

3. యది వా మన్యేత - "ప్రత్యాదేయం ప్రకృతికోపకం దీర్ఘకాలం, మహాక్షయవ్యయమ్, అనర్థానుబన్ధకమ్, అకల్యమ్, అధర్మ్యం మధ్యమోదాసీన విరుద్ధం మిత్రోపఘాతకం వా కార్యం పరః సాధయిష్యతి, విపరీతమహమ్" ఇతి, ఏతస్మిన్ విశేషే పరిపణితార్థం సంధిముపేయాత్.

4. ఏవం దేశకాలయోః కాలకార్యయోః, దేశకార్యయోః దేశకాలకార్యాణాం చావస్థాపనాత్ సప్తవిధః పరిపణితః.

వ్యా. 1. "శత్రువు వెళ్లవలసిన దేశం పర్వతదుర్గాలతోను, వనదుర్గాలతోను, నదీదుర్గాలతోను, వ్యవహితమైనది (మధ్య మధ్య పర్వతాదు లున్నది. మధ్య పెద్ద అడవులు కూడా ఉన్నాయి. ఆహారధాన్యాల, మనుష్యుల రాకపోకలకు సైన్యసంచారానికి అనువుగా ఉండదు. పశుగ్రాసం, కట్టెలు, ఉదకం లభించవు. అది పూర్వం పరిచితం కానిది. చాల దూరమైనది. అక్కడివాళ్లు ద్వేషభావంతో ఉంటారు. సైన్యవ్యాయామానికి (సేన యుద్ధం చేయడానికి) తగిన ప్రదేశం అక్కడ ఉండదు. నేను వెళ్లవలసిన దేశం ఇందుకు విరుద్ధంగా, పైన చెప్పిన అసౌకర్యా లేవీ లేకుండా ఉంది" అని అనుకొన్నప్పుడు, ఇలాంటి పరిస్థితులలో శత్రువుతో పరిపణితసంధి కుదుర్చుకోవాలి.ఆ సంధి కుదుర్చుకొని అలాంటి దేశం మీదుగా యాతవ్యుని మీదికి అతడు యుద్ధానికి వెళ్లేటట్లు, తాను అందుకు విపరీతమైన దేశంమీదుగా వెళ్లే టట్లు చూచుకోవాలి. అని అర్థం,

2."శత్రువు పని చేసే కాలంలో అధికమైన వర్షాలు గాని, వేడి గాని, చలి గాని ఉంటుంది. వ్యాధులు ప్రబలుతాయి. ఆహారానికి ఇతర ఆవశ్యకవస్తువులకీ కొరత ఉంటుంది. సైన్యవ్యవహారానికి అవరోధాలు ఎక్కువగా ఉంటాయి. చాల తక్కువ కాలం లేదా చాలా దీర్ఘకాలం అవడంచేత కార్యసాధనానికి అనువుగా ఉండదు. నేను పని చేసే కాలం ఇందుకు విరుద్ధంగా ఉంటుంది" అని అనుకొన్నప్పుడు, ఇలాంటి పరిస్థితులలో శత్రువుతో పరిపణితకాలసంధి కుదుర్చుకోవాలి.

3. "శత్రువు సాధించే కార్యాన్ని (కార్యఫలాన్ని) అనాయాసంగా తిరిగి రాబట్టుకొనవచ్చును. అతడు చేబట్టిన కార్యంవల్ల ప్రకృతులలో కోపం (తిరుగుబాటు) కలుగుతుంది. సాధించడానికి చాల కాలం పడుతుంది. చాలా నష్టం కలుగుతుంది. ఖర్చు అధికం అవుతుంది. ఆ కార్యాన్ని కొన్ని అనర్థాలు వెన్నంటి వస్తాయి. అది అంతగా యుక్తమైనది కాదు; ధర్మసంమతం కాదు. మధ్యమునికి ఉదాసీనునికి విరుద్ధంగా

ఉంటుంది. మిత్రులకు వినాశం కలిగిస్తుంది. నేను చేయవలసిన కార్యం ఇందుకు విరుద్ధంగా ఉంటుంది" అని అనుకొన్నప్పుడు, అలాంటి పరిస్థితిలో శత్రువుతో పరిపణితార్థసంధి ఏర్పరచుకోవాలి.

4. ఈ విధంగా దేశకాలాలను, కార్యకాలాలను, దేశకార్యాలను, దేశకాలకార్యాలను ముందుగా నిర్ణయించుకొని చేసికొన్న పరిపణితసంధి (మొదటి చెప్పిన దేశపరిపణితసంధి, కాలపరిపణితసంధి, కార్యపరిపణితసంధి అనే మూడు సంధులతో సహా) ఏడు విధాలు.

మూ. 1. తస్మిన్ ప్రాగేవారభ్య ప్రతిష్ఠాప్య చ స్వకర్మాణి పరకర్మసు విక్రమేత.

2. వ్యసనత్వరావమానాలస్యయుక్తమ్, అజ్ఞం వా శత్రుమ్ అతిసంధాతుకామః దేశకాలకార్యాణామనవస్థాపనాత్ "సంహితౌ స్వః" ఇతి సంధివిశ్వాసేన పరచ్ఛిద్రమాసాద్య ప్రహరేదిత్యపరిపణితః.

వ్యా. 1. ఈ ఏడు విధాలైన పరిపణితసంధిలో తన కర్మ లన్నీ ముందుగానే ప్రారంభించి, పూర్తిచేసికొని, శత్రువు కర్మల విషయంలో పరాక్రమించాలి.

2. శత్రువు కష్టాలలో ఉన్నా, తొందరలో ఉన్నా, అవమానితుడై ఉన్నా, సోమరిగా ఉన్నా, తెలివితక్కువవాడైనా వానిని మోసగించ దలచిన విజిగీషువు దేశ-కాల-కార్యాలను నిర్ణయించుకొనకుండా "మనమిద్దరం కలిసి ఉన్నాం" అని సంధి చేసికొని, తద్వారా విశ్వాసం కలిగించి వాని ఛిద్రాలలో (దుర్బలమైన పరిస్థితులు ఏర్పడినప్పుడు) దెబ్బకొట్టాలి. ఇది అపరిపణితసంధి.

మూ. 1. తత్రైతత్ భవతి-

శ్లో. సామన్తేనైవ సామన్తం విద్వానాయోజ్య విగ్రహే,
తతోఽన్యస్య హరేద్భూమిం ఛిత్త్వా పక్షం సమన్తతః.

2. సన్ధేః అకృతచికీర్షా కృతశ్లేషణం, కృతవిదూషణమ్, అవశీర్ణక్రియా చ విక్రమస్య ప్రకాశయుద్ధం, కూటయుద్ధం, తూష్ణీంయుద్ధమ్, ఇతి సంధి విక్రమౌ.

3. అపూర్వస్య సంధేః సానుబన్ధైః సామాదిభిః పర్యేషణం,

సమహీనజ్యాయసాం చ యథాబలమవస్థాపనమ్ అకృతచికీర్షా.

4. కృతస్య ప్రియహితాభ్యాముభయతః పరిపాలనం యథాసంభాషితస్య చ నిబన్ధనస్యానువర్తనం రక్షణం చ "కథం పరస్మాన్న భిద్యేత" ఇతి కృతశ్లేషణమ్.

5. పరస్య అపసంధేయతాం దూష్యాతిసంధానేన స్థాపయిత్వా వ్యతిక్రమః కృతవిదూషణమ్.

6. భృత్యేన మిత్రేణ వా దోషాపసృతేన ప్రతిసంధానమవశీర్ణక్రియా.

వ్యా. 1. ఈ విధమైన సంధులను కుదుర్చుకొన్న తరవాత ఈ విధంగా చేయవలసి ఉంటుంది- "తెలివైన విజగీషువు తనకు దగ్గరగా ఉన్న ఒక సామంతునికీ మరొక సామంతునికీ విరోధం కల్పించి, తరవాత మరొక సామంతుని పక్షాన్ని పూర్తిగా నశింపజేసి వాని భూమిని ఆక్రమించాలి"

2. అకృతచికీర్ష, కృతశ్లేషణం, కృతవిదూషణం, అవశీర్ణక్రియ అని సంధికి సంబంధించినవి నాలుగు అంశాలు. ప్రకాశయుద్ధం, కూటయుద్ధం, తూష్ణీంయుద్ధం అనేవి విక్రమానికి సంబంధించిన మూడు అంశాలు.ఇవి సంధివిక్రమాలు.

3. సామదానాదులచేత వాటివల్ల కలిగే ఫలితాలచేత క్రొత్తగా ఏర్పరచుకొన్న సంధిని పరీక్షించడం, సములు, హీనులు, బలవంతులు అయిన రాజులను వారి వారి బలాన్ని అనుసరించి,తన బలాన్ని కూడ దృష్టిలో పెట్టుకొని, వారి వారికి తగిన స్థానాలలో ఉంచడం - ఇది "అకృతచికీర్ష".

4. రెండు పక్షాలవాళ్లూ కూడ పరస్పరము ప్రియములూ, హితములూ అయిన పనులుచేస్తూ, చేసుకొన్న సంధిని పాటించడం, మాటలాడుకొన్న విధంగా అన్నీ జరిపించడం, ఏ శత్రువులవల్లా సంధికి విఘాతం కలగకుండా రక్షించుకొనడం - ఇది "కృతశ్లేషణం".

5. దూష్యుల (రాజద్రోహుల) ద్వారా శత్రువును మోసగించి ఆ శత్రువుతో సంధిని విఘటితం చెయ్యాలి అని స్థాపించి సంధిని విఘటితం చేయడం "కృతవిదూషణం".

6. ఏదో ఒక దోషంచేత తననుండి విడిపోయిన భృత్యునితో గాని, మిత్రునితో గాని తిరిగి కలవడం "అవశీర్ణక్రియ".

మూ. 1. తస్యాం గతాగతః చతుర్విధః- కారణాద్గతాగతః, విపరీతః, కారణాద్గతోఽకారణాదాగతః, విపరీతశ్చేతి.

2. స్వామినో దోషేణ గతో గుణేనాగతః, పరస్య గుణేన గతో దోషేణ ఆగత ఇతి కారణాద్గతాగతః సంధేయః.

3. స్వదోషేణ గతాగతో గుణముభయోః పరిత్యజ్య అకారణాద్గతాగతః చలబుద్ధిరసంధేయః.

4. స్వామినో దోషేణ గతః పరస్మాత్ స్వదోషేణాగత ఇతి కారణాత్ గతః అకారణాదాగతః తర్కయితవ్యః- "పరప్రయుక్తః స్వేన వా దోషేణ అపకర్తుకామః పరస్యోచ్ఛేత్తారమమిత్రం మే మత్వా ప్రతిఘాతభయాదాగతః, పరం వా మాముచ్ఛేత్తుకామం పరిత్యజ్య ఆనృశంస్యాదాగతః" ఇతి జ్ఞాత్వా కల్యాణబుద్ధిం పూజయేత్, అన్యథాబుద్ధిమపకృష్టం వాసయేత్.

5. స్వదోషేణ గతః పరదోషేణాగతః ఇత్యకారణాద్గతః కారణాదాగతః తర్కయితవ్యః- "ఛిద్రం మే పూరయిష్యతి, ఉచితోఽస్య వాసః, పరత్రాస్య జనో న రమతే, మిత్రైర్మే సంహితః, శత్రుభిర్విగృహీతః. లుబ్ధక్రూరాదావిగ్నః శత్రుసంహితాద్వా పరస్మాత్" ఇతి జ్ఞాత్వా యథాబుద్ధ్యవస్థాపయితవ్యః.

వ్యా. 1. అవశీర్ణక్రియలో- (1) ఏదో ఒక కారణం ఉండి వెళ్లిపోయినవాడు ఏదో ఒక కారణం ఉండి తిరిగి వచ్చినవాడు (2) దానికి విపరీతుడు, అనగా కారణం ఏమీ లేకుండానే వెళ్లిపోయినవాడు కారణం లేకుండానే తిరిగి వచ్చినవాడు, (3) కారణం ఉండి వెళ్లిపోయినవాడు కారణం ఏదీ లేకుండా తిరిగి వచ్చినవాడు (4) దానికి విపరీతుడు, అనగా కారణం ఏదీ లేకుండా వెళ్లిపోయినవాడు కారణం ఉండి తిరిగి వచ్చినవాడు అని గతాగతుడు నాలుగు విధాలు.

2. స్వామియొక్క దోషంచేత వెళ్లిపోయాడు స్వామి గుణంచేత తిరిగి వచ్చాడు, అదే విధంగా శత్రువుయొక్క గుణం అనే కారణంచేత (అటు) వెళ్లిపోయాడు వాని

దోషంచేత తిరిగివచ్చాడు గాన "కారణాద్గతాగతునితో" సంధి చేసుకోవచ్చును.

3. తన దోషంచేతనే స్వామిని విడిచి వెళ్లి శత్రువును ఆశ్రయించి, మళ్లీ అదే విధంగా శత్రుదోషంచేత కాక స్వదోషంచేతనే తిరిగి వచ్చిన గతాగతుడు స్వామిగుణం కాని శత్రువు గుణాన్ని గాని చూడక అకారణంగానే గతాగతాలు (వెళ్లడం రావడం) చేయడంచేత అతడు చపలబుద్ధి.వానితో సంధి చేసుకొనగూడదు.

4. స్వామియొక్క దోషంచేత శత్రువు దగ్గరికివెళ్లి ఆ శత్రువునుండి తన దోషం చేత తిరిగి స్వామి దగ్గరికి వచ్చినవాడు కారణంవల్ల వెళ్లి కారణం లేకుండా తిరిగి రావడం చేత వానిని గూర్చి- ఇతడు "శత్రువు ప్రేరేపింపగా నాకు అపకారం చేయడానికి వచ్చాడా, లేక నావల్ల తనకు పూర్వం జరిగిన అపకారానికి ప్రతీకారం చెయ్యాలి అనే దుష్టబుద్ధితో వచ్చాడా, లేక నా శత్రువు తన శత్రువుల దగ్గరినుండి వచ్చిన వాళ్ల నందరినీ నశింపచేస్తూండడంవల్ల తనను కూడా నశింపచేస్తా డనే భయంచేత నా దగ్గరికి తిరిగి వచ్చాడా లేక శత్రువు నన్ను నశింపచేయా లని అనుకుంటూ ఉండడం చూచి నామీద ఉన్న అభిమానంచేత ఆ శత్రువును విడిచి వచ్చాడా" అని బాగా తర్కించుకోవాలి. అసలు విషయం గ్రహించి అతడు మంచి బుద్ధితో వచ్చినవాడైతే అతనిని సత్కరించి దగ్గర ఉంచుకోవాలి. అలా కాని పక్షంలో దూరంగా ఉంచాలి. "

5. (స్వామిదోషంచేత కాక) తన దోషం చేతనే వెళ్లి శత్రువు దోషంచేత తిరిగి వచ్చినవాడు, కారణం లేకుడా వెళ్లి కారణం ఉండి తిరిగి వచ్చినవా డవడంచేత వానిని గూర్చి- "ఇతడు నాలో ఉన్న లోపాన్ని పూరిస్తాడా? లేక ఇతడు ఇక్కడ ఉండడమే మంచిదా? లేక ఇతని కుటుంబానికి సంబంధించినవాళ్లు మరొకచోట (శత్రురాజ్యంలో) ఉండడానికి ఇష్టపడడంలేదా? లేక ఇతడు నా మిత్రులతో కలిసి ఉన్నాడా (సంధి చేసికొని ఉన్నాడా) లేక నా శత్రువులతో వైరం పెట్టుకొన్నాడా? లేక లుబ్ధుడు క్రూరుడూ అయిన నా శత్రువుకు భయపడుతున్నాడా? లేదా శత్రువుతో సంధిచేసికొన్న మరొకనికి భయపడుతున్నాడా" అని వితర్కం చెయ్యాలి. విషయం తెలుసుకొని బుద్ధిని పట్టి దగ్గరగానో దూరంగానో ఉంచాలి.

మూ. 1. కృతప్రణాశః, శక్తిహానిః, విద్యాపణ్యత్వమ్, ఆశానిర్వేదః, దేశలౌల్యమ్, అవిశ్వాసః. బలవద్విగ్రహో వా పరిత్యాగస్థానమిత్యాచార్యాః. భయమ్, అవృత్తిః, అమర్ష ఇతి కౌటల్యః.

2. ఇహాపకారీ త్యాజ్యః. పరాపకారీ సంధేయః. ఉభయాపకారీ తర్కయితవ్యః ఇతి సమానమ్.

3. అసంధేయేన త్వవశ్యం సంధాతవ్యే యతః ప్రభావః తతః ప్రతివిదధ్యాత్.

వ్యా. 1. చేసిన పనిని (ఉపకారాన్ని నశింపచేయడం (మరచిపోవడం), శక్తి తగ్గిపోవడం, విద్యను ఒక పణ్యంగా (అమ్మగా కొనుక్కొనే వస్తువునుగా) పరిగణించడం, ఆశ కలిగించి దానిని వ్యర్థం చేయడం ఇతరదేశాలలో పర్యటించడంలో చాపల్యం, విశ్వాసం లేకపోవడం, బలవంతునితో విరోధం- స్వామిలో ఉన్న ఈ దోషాలు ఆతనిని విడచి మరొకని దగ్గరికి వెళ్లిపోవడానికి హేతువులు అని ఆచార్యుల అభిప్రాయం. భయము, వృత్తి లభించకపోవడం, కోపమూ- ఈ మూడు కారణా లని కౌటల్యుని అభిప్రాయం.

2. ఇక్కడ (తనకు) అపకారం చేసి వెళ్లిపోయి (పరునికి అపకారం చేయకుండా తిరిగి వచ్చినవానితో) సంధి చేసుకొనగూడదు. పరునికి అపకారం చేసి తిరిగి వచ్చిన వానితో సంధి చేసుకొనవచ్చును. ఇద్దరికీ అపకారం చేసిన వానిని గూర్చి వెనుక చెప్పిన విధంగా తర్కించి నిర్ణయం చెయ్యాలి.

3. సంధి చేసుకొనదగని వానితో సంధిచేసికొనవలసి వచ్చినప్పుడు పరునికి ఏ విషయంలో ప్రభావం (అధికబలం) ఉందో ఆ విషయంలో ప్రతిక్రియ చెయ్యాలి. అనగా అతని బలానికి కారణం ఏదో దాని విషయంలో జాగ్రత్తగా ఉండాలి.

శ్లో. సోపకారం వ్యవహితం గుప్తమాయుఃక్షయాదితి,
వాసయేదరిపక్షీయమవశీర్ణక్రియావిధౌ.

వ్యా. అవశీర్ణక్రియావిధిలో (దోషంచేత వెళ్లిపోయినవానితో తిరిగి సంధి చేసుకొనే విధానంలో) వెళ్లి తిరిగివచ్చిన శత్రుపక్షానికి చెందినవాడు ఉపకారం చేసినట్లయితే వానిని స్వామితో (తనతో) సాక్షాత్సంబంధం లేకుండా, ఆతడు జీవించి ఉన్నంత కాలమూ కూడా ఆతని మీద ఒక కన్ను వేసి ఉంచి తన రాజ్యంలో నివసింప చెయ్యాలి.

శ్లో. విక్రామయేద్భర్తరి వా సిద్ధం వా దణ్డచారిణమ్,
కుర్యాదమిత్రాటవీషు ప్రత్యన్తే వాన్యతః క్షిపేత్.

వ్యా. లేదా ఆతనిని తన ప్రభువుతో (ఏ శత్రురాజును విడిచి ఆతడు వచ్చినాడో ఆతనితో) యుద్ధానికి పంపాలి. లేదా అతడు మంచివా డని నిర్ణయించి నప్పుడు సైన్యంలో చేర్చుకోవాలి. లేదా శత్రువుయొక్క అడవులకు పంపాలి. లేదా రాజ్యం సరిహద్దులకు పంపించాలి.

శ్లో. పణ్యం కుర్యాదసిద్ధం వా సిద్ధం వా తేన సంవృతమ్,
తస్యైవ దోషేణాదూష్య పరసంధేయకారణాత్.

వ్యా. లేదా అసిద్ధుణ్ణి అనగా విశ్వసించతగినవాడుగా కనబడనివానిని, ఒక పణ్యంగా, అమ్మ దగిన వస్తువునుగా, చేసి శత్రువుకు అమ్మివేయాలి. లేదా ఆ అసిద్ధుని మరుగున ఒక సిద్ధుణ్ణి కూడ ఆ అసిద్ధుని దోషంచేత వీనిని కూడ దూషించి, అనగా ఇతడు వానికి సహకారం చేస్తున్నాడు అని చెప్పి, పణ్యంగా ఇవ్వాలి. ఇలా చేయడంవల్ల శత్రువుతో సంధి కుదుర్చుకొనడం సాధ్యం అయితే ఇట్లు చెయ్యాలి.

శ్లో. అథవా శమయేదేనమాయత్యర్థముపాంశునా,
ఆయత్యాం చ వధప్రేప్సుం దృష్ట్వా హన్యాద్గతాగతమ్.

వ్యా. లేదా ఆ అసిద్ధుణ్ణి, భవిష్యత్తును దృష్టిలో ఉంచుకొని, రహస్యవిధానంచేత చంపించాలి. ఏ గతాగతుడైనా భవిష్యత్తులో తనను (విజిగీషువును) చంపాలనే ఉద్దేశ్యంతో ఉన్నట్లయితే వానిని చంపివేయాలి.

శ్లో. అరితో ఽభ్యాగతో దోషః శత్రుసంవాసకారితః,
సర్పసంవాసధర్మిత్వాన్నిత్యోద్వేగేన దూషితః.

వ్యా. శత్రువుదగ్గరినుండి వచ్చినవాడు శత్రువుతో కలిసి ఉన్నవా డవడంచేత ఏనాటికైనా దోషం ఉన్నవాడే, అలాంటి వానితో కలిసి ఉండడం సర్పంతో కలిసి ఉండడం వంటిది, అందువల్ల నిత్యమూ భయం కలిగించే వా డవడంచేత అతడు దూషితుడే (చెడ్డవాడే).

శ్లో. జాయతే ప్లక్షబీజాశా(శః)కపోతాదివ (త ఇవ) శాల్మలేః,

ఉద్వేగజననో నిత్యం పశ్చాదపి భయావహః.

వ్యా. ప్లక్షవృక్షంయొక్క బీజాలను తినే పావురం శాల్మలీవృక్షానికి (బూరుగుచెట్టుకు) వలె ఎల్లప్పుడు భయం కలిగిస్తూ ఉంటాడు. కాలాంతరంలో ఏనాటికైనా అపాయం కలిగిస్తాడు. ప్లక్షవృక్షం పళ్లు తిన్న పావురం శాల్మలివృక్షంమీద నివసించినప్పుడు దాని రెట్టల ద్వారా ప్లక్షబీజాలు ఆ చెట్టు మొదట్లో పడి, పెద్ద చెట్లుగా పెరిగి ఆ బూరుగుచెట్టుకు విఘాతం కలిగిస్తాయి అని భావం అయి ఉంటుంది.

శ్లో. ప్రకాశయుద్ధం నిర్దిష్టే దేశే కాలే చ విక్రమః,

విభీషణమవస్కన్దః ప్రమాదవ్యసనార్దనమ్.

ఏకత్ర త్యాగఘాతౌ చ కూటయుద్ధస్య మాతృకా,

యోగగూఢోపజాపార్థం తూష్ణీంయుద్ధస్య లక్షణమ్.

ఇతి కౌటలీయార్థశాస్త్రే షాడ్గుణ్యే సప్తమాధికరణే షష్ఠోఽధ్యాయః,
సంహితప్రయాణికం పరిపణితాపరిపణితాపసృతాశ్చ సంధయః,
ఆదితశ్చతుశ్శతతమః.

వ్యా. ఈ ప్రదేశంలో, ఈ కాలంలో యుద్ధం చేద్దాం అని నిర్ణయించుకొని యుద్ధంచేయడం ప్రకాశయుద్ధం. భయపెట్టడం, హటాత్తుగా ఆక్రమణం చేయడం, ఏమరిపాటుతో ఉన్నప్పుడు, కష్టాలలో ఉన్నప్పుడు పీడించడం, ఒక చోట యుద్ధం ప్రారంభించి అక్కడ మానివేసి మరొక ప్రక్కనుండి యుద్ధం చేయడం ఇవి కూటయుద్ధానికి (కపటయుద్ధానికి) లక్షణాలు. రహస్యంగా గోడలు పడగొట్టడం, శిలలు పడవేయడం మొదలైన యోగాలచేత (కూటోపాయాలచేత), గూఢచారుల ద్వారా అంతఃప్రకోపం కలిగించడంచేత, శత్రుద్రోహరూప మైన ప్రయోజనాన్ని సాధించడం తూష్ణీం యుద్ధానికి (Silent-war. Coldwar) లక్షణం.

"బాలానందిని" అను అర్థశాస్త్రాంధ్రవ్యాఖ్యానంలో షాడ్గుణ్యం అనే ఏడవ అధికరణంలో
సంహితప్రయాణికం, పరిపణితాపరిపణితాపసృతసంధులు అను ఆరవ అధ్యాయం,
ప్రారంభంనుంచి నూటనాల్గవ అధ్యాయం సమాప్తం.

# అథ సప్తమో ఽధ్యాయః

## త్రయోదశోత్తరశతతమం ప్రకరణమ్. ద్వైధీభావికాః సంధివిక్రమాః
## (ద్వైధీభావంతో సంబంధించిన సంధివిగ్రహాలు)

మూ. విజిగీషుర్ద్వితీయాం ప్రకృతిమేవముపగృహ్ణీయాత్. సామన్తం సామన్తేన సంభూయ యాయాత్. యది వా మన్యేత- "పార్ష్ణిం మే న గ్రహీష్యతి, పార్ష్ణిగ్రాహం వారయిష్యతి, యాతవ్యం నాభిసరిష్యతి, బలవద్ద్వైగుణ్యం మే భవిష్యతి, వీవధాసారే మే ప్రవర్తయిష్యతి, పరస్య వారయిష్యతి, బహ్వాబాధే మే పథి కణ్టకాన్ మర్దయిష్యతి, దుర్గాటవ్యపసరేషు దణ్డేన చరిష్యతి, యాతవ్యమవిషహ్యే దోషే సంధౌ వా స్థాపయిష్యతి, లబ్ధలాభాంశో వా శత్రూ నన్యాన్ మే విశ్వాసయిష్యతి" ఇతి.

వ్యా. 1. విజిగీషువు రాజమండలంలోని రెండవవానిని ఈ విధంగా దగ్గరికి తీసుకోవాలి; అనగా వానితో మైత్రి చేసుకోవాలి. "ఇతడు నా వెనుకనుంచి వచ్చి ఆక్రమణం చెయ్యడు; ఆ విధంగా మరొక రాజెవరైనా వచ్చి ఆక్రమిస్తే అతనిని అడ్డుకుంటాడు. యాతవ్యుని (నేను ఎవనిమీదికి యుద్ధానికి వెళ్లవలసి ఉన్నదో వాని) పక్షానికి చేరడు. వీనితో స్నేహం చేసుకోవడంవల్ల నా బలం రెట్టింపు అవుతుంది. ఇతడు నా వీవధాసారములను కొనసాగేటట్లు చేస్తాడు. (ధాన్యాదులు రాజ్యంలోనికి ప్రవేశించడం 'వీవధం', మిత్రుల సైన్యం రావడం 'ఆసారం'.) పరుని వీవధాసారాలు అడ్డుకుంటాడు. చాల చిక్కులు ఉన్న నా మార్గంలో ఉన్న కంటకాలను (అడ్డుతగిలే వాటినన్నింటినీ) అణగద్రొక్కుతాడు, దుర్గాలలోను అడవులలోను, సైన్యం వెళ్లవలసిన మార్గాలలోను తన సైన్యంతో సంచరిస్తూ నాకు ఉపకరిస్తాడు. యాతవ్యుణ్ణి సహింపశక్యం కాని దోషంలో కాని, సంధిలో కాని నిలబెడతాడు, అనగా వానికి తట్టుకొనడానికి శక్యం కాని కష్టం కలిగిస్తాడు, లేదా సంధికి వచ్చే టట్లు చేస్తాడు అని అర్థం. లాభంలో ఒక భాగం తీసికొని నా ఇతరశత్రువులకు కూడ ఇతనితో చేరితే మీకు కూడ లాభం కలుగుతుంది అని చెప్పి విశ్వాసం కలిగిస్తాడు" అని అనుకొన్నప్పుడు ద్వితీయప్రకృతితో కలిసి ఆ సామంతునితో కలిసి మరొక సామంతునిమీదికి యుద్ధానికి వెళ్లాలి.

2. ద్వైధీభూతో వా కోశేన దణ్డం, దణ్డేన కోశం సామన్తానామన్యతమాల్లిప్సేత.

3. తేషాం జ్యాయసోఽధికేనాంశేన సమాత్ సమేన, హీనాత్ హీనేన ఇతి సమసంధిః.విపర్యయే విషమసంధిః. తయోర్విశేషలాభాదతిసంధిః.

4. వ్యసనినమ్, అపాయస్థానే సక్తమ్, అనర్థినం వా జ్యాయాంసం హీనః బలసమేన లాభేన పణేత. పణితస్తస్యాపకారసమర్థో విక్రమేత అన్యథా సందధ్యాత్.

2. ద్వితీయప్రకృతితో కలిస్తే లాభిస్తుందనే నమ్మకం లేనప్పుడు ద్వైధీభావం అవలంబించి సామంతరాజులలో ఒకనికి కోశం ఇచ్చి దండాన్ని (సైన్యాన్ని), సైన్యాన్ని ఇచ్చి కోశాన్నీ, (తన దగ్గర ఏది తక్కువ ఉంటే అది) సంపాదించడానికి ప్రయత్నించాలి.

3. ఆ సామంతులలో బలవంతునికి అధికమైన భాగం, సమునికి సమమైన భాగం,తక్కువవానికి తక్కువ భాగం, (సైన్యకోశాలలో) ఇచ్చి చేసికొన్న సంధి 'సమసంధి'. ఇందుకు విపరీతమైతే అది 'విషమసంధి'. ఈ రెండువిధాలైన సంధులద్వారా అధికమైన లాభం పొందకలిగి నట్లయితే అది 'అతిసంధి' అనగా అధికలాభకర మైన సంధి.

7. దుర్బలడైన రాజు తనకంటె అధికబలవంతుడైన రాజు దుర్వ్యసనాలు కలవాడైనా, అపాయాలలో చిక్కుకొన్నా, కష్టాలలోఉన్నా తన సైన్యంతో సమానమైన లాభంతో, అనగా తాను ఎంత సైన్యం వానికి ఇస్తాడో దానికి సరిపోయినంత లాభం లభించే టట్లు మాటలాడుకోవాలి. అలా నిర్ణయించుకొని వానికి అపకారం చేసే సామర్థ్యం తన కున్నది అనుకొన్నప్పుడు వాని విషయంలో పరాక్రమం చూపాలి. అది శక్యం కాకపోతే సంధి చేసుకోవాలి. (ఇది హీనుడు బలవంతునితో చేసికొనే విషమసంధి).

మూ. 1. ఏవమ్భూతో హీనశక్తిప్రతాపపూరణార్థం సంభావ్యార్థాభిసారీ మూలపార్ష్ణి త్రాణార్థం వా జ్యాయాంసం హీనో బలసమాత్ విశిష్టేన లాభేన పణేత; పణితః కల్యాణబుద్ధిమ్ అనుగృహ్ణీయాత్,అన్యథా విక్రమేత.

2. జాతవ్యసనప్రకృతిరన్ధ్రమ్ ఉపస్థితానర్థం వా జ్యాయాంసం హీనః దుర్గమిత్రప్రతిస్తబ్ధో వా హ్రస్వమధ్వానం యాతుకామః శత్రుయుద్ధమేకాన్త సిద్ధిం లాభమాదాతుకామో బలసమానేన పణేన పణేత. పణితస్తస్య అపకారసమర్థః విక్రమేత. అన్యథా సందధ్యాత్.

వ్యా. 1. హీనుడు బలవంతునితో విషమసంధి ఎట్లు చేసికోవాలో చెపుతున్నాడు- వ్యసనాదులలో చిక్కుకొన్న హీనుడు తగ్గిపోయిన తన శక్తిని ప్రతాపాన్నీ నింపుకొనడం కోసం కాని, తప్పక లభిస్తుంది అనుకొన్న ఒకప్రయోజనం కోసం ప్రయత్నిస్తున్నప్పుడు తన మూలబలాన్నీ, తన వెనుక భాగాన్నీ రక్షించుకొనడం కొరకు గాని తాను ఇచ్చిన సైన్యంకంటె అధికమైన లాభం ఇస్తా నని ఒప్పందం చేసుకోవాలి. అలా ఒప్పందం చేసుకొన్న తరవాత అతడు (బలవంతుడు) సద్బుద్ధి కలవా డైతే అతనితో అనుకూలంగా ప్రవర్తించాలి. అలా కాకపోతే పరాక్రమం చూపాలి.

2. దుర్గంలో ఉండడంచేత మిత్రుల అండ ఉండడంచేత గట్టిగా ఉన్న హీనుడు శత్రువుమీదికి అల్పమైన దూరం వెళ్లదలచుకొన్నప్పుడు లేదా యుద్ధం చేయకుండా తప్పకుండ లాభం లభిస్తుంది అనుకొన్నప్పుడు, బలవంతునితో, అతడు వ్యసనాలలో చిక్కుకొన్నప్పుడుగాని, వాని ప్రకృతులలో ఏవో ఛిద్రాలు (దౌర్బల్యాలు) ఉన్నప్పుడు గాని, వానికి ఏవో అనర్థాలు రానున్నాయి అని అనుకొన్నప్పుడు గాని తాను ఇచ్చే సైన్యంకంటె తక్కువ లాభం ఇస్తా నని పణం (ఒప్పందం) చేసుకోవాలి. ఇలా ఒప్పందం చేసుకొన్న తరవాత వానికి అపకారం చేయగల సామర్థ్యం తన కున్న దని అనుకుంటే వానిమీద పరాక్రమం చూపాలి. అలా కాకపోతే వానితో సంధి చేసుకోవాలి.

మూ. 1. అరన్ధ్రవ్యసనో వా జ్యాయాన్ దురారబ్ధకర్మాణం భూయః క్షయవ్యయాభ్యాం యోక్తుకామః దూష్యదణ్డం ప్రవాసయితుకామః దూష్యదణ్డమావాహయితుకామో వా పీడనీయముచ్ఛేదనీయం వా హీనేన వ్యథయితుకామః సంధిప్రధానో వా కల్యాణబుద్ధిః హీనం లాభం ప్రతిగృహ్ణీయాత్. కల్యాణబుద్ధినా సంభూయ అర్థం లిప్సేత అన్యథా విక్రమేత.

2. ఏవం సమః సమమతిసందధ్యాత్. అనుగృహ్ణీయాద్వా.

3. పరానీకస్య ప్రత్యనీకం మిత్రాటవీనాం వా శత్రోర్విభూమీనాం దేశికం మూలపార్ష్ణిత్రాణార్థం వా సమః సమబలేన లాభేన పణేత. పణితః కల్యాణబుద్ధిమ్ అనుగృహ్ణీయాత్. అన్యథా విక్రమేత.

వ్యా. 1. బలవంతు డైన రాజు తాను ఏవిధమైన రంధ్రాలు (దౌర్బల్యాలు) వ్యసనాలూ లేని వాడే అయినా పనులు అపమార్గంలో ప్రారంభించిన శత్రువుకు ఇంకా

క్షయవ్యయాలు కలగచేయడంకొరకు గాని, తనకు అవిధేయులుగా ఉన్న సైనికుల్ని పంపివేయడం కొరకు గాని, శత్రువుకు అవిధేయులుగా ఉన్న సైనికుల్ని తన వైపు తీసికొనిరావడానికి, హీనుడైన ఆ శత్రువు ద్వారా, పీడింపదగినవాడు లేదా పూర్తిగా పెకలించదగినవాడు అయిన మరొక శత్రువును బాధించడంకొరకు గాని, లేదా ఈ కారణాలేవీ లేకపోయినా సద్బుద్ధికలవాడవడంచేత సంధికి ప్రాధాన్యం ఇచ్చేవాడవడంచేత గాని, హీనుడైన శత్రువు ఇచ్చే హీనలాభానికి కూడా అంగీకరించాలి. అతడు మంచి బుద్ధి కలవాడైతే అతనితో కలిసి తన పనులు సాధించుకొనడంకోసం ప్రయత్నించాలి. అలా కాకపోతే పరాక్రమం చూపాలి.

2. సముడు సముడైన శత్రువుతో కూడ (అతడు కల్యాణబుద్ధి కాకపోవడం అవడం అనే దానిని పట్టి) వానిమీద విక్రమించడమో, అనుగ్రహించడమో చెయ్యాలి.

3. సముడైన రాజు తన శత్రురాజును గాని శత్రువుయొక్క మిత్రుణ్ణి గాని అటవికులను గాని ఎదిరించదగినవాడు, లేదా శత్రువుయొక్క విభూములలో (పర్వతాలు గుహలు మొదలైన వాటిలో) మార్గదర్శకుడుగా ఉండగలిగినవాడు అయిన సమునితో సైన్యానికి సమానమైన లాభానికి ఒప్పందం చేసుకోవాలి. అతడు తన మూలబలాన్ని, వెనుక భాగాన్ని రక్షిస్తాడు అనుకొన్నప్పుడు కూడ ఈ సంధి చేసుకోవాలి. ఇలా ఒప్పందం చేసుకొన్న తరవాత అతడు కల్యాణబుద్ధి అయితే అనుగ్రహించాలి; అలా కాకపోతే విక్రమించాలి.

మూ. 1. జాతవ్యసనప్రకృతిరన్ధ్రమ్ అనేకవిరుద్ధమ్, అన్యతో లభమానో వా సమః సమబలాద్ధనేన లాభేన పణేత. పణితస్తస్యాపకారసమర్థః విక్రమేత, అన్యథా సందధ్యాత్.

2. జాతవ్యసనప్రకృతిరన్ధ్రమభిహన్తుకామః స్వారబ్ధమ్ ఏకాన్తసిద్ధిం వా అస్య కర్మోపహన్తుకామః, మూలే యాత్రాయాం వా ప్రహర్తుకామః, యాతవ్యాద్ భూయో లభమానో వా జ్యాయాంసం హీనం సమం వా భూయో యాచేత. భూయో వా యాచితః స్వబలరక్షార్థం దుర్ధర్షమ్ అన్యదుర్గమ్, ఆసారమ్ అటవీం వా పరదణ్డేన మర్దితుకామః ప్రకృష్టేఽధ్వని కాలే వా పరదణ్డం క్షయవ్యయాభ్యాం యోక్తుకామః పరదణ్డేన వా వివృద్ధః తమేవోచ్ఛేత్తుకామః పరదణ్డమాదాతుకామో వా భూయో దద్యాత్.

వ్యా. 1. సముడైన రాజు వ్యసనాలలో చిక్కుకొన్నవాడు, ప్రకృతులలోరంధ్రాలు ఉన్నవాడు, చాలమంది విరోధులు కలవాడు అయిన సమునితో సైన్యంకంటె తక్కువైన లాభానికి కూడ పణం చేసుకోవాలి. తనకు మరొకరినుండి లాభం కలుగుతుంది అనుకొన్నప్పుడు కూడ సమునితో తక్కువ లాభానికి కూడ పణం చేసుకోవాలి. ఆ విధంగా పణం చేసుకొన్నవాడు వానికి అపకారం చేయడానికి సమర్థుడైతే విక్రమించాలి. అలా కాకపోతే సంధి చేసుకోవాలి.

2. తాను ఇట్టి స్థితిలో (వ్యసనాదులలో చిక్కుకొని) ఉన్న సముడు తన కార్యాలు సాధించుకొనడానికి సామంతునికి సహాయం అవసరం అవుతుంది అని కాని సేనను సమకూర్చుకోవాలని కాని అనుకున్నప్పుడు సమునితో సైన్యంకంటె మించిన లాభానికి పణం చేసుకోవాలి. ఆ విధంగా పణం చేసుకొన్నవాడు ఆ సముడు కల్యాణబుద్ధి అయితే అతనితో మంచిగా ఉండాలి, అలా కాకపోతే పరాక్రమించాలి.

3. వ్యసనాలలో చిక్కుకొన్నవాడు, రంధ్రాలు ఏర్పడిన ప్రకృతులు కలవాడు అయిన వానిని నశింపచేయా లనుకొన్నప్పుడు గాని, అతడు చక్కగా ప్రారంభించిన, తప్పక సత్ఫలితాన్ని ఇచ్చే కార్యాన్ని చెడగొట్టదలచి నప్పుడు గాని అతడు యుద్ధయాత్రకి బయలు దేరి నప్పుడు (వెనుకనుంచి) మూలంలో దెబ్బదీయాలని అనుకొన్నప్పుడు, యాతవ్యునినుంచి (ఎవనిమీదికి యుద్ధానికి వెళ్లదలచినాడో వానినుంచి) అధికంగా లాభం కలుగుతుంది అనుకొన్నప్పుడు ఒక రాజు, అవతలి రాజు తనకంటె బలవంతుడైనా, హీనుడైనా, సముడైనా వానిని అధికంగా ఇమ్మని అడగాలి. ఇలా అధికంగా ఇమ్మని అడగబడిన రాజు కూడ తన బలాన్ని (సైన్యాన్ని) రక్షించుకొనడం కోసం గాని, ఎదిరింప శక్యం కాని శత్రుదుర్గాన్నీ, మిత్రసైన్యాన్నీ, అటవీవాసులను ఇతరుని సైన్యంచేత మర్దించడంకోసం గాని, దూరమైన మార్గంలో లేదా కాలంలో శత్రుసైన్యానికి క్షయవ్యయాలు కలగజేయడంకోసం గాని, శత్రుసైన్యం తీసికొని దాని ద్వారా తన బలం పెంచుకొని ఆ శత్రువునే నశింపచేయడంకోసం గాని, శత్రుసైన్యాన్ని గ్రహించడంకోసం గాని అధికంగా ఇవ్వాలి.

మూ. 1. జ్యాయాన్ వా హీనం యాతవ్యాపదేశేన హస్తే కర్తుకామః, పరముచ్ఛిద్య వా తమేవోచ్ఛేత్తుకామః, త్యాగం వా కృత్వా ప్రత్యాదాతుకామః బలసమాత్ విశిష్టేన లాభేన పణేత, పణితస్తస్యాపకారసమర్థః విక్రమేత; అన్యథా సందధ్యాత్, యాతవ్యసంహితో వా తిష్ఠేత్; దూష్యామిత్రాటవీదణ్డం వాస్మై దద్యాత్.

2. జాతవ్యసనప్రకృతిరన్ధ్రో వా జ్యాయాన్ హీనం బలసమేన లాభేన పణేత. పణితస్తస్యాపకారసమర్థః విక్రమేత, అన్యథా సందధ్యాత్.

3. ఏవమ్భూతం వా హీనం జ్యాయాన్ బలసమాద్ధీనేన లాభేన పణేత. పణితస్తస్యాపకారసమర్థో విక్రమేత; అన్యథా సందధ్యాత్.

వ్యా. 1. బలవంతుడైన రాజు, యాతవ్యుడు అనే మిషచేత అనగా మరొక రాజు మీదికి యుద్ధానికి వెళ్లా లనే వంకచేత, హీనుణ్ణి తన వశంలో ఉంచుకొన వలె నని అనుకొన్నప్పుడు, శత్రువును నశింపచేసి హీనుణ్ణి కూడ నశింపచేయా లనుకొన్నప్పుడు, ముందు కొంత ధనం ఇచ్చి తిరిగి తీసికొనవలె నని అనుకొన్నప్పుడు, వానితో (హీనునితో) సైన్యం కంటె ఎక్కువైన లాభంచేత (లాభం ఇస్తా నని) పణం చేసుకోవాలి. అలా పణం చేసుకొన్న తరువాత వానికి అపకారం చేయడానికి సమర్థుడైతే విక్రమించాలి; కాని పక్షంలో సంధి చేసికోవాలి. లేదా యాతవ్యునితో అనగా ఆ హీనుని యాతవ్యునితో కలిసి సంధి చేసికోవాలి. లేదా వానికి దూష్యులైన (స్వామిభక్తులు కాని) సైనికులను గాని, శత్రుసైనికులను గాని, ఆటవికసైన్యాన్ని కాని ఇవ్వాలి.

2. వ్యసనాలలో చిక్కుకొని ఉన్నవాడు లేదా ప్రకృతులలో రంధ్రాలు (దౌర్బల్యం) ఏర్పడినవాడు అయిన బలవంతుడు హీనునికి, సైన్యంతో సమానమైన లాభం ఇచ్చి పణం చేసుకోవాలి. అలా పణం చేసికొన్న తరవాత వానికి అపకారం చేయడానికి సామర్థ్యం ఉంటే పరాక్రమించాలి; అలా కాకపోతే సంధి చేసుకోవాలి.

3. బలవంతుడు వ్యసనాదులలో చిక్కుకొని ఉన్న హీనునికి సైన్యంకంటె తక్కువ లాభం ఇవ్వడానికి పణం చేసుకోవాలి. పణం చేసుకొన్న తరవాత వానికి అపకారం చేయగల సామర్థ్యం ఉంటే పరాక్రమించాలి. అలా కాని పక్షంలో సంధి చేసుకోవాలి.

శ్లో. అతో బుద్ధ్యేత పణితః పణమానశ్చ కారణమ్,
తతో వితర్క్యోభయతో యతః శ్రేయస్తతో వ్రజేత్.

*ఇతి కౌటలీయార్థశాస్త్రే షాడ్గుణ్యే సప్తమాధికరణే సప్తమోऽధ్యాయః ద్వైధీభావికాః సంధివిక్రమాః, ఆదితః పఞ్చశతతమః.*

వ్యా. అందువల్ల పణితుడు (ఎవనితో పణం చేయబడుతుందో అతడు), పణం చేసుకొన్నవాడూ అలా పణం చేయడానికి కారణం ఏమో బాగా గుర్తించాలి.

తరవాత రెండు వైపులా , అనగా సంధి మంచిదా విగ్రహం మంచిదా అని, వితర్కించి ఏది అవలంబిస్తే శ్రేయస్కరమో అది అవలంబించాలి.

"బాలానందిని" అను కౌటలీయార్థశాస్త్రాంధ్రవ్యాఖ్యానంలో, షాడ్గుణ్యం అనే సప్తమాధికరణంలో ద్వైధీభావికసంధివిక్రమములు అను సప్తమాధ్యాయం, ప్రారంభంనుంచి నూట ఐదవ అధ్యాయం సమాప్తం.

# అథ అష్టమోధ్యాయః

## చతుర్దశోత్తరశతతమం ప్రకరణం - యాతవ్యవృత్తిః

## పఞ్చదశోత్తరశతతమం ప్రకరణమ్ - అనుగ్రాహ్యామిత్రవిశేషాశ్చ

### (యాతవ్యుని ప్రవృత్తి. అనుగ్రహింపదగిన విశిష్టమిత్రులు)

మూ. 1. యాతవ్యోఽభియాస్యమానః సంధికారణమాదాతుకామో విహన్తుకామో వా సామవాయికానామన్యతమం లాభద్వైగుణ్యేన పణేత. ప్రపణితా క్షయవ్యయప్రవాసప్రత్యవాయపరోపకారశరీరాబాధాంశ్చాస్య వర్ణయేత్. ప్రతిపన్నమర్థేన యోజయేత్. వైరం వా పరైర్గ్రాహయిత్వా విసంవాదయేత్.

2. దురారబ్ధకర్మాణం భూయః క్షయవ్యయాభ్యాం యోక్తుకామః స్వారబ్ధాయాం వా యాత్రాయాం సిద్ధిం విఘాతయితుకామో మూలే యాత్రాయాం వా ప్రతికర్తుకామో యాతవ్యసంహితః పునర్యాచితుకామః ప్రత్యుత్పన్నార్థకృచ్ఛ్రః తస్మిన్ అవిశ్వస్తో వా తదాత్వే లాభమల్పమిచ్ఛేత్, ఆయత్యాం ప్రభూతమ్.

వ్యా. 1. కొందరు రాజులు కలిసి తనమీదికి యుద్ధానికి వస్తారనుకొన్నప్పుడు ఆ యాతవ్యుడు వాళ్ల పరస్పరం చేసికొన్న సంధికి గల కారణాలను తొలగించడం కొరకు లేదా ఆ సంధినే విఘటింపచేయడంకొరకు, ఆ సామవాయికులలో (తనపై యుద్ధానికి రావడానికి కలిసిన రాజులలో) ఒకనితో "నీకు రెట్టింపు లాభం ఇస్తాను" అని చెప్పి పణం ఏర్పరచుకోవాలి. ఈ విధంగా పణం చేసుకొనేవాడు యుద్ధం జరిగితే ఎంత

క్షయం, వ్యయం, దూరంగా వెళ్లవలసి ఉండడం, నష్టం, శత్రువుకు ఉపకారం, తన శరీరానికి బాధ కలుగుతాయో ఆతనికి స్పష్టీకరించి చెప్పాలి. అందుకు అతడు అంగీకరించినప్పుడు అతనికి ధనం ఇవ్వాలి. లేదా సామవాయికులలోని ఇతర రాజులతో వానికి వైరం కలిగించి వాళ్లతో కలవకుండా చెయ్యాలి.

2. సామవాయికులలోని ఒక రాజు యాతవ్యునితో ఎట్లు పణం చేసుకోవాలో చెపుతున్నాడు- తన కర్మలను అపమార్గంలో ప్రారంభించిన యాతవ్యునికి ఇంకా అధికంగా క్షయవ్యయాలు కలిగించా లని అనుకొన్నప్పుడు, అతడు తన యాత్రను చక్కగానే ప్రారంభిస్తే దానికి సిద్ధి కలగకుండా చెయ్యాలని అనుకొన్నప్పుడు ఆ యాత్రకు గాని, మూలబలానికిగాని విఘాతం కలిగించాలి అనుకొన్నప్పుడు ముందు కొంత ధనం తీసికొని తరవాత మరి కొంత ధనం తీసికోవాలని అనుకొన్నప్పుడు, తాను ఆర్థికంగా కష్టాలలో ఉన్నప్పుడు, ఆ యాతవ్యుని మీద పూర్తి విశ్వాసం లేనప్పుడు, సామవాయికులలోని ఒక రాజు యాతవ్యునితో కలిసి ఆ సమయంలో అల్పలాభాన్ని పొంది, భవిష్యత్తులో అధికలాభం పొందాలి.

మూ. 1. మిత్రోపకారమ్, అమిత్రోపఘాతమ్, అర్థానుబన్ధమ్ అవేక్షమాణః పూర్వోపకారకం కారయితుకామః, భూయః తదాత్వే మహాన్తం లాభముత్సృజ్య ఆయత్యామల్పమిచ్ఛేత్.

2. దూష్యామిత్రాభ్యాం మూలహరేణ వా జ్యాయసా విగృహీతం త్రాతుకామః తథావిధముపకారం కారయితుకామః సంబన్ధాపేక్షీ వా తదాత్వే చ ఆయత్యాం చ లాభం న ప్రతిగృహ్ణీయాత్.

వ్యా. 1. భవిష్యత్తులో అల్పలాభం పొందడంకోసం చేసే పణనాన్ని (ఒప్పందాన్ని) వివరిస్తున్నాడు - మిత్రునికి ఉపకారం జరుగుతుంది., అమిత్రునికి అపకారం జరుగుతుంది, దీని వెంట కొన్ని సత్ఫలితాలు కలుగుతాయి అని అనుకొన్నవాడు, లేదా తనకు పూర్వం ఉపకారం చేసినవానిచేత ఇంకా ఎక్కువ ఉపకారం చేయించుకోవాలని అనుకుంటున్నవాడు, లేదా వానితో ఏదో విధంగా సంబంధం పెట్టుకోవాలి అనుకొనేవాడు తాత్కాలికంగా లభించే పెద్ద లాభాన్ని కూడా విడిచి, భవిష్యత్తులో లభించే అల్పలాభానికి అంగీకరించాలి.

2. దూష్యులతోను (రాజద్రోహులైన ముఖ్యాధికారులు మొదలైనవాళ్లతోను),

శత్రువుతోను, యుద్ధం చేస్తున్నవానిని లేదా సమూలంగా నశింపచేయడానికి ఉద్యుక్తుడైన బలవంతునితో యుద్ధం చేస్తున్నవానిని రక్షించకోరేవాడు, లేదా ఆతనితో సంబంధం పెట్టుకొని అలాంటి ఉపకారం (తనకు అవసర మైనప్పుడు) చేయించుకొనదలచినవాడు, ఆ సమయంలోను భవిష్యత్తులోనూ కూడ లాభం తీసికొనగూడదు.

మూ. 1. కృతసంధిరతిక్రమితుకామః, పరస్య ప్రకృతికర్శనం మిత్రామిత్రసంధివిశ్లేషణం వా కర్తుకామః, పరాభియోగాత్ శఙ్కమానః, లాభమప్రాప్తమధికం వా యాచేత. తమితరస్తదాత్వే చ ఆయత్యాం చ క్రమమవేక్షేత. తేన పూర్వే వ్యాఖ్యాతాః.

2. అరివిజిగీష్వోస్తు స్వం స్వం మిత్రమవగృహ్ణతోః శక్యకల్యభవ్యారమ్భిస్థిరకర్మానురక్తప్రకృతిభ్యో విశేషః. శక్యారమ్భీ విషహ్యం కర్మారభేత. భవ్యారమ్భీ కల్యాణోదయమ్. స్థిరకర్మా నాసమాప్య కర్మోపరమతే. అనురక్తప్రకృతిః సుసహాయత్వాత్ అల్పేనాప్యనుగ్రహేణ కార్యం సాధయతి. త ఏతే కృతార్థాః సుఖేన ప్రభూతం చోపకుర్వన్తి అతః ప్రతిలోమేనానుగ్రాహ్యాః.

వ్యా. 1. చేసుకొన్న సంధిని అతిక్రమించదలచుకొన్నవాడు లేదా శత్రువు యొక్క ప్రకృతులను కృశింపచేయ దలచినవాడు, లేదా తన మిత్రులకు శత్రువులకు మధ్య జరిగిన సంధిని విఘటితం చేయ దలచినవాడు లేదా పరుడు తనను ఆక్రమిస్తాడనే ఆశంక ఉన్నవాడు అంత వరకు పరునినుండి రాని లాభాన్ని కొంత వచ్చి ఉన్నట్లయితే అంతకంటె అధికమైన లాభాన్ని ఇవ్వమని అడగాలి. అలా అడగబడినవాడు అడిగినది ఇచ్చివేయడం వల్ల వెంటనే తనకు ప్రయోజనం ఉంటుందా, భవిష్యత్తులో ప్రయోజనం ఉంటుందా అని పరీక్షించుకొని ఇవ్వాలి (లేదా ఇవ్వాలా ఇవ్వనవసరంలేదా అని ఆలోచించుకోవాలి). ఇలా పరిశీలించుకోవడం అనేది వెనుక చెప్పిన మూడు పక్షాలలోను కూడ వర్తిస్తుంది. అనగా "దురారబ్ధకర్మాణమ్" "మిత్రోపకారమ్", "దూష్యామిత్రాభ్యామ్" ఇత్యాది వాక్యాలలో చెప్పిన లాభాల విషయంలో కూడ వర్తిస్తుంది.

2. అయితే శత్రువు, విజిగీషువు తమ తమ మిత్రుల్ని అనుగ్రహించడంలో (సహాయం చేయడంలో) వాళ్లు (మిత్రులు) శక్యారంభి- కల్యారమ్భి-భవ్యారమ్భి-స్థిరకర్మ-అనురక్తప్రకృతులు అవడాన్ని పట్టి విశేషం ఉంటుంది. అనగా అలాంటివాళ్లకే

సహాయం చెయ్యాలి అని అర్థం. శక్యారంభి తాను ఏ పని చేయగలడో ఆ పనినే చేబడతాడు. కల్యారంభి దోషాలు లేని పని చేబడతాడు. భవ్యారంభి భవిష్యత్తులో సత్ఫలితాన్ని ఇచ్చే పని చేపడతాడు. స్థిరకర్మ చేపట్టిన పని పూర్తి చేయకుండా వదలడు. అనురక్తప్రకృతి (ప్రకృతుల అనురాగం చూరగొన్నవాడు) మంచి (ప్రకృతి) సహాయం ఉన్నవా డవడంచేత ఏ మాత్రం చిన్న అనుగ్రహం చేసినా కార్యం సాధిస్తాడు. పనిని సాధించ గలిగిన వీళ్లందరూ సుఖంగాను, అధికంగాను ఉపకరిస్తారు. మిత్రులు ఇందుకు విరుద్ధంగా ఉంటే వాళ్లకి సహాయం చేయకూడదు.

మూ. 1. తయోరేకపురుషానుగ్రహే యో మిత్రం మిత్రతరం వానుగృహ్ణాతి సోఽతిసంధత్తే. మిత్రాదాత్మవృద్ధిం హి ప్రాప్నోతి. క్షయవ్యయప్రవాసపరోపకారాన్ ఇతరః. కృతార్థశ్చ శత్రుర్వైగుణ్యమేతి.

2. మధ్యమం త్వనుగృహ్ణతోః యః మధ్యమం మిత్రం మిత్రతరం వానుగృహ్ణాతి సః అతిసంధత్తే. మిత్రాదాత్మవృద్ధిం హి ప్రాప్నోతి. క్షయవ్యయప్రవాసపరోపకారానితరః. మధ్యమశ్చేదనుగృహీతో నిపుణః స్యాదమిత్రోఽతిసంధత్తే. కృతప్రయాసం హి మధ్యమామిత్ర మపసృతమేకార్థోప గతం ప్రాప్నోతి.

3. తేనోదాసీనానుగ్రహో వ్యాఖ్యాతః.

వ్యా. 1. ఇద్దరు రాజులు (అరివిజిగీషువులు) ఒక వ్యక్తికి (రాజుకు) సహాయం చేయడం జరిగినప్పుడు ఏ రాజు మిత్రునికి గాని, ఎక్కువ మైత్రి ఉన్నవానికి గాని సహాయం చేస్తాడో అతడు ఎక్కువ లాభం పొందుతాడు. అనగా సహాయం పొందినవాడు సహాయంచేసినవాళ్లలో ఎవరికి మిత్రుడో లేదా మిత్రతరుడో ఆతనికి ఎక్కువ లాభం లభిస్తుంది. మిత్రునివల్ల తనకు అభివృద్ధి కలుగుతుంది కదా? సహాయం చేసిన రెండవ వానికి (సహాయం పొందినవాడు మిత్రుడు మిత్రతరుడు గాని కానప్పుడు) లభించే దల్లా క్షయం, వ్యయం, ప్రవాసం, శత్రువుకు ఉపకారం చేయడం అనేవి మాత్రమే. శత్రువు తన పని పూర్తి అయిన తరవాత చెడ్డగానే ప్రవర్తిస్తాడు.

2. అరివిజిగీషువులు ఇద్దరూ ఒక మధ్యమునికి సహాయం చేసి నప్పుడు వారిలో ఎవడు మిత్రుడుగాని. మిత్రతరుడు గాని అయిన మధ్యమునికి సహాయం

చేస్తాడో అతడు బాగా లాభం పొందుతాడు. (ఎవడైనా) మిత్రునివల్ల ఆత్మవృద్ధిని పొందుతాడు కదా? రెండవవానికి లభించే దల్లా క్షయం, వ్యయం, ప్రవాసం, శత్రూపకారం మాత్రమే. సహాయం పొందిన మధ్యముడు విగుణు డైతే (కృతఘ్నుడై శత్రుత్వం వహిస్తే) శత్రువుకు ఎక్కు లాభం కలుగుతుంది. ఎందువల్ల ననగా శ్రమపడిన (సహాయం పొందిన) మధ్యముడు సహాయం చేసినవానిని విడిచివేసి శత్రువుతో చేరి తనకు సహాయం చేసిన వానితో వైరం పెట్టుకుంటాడు.

3. దీనిని పట్టి ఉదాసీనానుగ్రహం విషయం కూడా గ్రహించాలి.

మూ. 1. మధ్యమోదాసీనయోః బలాంశదానే యః శూరం కృతాస్త్రం దుఃఖసహమ్ అనురక్తం వా దణ్డం దదాతి సోఽతిసంధీయతే. విపరీతః అతిసంధత్తే.

2. యత్ర తు దణ్డః ప్రహితః తం వా చార్థమ్ అన్యాంశ్చ సాధయతి తత్ర మౌలభృతశ్రేణీమిత్రాటవీబలానామ్ అన్యతమమ్ ఉపలబ్ధదేశకాలం దణ్డం దద్యాత్. అమిత్రాటవీబలం వా వ్యవహితదేశకాలమ్.

3. యం తు మన్యేత- "కృతార్థో మే దణ్డం గృహ్ణీయాత్, అమిత్రాటవ్య భూమ్యనృతుషు వా వాసయేత్, అఫలం వా కుర్యాత్" ఇతి దణ్డవ్యాసఙ్గాపదేశేన నైనమనుగృహ్ణీయాత్. ఏవమవశ్యం త్వనుగ్రహీతవ్యే తత్కాలసమమస్మై దణ్డం దద్యాత్. ఆసమాప్తేశ్చైనం వాసయేత్ యోధయేచ్చ. బలవ్యసనేభ్యశ్చ రక్షేత్. కృతార్థాచ్చ సాపదేశమవస్రావయేత్. దూష్యామిత్రాటవీదణ్డం వాస్య దద్యాత్. యాతవ్యేన వా సంధాయైనమతిసందధ్యాత్.

వ్యా. 1. మధ్యమోదాసీనులకు కొంత సైన్యం ఇచ్చి సహాయం చేయవలసివచ్చినప్పుడు అస్త్రప్రయోగంలో మంచి నైపుణ్యం ఉన్న, కష్టాలను సహించ గలిగిన, రాజభక్తి ఉన్న సైన్యాన్ని ఇచ్చినవాడు మోసపోతాడు, ఇందుకు భిన్నమైన సైన్యం ఇచ్చినవాడు లాభం పొందుతాడు.

2. పంపబడిన సైన్యం ఏ పని మీద పంపబడిందో ఆ పనిని ఇతర ప్రయోజనాలనూ కూడ సాధిస్తుంది అనుకొన్నప్పుడు, దేశాన్ని కాలాన్ని పరిశీలించి, మౌలబలం; (తరతరాలుగా వస్తూన్న సైన్యం), జీతానికి పని చేసే సైన్యం, శ్రేణీబలం

శత్రుబలం, అటవీబలం- వీటిలో ఏదైన ఒక బలాన్ని ఇవ్వాలి. దేశంచేత కాలంచేత చాల దూరం ఉన్నప్పుడు అమిత్రబలాన్ని, అటవీబలాన్ని (మధ్యమునికి, ఉదాసీనునికి) ఇవ్వాలి.

3. "ఇతడు తన పని అయిపోయిన తరవాత కూడ నా సైన్యాన్ని తన వద్దనే ఉంచివేసికొంటాడు, లేదా దానిని శత్రురాజ్యంలోను అడవులలోను, అయుక్తమైన స్థానాలలోను, తగని ఋతువులలో నివసింపచేస్తాడు, లేదా ఏ పనీ చేయజాలని దానినిగా చేసి వేస్తాడు అని అనుకొన్నప్పుడు "నా సైన్యం మరొక పనిలో లగ్నమై ఉంది" అని వంక బెట్టి వానికి (మధ్యమునకు గాని, ఉదాసీనునికి గాని) తన సైన్యం ఇవ్వకూడదు, తప్పని సరిగా సైన్యసహాయం చేసి అనుగ్రహించవలసి ఉన్నప్పుడు వానికి ఆ సమయానికి సరిపోయి నంత సైన్యం మాత్రమే ఇవ్వాలి. పని పూర్తి అయేవరకు ఆ సైన్యం అక్కడనే ఉంటే టట్లు, యుద్ధం చేసే టట్లు, ఏ విధమైన ఆపదలకు లోను కాకుండా ఉండే టట్లు చూడాలి. వాని పది అయిపోయిన తరవాత ఏదో వంక పెట్టి తన సైన్యం తన దగ్గరికి తెప్పించుకోవాలి. లేదా వానికి దూష్యదండాన్ని (స్వామిభక్తి లేని సైన్యాన్ని) గాని, అటవీసైన్యాన్ని గాని ఇవ్వాలి. లేదా యాతవ్యునితో (ఎవనిమీదికి అతడు యుద్ధానికి వెళ్లాలో వానితో) సంధి చేసికొని వీనిని (మధ్యముణ్ణి లేదా ఉదాసీనుణ్ణి) మోసగించాలి.

శ్లో. సమే హి లాభే సంధిః స్యాద్విషమే విక్రమో మతః,
సమహీనవిశిష్టానామిత్యుక్తాః సంధివిక్రమాః.

ఇతి కౌటలీయార్థశాస్త్రే షాడ్గుణ్యే సప్తమాధికరణే అష్టమోఽధ్యాయః, యాతవ్యవృత్తిః అనుగ్రాహ్యామిత్రవిశేషాః ఆదితః షట్‌శతతమః.

వ్యా. సములకి సములకీ మధ్య హీనులకి హీనులకీ మధ్య బలవంతులకీ బలవంతులకీ మధ్య లాభం సమంగా ఉంటే సంధి చేసుకోవాలి. లాభంలో హెచ్చుతగ్గు లుంటే యుద్ధం చెయ్యాలి.

"బాలానందిని" అను కౌటలీయార్థశాస్త్రాంధ్రవ్యాఖ్యానంలో షాడ్గుణ్యం అనే సప్తమాధికరణంలో యాతవ్యవృత్తి, అనుగ్రాహ్యామిత్రవిశేషాలు అనే ఎనిమిదవ అధ్యాయం, ప్రారంభంనుంచి నూటఆరవ అధ్యాయం సమాప్తం.

# అథ నవమోఽధ్యాయః

## షోడశశతతమం ప్రకరణమ్ - మిత్రహిరణ్యభూమికర్మసంధయః

## తత్ర మిత్రసంధిః, హిరణ్యసంధిశ్చ (మిత్రసంధి, హిరణ్యసంధి, భూమిసంధి, కర్మసంధి వాటిలో మిత్రసంధి -హిరణ్యసంధులు)

మూ. 1. సంహితప్రయాణే మిత్రహిరణ్య భూమిలాభానాముత్తరోత్తరో లాభః శ్రేయాన్. మిత్రహిరణ్యే హి భూమిలాభాద్భవతః, మిత్రం హిరణ్యలాభాత్. యో వా లాభః సిద్ధః శేషయోరన్యతరం సాధయతి.

2. "త్వం చాహం చ మిత్రం లభావహే" ఇత్యేవమాదిః సమసంధిః. "త్వం మిత్రమ్" ఇత్యేవమాదిర్విషమసంధిః. తయోర్విశేషలాభాదతిసంధిః.

3. సమసంధౌ తు యః సంపన్నం మిత్రం మిత్రకృచ్ఛ్రే వా మిత్రమ్ అవాప్నోతి సోఽతిసన్ధత్తే. ఆపద్ధి సౌహృదస్థైర్యముత్పాదయతి.

వ్యా. 1. ఒక రాజుతో సంధి చేసికొని అతనితో కలిసి మరొకనిపై దండెత్తి. వెళ్లినప్పుడు మిత్రలాభ-ధనలాభ-భూమిలాభాలలో ముందు దానికంటె తరవాతి లాభం శ్రేయస్కరం. భూమి లభిస్తే మిత్రులు ధనం వాటంతట అవే లభిస్తాయి. ధనం లభిస్తే మిత్రుడు లభిస్తాడు. లేదా సిద్ధించిన ఏ లాభం మిగిలిన రెండు లాభాలను సాధిస్తుందో అది శ్రేయస్కరం.

2. "ఈ యుద్ధంలో జయిస్తే నీకు నాకూ కూడ మిత్రుడు లభిస్తాడు, లేదా ధనం లభిస్తుంది లేదా భూమి లభిస్తుంది. అని చేసుకొన్న సంధి సమసంధి. "నీకు మిత్రుడు లభిస్తాడు, నాకు ధనం లభిస్తుంది", లేదా "నీకు ధనం నాకు భూమి" ఇత్యాదివిధంగా చేసుకొన్న సంధి విషమసంధి. ఈ సమసంధి-విషమసంధులలో లాభం అధికంగా దేనిలో ఉంటుందో అది 'అతిసంధి'.

3. సమసంధిలో ఎవడు సంపన్నుడైన (చెప్పబోవు మిత్రగుణాలు అన్నీ ఉన్న) మిత్రుణ్ణి పొందుతాడో, మిత్రసంపద ఉన్నవాని ఆపత్సమయంలో మంచి మిత్రుణ్ణి

పొందుతాడో, అతడు అతిసంధి చేసికొన్నవా డవుతాడు. ఆపద స్నేహానికి స్థైర్యం కలిగిస్తుంది కదా?

మూ. 1. మిత్రకృచ్ఛ్రేఽపి నిత్యమవశ్యమ్ అనిత్యం వశ్యం వేతి-నిత్యమవశ్యం శ్రేయః, తద్ధ్యనుపకుర్వదపి నాపకరోతి ఇత్యాచార్యాః.

2. నేతి కౌటల్యః. వశ్యమనిత్యం శ్రేయః; యావదుపకరోతి తావ న్మిత్రం భవతి. ఉపకారలక్షణం మిత్రమితి.

3. వశ్యయోరపి మహాభోగమ్ అల్పభోగం వా నిత్యమితి-మహాభోగమనిత్యం శ్రేయః; మహాభోగమనిత్యమ్ అల్పకాలేన మహదుప కుర్వత్ మహాన్తి వ్యయస్థానాని ప్రతికరోతి ఇత్యాచార్యాః.

4. నేతి కౌటల్యః. నిత్యమల్పభోగం శ్రేయః, మహాభోగమనిత్యమ్ ఉపకారభయాదపక్రామతి, ఉపకృత్య వా ప్రత్యాదాతుమీహతే. నిత్యమ్ అల్పభోగం సాతత్యాదల్పముపకుర్వత్ మహతా కాలేన మహదుపకరోతి.

వ్యా. 1 మిత్రసంపద ఉన్నవానికి ఆపద కలిగి నప్పుడు కూడ వశ్యుడు కాని (అధీనంలో ఉండని) నిత్యమిత్రుడు ఉండడం మంచిదా లేక వశ్యుడైన అనిత్యమిత్రుడు ఉండడం మంచిదా అన్నప్పుడు - వశ్యుడు కాని నిత్యమిత్రుడు ఉండడమే మంచిది; అతడు ఉపకారం చేయకపోయినా అపకారం చేయడు అని ఆచార్యుల మతం.

2. అది కాదు అంటాడు కౌటిల్యుడు. వశ్యు డైన అనిత్యమిత్రుడే శ్రేయ స్కరుడు. ఎంతవరకు ఉపకారం చేస్తాడో అంత కాలమే మిత్రుడుగా ఉంటాడు. ఉపకారం చేయడమే మిత్రుని లక్షణం కదా అని కౌటిల్యుని అభిప్రాయం.

3. వశ్యులైన మిత్రులలో కూడ ఎక్కువ ఉపకారం చేసే అనిత్యమిత్రుడు మంచివాడా అల్పసహాయం చేసే నిత్యమిత్రుడు మంచివాడా అన్నప్పుడు - ఎక్కువ ఉపకారం చేసే అనిత్యమిత్రుడే మంచివాడు, ఎందువల్ల ననగా - అధికోపకారకారియైన మిత్రుడు అల్పకాలంలోనే గొప్ప ఉపకారం చేసి చాలా పెద్ద ఖర్చులు అయే పరిస్థితులలో తగిన ప్రతిక్రియ చేస్తాడు అని పూర్వాచార్యుల అభిప్రాయం.

4. అది కాదు అంటాడు కౌటిల్యుడు. తక్కువ ఉపకారం చేసినా నిత్యమిత్రు

దుండడం మంచిది. ఎక్కువ ఉపకారం చేసిన అనిత్యమిత్రుడు ఇంకా వీనికి ఉపకారం చేస్తూనే ఉండాలి అనే భయంచేత దూరం అయిపోతాడు, లేదా తాను చేసిన ఉపకారానికి తగినంత ప్రత్యుపకారం పొందడానికి ప్రయత్నిస్తాడు. తక్కువ ఉపకారమే చేస్తూన్నా నిత్యమిత్రుడు నిరంతరమూ కొంచెం కొంచెం ఉపకారం చేస్తూండగా చాలా కాలం గడచినకొలదీ అతడు చేసిన ఉపకారం చాల అధికమే అవుతుంది అని ఆయన అభిప్రాయం.

మూ. 1. గురుసముత్థం మహన్మిత్రం లఘుసముత్థమ్ అల్పం వేతి - గురుసముత్థం మహన్మిత్రం ప్రతాపకరం భవతి; యదా చోత్తిష్ఠతే తదా కార్యం సాధయతి ఇత్యాచార్యాః.

2. నేతి కౌటల్యః - లఘుసముత్థం శ్రేయః, లఘుసముత్థమల్పం మిత్రం కార్యకాలం నాతిపాతయతి, దౌర్బల్యాచ్చ యథేష్టభోగ్యం భవతి, నేతరత్ ప్రకృష్టభౌమమ్.

3. విక్షిప్తసైన్యమవశ్యసైన్యం వేతి- విక్షిప్తం సైన్యం శక్యం ప్రతి సంహర్తుం, వశ్యత్వాత్ ఇత్యాచార్యాః.

4. నేతి కౌటల్యః. అవశ్యసైన్యం శ్రేయః. అవశ్యం హి శక్యం సామాదిభిర్వశ్యం కర్తుమ్, నేతరత్ కార్యవ్యాసక్తం ప్రతిసంహర్తుమ్.

వ్యా. 1. గురుసముత్థుడైన అనగా- దూరంలో ఉండడం మొదలైన కారణాలచేత ఎక్కువ ప్రయత్నం చేసి సన్నద్ధం చేయదగిన సైన్యం గల, బలవంతుడైన మిత్రునివల్ల ఎక్కువ ప్రయోజనం ఉంటుందా లేక లఘుసముత్థుడైన, అనగా- తేలికగా సన్నద్ధం చేయడానికి వీలైన సైన్యం గల అల్పమిత్రుడు ఉండడం మంచిదా అన్నప్పుడు "గురుసముత్థు డైన బలవంతుడైన మిత్రుడు ప్రతాపం వృద్ధి పొందిస్తాడు, సైన్యం సన్నద్ధం చేశాడా, కార్యం సాధించితీరుతాడు" అని ప్రాచీనాచార్యులు అభిప్రాయపడ్డారు.

2. అది సరికాదు అంటాడు కౌటిల్యుడు. "లఘుసముత్థుడైన అల్పమిత్రుడు అవసరం వచ్చినప్పుడు సమయాన్ని దాటనీయడు; దుర్బలుడవడంచేత అతనిని ఇష్టం వచ్చినట్లు వాడుకొనవచ్చును. దూరదేశంలో ఉన్న రెండవవాడు, అనగా గురుసముత్థుడైన మహామిత్రుడు, దూరదేశంలో ఉండడంవల్ల ఆ విధంగా ఉపకరించడు" అని ఈయన అభిప్రాయం.

3. కార్యాంతరంలో లగ్నమైన సైన్యం గల మిత్రుడు ఉండడం మంచిదా లేక సేన తన వశంలో లేని మిత్రుడు ఉండడం మంచిదా అన్నప్పుడు- కార్యాంతరంలో లగ్నమై ఉన్నా అది వశంలో ఉండడంచేత దానిని శీఘ్రంగా ఒక చోటికి చేర్చవచ్చు, (అందుచేత విక్షిప్తసైన్యుడైన మిత్రుడు ఉండడమే మంచిది) అని ఆచార్యుల అభిప్రాయం.

4. అది యుక్తం కాదు; వశ్యం కాని సైన్యం గల మిత్రు డుండడమే మంచిది. సైన్యం (తాత్కాలికంగా) వశంలో లేకపోయినా దానిని సామాద్యుపాయాలచేత వశం చేసికొనవచ్చు; ఇతరకార్యాలలో లగ్న మైన సైన్యాన్ని ఒక చోటికి చేర్చడం కష్టం అని కౌటిల్యుని అభిప్రాయం.

మూ. 1. పురుషభోగం హిరణ్యభోగం వా మిత్రమితి- పురుషభోగం మిత్రం శ్రేయః. పురుషభోగం మిత్రం ప్రతాపకరం భవతి. యదా చోత్తిష్ఠతే తదా కార్యం సాధయతి ఇత్యాచార్యాః.

2. నేతి కౌటల్యః. హిరణ్యభోగం మిత్రం శ్రేయః; నిత్యో హిరణ్యేన యోగః, కదాచిత్ దణ్డేన; దణ్డశ్చ హిరణ్యేన అన్యే చ కామాః ప్రాప్యన్తే ఇతి.

3. హిరణ్యభోగం భూమిభోగం వా మిత్రమితి- హిరణ్యభోగం గతిమత్త్వాత్ సర్వవ్యయప్రతీకారకరమ్ ఇత్యాచార్యాః.

4. నేతి కౌటల్యః. "మిత్రహిరణ్యే హి భూమిలాభాద్భవతః" ఇత్యుక్తం పురస్తాత్. తస్మాద్ భూమిభోగం మిత్రం శ్రేయ ఇతి.

వ్యా. 1. పురుషభోగుడైన, అనగా సైనికులను పంపడం ద్వారా ఉపకరించు, మిత్రుడు ఉండడం మంచిదా హిరణ్యభోగుడైన (ధనం ఇవ్వడం ద్వారా ఉపకరించు) మిత్రుడు ఉండడం మంచిదా అన్నప్పుడు- పురుషభోగమిత్రుడే శ్రేయస్కరుడు. పురుషభోగమిత్రు డుండడంవల్ల ప్రతాపం వృద్ధి చెందుతుంది. ఎప్పుడైనా తాను (విజిగీషువు) యుద్ధయాత్రకు బయలుదేరి నప్పుడు పురుషభోగమిత్రుడు కార్యం సాధిస్తాడు అని ఆచార్యు లన్నారు.

2. "అది యుక్తం కాదు. హిరణ్యభోగమిత్రుడే శ్రేయస్కరుడు. హిరణ్యం (ధనం) అనేది ఎల్లప్పుడూ తన కూడా ఉంటుంది. దండం(సైన్యం) ఎప్పుడో అవసరం వచ్చి నప్పుడు మాత్రమే తన దగ్గరికి వస్తుంది. హిరణ్యం ఉంటే దండమూ, ఇతర

కామాలూ కూడ సిద్ధిస్తాయి" అని కౌటిల్యు డంటాడు.

3. హిరణ్యభోగమిత్రు డుండడం మంచిదా భూమిభోగు డుండడం మంచిదా అన్నప్పుడు- హిరణ్యభోగు డుండడమే మంచిది. ధనం అనేది గమనం కలది అవడంచేత అనగా ఎక్కడికి కావలసి వస్తే అక్కడికి తీసుకొని వెళ్లడానికి వీలైనది అవడంచేత, సమస్తవ్యయాలకీ ప్రతిక్రియ చేస్తుంది, అనగా ఎప్పుడు ఏ ఖర్చు వచ్చినా ఉపకరిస్తుంది. అందుచేత హిరణ్యభోగమిత్రు డుండడమే మంచి దని ఆచార్యు లన్నారు.

4. "అది కాదు. 'భూమి లభిస్తే దానివల్ల మిత్రలాభం ధనలాభం కూడా కలుగుతాయి' అని వెనుక చెప్పబడింది కదా? అందువల్ల భూమిభోగమిత్రుడు, (భూమిని ఇచ్చే మిత్రుడు) ఉండడమే మంచిది" అని కౌటల్యుని అభిప్రాయం.

మూ. 1. తుల్యే పురుషభోగే విక్రమః, క్లేశసహత్వమ్, అనురాగః, సర్వబలలాభో వా మిత్రకులాద్విశేషః.

2. తుల్యే హిరణ్యభోగే ప్రార్థితార్థతా, ప్రాభూత్యమ్, అల్పప్రయాసతా, సాతత్యం చ విశేషః.

వ్యా. 1. పురుషభోగమిత్రులు చాలమంది ఉన్నప్పుడు, పరాక్రమం, లేదా క్లేశాన్ని సహించకలిగి ఉండడం, లేదా అనురాగం, లేదా అన్ని విధాలైన సైన్యాన్ని సమకూర్చడం అనేది ఉండడం ఇతర పురుషభోగమిత్రులకంటె విశేషం. అనగా కేవల పురుషభోగమిత్రునికంటె ఈ గుణాలు ఉన్నవాడు విశిష్టుడు అని అర్థం.

2. చాలమంది హిరణ్యభోగమిత్రు లున్నప్పుడు, వారిలో ప్రార్థించిన ప్రయోజనాన్ని సమకూర్చడం, ధనసమృద్ధి కలిగి ఉండడం,తక్కువ ప్రయాసతో కార్యాల్ని సాధించడం, అవిచ్ఛిన్నంగా మైత్రిని కొనసాగించడం అనేవి విశేషాలు. హిరణ్యభోగమిత్రునిలో ఇలాంటి గుణాలు కూడా ఉండడం ఒక వైశిష్ట్యం అని అర్థం.

మూ. తత్రైతద్ భవతి-

శ్లో. నిత్యం వశ్యం లఘూత్థానం పితృపైతామహం మహత్,
అద్వైధ్యం చేతి సంపన్నం మిత్రం షడ్గుణముచ్యతే.

వ్యా. మిత్రుని విషయంలో ఈ మాట చెప్పవలసి ఉంది- నిత్యుడు, వశ్యుడు,

లఘూత్థానుడు,పితృపైతామహుడు, గొప్పవాడు, అద్వైధ్యుడు అని ఆరు గుణాలున్న మిత్రునికి 'సంపన్నమిత్రుడు' అని పేరు.

శ్లో. ఋతే యదర్థప్రణయాత్ రక్ష్యతే యచ్చ రక్షతి,
పూర్వోపచితసంబన్ధం తన్మిత్రం నిత్యముచ్యతే.

వ్యా. ఏ మిత్రుడు ఏ ప్రయోజనాపేక్షా లేకుండా రక్షించబడతాడో, ఏ మిత్రుడు రక్షిస్తాడో, చాల కాలంనుంచీ వృద్ధిపొందిన సంబంధం గల అట్టి మిత్రుడు 'నిత్యమిత్రుడు'

శ్లో. సర్వచిత్రమహాభోగం త్రివిధం వశ్యముచ్యతే,
ఏకతో భోగ్యుభయతః సర్వతోభోగి చాపరమ్.

వ్యా. 'సర్వభోగమిత్రుడు' అనగా దండ-కోశ-భూములను ఇచ్చి ఉపకరించే మిత్రుడు. 'మహాభోగుడు' అనగా దండకోశా లిచ్చి అత్యధికంగా ఉపకరించేవాడు. 'చిత్రభోగుడు' అనగా రత్నాలు, శ్రేష్ఠవస్తువులు,సాధారణవస్తువులు,కుప్యం మొదలైన అనేక విధాలైన వస్తువులు ఇచ్చేవాడు అని వశ్యమిత్రుడు మూడు విధాలు. అట్లే "'ఏకతోభోగి' అనగా ఒక ప్రక్క నున్న శత్రువునుండి ప్రతిక్రియ చేసి సహాయం చేసేవాడు, 'ఉభయతోభోగి' అనగా రెండు ప్రక్కలనుండీ వచ్చే శత్రువులనుండి రక్షణ ఇచ్చేవాడు, 'సర్వతోభోగి' అనగా అన్నివిధాల ఆపదలనుండి, శత్రువులనుండి రక్షణ ఇచ్చేవాడు అని కూడ వశ్యమిత్రులలో మూడు భేదాలు. మొదటి మూడు విధాలైన వశ్యమిత్రులు ధనాదుల ద్వారా ఉపకరించేవారు. చివరి మూడు విధాలైన వశ్యమిత్రులు అపాయాలనుండి రక్షణ కల్పించేవారు.

శ్లో. అదాత్ర వా దాత్రపి వా జీవత్యరిషు హింసయా,
నిత్యం మిత్రమవశ్యం తద్ దుర్గాటవ్యపసారి చ.

వ్యా. నిత్యమిత్రుడు వశ్యుడుగా ఉండడు; వశ్యమిత్రుడు నిత్యుడుగా ఉండడు. వాళ్లలో మొదటివానిని గూర్చి చెపుతున్నాడు- ఏ మిత్రుడు తననుండి (విజిగీషువునుండి) సహాయం తీసుకొన్నా, తనకు సహాయం చేసినా తన శత్రువుల విషయంలో మాత్రం హింసాప్రవృత్తిని వహించి జీవిస్తాడో, అవసరం అయినప్పుడు దుర్గంలోనికి గాని, అడవులలోనికి గాని వెళ్లిపోతూ ఉంటాడో అతడు నిత్యుడైన అవశ్యమిత్రుడు, అనగా వశ్యుడు కాని నిత్యమిత్రుడు.

శ్లో. అన్యతో విగృహీతం యల్లఘువ్యసనమేవ వా,
సంధత్తే చోపకారాయ తన్మిత్రం వశ్యమధ్రువమ్.

వ్యా. ఏ మిత్రుడు మరొకనితో విరోధం పెట్టుకొని ఉంటాడో, ఎవని వ్యసనాలు అత్యల్పంగా ఉంటాయో, ఏదో ఒక ఉపకారం కోరి తనతో (విజిగీషువుతో) సంధి చేసికొంటాడో అతడు వశ్యుడైన అనిత్యమిత్రుడు.

శ్లో. ఏకార్థానర్థసంబన్ధముపకార్యవికారి చ,
మిత్రభావి భవత్యేతన్మిత్రమద్వైధ్యమాపది.

వ్యా. పైన చెప్పిన ఆరు మిత్రగుణాలలో లఘూత్థానత్వ-పితృపైతామహత్వ-మహత్త్వము లనేవి స్పష్టార్థా లవడంచేత వాటిని వివరించకుండ ఈ శ్లోకంలో అద్వైధ్యమిత్రుని గూర్చి చెపుతున్నాడు. అతిశీఘ్రంగా సైన్యాన్ని సన్నద్ధం చేసుకొని సమయానికి రాగలిగిన మిత్రుడు లఘూత్థానమిత్రుడు, తండ్రితాతలనాటినుండి కొనసాగుతున్న మైత్రి కలవాడు పితృపైతామహమిత్రుడు. మంచి శౌర్యధైర్యాదులున్న సైన్యం కల మిత్రుడు 'మహామిత్రుడు'- అని వాటి అర్థం. 'ఏ మిత్రుడు సుఖదుఃఖాలలో సమానమైన సంబంధం కలవాడై ఉంటాడో, ఉపకారం చేస్తాడో, ఎన్నడూ వికారం చెందడో, ఆపత్సమయాలలో కూడ భేదం పొందడో అతడు అద్వైధ్యమిత్రుడు. సర్వదా మైత్రిని కొనసాగించడంచేత అతడు 'మిత్రభావి' అని కూడ చెప్పబడతాడు.

శ్లో. మిత్రభావాద్ ధ్రువం మిత్రం శత్రుసాధారణాచ్చలమ్,
న కస్య చిదుదాసీనం ద్వయోరుభయభావి తత్.

వ్యా. తన ఒక్కనితో (విజిగీషువుతో) మాత్రమే మైత్రి కొనసాగించువాడు "ధ్రువమిత్రుడు".తనకు శత్రువుకూ కూడ ఏ ఉపకారమూ చేయనివాడు 'ఉదాసీనమిత్రుడు'. ఇద్దరికీ ఉపకారం చేసేవాడు "ఉభయభావిమిత్రుడు".

శ్లో. విజిగీషోరమిత్రం యన్మిత్రమన్తర్ధితాం గతమ్,
ఉపకారేఽనివిష్టం వా శక్తం వానుపకారి తత్.

వ్యా. సరిహద్దులలోని రాజు అవడంచేత నిజానికి విజిగీషువునకు శత్రువైన రాజు ఇద్దరు బలవంతుల మధ్య అడ్డుగా నిలచి ఉండడంచేత విజిగీషువునకు

మిత్రుడౌతాడు. అయితే ఆతడు ఉపకారం చేయవలసిన బాధ్యత లేకపోవడంచేతగాని, ఉపకారం చేసే సామర్థ్యం లేకపోవడంచేత గాని విజిగీషువునకు ఉపకారం ఏమీ చేయడు. అతడు "అనుపకారిమిత్రుడు".

శ్లో. ప్రియం పరస్య వా రక్ష్యం పూజ్యసంబన్ధమేవ వా,
అనుగృహ్ణాతి యన్మిత్రం శత్రుసాధారణం హి తత్.

వ్యా. శత్రువుకు ప్రియుడైనా, వానిచేత రక్షింపదగినవాడైనా, ఆతనితో పూజించతగిన సంబంధం కలవాడైనా ఏ మిత్రుడు(రాజు) విజిగీషువును అనుగ్రహిస్తాడో (ఉపకారం చేస్తాడో) అతడు "శత్రుసాధారణమిత్రుడు".

శ్లో. ప్రకృష్టభౌమం సంతుష్టం బలవచ్చాలసం చ యత్,
ఉదాసీనం భవత్యేతద్ వ్యసనాదవమానితమ్.

వ్యా. విశాలమైన భూమి కలవాడు (కాంగ్లే) చాల దూరంలో ఉన్నవాడు (గ.శా.) ఉన్న దానితో సంతృప్తి చెందినవాడు, బలం కలవాడు, సోమరి, వ్యసనంచేత(కష్టాలచేత, కాంగ్లే. దుర్వ్యసనాలచేత, గ.శా.) అవమానించబడినవాడు "ఉదాసీనమిత్రుడు".

శ్లో. అరేర్నేతుశ్చ యద్వృద్ధిం దౌర్బల్యాదనువర్తతే,
ఉభయస్యాప్యవిద్విష్టం విద్యాదుభయభావి తత్.

వ్యా. ఏ మిత్రుడు దుర్బలు డవడంచేత విజిగీషువుయొక్క, శత్రువుయొక్క కూడ అభివృద్ధిని అభినందిస్తాడో (ఇద్దరినీ కూడ ఆశ్రయించి ఉంటాడో), ఇద్దరికీ కూడ ద్వేషపాత్రుడు కాడో అతడు "ఉభయభావిమిత్రుడు" అని గ్రహించవలెను,

శ్లో. కారణాకారణధ్వస్తం కారణాకారణాగతమ్,
యో మిత్రం సముపేక్షేత స మృత్యుముపగూహతి.

వ్యా. ఏ మిత్రుడు ఏదో చిన్న కారణంచేత గాని ఏ కారణమూ లేకుండగనే కాని దూరం అయిపోతాడో, లేదా ఏదో కారణం ఉండి గాని లేకుండా గాని తిరిగి వస్తాడో అలాంటివానిని మిత్రుణ్ణిగా స్వీకరించినవాడు మృత్యువును కౌగలించుకొన్నట్లే.

మూ. 1. క్షిప్రమల్పో లాభః చిరాదితి వా- క్షిప్రమల్పో లాభః కార్యదేశ కాలసంవాదకః శ్రేయాన్ ఇత్యాచార్యాః.

2. నేతి కౌటల్యః. చిరాదవినిపాతీ బీజసధర్మా మహాన్ లాభః శ్రేయాన్; విపర్యయే పూర్వః.

వ్యా. అతిశీఘ్రకాలంలో లభించే స్వల్పమైన లాభం మంచిదా లేక చాలకాలం తరవాత లభించే గొప్ప లాభం మంచిదా అన్నప్పుడు- ఈ దేశంలో ఇంత కాలానికి ఇంత కార్యం సిద్ధిస్తుంది అని ముందుగానే ఊహించుకొనడానికి వీలైన పక్షంలో శీఘ్రంగా లభించే అల్పలాభమే మంచిదని ఆచార్య లన్నారు.

2. "అది కాదు- ఒక బీజం చాలకాలానికి వృక్షం అయి ఫలాలు ఇచ్చి నట్లు ఏ విఘాతాలూ లేకుండా చాల కాలం తరవాతనైనా లభించే పెద్ద లాభం మంచిది. ఇందుకు విరుద్ధంగా ఉంటుంది, అనగా విఘ్నాలు కలుగుతాయి, అనుకొన్నప్పుడు మాత్రం ఆచార్యుల మతమే యుక్తం" అని కౌటల్యుని అభిప్రాయం.

శ్లో. ఏవం దృష్ట్వా ధ్రువే లాభే లాభాంశే చ గుణోదయమ్,
స్వార్థసిద్ధిపరో యాయాత్ సంహితః సామవాయికైః.

*ఇతి కౌటలీయార్థశాస్త్రే షాడ్గుణ్యే సప్తమాధికరణే నవమోఽధ్యాయః*
*మిత్రహిరణ్యభూమికర్మసంధౌ మిత్రసంధిః, హిరణ్యసంధిః, ఆదితః సప్తశతతమః.*

వ్యా. ఈ విధంగా మిత్రలాభ-హిరణ్యలాభాలు కలుగుతాయి లేదా ఆ లాభాలలో కొంత అంశం తప్పక లభిస్తుంది అనుకొన్నప్పుడు, ఆ లాభాలలోని లేదా లాభాంశాలలోని గుణాలను జాగర్తగా చూచుకొని, ప్రధానంగా స్వార్థాన్ని సాధించుకొనడంలో దృష్టి ఉంచుకొని సామవాయికులతో సంధులు చేసికొని యుద్ధయాత్రకు వెళ్లాలి.

*"బాలానందిని" అను కౌటలీయార్థశాస్త్రాంధ్రవ్యాఖ్యానంలో షాడ్గుణ్యం అనే సప్తమాధికరణంలో మిత్రహిరణ్యభూమికర్మసంధులలో మిత్రసంధి, హిరణ్యసంధి అను నవమాధ్యాయం, ప్రారంభంనుండి నూటఆరవ అధ్యాయం, సమాప్తం.*

# అథ దశమో౽ధ్యాయః

## షోడశశతతమం ప్రకరణమ్ - మిత్రహిరణ్యభూమికర్మసంధయః. తత్ర భూమిసంధిః

మూ. 1. "త్వం చాహం చ భూమిం లభావహే" ఇతి భూమిసంధిః.

2. తయోర్యః ప్రత్యుపస్థితార్థః సంపన్నాం భూమిమవాప్నోతి సో౽తిసంధత్తే.

3. తుల్యే సంపన్నలాభే యో బలవన్తమ్ ఆక్రమ్య భూమిమ్ అవాప్నోతి సః అతిసంధత్తే. భూమిలాభం, శత్రుకర్శనం, ప్రతాపం చ హి ప్రాప్నోతి. దుర్బలాత్ భూమిలాభే సత్యం సౌకర్యం భవతి; దుర్బల ఏవ చ భూమిలాభః, తత్సామన్తశ్చ మిత్రమమిత్రభావం గచ్ఛతి.

4. తుల్యే బలీయస్త్వే యః స్థిరం శత్రుముత్పాట్య భూమిమవాప్నోతి సో౽తిసంధత్తే.దుర్గావాప్తిర్హి స్వభూమిరక్షణమమిత్రాటవీప్రతిషేధం చ కరోతి.

వ్యా. 1. "నువ్వూ నేనూ కూడ భూమిని పొందుదాం (పంచుకుందాం)" అని చేసుకొన్న సంధి భూమిసంధి.

2. అలా సంధి చేసుకొన్నవాళ్లల్లో మంచి ప్రయోజనాలు (సేతునిర్మాణాదులు) అతిసమీపంలో ఉండి మంచి భూమిని పొందగలిగినవాడు ఎక్కువలాభం పొందిన వాడవుతాడు.

3. సంపన్నమైన (ఉత్తమమైన) భూమి ఇద్దరికీ సమంగా లభించి నప్పుడు బలవంతుణ్ణి ఆక్రమించి ఎవడు సంపన్నమైన భూమిని పొంది ఉంటాడో అతడు అధికలాభం పొందినవా డవుతాడు. ఎందువల్ల ననగా అతడు భూమిని పొందాడు; బలవంతుడైన శత్రువును దుర్బలుణ్ణిగా చేశాడు; ప్రతాపం కూడా విస్తరింపచేశాడు. దుర్బలునినుండి భూమిని సంపాదించడంలో సౌకర్యం ఉన్న దనే మాట నిజమే అయినా ఆ లభించిన భూలాభం కూడా దుర్బలమైనదే; శత్రువుకు అవతలి సరిహద్దులలో

ఉండడంచేత తనకు సహజమిత్రు డైన ఆ దుర్బలుని శత్రువు (ఇప్పుడు తన సరిహద్దుకు రావడంచేత) తనకు శత్రు వైపోతాడు.

4. జయించబడిన శత్రువు అధికబలవంతుడై ఉండడం తుల్యమే అయినా స్థిరుడైన (దుర్గాదు లుండడంచేత గట్టిగా నిలతొక్కుకొని ఉన్న) శత్రువును పెకిలించివేసి భూమిని పొందినవాడు అధికలాభం పొందినవా డవుతాడు. ఎందువల్ల ననగా దుర్గాన్ని పొందడంవల్ల తన భూమిని రక్షించుకొనకలుగుతాడు; అమిత్రులను, ఆటవికులను అడ్డుకొనకలుగుతాడు.

మూ. 1. చలామిత్రాత్ భూమిలాభే శక్యసామన్తతో విశేషః. దుర్బల సామన్తా హి క్షిప్రాప్యాయనయోగక్షేమా భవన్తి. విపరీతా బలవత్సామన్తా కోశదణ్డావచ్ఛేదనీ చ భూమిర్భవతి.

2. సంపన్నా నిత్యామిత్రా మన్దగుణా వా భూమిః అనిత్యామిత్రేతి - సంపన్నా నిత్యామిత్రా శ్రేయసీ భూమిః. సంపన్నా హి కోశదణ్డౌ సంపాదయతి. తౌ చ అమిత్రప్రతిఘాతకౌ ఇత్యాచార్యాః.

3. నేతి కౌటల్యః- నిత్యామిత్రాలాభే భూయాన్ శత్రులాభో భవతి. నిత్యశ్చ శత్రుః ఉపకృతే చాపకృతే చ శత్రురేవ భవతి. అనిత్యస్తు శత్రుః ఉపకారాత్ అనపకారాద్వా శామ్యతి. యస్యా హి భూమేః బహుదుర్గాః చోరగణైః మ్లేచ్ఛాటవీభిర్వా నిత్యావిరహితాః ప్రత్యన్తాః సా నిత్యామిత్రా; విపర్యయే త్వనిత్యామిత్రేతి.

వ్యా. 1. చలామిత్రునినుండి, అనగా దుర్గాదులు లేని అస్థిరుడైన అమిత్రుని నుండి, ఇద్దరికి సమంగానే భూమి లభించి నప్పుడు, సామంతుడు లొంగేవాడై దుర్బలుడుగా ఉండడం విశేషం. అనగా ఇద్దరూ భూమిని సమంగానే చలామిత్రునినుండి గ్రహించినా ఎవని భూమి సరిహద్దులలో ఉండే సామంతుడు దుర్బలుడో అతనికి బలవంతుడైన సామంతుడు గలవానికంటె వైశిష్ట్యం ఉంటుంది. దుర్బలుడైన సామంతుడు గల భూమిలో శీఘ్రంగా యోగక్షేమాలను పరిపూర్ణంగా సంపాదించవచ్చును (పొందని దానిని పొందడం యోగం; సంపాదించిన దానిని రక్షించుకొనడం క్షేమం). అందుకు విపరీతంగా బలవంతుడైన సామంతు డున్న భూమివల్ల కోశానికీ, దండానికీ నష్టం వాటిల్లుతుంది.

2. నిత్యులైన శత్రువులున్న సంపన్నమైన భూమి మంచిదా, అనిత్యులైన అమిత్రులు గల, అల్పగుణా లున్న భూమి మంచిదా అన్నప్పుడు - "నిత్యామిత్రులున్న సంపన్నమైన భూమియే మంచిది; భూమి సంపన్న మైనప్పుడు కోశదండాలను సంపాదించవచ్చు, ఆ కోశదండాలు అమిత్రులను నశింపచేయడానికి ఉపకరిస్తాయి" అని ఆచార్యు లన్నారు.

3. అది యుక్తం కాదంటాడు కౌటల్యుడు. నిత్యామిత్రులున్న భూమి లభిస్తే శత్రువుకే అధికమైన లాభం కలుగుతుంది లేదా చాలమంది శత్రువులు ఏర్పడతారు. నిత్యుడైన శత్రువు--వానికి ఉపకారం చేసినా అపకారం చేసినా కూడ శత్రువు గానే ఉంటాడు. అనిత్యశత్రు వైతే ఉపకారం చేయడంవల్ల గాని, అపకారం చేయకపోవడం వల్ల గాని శాంతిస్తాడు. ఏ భూమి సరిహద్దులలో చాలా దుర్గాలు ఉంటాయో, ఏ భూమిలో దొంగలు, మ్లేచ్ఛులు, ఆటవికులు ఎల్లప్పుడూ నివసిస్తారో ఆ భూమి "నిత్యామిత్రభూమి", ఇందుకు విపరీతమైనది "అనిత్యామిత్రభూమి".

మూ. 1. అల్పా ప్రత్యాసన్నా మహతీ వ్యవహితా వా భూమిరితి- అల్పా ప్రత్యాసన్నా శ్రేయసీ. సుఖా హి ప్రాప్తుం, పాలయితుమ్, అభిసారయితుం చ భవతి. విపరీతా వ్యవహితా.

2. వ్యవహితావ్యవహితయోరపి దణ్డధారణా ఆత్మధారణా వా భూమి రితి- ఆత్మధారణా శ్రేయసీ, సా హి స్వసముత్థాభ్యాం కోశదణ్డాభ్యాం ధార్యతే. విపరీతా దణ్డధారణా దణ్డస్థానమితి.

వ్యా. 1. దగ్గరగా ఉన్న అల్పమైన భూమి మంచిదా దూరంగా ఉన్న అధికమైన భూమి మంచిదా అన్నప్పుడు- దగ్గరగా ఉండే అల్పభూమియే మంచిది, అక్కడికి వెళ్లడానికి, దానిని రక్షించడానికి, అవసరం వస్తే అక్కడినుండి జనుల్ని తొలగించడానికీ కష్టం ఉండదు, దూరమైన భూమి అయితే ఇందుకు విరుద్ధంగా ఉంటుంది.

2. వ్యవహితావ్యవహితభూములలో కూడ సైన్యం తీసికొనివెళ్లి పరిపాలించదగినది మంచిదా, ఆత్మధారణ అయిన, అనగా ఆ భూమినుంచే తీసిన ధనదండాదులచేత పాలించదగినది మంచిదా అన్నప్పుడు- ఆత్మధారణమైన భూమియే మంచిది; ఎందువల్ల ననగా ఆ భూమినుండే సంపాదించిన కోశంచేత దండంచేత అది

నిలబెట్టబడుతుంది. దండధారణయైన భూమి ఇందుకు విపరీత మైనది; అది సైన్యాన్ని నిలపడానికి మాత్రమే (సైన్యస్థావరంగా మాత్రమే) ఉపయోగిస్తుంది.

మూ. 1. బాలిశాత్ ప్రాజ్ఞాద్వా భూమిలాభ ఇతి. బాలిశాద్ భూమిలాభః శ్రేయాన్. సుప్రాప్యానుపాల్యా హి భవతి అప్రత్యాదేయా చ. విపరీతా ప్రాజ్ఞాత్ అనురక్తా ఇతి.

2. పీడనీయోచ్ఛేదనీయయోః ఉచ్ఛేదనీయాద్ భూమిలాభః శ్రేయాన్. ఉచ్ఛేదనీయో హ్యనపాశ్రయః, దుర్బలాపాశ్రయో వా అభియుక్తః కోశదణ్డావాదాయ అపసర్తుకామః ప్రకృతిభిః త్యజ్యతే. న పీడనీయో దుర్గమిత్రప్రతిస్తబ్ధ ఇతి.

3. దుర్గప్రతిస్తబ్ధయోరపి స్థలనదీదుర్గీయాభ్యాం స్థలదుర్గీయాద్ భూమిలాభః శ్రేయాన్. స్థలీయం హి సురోధావమర్దావస్కన్దమ్ అనిఃస్రావితశత్రు చ. నదీదుర్గం తు ద్విగుణక్లేశకరముదకం చ పాతవ్యం వృత్తికరం చామిత్రస్య.

వ్యా. మూర్ఖుడైన రాజునుంచి భూమి తీసికొనడం మంచిదా బుద్ధిమంతుని వద్దనుంచి తీసికొనడం మంచిదా అన్నప్పుడు మూర్ఖునినుంచి తీసికొనడమే మంచిది. ఎందువల్ల ననగా దానిని అనాయాసంగా చేరవచ్చు, సుఖంగా పాలించవచ్చు; దానిని తిరిగి ఇవ్వవలసిన పని ఉండదు, ప్రాజ్ఞునినుండి తీసికొన్న భూమి ఇందుకు విపరీతంగా ఉంటుంది; ఎందువల్ల ననగా అక్కడి ప్రజలు ఆ రాజు మీద అనురాగంతో ఉంటారు.

2. పీడించదగిన శత్రువునుండి భూమిలాభం మంచిదా పూర్తిగా పెకిలించి వేయవలసిన (ఉచ్ఛేద్యుడైన) శత్రువునుండి భూమిలాభం మంచిదా అన్నప్పుడు ఉచ్ఛేదనీయునినుండి భూమిలాభమే మంచిది. దుర్గమిత్రాద్యాశ్రయం లేని లేదా దుర్బలమైన ఆశ్రయం గల ఉచ్ఛేదనీయుడు ఎదిరింపబడినప్పుడు కోశాన్నీ దండాన్నీ తీసికొని పారిపోవడానికి ప్రయత్నిస్తాడు, అప్పుడు వానిని ప్రకృతులు విడిచివేస్తారు, పీడనీయుడు ఆ విధంగా ఉండక దుర్గంచేత,మిత్రుల చేత రక్షించబడతాడు.

3. దుర్గంలో సురక్షితులుగా ఉన్నవాళ్లలో కూడ స్థలదుర్గంలో ఉన్నవానినుంచి భూమిలాభం మంచిదా నదీదుర్గంలో ఉన్నవానినుంచి మంచిదా అన్నప్పుడు స్థలదుర్గంలో ఉన్నవానినుండి భూమిలాభం శ్రేయస్కరం. ఎందువల్ల ననగా- స్థలదుర్గాన్ని

అనాయాసంగా ముట్టడించవచ్చు, మర్దించవచ్చు, ఆక్రమించవచ్చు, శత్రువు కూడ దాని నుండి తప్పించుకొని పారిపోజాలడు, నదీదుర్గమైతే (విజిగీషువుకు) రెట్టింపు క్లేశాన్ని కలిగిస్తుంది. నదిలోని నీరు త్రాగడానికి యోగ్యమై శత్రువుకు ధనధాన్యాదిసంపదలను పెంచడం ద్వారా వృత్తిని కల్పిస్తుంది. అందువల్ల శత్రువు బలవంతుడై ఉంటాడు అని భావం.

మూ. 1. నదీపర్వతదుర్గీయాభ్యాం నదీదుర్గీయాద్ భూమిలాభః శ్రేయాన్. నదీదుర్గం హి హస్తిస్తమ్భసంక్రమసేతుబన్ధనౌభిః సాధ్యమ్, అనిత్య గామ్భీర్యమ్, అవస్రావ్యుదకం చ; పార్వతం తు స్వారక్షం, దురుపరోధి, కృచ్ఛ్రారోహణమ్. భగ్నే చైకస్మిన్ న సర్వవధః, శిలావృక్షప్రమోక్షశ్చ మహాప కారిణామ్.

2. నిమ్నస్థలయోధిభ్యః నిమ్నయోధిభ్యః భూలాభః శ్రేయాన్; నిమ్న యోధినో హ్యుపరుద్ధదేశకాలాః; స్థలయోధినస్తు సర్వదేశకాలయోధినః.

3. ఖనకాకాశయోధిభ్యః ఖనకేభ్యః భూమిలాభః శ్రేయాన్. ఖనకా హి ఖాతేన శస్త్రేణ చోభయథా యుధ్యన్తే, శస్త్రేణైవాకాశయోధినః.

వ్యా. 1. నదీదుర్గ-పర్వతదుర్గాలలో ఉన్నవాళ్లనుంచి భూమిని పొందవలసినప్పుడు నదీదుర్గంలో ఉన్నవానినుంచి భూమిలాభమే మంచిది. నదీదుర్గాన్ని ఏనుగుల సహాయంచేత, స్తంభాలమీద నిర్మించిన వంతెనలు, ఆనకట్టలు, నావలు-వీటి సహాయం చేతా వశం చేసుకోవచ్చును. నది లోతు ఎల్లప్పుడూ ఒకే విధంగా ఉండదు. నీళ్లు క్రిందికి ప్రవహించిపోతూ ఉంటాయి, పార్వతదుర్గమైతే శిలాబంధాదులచేత బాగా రక్షింపబడి ఉంటుంది. దానిని ముట్టడించడం కష్టం. పైకి ఎక్కడం కష్టం. ఒక భాగానికి నష్టం కలిగించినా అందరినీ చంపడం శక్యం కాదు. ఎక్కువ అపకారం చేసేవాళ్లమీదికి పర్వతదుర్గంలో ఉన్నవాళ్లు రాళ్లూ, చెట్లూ విసురుతారు కూడ.

2. నిమ్నయోధులు (నావలమీద ఎక్కి నీళ్లలోనుంచి యుద్ధం చేసేవాళ్లు), స్థలయోధులు (చదునైన నేలమీద యుద్ధం చేసేవాళ్లు)- వీళ్లలో నిమ్నయోధులనుండి భూమిలాభం శ్రేయస్కరం. ఎందువల్ల ననగా- నిమ్నయోధులు కొన్ని ప్రదేశాలలోను కొన్ని కాలాలలోను మాత్రమే యుద్ధం చేయగలరు. స్థలయోధులైతే అన్ని ప్రదేశాలలోను, అన్ని కాలాలలోనూ కూడ యుద్ధం చేయగలరు.

3. ఖనకయోధులు (భూమిలో సురంగాలు తవ్వుకొని వాటిలో ఉండి యుద్ధం చేసే వాళ్లు) ఆకాశయోధులు (బైట యుద్ధం చేసేవాళ్లు)- వీళ్లలో ఖనకులనుంచి భూమిలాభం శ్రేయస్కరం. ఎందువల్ల ననగా ఖనకులకు యుద్ధం చేయడానికి గోతులు, శస్త్రాలు-రెండు కావాలి. ఆకాశయోధులైతే శస్త్రా లుంటే చాలు, యుద్ధం చేస్తారు.

శ్లో. ఏవంవిధేభ్యః పృథివీం లభమానోఽర్థశాస్త్రవిత్,
సంహితేభ్యః పరేభ్యశ్చ విశేషమధిగచ్ఛతి.

*ఇతి కౌటలీయార్థశాస్త్రే షాడ్గుణ్యే సప్తమాధికరణే దశమోఽధ్యాయః,*
*మిత్రహిరణ్యభూమికర్మసంధౌ భూమిసంధిః, ఆదితోఽష్టశతతమః.*

వ్యా. రాజనీతిశాస్త్రంలో నైపుణ్యం గల రాజు పైన చెప్పిన వేరు వేరు విధాలు గల రాజులనుండి భూమిని సంపాదిస్తూ సంధి చేసుకొన్న రాజులకంటె, శత్రువులకంటె కూడ వైశిష్ట్యం పొందుతాడు.

*"బాలానందిని" అను కౌటలీయార్థశాస్త్రాంధ్రవ్యాఖ్యానంలో షాడ్గుణ్యం అనే సప్తమాధికరణంలో మిత్ర హిరణ్యభూమికర్మసంధులలో భూమిసంధి అను దశమాధ్యాయం, ప్రారంభంనుంచి నూట ఎనిమిదవ అధ్యాయం సమాప్తం.*

# అథ ఏకాదశోఽధ్యాయః

## షోడశశతతమం ప్రకరణమ్ - మిత్రహిరణ్యభూమికర్మసంధయః

## తత్ర అనవసితసంధిః

మూ. 1. "త్వం చాహం చ శూన్యం నివేశయావహే" ఇత్యనవసితసంధిః.

2. తయోర్యః ప్రత్యుపస్థితార్థః యథోక్తగుణాం భూమిం నివేశయతి సోఽతిసంధత్తే.

3. తత్రాపి స్థలమ్ ఔదకం వేతి- మహతః స్థలాదల్పమౌదకం శ్రేయః, సాతత్యాదవస్థితత్వాచ్చ ఫలానామ్.

4. స్థలయోరపి ప్రభూతపూర్వాపరసస్యమ్, అల్పవర్షపాకమ్, అసక్తారమ్భం శ్రేయః. ఔదకయోరపి ధాన్యవాపమ్ అధాన్యవాపాచ్ఛ్రేయః, తయోరల్పబహుత్వే ధాన్యకాన్తాదల్పాన్మహదధాన్యకాన్తం శ్రేయః. మహత్యవకాశే హి స్థాల్యాశ్చ అనూప్యాశ్చ ఔషధయః భవన్తి. దుర్గాదీని చ కర్మాణి ప్రాభూత్యేన క్రియన్తే. కృత్రిమా హి భూమిగుణాః.

వ్యా. 1. ''నువ్వూ నేనూ కలిసి జనశూన్యంగా ఉన్న భూమిమీద గ్రామజనపదాదులు నెలకొల్పుదాం'' అని చేసుకొన్న సంధి అనవసితసంధి.

2. అలా సంధి చేసికొన్నవాళ్లలో ఎవడు అవసరం వచ్చినప్పుడు (కాంగ్లే) దగ్గరనే అన్ని సామగ్రులు ఉన్నవాడై (గ.శా.) వెనుక జనపదనివేశంలో చెప్పిన గుణాలన్నీ ఉన్న భూమిమీద జనపదాదులను నెలకొల్పుతాడో అతడు అధికలాభవంతుడు.

3. జనపదనివేశానికి ఉపయోగించే భూమిలో కూడ మెట్టభూమి (వర్షాధారభూమి) మంచిదా ఔదకమైన (సమృద్ధిగా ఉదకం ఉన్న) భూమి మంచిదా అన్నప్పుడు విశాలమైన స్థలంకంటె అల్పప్రమాణం గల ఔదకమే మంచిది. ఎందువల్ల ననగా- ఔదకభూమిలో పంటలు నిరంతరాయంగా, నిశ్చితంగా ఉంటాయి.

4. మెట్టభూములలో కూడ తొలి పంట మలి పంట (శరద్గ్రీష్మాలలో) సమృద్ధంగా ఉండేది, వర్షం తక్కువ ఉన్నా ఫలించేది, కృష్యాదులకు రాళ్లు, ఎగుడు దిగుళ్లు వంటి అడ్డు లేవీ లేనిది అయిన స్థలం మంచిది.

5. ఔదకభూములలో కూడ ధాన్యం పండనిదానికంటె ధాన్యం పండేది మంచిది. ఈ భూములలోనే అధికమైన భూమి మంచిదా అల్పమైన భూమి మంచిదా అన్నప్పుడు ధాన్యం పండించడానికి వీలైన అల్పభూమికంటె, ధాన్యం పండించడానికి ఎక్కువగా వీలులేని అధికప్రమాణమైన భూమియే మంచిది. ఎందువల్ల ననగా భూమి విశాలంగా ఉంటే మెట్టలమీద పెరిగే చెట్లు, మొక్కలు, నీళ్లల్లో పెరిగేవీ కూడ ఉంటాయి. అలాంటి విశాలప్రదేశంలో దుర్గాదినిర్మాణం కూడ అత్యధికం చేయవచ్చు. మానవుని ప్రయత్నాన్ని పట్టి కదా భూమి గుణవంతం అవుతుంది?

మూ. 1. ఖనిధాన్యభోగయోః ఖనిభోగః కోశకరః. ధాన్యభోగః కోశకోష్ఠాగారకరః. ధాన్యమూలా హి దుర్గాదీనాం కర్మణామారమ్భాః, మహావిషయవిక్రయో వా ఖనిభోగః శ్రేయాన్.

2. "ద్రవ్యహస్తివనభోగయోః ద్రవ్యవనభోగః సర్వకర్మణాం యోనిః ప్రభూతనిధానక్షమశ్చ. విపరీతో హస్తివనభోగః" ఇత్యాచార్యాః.

3. నేతి కౌటల్యః. శక్యం ద్రవ్యవనమనేకమనేకస్యాం భూమౌ వాపయితుం, న హస్తివనమ్: హస్తిప్రధానో హి పరానీకవధః ఇతి.

వ్యా. 1. ఖనిభోగధాన్యభోగాలలో, అనగా- గనులవల్లా, ధాన్యంవల్లా కలిగే లాభాలలో, ఖనిభోగంవల్ల కోశం మాత్రమే వృద్ధి పొందుతుంది. ధాన్యంవల్ల కోశమూ, కోష్ఠాగారమూ (గోడౌన్) కూడ వృద్ధి చెందుతాయి. దుర్గాదికర్మలను చేపట్టా లంటే ధాన్యమే మూలం (ప్రధానకారణం) కదా? అయితే ఖనిజాలు ఎక్కువ ఉండి అవి ఎక్కువగా అమ్ముడు పోతూన్నప్పుడు ఖనిభోగమే మంచిది.

2. "ద్రవ్యవన (ఆ యా వస్తువులు లభించే వనాలు) హస్తివన (ఏనుగులు లభించే వనాలు) భోగాలలో ద్రవ్యవనభోగమే మంచిది. అది సమస్తకర్మలకు మూల కారణం. అత్యధికంగా నిధులను ఏర్పరచుకొనవచ్చును. హస్తివనభోగం ఇందుకు విపరీతం" అని పూర్వాచార్యు లన్నారు.

3. ఇది యుక్తం కాదంటాడు కౌటల్యుడు- అనేకభూములలో అనేకవిధాలైన ద్రవ్యవనాలను పెంచవచ్చును. హస్తివనాన్ని అలా పెంచడం కుదరదు. శత్రుసైన్యాన్ని సంహరించాలంటే ఏనుగులు చాల అవసర మైనవి కదా?

మూ. 1. వారిస్థలపథభోగయోః అనిత్యో వారిపథభోగః, నిత్యః స్థలపథభోగః ఇతి.

2. భిన్నమనుష్యా శ్రేణీమనుష్యా వా భూమిరితి-భిన్నమనుష్యా శ్రేయసీ. భిన్నమనుష్యా భోగ్యా భవతి, అనుపజాప్యా చాన్యేషామ్, అనాపత్సహా తు. విపరీతా శ్రేణీమనుష్యా, కోపే మహాదోషా.

3. తస్యాం చాతుర్వర్ణ్యాభినివేశే సర్వభోగసహత్వాదవరవర్ణప్రాయా శ్రేయసీ. బాహుల్యాత్ ధ్రువత్వాచ్చ కృష్యాః కర్షణవతీ. కృష్యాశ్చాన్యేషాం చారమ్భాణాం ప్రయోజకత్వాత్ గోరక్షకవతీ. పణ్యనిచయర్ణానుగ్రహాత్ ఆఢ్యవణిగ్వతీ.

వ్యా. 1. జలమార్గభోగ- స్థలమార్గభోగాలలో-జలమార్గభోగం అనిత్యం (ఎల్లప్పుడు ఉండేది కాదు). స్థలమార్గభోగం నిత్యం.

2. భిన్నమనుష్య అయిన (ఒకరితో ఒకరు కలవని మనుష్యు లున్న) భూమి మంచిదా, శ్రేణీమనుష్యులు (కొన్ని గణాలు గుంపులు) గా కలిసి ఉండే మనుష్యులు ఉన్న భూమి మంచిదా అన్నప్పుడు- భిన్నమనుష్యభూమియే మంచిది. భిన్నమనుష్యభూమిని శ్రమపడకుండా పాలిస్తూ అనుభవించవచ్చు. దానిలో శత్రువులు కలతలు సృష్టించజాలరు. కాని అలాంటి భూమి ఆపదలు ఏవైనా వస్తే తట్టుకొనజాలదు. శ్రేణీమనుష్యభూమి ఇందుకు విపరీతం, కోపం (తిరుగుబాటు) వస్తే మహాదోషహేతువు, ఆ తిరుగుబాటును అణచడం కష్టం అని అర్థం.

3. ఆ భూమిలో నాలుగు వర్ణాలవాళ్లనీ నివేశింపచేసినప్పుడు ఎక్కువగా క్రింది వర్ణాలవాళ్లు ఉన్న భూమి మంచిది; అలాంటి ప్రదేశంలో అన్ని విధాలైన భోగాలు సమకూర్చుకొనవచ్చును. కర్షకులు అధికసంఖ్యలో ఉంటే కృషి (వ్యవసాయం) నిశ్చితంగా అధికంగా జరుగుతుంది. పశుపాలకు లుంటే వ్యవసాయం ఇతరమైన పనులూ కూడ నిరాఘాటంగా జరుగుతాయి. ధనికులైన వర్తకులు అధికంగా ఉంటే పణ్యవస్తువులు అధికంగా లభిస్తాయి; కావలసిన వాళ్లకి ఋణాలు దొరుకుతాయి.

మూ. 1. భూమిగుణానామపాశ్రయః శ్రేయాన్.

2. దుర్గాపాశ్రయా పురుషాపాశ్రయా వా భూమిరితి - పురుషాపాశ్రయా శ్రేయసీ. పురుషవద్ధి రాజ్యమ్. అపురుషా గౌః వన్ధ్యేవ కిం దుహీత?

3. మహాక్షయవ్యయనివేశాం తు భూమిమవాప్తుకామః పూర్వమేవ క్రేతారం పణేత. దుర్బలమ్ అరాజబీజినం, నిరుత్సాహమ్, అన్యాయవృత్తిం, వ్యసనినం, దైవప్రమాణం, యత్కించనకారిణం వా.

4. మహాక్షయవ్యయనివేశాయాం హి భూమౌ దుర్బలో, రాజబీజీ, నివిష్టః సగన్ధాభిః ప్రకృతిభిః సహ క్షయవ్యయే నావసీదతి.

5. బలవాన్ అరాజబీజీ క్షయవ్యయభయాత్ అసగన్ధాభిః ప్రకృతిభిః త్యజ్యతే.

వ్యా. 1. భూమికి ఉన్న సద్గుణాలలో ఆశ్రయంగా ఉండడం అనేది గొప్ప గుణం.

2. దుర్గాపాశ్రయభూమి (దుర్గం ద్వారా ఆశ్రయం ఇచ్చే భూమి) మంచిదా పురుషాపాశ్రయ మైనది మంచిదా అన్నప్పుడు- పురుషాపాశ్రయ (పురుషుల ద్వారా ఆశ్రయం, రక్షణ ఇచ్చేది) మంచిది. పురుషు లుంటేనే కదా రాజ్యం అవుతుంది? పురుషులు లేని భూమి గొడ్డుదైన ఆవు వలె, పిదికితే ఏమి ఇస్తుంది?

3. నివేశింపచేయడంలో (గ్రామాదులను నెలకొల్పడంలో) ఎక్కువ నష్టంతోను వ్యయంతోను కూడిన భూమిని పొంద దలచినవాడు, ముందుగానే-దుర్బలుడు లేదా రాజవంశానికి చెందనివాడు, ఉత్సాహరహితుడు, తనదంటూ ఒక పక్షం లేనివాడు లేదా అన్యాయంగా ప్రవర్తించేవాడు లేదా దుర్వ్యసనా లున్నవాడు, లేదా దైవంమీదనే ఆధారపడినవాడు, లేదా తోచి నట్లు చేసేవాడు అయిన క్రేతతో (కొనేవానితో) బేరం చేసి ఉంచుకోవాలి.

4. రాజబీజానికి పుట్టినవాడే అయినా దుర్బలుడు నివేశానికి పెద్దక్షయవ్యయాలతో కూడిన భూమిలో ఆ క్షయవ్యయాలచేత తనతో సమానులైన ప్రకృతులతో కూడ నశిస్తాడు.

5. రాజవంశానికి చెందని బలవంతుణ్ణి ప్రకృతులు క్షయవ్యయాలకి భయపడి విడిచిపెట్టివేస్తారు.

మూ. 1. నిరుత్సాహస్తు దణ్డవానపి దణ్డస్యాప్రణేతా సదణ్డః క్షయవ్యయేనావభజ్యతే.

2. కోశవానప్యపక్షః క్షయవ్యయానుగ్రహహీనత్వాన్న కుతశ్చిత్ ప్రాప్నోతి.

3. అన్యాయవృత్తిః నివిష్టమపి ఉత్థాపయేత్; స కథమనిష్టం నివేశయేత్?

4. తేన వ్యసనీ వ్యాఖ్యాతః.

5. దైవప్రమాణః మానుషహీనః నిరారమ్భః విపన్నకర్మారమ్భో వా అవసీదతి.

6. యత్కించనకారీ న కిఞ్చిదాసాదయతి. స చైషాం పాపిష్ఠతమో భవతి.

7. 'యత్కిఞ్చిదారభమాణో హి విజిగీషోః కదాచిచ్ఛిద్రమాసాదయేత్' ఇత్యాచార్యాః.

వ్యా. 1. దండం (సైన్యం) ఉన్నవాడైనా ఉత్సాహరహితుడు దండాన్ని సరియైన పద్ధతిలో వినియోగించకపోవడంవల్ల క్షయవ్యయాలచేత ఆ దండంతో సహా విఫలప్రయత్ను డౌతాడు.

2. పక్షం (మిత్రులు) లేనివాడు కోశం ఉన్నా కూడ క్షయవ్యయాలు కలిగి నప్పుడు వాటిని సరితీసికొనే శక్తి లేకపోవడంచేత ఏ విధంగానూ కూడ ఎవరినుండీ కూడ కార్యసిద్ధి పొందజాలడు.

3. అన్యాయంగా ప్రవర్తించేవాడు అంతకు పూర్వమే నివిష్టమైన (నెలకొల్పబడిన) గ్రామనగరాదికాన్ని కూడ లేవగొట్టేస్తాడు. అలాంటివాడు నివిష్టం కానిదానిని ఎలా నివేశింప చేయగలడు?

4. వీనిచేత వ్యసనవంతుడు కూడ వ్యాఖ్యానింపబడి నట్లే. అనగా వ్యసనవంతుడు కూడ అన్యాయవృత్తి వంటి వాడే.

5. దైవంమీదనే ఆధారపడినవాడు మనుష్యులు లేక, ఏ పనీ చేయక, లేదా ప్రారంభించిన పను లన్నీ చెడిపోయి నశిస్తాడు.

6. అనాలోచితంగా ఇష్టం వచ్చి నట్లు ఏదో ఒక పని చేసేవాడు ఏమీ సాధించజాలడు. ఇతడు వీళ్లందరిలోకీ ఎక్కువ పాపిష్ఠుడు. ఎందుకూ పనికిరానివాడు.

7. "యత్కించనకారి ఒకప్పుడు విజిగీషువులో ఉన్న ఛిద్రాన్ని (లోపాన్ని) గుర్తించి బైటపెట్టే అవకాశం కూడ ఉంది" అని ఆచార్యు లన్నారు.

మూ. 1. "యథా ఛిద్రం తథా వినాశమప్యాసాదయేత్" ఇతి కౌటల్యః.

2. తేషామలాభే యథా పార్ష్ణిగ్రాహోపకగ్రహే వక్ష్యామస్తథా భూమిమవస్థాపయేత్. ఇత్యభిహితసంధిః.

3. గుణవతీమాదేయాం వా భూమిం బలవతా క్రయేణ యాచితః సంధిమవస్థాప్య దద్యాత్. ఇత్యనిభృతసంధిః.

4. సమేన వా యాచితః కారణమవేక్ష్య దద్యాత్- "ప్రత్యాదేయా మే భూమిః వశ్యా వా, అనయా ప్రతిబద్ధః పరో మే వశ్యో భవిష్యతి, భూమివిక్రయాద్వా మిత్రహిరణ్యలాభః కార్యసామర్థ్యకరః మే భవిష్యతి" ఇతి.

5. తేన హీనః క్రేతా వ్యాఖ్యాతః.

వ్యా. 1. విజిగీషువుయొక్క ఛిద్రాన్ని కనిపెట్టి నట్లు అతడు తానే నశించిపోవచ్చును కూడ అని అంటాడు కౌటల్యుడు.

2. పైన చెప్పిన దుర్బలాదు లెవరూ దొరకనప్పుడు పార్ష్ణిగ్రాహోపగ్రహంలో చెప్ప నున్న విధంగా భూమిని నివేశింపచెయ్యాలి. ఇది అభిహితసంధి-అనగా గట్టిగా ఏర్పరచుకొన్న సంధి.

3. బలవంతుడైన రాజు మంచి గుణా లున్న, తిరిగి తీసికొనడానికి వీలైన ఏదైన ఒక భూమి తన కమ్మ మని కోరినప్పుడు "అవసరం వచ్చినప్పుడు నాకు సహాయం చెయ్యాలి" అని అతనితో సంధి చేసుకొని ఇవ్వాలి. ఇది అనిభృతసంధి అనగా రహస్యంగా కాని సంధి. (దుర్బలుని విషయంలో ప్రబలుడు సంధిని అతిక్రమించే అవకాశం ఎక్కువ ఉండడంచేత ఇది అవిశ్వస్తసంధి అని గ.శా.).

4. సమబలుడైన రాజు ఇలాంటి భూమిని తనకు అమ్మవలసిందిగా కోరినప్పుడు "ఈ భూమిని కావలసి నప్పుడు నేను వెనుకకు తీసికొనవచ్చును; లేదా నా అధీనంలో ఉంటుంది; లేదా దీనితో కట్టబడి శత్రువు నా చెప్పుచేతలలో ఉంటాడు; లేదా ఈ భూమిని అమ్మగా కలిగిన మిత్రలాభం, ధనలాభం కూడ నా పనులను నిర్వహించే సామర్థ్యాన్ని పెంచేదిగా ఉంటుంది" అని కారణాలు జాగర్తగా పరిశీలించుకొని వానికి ఇవ్వాలి.

5. దీనిని పట్టి తనకంటె తక్కువవాడు కొనడానికి వచ్చినప్పుడు ఎలా ప్రవర్తించాలో ఊహించుకొనాలి.

శ్లో. ఏవం మిత్రం హిరణ్యం చ సజనామజనాం చ గామ్,
లభమానోఽతిసంధత్తే శాస్త్రవిత్ సామవాయికాన్.

*ఇతి కౌటిలీయార్థశాస్త్రే షాడ్గుణ్యే సప్తమాధికరణే ఏకాదశోఽధ్యాయః*
*మిత్రహిరణ్యభూమికర్మసంధౌ అనవసితసంధిః, ఆదితః నవశతతమః.*

వ్యా. ఈ విధంగా నిత్యత్వ వశ్యత్వాదిగుణాలున్న మిత్రుణ్ణీ, ధనమునూ, జనులున్న భూమినీ, జనులు లేని భూమినీ పొంద గలిగిన అర్థశాస్త్రవేత్త సామవాయికులైన ఇతర రాజులకంటె ఆధిక్యంతో ఉంటాడు.

"బాలానందిని" అను కౌటలీయార్థశాస్త్రాంధ్రవ్యాఖ్యానంలో షాడ్గుణ్యం అనే సప్తమాధికరణంలో, మిత్రహిరణ్యభూమిసంధులలో అనవసితసంధి అనే పదకొండవ అధ్యాయం, ప్రారంభంనుంచి నూటతొమ్మిదవ అధ్యాయం సమాప్తం.

# అథ ద్వాదశోధ్యాయః

## షోడశశతతమం ప్రకరణమ్ - మిత్రహిరణ్యభూమికర్మసంధిః, తత్ర కర్మసంధిః

మూ. 1. "త్వం చాహం చ దుర్గం కారయావహే" ఇతి కర్మసంధిః.

2. తయోర్యో దైవకృతమ్, అవిషహ్యామ్, అల్పవ్యయారమ్భం దుర్గం కారయతి సోఽతిసంధత్తే.

3. తత్రాపి స్థలనదీపర్వతదుర్గాణాముత్తరోత్తరం శ్రేయః.

4. సేతుబన్ధయోరప్యాహార్యోదకాత్ సహోదకః శ్రేయాన్. సహోదకయోరపి ప్రభూతవాపస్థానః శ్రేయాన్.

5. ద్రవ్యవనయోరపి యో మహత్ సారవద్ద్రవ్యాటవీకం విషయాన్తే నదీమాతృకం ద్రవ్యవనం ఛేదయతి సోఽతిసంధత్తే. నదీమాతృకం హి స్వాజీవమ్ అపాశ్రయశ్చాపది భవతి.

వ్యా. 1. "నువ్వూ నేనూ కూడ దుర్గనిర్మాణం చేయిద్దాం" అని చేసుకొన్న సంధి కర్మసంధి.

2. అలా సంధి చేసుకొన్నవాళ్లలో ఎవడు -దైవంచేత నిర్మించబడినది అనగా సహజంగా పర్వతాదులు ఉన్నదీ, శత్రువులచేత ఎదిరింప శక్యం కానిది, అల్పమైన వ్యయంతో నిర్మించడానికి శక్యమూ అయిన దుర్గాన్ని నిర్మిస్తాడో అతడు అధికలాభం పొందినవా డవుతాడు.

3. ఆ దుర్గాలలో కూడ - స్థలదుర్గ-నదీదుర్గ-పర్వతదుర్గాలలో ఉత్తరోత్తరం (వెనుకటి దానికంటె తరవాతిది) మంచిది.

4. ఆహార్యోదకసేతుబంధం (వర్షకాలంలో ప్రయత్నపూర్వకంగా నీరు నిలవచేయవలసిన సేతుబంధం), సహోదకసేతుబంధం (సహజంగా ఉన్న నీరు నిలవచేసే సేతుబంధం)- వీటిలో సహోదకం మంచిది. రెండు సహోదకసేతుబంధాలలో కూడ పంట పండించ దగిన విశాలభూభాగం (ఆయకట్టు) ఉన్నది శ్రేష్ఠ మైనది.

5. రెండు ద్రవ్యవనాలలో- ఎవడు శ్రేష్ఠమైన ద్రవ్యాలున్న అడవి కలది, తన

దేశం సరిహద్దులలో నదీమాతృకమూ (నదీజలసహాయంచేత పంటలు పండేది) అయిన ద్రవ్యవనాన్ని తన ఉపయోగంకోసం ఛేదింపచేస్తాడో అతడు అధికలాభం పొందినవా డవుతాడు. ఎందువల్ల ననగా నదీమాతృకం మీద ఆధారపడి సుఖంగా జీవించవచ్చును. ఆపత్కాలంలో దానిని ఆశ్రయంగా కూడ చేసికొనవచ్చు.

మూ. 1. హస్తివనయోరపి యో బహుశూరమృగం దుర్బలప్రతివేశమ్, అనన్తావక్లేశివిషయాన్తే హస్తివనం బధ్నాతి సోఽతిసంధత్తే.

2. తత్రాపి "బహుకుణ్ఠాల్పశూరయోః అల్పశూరం శ్రేయః. శూరేషు హి యుద్ధమ్. అల్పాః శూరాః బహూన్ అశూరాన్ భఞ్జన్తి. తే భగ్నాః స్వసైన్యావఘాతినో భవన్తి" ఇత్యాచార్యాః.

3. నేతి కౌటల్యః. కుణ్ఠా బహవః శ్రేయాంసః. స్కన్ధవినియోగాదనేకం కర్మ కుర్వాణాః స్వేషామపాశ్రయా యుద్ధే; పరేషాం దుర్ధర్షా విభీషణాశ్చ. బహుషు హి కుణ్ఠేషు వినయకర్మణా శక్యం శౌర్యమాధాతుమ్, న త్వేవాల్పేషు శూరేషు బహుత్వమితి.

4. ఖన్యోరపి యః ప్రభూతసారామ్ అదుర్గమార్గామ్, అల్పవ్యయారమ్భాం ఖనిం ఖానయతి సోఽతిసంధత్తే.

వ్యా. 1. రెండు హస్తివనాలలో, ఎవడు శౌర్యం గల అధికసంఖ్యాకమైన ఏనుగులు గలదీ, ఇరుగుపొరుగున దుర్బలులు ఉన్నదీ, శత్రువుకు అత్యధికమైన క్లేశం కలిగించేదీ అయిన హస్తివనాన్ని తన దేశపు సరిహద్దులో నెలకొల్పుతాడో అతడు అధికలాభం పొందినవా డవుతాడు.

2. అందులో కూడ- "మందగొడిగా ఉండే చాలా ఏనుగులు ఉన్నదీ, శౌర్యం గల అల్పసంఖ్యాక మైన ఏనుగులు గలదీ అయిన హస్తివనాలలో అల్పశూరమైనది మంచిది. యుద్ధం-శౌర్యం గల ఏనుగుల మీదనే ఆధారపడి ఉంటుంది కదా? శౌర్యం గల అల్పసంఖ్యాకాలైన ఏనుగులు శౌర్యం లేని అధికసంఖ్యాకా లైన ఏనుగులను ఓడిస్తాయి. అలా ఓడించబడిన ఏనుగులు తమ సైన్యాన్నే తొక్కి నశింపచేస్తాయి" అని పూర్వాచార్యు లన్నారు.

3. అది యుక్తం కాదు అంటాడు కౌటల్యుడు. మందగొడిగా ఉన్నా చాలా ఏనుగులు ఉండడం మంచిది. వాటిని సైన్యంలో వినియోగించుకుంటే ఎన్నో విధాలైన పనులు చేస్తూ యుద్ధంలో తమవాళ్లకి ఆశ్రయంగా (సంరక్షణ ఇచ్చేవిగా) ఉంటాయి.

శత్రువులకు ఎదిరింప శక్యం కానివిగా, భయంకరమైనవిగా ఉంటాయి. మందగొడిగా ఉన్న అధికసంఖ్యాలైన ఏనుగులకు కూడా వినయకర్మ (ట్రైనింగ్) చేత శౌర్యం కలిగే టట్లు చేయవచ్చు. అయితే అల్పసంఖ్యలో ఉన్న శౌర్యం గల ఏనుగుల సంఖ్యను పెంచజాలం కదా?

4. గనులలో కూడ అత్యధికమైన సారం గలదీ, వెళ్లడానికి కష్టం కాని మార్గం గలదీ, తక్కువ వ్యయంతో పని చేయడానికి వీలున్నదీ అయిన గనిని తవ్వించేవాడు అధికలాభం పొందుతాడు.

మూ. 1. తత్రాపి మహాసారమ్ అల్పమ్, అల్పసారం వా ప్రభూతమ్ ఇతి- "మహాసారమల్పం శ్రేయః. వజ్రమణిముక్తాప్రవాలహేమరూప్యధాతుర్హి ప్రభూతమల్పసారమ్ అత్యర్ఘేణ గ్రసతే" ఇత్యాచార్యాః.

2. నేతి కౌటల్యః. చిరాదల్పో మహాసారస్య క్రేతా విద్యతే. ప్రభూతః సాతత్యా దల్పసారస్య.

3. ఏతేన వణిక్పథో వ్యాఖ్యాతః.

4. తత్రాపి "వారిస్థలపథయోః వారిపథః శ్రేయాన్. అల్పవ్యయ వ్యాయామః ప్రభూతపణ్యోదయశ్చ" ఇత్యాచార్యాః.

5. నేతి కౌటల్యః; సంరుద్ధగతిరసార్వకాలికః ప్రకృష్టభయయోనిః నిష్ప్రతికారశ్చ వారిపథః. విపరీతః స్థలపథః.

వ్యా. 1. ఆ గనులలో కూడ గొప్ప సారం గల చిన్న గని మంచిదా, అల్పసారం గల పెద్ద గని మంచిదా అన్నప్పుడు- "చిన్నదైనా మహాసారమైన గని మంచిది. వజ్రాలు, మణులు, ముత్యాలు, పగడాలు, బంగారం, వెండి మొదలైన ధాతువు లున్న గని అల్పసారమైన పెద్ద గనిని, మూల్యాధిక్యంచేత మ్రింగివేస్తుంది కదా?" అని ప్రాచీనాచార్యు లన్నారు.

2. "అది యుక్తం కాదు; చాలా ఖరీదైన వస్తువును కొనే వాళ్లు చాలా తక్కువగా ఉంటారు. అలాంటివాళ్లు ఏనాడో కాని దొరకరు, అల్పసారం నిరంతరంగా లభిస్తుంది. గాన కొనే వాళ్లు చాలమంది ఉంటారు" అంటాడు కౌటల్యుడు.

3. దీనిచేత వర్తకపు మార్గం కూడ వాఖ్యానించబడింది. అనగా గనులలోని వస్తువుల క్రయవిక్రయాలకోసం వర్తకపు మార్గాలను కూడ తదనుగుణంగా ఏర్పరచాలి.

4. అందులో కూడ "జలమార్గ-స్థలమార్గాలలో జలమార్గమే మంచిది. దీనికి ఖర్చు, శ్రమ కూడ తక్కువగా ఉంటాయి; పణ్యాలు అత్యధికంగా సరఫరా చేయ వచ్చు" అని ప్రాచీనాచార్యు లన్నారు.

5. "అది యుక్తం కాదు. జలమార్గానికి చాలా అడ్డంకులు ఉంటాయి. అన్ని కాలాలలోను ఇది ఉపయోగించదు.ఇది అనేకవిధాలైన భయాలకి కారణం. వీటికి సరియైన ప్రతిక్రియలు కూడ ఉండవు. స్థలమార్గం దీనికి విపరీతమైనది" అని కౌటల్యుడు అంటాడు.

మూ. 1. వారిపథే తు కూలసంయానపథయోః కూలపథః పణ్యపట్టణ బాహుల్యాత్ శ్రేయాన్, నదీపథో వా సాతత్యాత్ విషహ్యాబాధత్వాచ్చ.

2. స్థలపథేఽపి హైమవతః దక్షిణాపథాత్ శ్రేయాన్; హస్త్యశ్వగన్ధదన్తాజినరూప్యసువర్ణపణ్యాః సారవత్తరాః ఇత్యాచార్యాః.

3. నేతి కౌటల్యః. కమ్బలాజినాశ్వపణ్యవర్జాః శఙ్ఖవజ్రమణిముక్తాసువర్ణపణ్యాశ్చ ప్రభూతతరా దక్షిణాపథే.

4. దక్షిణాపథేఽపి బహుఖనిః సారపణ్యః ప్రసిద్ధగతిః అల్పవ్యాయామో వా వణిక్పథః శ్రేయాన్. ప్రభూతవిషయో వా ఫల్గుపణ్యః.

5. తేన పూర్వః పశ్చిమశ్చ వణిక్పథో వ్యాఖ్యాతః.

వ్యా. 1. జలమార్గంలో కూడ కూలపథ (తీరాన్ని అనుసరించి వెళ్లే మార్గం) - సంయానపథాల (సముద్రమధ్యమార్గం)లో పణ్యాలు (అమ్మే వస్తువులు) పట్టణాలు (ఓడలరేవులు) అధికంగా తగులుతూండడంచేత కూలపథమే మంచిది. లేదా నదీమార్గమైనా మంచిదే. ఎందువల్ల ననగా దానిని నిరంతరం ఉపయోగించవచ్చును. ఆ మార్గంలో ఉండే ఆబాధలు (కష్టాలు) సహించడానికి శక్యమైనవిగా ఉంటాయి.

2. స్థలపథంలో కూడ- "దక్షిణదేశంలోని మార్గంకంటె ఉత్తరదేశంలోని మార్గం మంచిది. ఎందువల్ల ననగా ఈ ప్రాంతంలో చాల సారం గల ఏనుగులు, గుఱ్ఱాలు, సుగంధద్రవ్యాలు, దంతాలు, చర్మలు, వెండి, బంగారమూ అనే పణ్యాల వర్తకం జరుగుతుంది". అని పూర్వాచార్యు లన్నారు.

3. అది సరి కాదంటాడు కౌటల్యుడు, ఎందువల్ల ననగా దక్షిణదేశంలో కంబళ్లు, చర్మలు, గుఱ్ఱాలు అనే పణ్యాలు మినహాయించి శంఖాలు, వజ్రాలు, మణులు, ముత్యాలు, బంగారం అనే పణ్యాలు అధికంగా ఉంటాయి.

4. దక్షిణాపథంలో (దక్షిణదేశంలో) కూడ అనేకమైన గనులు, శ్రేష్ఠమైన పణ్యవస్తువులూ ఉన్న, రాకపోకలలో అపాయాలు లేని, అల్పమైన పరిశ్రమ గల వణిక్పథం (వర్తకమార్గం) మంచిది లేదా అంతగా సారం లేని పణ్యాలు కలదైనా కొనేవాళ్లు అధికసంఖ్యలో ఉండే మార్గం మంచిది.

5. తూర్పుదేశాలలోని మార్గాల విషయంలోను, పశ్చిమదేశాల మార్గాలలోను లాభాలాభాలను ఈ విధంగానే చూచుకోవాలి.

మూ. 1. తత్రాపి చక్రపాదపథయోః చక్రపథః విపులారమ్భత్వాత్ శ్రేయాన్. దేశకాలసంభావనో వా ఖరోష్ట్రపథః.

2. ఆభ్యామంసపథో వ్యాఖ్యాతః.

3. శ్లో. పరకర్మోదయో నేతుః క్షయో వృద్ధిర్విపర్యయే,
తుల్యే కర్మపథే స్థానం జ్ఞేయం స్వం విజిగీషుణా.

వ్యా. 1. వణిక్పథంలో కూడ చక్రపథ(బండ్లదారి) పాదపథా (కాలిదారి)లలో విపులారంభం (ఎక్కువప్రమాణంలో సరుకు తీసికొని వెళ్లే వీలుండడం) చేత చక్రపథం మంచిది. వెళ్లవలసిన దేశం దూరంగా ఉండడం, కాలం-వీటిని పట్టి గాడిదల దారి, ఒంటెల దారి కూడ మంచిదే.

2. ఈ ఖరపథ-ఉష్ట్రపథాలచేత అంసపథం (మనుష్యులు సామాను బుజాలమీద పెట్టుకొని లేదా కావళ్లలో వేసికొని తీసికొని వెళ్లే మార్గం) వ్యాఖ్యానించబడింది. అనగా దేశకాలానుసారం అంసపథం కూడా ఏర్పరచుకొనవలె నని అర్థం.

3. శత్రువుయొక్క కర్మలలో అభివృద్ధి ఉన్నట్లయితే అది నాయకుని (విజిగీషువుయొక్క) నాశనమే. అందుకు విపరీతం అయితే అనగా పరుని కర్మలు అభివృద్ధిలో లేకపోతే అది తన (విజిగీషువుయొక్క) వృద్ధి. శత్రువుయొక్క కర్మమార్గమూ, తన కర్మమార్గమూ తుల్యంగా ఉంటే అది తనకు స్థిరత్వమే అని విజిగీషువు తెలుసుకోవాలి.

శ్లో. అల్పాగమాతివ్యయతా క్షయో వృద్ధిర్విపర్యయే,
సమాయవ్యయతా స్థానం కర్మసు జ్ఞేయమాత్మనః.

వ్యా. పనులు చేపట్టినప్పుడు రాబడి తక్కువగా ఉండి ఖర్చు ఎక్కువగా ఉన్నట్లయితే అది క్షయం. అందుకు విపరీతంగా రాబడి ఎక్కువై వ్యయం తక్కువగా

ఉంటే అది వృద్ధి. ఆయవ్యయాలు రెండూ సమంగా ఉండడం తనకు స్థానం అనగా నిలకడగా ఉండడం అని తెలుసుకోవాలి.

శ్లో. తస్మాదల్పవ్యయారమ్భం దుర్గాదిషు మహోదయమ్,
కర్మ లబ్ధ్వా విశిష్టః స్యాదిత్యుక్తాః కర్మసంధయః.

*ఇతి కౌటలీయార్థశాస్త్రే షాడ్గుణ్యే సప్తమాధికరణే ద్వాదశోఽధ్యాయః,*
*మిత్రహిరణ్యభూమికర్మసంధౌ కర్మసంధిః, ఆదితో దశశతతమః.*

వ్యా. అందువల్ల విజిగీషువు దుర్గసేత్వాదుల నిర్మాణంలో అల్పమైన వ్యయంతో కూడిన ప్రారంభం గల, గొప్ప సత్ఫలితం గల కర్మను పొంది (చేబట్టి) ఇతరరాజుల కంటె వైశిష్ట్యాన్ని సంపాదించాలి. ఈ విధంగా కర్మసంధులు చెప్పబడ్డాయి.

*"బాలానందిని" అను కౌటలీయార్థశాస్త్రాంధ్రవ్యాఖ్యానంలో షాడ్గుణ్యం అనే సప్తమాధికరణంలో, మిత్రహిరణ్యభూమికర్మసంధులలో కర్మసంధి అను పన్నెండవ అధ్యాయం, ప్రారంభంనుంచి నూటపదవ అధ్యాయం సమాప్తం.*

## అథ త్రయోదశోఽధ్యాయః.

### సప్తదశశతతమం ప్రకరణమ్ - పార్ష్ణిగ్రాహచిన్తా

మూ. 1. సంహత్యారివిజిగీష్వోః అమిత్రయోః పరాభియోగినోః పార్ష్ణిం గృహ్ణతోః యః శక్తిసంపన్నస్య పార్ష్ణిం గృహ్ణాతి సోఽతిసంధత్తే. శక్తిసంపన్నోహి అమిత్రముచ్ఛిద్య పార్ష్ణిగ్రాహముచ్ఛిన్ద్యాత్; న హీనశక్తిః అలబ్ధలాభః ఇతి.

2. శక్తిసామ్యే యో విపులారమ్భస్య పార్ష్ణిం గృహ్ణాతి సోఽతిసంధత్తే. విపులారమ్భో హ్యమిత్రముచ్ఛిద్య పార్ష్ణిగ్రాహముచ్ఛిన్ద్యాత్ నాల్పారమ్భః సక్తచక్ర ఇతి.

3. ఆరమ్భసామ్యే యః సర్వసందోహేన ప్రయాతస్య పార్ష్ణిం గృహ్ణాతి సోఽతిసంధత్తే. శూన్యమూలో హ్యస్య సుకరో భవతి, నైకదేశబల ప్రయాతః కృతపార్ష్ణిప్రతివిధాన ఇతి.

వ్యా. 1. (ఒక రాజు ఒక శత్రువుపై యుద్ధానికి వెళ్లినప్పుడు వెనుకనుండి వచ్చి వాని రాజ్యం ఆక్రమించే మరొక శత్రువు పార్ష్ణిగ్రాహుడు). తమ (ఇద్దరు పార్ష్ణిగ్రాహుల) శత్రువులైన-ఒక శత్రువు, విజిగీషువు వాళ్ల శత్రువులమీదికి దాడి చేయడానికి వెళ్లినప్పుడు, కలిసి వాళ్ల వెనుక భాగాన్ని ఆక్రమించే ఇద్దరు పార్ష్ణిగ్రాహులలో ఎవడు శక్తిసంపన్నుడైనవాని పృష్ఠభాగాన్ని ఆక్రమిస్తాడో అతడు అధికలాభం పొందుతాడు. ఎందువల్ల ననగా శక్తిసంపన్నుడు తన శత్రువును నశింపచేసిన తరవాత తిరిగి వచ్చి పార్ష్ణిగ్రాహుణ్ణి నశింపచేయవచ్చును. ఏ లాభమూ పొందజాలని హీనశక్తిమంతుడు అట్లు చేయజాలడు.

2. ఇద్దరి శక్తీ సమంగానే ఉన్నప్పుడు ఎవడు విపులారంభుని (సైన్యం, ఆహారం మొదలైనవి అన్నీ సమకూర్చుకొని యుద్ధానికి వెళ్లేవాని) వెనుకభాగాన్ని ఆక్రమిస్తాడో అతడు అధికలాభం పొందుతాడు. ఎందువల్ల ననగా విపులారంభుడు శత్రువును నిర్మూలించి తరవాత పార్ష్ణిగ్రాహుణ్ణి ఉన్మూలించవచ్చును. సక్తచక్రుడైన (మరో పనిలో లగ్నమైన ఉన్న సైన్యం గల) హీనశక్తిమంతుడు అలా చేయజాలడు.

3. ఇద్దరూ ఒకే విధమైన ఏర్పాట్లు చేసుకొని యుద్ధానికి వెళ్లి నప్పుడు ఏ పార్ష్ణిగ్రాహకుడు మొత్తం సైన్యాదు లన్నింటినీ తీసికొని వెళ్లినవాని వెనుక భాగాన్ని ఆక్రమిస్తాడో అతడు అధికలాభం పొందుతాడు. ఎందువల్ల ననగా మూలస్థానం శూన్యంగా ఉన్న అనగా, మూలస్థానంలో సరియైన రక్షణం ఏర్పరచుకొనకుండా యుద్ధానికి వెళ్లినవానిని వెనుకనుండి అనాయాసంగా పీడించవచ్చును గాని వెనక తగిన రక్షణలు కల్పించి కొంత సైన్యంతో యుద్ధయాత్రకు వెళ్లినవానిని వెనుకనుండి పీడించడం కష్టం.

మూ. 1. బలోపాదానసామ్యే యశ్చలామిత్రం ప్రయాతస్య పార్ష్ణిం గృహ్ణాతి సోఽతిసంధత్తే. చలామిత్రం ప్రయాతో హి సుఖేనావాప్తసిద్ధిః పార్ష్ణిగ్రాహముచ్ఛిన్ద్యాత్, న స్థితామిత్రం ప్రయాతః. అసౌ హి దుర్గప్రతిహతః పార్ష్ణిగ్రాహే చ ప్రతినివృత్తః స్థితేన అమిత్రేణ అవగృహ్యతే.

2. తేన పూర్వే వ్యాఖ్యాతాః.

వ్యా. 1. సైన్యాన్ని తీసికొనివెళ్లడం సమంగానే ఉన్నప్పుడు, అనగా ఇద్దరూ సైన్యాన్ని సమంగానే తీసికొని వెళ్లినప్పుడు, ఏ పార్ష్ణిగ్రాహుడు చలామిత్రుని మీదికి (కోటలో లేని శత్రువుమీదికి) యుద్ధానికి వెళ్లినవాని వెనుకభాగాన్ని ఆక్రమిస్తాడో అతడు అధికలాభం పొందుతాడు. ఎందువల్ల ననగా చలామిత్రునిమీదికి యుద్ధానికి వెళ్లినవాడు

అనాయాసంగా కార్యసిద్ధి పొంది పార్ష్ణిగ్రాహుణ్ణి ఉన్మూలించవచ్చును. (అలా అతడు తిరిగి వచ్చే లోగా వానిని వెనుకనుండి ఆక్రమించాలి అని భావం). అయితే స్థితామిత్రుని మీదికి (కోటలో ఉన్న శత్రువుమీదికి) యుద్ధానికి వెళ్లినవాడు అలా చేయజాలడు. ఎందువల్ల ననగా ఇతడు దుర్గంచేత ఎదురుదెబ్బ తిని, పార్ష్ణిగ్రాహుని మీదికి తిరిగి వచ్చినప్పుడు స్థితామిత్రుడు ఆతనిని నిగ్రహిస్తాడు.

2. దీనిచేత వెనుక చెప్పబడిన హీనశక్తిపార్ష్ణిగ్రాహి, అల్పారంభపార్ష్ణిగ్రాహి, ఏకదేశబలప్రయాతపార్ష్ణిగ్రాహి కూడ వ్యాఖ్యానింపబడినట్లే. అనగా వాళ్ల పార్ష్ణిగ్రహణం కూడ అనవసరం అని అర్థం. (పై రెండు పేరాల అర్థం అస్పష్టంగా ఉంది).

మూ. 1. శత్రుసామ్యే యః ధార్మికాభియోగినః పార్ష్ణిం గృహ్ణాతి సోఽతిసంధత్తే. ధార్మికాభియోగీ హి స్వేషాం చ ద్వేష్యో భవతి, అధార్మికాభి యోగీ సంప్రియః.

2. తేన మూలహరతాదాత్వికకదర్యాభియోగినాం పార్ష్ణిగ్రహణం వ్యాఖ్యాతమ్.

3. మిత్రాభియోగినోః పార్ష్ణిగ్రహణే త ఏవ హేతవః.

4. మిత్రమమిత్రం చాభియుఞ్జానయోః యః మిత్రాభియోగినః పార్ష్ణిం గృహ్ణాతి, సోఽతిసంధత్తే, మిత్రాభియోగీ హి సుఖేనావాప్తసిద్ధిః పార్ష్ణిగ్రాహముచ్ఛిన్ద్యాత్. సుకరో హి మిత్రేణ సంధిః నామిత్రేణేతి.

వ్యా. 1. ఇద్దరూ సమంగానే శత్రువు లైనప్పుడు ఎవడు ధార్మికుడైన శత్రువు మీదికి యుద్ధానికి వెళ్లినవానిని వెనుకనుండి పీడిస్తాడో అతడు అధికలాభం పొందుతాడు. ఎందువల్ల ననగా ధార్మికుని మీదికి యుద్ధానికి వెళ్లినవానిని తనవాళ్లు కూడా ద్వేషిస్తారు. అధార్మికునిమీదికి యుద్ధానికి వెళ్లినవాడు తనవాళ్లకు ప్రియుడౌతాడు.

2. ఈ చెప్పినదానిచేత మూలహరుని మీదికి (తాతతండ్రులనుంచి వచ్చిన ధనం దుర్వ్యయం చేసేవాని మీదికి), తాదాత్వికుని మీదికి (కేవలం వర్తమానం మీద మాత్రమే బ్రతికేవాని మీదికి) లోభిమీదికీ యుద్ధానికి వెళ్లినవాని వెనుకనుండి ఆక్రమించడం కూడ వివరించబడినట్లే, అనగా ఈ మూడు విధాల రాజులు తమ జనులకు ద్వేషపాత్రు లవడంచేత అలాంటి రాజులమీదికి యుద్ధానికి వెళ్లేవాని పార్ష్ణిగ్రహణం మంచిది కాదు అని అర్థం.

3. మిత్రులమీదికి వెళ్లేవానిని వెనుకనుండి ఆక్రమించడానికి కూడ పైన చెప్పినవే హేతువులు.

4. ఒకడు మిత్రుణ్ణి మరొకడు అమిత్రుణ్ణి యుద్ధంలో ఎదిరించే టప్పుడు ఎవడు మిత్రాభియోగిని వెనుకనుండి ఆక్రమిస్తాడో ఆ పార్ష్ణిగ్రాహుడు ఎక్కువ లాభం పొందుతాడు. ఎందువల్ల ననగా మిత్రుని పైకి యుద్ధానికి వెళ్లినవాడు అనాయాసంగా కార్యసిద్ధి పొంది పార్ష్ణిగ్రాహుణ్ణి నిర్మూలించవచ్చును. మిత్రునితో సంధి చేసుకొనడం సులభం కాని అమిత్రునితో సంధిచేసుకొనడం అంత సులభం కాదు కదా?

మూ. 1. మిత్రమ్ అమిత్రమ్ చ ఉద్ధరతోః యః అమిత్రోద్ధారిణః పార్ష్ణిం గృహ్ణాతి సోఽతిసంధత్తే. వృద్ధమిత్రో హ్యమిత్రోద్ధారీ పార్ష్ణిగ్రాహ ముచ్ఛిన్ద్యాత్, నేతరః స్వపక్షోపఘాతీ.

2. తయోరలబ్ధలాభాపగమనే యస్య అమిత్రః మహతో లాభాత్ వియుక్తః క్షయవ్యయాధికో వా స పార్ష్ణిగ్రాహోఽతి సంధత్తే, లబ్ధలాభాపగమనే యస్యామిత్రో లాభేన శక్త్యా హీనః స పార్ష్ణిగ్రాహోఽతిసంధత్తే. యస్య వా యాతవ్యః శత్రోర్విగ్రహాపహారసమర్థః స్యాత్.

3. పార్ష్ణిగ్రాహయోరపి యః శక్యారమ్భబలోపాదానాదధికః స్థితశత్రుః పార్శ్వస్థాయీ వా సోఽతిసంధత్తే. పార్శ్వస్థాయీ హి యాతవ్యాభిసారో మూల బాధకశ్చ భవతి. మూలబాధక ఏవ పశ్చాత్ స్థాయీ.

వ్యా. 1. ఒక రాజు తన మిత్రుణ్ణి నిర్మూలిస్తున్నప్పుడు మరొకడు శత్రువును నిర్మూలిస్తున్నప్పుడు వాళ్లిద్దరిలో శత్రువును నిర్మూలించేవాని వెనుకనుండి ఆక్రమణం చేసేవాడు అధికలాభం పొందుతాడు. ఎందువల్ల ననగా అమిత్రోద్ధారి మిత్రులు పెరగడంచేత పార్ష్ణిగ్రాహుణ్ణి ఉన్మూలించవచ్చును. అంతే కాని తన పక్షాన్నే నశింపచేసుకొంటూన్న మిత్రోద్ధారకుడు (మిత్రుణ్ణి ఉన్మూలించేవాడు) అలా చేయజాలడు.

2. మిత్రామిత్రవినాశకులు ఏ లాభమూ లేకుండా తిరిగి వచ్చినప్పుడు ఏ పార్ష్ణిగ్రాహుని అమిత్రుడు అత్యధికమైన లాభాన్ని కోల్పోయాడో, అధికంగా క్షయవ్యయాలకు లోనైనాడో, ఆ పార్ష్ణిగ్రాహుడు ఎక్కువలాభం పొందినవా డవుతాడు. ఏ పార్ష్ణిగ్రాహుని. అమిత్రుడు తనకు దొరికిన లాభం పోయి లాభమూ శక్తీ కూడ లేకుండా ఉంటాడో ఆ పార్ష్ణిగ్రాహుడు అధికలాభం పొందుతాడు. ఏ పార్ష్ణిగ్రాహకుని

యాతవ్యుడు (శత్రువు) శత్రువునకు (విజిగీషువునకు) విరోధం ద్వారా అపకారం చేయడానికి సమర్థుడో ఆ పార్ష్ణిగ్రాహుడు కూడ అధికలాభం పొందుతాడు.

3. ఇతరగుణా లన్నీ సమంగా ఉన్న ఇద్దరుపార్ష్ణిగ్రాహులలో ఎవడు వెంటనే పనిలో దుమకడానికి సమర్థమైన సైన్యం ఉండడంచేత అధికుడో, లేదా స్థితశత్రువో (కోటలో భద్రంగా ఉన్న శత్రువో), లేదా యాతవ్యుని ప్రక్కనే ఉంటాడో ఆ పార్ష్ణిగ్రాహుడు అధికలాభం పొందుతాడు. పార్శ్వస్థాయి (ప్రక్కనే ఉన్న పార్ష్ణిగ్రాహుడు) యాతవ్యునికి సహాయం చేయకలుగుతాడు. శత్రువుయొక్క మూలబలాన్ని కూడా బాధించ కలుగుతాడు. వెనక ఉన్నవాడు మూలబలాన్ని మాత్రమే బాధించకలుగుతాడు.

శ్లో. పార్ష్ణిగ్రాహాస్త్రయో జ్ఞేయాః శత్రోశ్చేష్టానిరోధకాః,
సామన్తాః పృష్ఠతో వర్గప్రతివేశౌ చ పార్శ్వయోః.
అరేర్నేతుశ్చ మధ్యస్థో దుర్బలోఽన్తర్ధిరుచ్యతే,
ప్రతిఘాతో బలవతో దుర్గాటవ్యపసారవాన్.

వ్యా. సరిహద్దులలో ఉన్నవాళ్లు, వెనక ఉన్నవాళ్లు, రెండు ప్రక్కల ఉన్నవాళ్లు అని మూడు విధాలైన పార్ష్ణిగ్రాహులుంటారు. వాళ్లు శత్రువుయొక్క పనులకు అడ్డు తగులుతూ ఉంటారు.

శత్రువుకు నాయకునికి (విజగీషువుకు) మధ్యలో ఉన్న దుర్బలుడైన రాజుకు అంతర్ధి అని పేరు. అతనికి పారిపోవడానికి దుర్గం, అడవి ఉన్నట్లయితే అతడు బలవంతునకు అడ్డు తగులుతూ ఉంటాడు.

మూ. మధ్యమం త్వరివిజిగీష్వోర్లిప్సమానయోః మధ్యమస్య పార్ష్ణిం గృహ్ణతోః లబ్ధలాభాపగమనే యో మధ్యమం మిత్రాత్ వియోజయతి, అమిత్రం చ మిత్రమాప్నోతి సోఽతిసంధత్తే. సంధేయశ్చ శత్రుః ఉపకుర్వాణః; న మిత్రం మిత్రభావాదుత్క్రాన్తమ్.

2. తేనోదాసీనలిప్సా వ్యాఖ్యాతా.

3. "పార్ష్ణిగ్రహణాభియానయోస్తు మన్త్రయుద్ధాదభ్యుచ్చయః. వ్యాయామయుద్ధే హి క్షయవ్యయాభ్యాముభయోరవృద్ధిః. జిత్వాపి హి క్షీణదణ్డకోశః పరాజితో భవతి" ఇత్యాచార్యాః.

4. నేతి కౌటల్యః. సుమహతాపి క్షయవ్యయేన శత్రువినాశః అభ్యుపగన్తవ్యః.

వ్యా. 1. అరి, విజిగీషువూ కూడ మధ్యముణ్ణి పొందాలని (వశం చేసుకోవాలని) అనుకుంటూండగా ఆ మధ్యముడు మరొక శత్రువుతో యుద్ధానికి వెళ్లగా ఈ అరివిజిగీషువు లిద్దరూ వాని పార్ష్ణిగ్రహణం చేస్తారు. మధ్యముడు లాభం పొంది వెనుకకు మరలిపోయినప్పుడు పార్ష్ణిగ్రహణం చేసిన ఇద్దరిలో ఎవడు మధ్యముణ్ణి మిత్రునినుండి (పార్ష్ణిగ్రహణం చేసిన అరి-విజిగీషువులలో ఒకడు మధ్యముని మిత్రుడు, మరొకడు శత్రువు) దూరం చేస్తాడో, అమిత్రుణ్ణి మిత్రుణ్ణిగా పొందుతాడో (చేసికొంటాడో) అతడు అధికలాభం పొందుతాడు. ఎందువల్ల ననగా శత్రువైనా, అతడు ఉపకారం చేస్తే అతనితో సంధి చేసికొనవచ్చు. మిత్రత్వాన్ని విడచి శత్రువు వలె ప్రవర్తించిన మిత్రునితో సంధి చేసికొనడం కుదరదు.

దీని భావం ఇది- ఒక మధ్యముణ్ణి వశంచేసుకోవా లని విజిగీషువు, వాని శత్రువూ కూడ ఆలోచిస్తున్నారు. వీళ్లలో ఒకడు మధ్యమునికి మిత్రుడు; ఒకడు శత్రువు. ఇలా ఉండగా మధ్యముడు మరొక మూడవ రాజుతో యుద్ధానికి వెళ్లి నప్పుడు విజిగీషువు, అరీ కూడ వాని పార్ష్ణిగ్రహణం చేశారు. మధ్యముడు తన పని పూర్తి చేసికొని తిరిగి వచ్చాడు. అప్పుడు పార్ష్ణిగ్రహణం చేసిన ఇద్దరిలో మధ్యమునితో పూర్వంనుండీ శత్రుత్వం ఉన్నవాడు ఆ మధ్యమునితో సంధి చేసికొని మిత్రు డవడం మంచిది. శత్రుత్వం ఉన్నా కూడ ఏదైన ఉపకారం చేస్తే మిత్రుడు కావచ్చు. కాని మిత్రుడ నని చెప్పుకొంటూ పార్ష్ణిగ్రహణం చేసినవానిని మధ్యముడు నమ్మడు గాన వానితో మైత్రి చెడిపోయినట్లే.

2. మధ్యమలిప్స విషయంలో చెప్పినది ఉదాసీనలిప్స (ఉదాసీనుణ్ణి స్వాధీనం చేసుకోవాలనే కోరిక) విషయంలో కూడ వర్తిస్తుంది.

3. "పార్ష్ణిగ్రహణం చేసినా, యుద్ధయాత్ర చేసినా కూడ ముందు మంత్ర యుద్ధం (రాజకీయవిషయ చర్చలద్వారా Deplomatic fight) చేయడం అధికఫలప్రదం. ఎందువల్ల ననగా వ్యాయామయుద్ధంలో (సైన్యంతో చేసే యుద్ధంలో) క్షయవ్యయాలు కలగడంవల్ల రెండు పక్షాలవారికీ కూడ నష్టం కలుగుతుంది. జయం లభించినా కూడ దండ-కోశాలు రెండూ క్షీణించిన రాజు ఓడిపోయినట్లే" అని ప్రాచీనాచార్యు లన్నారు.

4. అది యుక్తం కాదు, క్షయవ్యయాలు ఎంత అధికంగా జరిగినా కూడ ఏదో విధంగా శత్రువినాశం చేయడం అవసరం అని కౌటల్యు డంటాడు.

మూ. 1. తుల్యే క్షయవ్యయే యః పురస్తాద్ దూష్యబలం ఘాతయిత్వా నిఃశఙ్కః పశ్చాద్ వశ్యబలేన యుధ్యేత, సోఽతిసంధత్తే.

2. ద్వయోరపి పురస్తాద్దూష్యబలప్రతిఘాతినోః యః బహులతరం శక్తిమత్తరమత్యన్తదూష్యం ఘాతయేత్ సోఽతిసంధత్తే.

3. తేనామిత్రాటవీబలఘాతో వ్యాఖ్యాతః.

వ్యా. 1. క్షయవ్యయాలు ఇద్దరు రాజులకీ సమంగానే ఉన్నప్పుడు ఎవడు ముందుగా దూష్యబలాన్ని (రాజభక్తి లేని సైన్యాన్ని) ముందుగా చంపించి తరవాత ఏ బాధా లేకుండా వశ్యబలంతో (తన చెప్పుచేతలలో ఉన్న సైన్యంతో) యుద్ధం చేస్తాడో అతడు అధికలాభం పొందుతాడు.

2. ఇద్దరూ కూడ ముందుగా దూష్యబలాన్ని నశింపచేసినప్పుడు వాళ్లిద్దరిలో ఎవడు చాలా బలం గలది, అత్యంతము దూష్యము అయిన సైన్యాన్ని అధికంగా నశింపచేస్తాడో అతడు అధికలాభం పొందినవా డవుతాడు.

3. దీనిచేత అమిత్రబల-అటవీసైన్యాల విషయం కూడ వివరించినట్లే; అనగా ముందుగా శత్రువు దగ్గరనుండి తీసికొన్న సైన్యాన్నీ, ఆటవికసైన్యాన్నీ యుద్ధంలోనికి దింపి వాళ్లు నశించిన తరవాత రాజభక్తులుగా ఉండే సైనికులను ప్రయోగించాలి అని అర్థం.

శ్లో. పార్ష్ణిగ్రాహోఽభియోక్తా వా యాతవ్యో వా యదా భవేత్,
విజిగీషుస్తదా తత్ర నైత్రమేతత్ సమాచరేత్.

వ్యా. విజిగీషువు పార్ష్ణిగ్రాహుడుగా గాని, అభియోక్తగా (దాడి చేసేవాడుగా) గాని, యాతవ్యడుగా (ఇతరులు తనమీదికి యుద్ధానికి వచ్చేవాడుగా) గాని అయినప్పుడు ఈ క్రింద చెప్పబోయే విధంగా నైత్రం (నాయకత్వం) వహించాలి.

శ్లో. పార్ష్ణిగ్రాహో భవేన్నేతా శత్రోర్మిత్రాభియోగినః,
విగ్రాహ్య పూర్వమాక్రన్దం పార్ష్ణిగ్రాహాభిసారిణా.

వ్యా. నాయకుడు (అనగా పార్ష్ణిగ్రాహుడుగా అయిన విజిగీషువు) ఎవరైన శత్రువు తన మిత్రుని మీదికి దండెత్తి వచ్చినప్పుడు , ముందుగా ఆక్రందునికి (శత్రువు వెనుక ఉన్న మిత్రునికి) పార్ష్ణిగ్రాహాసారునితో (అనగా పార్ష్ణిగ్రాహుడుగా అయిన తన మిత్రునితో) విరోధం కల్పించి తాను తన మిత్రునిమీదికి దండెత్తివచ్చిన శత్రువుకు పార్ష్ణిగ్రాహుడు కావాలి.

శ్లో. ఆక్రన్దేనాభియుఞ్జానః పార్ష్ణిగ్రాహం నివారయేత్,
తథాక్రన్దాభిసారేణ పార్ష్ణిగ్రాహాభిసారిణమ్.

వ్యా. తాను దండెత్తి శత్రువుమీదికి వెళ్లుచున్న విజిగీషువు తన పార్ష్ణిగ్రాహుణ్ణి ఆక్రందుడు (తన వెనుక ఉన్న మిత్రుడు) అడ్డుకొనే టట్లు చేసుకోవాలి. అట్లే పార్ష్ణిగ్రాహాభిసారుణ్ణి (పార్ష్ణిగ్రాహుని మిత్రుణ్ణి), ఆక్రందాభిసారుడు (తన వెనుక ఉన్న మిత్రుని మిత్రుడు) అడ్డుకొనే టట్లు ఏర్పాటు చేసుకోవాలి. ఇది వెనుకభాగంలో చేసుకొవలసిన రక్షణ విధానం.

శ్లో. అరిమిత్రేణ మిత్రం చ పురస్తాదవఘట్టయేత్,
మిత్రమిత్రమరేశ్చాపి మిత్రమిత్రేణ వారయేత్.

వ్యా. అట్లే ముందుభాగంలో తన మిత్రుడు శత్రువుయొక్క మిత్రుణ్ణి ఎదుర్కొనే టట్లు చెయ్యాలి. అట్లే శత్రువుయొక్క మిత్రుని మిత్రుణ్ణి తన మిత్రుని మిత్రుడు అడ్డుకొనే టట్లు చెయ్యాలి. ఇది ముందు భాగంలో ఏర్పరచుకొనవలసిన రక్షణ.

శ్లో. మిత్రేణ గ్రాహయేత్ పార్ష్ణిమభియుక్తోఽభియోగినః,
మిత్రమిత్రేణ చాక్రన్దం పార్ష్ణిగ్రాహాన్నివారయేత్.

వ్యా. తాను అభియుక్తు డైనప్పుడు (తనను శత్రువు ఆక్రమించడానికి వచ్చినప్పుడు) అభియోగిని (దండెత్తివచ్చినవానిని) తన మిత్రునిచేత పట్టించాలి. ఆక్రందుణ్ణి (అభియోగి వెనుక ఉన్నవాని మిత్రుణ్ణి) అతడు శత్రువుయొక్క పార్ష్ణిగ్రాహుణ్ణి బాధించకుండా ఉంటే టట్లు, తన మిత్రుని మిత్రునిచేత అనగా పార్ష్ణిగ్రాహాసారునిచేత, అడ్డగింపచెయ్యాలి.

శ్లో. ఏవం మణ్డలమాత్మార్థం విజిగీషుర్నివేశయేత్,
పృష్ఠతశ్చ పురస్తాచ్చ మిత్రప్రకృతిసంపదా.

వ్యా. విజిగీషువు ఈ విధంగా మిత్రసంపదతోను ప్రకృతిసంపదతోను కూడిన మండలాన్ని తన ప్రయోజనం సాధించుకొనడంకొరకు తన వెనుక ముందూ కూడ ఉండే టట్లు ఏర్పరచుకోవాలి.

శ్లో. కృత్స్నే చ మణ్డలే నిత్యం దూతాన్ గూఢాంశ్చ వాసయేత్,
మిత్రభూతః సపత్నానాం హత్వా హత్వా చ సంవృతః.

వ్యా. విజిగీషువు సమస్తమండలంలోను కూడ రహస్యంగా పని చేసే దూతలను ఏర్పరచుకోవాలి. శత్రువులకు పైకి మిత్రుడు వలె కనబడుతూ, అవకాశం వచ్చినప్పుడల్లా వాళ్లని హింసిస్తూ పైకి మాత్రం ఏమీ కనబడకుండా ఉండాలి.

శ్లో. అసంవృతస్య కార్యాణి ప్రాప్తాన్యపి విశేషతః,
నిఃసంశయం విపద్యన్తే భిన్నప్లవ ఇవోదధౌ.

ఇతి కౌటలీయార్థశాస్త్రే షాడ్గుణ్యే సప్తమాధికరణే త్రయోదశోఽధ్యాయః
పార్ష్ణిగ్రాహచిన్తా, అదితః ఏకాదశోత్తరశతతమః.

వ్యా. తాను చేయదలచిన లేదా చేసిన ప్రతి కార్యమూ బట్టబయలు చేసుకొనే రాజు ఎంత విశిష్టములైన కార్యాలు సాధించినా అవన్నీ బీటలు తీసిన ఓడ సముద్రంలో మునిగి పోయి నట్లు, చెడిపోతాయి; ఏ మాత్రం సంశయం లేదు.

"బాలానందిని" అను కౌటలీయార్థశాస్త్రాంధ్రవ్యాఖ్యానంలో, షాడ్గుణ్యం అనే సప్తమాధికరణంలో పార్ష్ణిగ్రాహచింత అను పదమూడవ అధ్యాయం, ప్రారంభంనుంచి నూటపదకొండవ అధ్యాయం సమాప్తం.

# అథ చతుర్దశోఽధ్యాయః

## అష్టాదశశతతమం ప్రకరణమ్ - హీనశక్తిపూరణమ్

(తగ్గిన శక్తిని మళ్లీ నింపుకోవడం)

మూ. 1. సామవాయికైరేవమభియుక్తో విజిగీషుః య స్తేషాం ప్రధానః తం బ్రూయాత్- "త్వయా మే సంధిః; ఇదం హిరణ్యమ్, ఇదం చ మిత్రమ్. ద్విగుణా తే వృద్ధిః. నార్హస్యాత్మక్షయేణ మిత్రముఖానమిత్రాన్ వర్ధయితుమ్. ఏతే హి వృద్ధాస్త్వామేవ పరిభవిష్యన్తి".

2. భేదం వా బ్రూయాత్- "అనపకారో యథాహమేతైః సంభూయాభియుక్తః తథా త్వామప్యేతే సంహితబలాః స్వస్థాః వ్యసనే వాభియోక్ష్యన్తే. బలం హి చిత్తం వికరోతి. తదేషాం విఘాతయ" ఇతి.

వ్యా. 1. ఒక శత్రువు దండెత్తి వచ్చినట్లే సామవాయికులు (కలిసిన కొందరు

శత్రువులు) తనమీదికి దండెత్తి వచ్చినప్పుడు విజిగీషువు వాళ్లలో ప్రధానుడైన రాజుతో ఇలా చెప్పాలి- "నువ్వూ నేనూ సంధి చేసుకుందాం. ఇదిగో ఈ ధనం ఇస్తాను. ఇదిగో వీళ్లందరూ, నేనూ కూడ నీ మిత్రులం అవుతాం. ఈ విధంగా ధనలాభ-మిత్రలాభాల వల్ల నీకు రెట్టింపు అభివృద్ధి కలుగుతుంది. నీకు క్షయం కలిగేటట్లు (నష్టం వచ్చే టట్లు) చేసికొని పైకి మిత్రుల మని చెప్పుకొనే ఈ అమిత్రులకు అభివృద్ధి కలిగించడం మంచిది కాదు. వీళ్లందరూ అభివృద్ధిలోనికి వచ్చిన తరవాత నిన్నే తిరస్కరిస్తారు".

2. లేదా భేదం కలిగించే మాటలు చెప్పాలి- "వీళ్లందరూ కలిసి, ఏ అపకారమూ చేయని నా మీదికి యుద్ధానికి వచ్చినట్లే, ఈ యుద్ధం పూర్తి చేసికొని, స్వస్థులై, సైన్యాలు కూడగట్టుకొని నీమీదికి కూడ యుద్ధానికి వస్తారు. లేదా నీకు ఏదైనా ఆపద కలిగినప్పుడు దండెత్తి వచ్చి పీడిస్తారు. ఎందువల్ల ననగా బలం పెరగడంతో చిత్తం వికారం చెందుతుంది. అందుచేత వీళ్ల ఈ బలం తగ్గిపోయే టట్లు చెయ్యి.

మూ. 1. భిన్నేషు ప్రధానముపగృహ్య హీనేషు విక్రమయేత్. హీనాననుగ్రాహ్య వా ప్రధానే. యథా వా శ్రేయోఽభిమన్యేత తథా. వైరం వా పరైః గ్రాహయిత్వా విసంవాదయేత్.

2. ఫలభూయస్త్వేన వా ప్రధానముపజాప్య సంధిం కారయేత్. అథ ఉభయవేతనాః ఫలభూయస్త్వం దర్శయన్తః సామవాయికాన్ "అతిసంహితాః స్థ" ఇత్యుద్ఘోషయేయుః. దుష్టేషు సంధిం దూషయేత్. అథ ఉభయవేతనాః భూయః భేదమేషాం కుర్యుః-"ఏవం తద్ యదస్మాభిర్దర్శితమ్" ఇతి. భిన్నేష్వన్యతమోపగ్రహేణ వా చేష్టేత.

వ్యా. 1. పైన చెప్పిన విధంగా వాళ్లలో భేదభావం కలిగించగా వాళ్లు విడిపోయినప్పుడు వాళ్లల్లో ప్రధానుణ్ణి స్వీకరించి (వాని పక్షం చేరి) హీనుల విషయంలో పరాక్రమించాలి. లేదా హీనుల నందరినీ అనుగ్రహింపచేసికొని (తన వైపు త్రిప్పుకొని) ప్రధానునిమీద తిరగబడాలి. ఎలా చేస్తే శ్రేయస్కరంగా ఉంటుం దని తోస్తుందో అలా చెయ్యాలి. లేదా ఆ శత్రువులలో పరస్పరం వైరం పుట్టించి ఒకరితో ఒకరికి పడకుండా ఉంటేటట్లు చెయ్యాలి.

2. లేదా ప్రధానునికి అత్యధికమైన ధనాదికం ఇస్తా నని ఆతనిని ఇతరుల నుండి వేరుచేసి అతని ద్వారా ఇతరులతో సంధి చేసుకోవాలి. సంధి చేసుకొన్న తరవాత ఉభయవేతనులు (విజిగీషువు పక్షానికి చెందినవారై ఉండి శత్రువుల పక్షంలో కూడ

ఉన్నట్లు అభినయిస్తూ రెండు పక్షాలనుండీ ధనం తీసుకొనే వాళ్లు) "అతనికి అత్యధికమైన ఫలం లభించింది; మీరు మోసగింపబడ్డారు" అని సామవాయికులకు చెప్పి వాళ్లను దూషింపచెయ్యాలి. (సంధిని విఘటించే టట్లు చెయ్యాలి). వాళ్ల మనస్సులను ఆ విధంగా చెడగొట్టిన తరవాత సామవాయికులలోని కొందరు దుష్టులైనారు అనే వంకమీద విజిగీషువు తాను ప్రధానుని ద్వారా చేసుకొన్న సంధి విఘటితం చెయ్యాలి. తరవాత ఉభయవేతనులు- "చూచారా! మేం ముందుగానే చెప్పి ఉన్నాం' ' అని అంటూ మళ్లీ సామవాయికులలో భేదం కల్పించాలి. ఈ విధంగా వాళ్లు భిన్నులైనప్పుడు వాళ్లలో కొందరి పక్షాన జేరి పని చెయ్యాలి; అనగా ఇతరులను లొంగదీసుకోవాలి.

మూ. 1. ప్రధానాభావే సామవాయికానాముత్సాహయితారం, స్థిరకర్మాణమ్, అనురక్తప్రకృతిం లోభాద్ భయాద్వా సంఘాతముపగతం, విజిగీషోర్భీతం రాజ్యప్రతిసంబన్ధం మిత్రం, చలామిత్రం వా పూర్వానుత్తరాభావే సాధయేత్.

2. ఉత్సాహయితారమాత్మనిసర్గేణ, స్థిరకర్మాణం సాన్త్వప్రణిపాతేన, అనురక్తప్రకృతిం కన్యాదానయాపనాభ్యాం, లుబ్ధమంశద్వైగుణ్యేన, భీతమేభ్యః కోశదణ్డానుగ్రహేణ, స్వతోభీతం విశ్వాస్య ప్రతిభూప్రధానేన, రాజ్యప్రతిసమ్బన్ధమ్ ఏకీభావోపగమనేన, మిత్రముభయతః ప్రియహితాభ్యాముపకారత్యాగేన వా చలామిత్రమవధృతమనపకారోపకారాభ్యామ్.

వ్యా. 1. ఆ సామవాయికులలో ప్రధాను డనేవాడు లేకపోతే వాళ్లలో ప్రోత్సహించేవానిని, స్థిరకర్మను (చివరిదాకా ప్రయత్నం విడవనివానిని), అనురాగంతో కూడిన ప్రకృతులు కలవానిని, లోభంచేత ఈ సమవాయంలో చేరినవానిని, భయంవల్ల సమవాయంలో చేరినవానిని, విజిగీషువుకు భయపడినవానిని, రాజ్యం సరిహద్దులలో ఉన్నవానిని, మిత్రుణ్ణి, లేదా చలామిత్రుణ్ణి-వీళ్లలో ఉత్తరుడు లేకపోతే పూర్వుణ్ణి వశం చేసుకోవాలి. అనగా ఉత్సాహయిత, స్థిరకర్మ అనేవాళ్లలో స్థిరకర్మ లేకపోతే ఉత్సాహయితను, అనురక్తప్రకృతి లేకపోతే స్థిరకర్మను ఈ విధంగా వశం చేసుకోవాలి.

2. ఉత్సాహయితను ఆత్మనిసర్గంచేత (నన్ను నీ ఇష్టం వచ్చినట్లు ఉపయోగించుకో అని చెప్పడంచేత), స్థిరకర్మను మంచి మాటలు చెప్పి వంగి ఉండడంచేత, అనురక్తప్రకృతిని కన్యలను ఇచ్చిపుచ్చుకోవడాలచేత, లుబ్ధుణ్ణి రెట్టింపు వాటా ఇస్తా నని చెప్పడంచేత, సామవాయికులకు భయపడి వాళ్లలో చేరినవానిని కోశ

దండాలు ఇవ్వడంచేత, తనకు భయపడినవానిని నమ్మదగిన జామీను ఇవ్వడంచేత, రాజ్యం ప్రక్కన ఉన్నవానిని వానితో కలిసిపోతా నని చెప్పడం చేత, మిత్రుణ్ణి మన ఇద్దరి ప్రియహితాలు ఒకరివాటితో మరొకరివి ముడివడి ఉన్నాయి అని చెప్పడంచేత, లేదా ఉపకారత్యాగంచేత (వానినుండి రావలసిన ధనాదికం తీసికొనకుండా ఉండడంచేత), చలామిత్రుణ్ణి (కోటలేని అమిత్రుణ్ణి) నీకు నేను గాని నాకు నువ్వు గాని ఉపకారాపకారాలు చేసుకోవడం ఉండగూడదు అని గట్టిగా చెప్పడంచేత వశం చేసుకోవాలి.

మూ. 1. యో వా యథాఽయోగం భజేత తం తథా సాధయేత్. సామ దానభేదదణ్డైర్వా, యథాపత్సు వ్యాఖ్యాస్యామః.

2. వ్యసనోపఘాతత్వరితో వా కోశదణ్డాభ్యాం దేశే కాలే కార్యే వా అవధృతం సంధిముపేయాత్. కృతసంధిః హీనమాత్మానం ప్రతికుర్వీత.

3. పక్షే హీనః బన్ధుమిత్రపక్షం కుర్వీత; దుర్గమవిషహ్యం వా. దుర్గమిత్రప్రతిస్తబ్ధో హి స్వేషాం పరేషాం చ పూజ్యో భవతి.

4. మన్త్రశక్తిహీనః ప్రాజ్ఞపురుషోపచయం విద్యావృద్ధసంయోగం వా కుర్వీత. తథా హి సద్యః శ్రేయః ప్రాప్నోతి.

5. ప్రభావహీనః ప్రకృతియోగక్షేమసిద్ధౌ యతేత. జనపదః సర్వకర్మణాం యోనిః. తతః ప్రభావః.

6. తస్య స్థానమాత్మనశ్చ ఆపది దుర్గమ్.

7. సేతుబన్ధః సస్యానాం యోనిః. నిత్యానుషక్తో హి వర్షగుణలాభః సేతువాపేషు.

వ్యా. 1. ఏ సామవాయికుడు ఏ ఉపాయం అవలంబించడంచేత మిగిలిన సమవాయులనుండి విడిపోతాడో ఆ ఉపాయం ప్రయోగించి వానిని వశం చేసుకోవాలి. అభియాస్యత్కర్మాధికరణంలో ఆపత్ప్రకరణంలో వివరించనున్న విధంగా సామ దాన-భేద-దండోపాయాలచేత నైనా వశం చేసుకోవాలి.

2. వచ్చిపడిన ఆపదలకు ప్రతిక్రియ చేసుకోవా లనే తొందర ఉంటే ఫలానా దేశంలో ఫలానా కాలంలో కార్యం నిమిత్తం కోశదండాలు ఇస్తాను అని సామవాయికులతో సంధి చేసుకోవాలి. ఈ విధంగా సంధి చేసుకోవడం చేత హీనుడైన తనకు (తనకు కలిగిన హీనత్వానికి) ప్రతిక్రియ చేసుకోవాలి.

3. పక్షంలో హీనుడైనవాడు (సహాయం చేసేవాళ్లు ఎవరూ లేనివాడు) బంధుపక్షాన్ని మిత్రపక్షాన్ని ఆకట్టుకోవాలి. లేదా ఎదిరింప శక్యం కాని దుర్గం నిర్మించుకోవాలి. ఎందువల్ల ననగా దుర్గంచేత మిత్రులచేత ప్రతిస్తబ్ధుడు (కాపు ఇవ్వబడినవాడు Supported) తనవాళ్లచేత ఇతరుల (శత్రువుల) చేతా కూడ పూజించబడతాడు.

4. మంత్రశక్తి (ఆలోచనాశక్తి) కొరవడినవాడు బుద్ధిమంతులైన పురుషులను తగు స్థానాలలో నియమించాలి; విద్యచేత వృద్ధులైనవాళ్ల సహవాసం చెయ్యాలి. ఆ విధంగా చేస్తే వెంటనే శ్రేయస్సు లభిస్తుంది.

5. ప్రభావం తగ్గినవాడు ప్రకృతులకు యోగక్షేమాలు సమకూర్చడానికి ప్రయత్నించాలి. దుర్గనిర్మాణాదిసమస్తకర్మలకీ మూలకారణం దేశం. కర్మలవల్ల ప్రభావం పెరుగుతుంది.

6. ప్రభావానికి స్థానం దుర్గం. ఆపత్సమయాలలో తనకు స్థానం కూడ దుర్గమే.

7. సేతుబంధం (ఆనకట్ట కట్టించడం) సస్యాలకు మూలకారణం. సేతువుల సహాయంతో జరిగే బీజావాపాలకు వర్షంవల్ల ఏ లాభం కలుగుతోందో ఆ లాభం నిత్యమూ అవిచ్ఛిన్నంగా లభిస్తుంది కదా?

మూ. 1. వణిక్పథః పరాతిసంధానస్య యోనిః. వణిక్పథేన హి దణ్డగూఢపురుషాతినయనం శస్త్రావరణయానవాహనక్రయశ్చ క్రియతే.ప్రవేశో నిర్ణయనం చ.

2. ఖనిః సంగ్రామోపకరణానాం యోనిః.

3. ద్రవ్యవనం దుర్గకర్మణాం యానరథయోశ్చ.

4. హస్తివనం హస్తినామ్.

5. గజాశ్వఖరోష్ట్రాణాంచ వ్రజః.

6. తేషామలాభే బన్ధుమిత్రకులేభ్యః సమార్జనమ్.

7. ఉత్సాహహీనః శ్రేణీప్రవీరపురుషాణాం చోరగణాటవికమ్లేచ్ఛ జాతీనాం పరాపకారిణాం గూఢపురుషాణాం చ యథాలాభముపచయం కుర్వీత.

8. పరమిత్రః ప్రతీకారమ్ ఆబలీయసం వా పరేషు ప్రయుఞ్జీత.

వ్యా. 1. వణిక్పథం (వర్తకం మార్గం) శత్రువులను వంచించడానికి ప్రధానోపాయం. ఎందువల్ల ననగా వణిక్పథం ద్వారా సైనికుల్ని, సత్రి-తీక్ష్ణాదులైన గూఢపురుషుల్ని శత్రురాజ్యంలోనికి పంపడం, ఆయుధాలు, కవచాలు, బళ్లు, వాహనాలు(అశ్వాదులు) వీటి కొనుగోలు జరుగుతాయి. దీని ద్వారా రాకపోకలు జరుగుతూంటాయి.

2. గని యుద్ధసాధనాలకు మూలకారణం.

3. ద్రవ్యవనం (అనేక విధాలైన మంచికఱ్ఱలు మొదలైన వస్తువులు లభించే వనం) దుర్గాలకి సంబంధించిన కర్మలకు,బండ్లకు, రథాలకు మూలకారణం.

4. హస్తివనం ఏనుగులు లభించడానికి మూలకారణం.

5. వ్రజం (గోష్ఠం) ఏనుగులకు, గుఱ్ఱాలకు, గాడిదలకు, ఒంటెలకు మూలస్థానం.

6. పైన చెప్పిన గనులు మొదలైనవి లభించకపోతే బంధువుల ఇండ్లనుండి, మిత్రుల ఇండ్లనుండీ సంపాదించుకోవాలి.

7. ఉత్సాహశక్తి కొరవడినవాడు శ్రేణులలోని (కొన్ని సంఘాలకు సంబంధించిన) పురుషులను, శూరులను, చోరగణాలను, ఆటవికులను, మ్లేచ్ఛజాతులకు చెందినవాళ్లను, శత్రువుకు అపకారం చేయగలిగిన గూఢపురుషులను- ఎవరు దొరికితే వాళ్లను, దగ్గరకు చేర్చుకొని వృద్ధి పొందించాలి.

8. సంధి చేసికొని శత్రువుతో కలిసినవాడు శత్రువుల విషయంలో తగు ప్రతిక్రియను, లేదా ఆబలీయసాధికరణంలో చెప్పబోవు ప్రతిక్రియను చేసుకోవాలి.

శ్లో. ఏవం పక్షేణ మన్త్రేణ ద్రవ్యేణ చ బలేన చ,
సంపన్నః ప్రతినిర్గచ్ఛేత్ పరావగ్రహమాత్మనః.

ఇతి కౌటలీయార్థశాస్త్రే షాడ్గుణ్యే సప్తమాధికరణే చతుర్దశోఽధ్యాయః
హీనశక్తిపూరణమ్, ఆదితో ద్వాదశశతః.

వ్యా. ఈ విధంగా విజిగీషువు పక్షంచేత, మంత్రంచేత, ద్రవ్యంచేత, బలంచేత తనలో ఉన్న లోటును పూరించుకొని శత్రువులవల్ల తనకు కలిగిన పరాజయంనుంచి బైటపడాలి.

*"బాలానందిని" అను కౌటలీయార్థశాస్త్రాంధ్రవ్యాఖ్యానంలో, షాడ్గుణ్యం అనే సప్తమాధికరణంలో హీనశక్తిపూరణం అనే చతుర్దశాధ్యాయం, ప్రారంభంనుంచి నూటపన్నెండవ అధ్యాయం సమాప్తం.*

# అథ పఞ్చదశోఽధ్యాయః

## ఏకోనవింశతిశతతమం ప్రకరణమ్ - బలవతా విగృహ్య ఉపరోధహేతవః

## వింశతిశతతమం ప్రకరణమ్ - దణ్డోపనతవృత్తమ్

మూ. 1. దుర్బలో రాజా బలవతాభియుక్తః తద్విశిష్టబలమాశ్రయేత; యమితరో మన్త్రశక్త్యా నాతిసందధ్యాత్.

2. తుల్యబలమన్త్రశక్తీనామ్ ఆయత్తసంపదః వృద్ధసంయోగాద్వా విశేషః.

3. విశిష్టబలాభావే సమబలైః తుల్యబలసంఘైర్వా బలవతః సంభూయ తిష్ఠేత్, యాన్న మన్త్రప్రభావశక్తిభ్యామతిసందధ్యాత్.

4. తుల్యమన్త్రప్రభావశక్తీనాం విపులారమ్భతో విశేషః.

వ్యా. 1. బలవంతునిచేత అభియుక్తుడై (యుద్ధానికి ఎదిరింపబడిన) దుర్బలుడైన రాజు ఆ బలవంతునికంటె అధికబలం గలిగినవాడు, ఎవనినైతే అభియోక్త మంత్రశక్తిచేత మోసగించడో అట్టివాడు అయిన మరొక రాజును ఆశ్రయించాలి.

2. సమానమైన బలమూ, మంత్రశక్తీ కలవారు చాలమంది ఉన్నప్పుడు ఎవని దగ్గర మంచి అమాత్యాదిసంపద ఉంటుందో, ఎవనికి పెద్దలతో సాంగత్యం ఉంటుందో అలాంటివాడు విశేషం కలవాడు. అందుచేత అలాంటి విశేషం ఉన్న రాజును ఆశ్రయించాలి అని అర్థం.

3. అభియోక్తకంటె విశిష్టమైన బలం లేని పక్షంలో- ఏ రాజులు ఏ సంఘరాజ్యాలు బలవంతుడైన ఆ అభియోక్తతో సమానబలులో, ఎవరిని అతడు మంత్రప్రభావశక్తులచేత మోసగించడో లేదా మించజాలడో వాళ్లతో కలిసి ఉండాలి.

4. వాళ్లు మంత్రశక్తి-ప్రభుశక్తులు సమంగానే ఉన్నవాళ్లైతే ఎవరు విపులారంభం గలవారో (విస్తృతమైన కార్యనిర్వహణప్రయత్నం గలవారో) వాళ్లకు ఆ విపులారంభ ప్రయత్నత్వంవల్ల విశేషం; అనగా అలాంటి వాళ్లతో కలిసి ఉండాలి.

మూ. 1. సమబలాభావే హీనబలైః శుచిభిః, ఉత్సాహిభిః ప్రత్యనీకభూతైః

బలవతః సంభూయ తిష్ఠేత్. యాన్న మన్త్రప్రభావోత్సాహశక్తిభిః అతిసందధ్యాత్. తుల్యోత్సాహశక్తీనాం స్వయుద్ధభూమిలాభాద్విశేషః. తుల్యభూమీనాం స్వయుద్ధకాలలాభాద్విశేషః. తుల్యదేశకాలానాం యుగ్యశస్త్రావరణతో విశేషః.

2. తుల్యదుర్గాణాం నిచయాపసారతో విశేషః. నిచయాపసారసంపన్నం హి మనుష్యదుర్గమిచ్ఛేదితి కౌటల్యః.

వ్యా. 1. సమబలం కలవాళ్లు లేకపోతే, ఎవరి నైతే బలవంతుడైన అభియోక్త మంత్రప్రభావోత్సాహశక్తులచేత మించజాలడో అట్టి, నిజాయతీ ఉన్నవాళ్లు, ఉత్సాహవంతులు, ఆతనికి శత్రువులు అయిన (ఆతనికంటె) దుర్బలులైనవాళ్లతో కలిసి ఉండాలి. తుల్యమైన ఉత్సాహశక్తికలవాళ్లలో తనకు ఎవని ద్వారా యుద్ధం చేయడానికి అనువైన భూమి లభిస్తుందో దానిని పట్టి విశేషం. అనగా అతడు విశేషించి ఉపకారకారి అవుతాడు. అందరూ తుల్యమైన యుద్ధభూమి కలవారైతే ఎవనివల్ల తనకు యుద్ధం చేయడానికి తగిన కాలం లభిస్తుందో వానియందు అది (స్వయుద్ధకాలలాభం) విశేషం. అందరూ తుల్యమైన దేశకాలాలు కలవా రైనప్పుడు బండ్లులాగే పశువులు, ఆయుధాలు, కవచాలు ఉండడంవల్ల విశేషం.

2. సహాయు లెవరూ లేకపోతే - శత్రువు ఎంత అధికసైన్యం ఉన్నవాడైనా ఏ దుర్గంలోనికి ఆహారమూ, పశువుల ఆహారమూ, కట్టెలు, ఉదకమూ వీటి ప్రవేశాన్ని అడ్డుకొనజాలడో, తనకు క్షయవ్యయాలుకలగవో అలాంటి దుర్గం ఆశ్రయించాలి.

3. ఆశ్రయించడానికి తగిన (రెండు మూడు) దుర్గాలు సమానంగా ఉన్నప్పుడు ఏ దుర్గంలో సరుకులు నిలవ చేసుకోవడానికి ఎక్కువ అవకాశం ఉంటుందో, దేనినుంచి బైటకి వెళ్లే మార్గాలు ఉంటాయో అది విశిష్టమైనది. అందువల్ల నిచయాపసారములున్న మనుష్యదుర్గాన్ని (మనుష్యనివాసయోగ్యదుర్గాన్ని) ఆశ్రయించడంకోసం ప్రయత్నించాలి అని కౌటిల్యుడు అంటాడు.

మూ. 1. తదేభిః కారణైరాశ్రయేత- పార్ష్ణిగ్రాహమాసారం మధ్యమ ముదాసీనం వా ప్రతిపాదయిష్యామి. సామన్తాటవికతత్కులీనావరుద్ధానామ్ అన్యతమేన అస్య రాజ్యం హరిష్యామి, ఘాతయిష్యామి వా. కృత్య పక్షోపగ్రహేణ వా అస్య దుర్గే రాష్ట్రే స్కన్ధావారే వా కోపం సముత్థాపయిష్యామి. శస్త్రాగ్నిరసప్రణిధానైః ఔపనిషదికై ర్వా యథేష్ట మాసన్నం హనిష్యామి.

స్వయమధిష్ఠితేన వా యోగప్రణిధానేన క్షయవ్యయమేనమ్ ఉపనేష్యామి. క్షయవ్యయప్రవాసోపతప్తే వాస్య మిత్రవర్గే సైన్యే వా క్రమేణోపజాపం ప్రాప్స్యామి. వీవధాసారప్రసారవధేన వాస్య స్కన్ధావారావగ్రహం కరిష్యామి. దణ్డోపనయేన వాస్య రన్ధ్రముత్థాప్య సర్వసన్దోహేన ప్రహరిష్యామి. ప్రతిహతోత్సాహేన వా యథేష్టం సన్ధిమవాప్స్యామి. మయి ప్రతిబన్ధస్య వా సర్వతః కోపాః సముత్థాస్యన్తి. నిరాసారం వాస్యమూలం మిత్రాట వీదణ్డైరుద్ఘాతయిష్యామి. మహతో వా దేశస్య యోగక్షేమమిహస్థః పాలయిష్యామి. స్వవిక్షిప్తం మిత్రవిక్షిప్తం వా మే సైన్యమ్ ఇహస్థస్య ఏకస్థస్య అవిషహ్యం భవిష్యతి. నిమ్నఖాతరాత్రియుద్ధవిశారదం వా మే సైన్యం పథ్యాబాధముక్తమ్ ఆసన్నే కర్మణి కరిష్యతి. విరుద్ధదేశకాలమిహాగతో వా స్వయమేవ క్షయవ్యయాభ్యాం న భవిష్యతి. మహాక్షయవ్యయాభిగమ్యో ఽయం దేశః దుర్గాటవ్యపసారబాహుల్యాత్, పరేషాం వ్యాధిప్రాయః సైన్యవ్యాయామానాం అలబ్ధభౌమశ్చ తమాపద్గతః ప్రవేక్ష్యతి. ప్రవిష్టో వా న నిర్గమిష్యతి" ఇతి.

వ్యా. 1. క్రింద చెప్పబోయే ఈ కారణాలను బట్టి దుర్గాన్ని ఆశ్రయించాలి- "ఈ దుర్గాన్ని ఆశ్రయించి నేను పార్ష్ణిగ్రాహుణ్ణి గాని, మిత్రబలం గాని, మధ్యముణ్ణి గాని, ఉదాసీనుణ్ణి గాని నా వైపు త్రిప్పుకొంటాను; లేదా సామంతుడు (శత్రువు,సరిహద్దులోని రాజు), ఆటవికుల రాజు, ఆ శత్రువు కులానికి (వంశానికి చెందినవాడు), వాని ఆగ్రహానికి గురి అయిన రాజకుమారుడు-వీరిలో ఎవడైనా ఇతని రాజ్యాన్ని హరించేటట్లు, నశింపచేసే టట్లు చేస్తాను; లేదా వాని కృత్యపక్షాన్ని (వాని రాజ్యంలో కలతలు సృష్టించడంకోసం సిద్ధంగా ఉన్న రాజద్రోహుల్ని) చేరదీసి వాళ్ల ద్వారా వాని దుర్గంలో గాని, రాష్ట్రంలో గాని, సేనానివేశంలో గాని కోపం (తిరుగుబాటు) కలిగిస్తాను; ఆ శత్రువు దగ్గరికి వచ్చినప్పుడు వానిని శస్త్రాలచేత గాని, విషప్రయోగంచేత గాని, ఇతరరహస్యమార్గాలచేత గాని నా ఇష్టం వచ్చి నట్లు చంపివేస్తాను; లేదా నేనే స్వయంగా చేసిన రహస్యప్రయోగాలచేత వానికి క్షయ-వ్యయాలు కలిగే టట్లు చేస్తాను. లేదా క్షయ-వ్యయాలచేత, ప్రవాసంచేత (దూరదేశంలో ఉండడంచేత) విసిగి ఉన్న వీని

మిత్రవర్గంలో గాని, సైన్యంలోగాని మెల్లమెల్లగా ఉపజాపం (ఎదురుతిరిగే టట్లు కలతలు సృష్టించడం) చేయడానికి అవకాశం పొందకలుగుతాను; లేదా వీని వీవధాన్ని (ఆహారాదులు రావడాన్ని), ఆసారాన్నీ (నిల్వలను కాంగ్లే. మిత్రసైన్యం గ.శా.) ప్రసారాన్ని (గుఙ్గాలు మొదలైనవాటి ఆహారాన్ని) అడ్డుకొనడంచేత వీని సైన్యావాసాన్ని పీడిస్తాను; లేదా ముందుగా వాని సైన్యంలోనికి రహస్యంగా నా సైన్యం కొంత పంపి, దాని ద్వారా రంధ్రం (దుర్బలమైన ప్రదేశం Weak point) ఏర్పరచి, తరవాత మొత్తం సైన్యంతో ప్రవేశించి వానిని, సైన్యాన్నీ నశింపచేస్తాను; లేదా వాని ఉత్సాహం అంతా నశించిన తరవాత నా ఇష్టంవచ్చిన షరతులు పెట్టి సంధి చేసుకొంటాను; ఇతడు నాతో విరోధం కొనసాగిస్తూన్న సమయంలో వాని నలు వైపులా కోపాలు (తిరుగుబాట్లు) కలుగుతాయి; లేదా వాని మూలస్థానం ఆసారం (మిత్రసైన్యం గ.శా. నిలవలు కాంగ్లే) లేకుండా ఉన్నప్పుడు వానిని నా మిత్రసైన్యాలచేత గాని, ఆటవికసైన్యాలచేత గాని నశింపచేస్తాను, ఇక్కడ (ఈ కోటలో) ఉండి విశాలమైన నా దేశంయొక్క యోగక్షేమాలను పాలిస్తాను; లేదా నా పనిమీద గాని, మిత్రుల పనిమీద గాని ఇటూ అటూ వెళ్లి చెదిరి ఉన్న నా సైన్యాన్ని ఇక్కడ ఒక చోటకి చేరిస్తే దానిని ఎవ్వరూ ఎదిరించజాలరు; లేదా నిమ్నయుద్ధం (నీటిలో ఉండి యుద్ధం) చేయడంలోను, ఖాతయుద్ధం (సొరంగాలలో ఉండి యుద్ధం) చేయడంలోను, రాత్రియుద్ధంలోను నేర్పుగల నా సైన్యం మార్గంలో యుద్ధం కొరకై ప్రయాణం చేయవలసిన శ్రమలేనిదై సమీపంలోనే తాను చేయవలసిన పని చేయగలదు; లేదా విరుద్ధమైన దేశకాలాలలో ఇక్కడికి వచ్చిన నా శత్రువు క్షయవ్యయాలచేత తనంతట తానే నశిస్తాడు; లేదా ఈ దేశంలో దుర్గాలు, అడవులు, తప్పుకొని పారిపోయే మార్గాలు ఉండడంచేత ఇక్కడికి రావాలంటే చాలా క్షయవ్యయాలు కలుగుతాయి; లేదా ఈ ప్రదేశం ఇతర ప్రాంతాలనుండి వచ్చేవాళ్లకి అధికంగా వ్యాధులను కలిగిస్తుంది, అందుచేత దీనిలోనికి ప్రవేశించాడా ఆపదలలో చిక్కుకొంటాడు; ప్రవేశించినా క్షేమంగా తిరిగివెళ్లడు''. ఈ పదహారు కారణాలలో ఏ ఒక్కకారణం ఉన్నా దుర్గాన్ని ఆశ్రయించాలి అని అర్థం.

మూ. 1. కారణాభావే బలసముచ్ఛ్రయే వా పరస్య దుర్గమున్ముచ్య అపగచ్ఛేత్. అగ్నిపతఙ్గవదమిత్రే వా ప్రవిశేత్. అన్యతరసిద్ధిర్హి త్యక్తాత్మనః భవతీత్యాచార్యాః.

2. నేతి కౌటిల్యః. సంధేయతామాత్మనః పరస్య చోపలభ్య సందధీత. విపర్యయే విక్రమేణ సిద్ధిమ్ అపసారం వా లిప్సేత.

3. సంధేయస్య వా దూతం ప్రేషయేత్. తేన వా ప్రేషితమ్ అర్థ మానాభ్యాం సత్కృత్య బ్రూయాత్ - "ఇదం రాజ్ఞః పణ్యా గారమ్. ఇదం దేవీ కుమారాణామ్. దేవీకుమారవచనాద్ ఇదం రాజ్యమహం చ త్వదర్ప ణః' ' - ఇతి

వ్యా. 1. పైన చెప్పిన పదహారు కారణాలలో ఏ కారణమూ లేకపోయినా, శత్రుసైన్యం ప్రబలంగా ఉన్నా దుర్గం విడిచి వెళ్లిపోవాలి. లేదా అగ్నిలో మిడత పడి నట్లు శత్రుసైన్యం మధ్య దుమికి యథాశక్తిగా యుద్ధం చెయ్యాలి. ఈ విధంగా జీవితాన్ని లెక్కచేయక యుద్ధరంగంలో దిగినవానికి జయమో పరాజయమో కలుగుతుంది అని ఆచార్యు లన్నారు.

2. అది యుక్తం కాదంటాడు కౌటిల్యుడు. తాను శత్రువూ సంధేయులుగా (సంధి చేసికొనడానికి తగిన స్థితిలో) ఉన్నారా లేదా అనే విషయం చూచుకొని సంధి చేసికోవాలి. సంధేయత్వం లేని పక్షంలో పరాక్రమం చూపి కార్యసిద్ధి సాధించాలి; లేదా దూరంగా వెళ్లిపోవాలి.

3. ఇప్పుడు దండోపనతవృత్తం (దండంచేత శత్రువుకు లొంగిపోయినవాడు చేయవలసిన సంధివిధానం) చెపుతున్నాడు - లేదా సంధేయుని దగ్గరికి దూతను పంపాలి. లేదా అతడు పంపిన దూతను ధనమానాలచేత సత్కరించి - "ఇది మీ రాజుగారికి సమర్పించదగిన వివిధవస్తువులు ఉంచిన గృహం. ఇది మా దేవి, మా కుమారులు చెప్పిన ప్రకారం మీ రాజుగారి దేవీ కుమారులకు ఇవ్వవలసిన పణ్యాల అగారం. ఈ రాజ్యమూ నేనూ కూడా మీకు (మీ రాజుకు) అర్పించబడే వాళ్లమే" అని చెప్పాలి.

మూ. లబ్ధసంశ్రయః సమయాచారికవద్ భర్తరి వర్తేత. దుర్గాదీని చ కర్మాణి ఆవాహవివాహపుత్రాభిషేకాశ్వపణ్యహస్తిగ్రహణసత్రయాత్రా విహారగమనాని చ అనుజ్ఞాతః కుర్వీత. దుష్టపౌరజానపదో వా న్యాయవృత్తి రన్యాం భూమిం యాచేత. దూష్యవదుపాంశుదణ్డేన వా ప్రతికుర్వీత. ఉచితాం వా మిత్రాద్భూమిం దీయమానాం న ప్రతిగృహ్ణీయాత్. మన్త్రిపురోహితసేనాపతి యువరాజానామ్ అన్యతమమ్ అదృశ్యమానే భర్తరి పశ్యేత్. యథాశక్తి చోపకుర్యాత్. దైవతస్వస్తివాచనేషు తత్పరా ఆశిషో వాచయేత్. సర్వత్రాత్మనిసర్గం గుణం బ్రూయాత్.

వ్యా. ఈ విధంగా బలవంతునికి ఆత్మసమర్పణం చేసి అతనిని ఆశ్రయించినవాడు ఆ ప్రభువు విషయంలో సేవకధర్మానికి సంబంధించిన ఆచరణం అనుష్ఠించాలి. దుర్గనిర్మాణం మొదలైన పనులు ఆవాహ్యం (కన్యను స్వీకరించడం) వివాహం,) పుత్రునికి అభిషేకంచేయడం, అశ్వాలను అమ్మడం-కొనడం, ఏనుగులను పట్టుకొనడం, యాగాలు, యుద్ధయాత్ర, విహారయాత్ర మొదలైన వన్నీ అతని అనుజ్ఞపొందిన తరవాతనే చెయ్యాలి. న్యాయప్రవృత్తి గల రాజు తన రాజ్యంలోని పౌరులు జానపదులు చెడ్డవారుగా ఉంటే బలవంతుడైన ఆ రాజుదగ్గరికి వెళ్లి తనకు మరొక రాజ్యం ఇమ్మని కోరాలి. లేదా ఆ విధంగా యాచించకుండా తన రాజ్యంలోని దుష్టులను దూష్యులను (రాజద్రోహులను) వలె రహస్యదండనంచేత నశింపచేసి ప్రతిక్రియ చేసుకోవాలి. తగిన భూమియే (దుష్టపౌరజానపదులు లేనిదే) అయినా తన మిత్రునినుండి లాగికొని ఆ బలవంతుడు తన కిచ్చి నట్లయితే దానిని తీసికొనగూడదు. ప్రభువు దర్శనం కానప్పుడు అతని మంత్రి-పురోహిత-సేనాపతి-యువరాజులలో ఒకరిని ఎవరినైనా చూడాలి (ఎవరినైనా కలుస్తూ ఉండాలి). యథాశక్తిగా (వాళ్లతో మంచితనం చేసుకొనడంకొరకు) వాళ్లకు ఉపకారం చేస్తూండాలి. దేవతారాధనలలోను, స్వస్తివాచనాలలోను ఆ ప్రభువుకు మంచి కలగాలని ఆశీస్సులను చెప్పిస్తూండాలి. అన్ని పరిస్థితులలోను, తాను అతనికి లొంగిపోయి ఉండడాన్ని ఒక గుణంగానే చెపుతూ ఉండాలి (కాంగ్లే). అందరితోను తాను రాజుకు లొంగిపోయి నట్లు చెప్పుతూ అతని గుణాలు ప్రశంసిస్తూండాలి (గ.శా.)

శ్లో. సంయుక్తబలవత్సేవీ విరుద్ధః శఙ్కితాదిభిః,
వర్తేత దణ్డోపనతో భర్తర్యేవమవస్థితః.

*ఇతి కౌటలీయార్థశాస్త్రే షాడ్గుణ్యే సప్తమాధికరణే పఞ్చదశోఽధ్యాయః బలవతా విగృహ్యోపరోధహేతవః, దణ్డోపనతవృత్తమ్, ఆదితస్త్రయోదశతమః.*

వ్యా. ఈ విధంగా దండోపనతుడు (దండంచేత లొంగదీసికొనబడిన రాజు) ప్రభువుకు సంబంధించి మంత్రులు మొదలైన బలవంతులను సేవిస్తూ, ప్రభువుకు శంకితులు మొదలైనవాళ్లతో (అనగా అతనికి ప్రతికూలంగా ఉన్నవాళ్లతో) విరుద్ధుడుగా (ఏ సంబంధమూ పెట్టుకొననివాడుగా), ఉంటూ ప్రభువు విషయంలో ఈ విధంగా (పైన చెప్పిన విధంగా) మసలుకోవాలి.

"బాలానందిని" అను కౌటలీయార్థశాస్త్రాంధ్రవ్యాఖ్యానంలో షాడ్గుణ్యం అనే సప్తమాధికరణంలో బలవంతునితో విరోధం పెట్టుకొని ఎదురుతిరగడానికి హేతువులు, దండోపనతవృత్తమూ అను పదిహేనవ అధ్యాయం, ప్రారంభంనుంచి నూటపదమూడవ అధ్యాయం సమాప్తం.

# అథ షోడశోఽధ్యాయః

## ఏకవింశతితమం ప్రకరణమ్ - దణ్డోపనాయివృత్తమ్
## (బలంచేత శత్రువులను వశం చేసుకొనేవాని ప్రవృత్తి).

మూ. 1. అనుజ్ఞాతసంధిపణోద్వేగకరం బలవాన్ విజిగీషమాణః, యతః స్వభూమిః స్వర్తువృత్తిశ్చ స్వసైన్యానామ్ అదుర్గాపసారః శత్రుపార్ష్ణిః అనాసారశ్చ తతో యాయాత్. విపర్యయే కృతప్రతీకారో యాయాత్.

2. సామదానాభ్యాం దుర్బలానుపనమయేత్; భేదదణ్డాభ్యాం బలవతః.

3. నియోగవికల్పసముచ్చయైశ్చ ఉపాయానామ్ అనన్తరైకాన్తరాః ప్రకృతీః సాధయేత్.

4.గ్రామారణ్యోపజీవి వ్రజవణిక్పథానుపాలనమ్ ఉజ్ఝితాపసృత కారిణాం చార్పణమితి సాన్త్వమాచరేత్. భూమిద్రవ్యకన్యాదానమ భయస్య చేతి దానమాచరేత్.

5. సామన్తాటవికతత్కులీనావరుద్ధానామన్యతమోపగ్రహేణ కోశదణ్డ భూమిదాయయాచనమితి భేదమాచరేత్. ప్రకాశకూటతూష్ణీం యుద్ధదుర్గ లమ్భోపాయైః అమిత్రప్రగ్రహణమితి దణ్డమాచరేత్.

వ్యా. 1. ముందుగా చేసికొనబడిన సంధికి సంబంధించిన పణాన్ని (షరతులను) పాటించని రాజును జయించదలచిన బలవంతుడు ఏ వైపున తన భూమి లేదా అనుకూలమైన భూమి ఉంటుందో, తన సైన్యాలకు అనుకూలమైన కాలము, ఆహారాది సౌకర్యమూ ఉంటుందో, శత్రువునకు ఆశ్రయించదగిన దుర్గం గాని, వెనుకనుండి రక్షణ గాని, మిత్రసాహాయ్యం గాని ఉండవో ఆ మార్గాన దండెత్తి వెళ్లాలి.

పరిస్థితులు ఇందుకు విపరీతంగా ఉంటే ముందుగానే వాటికి తగిన ప్రతిక్రియ చేసుకొని వెళ్లాలి.

2. దుర్బలులను సామదానాలచేత, బలవంతులను భేదదండాలచేత లొంగదీసుకోవాలి.

3. నియోగంచేత (వీని విషయంలో ఈ ఉపాయమే అవలంబించాలి అనే రీతిలోను) వికల్పంచేత (వీని విషయంలో ఈ ఉపాయం గాని ఆ ఉపాయం గాని ఉపయోగించవచ్చును అనే రీతిలోను) సముచ్చయంచేత (వీని విషయంలో ఈ ఉపాయమూ ఆ ఉపాయమూ కూడ ఉపయోగిస్తాయి అనే రీతిలోను) ఆయా మనుష్యులను పట్టి వేరు వేరు ఉపాయాలు (సామాదులు) ప్రయోగిస్తూ తన సరిహద్దులోను, సరిహద్దులోని రాజ్యానికి అవతలా ఉన్న ప్రకృతులను వశం చేసుకోవాలి.

3. గ్రామాలను అరణ్యాలను ఆధారంగా చేసికొని జీవించేవాళ్లకు, పశుస్థానాలకు, వాణిజ్యమార్గాలకు రక్షణ కల్పించడం, విడవబడినవాళ్లను, విడిచి వెళ్లిపోయిన వాళ్లను, అపకారం చేసినవాళ్లను పట్టి ఇవ్వడం - ఈ రీతిలో (దుర్బలుల విషయంలో) సామోపాయప్రయోగం చెయ్యాలి. భూమి, ద్రవ్యం, కన్యలు, అభయం వీటిని ఇవ్వడం అనే దానోపాయప్రయోగం చెయ్యాలి.

4. యాతవ్యుని సామంతులు, ఆటవికులు, రాజ్యాన్ని కోరే వాని వంశానికి చెందినవాళ్లు, నిగ్రహించబడిన వాని పుత్రాదులు - వీళ్లలో ఎవరినైనా వశం చేసికొని వాళ్ల పక్షాన కోశ-సైన్య-భూములు - రాజ్యంలో దాయం(వాటా) అడగడం అనే రీతిలో భేదోపాయం అవలంబించాలి. ప్రకాశయుద్ధం(బాహాటంగా చేసే యుద్ధం), కూటయుద్ధం (మోసంతో యుద్ధం చేయడం), తూష్ణీం యుద్ధం (పైకి కనబడకుండా చేసే యుద్ధం), దుర్గాన్ని వశం చేసుకొనే ఉపాయాలు - వీటి ద్వారా శత్రువును వశంచేసుకోవడం అనే దండోపాయాన్ని ప్రయోగించాలి.

మూ. 1. ఏవముత్సాహవతో దణ్డోపకారిణః స్థాపయేత్; స్వప్రభావతః కోశోపకారిణః, ప్రజ్ఞావతో భూమ్యుపకారిణః.

2. తేషాం పణ్యపత్తనగ్రామఖనిసంజాతేన రత్నసారఫల్గుకుప్యేన ద్రవ్యహస్తివనవ్రజసముత్థేన యానవాహనేన వా యద్ బహుశ ఉపకరోతి తత్ చిత్రభోగం, యద్ దణ్డేన కోశేన వా మహదుపకరోతి తన్మహాభోగం, యద్ దణ్డకోశభూమీరుపకరోతి తత్ సర్వభోగమ్.

3. యదమిత్రమేకతః ప్రతికరోతి తదేకతోభోగి; యదమిత్రమ్ ఆసారం చాపాకరోతి తదుభయతోభోగి, యదమిత్రాసారప్రతివేశాటవికాన్ సర్వతః ప్రతికరోతి తత్ సర్వతోభోగి.

వ్యా. 1. ఈ విధంగా (వశం చేసుకొన్నవారిలో) ఉత్సాహవంతులను సైన్యానికి ఉపకరించేవాళ్లనుగా స్థాపించాలి. సహజంగా ప్రభావం కలవాళ్లని కోశానికి ఉపకరించేవాళ్లనుగా స్థాపించాలి. ప్రజ్ఞావంతులను భూలాభానికి ఉపకరించేవాళ్లనుగా నియమించాలి.

2. వాళ్లలో ఏ మిత్రుడు పణ్యాలచేత, పట్టణాలలోను గ్రామాలలోను, గనులలోను పుట్టినవాటిచేత, రత్నాలచేత, శ్రేష్ఠమైన వస్తువులచేత, తక్కువరకం వస్తువులచేత, కుప్యంచేత, ద్రవ్యవనాలనుండి హస్తివనాలనుండి, ప్రజాలనుండి లభ్యమైన శకటాదియానాలచేత వాహనాలచేత అనేకవిధాల ఉపకరిస్తాడో ఆ మిత్రుడు చిత్రభోగమిత్రుడు. దండ-కోశాలద్వారా ఉపకరించేవాడు మహాభోగమిత్రుడు. దండ-కోశ-భూములచేత ఉపకరించేవాడు సర్వభోగమిత్రుడు.

3. ఏ మిత్రుడు ఒక వైపున శత్రువునకు మాత్రమే ప్రతిక్రియ చేస్తాడో అతడు ఏకతోభోగిమిత్రుడు. ఏ మిత్రుడు శత్రువును వాని ఆసారుణ్ణి (మిత్రుణ్ణి) కూడ అడ్డుకుంటాడో అతడు ఉభయతోభోగి. ఏ మిత్రుడు అమిత్రుణ్ణీ, వాని మిత్రుణ్ణి, ఇరుగు పొరుగు వాళ్లని, ఆటవికులనూ కూడ అన్ని వైపులా అడ్డుకుంటాడో అతడు సర్వతోభోగి.

మూ. 1. పార్ష్ణిగ్రాహశ్చాటవికః శత్రుముఖ్యః శత్రుర్వా భూమిదానసాధ్యః కశ్చిదాసాద్యేత నిర్గుణయా భూమ్యా ఏనముపగ్రాహయేత్; అప్రతిసంబద్ధయా దుర్గస్థమ్, నిరుపజీవ్యయా ఆటవికమ్; ప్రత్యాదేయయా తత్కులీనమ్, శత్రోరుపచ్ఛిన్నయా శత్రోరుపరుద్ధమ్; నిత్యామిత్రయా శ్రేణీబలమ్, బలవత్సామన్తయా సంహితబలమ్, ఉభాభ్యాం యుద్ధే ప్రతిలోమమ్; అలబ్ధవ్యాయామయా ఉత్సాహినమ్; శూన్యయా అరిపక్షీయమ్; కర్శితయా అపవాహితమ్; మహాక్షయవ్యయనివేశయా గతప్రత్యాగతమ్; అనుపాశ్రయయా ప్రత్యపసృతమ్, పరేణానధివాస్యయా స్వయమేవ భర్తారముపగ్రాహయేత్.

వ్యా. పార్ష్ణిగ్రాహుడు గాని, ఆటవికుడు గాని, శత్రువుకు సంబంధించినవారిలో ముఖ్యుడైన అమాత్యుడు వంటివాడు గాని, శత్రువే గాని ఎవడైనా భూమిని ఇవ్వడంచేత అనుకూలుడౌతాడు అన్నట్లు కనబడే వానికి మంచి గుణాలు లేని భూమి ఇచ్చి తనకు అనుకూలుణ్ణిగా చేసుకోవాలి. దుర్గంలో ఉన్నవానికి దుర్గానికి దూరంగా ఉన్న భూమి ఇవ్వాలి. ఆటవికునికి జీవనాధారంగా ఉపయోగించని భూమిని శత్రుకుటుంబానికి చెందినవానికి తిరిగి తీసుకుంటా నని చెప్పిన భూమిని, శత్రువుచేత నిరుద్ధులైన వాని పుత్రాదులకు శత్రువునుండి లాగికొన్న భూమిని, శ్రేణీబలానికి (నాయకుడు ఉండని జనసముదాయాత్మకమైన ఒక విధమైన సైన్యానికి) ఎల్లప్పుడు చోరాద్యమిత్రులున్న భూమిని, సంహితబలానికి (నాయకుడున్న జనసంఘరూపమైన సైన్యవిశేషానికి) ప్రబలుడైన సామంతరాజు (సరిహద్దులోని రాజు) ఉన్న భూమిని, యుద్ధంలో ప్రతికూలంగా ప్రవర్తిస్తూ కపటయుద్ధం చేసేవానికి నిత్యామిత్రభూమిని, బలవత్సామంతభూమిని, ఉత్సాహవంతునికి సైన్యవ్యాయామానికి వీలుకాని భూమిని, శత్రుపక్షానికి చెందినవానికి ఏమీ పండని శూన్యభూమిని, అపవాహితునికి (యుద్ధపీడితునికి లేదా సంధి చేసుకొని పాటించనివానికి) పరచక్ర ఆటవికాద్యుపద్రవా లున్న భూమిని, విడిచి వెళ్లి తిరిగి వచ్చినవానికి గ్రామాదినిర్మాణం చేయడానికి ఎక్కువ క్షయవ్యయాలు కలిగే భూమిని, ప్రత్యపసృతునికి (శత్రుభయంచేత స్వదేశం విడిచినవానికి) దుర్గం లేని భూమిని, ఒక భూస్వామికి అతడు తప్ప మరెవరూ నివసింప శక్యం కాని భూమిని, ఇచ్చి అనుకూలుణ్ణిగా చేసుకోవాలి.

మూ. 1. తేషాం మహోపకారం నిర్వికారం చానువర్తయేత్. ప్రతిలోమముపాంశునా సాధయేత్. ఉపకారిణముపకారశక్త్యా తోషయేత్. ప్రయాసతశ్చ అర్థమానౌ కుర్యాత్. వ్యసనేషు చానుగ్రహమ్. స్వయమాగతానాం యథేష్టదర్శనం ప్రతి విధానం చ కుర్యాత్. పరిభవోపఘాతకుత్సాతివాదాంశ్చైషు న ప్రయుఞ్జీత. దత్త్వా చాభయం పితేవానుగృహ్ణీయాత్. యశ్చాస్యాపకుర్యాత్త ద్దోషమ్ అభివిఖ్యాప్య ప్రకాశమేనం ఘాతయేత్. పరోద్వేగకారణాద్వా దాణ్డకార్మికవత్ చేష్టేత. న చ హతస్య భూమిద్రవ్యపుత్రదారానభిమన్యేత. కుల్యానప్యస్య స్వేషు పాత్రేషు స్థాపయేత్. కర్మణి మృతస్య పుత్రం రాజ్యే స్థాపయేత్.

వ్యా. ఆ దండోపనతులలో గొప్ప ఉపకారం చేసినవానిని, ఏ మాత్రము వికారం (చెడ్డ మార్పు) చెందనివానిని అతడు ఆ విధంగానే ఉండే టట్లు చేసుకోవాలి. ప్రతికూలంగా ఉన్నవానిని రహస్యోపాయాలచేత చంపివేయాలి. ఉపకారం చేసినవానిని అతడు చేసిన ఉపకారానికి అనుగుణంగా సంతోషపెట్టాలి. వాళ్లు చేసిన ప్రయాసను పట్టి వాళ్లకు ధనం, సంమానం చేస్తూండాలి. కష్టాలలో ఉన్నప్పుడు వాళ్లను ఆదుకోవాలి. తనను చూడడానికి వాళ్లెవరైనా స్వయంగా వచ్చినప్పుడు వాళ్ల కోరిక ప్రకారం దర్శనం ఇవ్వాలి. అయితే వాళ్లవల్ల తన కేమీ అపాయం కలగకుండా ఉండడానికి సంరక్షణం చేసుకోవాలి. వాళ్లలో ఎవరి విషయంలోను అనాదరం, దెప్పిపొడవడం, నిందా, దూషించడం చేయకూడదు. అభయం ఇచ్చిన తరవాత తండ్రి వలె రక్షించాలి. అపకారం చేసిన దండోపనతుణ్ణి, వాడు చేసిన తప్పు చాటించి బహిరంగంగా చంపించాలి. బహిరంగంగా చంపిస్తే ఇతరులకు ఉద్వేగం (భయాదికం) కలుగుతుంది అనే శంక ఉంటే దాండకార్మికప్రకరణంలో చెప్పిన విధంగా రహస్యంగా చంపించాలి. అలా చంపబడినవాని భూమిని, ద్రవ్యాన్ని, పుత్రులను, భార్యలను తన స్వాధీనం చేసుకొనగూడదు. వాని కులానికి చెందిన పుత్రాదులను కూడ వాళ్లకు తగిన స్థానాలలో ఉంచాలి. యుద్ధంలో మరణించినవాని పుత్రుణ్ణి వాని రాజ్యంలో స్థాపించాలి.

మూ. 1. ఏమవస్య దణ్డోపనతాః పుత్రపౌత్రాననువర్తన్తే.

2. యస్తు ఉపనతాన్ హత్వా బద్ధ్వా వా భూమిద్రవ్యపుత్రదారా నభిమన్యేత తస్యోద్విగ్నం మణ్డలమ్ అభావాయ ఉత్తిష్ఠతే. యే చాస్యామాత్యాః స్వభూమిషు ఆయత్తాః తే చాస్య ఉద్విగ్నాః మణ్డలమాశ్రయన్తే. స్వయం వా రాజ్యం ప్రాణాన్ వా అస్యాభిమన్యన్తే.

వ్యా. 1. ఈ విధంగా ప్రవర్తించి నట్లయితే దండోపనతులు అతని పుత్రపౌత్రుల విషయంలో కూడ అనుకూలంగా ప్రవర్తిస్తారు.

2. ఎవడైతే తన వశంలో ఉన్న రాజులను చంపి గాని బంధించి గాని వాళ్ల భూమిద్రవ్యపుత్రభార్యాదులను వశం చేసుకుంటాడో వానిమీద మండలం కోపించి వానిని లేకుండా చేయడానికి ప్రయత్నిస్తుంది. తమ తమ ప్రదేశాలలో పనులు చేస్తూన్న వీని అమాత్యులు కూడ వీనిపై కోపించి మండలాన్ని ఆశ్రయిస్తారు. లేదా వాళ్లే స్వయంగా వీని రాజ్యాన్ని లాగికొంటారు, ప్రాణాలు తీస్తారు.

శ్లో. స్వభూమిషు చ రాజానస్తస్మాత్ సామ్నానుపాలితాః,
భవన్త్యనుగుణా రాజ్ఞః పుత్రపౌత్రానువర్తినః.

ఇతి కౌటలీయార్థశాస్త్రే షాడ్గుణ్యే సప్తమాధికరణే షోడశోఽధ్యాయః, దణ్డోపనాయి వృత్తమ్, ఆదితః చతుర్దశశతతమః.

వ్యా. అందుచేత తమ తమ రాజ్యాలలో ఉన్న రాజులు (విజిగీషువుచేత) సామోపాయంచేత లాలింపబడినవారై రాజుకు అనుకూలులుగా ఉంటారు. పుత్రపౌత్రాదుల విషయంలో కూడ అనుకూలంగా ఉంటారు.

"బాలానందిని" అను కౌటలీయార్థశాస్త్రాంధ్రవ్యాఖ్యానంలో షాడ్గుణ్యం అనే సప్తమాధికరణంలో దండోపనాయివృత్తం అనే పదహారవ అధ్యాయం, ప్రారంభంనుంచి నూటపద్నాల్గవ అధ్యాయం సమాప్తం.

## అథ సప్తదశోధ్యాయః

### ద్వావింశతిశతతమం ప్రకరణమ్ - సంధికర్మ. త్రయోవింశతిశతతమం ప్రకరణమ్ - సమాధిమోక్షః

మూ. 1. శమః, సంధిః, సమాధిః ఇత్యేకోఽర్థః, రాజ్ఞాం విశ్వాసోపగమః శమః సంధిః, సమాధిరితి.

2. "సత్యం శపథో వా చలః సంధిః; ప్రతిభూః ప్రతిగ్రహో వా స్థావరః" ఇత్యాచార్యాః.

3. నేతి కౌటల్యః. సత్యం శపథో వా పరత్రేహ చ స్థావరః సంధిః. ఇహార్థ ఏవ ప్రతిభూః ప్రతిగ్రహో వా బలాపేక్షః.

వ్యా. 1. 'శమం', 'సంధి', 'సమాధి' అనే పదాల అర్థం ఒకటే. 'శమం' అన్నా, 'సంధి' అన్నా', 'సమాధి' అన్నా అర్థం రాజులు పరస్పరం విశ్వాసం పొందడమే.

2. సత్యము (అనగా ఈ విషయంలో ఏ మాత్రమూ మార్పు ఉండదు అని చెప్పడం) లేదా శపథం (తండ్రి మొదలైన వాళ్లమీద ఒట్టు వేసి చెప్పడం) ఇవి చలసంధి. స్థిరం కాని సంధి. ప్రతిభువు (జామీను గాని) ప్రతిగ్రహం (పుత్రాదులను కుదువబెట్టడం)

గాని స్థావరమైన సంధి అని పూర్వాచార్యు లన్నారు.

3. "అది యుక్తం కాదు-సత్యమైనా శపథమైనా పరలోకంలోను, ఇహలోకంలోను కూడ స్థిరమైన సంధి. ప్రతిభువు ప్రతిగ్రహం కూడా కేవలం ఇహలోకానికి మాత్రమే సంబంధించినది. బలంమీద ఆధారపడినది కూడ అని అంటాడు కౌటల్యుడు. అనగా సత్యశపథాలు ఇహలోకంలో మనిషిని బంధించి ఉంచుతాయి. వాటికి భంగం కలుగుతే పరలోకంలో పాపఫలం అనుభవించవలసి ఉంటుంది. ప్రతిభూప్రతిగ్రహాలు జామీను ఉన్నవాని బలంమీద ప్రతిగ్రహంగా ఉన్నవాని ప్రేమపాత్రత్వాదుల మీద ఆధారపడి ఉంటాయి. వాటికి భంగం కలిగినా పరలోకభయం ఏదీ లేదు. అందుచేత సత్య-శపథాలే స్థావరసంధులు అని కౌటిల్యుని అభిప్రాయం.

మూ. "సంహితాః స్మః" ఇతి సత్యసన్ధాః పూర్వే రాజానః సత్యేన సందధిరే.

2. తస్యాతిక్రమే శపథేన అగ్న్యుదకసీతాప్రాకారలోష్టహస్తి స్కన్ధాశ్వపృష్ఠ రథోపస్థ శస్త్రరత్నబీజగన్ధరససువర్ణహిరణ్యాన్యాలేభిరే - హన్యురేతాని త్యజేయుశ్చైనం యః శపథమతిక్రామేదితి.

3. శపథాతిక్రమే మహతాం తపస్వినాం ముఖ్యానాం వా ప్రాతిభావ్య బన్ధః ప్రతిభూః. తస్మిన్ యః పరావగ్రహసమర్థాన్ ప్రతిభువః గృహ్ణాతి సోఽతిసంధత్తే; విపరీతోఽతిసంధీయతే.

4. బన్ధుముఖప్రగ్రహః ప్రతిగ్రహః. తస్మిన్ యో దూష్యామాత్యం, దూష్యాపత్యం వా దదాతి సోఽతిసన్ధత్తే. విపరీతః అతిసంధీయతే. ప్రతి గ్రహణవిశ్వస్తస్య హి పరః ఛిద్రేషు నిరపేక్షః ప్రహరతి.

వ్యా. 1. సత్యసంధులైన ప్రాచీనరాజులు "మనం కలిశాం" అని పలికి సత్యంచేతనే సంధి చేసికొనేవారు.

2. దానిని అతిక్రమించే విషయంలో అనగా దీనిని అతిక్రమించము అని దృఢంగా చెప్పడానికి అగ్ని, ఉదకం, నాగలిచాలు, ప్రాకారంమీద ఉన్న మట్టిబెడ్డ, ఏనుగుమూపురం, గుఱ్ఱంవీపు, రథమధ్యభాగం, ఆయుధాలు, రత్నం, విత్తనాలు, సుగంధద్రవ్యాలు, రసద్రవ్యాలు, బంగారం, ధనం స్పృశించేవారు. శపథం అతిక్రమించినవానిని ఇవి (అగ్న్యాదులు) నశింపచేస్తాయి, వానికి లభించకుండా

పోతాయి అనే విశ్వాసంతో అలా చేసేవారు.

3. శపథాన్ని అతిక్రమించే పక్షంలో (అతిక్రమించకుండా) గొప్ప తపఃశాలులను గాని, గ్రామముఖ్యాదులను గాని, జామీనుగా నియమించడానికి 'ప్రతిభూ' (Surity) అని పేరు. అందులో - అన్న మాట తప్పిన ఇతరులను నిగ్రహించగలిగినవాళ్లను ప్రతిభూలనుగా తీసికొన్నవాడు లాభం పొందుతాడు. అలా నిగ్రహించజాలనివాళ్లని ప్రతిభూలనుగా గ్రహించినవాడు మోసపోతాడు.

4. "నేను మాట తప్పితే నువ్వు వీళ్లను ఏమైనా చేసుకోవచ్చు" అని చెప్పి బంధువులను గాని, ముఖ్యులైన అమాత్యాదిజనులను గాని సంధి చేసుకొన్నవాని అధీనంలో ఉంచడం ప్రతిగ్రహం (Hostage). అందులో దూష్యుడైన (రాజద్రోహియైన) అమాత్యుణ్ణి గాని, దూష్యుడైన పుత్రాదికుణ్ణిగాని ప్రతిగ్రహంగా ఉంచినవాడు ఎక్కువ లాభం పొందుతాడు. అందుకు విపరీతంగా చేసినవాడు అనగా స్నేహపాత్రులైన వాళ్లను ప్రతిగ్రహం పెట్టినవాడు మోసపోతాడు. ఎందువల్ల ననగా ఎదుటివాడు వాని ప్రతిగ్రహం మన చేతిలో ఉంది కదా అని విశ్వాసంతో ఉన్నప్పుడు రెండవవాడు ఆ ప్రతిగ్రహాన్ని చంపివేసినా నష్టం లేదు అనే అభిప్రాయం కలవా డవడంచేత ఛిద్రాలలో (అవకాశం వచ్చినప్పుడు) వానిమీద దెబ్బతీస్తాడు.

మూ. 1. అసత్యసమాధౌ తు- కన్యాపుత్రదానే దదత్ తు కన్యామతిసంధత్తే. కన్యా హ్యదాయాదా పరేషామేవ అర్థాయాక్లేశ్యా చ. విపరీతః పుత్రః.

2. పుత్రయోరపి జాత్యం ప్రాజ్ఞం శూరం కృతాస్త్రమేకపుత్రం వా దదాతి సోఽతిసంధీయతే. విపరీతోఽతిసన్ధత్తే. జాత్యాదజాత్యో హి లుప్తదాయాదసన్తానత్వాదాధాతుం శ్రేయాన్. ప్రాజ్ఞాదప్రాజ్ఞో మన్త్రశక్తిలోపాత్. శూరాదశూరః ఉత్సాహశక్తిలోపాత్. కృతాస్త్రాదకృతాస్త్రః ప్రహర్తవ్యసంపల్లోపాత్. ఏకపుత్రాదనేకపుత్రః నిరపేక్షత్వాత్.

వ్యా. 1. సంతానాన్ని ప్రతిగ్రహంగా ఇవ్వవలసి వచ్చినప్పుడు కన్యాపుత్రులలో కన్యను ఇచ్చేవాడు అధికలాభం పొందుతాడు. ఎందువల్ల ననగా కన్యకు దాయభాగం ఉండదు. ఎప్పటికైనా ఆమె పరులకే ఉపయోగిస్తుంది. ఆమెను (వాళ్లు) బాధపెట్టడానికి అవకాశం లేదు. పుత్రుడు ఇందుకు విపరీతుడు.

2. ఇద్దరు పుత్రులలో కూడ ఉత్తమజాతికి చెందినవాడు, ప్రాజ్ఞుడు, శూరుడు, అస్త్రవిద్య నేర్చినవాడు, ఏకైకపుత్రుడు అయినవానిని ఇచ్చినవాడు మోసగించబడతాడు. అందుకు విపరీతంగా పుత్రుణ్ణి ఇచ్చినవాడు లాభం పొందినవా డవుతాడు. జాత్యుణ్ణి కాకుండా అజాత్యుణ్ణి ఇవ్వడం మంచిది. ఎందువల్ల ననగా అజాత్యుని సంతానానికి దాయాధికారం ఉండదు. బుద్ధిమంతుణ్ణి ఇవ్వడం కంటె తెలివి తక్కువ వానిని ఇవ్వడం మంచిది. ఎందువల్లననగా వానికి ఆలోచనాశక్తి ఉండదు. శూరుణ్ణి ఇవ్వడంకంటె ఉత్సాహశక్తి లేని అశూరుణ్ణి ఇవ్వడం మంచిది. అస్త్రవిద్య నేర్చినవానికంటె నేర్వని వానిని ఇవ్వడం మంచిది; ఎందువల్ల ననగా వానికి ఎదుటివాని మీద దెబ్బతీసే శక్తి ఉండదు. ఏకైకపుత్రుడైనవానిని ఇవ్వడం కంటె చాలమంది పుత్రులలో ఒకనిని ఇవ్వడం మంచిది; ఎందువల్ల ననగా తండ్రి పూర్తిగా వానిమీదనే ఆధారపడి ఉండడు.

మూ. 1. జాత్యప్రాజ్ఞయోః జాత్యమ్ అప్రాజ్ఞమ్ ఐశ్వర్యప్రకృతిరనువర్తతే. ప్రాజ్ఞమజాత్యం మన్త్రాధికారః. మన్త్రాధికారేఽపి వృద్ధసంయోగాజ్జాత్యకః ప్రాజ్ఞమ్ అతిసంధత్తే.

2. ప్రాజ్ఞశూరయోః ప్రాజ్ఞమ్ అశూరం మతికర్మణాం యోగోఽనువర్తతే. శూరమప్రాజ్ఞం విక్రమాధికారః. విక్రమాధికారేఽపి హస్తినమివ లుబ్ధకః ప్రాజ్ఞః శూరమతిసన్ధత్తే.

3. శూరకృతాస్త్రయోః శూరమకృతాస్త్రం విక్రమవ్యవసాయః అనువర్తతే. కృతాస్త్రమశూరం లక్షలమ్భాధికారః. లక్షలమ్భాధికారేఽపి స్థైర్యప్రతిప త్త్యసంమోక్షైః శూరః కృతాస్త్రమతిసన్ధత్తే.

వ్యా. 1. జాత్యుడైన అప్రాజ్ఞుడు, ప్రాజ్ఞుడైన అజాత్యుడు - ఇలాంటి పుత్రులలో అప్రాజ్ఞుడైన జాత్యునికి రాజ్యం పొందే అధికారం ఉంటుంది; అజాత్యుడైన ప్రాజ్ఞునికి మంచి ఆలోచన చేసే అధికారం ఉంటుంది. అయితే జాత్యుడు వృద్ధులతో సాంగత్యం చేస్తే మంత్రాధికారంవిషయంలో కూడ ప్రాజ్ఞుణ్ణి మించి ఉంటాడు. ప్రాజ్ఞుడైన అజాత్యునికి ఏమి చేసినా జాత్యత్వం లభించదు అని భావం.

2. శూరుడు కాని ప్రాజ్ఞుడు, ప్రాజ్ఞుడు కాని శూరుడు-ఇలాంటి ఇద్దరు పుత్రులలో శూరుడు కాని ప్రాజ్ఞుడికి బుద్ధిబలంతో చేయవలసిన పనులమీద అధికారం ఉంటుంది. ప్రాజ్ఞుడు కాని శూరునికి పరాక్రమం చూపే అధికారం ఉంటుంది. అయితే

-విక్రమాధికారం విషయంలో కూడ, తెలివైన వేటగాడు ఏనుగును మించి నట్లు ప్రాజ్ఞుడు శూరుణ్ణి మించగలడు.

3. కృతాస్త్రుడు కాని శూరుడు, శూరుడు కాని కృతాస్త్రుడు - ఇలాంటి పుత్రులలో కృతాస్త్రుడు కాని శూరునికి పరాక్రమం చూపడంలో వ్యవసాయం (ప్రయత్నం) ఉంటుంది. శూరుడు కాని కృతాస్త్రునికి లక్ష్యాన్ని సూటిగా కొట్టే అధికారం ఉంటుంది. అయితే స్థిరత్వమూ, కష్టసమయంలో వెంటనే ప్రతిక్రియ చేయడమూ, పొరబాటు పడకపోవడమూ అనే గుణాలు ఉంటే శూరుడు కృతాస్త్రుణ్ణి కూడా మించి ఉంటాడు.

మూ. 1. బహ్వేకపుత్రయోః బహుపుత్రః ఏకం దత్వా శేషవృత్తిస్తబ్ధః సన్ధిమతిక్రామతి, నేతరః.

2. పుత్రసర్వస్వదానే సంధిశ్చేత్ పుత్రఫలకో విశేషః. సమఫలయోః శక్తప్రజననతో విశేషః. శక్తప్రజననయోరపి ఉపస్థితప్రజననతో విశేషః.

3. శక్తిమత్యేకపుత్రే తు లుప్తపుత్రోత్పత్తిరాత్మానమాదధ్యాత్; న చైకపుత్రమితి.

వ్యా. 1. చాలమంది పుత్రులు కలవాడు, ఒకే పుత్రుడు కలవాడు -వీరిలో చాలమంది పుత్రు లున్నవాడు ఒక పుత్రుణ్ణి ఇచ్చి ఇంకా మిగిలిన పుత్రులు ఉండడంచేత దృష్టుడై సంధిని అతిక్రమించవచ్చును. ఇతరుడు (ఏకపుత్రుడు) అలా చేయజాలడు.

2. పుత్రు డనే సర్వస్వాన్నీ ఇచ్చి సంధి చేసుకొనవలసి ఉన్నప్పుడు ఆ పుత్రునికి పుత్రు డనే ఫలం ఉంటే అదొక విశేషం. ఇద్దరు పుత్రులు సమానమైన పుత్రఫలం కలవారైనప్పుడు సంతానం కలిగించ కలిగి ఉండడం విశేషం. అనగా సంతానం కలిగించగలవానిని ఇవ్వకుండా ఆ సామర్థ్యం లేని పుత్రుణ్ణి ఇవ్వాలి అని అర్థం. ఇద్దరు పుత్రులూ సంతానం పుట్టించడానికి సమర్థులైన పక్షంలో అచిరకాలంలో సంతానం కలగడం విశేషం.

3. ఒకే పుత్రు డుండి అతడు పుత్రోత్పాదనశక్తి కలవాడైతే, పుత్రోత్పాదనశక్తి ఉడిగిపోయిన తానే ఆధి (తాకట్టు)గా వెళ్లాలి కాని ఏకపుత్రుణ్ణి పంపగూడదు.

మూ. 1. అభ్యుచ్ఛీయమానః సమాధిమోక్షం కారయేత్.

2. కుమారాసన్నాః సత్రిణః కారుశిల్పివ్యఞ్జనాః కర్మాణి కుర్వాణాః

సురఙ్గయా రాత్రౌ ఉపఖానయిత్వా కుమారమపహరేయుః. నటనర్తకగాయన వాదకవాగ్జీవకుశీలవప్లవకసౌభికా వా పూర్వప్రణిహితాః పరముపతిష్ఠేరన్. తే కుమారం పరమ్పరయా ఉపతిష్ఠేరన్. తేషామనియతకాలప్రవేశస్థాననిర్గమనాని స్థాపయేత్. తతస్తద్వ్యఞ్జనో వా రాత్రౌ ప్రతిష్ఠేత.

వ్యా. 1. రాజు బలం పుంజుకొన్న తరవాత ప్రతిగ్రహంగా ఉంచబడినవానిని విడిపించుకోవాలి.

2. రాజకుమారు డున్న ప్రదేశానికి దగ్గర పనులు చేస్తూన్న, కారు-శిల్పుల వేషాలలో ఉన్న సత్రులు (గూఢచారులు) రాత్రి సురంగం త్రవ్వి దాని ద్వారా రాజకుమారుణ్ణి అపహరించాలి. లేదా ముందుగానే గూఢచారులుగా పంపబడిన నట-నర్తక-గాయన-వాదక-వాగ్జీవన-కుశీలవ-ప్లవక(ఖడ్గాగ్రంమీద నృత్యం చేసేవాడు) సౌభికులు (ఆకాశంమీద ఎగిరేవాడు) శత్రువు దగ్గరికి వెళ్లాలి. వాళ్లు మెల్ల మెల్లగా రాజకుమారుని దగ్గరికి వెళ్లాలి. రాజకుమారుడు శత్రురాజు ఆజ్ఞచేత ఆ నటనర్తకాదులు నిశ్చితమైన కాలం అంటూ ఏదీ లేకుండా ప్రవేశించడానికి, ఉండడానికి, బైటకు వెళ్లడానికి ఏర్పాటు చెయ్యాలి. తరవాత ఏదో ఒక రాత్రి ఆ నటాదుల వేషం వేసుకొని బైటకు రావాలి.

మూ. 1. తేన రూపాజీవాభార్యావ్యఞ్జనాశ్చ వ్యాఖ్యాతాః.

2. తేషాం వా తూర్యభాణ్డఫేలాం గృహీత్వా నిర్గచ్ఛేత్.

3. సూదారాలికస్నాపకసంవాహకాస్తరకకల్పకప్రసాధకోదకపరిచార కైర్వా ద్రవ్యవస్త్రభాణ్డఫేలాశయనాసనసంభోగైర్నిర్హ్రియేత.

4. పరిచారకచ్ఛద్మనా వా కించిదరూపవేలాయామాదాయ నిర్గచ్ఛేత్. సురఙ్గాముఖేన వా నిశోపహారేణ, తోయాశయే వా వారుణం యోగమాతిష్ఠేత్.

5. వైదేహకవ్యఞ్జనా వా పక్వాన్నఫలవ్యవహారేణ ఆరక్షిషు రసమవచ్ఛారయేయుః.

వ్యా. 1. నటాదివేషంలో పారిపోవాలి అని చెప్పి నట్లే వేశ్యాస్త్రీ, భార్య (అక్కడ ఉన్న నటాదులలో ఒకని భార్య) ఇత్యాదివేషాలలో పారిపోవచ్చును అని కూడ చెప్పినట్లయింది.

2. లేదా నటాదుల వాద్యాలు పెట్టిన పెట్టెను, ఇతరమైన సామానులు ఉంచే పెట్టెను మోసుకొంటూ బైటకు వచ్చేయాలి.

3. లేదా వంటవాళ్లు, ఆరాలికులు (వడ్డన మొదలైనవి చేసేవాళ్లు లేదా భక్ష్యాలు తయారు చేసేవాళ్లు), స్నానం చేయించేవాళ్లు, ఒళ్లు పట్టేవాళ్లు, పక్కలు వేసేవాళ్లు, మంగళ్లు, అలంకరించేవాళ్లు. నీళ్లు అందించేవాళ్లు ఉపయోగించిన ద్రవ్యాలు, వస్త్రాలు, సరుకులు ఉంచిన పెట్టెలతోను, శయనాసనాలతోను ఆ రాజకుమారుణ్ణి కూడ బైటకు తీసికొనిపోవాలి.

4. లేదా పరిచారకు డనే వంక పెట్టుకొని పరిచారకుడు తీసికొని వెళ్లే వస్తువు ఏదైనా తీసికొని మనిషిని గుర్తుపట్టడానికి శక్యం కాని సమయంలో (రాజకుమారుడు) బైటకు వెళ్లిపోవాలి. లేదా రాత్రి ఇవ్వవలసిన బలులు చేతిలో ధరించి సురంగం ద్వారా బైటకు వెళ్లిపోవాలి. లేదా ఏదైనా జలాశయంలో (నదిలో లేదా చెరువులో) వారుణయోగం అవలంబించాలి. ఒక చోట మునిగి చాల దూరం నీటిలోనే ఈదుకుంటూ వెళ్లి అక్కడ తేలాలి.

5. లేదా వర్తకుల వేషంలో ఉన్న గూఢచారులు పక్వాన్నంలోను పండ్లలోను విషం కలిపి వాటిని రక్షకభటులచేత తినిపించాలి. వాళ్లు మూర్ఛ పోయినప్పుడు రాజకుమారుడు పారిపోవాలి అని అర్థం.

మూ. 1. దైవతోపహార శ్రాద్ధప్రహవణనిమిత్తమ్ ఆరక్షిషు మదనయోగ యుక్తమన్నపానరసం వా ప్రయుజ్యాపగచ్ఛేత్ ఆరక్షకప్రోత్సాహనేన వా.

2. నాగరకకుశీలవచికిత్సకాపూపికవ్యఞ్జనా వా రాత్రౌ సమృద్ధగృహాణ్యా దీపయేయుః ఆరక్షిణాం వా. వైదేహకవ్యఞ్జనా వా పణ్యసంస్థామాదీపయేయుః.

3. అన్యద్వా శరీరం నిక్షిప్య స్వగృహమాదీపయేదనుపాతభయాత్. తతః సంధిచ్ఛేదఖాతసురఙ్గాభిరపగచ్ఛేత్.

4. కాచకుమ్భభాణ్డభారవ్యఞ్జనో వా రాత్రౌ ప్రతిష్ఠేత. ముణ్డజటిలానాం ప్రవాసనాన్యనుప్రవిష్టః వా రాత్రౌ తద్వ్యఞ్జనః ప్రతిష్ఠేత. విరూపవ్యాధి కరణారణ్యచరఛద్మనా మన్యతమేన వా. ప్రేతవ్యఞ్జనో వా గూఢైర్నిర్హ్రియేత. ప్రేతం వా స్త్రీవేషేణానుగచ్ఛేత్.

వ్యా. 1. దేవతలకు నైవేద్యం పెట్టినది, లేదా శ్రాద్ధంలో ఉపయోగించినది లేదా

విందు భోజనాలలో ఉపయోగించేది అయిన అన్నంలోను, పానీయంలోను మాదకద్రవ్యాలు కలిపి రక్షకభటులకు ఇచ్చి వాళ్లు మత్తులో ఉన్నప్పుడు పారిపోవాలి. లేదా మీకు చాలా ధనం ఇస్తాను అని ఆరక్షకులను లోభపెట్టి పారిపోవాలి.

2. లేదా రాత్రి సంచరించడానికి అనుజ్ఞ ఉన్న నాగరకుడు, కుశీలవులు, వైద్యుడు, పిండివంటలు తయారు చేసేవాడు మొదలైనవాళ్ల వేషాలతో వెళ్లి రాత్రి ధనవంతుల గృహాలకు గాని, ఆరక్షకుల ఇండ్లకు గాని నిప్పు అంటించాలి. లేదా వర్తకుల వేషంలో ఉన్న గూఢచారులు ఆపణశాలకు (దుకాణాలు ఉన్న పెద్ద శాలకు) నిప్పు అంటించాలి.

3. రాజకుమారుడు తను నివసించే ఇంట్లో ఒక శవం ఉంచి ఆ ఇంటికి నిప్పుపెట్టాలి. అలా చేయడంవల్ల అతడే మరణించా డనుకొని ఎవరూ రాజకుమారుని వెనుక వెదకుతూ రారు. తరవాత గోడకు కన్నం చేసి కాని, తవ్విన మార్గంగుండా గాని సురంగం గుండాగాని బైటకు వెళ్లిపోవాలి.

4. లేదా కుండలకావడి మోసేవాని వేషంలో (కాంగ్లే), లేదా కాచభారుడు (గడ్డి, కఱ్ఱలు మొదలైనవి మోసేవాడు) కుమ్భభారుడు (నీళ్లకుండ మోసేవాడు) భాణ్డభారుడు (గుఱ్ఱాలు మొదలైనవాటి సామాను మోసేవాడు) (గ.శా) వీళ్ల వేషాలలో రాత్రి బయలుదేరాలి. లేదా విజిగీషువు పంపిన బోడిగుండ్లవాళ్లు, జటాధారులు నివసించే ప్రదేశాలలో ప్రవేశించి ఆ వేషం వేసుకొని రాత్రి బయలుదేరి వెళ్లిపోవాలి. లేదా విరూపం దాల్చడం, జబ్బుతో బాధపడుతున్నట్లు కనబడడం, అరణ్యాలలో సంచరించేవాని వేషం-వీటిలో ఏదో ఒక ఉపాయంచేత పారిపోవాలి.లేదా మరణించినట్లు అభినయిస్తూ గూఢచారులు తనను మోసికొనిపోయేటట్లు చేసుకోవాలి. లేదా స్త్రీవేషం వేసుకొని ఒక శవం వెంట వెళ్లాలి.

మూ. 1. వనచరవ్యఞ్జనాశ్చైనమన్యతో యాన్తమన్యతోఽపదిశేయుః, తతోఽన్యతో గచ్ఛేత్. చక్రచరాణాం వా శకటవాటైరపగచ్ఛేత్.

2. ఆసన్నే చానుపాతే సత్రం వా గృహ్ణీయాత్. తతోఽన్యతోఽపగచ్ఛేత్.

3. గృహీతో వా సామాదిభిరనుపాతమ్ అతిసన్దధ్యాత్. రసవిద్ధేన వా పథ్యదనేన.

4. వారుణయోగాగ్నిదాహేషు వా శరీరమన్యదాధాయ శత్రుమభియుఞ్జీత పుత్రో మే త్వయా హత ఇతి.

వ్యా. 1. వనచరుల వేషాలలో ఉన్న గూఢచారులు, రాజపుత్రుడు ఎటువైపు వెళ్లాడు అని అతని వెన్నంటి వస్తూన్న రాజభటులు అడిగినప్పుడు, అతడు ఒక దిక్కువైపు వెడితే మరొకవైపు వెళ్లి నట్లు చెప్పాలి. అప్పుడు ఆ రాజకుమారుడు వాళ్లు చెప్పిన దిక్కున కాక మరొక దిక్కున వెళ్లాలి. లేదా బండ్లమీద ప్రయాణం చేసేవాళ్ల బండ్ల గుంపులో దాగి వెళ్లాలి.

2. అనుపాతం (తరుముకొనివచ్చే రాజభటుల గుంపు) తనకు చాల దగ్గరికి వచ్చి నట్లయితే వనాన్ని ఆశ్రయించి దాగికొనాలి. అలా దాగికొనే ప్రదేశం లేని పక్షంలో మార్గానికి రెండు వైపులా ధనం గాని, విషం కలిపిన భక్ష్యాల సముదాయంకాని చల్లి తాను మరొకమార్గాన పారిపోవాలి.

3. పట్టుబడిన ట్లయితే సామాదులచేత ఆ అనుపాతాన్ని మోసగించాలి. లేదా విషం కలిపిన ఆహారం మార్గంలో వాళ్లకు ఇచ్చి మోసగించాలి.

4. లేదా విజిగీషువు వారుణయోగం, అగ్నిదాహం జరిగి నప్పుడు అక్కడ మరొక శరీరం ఉంచి నువ్వు నా పుత్రుణ్ణి చంపివేశావు అని శత్రువుమీద దోషారోపణం చెయ్యాలి.

శ్లో. ఉపాత్తచ్ఛన్నశస్త్రో వా రాత్రౌ విక్రమ్య రక్షిషు,
శీఘ్రపాతైరపసరేద్గూఢప్రణిహితైః సహ.

*ఇతి కౌటలీయార్థశాస్త్రే షాడ్గుణ్యే సప్తమాధికరణే సప్తదశోఽధ్యాయః సంధికర్మ, సంధిమోక్షః ఆదితః పఞ్చదశశతతమః.*

వ్యా. లేదా రహస్యంగా ఆయుధం ధరించి, రాత్రియందు రక్షకభటుల విషయంలో పరాక్రమించి, పైన చెప్పిన గూఢచారులతో కూడ శీఘ్రంగా నడిచే అశ్వాదులచేత పారిపోవాలి.

*"బాలానందిని" అను కౌటలీయార్థశాస్త్రాంధ్రవ్యాఖ్యలో షాడ్గుణ్యం అనే సప్తమాధికరణంలో సంధికర్మ, సంధిమోక్షం అనే పదిహేడవ అధ్యాయం, ప్రారంభం నుంచి నూటపదిహేనవ అధ్యాయం సమాప్తం.*

# అథ అష్టాదశోఽధ్యాయః

## చతుర్వింశతితమం ప్రకరణమ్ - మధ్యమచరితమ్

(మధ్యముని విషయంలో ప్రవర్తన)

## పఞ్చవింశతితమం ప్రకరణమ్ - ఉదాసీనచరితమ్

(ఉదాసీనుని విషయంలో ప్రవర్తన)

## షడ్వింశతితమం ప్రకరణమ్ - మణ్డలచరితమ్

(మండలం విషయంలో ప్రవర్తన)

మూ. 1. మధ్యమస్యాత్మా తృతీయా పఞ్చమీ చ ప్రకృతీ ప్రకృతయః. ద్వితీయా చ, చతుర్థీ, షష్ఠీ చ వికృతయః. తచ్చేదుభయం మధ్యమోఽనుగృహ్ణీయాత్ విజిగీషుర్మధ్యమానులోమః స్యాత్. న చేదనుగృహ్ణీయాత్ ప్రకృత్యనులోమః స్యాత్.

2. మధ్యమశ్చేత్ విజిగీషోర్మిత్రం మిత్రభావి లిప్సేత, మిత్రస్య ఆత్మనశ్చ మిత్రాణ్యుత్థాప్య మధ్యమాచ్చ మిత్రాణి భేదయిత్వా మిత్రం త్రాయేత. మణ్డలం వా ప్రోత్సాహయేత్ - అతివృద్ధోఽయం మధ్యమః సర్వేషాం నో వినాశాయ అభ్యుత్థితః, సంభూయాస్య యాత్రాం విహనామేతి. తచ్చేన్మణ్డలమనుగృహ్ణీయాత్ మధ్యమావగ్రహేణ ఆత్మానముపబృంహయేత్. న చే దనుగృహ్ణీయాత్, కోశదణ్డాభ్యాం మిత్రమనుగృహ్య యే మధ్యమద్వేషిణో రాజానః పరస్పరానుగృహీతా వా బహవస్తిష్ఠేయుః, ఏకసిద్ధా వా బహవః సిధ్యేయుః, పరస్పరాద్వా శఙ్కితాః నోత్తిష్ఠేరన్, తేషాం ప్రధానమేకమ్, ఆసన్నం వా సామదానాభ్యాం లభేత. ద్విగుణో ద్వితీయం త్రిగుణ స్తృతీయమ్. ఏవమభ్యుచ్చితో మధ్యమమవగృహ్ణీయాత్.

వ్యా. 1. రాజమండలంలోని మధ్యమునికి తాను, అనగా విజిగీషువు. తృతీయప్రకృతి, అనగా మిత్రుడు, పంచమప్రకృతి అనగా మిత్రమిత్రుడు ప్రకృతులు, అనగా మిత్రులు. ద్వితీయ - చతుర్థ - షష్ఠప్రకృతులు. అనగా అరి. అరిమిత్రుడు. అరి

మిత్రమిత్రుడు వికృతులు (విరుద్ధంగా ప్రవర్తించే వాళ్లు). మధ్యముడు పైన చెప్పిన ప్రకృతి - వికృతులను ఇద్దరినీ అనుగ్రహించిన ట్లయితే (రెండు విధాల రాజుల విషయంలో హితప్రవృత్తి కలవాడైతే) విజిగీషువు ఆ మధ్యమునికి అనుకూలుడుగా ఉండాలి. అట్లు అనుగ్రహించకపోయిన ట్లయితే ప్రకృతికి (తన మిత్రునకు, మిత్రమిత్రునకు) అనుకూలుడుగా ఉండాలి.

2. మధ్యముడు విజిగీషువుయొక్క 'మిత్రభావి' మిత్రుణ్ణి ఆక్రమించదలచి నప్పుడు విజిగీషువు మిత్రుని మిత్రులను తన మిత్రులను లేవదీసి మధ్యమునికీ, వాని మిత్రులకూ మధ్య భేదం కలిగించి తన మిత్రుణ్ణి రక్షించాలి. లేదా - "ఈ మధ్యముడు చాలా బలవంతు డైపోయాడు; మన అందర్నీ నశింపచేయడానికి పూనుకొన్నాడు; మనం అందరం కలిసి వీని యుద్ధయాత్రకు అడ్డుతగులుదాం" అని చెప్పి రాజమండలాన్ని ప్రోత్సహింపచేయాలి. మండలం అందుకు అంగీకరిస్తే మధ్యముణ్ణి కృశింపచేసి (దుర్బలునిగా చేసి) తనను అధికబలవంతుణ్ణిగా చేసుకోవాలి. రాజమండలం అందుకు అంగీకరించకపోతే మిత్రునికి కోశదండాలు ఇవ్వడం ద్వారా సహాయం చేసి మధ్యముణ్ణి ద్వేషించే ఏ చాలమంది రాజులు పరస్పరం సహాయం చేసుకొంటూ ఉంటారో, లేదా మధ్యమద్వేషులైన ఏ చాలమంది రాజులలో ఒకనిని తన వైపు తిప్పుకుంటే మిగిలిన వాళ్లందరూ అనుకూలులు అవుతారో, మధ్యమద్వేషులైన ఏ రాజులు ఒకరిని ఒకరు శంకించుకొంటూ యుద్ధానికి కలిసి రారో, వాళ్లల్లో ప్రధానుడైన ఒక రాజును గాని, తనకు సమీపంలో ఉన్న రాజును గాని సామదానాలచేత వశం చేసుకోవాలి. ఆ విధంగా ఆ రాజు కలవడంచేత రెట్టింపు కలవాడై రెండవరాజునుకూడా అనుకూలుణ్ణిగా చేసుకోవాలి. ఆ విధంగా మూడు రెట్లబలం పుంజుకొని మూడవరాజును అనుకూలుణ్ణిగా చేసుకోవాలి. ఈ విధంగా బలం పెంచుకొని మధ్యముణ్ణి దుర్బలునిగా చెయ్యాలి.

మూ. 1. దేశకాలాతిపత్తౌ వా సన్ధాయ మధ్యమేన మిత్రస్య సాచివ్యం కుర్యాత్. దూష్యేషు వా కర్మసంధిమ్.

2. కర్శనీయం వాస్య మిత్రం మధ్యమో లిప్సేత ప్రతిస్తమ్భయేదేనమ్- "అహం త్వా త్రాయేయ" ఇత్యాకర్శనాత్. కర్శితమేనం త్రాయేత.

3. ఉచ్ఛేదనీయం వాస్య మిత్రం మధ్యమో లిప్సేత. కర్శితమేతం త్రాయేత మధ్యమవృద్ధిభయాత్.

4. ఉచ్ఛిన్నం వా భూమ్యనుగ్రహేణ హస్తే కుర్యాదన్యత్రాపసార భయాత్.

5. కర్శనీయోచ్ఛేదనీయయోశ్చేన్మిత్రాణి మధ్యమస్య సాచివ్యకరాణి స్యుః పురుషాన్తరేణ సంధీయేత. విజిగీషోర్వా తయోర్మిత్రాణి అవగ్రహసమర్థాని స్యుః, సన్ధిముపేయాత్.

6. అమిత్రం వాస్య మధ్యమో లిప్సేత సంధిముపేయాత్. ఏవం స్వార్థశ్చ కృతో భవతి మధ్యమస్య ప్రియం చ.

వ్యా. 1. దేశకాలాలు దాటిపోయి మండలాన్ని ప్రోత్సహించడం కుదరని పక్షంలో మధ్యమునితో సంధి చేసుకొని మిత్రునికి సహాయం చెయ్యాలి. లేదా మధ్యముని రాజ్యంలో ఉన్న దూష్యులతో (రాజవిరోధులైన అమాత్యాదులతో) కర్మసంధి (నేను మీ రాజును ఎదిరించి యుద్ధం చేస్తూంటాను, మీరు రాజ్యంలో అంతఃప్రకోపం కలిగించండి అనే సంధి) చేసుకోవాలి.

2. మధ్యముడు వీని (విజిగీషువుయొక్క) కృశింపచేయ దగిన మిత్రుణ్ణి (సరిహద్దు రాజ్యానికి అవతలి రాజ్యంలో ఉండడంచేత మిత్రుడే అయినా తనకు అనుకూలంగా ఉండనివానిని) ఆక్రమించ దలచినప్పుడు, ఆతని కోశదండాదులు కృశింపచేయబడేటంతవరకూ "నేను నిన్ను రక్షిస్తాను" అని అంటూ (సహాయం చేస్తూన్నట్లు కనబడుతూ) నిలబెట్టాలి. అతడు పూర్తిగా కర్శితుడైన తరవాత వానికి సహాయం చెయ్యాలి.

3. వీని (విజిగీషువుయొక్క) నిర్మూలించదగిన మిత్రుణ్ణి మధ్యముడు ఆక్రమించ దలచి నప్పుడు ఆతడు పూర్తిగా కర్శితుడు అయేవరకు ఉపేక్షించి కర్శితుడైన తరవాత వానిని రక్షించాలి. అలా రక్షించకపోతే మధ్యమునికి బలం పెరిగి పోయే భయం ఉంటుంది.

4. అతడు నిర్మూలించబడితే అతనికి భూమి ఇచ్చి తన వశంలో ఉంచుకోవాలి. అలా చేయకపోతే అతడు మరొకని దగ్గరికి వెళ్ళిపోవచ్చును.

5. కర్శనీయుడు ఉచ్ఛేదనీయుడు అయినవాళ్ల మిత్రులే (రహస్యంగా) మధ్యమునికి సహాయం చేస్తూన్న పక్షంలో పురుషాంతరంచేత సంధి (మధ్యమునితో)

చేసుకోవాలి. (సేనాపతిని గాని కుమారుణ్ణి గాని అప్పగించి చేసుకొన్న సంధి పురుషాంతరసంధి. కర్శనీయోచ్ఛేదనీయుల కుమారుణ్ణి లేదా సేనాపతిని మధ్యమునికి అప్పగించి సంధి చేసుకోవాలి అని అర్థం). ఆ ఇద్దరి (కర్శనీయోచ్ఛేదనీయుల) మిత్రులు విజిగీషువును కృశింపచేయడానికి సమర్థులైతే అప్పడు విజిగీషువు మధ్యమునితో సంధి చేసుకోవాలి.

6. వీని (విజిగీషువు యొక్క) అమిత్రుణ్ణి మధ్యముడు ఆక్రమించదలచి నట్లయితే అప్పుడు విజిగీషువు మధ్యమునితో సంధి చేసుకోవాలి. ఇలా చేయడంవల్ల తన ప్రయోజనమూ నెరవేరుతుంది, మధ్యమునికి ఇష్టమైన పని చేసిన ట్లవుతుంది.

మూ. 1. మధ్యమశ్చేత్ స్వమిత్రం మిత్రభావి లిప్సేత పురుషాన్తరేణ సందధ్యాత్. సాపేక్షం వా "నార్హసి మిత్రముచ్ఛేత్తుమ్"ఇతి వారయేత్. ఉపేక్షేత వా-మణ్డల మస్య కుప్యతు స్వపక్షవధాదితి.

2. అమిత్రమాత్మనో వా మధ్యమో లిప్సేత కోశదణ్డాభ్యామేనమ్ అదృశ్యమానః అనుగృహ్ణీయాత్.

3. ఉదాసీనం వా మధ్యమో లిప్సేత "ఉదాసీనాద్ భిద్యతామ్" ఇతి మధ్యమోదాసీనయోః యః మణ్డలస్య అభిప్రేతః తమాశ్రయేత.

వ్యా. 1. మధ్యముడు తన "మిత్రభావి" మిత్రుణ్ణే ఆక్రమించదలస్తూ న్నప్పుడు విజిగీషువు ఆ మధ్యమునికీ ఆతని మిత్రునికీ మధ్య పురుషాంతరసంధి చేయించాలి. ఆ మధ్యముడు తన విషయంలో గౌరవభావం ఉన్నవాడైతే విజిగీషువు "మిత్రుణ్ణి నువ్వు ఈ విధంగా నిర్మూలించకూడదు" అని చెప్పి నివారించాలి. లేదా తన పక్షానికి చెందినవానిని చంపడంవల్ల మండలమే వీని విషయంలో కోపిస్తుందిలే అనే భావంతో ఏమీ చేయకుండా ఊరుకోవాలి.

2. మధ్యముడు తన (విజిగీషువుయొక్క) అమిత్రుణ్ణి ఆక్రమించా లనుకొంటూన్నప్పుడు విజిగీషువు పైకి కనబడకుండా ఆ మధ్యమునికి కోశదండాలచేత సహాయం చెయ్యాలి.

3 మధ్యముడు ఉదాసీనుణ్ణి ఆక్రమించా లని అనుకొన్నప్పుడు - "వీళ్లిద్దరి మధ్యా భేదం ఉంటేనే మంచిది" అనుకొన్న విజిగీషువు మధ్యమోదాసీనులలో ఎవడు మండలానికి ఇష్టుడో వానిని ఆశ్రయించి వానికి సహాయం చెయ్యాలి.

మూ. 1. మధ్యమచరితేన ఉదాసీనచరితం వ్యాఖ్యాతమ్. ఉదాసీనశ్చేన్మధ్యమం లిప్సేత యతః శత్రుమతిసందధ్యాత్, మిత్రస్యోపకారం కుర్యాత్. మధ్యమముదాసీనం వా దణ్డోపకారిణం లభేత తతః పరిణమేత.

2. ఏవముపగృహ్యాత్మానమ్ అరిప్రకృతిం కర్శయేత్, మిత్రప్రకృతిం చోపగృహ్ణీయాత్.

3. సత్యప్యమిత్రభావే తస్యానాత్మవాన్ నిత్యాపకారీ శత్రుః శత్రుసహితః పార్ష్ణిగ్రాహో వా వ్యసనీ యాతవ్యో వ్యసనే వా నేతురభియోక్తేత్యరిభావినః.

వ్యా. 1. మధ్యముని విషయంలో అనుసరించిన విధానంచేత ఉదాసీనుని విషయంలో అనుసరించిన విధానం కూడ విశదీకరించినట్లే. ఆ యా సమయాలలో మధ్యమునితో ఎలా ప్రవర్తించాలో అలాంటి సమయాలలో ఉదాసీనునితో కూడ అదే విధంగా ప్రవర్తించాలి అని అర్థం. ఉదాసీనుడు మధ్యముణ్ణి ఆక్రమించా లని అభిలషించిన ట్లయితే విజిగీషువు ఏ పద్ధతి అవలంబిస్తే తన శత్రువుకు అపకారం జరుగుతుందో, మిత్రునికి ఉపకారం జరుగుతుందో ఆ పద్ధతి అవలంబించాలి. మధ్యమోదాసీనులలో ఎవడు తనకు సైన్యం ఇచ్చి ఉపకారం చేస్తాడో వాని పక్షాన చేరాలి.

2. ఈ విధంగా తాను బలవంతుడై శత్రువును కృశింపచెయ్యాలి. మిత్రునికి సహాయం చెయ్యాలి.

3. ('అరి' అని చెప్పబడే సరిహద్దులలో ఉండే సామంతులలో అరిభావి, మిత్రభావి, భృత్యభావి అని మూడు రకాలవాళ్లు ఉంటారు. వాళ్లలో ఎనిమిది విధాలైన అరిభావిసామంతులను గూర్చి చెపుతున్నాడు) - సరిహద్దులో ఉండడంచేత అలా ఉన్నవాళ్లందరూ విజిగీషువుకు శత్రులుగా ఉండడం సమానమే అయినా వాళ్లలో- అనాత్మవంతుడు (ఇంద్రియాలు తన వశంలో లేనివాడు), నిత్యమూ అపకారం చేసేవాడు, శత్రువు (అకారణంగా ద్వేషించేవాడు), శత్రువుతో కలిసినవాడు, పార్ష్ణిగ్రాహుడు, వ్యసనాలలో ఉన్నవాడు, యాతవ్యుడు, నేత (విజిగీషువు) కష్టాలలో ఉన్నప్పుడు వానిపై దండెత్తి వచ్చేవాడు అని 'అరిభావులు' ఎనిమిది రకాలు.

మూ. 1. ఏకార్థాభిప్రయాతః, పృథగర్థాభిప్రయాతః, సంభూయ యాత్రికః సంహితప్రయాణికః, స్వార్థాభిప్రయాతః, సాముత్థాయికః, కోశ

దణ్డయోరన్యతరస్య క్రేతా, విక్రేతా, ద్వైధీభావిక ఇతి మిత్రభావినః.

2. సామన్తో బలవతః ప్రతిఘాతః అన్తర్ధిః ప్రతివేశో వా బలవతః పార్ష్ణిగ్రాహో వా స్వయముపనతః ప్రతాపోపనతో వా దణ్డోపనత ఇతి భృత్యభావినః సామన్తాః.

3. తైర్భూమ్యేకాన్తరాః వ్యాఖ్యాతాః.

వ్యా. 1. విజిగీషువు ఏ ప్రయోజనం ఉద్దేశించి వెడుతున్నాడో ఆ ప్రయోజనాన్నే సాధించడానికి (మరొక ప్రక్కనుంచి) వెళ్లేవాడు, వేరైన ప్రయోజనాన్ని ఉద్దేశించి వెళ్లేవాడు (విజిగీషువు భూమికోసం వెడితే తాను ధనంకోసం వెళ్లేవాడు), విజిగీషువుతో కలిసి వెళ్లేవాడు, సంధి చేసికొని వెళ్లేవాడు, తన (విజిగీషువుయొక్క) ప్రయోజనం సాధించడంకోసం వెళ్లేవాడు,సాముత్థాయికుడు (కలిసి శూన్యనివేశనాదికర్మలు చేసేవాడు), కోశదండాలలో ఒకదానిని కొని మరొకదానిని అమ్మేవాడు, ద్వైధీభావానికి ఉపయోగించేవాడు అని మిత్రభావిసామంతుడు ఎనిమిది విధాలు.

2. బలవంతుణ్ణి అడ్డుకొనేవాడు, అంతర్ధి(శత్రువుకూ నాయకునికి మధ్యనున్న వాడు), సరిహద్దులో ఉన్నవాడు, బలవంతుని పార్ష్ణిగ్రాహుడు, స్వయంగా వచ్చి ఆశ్రయించిన లేదా ప్రతాపానికి భయపడి వచ్చి ఆశ్రయించిన దండోపనతుడు (సైన్యం మూలాన లొంగినవాడు) అని భృత్యభావిసామంతులు ఆరు విధాలు.

3. వీటిచేత ఒక రాజ్యం అవతల ఉన్న వాళ్లను కూడ వివరించి నట్లే. అనగా భూమ్యేకాంతరు లవడంచేత మిత్రులైనవాళ్లలో గూడ అరిభావిత్వ-మిత్రభావిత్వ-భృత్యభావిత్వా లుంటాయి అని భావం.

శ్లో. తేషాం శత్రువిరోధే యన్మిత్రమేకార్థతాం వ్రజేత్,
శక్త్యా తదనుగృహ్ణీయాద్ విషహేత యయా పరమ్.

వ్యా. ఆ భూమ్యేకాంతరులలో ఏ మిత్రుడు ఎవరైన శత్రువుతో తనకు (విజిగీషువుకు) విరోధం ఏర్పడినప్పుడు ఏకార్థుడుగా ప్రవర్తిస్తాడో అనగా తనతో కలిసి ఆ శత్రువును ఎదిరిస్తాడో, వానికి, ఎంత శక్తి ఉంటే శత్రువు ధాటికి తట్టుకోగలుగుతాడో అంత శక్తి కల్పించాలి.

శ్లో. ప్రసాధ్య శత్రుం యన్మిత్రం వృద్ధం గచ్ఛేదవశ్యతామ్,
సామన్తైకాన్తరాభ్యాం తత్ ప్రకృతిభ్యాం విరోధయేత్.

వ్యా. ఏ మిత్రుడు శత్రువును జయించి, అభివృద్ధి పొందడంచేత తన అదుపులో ఉండడో వానికి సామంతైకాంతరులైన ప్రకృతులతో (అరిప్రకృతి - మిత్రప్రకృతులతో) విరోధం కల్పించాలి.

శ్లో. తత్కులీనావరుద్ధాభ్యాం భూమిం వా తస్య హారయేత్,
యథా వానుగ్రహాపేక్షం వశ్యం తిష్ఠేత్ తథా చరేత్.

వ్యా. లేదా వాని భూమిని తత్కులీనునిచేత (రాజ్యకాంక్షియైన అతని వంశానికి చెందినవానిచేత), లేదా అవరుద్ధునిచేత (వాని కోపానికి గురియై నిర్బంధంలో ఉన్న పుత్రునిచేత) ఆక్రమింపచెయ్యాలి. లేదా అతడు సర్వదా తన అనుగ్రహం కోరుతూ ఎలా వశుడై ఉంటాడో అలా చెయ్యాలి.

శ్లో. నోపకుర్యాదమిత్రం వా గచ్ఛేద్యదతికర్శితమ్,
తదహీనమవృద్ధం చ స్థాపయేన్మిత్రమర్థవత్.

వ్యా. స్వప్రయోజనాన్ని సాధించుకొనడంలో నేర్పుగల విజిగీషువు ఏ మిత్రుడు చాల కృశించిపోయి తనకు ఉపకారం చేయజాలకుండా ఉన్నాడో, లేదా తన శత్రువు పక్షానికి వెళ్లేట ట్లున్నాడో అలాంటి మిత్రుడు ఎక్కువ హీనుడుగా గాని, బాగా సమృద్ధి పొందినవాడుగా గాని ఉండకుండే టట్లు చెయ్యాలి.

శ్లో. అర్థయుక్త్యా చలం మిత్రం సంధిం యదుపగచ్ఛతి,
తస్యాపగమనే హేతుం విహన్యాన్న చలేద్యథా.

వ్యా. ఏ చలమిత్రుడు (స్థిరత్వం లేని మిత్రుడు) ఏదో ప్రయోజనాన్ని అపేక్షించి సంధి చేసుకుంటాడో, అతడు చలించకుండా ఉండడంకొరకు, అతడు తనను విడిచి వెళ్లిపోవడానికి తగిన కారణా లేవీ లేకుండా తొలగించాలి.

శ్లో. అరిసాధారణం యద్వా తిష్ఠేత్ తదరితః శఠమ్,
భేదయేద్ భిన్నముచ్ఛిన్ద్యాత్తతః శత్రుమనన్తరమ్.

వ్యా. ఏ మిత్రుడు తనతోను తన శత్రువుతోనూ కూడ సమంగానే మైత్రి చూపుతాడో అలాంటి శఠుడైన మిత్రునికీ శత్రువుకీ మధ్య భేదం కల్పించి (వాళ్లని విడదీసి) ఆ విధంగా విడదీయబడిన మిత్రుణ్ణి నిర్మూలించి తరవాత శత్రువును నిర్మూలించాలి.

శ్లో. ఉదాసీనం చ యత్తిష్ఠేత్ సామన్తైస్తద్విరోధయేత్,
తతో విగ్రహసంతప్తముపకారం నివేశయేత్.

వ్యా. ఏ మిత్రుడు తన విషయంలోను తన శత్రువు విషయంలోనూ కూడ ఉదాసీనుడుగా ఉంటాడో అలాంటి మిత్రునికి సామంతులతో విరోధం కల్పించి తన ఉపకారం కోరేవాణ్ణిగా చెయ్యాలి.

శ్లో. అమిత్రం విజిగీషుం చ యత్ సంచరతి దుర్బలమ్,
తద్ బలేనానుగృహ్ణీయాద్ యథా స్యాన్న పరాఙ్ముఖమ్.

వ్యా. దుర్బలుడైన ఏ మిత్రుడు అమిత్రుణ్ణి, విజిగీషువును (తనను) కూడ స్వలాభాపేక్షతో ఆశ్రయిస్తాడో అలాంటి మిత్రుడు తన విషయంలో వైముఖ్యం చెందకుండా వానికి సైన్యం ఇచ్చి అనుగ్రహించాలి.

శ్లో. అపనీయ తతోఽన్యస్యాం భూమౌ వాసం నివేశయేత్,
నివేశ్య పూర్వం తత్రాన్యం దణ్డానుగ్రహహేతునా.

వ్యా. లేదా అలాంటి మిత్రుని భూమిలో ముందుగానే సైన్యం ఇవ్వడం అనే అనుగ్రహాన్ని కారణంగా చూపి మరొకనిని నిలిపి, ఆ మిత్రుణ్ణి ఆతని భూమినుండి తొలగించి మరొక భూమిలో (శత్రుసాహాయ్యం కోరవలసిన అవసరం ఉండని భూమిలో) నిలపాలి.

శ్లో. అపకుర్యాత్సమర్థం వా నోపకుర్యాద్యదాపది,
ఉచ్ఛిన్ద్యాదేవ తన్మిత్రం విశ్వస్యాఙ్కముపస్థితమ్.

వ్యా. ఏ మిత్రుడు అపకారం చేస్తాడో, లేదా సామర్థ్యం ఉండి కూడ ఆపత్సమయాలలో ఉపకారం చెయ్యడో ఆ మిత్రుడు నమ్మి దగ్గరకు వచ్చి నప్పుడు వానిని ఏ మాత్రము సందేహించకుండా నిర్మూలించాలి.

శ్లో. మిత్రవ్యసన తో వారిరుత్తిష్ఠేత్ యోఽనవగ్రహః,
మిత్రేణైవ భవేత్ సాధ్యశ్ఛాదితవ్యసనేన సః.

వ్యా. తన (విజిగీషువుయొక్క) మిత్రుడు కష్టాలలో ఉండడంచేత ఏ అడ్డూ

లేక శత్రువు అభివృద్ధి చెందుతున్నప్పుడు ఆ శత్రువును, తన మిత్రుని కష్టాలు తొలగించి, వాని ద్వారానే సాధించాలి.

శ్లో. అమిత్రవ్యసనాన్మిత్రముత్థితం యద్విరజ్యతి,
అరివ్యసనసిద్ధ్యా తచ్ఛత్రుణైవ ప్రసిధ్యతి.

వ్యా. శత్రువు కష్టాలలో ఉండడంచేత అభివృద్ధిపొందిన తన విషయంలో విరక్తుడుగా ఉన్న మిత్రుణ్ణి, శత్రువుకు వచ్చిన కష్టాలు తొలగించి ఆ శత్రువు ద్వారానే, లొంగదీసుకోవాలి.

శ్లో. వృద్ధిం క్షయం చ స్థానం చ కర్శనోచ్ఛేదనం తథా,
సర్వోపాయాన్ సమాదధ్యాదేతాన్ యశ్చార్థశాస్త్రవిత్.

వ్యా. అర్థశాస్త్రం బాగా తెలిసిన విజిగీషువు వృద్ధిని, క్షయాన్ని, స్థానాన్ని, కృశింపచేయడాన్ని, నిర్మూలించడాన్ని, సామాదిసర్వోపాయాలను ఆ యా పరిస్థితులకు అనుగుణంగా ప్రయోగించాలి.

శ్లో. ఏవమన్యోన్యసంచారం షాడ్గుణ్యం యోఽనుపశ్యతి,
స బుద్ధినిగలైర్బద్ధైరిష్టం క్రీడతి పార్థివైః.

ఇతి కౌటలీయార్థశాస్త్రే షాడ్గుణ్యే సప్తమాధికరణే అష్టాదశోఽధ్యాయః
మధ్యమచరితముదాసీనచరితం మణ్డలచరితమ్, ఆదితః షోడశశతతమః. ఏతావతా
కౌటలీయార్థశాస్త్రస్య షాడ్గుణ్యం సప్తమమధికరణం సమాప్తమ్.

వ్యా. ఈ విధంగా ఒక దానితో ఒకటి ముడివడి ఉన్న షాడ్గుణాన్ని ఏ విజిగీషువు బాగా పరిశీలించి ప్రయోగిస్తాడో అతడు బుద్ధి అనే గొలుసులతో కట్టబడిన రాజులతో ఇష్టం వచ్చినట్లు ఆడుకుంటాడు.

*"బాలానందిని" అనే కౌటలీయార్థశాస్త్రాంధ్రవ్యాఖ్యానంలో షాడ్గుణ్యం అనే సప్తమాధికరణంలో మధ్యమచరితం, ఉదాసీనచరితం, మండలచరితం అనే పద్దెనిమిదవ అధ్యాయం, ప్రారంభంనుండి నూటపదహారవ అధ్యాయం సమాప్తం.*

ఇంతటితో కౌటలీయార్థశాస్త్రంలోని షాడ్గుణ్యం అనే ఏడవ అధికరణం సమాప్తం.

## అథ వ్యసనాధికారికమ్ - అష్టమమధికరణమ్

# ప్రథమో ఽధ్యాయః

### సప్తదశశతతమం ప్రకరణమ్ - ప్రకృతివ్యసనవర్గః

(వ్యసనాధికారికం = ఆపదలను గూర్చినది. ప్రకృతివ్యసనవర్గం = ప్రకృతులకు కలిగే ఆపదల సముదాయం)

మూ. 1. వ్యసనయౌగపద్యే సౌకర్యతో యాతవ్యం రక్షితవ్యం వేతి వ్యసనచిన్తా.

2. దైవం మానుషం వా ప్రకృతివ్యసనమ్ అనయాపనయాభ్యాం సంభవతి.

3. గుణప్రాతిలోమ్యమభావః ప్రదోషః ప్రసఙ్గః, పీడా వా వ్యసనమ్. వ్యస్యత్యేనం శ్రేయస ఇతి వ్యసనమ్.

4. స్వామ్యమాత్యజనపదదుర్గకోశదణ్డమిత్రవ్యసనానాం పూర్వం పూర్వం గరీయ ఇత్యాచార్యాః.

వ్యా. 1. శత్రువు వ్యసనంలో ఉన్నప్పుడు, తనకు ఏ వ్యసనమూ లేనప్పుడు శత్రువుమీదికి యుద్ధానికి వెళ్లాలని చెప్పబడింది. అయితే - ఇద్దరికీ వ్యసనం వచ్చినప్పుడు యుద్ధానికి వెళ్లడంలో సౌకర్యం ఉన్నదా లేక రక్షించుకొనడంలో సౌకర్యం ఉన్నదా అనే ప్రశ్న కలుగుతుంది. అందుచేత వ్యసనాలను గూర్చిన విచారణ చేయబడుచున్నది.

2. దైవకృతమైనా, మనుష్యకృతమైనా ప్రకృతివ్యసనం (స్వామ్యాదులకు కలిగే వ్యసనం) అనయ-అపనయాల మూలాన కలుగుతుంది. అనయం అనగా అశుభమైన దైవం. అపనయం అనగా సంధ్యాదిగుణాలను సరిగా ప్రయోగించకపోవడం.

3. ఆ యా ప్రకృతులకు ఉండవలసిన గుణాలకు విరుద్ధమైన గుణాలు ఉండడం, అభావం (దుర్గాదిప్రకృతులు కొన్ని లేకపోవడం). అత్యధికమైన దోషం,

ద్యూతాదులందు అత్యాసక్తి, లేదా దేశాదులకు పీడ-ఇవి వ్యసనం. వీనిని శ్రేయస్సునుంచి దూరం చేస్తుంది కాబట్టి దీనికి వ్యసనం అని పేరు.

4. స్వామి, అమాత్యుడు, జనపదం, దుర్గం, కోశం, దండం, మిత్రుడు -వీళ్లకి కలిగిన వ్యసనాలలో తరవాతిదానికన్న ముందుముందుది గొప్పది అని పూర్వాచార్యులు చెప్పి ఉన్నారు. అనగా స్వామివ్యసన-అమాత్యవ్యసనాలలో అమాత్యవ్యసనంకంటె స్వామివ్యసనం గొప్పది. అమాత్యవ్యసన-జనపదవ్యసనాలలో జనపదవ్యసనంకంటె అమాత్యవ్యసనం గొప్పది ఇత్యాదిరీతిలో ఉత్తరోత్తరంకంటె పూర్వపూర్వవ్యసనం గొప్పది అని అర్థం.

మూ. 1. నేతి భారద్వాజః, స్వామ్యమాత్యవ్యసనయోః అమాత్య వ్యసనం గరీయః ఇతి. మన్త్రో మన్త్రఫలావాప్తిః, కర్మానుష్ఠానమ్, ఆయవ్యయ కర్మ, దణ్డప్రణయనమ్, అమిత్రాటవీప్రతిషేధః, రాజ్యరక్షణం, వ్యసనప్రతీకారః, కుమారరక్షణమ్, అభిషేకశ్చ కుమారాణామాయత్తమమాత్యేషు. తేషామభావే తదభావః. ఛిన్నపక్షస్యేవ రాజ్ఞశ్చేష్టానాశః, వ్యసనేషు చాసన్నాః పరోపజాపాః, వైగుణ్యే చ ప్రాణబాధః ప్రాణాన్తికచరత్వాద్రాజ్ఞః ఇతి.

2. నేతి కౌటల్యః - మన్త్రిపురోహితాదిభృత్యవర్గమ్, అధ్యక్షప్రచారం, పురుషద్రవ్యప్రకృతివ్యసనప్రతీకారమ్, ఏధనం చ రాజైవ కరోతి. వ్యసనిషు వామాత్యేషు అన్యానవ్యసనినః కరోతి. పూజ్యపూజనే దూష్యావగ్రహే చ నిత్యయుక్తః తిష్ఠతి. స్వామీ చ సంపన్నః స్వసంపద్భిః ప్రకృతీః సంపాదయతి. స్వయం యచ్ఛీలస్తచ్ఛీలాః ప్రకృతయో భవన్తి. ఉత్థానే ప్రమాదే చ తదాయత్తత్వాత్. తత్కూటస్థానీయో హి స్వామీతి.

వ్యా. 1. అది కాదు అంటాడు భరద్వాజుడు. ఎందువల్ల ననగా స్వామివ్యసన-అమాత్యవ్యసనాలలో అమాత్యవ్యసనమే గొప్పది. మంత్రము (ఆలోచన), మంత్రఫలప్రాప్తి, ఆ యా కర్మలను చెయ్యడం, ఆయవ్యయాలను చూచుకోవడం, దండాన్ని (సైన్యాన్ని) సమకూర్చడం, అమిత్రులను ఆటవికులను అడ్డగించడం, రాజ్యాన్ని రక్షించడం, వ్యసనాలకి ప్రతిక్రియ చేయడం, రాజకుమారులను రక్షించడం,

వాళ్లకి రాజ్యాభిషేకం చేయడం ఇవన్నీ అమాత్యులమీదనే అధారపడి ఉంటాయి. అమాత్యులు లేకపోతే ఇవేమీ జరగవు. రెక్కలు నరికిన పక్షి వలె రాజు, అమాత్యుడు లేకపోతే కదలజాలడు (ఏ పనీ చేయలేడు). వ్యసనాలలో శత్రువులనుండి రహస్యంగా జరిగే ఉపజాపాలు (ప్రజలను దుష్టులను రెచ్చగొట్టడాలు) దగ్గరనే ఉంటాయి. అమాత్యులలో ఏమైనా చెడ్డ గుణాలు ఉన్నాయా రాజు ప్రాణాలకే ముప్పు. ఎందువల్ల ననగా అమాత్యుడు రాజు ప్రాణాలకి దగ్గరగా తిరుగుతూంటాడు.

2. అది యుక్తం కాదంటాడు కౌటల్యుడు. మంత్రిపురోహితాదిభృత్యసముదాయాన్ని, సువర్ణాధ్యక్షుడు మొదలైన అన్ని విధాలైన అధ్యక్షుల నియమనాన్నీ లేదా కార్యకలాపాలను, మంత్రులు మొదలైన పురుషప్రకృతులయొక్క జనపదదుర్గకోశాది ద్రవ్యప్రకృతులయొక్క వ్యసనాలకి ప్రతిక్రియను రాజ్యాభివృద్ధిని కూడ రాజే చేస్తాడు. అమాత్యులకు వ్యసనం కలిగినప్పుడు వ్యసనం లేని మరికొందరిని అమాత్యులనుగా నియమిస్తాడు. పూజించదగిన వారిని పూజించడంలోను, దూష్యులను (సంఘవ్యతిరేకశక్తులను) నిగ్రహించడంలోను జాగరూకుడై ఉంటాడు.తన కుండవలసిన గుణసంపద లన్నీ ఉన్న స్వామి తన ప్రకృతులను కూడ సర్వగుణసంపన్నులను చేస్తాడు. స్వామి ఎలాంటి స్వభావం కలవాడై ఉంటాడో ప్రకృతులు కూడ ఆ విధమైన స్వభావంతోనే ఉంటారు. అభివృద్ధి విషయంలో నైనా, ప్రమాదంలో నైనా (పొరబాటు చేయడంలోనైనా) ప్రకృతు లందరూ స్వామిమీదనే ఆధారపడి ఉంటారు కదా? స్వామి ప్రకృతులకు మూలప్రకృతివంటివాడు కదా?

మూ. 1. అమాత్యజనపదవ్యసనయోః జనపదవ్యసనం గరీయః ఇతి విశాలాక్షః. కోశః, దణ్డః, కుప్యమ్, విష్టిః, వాహనమ్, నిచయాశ్చ జనపదాదుత్తిష్ఠన్తే; తేషామభావో జనపదాభావే స్వామ్యమాత్యయోశ్చానన్తర ఇతి.

2. నేతి కౌటిల్యః. అమాత్యమూలాః సర్వారమ్భాః జనపదస్య కర్మసిద్ధయః స్వతః పరతశ్చ యోగసాధనం వ్యసనప్రతీకారః శూన్యనివేశోపచయౌ, దణ్డకరానుగ్రహశ్చేతి.

3. జనపదదుర్గవ్యసనయోః దుర్గవ్యసనమితి పారాశరాః. దుర్గే హి కోశదణ్డోత్పత్తిః ఆపది స్థానం చ జనపదస్య. శక్తిమత్తరాశ్చ పౌరాః జానపదేభ్యః

నిత్యాశ్చాపది సహాయా రాజ్ఞః. జానపదాస్త్వమిత్రసాధారణా ఇతి.

4. నేతి కౌటల్యః. జనపదమూలా దుర్గకోశదణ్డసేతువార్తారమ్భాః శౌర్యం, స్థైర్యం, దాక్ష్యం, బాహుల్యం చ జానపదేషు. పర్వతాన్తర్ద్వీపాశ్చ దుర్గా నాధ్యుష్యన్తే జనపదాభావాత్. కర్షకప్రాయే తు దుర్గవ్యసనమ్, ఆయుధీయ ప్రాయే తు జనపదే జనపదవ్యసనమితి.

వ్యా. 1. అమాత్యవ్యసన - జనపదవ్యసనాలలో జనపదవ్యసనం గొప్ప దని విశాలాక్షుడు అన్నాడు. ఎందువల్ల ననగా కోశము, సైన్యము,కుప్యము (వస్త్రాస్తరణాదికం) విష్టి, (కర్మకరవర్గం) వాహనం (గజాశ్వాదులు), నిచయాలు (ధాన్యస్నేహాది సముదాయాలు) ఇవన్నీ జనపదం నుంచే లభిస్తాయి. జనపదం లేకపోతే ఇవేమీ ఉండవు. జనపదం అనేది లేకపోతే వెంటనే స్వామి, అమాత్యుడు కూడ లేకుండా పోతారు.

2. "అది కాదు; జనపదంలో జరగవలసిన అన్ని పనులు, ఆ యా కర్మల సిద్ధులు, స్వజనంనుంచి, శత్రుజనంనుంచి యోగక్షేమాల సాధనం, వ్యసనాలకు ప్రతిక్రియ చేయడం, శూన్యస్థానాలలో గ్రామాదులను నెలకొల్పడం, వాటిని వృద్ధి పొందించడం, ఉత్తమసాహసాదిదండాలను విధించడంలోను పన్నులు వసూలు చేయడంలోను లాభాలు ఆర్జించడం, ఇవన్నీ అమాత్యునిమీదనే ఆధారపడి ఉంటాయి" అని కౌటల్యు డంటాడు.

3. జనపదవ్యసన-దుర్గవ్యసనాలలో దుర్గవ్యసనం గొప్పది అని పారాశరులు (పరాశరుని మతం అనుసరించేవారు) అన్నారు. దుర్గం ఉంటేనే కోశం, దండం (సైన్యం) ఇవి ఉత్పన్న మౌతాయి. ఆపత్సమయంలో దుర్గం జనపదానికి స్థానం కూడా కల్పిస్తుంది. పౌరులు జానపదులకంటె ఎక్కువ శక్తికలవారు. ఆపత్సమయంలో వాళ్లు తప్పక సహాయం చేస్తారు. జానపదులైతే శత్రువులకు కూడా సాధారణులే, అనగా కొన్ని పరిస్థితులలో శత్రువువైపుకు కూడా వెళ్లిపోతారు అని పారాశరుల అభిప్రాయం.

4. "అది యుక్తం కాదు. దుర్గం, కోశం, దండం,సేతువులు, వార్త అనగా కృషివాణిజ్యపశుపాలనాదికము, జనపదంమీదనే ఆధారపడి ఉంటాయి. జానపదులలో శౌర్యమూ, స్థిరత్వమూ, మంచితనమూ సంఖ్యాధిక్యము కూడా ఉంటాయి. జనపదం

(జనుల నివాసానికి అనుగుణమైన స్థానం) కాకపోవడంచేతనే ఎవరూ కూడ పర్వతరూపాలు, అంతర్ద్వీపరూపాలు (చుట్టూ నీళ్లు ఉన్న చిన్న ద్వీపాల రూపంలో ఉన్నవి) అయిన దుర్గాలలో నివసించరు. అయితే జనపదంలో కర్షకులు అధికసంఖ్యలో ఉంటే దుర్గానికి వ్యసనం కలుగుతుంది. ఆయుధాలతో జీవించేవాళ్లు అధికంగా ఉంటే జనపదానికి వ్యసనం కలుగుతుంది.

మూ. 1. దుర్గకోశవ్యసనయోః కోశవ్యసనమితి పిశునః. కోశమూలో హి దుర్గసంస్కారః దుర్గరక్షణం జనపదమిత్రామిత్రనిగ్రహో, దేశాన్తరితానా ముత్సాహనం దణ్డబలవ్యవహారశ్చ. దుర్గః కోశాదుపజాప్యః పరేషామ్. కోశమాదాయ చ వ్యసనే శక్యమపయాతుం న దుర్గమ్ ఇతి.

2. నేతి కౌటల్యః. దుర్గార్పణః కోశో, దణ్డః, తుష్ణీంయుద్ధమ్, స్వపక్షనిగ్రహః, దణ్డబలవ్యవహారః, ఆసారప్రతిగ్రహః, పరచక్రాటవీప్రతిషేధశ్చ. దుర్గాభావే చ కోశః పరేషామ్. దృశ్యతే హి దుర్గవతామనుచ్ఛిత్తిరితి.

వ్యా. 1. దుర్గవ్యసన-కోశవ్యసనాలలో కోశవ్యసనం గొప్పది అని పిశునుడు అన్నాడు. (పిశునుడు అనగా నారదుడు. గ.శా.) దుర్గాన్ని సంస్కరించడం (మరమ్మత్తులు చేయడం) దుర్గాన్ని రక్షించడం, జనపదాన్ని అ మిత్రుల్ని పశంలో ఉంచుకొనడం, దూరదేశాలలో ఉన్నవాళ్లను ప్రోత్సహించడం, దండబలవ్యవహారం, (సైన్యబలవ్యవహారం) ఇవన్నీ కోశం మీదనే ఆధారపడి ఉంటాయి కదా? కోశం సహాయంతోనే శత్రువులు దుర్గంలో ఉపజాపం కలిగిస్తారు. (ధనం ఇచ్చి దుర్గంలో ఉన్న అధికారులు, ప్రజలు మొదలైనవాళ్లు రాజుకు ఎదురుతిరిగే టట్లు చేస్తారు). ఏదైనా వ్యసనం కలిగి నప్పుడు కోశం తీసికొని పారిపోవచ్చు; దుర్గాన్ని ఆ విధంగా తీసికొని వెళ్లడం కుదరదు.

2. అది యుక్తం కాదు అని అంటాడు కౌటల్యుడు. కోశం, దండం, తూష్ణీం యుద్ధం (coldwar), తన పక్షాన్ని అదుపులో ఉంచుకొనడం, సైన్యబలవ్యవహారం, మిత్రసైన్యాన్ని స్వీకరించడం, శత్రుసైన్యాన్ని, ఆటవికసైన్యాన్నీ అడ్డుకోవడం ఇవన్నీ దుర్గంమీదనే ఆధారపడి ఉంటాయి. దుర్గం లేకపోతే కోశాన్ని పరులు అపహరించివేస్తారు. దుర్గం కలవాళ్లు పరాజయం పొందకపోవడం చూడబడుతున్నది గదా?

మూ. 1. కోశదణ్డవ్యసనయోః దణ్డవ్యసనమ్ ఇతి కౌణపదన్తః. దణ్డమూలో హి మిత్రామిత్రనిగ్రహః, పరదణ్డోత్సాహనం, స్వదణ్డప్రతిగ్రహశ్చ. దణ్డాభావే చ ధ్రువః కోశవినాశః. కోశాభావే చ శక్యః కుప్యేన భూమ్యా పర భూమిస్వయంగ్రాహేణ వా దణ్డః పిణ్డయితుమ్, దణ్డవతా చ కోశః. స్వామిన శ్చాసన్నవృత్తిత్వాదమాత్యసధర్మా దణ్డ ఇతి.

2. నేతి కౌటల్యః - కోశమూలో హి దణ్డః. కోశాభావే దణ్డః పరం గచ్ఛతి, స్వామినం వా హన్తి. సర్వాభియోగకరశ్చ కోశో ధర్మకామహేతుః. దేశకాలకార్యవశేన తు కోశదణ్డయోరన్యతరః ప్రమాణీభవతి. లబ్ధపాలనో హి దణ్డః కోశస్య. కోశః కోశస్య దణ్డస్య చ భవతి. సర్వద్రవ్యప్రయోజకత్వాత్ కోశవ్యసనం గరీయ ఇతి.

వ్యా. 1. కోశవ్యసన-దండవ్యసనాలలో దండవ్యసనం గొప్పది అని కౌణపదంతుని అభిప్రాయం. (కౌణపదంతు డనగా భీష్ముడు. గ.శా.) మిత్రులను అమిత్రులను అదుపులో ఉంచడం, శత్రుసైన్యాన్ని ప్రోత్సహించడం, తన సైన్యాన్ని (శత్రుసైన్యంతో యుద్ధం చేసే విధంగా) స్వీకరించడం అనేవి దండంమీదనే ఆధారపడి ఉంటాయి. దండం లేకపోతే కోశం నశించడం నిశ్చితం. కోశం లేకపోయినా కుప్యం గాని, భూమి గాని, ఇచ్చి, శత్రుభూమిని స్వయంగా ఆక్రమించి దండాన్ని ప్రోగుచేసుకోవడానికి అవకాశం ఉంటుంది. దండం ఉన్నవానిచేత కోశం ప్రోగుచేసుకొనడానికి శక్యం అవుతుంది. కోశం ఎల్లప్పుడు స్వామి దగ్గరనే ఉంటుంది గాన అమాత్యుని వంటిది.

2. అది కాదు అంటాడు కౌటల్యుడు. దండానికి మూలం కోశమే. కోశం లేకపోతే దండం శత్రువు వైపుకు వెళ్లిపోతుంది, లేదా స్వామినే చంపివేస్తుంది. కోశం సమస్తకార్యాలు సఫలం అయే టట్లు చేస్తుంది. అది ధర్మకామాలకు హేతువు కూడ. అయితే దేశాన్ని పట్టి, కాలాన్ని పట్టి, కార్యాన్ని పట్టి ఒకప్పుడు కోశం ఉపకరిస్తుంది. ఒకప్పుడు దండం ఉపకరిస్తుంది. దండం లభించిన కోశాన్ని రక్షిస్తుంది కదా? కోశమైతే కోశాన్నీ దండాన్నీ కూడ రక్షస్తుంది. కోశం సమస్తద్రవ్యప్రకృతులయందు కార్యకారి (కార్యాన్ని సాధించేది) గాన కోశవ్యసనం దండవ్యసనంకంటె గొప్పది.

మూ. 1. దణ్డమిత్రవ్యసనయోః మిత్రవ్యసనమితి వాతవ్యాధిః. మిత్రమ్ అభృతం వ్యవహితం చ కర్మ కరోతి; పార్ష్ణిగ్రాహమ్, ఆసారమ్, అమిత్రమ్ ఆటవికం చ ప్రతికరోతి; కోశదణ్డభూమిశ్చ ఉపకరోతి వ్యసనావస్థాయోగమితి.

2. నేతి కౌటిల్యః. దణ్డవతో మిత్రం మిత్రభావే తిష్ఠతి, అమిత్రో వా మిత్రభావే. దణ్డమిత్రయోస్తు సాధారణే కార్యే సారతః స్వయుద్ధదేశకాలలాభాద్విశేషః. శీఘ్రాభియానే తు అమిత్రాటవికాభ్యన్తరకోపే చ న మిత్రం విద్యతే. వ్యసనయౌగపద్యే పరవృద్ధౌ చ మిత్రమర్థయుక్తౌ తిష్ఠతి.

3. ప్రకృతివ్యసనసంప్రధారణముక్తమితి.

వ్యా. 1. దండవ్యసన-మిత్రవ్యసనాలలో మిత్రవ్యసనం గొప్పది అని వాతవ్యాధి (ఉద్ధవుడు. గ.శా) అభిప్రాయం. మిత్రుడు వేతనం ఏమీ తీసికొనకుండా దూరంలోనే ఉండి పని చేస్తాడు. పార్ష్ణిగ్రాహుణ్ణి, ఆసారుణ్ణి (పార్ష్ణిగ్రాహుని మిత్రుణ్ణి), శత్రువును, ఆటవికులను అడ్డుకుంటాడు. వ్యసనావస్థలో ఉన్నప్పుడు కోశ-దండ-భూము లిచ్చి ఉపకరిస్తాడు.

2. అది యుక్తం కాదు అంటాడు కౌటిల్యుడు. సైన్యం ఉన్న వాని విషయంలోనే మిత్రుడు మిత్రత్వంతో ఉంటాడు; శత్రువు కూడా మిత్రత్వంతో ఉంటాడు. దండమూ మిత్రుడూ కూడ కార్యం సాధిస్తా రనేది సాధారణమే (సమానమే) అయినా తమకు అనుగుణమైన యుద్ధభూమి, కాలమూ లభించడం అనే సారం(బలం) వల్ల, వాటికి విశేషం ఉంటుంది. అనగా స్వయుద్ధదేశకాలలాభంవల్ల వైశిష్ట్యం ఉంటుంది అని భావం. అయితే శత్రువుమీదకు వెంటనే దాడిచేయవలసినప్పుడు, అమిత్రుల కోపం (తిరుగుబాటు), ఆటవికుల కోపం, ప్రజలలో కోపం వచ్చి నప్పుడు అక్కడ మిత్రు డుండడు. శత్రువుకు విజిగీషువుకు ఒకే సమయంలో వ్యసనం వచ్చినా, శత్రువు అభివృద్ధిలో ఉన్నా మిత్రుడు తన లాభాన్ని గూర్చిన ఆలోచనలో ఉంటాడు.

3. ఈ విధంగా ప్రకృతుల వ్యసనాల విషయంలో పరస్పరము గౌరవలాఘవనిర్ధారణ చేయబడింది.

శ్లో. ప్రకృత్యవయవానాం తు వ్యసనస్య విశేషతః,
బహుభావోఽనురాగో వా సారో వా కర్మసాధకః.

వ్యా. కలిగిన వ్యసనంయొక్క స్వభావాన్ని పట్టి ప్రకృత్యవయవాలు, భిన్న భిన్న ప్రకృతులు, అధికసంఖ్యలో ఉండడం, అనురాగం, శక్తీ ఇవి కార్యాన్ని సాధిస్తాయి. కలిగిన ఆపదను ప్రకృతుల అధికసంఖ్యాదులచేత, అనురాగంచేత, సారంచేత అధిగమించడం శక్యం అవుతుందా కాదా అనే విషయం వచ్చిన ఆపదయొక్క విశేషాన్ని పట్టి ఉంటుంది అని భావం.

శ్లో. ద్వయోస్తు వ్యసనే తుల్యే విశేషో గుణతః క్షయాత్,
శేషప్రకృతిసాద్గుణ్యం యది స్యాన్నావిధేయకమ్.

వ్యా. రెండు ప్రకృతుల వ్యసనం సమంగా ఉన్నప్పుడు, అనగా రెండు ప్రకృతులు వ్యసనం పొందినప్పుడు, మిగిలిన ప్రకృతులలో ఉండవలసిన మంచి గుణాలు తొలగిపోకపోతే (ఉన్నట్లయితే) ఆ రెండు ప్రకృతులలో ఏ ప్రకృతిలోని గుణాలు క్షీణించాయో దాని వ్యసనంలో విశేషం ఉన్న దని గ్రహించాలి.

శ్లో. శేషప్రకృతినాశస్తు యత్రైకవ్యసనాద్భవేత్,
వ్యసనం తద్గరీయః స్యాత్ ప్రధానస్యేతరస్య చ.

ఇతి కౌటలీయార్థశాస్త్రే వ్యసనాధికారికే అష్టమాధికరణే ప్రథమోఽధ్యాయః, ఆదితః సప్తదశశతతమః.

వ్యా. ఒక ప్రకృతికి -అది ప్రధానప్రకృతి అయినా అప్రధానప్రకృతి అయినా- కలిగిన వ్యసనంవల్ల మిగిలిన ప్రకృతులకు కూడ వినాశం కలిగిన ట్లయితే, ఆ వ్యసనం చాల పెద్దది.

"బాలానందిని" అను కౌటలీయార్థశాస్త్రాంధ్రవ్యాఖ్యానంలో వ్యసనాధికారికం అనే ఎనిమిదవ అధికరణంలో ప్రకృతివ్యసనవర్గం అనే మొదటి అధ్యాయం, ప్రారంభంనుంచి నూటపదిహేడవ అధ్యాయం సమాప్తం.

# అథ ద్వితీయో௨ధ్యాయః

## అష్టావింశతిశతతమం ప్రకరణమ్ - రాజరాజ్యయోర్వ్యసనచిన్తా

(నూటఇరవైఎనిమిదవ ప్రకరణం - రాజ-రాజ్యవ్యసనాలను గూర్చిన విచారం.)

మూ. 1. రాజా రాజ్యమితి ప్రకృతిసంక్షేపః.

2. రాజ్ఞః అభ్యన్తరః బాహ్యో వా కోప ఇతి. అహిభయాదాభ్యన్తరః కోపో బాహ్యకోపాత్ పాపీయాన్. అన్తరమాత్యకోపశ్చ అన్తఃకోపాత్. తస్మాత్ కోశదణ్డశక్తిమాత్మసంస్థం కుర్వీత.

3. ద్వైరాజ్యవైరాజ్యయోః - ద్వైరాజ్యమన్యోన్యపక్షద్వేషానురాగాభ్యాం పరస్పరసంఘర్షేణ వా వినశ్యతి. వైరాజ్యం తు ప్రకృతిచిత్తగ్రహణాపేక్షి యథాస్థితమన్యైర్భుజ్యత ఇత్యాచార్యాః.

4. నేతి కౌటల్యః. పితాపుత్రయోః భ్రాత్రోర్వా ద్వైరాజ్యం తుల్యయోగక్షేమమ్. అమాత్యావగ్రహం వర్తయేతేతి. వైరాజ్యే తు జీవతః పరస్యాచ్ఛిద్య "నైతన్మమ" ఇతి మన్యమానః కర్శయత్యపవాహయతి, పణ్యం వా కరోతి,విరక్తం వా పరిత్యజ్య అపగచ్ఛతీతి.

వ్యా. 1. రాజు, ఆతని పరిపాలనము - ఇవే వివిధప్రకృతుల సంక్షిప్తస్వరూపం (sum-total).

2. రాజుకు అభ్యంతరకోపం (రాజ్యంలో వచ్చిన తిరుగుబాటు) లేదా బాహ్యకోపం (శత్రువులనుండి వచ్చిన తిరుగుబాటు) ఈ రెండే ప్రధానమైన వ్యసనాలు అభ్యంతరకోపం దగ్గరనే ఉన్న పాముపగ వంటిది. అందుచేత ఇది బాహ్యకోపం కంటె చాల చెడ్డది. అంతఃకోపంకంటె కూడ అంతరమాత్యకోపం (దగ్గరనే ఉండే అమాత్యుల కోపం) చెడ్డది. అందువల్ల రాజు కోశశక్తిని, దండశక్తిని తనవద్దనే ఉంచుకోవాలి.

3. ద్వైరాజ్యం అనగా ఒక రాజ్యానికి ఇద్దరు రాజులు ఉండడం. వైరాజ్యం అనగా రాజు (న్యాయసంమతుడైన రాజు) లేకపోవడం. ఇద్దరు రాజుల పక్షాలకు చెందినవారిలో పరస్పరం ద్వేషం, ఒక పక్షం విషయంలోనే అనురాగం ఉండడంవల్లా, లేదా పరస్పరవిరోధం వల్లా ద్వైరాజ్యం నశిస్తుంది. వైరాజ్యం అయితే ప్రజల మనస్సు

ఎలా ఉందో తెలుసుకోవా లనే కోరికతో ఉంటుంది. అందుచేత దానిని ప్రజలు ఉన్నదానిని ఉన్నట్లుగా అనుభవిస్తారు అని ఆచార్యు లన్నారు.

4. "అది యుక్తం కాదు. తండ్రి-కుమారులు గాని, ఇద్దరు సోదరులు గాని పాలించే ద్వైరాజ్యాన్ని కూడా యోగక్షేమాలను సమంగా చూచుకొంటూ, అమాత్యులను అదుపులో ఉంచి నడిపించవచ్చును. కాని వైరాజ్యంలో ఒక రాజు, అసలు రాజు జీవించి ఉండగానే వాని దగ్గరనుండి లాగికొని రాజ్యం చేస్తూన్న న్యాయసంమతుడు కాని రాజు "ఏమైనా ఇది నా రాజ్యం కాదు కదా" అనే అభిప్రాయంతో రాజ్యాన్ని కృశింపచేస్తాడు, మరొకచోటికి తొలగిస్తాడు, అమ్ముకుంటాడు. తన విషయంలో ప్రజలకు అనురాగం లేకపోతే విడిచి వెళ్లిపోతాడు" అని కౌటల్యుని అభిప్రాయం.

మూ. 1. అన్ధః చలితశాస్త్రో వా రాజేతి - అశాస్త్రచక్షురన్ధః యత్కిఞ్చన కారీ దృఢాభినివేశీ పరప్రణేయో వా రాజ్యమన్యాయేనోపహన్తి. చలితశాస్త్రస్తు యత్ర శాస్త్రాచ్చలితమతిర్భవతి శక్యానునేయో భవతీత్యాచార్యాః.

2. నేతి కౌటల్యః. అన్ధో రాజా శక్యతే సహాయసంపదా యత్ర తత్ర వా పర్యవస్థాపయితుమితి. చరితశాస్త్రస్తు శాస్త్రాదన్యథాభినివిష్టబుద్ధిః అన్యాయేన రాజ్యమాత్మానం చోపహన్తీతి.

వ్యా. 1. అంధుడైన, అనగా శాస్త్రం అనే నేత్రం లేకపోవడంచేత గ్రుడ్డివాడైన రాజు, ఉండడం మంచిదా, చలితశాస్త్రుడు (శాస్త్రం చదువుకొని ఉండి కూడ ఆ శాస్త్రీయమార్గంనుంచి చలించినవాడు) ఉండడం మంచిదా అన్నప్పుడు "శాస్త్రచక్షుస్సు లేని అంధుడు ఇష్టం వచ్చినట్లు ఏదో ఒకటి చేస్తూ మొండి పట్టుదల కలవాడై, ఇతరులచేత నడపదగినవాడై అన్యాయంచేత రాజ్యాన్ని నశింపచేస్తాడు. చలితశాస్త్రుడైతే ఏ విషయాన్ని గూర్చిన ఆలోచనలో శాస్త్రాన్ని ఉల్లంఘిస్తాడో ఆ విషయంలో నచ్చచెప్పడానికి వీలుగా ఉంటాడు" అని పూర్వాచార్యులు అన్నారు.

2. ఇది యుక్తం కాదని కౌటిల్యు డంటాడు - ఎందువల్ల ననగా అంధుడైన రాజును అమాత్యాదులలో ఉన్న ప్రాజ్ఞత్వాదిగుణసంపదచేత ఏ మార్గంలో నడిపించా లంటే ఆ మార్గంలోనే నడపవచ్చును: నిలపవచ్చును, కాని శాస్త్రానికి విరుద్ధంగా మొండి పట్టుదలతో కూడిన బుద్ధి గల చలితశాస్త్రుడైతే అన్యాయంచేత రాజ్యాన్నీ తననూ కూడ నశింపచేస్తాడు.

మూ. 1. వ్యాధితో నవో వా రాజేతి - వ్యాధితో రాజా రాజ్యోపఘాతమ్ అమాత్యమూలం, ప్రాణాబాధం వా రాజ్యమూలమవాప్నోతి; నవస్తు రాజా స్వధర్మానుగ్రహపరిహారమానకర్మభిః ప్రకృతిరఞ్జనోపకారైః చరతి ఇత్యాచార్యాః.

2. నేతి కౌటిల్యః. వ్యాధితో రాజా యథాప్రవృత్తం రాజప్రణిధిమను వర్తయతి. నవస్తు రాజా "బలావర్జితం మమేదం రాజ్యమ్" ఇతి యథేష్టమనవ గ్రహః చరతి. సాముత్థాయికైరవగృహీతో వా రాజ్యోపఘాతం మర్షయతి. ప్రకృతిష్వరూఢః సుఖం సముచ్ఛేత్తుం భవతి. వ్యాధితే విశేషః పాపరోగీ అపాపరోగీ చ.

వ్యా. 1. వ్యాధితో బాధపడుతూన్న రాజు ఉండడం మంచిదా, నవుడైన (క్రొత్తగా రాజ్యాభిషిక్తుడైన) రాజు ఉండడం మంచిదా అన్నప్పుడు - "వ్యాధితుడైన రాజు భయం లేకుండా ప్రవర్తించే అమాత్యులవల్ల రాజ్యవినాశాన్ని, లేదా రాజ్యం మూలాన (రాజ్యంలోని ప్రకృతుల మూలాన) ప్రాణనాశనం కాని పొందుతాడు. నవుడైన రాజైతే ప్రకృతులకు సంతోషం కలిగించే తన ధర్మాన్ని ఆచరించడం,తన కోశం పెంచుకోవడం, పన్నుల పరిహారం ఇవ్వడం, దానం, గౌరవించడం. ఇతరకర్మలు-వీటిచేత ప్రవర్తిస్తాడు" అని ఆచార్యు లన్నారు.

2. అది కాదంటాడు కౌటిల్యుడు. వ్యాధితుడైన రాజు మొదటినుండీ అమలులో ఉన్న రాజవ్యవహారాన్ని నడిపిస్తాడు. క్రొత్తరాజైతే "ఇది నేను నా బలం చేత సంపాదించుకొన్న రాజ్యం" అని అనుకుంటూ అడ్డు లేకుండా ఇష్టం వచ్చి నట్లు ప్రవర్తిస్తాడు. లేదా సామవాయికులచేత (గ.శా.) ఎదురు తిరిగిన తనవాళ్లచేత (కాంగ్లే) నిగ్రహింపబడి రాజ్యానికి జరిగిన నష్టాన్ని సహిస్తాడు. (ప్రతిక్రియ చేయజాలడు). ప్రకృతులలో బాగా నిలదొక్కుకొనకపోవుటచేత అనాయాసంగా నిర్మూలించడానికి శక్యమైనవా డవుతాడు. అయితే- పాపరోగాలు (కుష్ఠాదిరోగాలు) ఉన్నవాడా, అపాపరోగాలు (సాధారణములైన రోగాలు) ఉన్నవాడా అనే విశేషం మాత్రం చూచుకోవాలి.

మూ. 1. నవేఽప్యభిజాతః అనభిజాత ఇతి. దుర్బలోఽభిజాతః బలవాననభిజాతో రాజేతి- దుర్బలస్యాభిజాతస్య ఉపజాపం దౌర్బల్యాపేక్షాః ప్రకృతయః కృచ్ఛ్రేణోపగచ్ఛన్తి. బలవతశ్చానభిజాతస్య బలాపేక్షాః సుఖేన ఇత్యాచార్యాః.

2. నేతి కౌటల్యః. దుర్బలమభిజాతం ప్రకృతయః స్వయముపనమన్తి, జాత్యమైశ్వర్యప్రకృతిరనువర్తతే ఇతి. బలవతశ్చానభిజాతస్య ఉపజాపం విసంవాదయన్తి. అనురాగే సార్వగుణ్యమ్ ఇతి.

వ్యా. 1. క్రొత్త రాజులో కూడ ఉత్తమవంశీయుడై ఉండడం, అనభిజాతుడై (రాజవంశానికి చెందనివాడై) ఉండడం అనేది విశేషం. దుర్బలుడైన అభిజాతుడు రాజుగా ఉండడం మంచిదా బలవంతుడైన అనభిజాతుడు ఉండడం మంచిదా అన్నప్పుడు - దుర్బలుడైన అభిజాతుడు ప్రకృతులలో ఉపజాపం (పరస్పరభేదం సృష్టించడం) చేయడానికి ప్రయత్నించినప్పుడు ఆతని దౌర్బల్యం తెలిసిన ప్రకృతులు అతికష్టంగా లొంగుతారు. అనభిజాతు డైనా బలవంతుడు చేసే ఉపజాపానికి ఆతని బలం గుర్తించిన ప్రకృతులు సులభంగా లొంగుతారు అని ఆచార్యు లన్నారు.

2. అది కాదంటాడు కౌటల్యుడు. దుర్బలుడైన అభిజాతునికి ప్రజలు స్వయంగానే అనుకూలు లౌతారు. ఎందువల్ల ననగా ఐశ్వర్యార్హత్వం, ఉత్తమజాతికి చెందినవానిని స్వయంగానే అనుసరిస్తుంది అని వాళ్ల నమ్మకం. బలవంతుడైన అనభిజాతుడు చేసే ఉపజాపాన్ని వాళ్లు వమ్ము చేస్తారు. అనురాగం ఉంటే అన్ని గుణాలూ కనబడతాయి. అందువల్ల ప్రకృతులు అభిజాతునియందు అనురాగం కలవారవడంచేత ఆతనిలో అన్ని గుణాలూ ఉన్నట్లు భావిస్తారు అని అర్థం.

మూ. 1. ప్రయాసవధాత్ సస్యవధః ముష్టివధాత్పాపీయాన్.

2. నిరాజీవత్వాద్ వృష్టిరతివృష్టిత ఇతి.

3. శ్లో. ద్వయోర్ద్వయోర్వ్యసనయోః ప్రకృతీనాం బలాబలమ్,
పారమ్పర్యక్రమేణోక్తం యానే స్థానే చ కారణమ్.

ఇతి కౌటలీయార్థశాస్త్రే వ్యసనాధికారికేఽష్టమాధికరణే ద్వితీయోఽధ్యాయః
రాజరాజ్యయోర్వ్యసనచిన్తా, ఆదితోఽష్టాదశశతతమః.

వ్యా. 1. తయారైన సస్యాన్ని (పంటను) నశింపచేయడం ముష్టివధ (విత్తనాలు చల్లకపోవడం) కంటె చాలా చెడ్డది. ఫలం లభించకపోవడం రెండింటిలోనూ సమానమే అయినా సస్యవధ చేయడంచేత అంతవరకూ సస్యాన్ని పెంచడానికి చేసిన ప్రయాస అంతా భగ్నం చేయబడిపోతుంది.

2. అసలే వర్షాలు లేకపోవడం అతివృష్టికంటె చాల చెడ్డది. ఎందువల్ల ననగా అవృష్టివల్ల జీవనాధారమే లేకుండా పోతుంది కదా?

3. ప్రకృతులలో కలిగే రెండు వ్యసనాలలో ఏది బలవత్తరం ఏది కాదు అనే విషయం శాస్త్రసంప్రదాయాన్ని అనుసరించి చెప్పబడింది. ఇది యుద్ధయాత్ర చేయడానికీ, చేయకుండా ఆగడానికీ కారణం. అనగా వ్యసనాల బలాబలాలను పట్టి యానస్థానాలు నిర్ణయించుకోవాలి అని భావం.

"బాలానందిని" అను కౌటలీయార్థశాస్త్రాంధ్రవ్యాఖ్యానంలో వ్యసనాధికారికం అనే అష్టమాధికరణంలో రాజ-రాజ్యాల వ్యసనాలను గూర్చిన విమర్శ అనే రెండవ అధ్యాయం, ప్రారంభంనుండి నూటపద్దెనిమిదవ అధ్యాయం సమాప్తం.

## అథ తృతీయోఽధ్యాయః

### ఏకోనత్రింశచ్ఛతతమం ప్రకరణమ్ - పురుషవ్యసనవర్గః

మూ. 1. అవిద్యావినయః పురుషవ్యసనహేతుః. అవినీతో హి వ్యసన దోషాన్న పశ్యతి.

2. తానుపదేక్ష్యామః- కోపజః త్రివర్గః, కామజః చతుర్వర్గః.

3. తయోః కోపో గరీయాన్. సర్వత్ర హి కోపశ్చరతి. ప్రాయశశ్చ కోపవశా రాజానః ప్రకృతికోపైః హతాః శ్రూయన్తే. కామవశాః క్షయవ్యయ నిమిత్తమ్ అరివ్యాధిభిః ఇతి.

వ్యా. 1. ఆన్వీక్షికి మొదలైన విద్యలలో వినయం (ట్రైనింగ్) పొందకపోవడమే పురుషవ్యసనాలకి (దుర్వ్యసనాలకి) హేతువు. వినీతుడు కానివాడు (విద్యను అభ్యసించనివాడు) వ్యసనాలవల్ల కలిగే దోషాలను అర్థం చేసుకొనజాలడు.

2. ఆ వ్యసనాలను గూర్చి చెపుతాం. కోపం (క్రోధం) వల్ల కలిగేవి మూడు వ్యసనాలు; కామంవల్ల కలిగేవి నాలుగు, (వాక్పారుష్యం, అర్థదూషణం, దండపారుష్యం - ఇవి కోపజత్రివర్గం. వేట, జూదం, స్త్రీలు, పానం - ఇవి కామంవల్ల కలిగే చతుర్వర్గం).

3. వాటిలో క్రోధం చాల చెడ్డది. ఎందువల్ల ననగా అన్ని విషయాలలోను క్రోధం రావడానికి అవకాశం ఉంది. సాధారణంగా క్రోధానికి వశులైపోయి రాజులు

ప్రకృతుల కోపాలచేత (తిరుగుబాట్లచేత) చంపబడినట్లుగా వింటున్నాం. కామవశులైన రాజులు క్షయ-వ్యయాలకు లోనై శత్రువులచేత వ్యాధులచేత చంపబడ్డారు.

మూ. 1. నేతి భారద్వాజః. సత్పురుషాచారః కోపః. వైరయాతనమ్, అవజ్ఞావధః, భీతమనుష్యతా చ. నిత్యశ్చ కోపసంబన్ధః పాపప్రతిషేధార్థః. కామః సిద్ధిలాభః, సాన్త్వం, త్యాగశీలతా,సంప్రియభావశ్చ. నిత్యశ్చ కామేన సంబన్ధః కృతకర్మణః ఫలోపభోగార్థః ఇతి.

2. నేతి కౌటల్యః. ద్వేష్యతా, శత్రువేదనం, దుఃఖాసంగశ్చ కోపః. పరిభవో, ద్రవ్యనాశః, పాటచ్చరద్యూతకారలుబ్ధకగాయనవాదకైశ్చానర్థ్యైః సంయోగః కామః.

వ్యా. 1. కోపకామాలు వ్యసనాలు (వ్యసనకారణాలు) కావంటాడు భారద్వాజుడు. ఎందువల్ల ననగా - కోపం అనేది సత్పురుషుల ఆచారం (ధర్మం).కోపం ఉండడంవల్ల వైరానికి ప్రతిక్రియ చేయడం, అవమానాన్ని నివారించుకొనడం, మనుష్యులకు భయం కలిగించడం అనేవి ఉంటాయి. పాపాత్ములను నిగ్రహించడానికి కోపాన్ని అవలంబించడం నిత్యమైనది (తప్పనిసరి అయినది). కార్యసిద్ధిలాభమే కామం. అనగా కామం ఉంటేనే కార్యసిద్ధి కలుగుతుంది. కామం ఉండడంవల్ల మనిషికి మృదువుగా మాటలాడడం, త్యాగశీలం,అందరికీ ఇష్టుడుగా ఉండడం అనేవి కలుగుతాయి. చేసిన పనియొక్క ఫలాన్ని అనుభవించడానికి కామం తప్పనిసరిగా ఉండవలసిందే.

2. అది యుక్తం కాదంటాడు కౌటిల్యుడు. ఇతరుల ద్వేషానికి పాత్రు డవడం, శత్రువుల్ని చేసుకోవడం, దుఃఖంతో సంబంధం -ఇవే క్రోధం అంటే. అనగా క్రోధంవల్ల ఇవన్నీ కలుగుతాయి అని అర్థం. అవమానం, ధననాశం, అనర్థకరులైన దొంగలతోను, జూదరులతోను, వేటగాళ్లతోను, గాయకులతోను, వాద్యాలు మ్రోగించేవాళ్లతోను సంబంధమే కామం. కామంవల్ల ఇవన్నీ కలుగుతాయి అని అర్థం.

మూ. తయోః పరిభవాత్ ద్వేష్యతా గరీయసీ.పరిభూతః స్వైః పరైశ్చ అవగృహ్యతే, ద్వేష్యః సముచ్ఛిద్యతే. ద్రవ్యనాశాత్ శత్రువేదనం గరీయః; ద్రవ్యనాశః కోశాబాధకః, శత్రువేదనం ప్రాణాబాధకమితి. అనర్థ్యసంయోగాత్ దుఃఖసంయోగో గరీయాన్; అనర్థసంయోగో ముహూర్తప్రతీకారః, దీర్ఘక్లేశకరో దుఃఖానామాసఙ్గ ఇతి. తస్మాత్ కోపో గరీయాన్.

వ్యా. కోపం వల్ల ద్వేష్యత శత్రువేదనం దుఃఖాసంగం అనే త్రికం, కామంవల్ల పరాభవం ద్రవ్యనాశం అనర్థ్యులతో సంయోగం అనే త్రికం కలుగుతా యని చెప్పబడింది. వాటిలో కామజత్రికంకంటె కోపజత్రివర్గం గొప్పది అని చెపుతున్నాడు - ఆ రెండు త్రికాలలో అవమానం కంటె ద్వేష్యత్వం గొప్పది. అవమానించబడినవాడు తన వాళ్లచేత పరులచేత కూడ విధేయుడుగా చేయబడతాడు. ద్వేష్యుడైతే, పూర్తిగా నిర్మూలించబడతాడు. ద్రవ్యనాశంకంటె శత్రువేదనం గొప్పది. ద్రవ్యనాశం కోశంమీద దెబ్బతీస్తుంది; శత్రువేదనం ప్రాణాలు తీస్తుంది. అనర్థ్యులతో సంయోగంకంటె దుఃఖసంయోగం గొప్పది. అనర్థ్యసంయోగానికి స్వల్పకాలంలో ప్రతిక్రియ చేసుకోవచ్చు. దుఃఖాలతో సంబంధం దీర్ఘమైన క్లేశాన్ని కలిగిస్తుంది. అందువల్ల కామంకంటె కోపం గొప్పది.

మూ. 1. వాక్పారుష్యమ్,అర్థదూషణమ్, దణ్డపారుష్యమితి. వాక్పారుష్యార్థదూషణయోః వాక్పారుష్యం గరీయః ఇతి విశాలాక్షః. పరుషముక్తో హి తేజస్వీ తేజసా ప్రత్యారోహతి. దురుక్తశల్యం హృది నిఖాతం తేజఃసందీపనమ్ ఇన్ద్రియోపతాపి చ ఇతి.

2. నేతి కౌటల్యః. అర్థపూజా వాక్ఛల్య మపహన్తి, వృత్తివిలోపస్తు అర్థదూషణమ్. అదానమ్, ఆదానం, వినాశః పరిత్యాగో వా అర్థస్యేత్యర్థదూషణమ్.

వ్యా. 1. వాక్పారుష్యం, అర్థదూషణం, దండపారుష్యం (ఇవి కోపజత్రివర్గం). వాక్పారుష్య-అర్థదూషణాలలో వాక్పారుష్యం చెడ్డది అని విశాలాక్షు డన్నాడు. తనను గూర్చి పరుషవాక్యాలు పలకగానే తేజఃశాలి అయినవాడు తేజస్సుచేత ఆ మాటలు పలికినవానిని ఆక్రమిస్తాడు. హృదయంలో నాటబడిన దురుక్తి అనే శల్యం తేజస్సును రగుల్కొలుపుతుంది. ఇంద్రియాలకు తాపం కలిగిస్తుంది.

2. అది యుక్తం కాదని కౌటిల్యు డంటాడు. ధనం ఇచ్చి గౌరవం చేస్తే వాక్కు అనే శల్యాన్ని తొలగిస్తుంది. జీవనాధారాన్ని లోపింపచేయడం అర్థదూషణం. ఇవ్వవలసినది ఇవ్వకపోవడం, తనది కానిదానిని తీసుకోవడం, వినాశం (దేశాన్ని పీడించడం), పరిత్యాగం (రక్షించ దగిన అర్థాన్ని రక్షించకుండా వదలివేయడం) - ఈ నాలుగూ అర్థదూషణంలోని భేదాలు.

మూ. 1. అర్థదూషణదణ్డపారుష్యయోః అర్థదూషణం గరీయః ఇతి

పారాశరాః. అర్థమూలౌ ధర్మకామౌ. అర్థప్రతిబన్ధశ్చ లోకో వర్తతే. తస్యోపఘాతో గరీయాన్ ఇతి.

2. నేతి కౌటిల్యః. సుమహతాప్యర్థేన న కశ్చన శరీరవినాశమిచ్ఛేత్. దణ్డపారుష్యాచ్చ తమేవ దోషమన్యేభ్యః ప్రాప్నోతి. ఇతి కోపజస్త్రివర్గః.

వ్యా. 1. అర్థదూషణదండపారుష్యాలలో అర్థదూషణం చెడ్డది అని పారాశరుల అభిప్రాయం. దర్మకామాలకి మూలం అర్థం. ఈ లోకవ్యవహారం అర్థంమీదనే ఆధారపడి నడుస్తూన్నది. అందువల్ల ఆ అర్థానికి విఘాతం కలిగించడం చాల చెడ్డది.

2. అది కాదంటాడు కౌటిల్యుడు. ఎంత అధికమైన అర్థం ఇచ్చినా ఎవడూ కూడ తన శరీరవినాశాన్ని కోరుకొనడు. దండపారుష్యంవల్ల, ఆవిధమైన దండపారుష్యాన్ని ప్రయోగించిన ఇతరులనుండి ఆ దోషాన్నే, అనగా శరీరత్యాగాన్నే పొందుతాడు. ఇది కోపజత్రివర్గం.

మూ. 1. కామజస్తు-మృగయా, ద్యూతం, స్త్రియః,పానమితి చతుర్వర్గః. తస్య మృగయాద్యూతయోః మృగయా గరీయసీ ఇతి పిశునః. స్తేనామిత్రవ్యాల దావప్రస్ఖలనభయదిఙ్మోహాః, క్షుత్పిపాసే చ ప్రాణాబాధస్తస్యామ్. ద్యూతే తు జితమేవాక్షవిదుషా యథా జయత్సేనదుర్యోధనాభ్యామ్ ఇతి.

2. నేతి కౌటల్యః. తయోరప్యన్యతరపరాజయోఽస్తీతి నలయుధిష్ఠి రాభ్యాం వ్యాఖ్యాతమ్. తదేవ విజితద్రవ్యమామిషం, వైరబన్ధశ్చ,సతోఽర్థస్య విపత్తిః, అసతశ్చార్జనమ్, అప్రతిభుక్తనాశః, మూత్రపురీషధారణబుభుక్షాదిభిశ్చ వ్యాధిలాభ ఇతి ద్యూతదోషః. మృగయాయాం తు వ్యాయామః, శ్లేష్మపిత్తమేదఃస్వేదనాశః, చలే స్థిరే చ కాయే లక్షపరిచయః, కోపభయస్థానేషు చ మృగాణాం చిత్తజ్ఞానమ్ అనిత్యయానం చేతి.

వ్యా. వేట, జూదం, స్త్రీలు, మద్యపానం ఇవి కామంవల్ల పుట్టిన నాలుగు వ్యసనాల వర్గం. వేట, జూదం- ఈ రెండింటిలో వేట చెడ్డది అని పిశునుడు (నారదుడు). వేటలో దొంగలు,శత్రువులు, క్రూరమృగాలు, దావాగ్ని, తొట్రుపాటు, భయం, దిఙ్మోహం (దిక్కులు తెలియకపోవడం), ఆకలి-దప్పులు అనే ప్రాణాపాయం (ప్రాణాపాయ కారణాలు) ఉంటుంది. జూదంలో అయితే పాచికలలో నేర్పు కలవాడు జయత్సేన-దుర్యోధనుల వలె తప్పక జయం పొందుతాడు. (జయత్సేనుడు నలుని సోదరుడై

ఉంటాడు. కాని మహాభారతం ప్రకారం నలుణ్ణి ఓడించినవాని పేరు పుష్కరుడు).

2. అది యుక్తం కాదంటాడు కౌటిల్యుడు. జూదం ఆడే ఇద్దరిలో ఒకరు ఓడిపోతారు అనే విషయం నలయుధిష్ఠిరులచేత స్పష్టం అవుతున్నది. జయించబడిన ఆ ద్రవ్యమే ఆమిషంగా (రెండు జంతువులు పోట్లాడుకొనే మాంసం ముద్ద ఆమిషం) అయి దాని మూలాన వైరబంధం,న్యాయార్జితమైన ధనం నశించడం, అన్యాయంగా ధనం ఆర్జించడం, ఆర్జించినదానిని అనుభవించకుండానే మళ్లీ ద్యూతంలో ఒడ్డడంచేత అది నశించడం, గంటలకొలది కదలకుండా మూత్రపురీషాలు బంధించుకొని కూర్చొనుట, ఆకలి మొదలైనవాటిచేత వ్యాధులు కలగడం ఇవన్నీ ద్యూతదోషాలు. అయితే వేటలో శరీరానికి వ్యాయామం, శ్లేష్మం పిత్తం కొవ్వు చెమట ఇవి నశించడం, చలమూ స్థిరమూ అయిన శరీరంమీద బాణాలు ప్రయోగించగలిగిన గురి కుదరడం, కోపం వచ్చినప్పుడు భయం కలిగినప్పుడూ మృగాలు ఎలా ప్రవర్తిస్తాయో అని వాటి చిత్తంయొక్క జ్ఞానం అనే లాభాలు ఉంటాయి. మరొక విషయం ఏ మనగా వేటకు తగిన కాలాలలోనే వెడతారు కాని వర్షకాలాదులలో వెళ్లరు. (జూదం అన్ని కాలాలలోను రాత్రింబవళ్లు ఆడవచ్చును).

మూ. 1. ద్యూతస్త్రీవ్యసనయోః కైతవవ్యసనమ్ ఇతి కౌణపదన్తః. సాతత్యేన హి నిశి ప్రదీపే మాతరి చ మృతాయాం దీవ్యత్యేవ కితవః. కృచ్ఛ్రే చ ప్రతిపృష్టః కుప్యతి. స్త్రీవ్యసనే తు స్నానప్రతికర్మభోజనభూమిషు భవ త్యేవ ధర్మార్థపరిప్రశ్నః. శక్యా చ స్త్రీ రాజహితే నియోక్తుమ్. ఉపాంశుదణ్డేన వ్యాధినా వా వ్యావర్తయితుమ్ అవస్రావయితుం వా ఇతి.

2. నేతి కౌటల్యః. సప్రత్యాదేయం ద్యూతమ్. నిష్ప్రత్యాదేయం స్త్రీవ్యసనమ్. అదర్శనం, కార్యనిర్వేదః, కాలాతిపాతనాదనర్థః ధర్మలోపశ్చ, తన్త్రదౌర్బల్యమ్, పాపానుబన్ధశ్చేతి.

వ్యా. 1. ద్యూత-స్త్రీవ్యసనాలలో ద్యూతవ్యసనం చెడ్డది అని కౌణపదంతుడు (భీష్ముడు) అన్నాడు. జూదగాడు రాత్రికూడ దీపం పెట్టుకొని, తల్లి చచ్చిపోయినా కూడ ఇంటికి వెళ్లక నిరంతరమూ అలా జూదం ఆడుతూనే ఉంటాడు. ఏదైనా కష్టసమయంలో ఏమైనా అడుగుతే చిఱ్ఱుమంటాడు. స్త్రీవ్యసనంలో అయితే ఆ వ్యసనం ఉన్నవానిని స్నానభూమిలోను, అలంకరించుకొనే ప్రదేశంలోను, భోజనం చేసే ప్రదేశాలలోను

ధర్మార్థాలను గూర్చిన చర్చలోనికి దింపవచ్చును. ఆ స్త్రీని రాజుకు హితకరమైన (శత్రువధాదిరూపమైన) పనిలో వినియోగించవచ్చును. రహస్యదండనంచేత నశింపచేయడానికి గాని, రసాదు లిచ్చి వ్యాధి కలిగించి దూరంగా పంపివేయడానికి గాని, శక్యం అవుతుంది.

2. అది యుక్తం కాదు అంటాడు కౌటల్యుడు. ద్యూతంనుంచి మనిషిని మరలించవచ్చును కాని స్త్రీవ్యసనంనుంచి మరల్చడం కష్టం. స్త్రీవ్యసనం ఉన్న రాజు అమాత్యాదులకు దర్శనం ఇవ్వకపోవడం, ఏ పనీ చేయడానికి(వానిలో) నిరుత్సాహం, సరియైన కాలాన్ని దాటబెట్టడంవల్ల అనర్థం, ధర్మానికి లోపం, రాజ్యవ్యవహారాలను చూచుకోవడంలో దుర్బలత్వం, స్త్రీవ్యసనానికి తోడు పానవ్యసనంకూడా కలవడం ఈ అనర్థాలన్నీ ఏర్పడతాయి.

మూ. 1. స్త్రీపానవ్యసనయోః స్త్రీవ్యసనమ్ ఇతి వాతవ్యాధిః. స్త్రీషు హి బాలిశ్యమ్ అనేకవిధం నిశాన్తప్రణిధౌ వ్యాఖ్యాతమ్. పానే తు శబ్దాదీనామిన్ద్రియార్థానా ముపభోగః, ప్రీతిదానమ్, పరిజనపూజనమ్, కర్మశ్రమ వధశ్చ ఇతి.

2. నేతి కౌటల్యః. స్త్రీవ్యసనే భవతి అపత్యోత్పత్తిః, ఆత్మరక్షణం చాన్తర్దారేషు, విపర్యయో వా బాహ్యేషు; అగమ్యేషు సర్వోచ్ఛిత్తిః. తదుభయం పానవ్యసనే. పానసంపత్-ప్రజ్ఞానాశః, అనున్మత్తస్య ఉన్మత్తత్వమ్, అప్రేతస్య ప్రేతత్వమ్, కౌపీనదర్శనమ్, శ్రుతప్రజ్ఞాప్రాణవిత్తమిత్రహానిః, సద్భిః వియోగః, అనర్థ్యసంయోగః, తన్త్రీగీతనైపుణ్యేషు చార్థఘ్నేషు ప్రసఙ్గః ఇతి.

వ్యా. 1. స్త్రీవ్యసనపానవ్యసనాలలో స్త్రీవ్యసనం చెడ్డ దని ఉద్ధవుడు అన్నాడు. స్త్రీలలో అనేకవిధ మైన మూర్ఖత్వం ఉంటుం దని వెనుక నిశాంతప్రణిధిలో వివరించబడింది. పానంలో అయితే శబ్దాదులైన ఇంద్రియవిషయాల భోగం, ప్రీతిదానం (ప్రేమపూర్వకంగా కానుకలు ఇవ్వడం), పరిజనుల పూజనం, పనులు చేసీచేసి ఉండడంవల్ల కలిగిన శ్రమ తొలగిపోవడం అనే లాభా లున్నాయి.

2. అది యుక్తం కాదంటాడు కౌటల్యుడు. భార్యల విషయంలో స్త్రీవ్యసనం ఉన్నట్లయితే సంతానోత్పత్తి, తనకు రక్షణం అనే లాభాలు ఉంటాయి. బాహ్యాలైన గణికాదులయందు వ్యసనం ఉంటే ఇందుకు విపరీతమైన ఫలం లభిస్తుంది. అగమ్యలైన స్త్రీల విషయంలో లంపటత్వం ఉంటే సర్వనాశం కలుగుతుంది. పానవ్యసనంలో ఈ

రెండు దోషాలు కూడ ఉంటాయి. పానవ్యసనంవల్ల కలిగే సంపద (అత్యుత్తమఫలం)ఇది - బుద్ధి లోపిస్తుంది. ఉన్మత్తుడు కానివాడు ఉన్మత్తుడౌతాడు. జీవించి ఉండగానే శవం వలె పడి ఉంటాడు. గుహ్యప్రదేశాన్ని ప్రదర్శించడం జరుగుతుంది. శాస్త్రజ్ఞానం, బుద్ధిబలం, ధనం,మిత్రులు - వీటికి హాని కలుగుతుంది. సత్పురుషులతో సంబంధం ఉండదు. అనర్థహేతువులైనవాళ్లతో సంబంధం ఏర్పడుతుంది. పనులకు విఘ్నాలు కలిగించే వీణాదితంత్రీనైపుణ్యం, సంగీతనైపుణ్యం సంపాదించా లని అత్యాసక్తి కలుగుతుంది.

మూ. 1. ద్యూతమద్యయోః ద్యూత ఏకేషామ్. పణనిమిత్తో జయః పరాజయో వా ప్రాణిషు నిశ్చేతనేషు వా పక్షద్వైధేన ప్రకృతికోపం కరోతి; విశేషతశ్చ సంఘానాం సంఘధర్మిణాం చ రాజకులానాం ద్యూతనిమిత్తో భేదః, తన్నిమిత్తో వినాశ ఇతి. అసత్ప్రతిగ్రహః పాపిష్ఠతమో వ్యసనానాం తన్త్రదౌర్బల్యాదితి.

2. శ్లో. అసతాం ప్రగ్రహః కామః కోపశ్చావగ్రహః సతామ్,
వ్యసనం దోషబాహుల్యాదత్యన్తముభయం మతమ్.

3. శ్లో. తస్మాత్ కోపం చ కామం చ వ్యసనారమ్భమాత్మవాన్,
పరిత్యజేన్మూలహరం వృద్ధసేవీ జితేన్ద్రియః.

ఇతి కౌటలీయార్థశాస్త్రే వ్యసనాధికారికేఽష్టమాధికరణే తృతీయోఽధ్యాయః
పురుషవ్యసనవర్గః; ఆదిత ఏకోన వింశతిశతతమః.

వ్యా. 1. ద్యూతవ్యసన-మద్యవ్యసనాలలో ద్యూతం చెడ్డ దని కొందరి అభిప్రాయం. ప్రాణిద్యూతంలోను అప్రాణిద్యూతంలోను మనుష్యులు రెండు పక్షాలుగా ఏర్పడి పందెం ఒడ్డినప్పుడు ఒక పక్షానికి జయం మరొక పక్షానికి పరాజయం కలగడంతో ప్రకృతులలో కోపం కలుగుతుంది. ప్రధానంగా సంఘరాజ్యాలలోను, సంఘరాజ్యాల వంటి రాజవంశీయుల రాజ్యాలలోను ద్యూతం నిమిత్తంగా చేసుకొని భేదభావాలు ఏర్పడి ఆ రాజ్యాల వినాశానికి దారితీస్తుంది. ఈ ద్యూతంలో చెడ్డవాళ్లతో సంబంధం ఏర్పడుతుంది. అందువల్ల రాజ్యపరిపాలనావ్యవహారం దుర్బలం అయిపోతుంది. ఈ కారణాలచేత ద్యూతవ్యసనం వ్యసనా లన్నింటిలోకి పాపిష్ఠ మైనది.

2. కామం చెడ్డవారితో స్నేహానికి కారణం. కోపం సత్పురుషులను పీడించడానికి హేతువు. ఈ విధంగా అనేకమైన దోషా లుండడంవల్ల, ఈ రెండు కూడ చాల చెడ్డ వ్యసనాలుగా చెప్పబడ్డాయి.

3. అందువల్ల ఆత్మవంతుడైన (బుద్ధిమంతుడైన) రాజు ఇంద్రియాలను జయించి పెద్దల సాంగత్యం చేస్తూ దుఃఖజనకమైనది, మూలానికి నాశం కలిగించేదీ అయిన కోపాన్ని, కామాన్నీ విడిచిపెట్టాలి.

*"బాలానందిని" అను కౌటలీయార్థశాస్త్రాంధ్రవ్యాఖ్యానంలో వ్యసనాధికారికమైన అష్టమాధికరణంలో పురుషవ్యసనవర్గం అనే తృతీయాధ్యాయం, ప్రారంభంనుంచి నూటపందొమ్మిదవ అధ్యాయం సమాప్తం.*

## అథ చతుర్థోఽధ్యాయః

### త్రింశచ్ఛతతమం ప్రకరణమ్ - పీడనవర్గః (బాధల సముదాయం)

### ఏకత్రింశచ్ఛతతమం ప్రకరణమ్ - స్తమ్భవర్గః (విఘాతాల సముదాయం)

### ద్వాత్రింశచ్ఛతతమం ప్రకరణమ్ - కోశసంగవర్గః

(కోశానికి నష్టంకలిగించేవాటి సముదాయం)

మూ. 1. దైవపీడనమగ్నిరుదకం వ్యాధిః దుర్భిక్షం మరక ఇతి.

2. అగ్న్యుదకయోః అగ్నిపీడనమ్ అప్రతికార్యం సర్వదాహి చ, శక్యోపగమనం తార్యాబాధముదకపీడనమిత్యాచార్యాః.

3. నేతి కౌటల్యః. అగ్నిః గ్రామమ్ అర్ధగ్రామం వా దహతి. ఉదకవేగస్తు గ్రామశతప్రవాహీతి.

4. వ్యాధిదుర్భిక్షయోః వ్యాధిః ప్రేతవ్యాధితోపసృష్టపరిచారక వ్యాయామోపరోధేన కర్మాణ్యుపహన్తి. దుర్భిక్షం పునః అకర్మోపఘాతి. హిరణ్య కరపశుదాయి చేత్యాచార్యాః.

5. నేతి కౌటల్యః. ఏకదేశపీడనో వ్యాధిః, శక్యప్రతీకారశ్చ. సర్వదేశపీడనం దుర్భిక్షం ప్రాణినామజీవనాయేతి.తేన మరకో వ్యాఖ్యాతః.

వ్యా. 1. అగ్ని, ఉదకం, వ్యాధి, దుర్భిక్షం, అంటు రోగాలు- ఇవి దైవం వల్ల కలిగే పీడ.

2. అగ్నివల్ల కలిగే పీడ, ఉదకంవల్ల కలిగే పీడ -వీటిలో అగ్నిపీడనానికి ప్రతిక్రియ చేయడం శక్యం కాదు; మొత్తం అంతనీ దహింపచేస్తుంది. ఉదకంవల్ల కలిగే పీడను తప్పించుకొనవచ్చు, కలిగిన బాధను దాటవచ్చును అని ఆచార్యు లన్నారు.

3. "అది యుక్తం కాదు. అగ్ని గ్రామాన్ని కాల్చవచ్చు,సగం గ్రామాన్ని కాల్చవచ్చు, ఉదకవేగ మైతే వందలకొలది గ్రామాలు కొట్టుకొనిపోయే టట్లు చేస్తుంది' ' అని కౌటల్యు డంటాడు.

4. "వ్యాధి దుర్భిక్షాలలో వ్యాధి మరణించినవాళ్లు, వ్యాధిగ్రస్తులు, వ్యాధిగ్రస్తులకు పరిచర్య చేసే వాళ్లు వీళ్లకు చేయవలసిన పను లన్నింటికీ విఘాతం కలిగిస్తుంది. దుర్భిక్షం (కరువు) అయితే కర్మలకు విఘ్నం కలిగించదు, (ధాన్యరూపమైన పన్ను లేకపోయినా) ధన -పశురూపంలో పన్ను ఇస్తుంది" అని ఆచార్యు లన్నారు.

5. అది కాదంటాడు కౌటల్యుడు - వ్యాధి (రాజ్యంలో) ఒక భాగాన్ని మాత్రమే పీడిస్తుంది. దానికి ప్రతిక్రియ కూడ చేసికొనవచ్చును. దుర్భిక్ష మైతే సమస్తదేశాన్నీ పీడిస్తుంది. ప్రాణు లన్నింటినీ చంపేస్తుంది- దీనిని పట్టి అంటువ్యాధిని గూర్చి కూడ చెప్పినట్లే.

మూ. 1. క్షుద్రకముఖ్యక్షయయోః క్షుద్రకక్షయః కర్మణామయోగక్షేమం కరోతి.ముఖ్యక్షయః కర్మానుష్ఠానోపరోధధర్మా ఇత్యాచార్యాః.

2. నేతి కౌటల్యః. శక్యః క్షుద్రకక్షయః ప్రతిసంధాతుమ్ బాహుల్యాత్ క్షుద్రకాణాం; న ముఖ్యక్షయః. సహస్రేషు హి భవత్యేకో న వా సత్త్వప్రజ్ఞాధిక్యాత్, ఆశ్రయత్వాత్ క్షుద్రకాణామితి.

3. స్వపరచక్రయోః స్వచక్రమతిమాత్రాభ్యాం దణ్డకరాభ్యాం పీడయతి అశక్యం చ వారయితుమ్. పరచక్రం తు శక్యం ప్రతియోద్ధుమ్, అపసారేణ సంధినా వా మోక్షయితుమ్ ఇత్యాచార్యాః.

4. నేతి కౌటల్యః. స్వచక్రపీడనం ప్రకృతిపురుషముఖ్యోపగ్రహవిఘాతాభ్యాం శక్యతే వారయితుమ్; ఏకదేశం వా పీడయతి. సర్వదేశపీడనం తు పరచక్రం, విలోపఘాతదాహధ్వంసనాపవాహనైః పీడయతీతి.

వ్యా. 1. క్షుద్రకుల (కర్మకరాదులైన సామాన్యజనుల) క్షయం ముఖ్యులైన పురుషుల క్షయం-ఈ రెండింటిలో క్షుద్రకక్షయం చెడ్డది; ఎందువల్ల ననగా వాళ్ల క్షయంవల్ల కొత్త కర్మలు చేబట్టడం, చేబట్టిన వాటిని సంరక్షించుకోవడం జరగదు, ముఖ్యుల క్షయం కలుగుతే పనులు కొనసాగించడంలో అడ్డు తగలవచ్చును అని ఆచార్యుల మతం.

2. అది కాదంటాడు కౌటల్యుడు. క్షుద్రకులు అధికసంఖ్యలో లభిస్తారు గాన క్షుద్రకక్షయానికి ప్రతిక్రియ చేసుకొనవచ్చును. వెయ్యిమందిలో కూడ ఒక ముఖ్యుడు ఉంటాడా ఉండడా అనేది సందేహాస్పదమే. ఎందువల్ల ననగా ముఖ్యునిలో అధికమైన ఉత్సాహం, బుద్ధీ ఉంటాయి. అందుచేత అతడు క్షుద్రకులకు ఆశ్రయంగా ఉంటాడు.

3. ఇంతవరకు దైవకృతపీడలను గూర్చి చెప్పి ఇప్పుడు మనుష్యకృతపీడనాన్ని గూర్చి విచారిస్తున్నాడు-స్వచక్రపరచక్రాలలో (స్వసైన్య-శత్రుసైన్యాలలో) స్వచక్రం దండనమూ పన్నులూ అత్యధికంగా వేయడం ద్వారా పీడిస్తుంది. దాన్ని నివారించడం కూడ శక్యం కాదు, పరచక్రాన్నైతే ఎదిరించి యుద్ధం చేయడంచేత, దూరంగా పారిపోవడంచేత సంధి చేసుకొనడంచేత విడిపించుకొనవచ్చును అని ఆచార్యు లన్నారు.

4. "అది యుక్తం కాదు; స్వచక్రపీడనం ప్రకృతిపురుషులలో ముఖ్యులైన వాళ్లను (నాయకులను) అనుకూలంగా చేసుకోవడంచేత, లేదా వాళ్లను నశింపచేయడం చేతా అణచివేయడానికి శక్యం అవుతుంది. అంతే కాక స్వచక్రం దేశంలో కొంత భాగాన్నే పీడిస్తుంది. పరచక్రమైతే లూటీలు, చంపడాలు, కాల్చడం, నశింపచేయడం, మనుష్యుల్ని కట్టి తీసికొనిపోవడం ఇలాంటివాటిచేత సమస్తదేశాన్నీ పీడిస్తుంది.

మూ. 1. ప్రకృతిరాజవివాదయోః ప్రకృతివివాదః ప్రకృతీనాం భేదకః పరాభియోగానావహతి,రాజవివాదస్తు ప్రకృతీనాం ద్విగుణభక్తవేతనపరిహారకరో భవతీత్యాచార్యాః.

2. నేతి కౌటల్యః. శక్యః ప్రకృతివివాదః ప్రకృతిముఖ్యోపగ్రహేణ కలహస్థానాపనయనేన వా వారయితుమ్. వివదమానాస్తు ప్రకృతయః పరస్పరసంఘర్షేణోపకుర్వన్తి. రాజవివాదస్తు పీడనోచ్ఛేదనాయ ప్రకృతీనాం ద్విగుణవ్యాయామసాధ్య ఇతి.

వ్యా. 1. ప్రకృతివివాద- రాజవివాదాలలో (ప్రజలలో కలహాలు, రాజకుటుంబం

లో కలహాలు) ప్రకృతివివాదం ప్రకృతులను విడగొట్టివేస్తుంది. శత్రువులనుండి ఆక్రమణలను పురిగొల్పుతుంది. రాజవివాద మైతే ప్రకృతులకు రెట్టింపు ఆహారం, వేతనం, పన్నులు మొదలైనవాటిలో మినహాయింపులు కలిగిస్తుంది అని ఆచార్యులన్నారు.

2. అది కాదంటాడు కౌటల్యుడు. ప్రకృతులలోని నాయకులను వశం చేసుకోవడంచేత, కలహకారణాలను తొలగించడంచేత ప్రకృతివివాదాన్ని నివారింపచేయవచ్చు. కలహిస్తున్న ప్రకృతు లైతే పరస్పరవైరంచేత రాజుకే ఉపకరిస్తారు. రాజవివాదమైతే ప్రకృతులను పీడించడానికి, నిర్మూలించడానికీ దారితీస్తుంది; దానిని నివారించాలంటే రెట్టింపు ప్రయత్నం చెయ్యాలి.

మూ. 1. దేశరాజవిహారయోః దేశవిహారస్త్రైకాల్యేన కర్మఫలోపఘాతం కరోతి; రాజవిహారస్తు కారుశిల్పికుశీలవవాగ్జీవనరూపాజీవావైదేహకోపకారం కరోతి ఇత్యాచార్యాః.

2. నేతి కౌటల్యః. దేశవిహారః కర్మశ్రమవధార్థమల్పం భక్షయతి. భక్షయిత్వా చ భూయః కర్మసు యోగం యచ్ఛతి. రాజవిహారస్తు స్వయం వల్లభైశ్చ స్వయంగ్రాహప్రణయపణ్యాగారకార్యోపగ్రహైః పీడయతీతి.

వ్యా. 1. దేశవిహార - రాజవిహారాలలో (దేశంలోని ప్రజలు సుఖాలను అనుభవించడంలో ఆసక్తులై ఉండడం, రాజు సుఖానుభవాసక్తుడై ఉండడం) దేశ విహారం భూతభవిష్యద్వర్తమానాలలో కర్మలకు వాటివల్ల రావలసిన ఫలాలకి విఘాతం కలిగిస్తుంది. రాజవిహారమైతే చేతి పనివాళ్లు, శిల్పులు, కుశీలవులు, వాగ్జీవనులు, వేశ్యలు, వర్తకులు-వీళ్లకు ఉపకరిస్తుంది అని ఆచార్యు లన్నారు.

2. అది కాదంటాడు కౌటల్యుడు -దేశవిహారం పనులు చేసి చేసి ఉండడంవల్ల కలిగిన శ్రమను తొలగించడానికి కొంచెం మాత్రమే (కొంచెం కాలధనాదికం మాత్రమే) భక్షిస్తుంది. భక్షించిన తరవాత మళ్లీ వాళ్లందరూ తమ తమ పనులలో లగ్ను లయేటట్లు చేస్తుంది. రాజవిహారమైతే స్వయంగా రాజు, వాని వల్లభులు (ఇష్టులైన బంధు మిత్రాదులు)ఇష్టం వచ్చిన వన్నీ తీసుకొనడంచేత, ఇమ్మని నిర్బంధించి తీసికొనడంచేత కానుకలుగా ఆ యా వస్తువులు తీసికొనడంచేత పణ్యాగారాలలో జరిగే పనులమీద లంచాలు తీసుకొనడంచేత దేశాన్ని పీడిస్తారు.

మూ. 1. సుభగాకుమారయోః కుమారః స్వయం వల్లభైశ్చ స్వయం గ్రాహప్రణయపణ్యాగారకార్యోపగ్రహైః పీడయతి. సుభగా విలాసోపభోగేన ఇత్యాచార్యాః.

2. నేతి కౌటల్యః. శక్యః కుమారో మన్త్రిపురోహితాభ్యాం వారయితుమ్, న తు సుభగా బాలిశ్యాదనర్థ్యజనసంయోగాచ్చేతి.

వ్యా. సుభగావిహార-కుమారవిహారాలలో (రాజుయొక్క ప్రియురాలి విహారం కుమారుని విహారం) రాజకుమారుడు అతని దగ్గరివాళ్లు కూడ వాళ్లకి కావలసిన వన్నీ స్వయంగానే తీసుకొనడంచేత, కానుకలు తీసికొనడంచేత, పణ్యాగారాలలో జరిగే పనులనుంచి లంచాలు తీసుకొనడంచేత దేశాన్ని పీడిస్తారు. సుభగ కేవలం గంధమాల్యాదివిలాసవస్తువులను మాత్రమే తీసుకుంటుంది. అని ఆచార్య లన్నారు.

2. అది కాదంటాడు కౌటల్యుడు. మంత్రి-పురోహితులు రాజకుమారుణ్ణి ఆ విధంగా ప్రవర్తించకుండా నివారించవచ్చును. కాని సుభగను ఎవరూ వారించజాలరు. ఎందువల్ల ననగా ఆమె మూర్ఖురాలై ఉంటుంది. ఆమెకు అనర్థకరులైన జనులతో సంబంధం ఉంటుంది.

మూ. 1. శ్రేణీముఖ్యయోః శ్రేణీబాహుల్యాదనవగ్రహాస్తేయసాహసాభ్యాం పీడయతి, ముఖ్యః కార్యానుగ్రహవిఘాతాభ్యామ్ ఇత్యాచార్యాః.

2. నేతి కౌటల్యః. సువ్యావర్త్యా శ్రేణీ సమానశీలవ్యసనత్వాత్, శ్రేణీముఖ్యైకదేశోపగ్రహేణ వా. స్తమ్భయుక్తో ముఖ్యః పరప్రాణద్రవ్యోపఘాతాభ్యాం పీడయతీతి.

వ్యా. 1. శ్రేణి అనగా ఆయుధజీవుల సంఘం లేదా కర్షకాదుల సంఘం (గ.శా.) యుద్ధం చేసేవాళ్ల సంఘం (కాంగ్లే). ముఖ్య డనగా ఆ సంఘనాయకుడు (కాంగ్లే) ప్రధానాధికారి (గ.శా). శ్రేణి, ముఖ్యుడు కలిగించే పీడలో అల్పత్వాధిక్యాలు చెపుతున్నాడు- శ్రేణిలో చాలమంది ఉండడంచేత దానికి ఏ అడ్డూ లేక దొంగతనం, సాహసకృత్యాలు చేసి పీడిస్తుంది. ముఖ్యుడు ఏదైన కార్యాన్ని చేయడానికి అనుమతి ఇవ్వడంచేత, ఇవ్వకపోవడంచేత పీడిస్తాడు. ఏ శాఖలో నైనా ప్రధానాధికారి లంచం ఇస్తే పనికి అనుమతి ఇచ్చి లంచం ఇవ్వకపోతే అనుమతి నిరాకరించి బాధిస్తాడు (గ.శా.). అందుచేత శ్రేణివల్ల కలిగే పీడ గొప్పది అని ఆచార్య లన్నారు.

2. అది కాదంటాడు కౌటిల్యుడు. సమానమైన స్వభావమూ, వ్యసనమూ కల దవడం చేత ఒక శ్రేణిని మరొక శ్రేణి అనాయాసంగా నివారించకలుగుతుంది. లేదా ఆ శ్రేణి నాయకుణ్ణి గాని, ఆ శ్రేణిలోని కొంతమందిని గాని వశం చేసుకుంటే శ్రేణిని పీడించడం నుంచి నివారించవచ్చు. ముఖ్యుడైతే దృప్తుడై ఇతరుల ప్రాణాలకు, ద్రవ్యానికి ఉపఘాతం కలిగించి పీడిస్తాడు.

మూ. 1. సన్నిధాతృసమాహర్త్రోః సంనిధాతా కృతవిదూషణాత్య యాభ్యాం పీడయతి. సమాహర్తా కరణాధిష్ఠితః ప్రదిష్టఫలోపభోగీ భవతి ఇత్యాచార్యాః. 2. నేతి కౌటిల్యః. సంనిధాతా కృతావస్థమన్యైః కోశప్రవేశ్యం ప్రతిగృహ్ణాతి. సమాహర్తా తు పూర్వ మర్థమాత్మనః కృత్వా పశ్చాద్రాజార్థం కరోతి, ప్రణాశయతి వా, పరస్వాదానే చ స్వప్రత్యయశ్చరతీతి.

వ్యా. 1. సంనిధాత (Director of stores) సమాహర్త (Administrator) వీళ్లలో సంనిధాత చేసిన పనిలో తప్పులు పట్టి అత్యయం (పెనాల్టీ) వేస్తూ బాధిస్తాడు. సమాహర్త కరణాల, లెక్కలు వేసే అధికారుల, పర్యవేక్షణలో ఉండడంచేత తనకు ఎంత ఫలం (జీతం మొదలైనది) లభిస్తుందో దానిని మాత్రమే అనుభవిస్తాడు అని ఆచార్యుల అభిప్రాయం.

2. అట్లు కాదంటాడు కౌటిల్యుడు - సంనిధాత ఇంత ఇవ్వాలి అని ఇతరుల చేత (పరీక్షకులచేత) నిర్ణయించబడిన, కోశంలో ప్రవేశపెట్టదగిన దానిని మాత్రమే తీసుకుంటాడు. సమాహర్త అయితే ముందుగా తనకు రావలసిన మామూలు (లంచం) తీసుకొని తరవాత రాజుకు రావలసిన ధనం వసూలు చేస్తాడు లేదా దానిని నశింపచేస్తాడు. ఇతరుల ధనం తీసుకొనడంలో తనదే అంతిమాధికారం అన్నట్లు ప్రవర్తిస్తాడు.

మూ. 1. అన్తపాల వైదేహకయోః అన్తపాలః చోరప్రసఙ్గ దేయాత్యాదానా భ్యాం వణిక్పథం పీడయతి. వైదేహకాస్తు పణ్యప్రతిప ణ్యానుగ్రహైః ప్రసాధయన్తి ఇత్యాచార్యాః.

2. నేతి కౌటిల్యః. అన్తపాలః పణ్యసంపాతానుగ్రహేణ వర్తయతి. వైదేహకాస్తు సంభూయ పణ్యానాముత్కర్షాపకర్షం కుర్వాణాః పణే పణశతం, కుమ్భే కుమ్భశతమిత్యాజీవన్తి.

వ్యా. 1. అంతపాల - వైదేహకులలో (సరిహద్దులు రక్షించేవాడు - వర్తకుడు)

అంతపాలుడు దొంగల సంబంధంచేత (దొంగలను ప్రోత్సహించడంచేత) ఇవ్వవలసిన సుంకం ఎక్కువగా వసూలుచేయడంచేత వర్తకమార్గానికి బాధ కలిగిస్తాడు. వైదేహకు లైతే పణ్యాలను, ప్రతిపణ్యాలను (ఒక పణ్యానికి బదులు మరొక పణ్యం) ఇవ్వడం ద్వారా వర్తకమార్గాలను అభివృద్ధి పొందిస్తారు అని ఆచార్యు లన్నారు.

2. అది కాదంటాడు కౌటిల్యుడు. అంతపాలుడు పణ్యాలను అత్యధికంగా చేరవేయడం ద్వారా వణిక్పథాలను బాగా ఉండే టట్లు ప్రవర్తింపచేస్తాడు. వర్తకులైతే కలిసి (ఒకరితో ఒకరు కూడబలుకుకొని) పణ్యాలను హెచ్చిస్తూ తగ్గిస్తూ ఒక పణానికి నూరు పణాలు, ఒక కుంభానికి (పణ్యా లుంచిన పాత్ర) నూరు కుంభాలు లెక్కన సంపాదించి జీవిస్తారు.

మూ. 1. అభిజాతోపరుద్ధా భూమిః పశువ్రజోపరుద్ధా వేతి. అభిజాతో పరుద్ధా భూమిః మహాఫలాప్యాయుధీయోపకారిణీ న క్షమా మోక్షయితుం వ్యసనాబాధభయాత్. పశువ్రజోపరుద్ధా తు కృషియోగ్యా క్షమా మోక్షయితుం; వివీతం హి క్షేత్రేణ బాధ్యతే ఇత్యాచార్యాః.

2. నేతి కౌటల్యః. అభిజాతోపరుద్ధా భూమిః అత్యన్తమహోపకారాపి క్షమా మోక్షయితుం వ్యసనాబాధభయాత్. పశువ్రజోపరుద్ధా తు కోశవాహనోప కారిణీ న క్షమా మోక్షయితుమ్, అన్యత్ర సస్యవాపోపరోధాత్ ఇతి.

వ్యా. 1. ఉత్తమవంశానికి చెందిన వానిచేత ఆక్రమించబడిన భూమిని విడిపించాలా లేక పశుసముదాయంచేత ఆక్రమించబడినదానిని విడిపించాలా అన్నప్పుడు అభిజాతోపరుద్ధమైన భూమినే, అది గొప్ప ఫలం ఇచ్చేదైనా (మంచి పంట పండేదైనా) యోధులకు ఉపకరించేది అవడంచేత దానిని విడిపించగూడదు. ఎందువల్ల ననగా ఏదైనా వ్యసనం (శత్రుభయాదికం) వచ్చి నప్పుడు సైనికులను తొలగించిన ఆ ప్రదేశంలో రక్షణ లేకుండా పోతుంది. కృషికి యోగ్యమైన పశువ్రజోపరుద్ధభూమి అయితే విడిపించడానికి తగినదే. ఎందువల్ల ననగా వివీతం (పశువుల మేతకు విదిలిన బీడు) పంటలు పండే క్షేత్రంచేత బాధించబడుతుంది. (అనగా ఆ భూమిలో పంటలు బాగా పండుతా యనే నమ్మకం ఉన్నప్పుడు దానిని బీడుగా వదలకూడదు అని భావం) అని ఆచార్యులన్నారు.

2. అది కాదంటాడు కౌటల్యుడు. అభిజాతోపరుద్ధమైన భూమి అత్యంత మహోపకారం ఇచ్చే దైనా, దానిని ఆక్రమించుకొని ఉన్న అభిజాతుని ద్వారా రాజ్యానికే ముప్పు వస్తుం దనే భయంవల్ల, విడిపించదగినదే. పశుప్రజోపరుద్ధ మైన భూమి అయితే కోశానికి వాహనాలకీ ఉపయోగించే దవడంచేత విడిపించదగినది కాదు. అయితే చుట్టుప్రక్కల నున్న సస్యాలకి బాధ కలుగుతుంది అన్నప్పుడు మాత్రం విడిపించాలి.

మూ. 1. ప్రతిరోధకాటవికయోః ప్రతిరోధకాః రాత్రిసత్రచరాః శరీరాక్ర మిణో నిత్యాః శతసహస్రాపహారిణః, ప్రధానకోపకాశ్చ. వ్యవహితాః ప్రత్యన్తారణ్య చరాశ్చ ఆటవికాః ప్రకాశాః దృశ్యాః చరన్తి ఏకదేశఘాతకాశ్చ ఇత్యాచార్యాః.

2. నేతి కౌటల్యః. ప్రతిరోధకాః ప్రమత్తస్య అపహరన్తి, అల్పాః కుణ్ఠాః సుఖా జ్ఞాతుం గ్రహీతుం చ. స్వదేశస్థాః ప్రభూతాః విక్రాన్తాశ్చాటవికాః. ప్రకాశయోధినః, అపహర్తారః హన్తారశ్చ దేశానాం రాజసధర్మాణ ఇతి.

వ్యా. 1. ప్రతిరోధక (మార్గాలలోని దోపిడీ దొంగలు) - ఆటవికులలో ప్రతిరోధకులు రాత్రులందు మాత్రమే సంచరిస్తారు. బాటసారుల శరీరాలను ఆక్రమిస్తారు (శరీరాలకు గాయాలు కలిగిస్తారు); నిత్యులు (ఎల్లప్పుడు ఉండేవారు); నూర్లకొలది వేలకొలది ధనం అపహరిస్తారు. ప్రధానులను (మహాధనికులైన రాష్ట్రముఖ్యులను) హింసిస్తారు. ఆటవికులైతే రాజ్యాల సరిహద్దులలో తిరుగుతూ దూరంగా ఉంటారు, బాహాటంగా అందరికీ కనబడే టట్లు సంచరిస్తారు. కొంతమందిని మాత్రమే హింసిస్తారు. అందుచేత వీళ్లే నయం అని ఆచార్యులన్నారు.

అది కాదంటాడు కౌటల్యుడు. ప్రతిరోధకులు ఏమరుపాటుతో ఉన్నవాని ధనం అపహరిస్తారు; తక్కువమంది ఉంటారు. అందుచేతనే వాళ్లకు బలం తక్కువ ఉంటుంది. వాళ్లని గుర్తించడం పట్టడం కూడ సులభం. ఆటవికులు తమ దేశంలోనే ఉంటారు. పరాక్రమించగలరు. బాహాటంగా యుద్ధం చేస్తారు. అపహరిస్తారు. దేశాలను నశింపచేస్తారు. ఈ విధంగా వాళ్లు రాజుతో సమానమైన శక్తి గలవారు.

మూ. 1. మృగహస్తివనయోః మృగాః ప్రభూతాః ప్రభూతమాంసచర్మోప కారిణః మన్దగ్రాసావక్లేశినః సునియమ్యాశ్చ. విపరీతా హస్తినో గృహ్యమాణా దుష్టాశ్చ దేశవినాశాయేతి.

2. స్వపరస్థానీయోపకారయోః స్వస్థానీయోపకారో ధాన్యపశు హిరణ్యకుప్యోపకారో, జానపదానామాపద్యాత్మధారణః. విపరీతః పరస్థానీయోపకారః. ఇతి పీడనాని.

వ్యా. 1. మృగవనహస్తివనాలలో - మృగాలు (లేళ్లు) అధికసంఖ్యలో ఉంటాయి, అధికమైన మాంసంచేత, చర్మలచేత ఉపయోగిస్తాయి. వాటికి ఆహారం విషయంలో కూడ అల్పమైన శ్రమను కలిగిస్తాయి. ఏనుగులు ఇందుకు విపరీతమైనవి. పట్టుకొన్న ఏనుగులు దుష్టమైన వైతే దేశాన్ని నశింపచేస్తాయి.

2. తన స్థానీయానికి (ఎనిమిదివందల గ్రామాలకు ప్రధానస్థానం) చేసిన ఉపకారంలోను, శత్రుస్థానీయానికి చేసిన ఉపకారంలోను - స్వస్థానీయోపకారం, అనగా ధాన్యం, పశువులు, ధనం, కుప్యం - వీటి రూపంలో ఉన్న ఉపకారం, ఆపత్సమయాలలో జానపదు లందరికీ సమంగా ఉపకరిస్తుంది. పరస్థానీయోపకారం ఇందుకు విపరీతం. ఈ విధంగా పీడనాలను గూర్చి వివరించబడినది.

మూ. 1. అభ్యన్తరో ముఖ్యస్తమ్భో బాహ్యో మిత్రాటవీస్తమ్భః ఇతిస్తమ్భవర్గః.

2. తాభ్యాం పీడనైర్యథోక్తైశ్చ పీడితః సక్తో ముఖ్యేషు పరిహారోపహతః ప్రకీర్ణః మిథ్యాసంహృతః సామన్తాటవీహృతః ఇతి కోశసంగాః.

3. శ్లో. పీడనానామనుత్పత్తావుత్పన్నానాం చ వారణే,
యతేత దేశవృద్ధ్యర్థం నాశే చ స్తమ్భసంగయోః.

ఇతి కౌటలీయార్థశాస్త్రే వ్యసనాధికారికేఽష్టమాధికరణే చతుర్థోఽధ్యాయః,
పీడనవర్గః, స్తమ్భవర్గః, కోశసంగవర్గః, ఆదితః వింశతిశతతమః.

వ్యా. 1. రాష్ట్రంలోని ముఖ్యులు కల్పించే స్తంభం (రాజప్రయోజనాలకు విఘాతం) అభ్యంతరస్తంభం, మిత్రులు ఆటవికులు కల్పించే స్తంభం బాహ్యస్తంభం, ఇది స్తంభవర్గం.

2. (కోశసంగం అనగా కోశంలో చేరవలసిన ధనం చేరకపోవడం). వాటిచేత (అభ్యంతరబాహ్యస్తంభాలచేత), పైన చెప్పిన పీడనాలచేత (కోశం) పీడించబడడం వసూలు చేయబడి కూడ ప్రధానాధికారుల వద్దనే ఉండిపోవడం, రాజశాసనానుసారం పరిహారం ఇవ్వడంచేత తగ్గిపోవడం, చాలా చోట్ల విక్షిప్తం అయిపోవడం, న్యాయంగా

వసూలు చేయవలసినదానికంటె తక్కువగానో ఎక్కువగానో వసూలు చేయడం, ఇరుగు పొరుగు రాజులు, ఆటవికులు హరించడం ఇవన్నీ కోశసంగాలు.

3. రాజు పైన చెప్పిన పీడనా లేవీ కలగకుండాను, కలిగిన పీడనాలను నివారించడానికీ, స్తంభసంగాలు నశించడానికీ, దేశాభివృద్ధికొరకు ప్రయత్నించాలి.

"బాలానందిని" అను కౌటలీయార్థశాస్త్రాంధ్రవ్యాఖ్యానంలో వ్యసనాధికారికం అనే అష్టమాధికరణంలో, పీడకవర్గం, స్తంభవర్గం, కోశసంగవర్గం అను అష్టమాధ్యాయం, ప్రారంభంనుంచి నూట ఇరవైయవ అధ్యాయం సమాప్తం.

## అథ పఞ్చమోఽధ్యాయః

### త్రయస్త్రింశచ్ఛతతమం ప్రకరణమ్ - బలవ్యసనవర్గః

### చతుర్వింశచ్ఛతతమం ప్రకరణమ్ - మిత్రవ్యసనవర్గః

మూ. 1. బలవ్యసనాని-అమానితం విమానితమ్, అభృతం, వ్యాధితం, నవాగతం, దూరాయాతం, పరిశ్రాన్తం, పరిక్షీణం, ప్రతిహతం, హతాగ్రవేగమ్, అనృతుప్రాప్తమ్, అభూమిప్రాప్తమ్, ఆశానిర్వేది, పరిసృప్తం, కలత్రగర్హి, అన్తః శల్యం, కుపితమూలం, భిన్నగర్భమ్, అపసృతమ్, అతిక్షిప్తమ్, ఉపనివిష్టమ్, సమాప్తమ్, ఉపరుద్ధమ్, పరిక్షిప్తం, ఛిన్నధాన్యపురుషవీవధం, స్వవిక్షిప్తం, మిత్రవిక్షిప్తం, దూష్యయుక్తం, దుష్టపార్ష్ణిగ్రాహం, శూన్యమూలమ్, అస్వామిసంహతం, భిన్నకూటమ్, అన్ధమితి.

2. తేషామమానిత - విమానితయోః అమానితం కృతార్థమానం యుధ్యేత, న మానిత మన్తఃకోపమ్.

3. అభృతవ్యాధితయోః అభృతం తదాత్వకృతవేతనం యుధ్యేత న వ్యాధిత మకర్మణ్యమ్.

4. నవాగత-దూరాగతయోః నవాగతమ్ అన్యతః ఉపలబ్ధదేశమ్ అనవమిశ్రం యుధ్యేత, న దూరాగతమ్ ఆయతగతపరిక్లేశమ్.

వ్యా. 1. సైన్యవ్యసనాలు - అమానితత్వం మొదలైన ముప్పైనాలుగు సైన్యవ్యసనాలు. వీటి అర్థాలు రాబోయే వాక్యాలలో స్పష్టం అవుతాయి.

2. వీటిలో అమానితం (గౌరవింపబడనిది) - విమానితం (అవమానింపబడినది) వీటిలో అమానితమైన సైన్యం ధనదానసత్కారాలు చేసిన ట్లయితే యుద్ధం చేస్తుంది. విమానితసైన్యం మాత్రం మనస్సులో కోపం ఉండడంచేత సరిగా యుద్ధం చేయదు.

3. అభృతం (సరిగా జీతం ఇవ్వనిది) వ్యాధితం (జబ్బుపడినది) - వీటిలో అభృతసైన్యానికి తాత్కాలికంగా వేతనం ఇస్తే యుద్ధం చేస్తుంది. వ్యాధితసైన్యం ఏ పనీ చేసే సామర్థ్యం లేకపోవడంచేత యుద్ధం చేయదు.

4. నవాగతం (క్రొత్తగా వచ్చినది) దూరాగతం (దూరప్రయాణం చేసి వచ్చినది): వీటిలో నవాగతసైన్యం దేశాన్ని గూర్చి ఇతరులవల్ల తెలుసుకొని, పాతవాళ్లతో కలిసి యుద్ధం చేస్తుంది. దీర్ఘప్రయాణంచేత చాల శ్రమపడి యున్న దూరాగతసైన్యం యుద్ధం సరిగా చేయజాలదు.

మూ. 1. పరిశ్రాన్తపరిక్షీణయోః పరిశ్రాన్తం స్నానభోజనస్వప్నలబ్ధవిశ్రమం యుధ్యేత; న పరిక్షీణమన్యత్రాహవే క్షీణయుగ్యపురుషమ్.

2. ప్రతిహత-హతాగ్రవేగయోః ప్రతిహతమగ్రపాతభగ్నం ప్రవీరపురుష సంహతం యుధ్యేత, న హతాగ్రవేగమగ్రపాతహతప్రవీరమ్.

3. అనృత్వభూమిప్రాప్తయోః అనృతుప్రాప్తమ్ యథర్తు యోగ్యయుగ్య శస్త్రావరణం యుధ్యేత. న అభూమిప్రాప్తమ్ అవరుద్ధప్రసారవ్యాయామమ్.

4. ఆశానిర్వేదిపరిసృప్తయోః ఆశానిర్వేది లబ్ధాభిప్రాయం యుధ్యేత, న పరిసృప్తమ్ అపసృతముఖ్యమ్.

5. కలత్రగర్హ్యన్తఃశల్యయోః కలత్రగర్హి ఉన్ముచ్య కలత్రం యుధ్యేత, నాన్తఃశల్యమన్తరమిత్రమ్.

వ్యా. 1. పరిశ్రాంతం (అలసిపోయినది), పరిక్షీణం (దుర్బలంగా అయినది) - ఈ రెండు విధాల సైన్యాలలో పరిశ్రాంతసైన్యం స్నానం, భోజనం, నిద్ర-వీటిచేత విశ్రాంతి తీసికొని యుద్ధం చేయవచ్చు. మరొక యుద్ధంలో ప్రధానపురుషులందరూ నశించిన పరిక్షీణసైన్యం మాత్రం యుద్ధం చేయజాలదు.

2. ప్రతిహతం (ప్రారంభంలోనే ఎదురు దెబ్బతిన్నది), హతాగ్రవేగం (భగ్నమైన ప్రాథమిక యుద్ధోత్సాహం గలది) ఈ రెండింటిలో ప్రారంభంలోనే ఎదురు దెబ్బ తిన్న ప్రతిహతసైన్యం ప్రవీరులైన పురుషులతో కలిసినదై యుద్ధం చేయవచ్చును. మొట్ట మొదటి అడుగులోనే ప్రవీరపురుషు లందరూ మరణించిన హతాగ్రవేగసైన్యం యుద్ధం చేయజాలదు.

3. అనృతుప్రాప్తం (అనుకూలం కాని ఋతువులో యుద్ధానికి వెళ్లినది), అభూమిప్రాప్తం (అనుకూలం కాని భూమికి చేరినది) - ఈ రెండింటిలో అనృతుప్రాప్తసైన్యం ఆ ఋతువుకు (కాలానికి) తగిన వాహనాలు, ఆయుధాలు, కవచాలు సంపాదించి యుద్ధం చేయవచ్చును. కదలడానికి కూడ తగిన చోటు లేక వ్యాయామం చేసే (యుద్ధం చేసే) స్థలం లేని అభూమిప్రాప్తసైన్యం యుద్ధం చేయజాలదు.

4. ఆశానిర్వేది (ఆశ భగ్నం అవడంచేత నిర్వేదం, దుఃఖం, చెందినది) పరిసృప్తం( నాయకులు లేనిది) ఈ రెండు విధాలైన సైన్యాలలో ఆశానిర్వేదిసైన్యం తాను అనుకున్నది లభిస్తుంది అనే ఆశ మళ్లీ అంకురిస్తే యుద్ధం చేయవచ్చును, నాయకులు తొలగిపోయిన పరిసృప్తసైన్యం మాత్రం యుద్ధం చేయజాలదు.

5. కలత్రగర్హి (నా కీ పోష్యవర్గం అడ్డంగా ఉంది అని కలత్రాన్ని, అనగా పోష్యవర్గాన్ని నిందించేది), అంతఃశల్యం (తమలో శత్రువు లున్నది) ఈ రెండింటిలో కలత్రగర్హి తన పోష్యవర్గాన్ని ఏదో విధంగా విడిపించుకొని యుద్ధం చేయవచ్చును. తమలోనే అమిత్రు లున్న అంతఃశల్యసైన్యం మాత్రం యుద్ధం చేయజాలదు.

మూ. 1. కుపితమూలభిన్నగర్భయోః కుపితమూలం ప్రశమితకోపం సామాదిభిర్యుధ్యేత; న భిన్నగర్భమన్యోన్యస్మాత్ భిన్నమ్.

2. అపసృతాతిక్షిప్తయోః అపసృతమేకరాజ్యాతిక్రాన్తం మన్త్రవ్యాయామాభ్యాం సత్రమిత్రాపాశ్రయం యుధ్యేత, నాతిక్షిప్తమ్ అనేకరాజ్యాతిక్రాన్తం బహ్వాబాధత్వాత్.

3. ఉపనివిష్టసమాప్తయోః ఉపనివిష్టం పృథగ్యానస్థానమతిసన్ధాయారిం యుధ్యేత. న సమాప్తమ్ అరిణా ఏకస్థానయానమ్.

4. ఉపరుద్ధపరిక్షిప్తయోః ఉపరుద్ధమ్ అన్యతోనిష్క్రమ్య ఉపరోద్ధారం

ప్రతియుధ్యేత, న పరిక్షిప్తం సర్వతః ప్రతిరుద్ధమ్,

5. ఛిన్నధాన్యపురుషవీవధయోః ఛిన్నధాన్యమ్ అన్యతో ధాన్యమానీయ జఙ్గమస్థావరాహారం వా యుధ్యేత, న చ్ఛిన్నపురుషవీవధమ్ అనభిసారమ్.

వ్యా. 1. కుపితమూలం (కోపించిన ప్రధానపురుషులు గలది), భిన్నగర్భం (ఒకరితో ఒకరికి పడనివాళ్లు ఉన్నది) - ఈ రెండింటిలో కుపితమూలం సామాద్యుపాయాలచేత కోపాన్ని శమింపచేస్తే యుద్ధం చేయవచ్చు, ఒకరితో ఒకరికి పడనివాళ్లు ఉన్న భిన్నగర్భం మాత్రం యుద్ధం చేయజాలదు.

2. అపసృతం (ఒక రాజ్యంలో సైన్యాలచేత ఓడించబడినది), అతిక్షిప్తం (అనేక రాజ్యాలలో సేనలచేత ఓడించబడినది) వీటిలో ఒక రాజ్యంలో ఓడించబడిన అపసృతబలం శాస్త్రవిహితా లైన ఆలోచనలచేత, శిక్షావిశేషరూపమైన వ్యాయామంచేత అరణ్యాన్ని గాని, మిత్రుణ్ణి గాని ఆశ్రయంగా గైకొని యుద్ధం చేయవచ్చును. కాని అనేక రాజ్యాలలో ఓడిపోయిన అతిక్షిప్తసైన్యం యుద్ధం చేయజాలదు; ఎందువల్ల ననగా అది అనేక రాజ్యాలలో ఓడిపోయి ఉన్నది.

3. ఉపనివిష్టం (శత్రువుకు దగ్గరగా మోహరించినది), సమాప్తం (శత్రువున్న స్థానంలో ఉన్నది) ఈ రెండింటిలో ఉపనివిష్టసైన్యం శత్రువుకంటె భిన్నమైన యానం (యుద్ధప్రయాణం) స్థానం (నిలవడం) కలదవడంచేత శత్రువును మించినదై యుద్ధం చేయవచ్చును. సమాప్తసైన్యం మాత్రం శత్రువుతో సమానయానస్థానాలు కల దవడంచేత యుద్ధం చేయజాలదు.

4. ఉపరుద్ధం (ఒకవైపున అడ్డుకొనబడినది) పరిక్షిప్తం (అన్నివైపుల నుండీ అడ్డగింపబడినది), -వీటిలో ఉపరుద్ధసైన్యం మరొక ప్రక్కనుండి బైటకు వచ్చి అడ్డుకొన్న వానిని ఎదిరించి యుద్ధం చేయవచ్చును. కాని నలుమూలలా అడ్డుకొనబడిన పరిక్షిప్తసైన్యం యుద్ధం చేయజాలదు.

5. భిన్నధాన్యం (స్వదేశంనుండి వచ్చే ధాన్యం రాకుండా చేయబడినది) ఛిన్నపురుషవీవధం (పురుషులు, యోధులు మొదలైన వాళ్ల రాక అడ్డుకొనబడినది) వీటిలో ఛిన్న ధాన్యసైన్యం మరొకచోటినుంచి ధాన్యం తెప్పించుకొని లేదా జంగమాలైన మృగాదులనుండి గాని స్థావరాలైన వృక్షాదులనుండి గాని ఆహారం గ్రహించి యుద్ధం చేయవచ్చు. అంతేనే కాని ఆసారం (సహాయం) లేని ఛిన్నపురుషవీవధం యుద్ధం చేయజాలదు.

మూ. 1. స్వవిక్షిప్తమిత్రవిక్షిప్తయోః స్వవిక్షిప్తం స్వభూమౌ విక్షిప్తం సైన్యమాపది శక్యమవస్రావయితుమ్; న మిత్రవిక్షిప్తం విప్రకృష్టదేశ కాలత్వాత్.

2. దూష్యయుక్తదుష్టపార్ష్ణిగ్రాహయోః దూష్యయుక్తమ్ అప్తపురుషాధిష్ఠితమసంహతం యుధ్యేత, న దుష్టపార్ష్ణిగ్రాహం పృష్ఠాభిఘాతత్రస్తమ్.

3. శూన్యమూలాస్వామిసంహతయోః శూన్యమూలం కృతపౌరజానపదారక్షం సర్వసందోహేన యుధ్యేత, నాస్వామిసంహతం రాజసేనాపతిహీనమ్.

4. భిన్నకూటాన్ధయోః భిన్నకూటమన్యాధిష్ఠితం యుధ్యేత, నాన్ధమదేశికమితి.

వ్యా. 1. స్వవిక్షిప్తం (తన రాజ్యంలోనే దూరదూరంగా చెదరి ఉన్నది) మిత్రవిక్షిప్తం (మిత్రరాజ్యంలో దూరదూరంగా చెదరి ఉన్నది) ఈ రెండింటిలో తన రాజ్యంలోనే చెదరి ఉన్న స్వవిక్షిప్తసైన్యం ఆపత్సమయంలో ఒకచోటకి చేర్చడానికి వీలుగా ఉంటుంది. మిత్రవిక్షిప్తసైన్య మైతే దూరదేశంలో విక్షిప్తం అవడంచేత ఎక్కువకాలం పట్టడంచేత ఒకచోటుకు చేర్చడానికి శక్యం కాదు.

2. దూష్యయుక్తం (రాజద్రోహులతో కూడినది) దుష్టుడైన పార్ష్ణిగ్రాహుడు కలది అయిన సైన్యాలలో దూష్యయుక్తసైన్యం విశ్వాసపాత్రులైన నాయకులచేత నడపబడుచు సైనికులు ఒకరితో ఒకరు కలవని పక్షంలో యుద్ధం చేయవచ్చును. కాని వెనకనుంచి శత్రువు దెబ్బ తీస్తాడని భయపడే దుష్టపార్ష్ణిగ్రాహం యుద్ధం చేయజాలదు.

3. శూన్యమూలం (వెనుక సైన్యం ఏమీ ఉంచకుండా బైలుదేరిన మొత్తం సైన్యం), అస్వామిసంహతం (ప్రభువులతో కలిసి ఉండనిది) - వీటిలో శూన్యమూలసైన్యం పౌరులచేత జానపదులచేత చేయబడిన రక్షణ కలదైతే యుద్ధం చేయవచ్చును. కాని రాజు కాని సేనాపతి కాని లేని అస్వామిసంహతసైన్యం మాత్రం యుద్ధం చేయజాలదు.

4. భిన్నకూటం (సేనాధ్యక్షుడు నశించినది), అంధం (ఉపదేశించేవాడు లేనిది) - వీటిలో భిన్నకూటసైన్యం మరొకరు ఎవరైనా నాయకత్వం వహిస్తే యుద్ధం చేయవచ్చు; కాని అంధసైన్యం దారి చూపేవా డెవడూ లేకపోవడం చేత యుద్ధం చేయజాలదు.

శ్లో. దోషశుద్ధిర్బలావాపః సత్రస్థానాతిసంహితమ్,
సంధిశ్చోత్తరపక్షస్య బలవ్యసనసాధనమ్.

వ్యా. పైన చెప్పిన దోషాలను తొలగించడం, మంచి సైన్యాన్ని తీసికొనివచ్చి అంతకు ముందున్న సైన్యంతో కలపడం, అరణ్యంలో ఉండడం, కపటోపాయాలచేత శత్రుసైన్యాన్ని మోసగించడం, అధికబలం గల పక్షంతో సంధి చేసుకొనడం ఇవి సైన్యవ్యసనాలను తొలగించుకొనడానికి సాధనాలు.

శ్లో. రక్షేత్ స్వదణ్డం వ్యసనే శత్రుభ్యో నిత్యముత్థితః,
ప్రహరేద్ దణ్డరన్ధ్రేషు శత్రూణాం నిత్యముత్థితః.

వ్యా. వ్యసనసమయాలలో నిత్యమూ ఉత్థితుడై (ఉద్యమశీలుడై) శత్రువులనుండి తన సైన్యాన్ని రక్షించుకోవాలి. నిత్యమూ ఉత్థితుడై శత్రుసైన్యాలను రంధ్రాలలో, దుర్బలస్థానాలలో, దెబ్బకొట్టాలి.

శ్లో. అభియాతం స్వయం మిత్రం సంభూయాన్యవశేన వా,
పరిత్యక్తమశక్త్యా వా లోభేన ప్రణయేన వా.

శ్లో. విక్రీతమభియుఞ్జానే సంగ్రామే వాపవర్తినా,
ద్వైధీభావేన వా మిత్రం యాస్యతా వాన్యమన్యతః.

శ్లో. పృథగ్వా సహయానే వా విశ్వాసేనాతిసంహితమ్,
భయావమానాలస్యైర్వా వ్యసనాన్న ప్రమోక్షితమ్.

శ్లో. అవరుద్ధం స్వభూమిభ్యః సమీపాద్వా భయాద్గతమ్,
ఆచ్ఛేదనాదదానాద్వా దత్త్వా వాప్యవమానితమ్.

శ్లో. అత్యాహారితమర్థం వా స్వయం పరముఖేన వా,
అతిభారే నియుక్తం వా భఙ్క్త్వా పరమవస్థితమ్.

శ్లో. ఉపేక్షితమశక్త్యా వా ప్రార్థయిత్వా విరోధితమ్,
కృచ్ఛ్రేణ సాధ్యతే మిత్రం సిద్ధం చాశు విరజ్యతి.

వ్యా. తన మిత్రునిమీదికి తానే స్వయంగా గాని, ఇతరులతో కలిసి గాని, తన బంధువులు మొదలైనవాళ్లను బట్టి గాని యుద్ధానికి వెళ్లినా, ఆతనిమీదికి మరొకడు యుద్ధానికి వచ్చినప్పుడు అశక్తి చేత గాని, ఆ శత్రువు తన కిస్తా నన్న ధనాదులమీద ఆశచేత గాని, ఆ శత్రువుమీద ప్రేమచేత గాని మిత్రుణ్ణి రక్షించకుండా పరిత్యజించినా, ఆ మిత్రుడు ఇతరునితో యుద్ధం చేస్తూండగా మధ్యలో ఆతనిని విడచి వచ్చి అతనిని ఆ యుద్ధంలో అమ్మివేసినా (అనగా సహాయహీనుణ్ణిగా చేసినా), లేదా ద్వైధీభావం అవలంబించి తన మిత్రుని శత్రువుతో సంధి చేసికొని తన యాతవ్యునిమీదికి యుద్ధానికి వెడుతూ ఈ మిత్రుణ్ణి అమ్మివేసినా (విడిచివేసినా), వేరుగా గాని (అనగా నువ్వు ఈ దిక్కునుంచి నీ శత్రువును ముట్టడించుము, నేను ఈ దిక్కునుండి ముట్టడిస్తాను అని చెప్పి గాని, కలిసి వెళ్లి యుద్ధం చేద్దాం అని చెప్పిగాని ఆ మిత్రుణ్ణి మోసం చేసినా, ఆతడు కష్టాలలో ఉన్నప్పుడు భయంచేత గాని, అవమానం(అనాదరం) చేత గాని, సోమరితనంచేత గాని ఆతనిని ఆ వ్యసనంనుండి విడిపించకపోయినా, తన భూములనుండి నిరోధించినా అనగా మిత్రుడు తన భూమికి రాకుండా చేసినా, తన సమీపం నుంచి భయపడి వెళ్లిపోయే టట్లు చేసినా, బలాత్కారంగా ధనాదికం లాగికొని గాని, ఆతనికి ఇవ్వవలసినది ఇవ్వకుండా గాని ఆతనిని అవమానించినా, ఇచ్చిన తరవాత కూడ అవమానించినా, స్వయంగా గాని, ఇతరుల ద్వారా గాని ఆతనినుండి ఎక్కువ ధనం గ్రహించినా,తన శత్రువును జయించి వచ్చిన ఆ మిత్రుణ్ణి మరొక అతిక్లిష్టమైన పనిలో నియోగించినా, అశక్తిచేత అతనిని ఉపేక్షించినా, ప్రార్థించి తిరిగి ఆతనితో విరోధం పెట్టుకొన్నా అలాంటి మిత్రుణ్ణి మళ్లీ తనకు అనుకూలుణ్ణిగా చేసుకొనడం చాల కష్టం. ఏదో విధంగా అనుకూలుణ్ణిగా చేసుకొన్నా వెంటనే అతడు వైరాగ్యం చెందుతాడు.

శ్లో. కృతప్రయాసం మాన్యం వా మోహాన్మిత్రమమానితమ్,
మానితం వా న సదృశం శక్తితో వా నివారితమ్.

శ్లో. మిత్రోపఘాతత్రస్తం వా శఙ్కితం వారిసంహితాత్,
దూష్యైర్వా భేదితం మిత్రం సాధ్యం సిద్ధం చ తిష్ఠతి.

వ్యా. తనకోసం ఎక్కువ పరిశ్రమచేసిన, మాన్యుడైన మిత్రునికి అజ్ఞానంవల్ల సంమానం చేయకపోయినా, సంమానం చేసినా తగు విధంగా చేయకపోయినా, బలం

పుంజుకొనకుండా ఆతనికి అడ్డుతగిలినా, తన మరొక మిత్రుణ్ణి నశింపచేయడంచేత తనను కూడా అట్లే చేస్తాడేమో అని భయపడినా, తాను ఆతని శత్రువుతో సంధి చేసికొనడంవల్ల తనకు భయపడుతున్నా, దూష్యులచేత భేదింపబడినా- అలాంటి మిత్రుణ్ణి ఆ కారణాలు తొలగించడం ద్వారా తనకు అనుకూలుణ్ణిగా చేసుకొనవచ్చును. అతడు అలా అనుకూలుడు గానే ఉంటాడు.

శ్లో. తస్మాన్నోత్పాదయేదేతాన్ దోషాన్ మిత్రోపఘాతకాన్,
ఉత్పన్నాన్ వా ప్రశమయేత్ గుణైర్దోషోపఘాతిభిః.

వ్యా. అందువల్ల మిత్రుణ్ణి బాధించే (మైత్రికి భంగం కలిగించే) ఈ దోషాలు కలగకుండా చూచుకోవాలి.అలాంటి దోషాలు ఏర్పడినా వాటిని నశింపచేసే గుణాలచేత వాటిని శమింపచెయ్యాలి.

శ్లో. యతో నిమిత్తం వ్యసనం ప్రకృతీనామవాప్నుయాత్,
ప్రాగేవ ప్రతికుర్వీత తన్నిమిత్తమతన్ద్రితః.

(కాంగ్లే ప్రకారం ఈ శ్లోకం ఈ ఘట్టంలోని మూడవ శ్లోకంగా - 'రక్షేత్స్వదణ్డం' ఇత్యాది శ్లోకం తరవాత - ఉన్నది)

ఇతి కౌటలీయార్థశాస్త్రే వ్యసనాధికారికే అష్టమాధికరణే పఞ్చమోऽధ్యాయః
బలవ్యసనవర్గః, మిత్రవ్యసనవర్గః, ఆదితః ఏకవింశతిశతతమః.

ఏతావతా కౌటలీయార్థశాస్త్రస్య వ్యసనాధికారికం అష్టమమధికరణం సమాప్తమ్.

వ్యా. సర్వదా జాగరూకుడైన విజిగీషువు స్వామి మొదలు మిత్రుని వరకు గల ప్రకృతులకు ఏ నిమిత్తముచేత వ్యసనం కలుగుతుందో ఆనిమిత్తాన్ని, ముందుగానే తొలగించాలి.

"బాలానందిని" అను కౌటలీయార్థశాస్త్రాంధ్రవ్యాఖ్యానంలో వ్యసనాధికారికం అనే అష్టమాధికరణంలో బలవ్యసనవర్గ-మిత్రవ్యసనవర్గా లనే ఐదవ అధ్యాయం, ప్రారంభంనుంచి నూట ఇరవై ఒకటవ అధ్యాయం సమాప్తం.

ఇంతటితో కౌటలీయార్థశాస్త్రంలో వ్యసనాధికారికం అనే ఎనిమిదవ అధికరణం సమాప్తం.

# అథ అభియాస్యత్కర్మ - నవమమధికరణమ్,

(యుద్ధయాత్రకువెళ్లనున్నవాడు చేయవలసిన పనులు - తొమ్మిదవ అధికరణం)

## అథ ప్రథమోఽధ్యాయః

### పఞ్చత్రింశచ్ఛతతమం ప్రకరణమ్ - శక్తిదేశకాలబలాబలజ్ఞానమ్

### షట్త్రింశచ్ఛతతమం ప్రకరణమ్ - యాత్రాకాలాః.

మూ. 1. విజిగీషురాత్మనః పరస్య చ బలాబలం శక్తిదేశకాలయాత్రాకాల బలసముత్థానకాలపశ్చాత్కోపక్షయవ్యయలాభాపదాం జ్ఞాత్వా విశిష్టబలో యాయాత్. అన్యథా ఆసీత.

2. ఉత్సాహప్రభావయోరుత్సాహః శ్రేయాన్. స్వయం హి రాజా శూరో బలవానరోగః, కృతాస్త్రః, దణ్డద్వితీయోఽపి శక్తః ప్రభావవన్తం రాజానం జేతుమ్; అల్పోఽపి చాస్య దణ్డస్తేజసా కృత్యకరో భవతి. నిరుత్సాహస్తు ప్రభావవాన్ రాజా విక్రమాభిపన్నో నశ్యతి ఇత్యాచార్యాః.

3. నేతి కౌటల్యః. ప్రభావవానుత్సాహవన్తం రాజానం ప్రభావేన అతిసంధత్తే. తద్విశిష్టమన్యం రాజానమ్ ఆవాహ్య హృత్వా క్రీత్వా ప్రవీరపురుషాన్ ప్రభూతప్రభావహయహస్తిరథోపకరణసంపన్నశ్చాస్య దణ్డః సర్వత్రాప్రతిహతః చరతి.ఉత్సాహవతశ్చ ప్రభావవన్తో జిత్వా క్రీత్వా చ స్త్రియో బాలాః పఙ్గవః అన్ధాశ్చ పృథివీం జిగ్యురితి.

వ్యా. 1. విజిగీషువు తనకూ శత్రువుకూ సంబంధించిన - శక్తి, దేశకాలాలు, యుద్ధయాత్రాసమయం, సైన్యం యుద్ధసంనద్ధం అయే కాలం, వెనుకనుంచి వచ్చే కోపం (తిరుగుబాటు మొ.) క్షయం, వ్యయం, లాభం,ఆపద-వీటి బలాబలాలను తెలుసుకొని తన బలం అధికంగా ఉన్న ట్లయితే యుద్ధానికి వెళ్లాలి. అలా కాకపోతే మెదలకుండా కూర్చోవాలి.

2. "ఉత్సాహశక్తి - ప్రభావాలలో (ప్రభావం అనగా కోశసైన్యాల సమృద్ధి) ఉత్సాహం శ్రేయస్కరం. తాను శూరుడు, బలవంతుడు, రోగాలు లేనివాడు, అస్త్రవిద్య

అభ్యసించినవాడూ అయిన రాజు కేవలం సైన్యం మాత్రమే సహాయంగా తీసికొని ప్రభావవంతుడైన రాజును కూడ జయించకలుగుతాడు. వీని సైన్యం అల్పమైనా కూడ తేజస్సుచేత పని సాధించకలుగుతుంది. ప్రభావవంతుడైనా ఉత్సాహం లేని రాజు పరాక్రమంచేత ఓడించబడినవాడై నశిస్తాడు" అని పూర్వాచార్యు లన్నారు.

3. అది కాదంటాడు కౌటల్యుడు. ఎందువల్ల ననగా - ప్రభావం గల రాజు ప్రభావం గల మరొక రాజును సహాయం కోసం రప్పించుకొని, మంచి వీరులైన పురుషులను అన్నం, వేతనం మొదలైనవి ఇవ్వడం ద్వారా గ్రహించి, అధికంగా ధనం ఇచ్చి కొని, ఉత్సాహవంతుడైన రాజును జయిస్తాడు. అత్యధికమైన ప్రభావం గల గుఱ్ఱాలు, ఏనుగులు, రథాలు, ఇతరసాధనాలు సమృద్ధిగా ఉన్న ఇతని సైన్యం ఎక్కడా అడ్డులేక సంచరిస్తుంది. పూర్వం ఎంతోమంది ప్రభావవంతులైన స్త్రీలు, బాలులు, కుంటివాళ్లూ, గ్రుడ్డివాళ్లు కూడ ఉత్సాహవంతులను జయించి, కొనివేసి ప్రపంచాన్ని జయించారు.

మూ. 1. ప్రభావమన్త్రయోః ప్రభావః శ్రేయాన్. మన్త్రశక్తిసంపన్నో హి వన్ధ్యబుద్ధిరప్రభావో భవతి. మన్త్రకర్మ చాస్య నిశ్చితమ్. అప్రభావః గర్భధాన్య మవృష్టిరివోపహన్తి ఇత్యాచార్యాః.

2. నేతి కౌటల్యః. మన్త్రశక్తిః శ్రేయసీ, ప్రజ్ఞాశాస్త్రచక్షుర్హి రాజా అల్పేనాపి ప్రయత్నేన మన్త్రమాధాతుం శక్తః, పరానుత్సాహప్రభావవతశ్చ సామాదిభిర్యోగోపనిషద్భ్యాం చాతిసన్ధాతుమ్. ఏవముత్సాహప్రభావమన్త్రశక్తీ నామ్ ఉత్తరోత్తరాధికః అతిసంధత్తే.

వ్యా. 1. "ప్రభావ-మంత్రశక్తులలో ప్రభావం గొప్పది. మంత్రశక్తిసంపన్నుడు ప్రభావం లేనివా డైతే వాని బుద్ధి వ్యర్థమే అవుతుంది. ప్రభావం లేకపోవడం నిశ్చితమైన వీని మంత్రకర్మను అవృష్టి పొట్టలో ఉన్న ధాన్యాన్ని వలె నశింపచేస్తుంది. అని ఆచార్యుల అభిప్రాయం.

2. అది యుక్తం కాదు-మంత్రశక్తియే (ఆలోచించి సరియైన నిర్ణయాలు తీసుకొనే శక్తి) మంచిది. ప్రజ్ఞ (బుద్ధిబలం), శాస్త్రమూ నేత్రాలుగా గల రాజు అల్పమైన ప్రయత్నంచేత కూడ మంత్రం (సరియైన ఆలోచన) చేయడానికీ, ఉత్సాహప్రభావాలు గల ఇతరులను, సామాద్యుపాయాలచేత తీక్ష్ణాదిగూఢపురుషులను ప్రయోగించడం

చేత ఔపనిషదప్రకరణంలో చెప్ప నున్న విషాగ్న్యాదిప్రయోగంచేత ఓడించడానికీ సమర్థు డవుతాడు. ఈ విధంగా ఉత్సాహ-ప్రభావ-మంత్రశక్తులలో ఉత్తరోత్తరమునందు అధికు డైనవాడు ఇతరులను అతిక్రమిస్తాడు, అనగా ఉత్సాహం ఉన్నవానికంటె ప్రభావం ఉన్నవాడు, ఈ రెండూ ఉన్నవానికంటె మంత్రశక్తి ఉన్నవాడూ గొప్పవా డని అర్థం.

మూ. 1. దేశః పృథివీ. తస్యాం హిమవత్సముద్రాన్తరముదీచీనం యోజనసహస్రపరిమాణం తిర్యక్ చక్రవర్తిక్షేత్రమ్. తత్ర ఆరణ్యః గ్రామ్యః, పార్వతః, ఔదకః, భౌమః, సమః, విషమ ఇతి విశేషాః. తేషు యథాస్వబలవృద్ధి కరం కర్మ ప్రయుఞ్జీత. యత్రాత్మనః సైన్యవ్యాయామానాం భూమిః, అభూమిః పరస్య, స ఉత్తమో దేశః, విపరీతోఽధమః, సాధారణో మధ్యమః.

2. కాలః శీతోష్ణవర్షాత్మా. తస్య రాత్రిః, అహః, పక్షః, మాసః, ఋతుః, అయనమ్,సంవత్సరో, యుగమితి విశేషాః. తేషు యథాస్వం బలవృద్ధికరం కర్మ ప్రయుఞ్జీత. యత్రాత్మనః సైన్యవ్యాయామానామ్ ఋతుః అనృతుః పరస్య స ఉత్తమః కాలః. విపరీతోఽధమః, సాధారణో మధ్యమః.

వ్యా. 1. దేశం అనగా భూమి. ఆ భూమియందు హిమవత్పర్వతదక్షిణ సముద్రాల మధ్య నున్నది ఉదీచీనభూమి (దక్షిణోత్తరాలలో వ్యాపించి ఉన్నది). వెయ్యియోజనాల ప్రమాణం గలది తిర్యగ్భూమి- అడ్డంగా తూర్పుసముద్రంనుంచి పశ్చిమసముద్రం వరకూ వ్యాపించిన భూమి. ఈ మొత్తం భూమి చక్రవర్తిక్షేత్రం. అనగా ఈ మొత్తం భూమికి అధిపతి యైనవాడు చక్రవర్తి. ఈ భూమిలో అరణ్యభూమి, పార్వతభూమి, ఔదకభూమి (నీటితో నిండిన భూమి) భౌమభౌమి (మెట్టభూమి), సమభూమి (చదునుగా ఉన్న భూమి) విషమభూమి (ఎగుడు దిగుడుగా ఉన్న భూమి) అని విశేషాలున్నాయి. ఆ భూములలో తన బలాన్ని పెంపొందించే విధంగా పనులు చెయ్యాలి. ఏ దేశం తన సైన్యం వ్యాయామం చేయడానికి అనుకూలంగా ఉంటుందో, పరసైన్యవ్యాయామానికి అనుకూలం కాదో, అది ఉత్తమదేశం, ఇందుకు విపరీతమైనది, అనగా పరసైన్యవ్యాయామానికి అనుకూలమై స్వసైన్యవ్యాయామానికి ప్రతికూలంగా ఉండేది, అధమభూమి. ఇద్దరికీ సమంగానే (సైన్యవ్యాయామానుకూలంగానో సైన్యవ్యాయామ ప్రతికూలంగానో) ఉండేది మధ్యమభూమి.

2. కాలం శీతకాలం, ఉష్మ గ్రీష్మకాలం వర్షాకాలం, అని మూడు విధాలుగా ఉంటుంది. ఆ కాలంలో, రాత్రి, పగలు, పక్షం, మాసం, ఋతువు, అయనం, సంవత్సరం, యుగం అనేవి విశేషాలు. ఆ కాలాలలో తన బలాన్ని పెంపొందించే పనులు చెయ్యాలి. ఏది తన సైన్యవ్యాయామాలకి అనుకూలమైన ఋతువో (కాలమో), ఏది పరుని సైన్యవ్యాయామానికి అనుకూలమైన ఋతువు కాదో, అది ఉత్తమకాలం. ఇందుకు విపరీతమైనది అధమకాలం. ఇద్దరికీ సమంగానే ఉండేది మధ్యమకాలం.

మూ. 1. శక్తిదేశకాలానాం తు-శక్తిః శ్రేయసీ ఇత్యాచార్యాః. శక్తిమాన్ హి నిమ్నస్థలవతో దేశస్య శీతోష్ణవర్షవతశ్చ కాలస్య శక్తః ప్రతీకారే భవతి.

2. దేశః శ్రేయాన్ ఇత్యేకే. స్థలగతో హి శ్వా నక్రం వికర్షతి. నిమ్నగతో నక్రః శ్వానమితి.

3. కాలః శ్రేయానిత్యేకే. దివా కాకః కౌశికం హన్తి. రాత్రౌ కౌశికః కాకమ్.

4. నేతి కౌటల్యః. పరస్పరసాధకా హి శక్తిదేశకాలాః.

వ్యా. 1. శక్తి-దేశ-కాలాలలో శక్తి మంచిది అని ఆచార్యుల అభిప్రాయం. ఎందువల్ల ననగా శక్తి గలవాడు పల్లంగా ఉన్న బురదనేలకు, మెట్టనేలకు, అట్లే శీతోష్ణవర్షా లున్న కాలానికి తగు ప్రతిక్రియ చేసుకొనకలుగుతాడు.

2. దేశం మంచిది అని కొందరు అంటారు. ఎందువల్ల ననగా మెట్టమీద ఉన్న కుక్క మొసలిని లాగకలుగుతుంది; నీళ్లలో ఉన్న మొసలి కుక్కను లాగుతుంది.

3. కాలం మంచి దని అంటారు మరి కొందరు. పగలు కాకి గుడ్లగూబను చంపుతుంది, గుడ్లగూబ రాత్రి కాకిని చంపుతుంది.

4. "అది కాదు; శక్తి-దేశ-కాలాలు అన్యోన్యోపకారకాలుగా ఉంటాయి" అని అంటాడు కౌటిల్యుడు.

మూ. 1. తైరభ్యుచ్ఛ్రితః తృతీయం చతుర్థం వా దణ్డస్యాంశం మూలే, పార్ష్ణ్యామ్, ప్రత్యన్తాటవీషు చ రక్షా విధాయ, కార్యసాధనసహం కోశదణ్డం చాదాయ క్షీణపురాణభక్తమ్, అగృహీతనవభక్తమ్ అసంస్కృతదుర్గమ్, అమిత్రం,

వార్షికం చాస్య సస్యం హైమనం చ ముష్టిముపహన్తుం మార్గశీర్షం యాత్రాం యాయాత్. హైమనం చాస్య సస్యం వాసన్తికం చ ముష్టిముపహన్తుం చైత్రీం యాత్రాం యాయాత్. క్షీణతృణకాష్ఠోదకమ్, అసంస్కృతదుర్గమ్ అమిత్రం వాసన్తికం చాస్య సస్యం వార్షికీం వా ముష్టిముపహన్తుం జ్యేష్ఠామూలీయాం యాత్రాం యాయాత్.

వ్యా. శక్తి-దేశ-కాలాలచేత మంచి బలం సంపాదించుకొన్న విజిగీషువు తన సైన్యంలోని మూడవ వంతు గాని నాల్గవ వంతుగాని మూలంలోను (తన రాజ్యంలోను), తన రాజ్యం వెనుక భాగంలోను,రాజ్యం సరిహద్దులలోను, అడవులలోను రక్షణకోసం ఉంచి, తాను తలపెట్టిన కార్యం సాధించడానికి సమర్థమైన కోశదండాలు కూడా తీసికొని, ఆహారం నిలవలు క్షీణించినవాడు, కొత్త ఆహారం సంగ్రహించనివాడు, దుర్గాలకు సంస్కారం చేయించుకొననివాడు అయిన శత్రువుమీదికి యుద్ధానికి వెళ్లాలి. (ప్రతిసంవత్సరం మూడు పంటల భోగాలు ఉంటాయి. వర్షాకాలంలో చల్లిన విత్తనాలవల్ల వచ్చిన పంటలు కోసికొని హేమంత ఋతువులో విత్తనాలు చల్లడం, వసంతంలో చల్లిన విత్తనాలవల్ల వచ్చిన పంటలు కోసుకొని వసంతర్తువులో విత్తనాలు చల్లడం, వసంతంలో చల్లిన విత్తనాలనుండి వచ్చిన పంటలు కోసికొని వర్షాకాలంలో విత్తనాలు చల్లడం. వాటిలో ఏ భోగాన్ని చెడగొట్టడానికి ఏ మాసంలో యుద్ధానికి వెళ్లాలో చెపుతున్నాడు). ఆ శత్రువుయొక్క వర్షాకాలపు సస్యాన్నీ హేమంతఋతువుకు సంబంధించిన ముష్టిని (విత్తనాలు చల్లడాన్ని) చెడగొట్టడానికి మార్గశీర్షమాసంలో యుద్ధానికి వెళ్లాలి. హేమంతఋతువులో లభించే సస్యాన్నీ, వసంతర్తువులో చేసే ముష్టిని చెడగొట్టడానికి చైత్రమాసంలో యుద్ధయాత్రకు వెళ్లాలి. తృణం, కాష్ఠాలు, ఉదకమూ క్షీణించినవాడు, దుర్గానికి బాగులు చేసికొననివాడు అయిన అమిత్రునిమీదికి, వాని వసంతర్తువులో లభించే సస్యాన్నీ, వర్షాకాలంలో చేయవలసిన ముష్టినీ చెడగొట్టడానికి జ్యేష్ఠమాసంలో యుద్ధయాత్రకు వెళ్లాలి.

మూ. 1. అత్యుష్ణమ్ అల్పయవసేన్ధనోదకం వా దేశం హేమన్తే యాయాత్.

2. తుషారదుర్దినమ్, అగాధనిమ్నప్రాయం, గహనతృణవృక్షం వా దేశం గ్రీష్మే యాయాత్.

3. స్వసైన్యవ్యాయామయోగ్యం పరస్యాయోగ్యం వర్షతి యాయాత్.

4. మార్గశీర్షం తైషం చాన్తరేణ దీర్ఘకాలాం యాత్రాం యాయాత్. చైత్రం వైశాఖం చాన్తరేణ మధ్యమకాలమ్, జ్యేష్ఠామూలీయమ్ అషాఢం చాన్తరేణ హ్రస్వకాలామ్. ఉపోషిష్యన్ వ్యసనే చతుర్థమ్. వ్యసనాభియానం విగృహ్య యానే వ్యాఖ్యాతమ్.

వ్యా. 1. చాల వేడి ఉండే దేశంమీదికి, లేదా అల్పమైన యవసం (పశువుల ఆహారం) కట్టెలు, ఉదకమూ గల దేశంమీదికి హేమంతఋతువులో యుద్ధానికి వెళ్లాలి.

2. రోజంతా పొగమంచుతో కప్పబడేదీ,లేదా లోతైన నీటితో నిండిన పల్లపుప్రదేశాలు అధికంగా ఉండేదీ, లేదా ప్రవేశింప శక్యం కాని గడ్డి చెట్లూ గలది అయిన దేశం మీదికి గ్రీష్మఋతువులో దండెత్తి వెళ్లాలి.

3. తన సైన్యం వ్యాయామం చేయడానికి తగిన భూమి గలది, పరసైన్యానికి వ్యాయామయోగ్యం కానిదీ అయిన దేశం మీదికి వర్షాకాలంలో దండెత్తి వెళ్లాలి.

4. దీర్ఘకాలం పట్టే యాత్రకు మార్గశీర్షపుష్యమాసాల మధ్యలో వెళ్లాలి. మధ్యమకాలం పట్టే యాత్రకి చైత్రవైశాఖమాసాల మధ్య వెళ్లాలి. తక్కువ కాలం పట్టే యాత్రకు జ్యేష్ఠాషాఢమాసాల మధ్య వెళ్లాలి. కష్టాలలో ఉన్న శత్రువును శుష్కింపచేయడం కొఱకు నాల్గవయాత్ర చెయ్యాలి. వ్యసనసమయంలో అభియానాన్ని గూర్చి "విగృహ్యయానం" అనే ప్రకరణంలో వివరించబడింది.

మూ. 1. ప్రాయశశ్చ ఆచార్యాః పరవ్యసనే యాతవ్యమ్ ఇత్యుపదిశన్తి.

2. శక్త్యుదయే యాతవ్యమ్; అనైకాన్తికత్వాత్ వ్యసనానామితి కౌటల్యః.

3. యదా వా ప్రయాతః కర్శయితుమ్, ఉచ్ఛేత్తుం వా శక్నుయాదమిత్రం తదా యాయాత్.

4. అత్యుష్ణోపక్షీణే కాలే హస్తిబలప్రాయో యాయాత్. హస్తినో హ్యన్తః స్వేదాః కుష్ఠినో భవన్తి, అనవగాహమానాస్తోయమ్, అపిబన్తః అవక్షారాశ్చ అన్ధీభవన్తి. తస్మాత్ ప్రభూతోదకే దేశే వర్షతి చ హస్తిబలప్రాయః యాయాత్.

విపర్యయే ఖరోష్ట్రాశ్వబలప్రాయః. దేశమల్పవర్షపఙ్కం వర్షతి మరుప్రాయం చ తురఙ్గబలో యాయాత్.

5. సమవిషమనిమ్నస్థలహ్రస్వదీర్ఘవశేన వాధ్వనః యాత్రాం విభజేత్.

వ్యా. 1. శత్రువు కష్టాలలో ఉన్నప్పుడు వానిమీదికి వెళ్లాలి అని సాధారణంగా ఆచార్యులు ఉపదేశిస్తున్నారు.

2. వ్యసనాలు తప్పనిసరిగా ఈ విధంగా, ఈ కాలంలో వస్తాయి అని చెప్పడం కష్టం. అందుచేత తన శక్తి అభివృద్ధిలో (అధికంగా) ఉన్నప్పుడు యాత్రకు వెళ్లాలి అని కౌటిల్యుని అభిప్రాయం.

3. ఎప్పుడు దండెత్తి వెడితే శత్రువును కృశింపచేయడానికి గాని, నిర్మూలించడానికి గాని సమర్థుడౌతాడో అప్పుడు వెళ్లాలి.

4.అత్యధికమైన వేడి తగ్గిన తరవాత ఆ కాలంలో అధికంగా ఏనుగుల సైన్యంతో యుద్ధానికి వెళ్లాలి. ఎందువల్లననగా ఏనుగులు లోలోన చెమటతో నిండి కుష్ఠరోగం కల వౌతాయి. నీటిలో దిగకపోయినా, నీళ్లు బాగా త్రాగకపోయినా అవి దేహంలోపల మలప్రవాహం జరగడంతో గ్రుడ్డివైపోతాయి. (అందువల్ల అత్యుష్ణకాలంలో హస్తిసేనతో వెళ్లకూడదు అని భావం). అందువల్ల నీళ్లు సమృద్ధంగా ఉన్న ప్రదేశానికీ, వర్షం కురుస్తున్న రోజులలోను అధికంగా హస్తిసైన్యం తీసికొని యుద్ధానికి వెళ్లాలి. అందుకు విపరీతంగా (చాల వేడిగా ఉన్నప్పుడు ఆ దేశంలో నీళ్లు లేనప్పుడు) అధికంగా గాడిదల సైన్యం, ఒంటెల సైన్యం, అశ్వసైన్యం తీసికొని వెళ్లాలి. వర్షం, బురదా తక్కువగా ఉండే మరుదేశానికి వర్షాలు కురుస్తూన్నప్పుడు చతురంగబలంతో వెళ్లాలి.

5. మార్గం సమంగాను -విషమంగాను, పల్లంగాను -మెరకగాను, హ్రస్వంగాను - దీర్ఘంగాను ఉండడాన్ని పట్టి యుద్ధయాత్రను దానికి అనుగుణంగా విభజించుకొనాలి.

శ్లో. సర్వా హి హ్రస్వకాలాః స్యుః యాతవ్యాః కార్యలాఘవాత్,
దీర్ఘాః కార్యగురుత్వాద్వా వర్షావాసః పరత్ర చ.

ఇతి కౌటలీయార్థశాస్త్రే అభియాస్యత్కర్మణి నవమాధికరణే ప్రథమోఽధ్యాయః శక్తిదేశకాలబలాబలజ్ఞానం, యాత్రాకాలాః, ఆదితః ద్వావింశతిశతతమోఽ ధ్యాయః.

వ్యా. అన్ని యుద్ధయాత్రలూ కూడ కార్యలాఘవాన్ని పట్టి (సాధించవలసిన

కార్యం శీఘ్రంగా జరిగే పక్షంలో) అల్పమైన కాలంలో పూర్తి కావచ్చు. కార్యగురుత్వాన్ని పట్టి దీర్ఘాలు కావచ్చును. అవసరాన్ని పట్టి శత్రురాజ్యంలోనే వర్షాకాలం కూడా గడపవలసి రావచ్చు.

"బాలానందిని" అను కౌటలీయార్థశాస్త్రాంధ్రవ్యాఖ్యానంలో అభియాస్యత్కర్మ అనే నవమాధికరణంలో శక్తి-దేశ-కాల-బలాబలజ్ఞానం, యాత్రాకాలాలు అనే ప్రథమాధ్యాయం, ప్రారంభంనుంచి నూటఇరవైరెండవ అధ్యాయం సమాప్తం.

## అథ ద్వితీయోఽధ్యాయః

### సప్తత్రింశచ్ఛతతమం ప్రకరణమ్ - బలోపాదానకాలాః.

(అనేక విధాలైన సైన్యాలను ఉపయోగించడం)

### అష్టత్రింశచ్ఛతతమం ప్రకరణమ్ - సంనాహగుణాః.

(యుద్ధానికి సంనద్ధం అవడంలో గుణాలు.)

### ఏకోనచత్వారింశచ్ఛతతమం ప్రకరణమ్ - ప్రతిబలకర్మ.

(శత్రుసైన్యానికి ఎదురుగా తగిన సైన్యాన్ని మోహరించడం)

మూ. 1. మౌలభృతకశ్రేణీమిత్రామిత్రబలానాం సముద్దానకాలాః.

2. మూలరక్షణాదతిరిక్తం మౌలబలమ్, అత్యావాపయుక్తా వా మౌలాః మూలే వికుర్వీరన్ ఇతి, బహులానురక్తమౌలబలః సారబలో వా ప్రతియోద్ధా వ్యాయామేన యోద్ధవ్యమ్ ఇతి, ప్రకృష్టేఽధ్వని కాలే వా క్షయ వ్యయసహత్వాత్ మౌలానామ్ ఇతి, బహులానురక్తసంపాతే చ యాతవ్య స్యోపజాపభయాదన్యసైన్యానాం భృతాదీనామవిశ్వాసే, బలక్షయే వా సర్వ సైన్యానామ్ ఇతి మౌలబలకాలః.

వ్యా. 1. మౌలబలం (స్థానీయమైన అనగా రాజధానిలో ఉండే విశ్వాసపాత్రమై తండ్రితాతలనాటినుండి వస్తూన్న సైన్యం), భృతకబలం (జీతానికి కుదుర్చుకొన్న బలం), శ్రేణీబలం (జానపదుల, ఆయుధీయుల అనగా ఆయుధజీవుల సముదాయరూపమైన బలం) మిత్రబలం, అమిత్రబలం (శత్రువునుండి తీసికొన్న

బలం) అటవీబలం (ఆటవికుల బలం) వీటిని పనిలో వినియోగించే కాలం చెప్పబడుతున్నది.

2. మౌలబలం మూలస్థానాన్ని రక్షించడానికి అవసరమైనదానికంటె ఎక్కువ ఉన్నదని అనుకొన్నప్పుడు, అధికసంఖ్యలో ఉన్న రాజద్రోహులు కలవడంచేత మూలస్థానంలో వికృతంగా ప్రవర్తించవచ్చును అనుకొన్నప్పుడు, మన ప్రతియోద్ధ (ఎదిరించి యుద్ధంచేసే శత్రువు) దగ్గర అధికసంఖ్యలో ఉన్న అనురక్తమైన మౌలబలం ఉన్నది, లేదా శ్రేష్ఠమైన బలం ఉన్నది, అందుచేత ఆతనితో ప్రయత్నపూర్వకంగా యుద్ధం చెయ్యాలి అనుకొన్నప్పుడు, మౌలబలానికి చెందినవాళ్లు దూరమైన మార్గంలో గాని, కాలంలో గాని క్షయవ్యయాలు సహించకలుగుతారు అనుకొన్నప్పుడు, చాల విశ్వాసపాత్రులైన సైనికులతో (భృతాదులను) కలిపి ఒక చోట చేర్చితే, యాతవ్యుడు ఉపజాపం చేస్తాడేమో అనే భయంవల్ల, భృతాదులైన ఇతరసైన్యాలయందు విశ్వాసం లేనప్పుడు, ఇతరములైన సమస్తసైన్యాల బలం క్షీణించినప్పుడు అది మౌలబలాన్ని ఉపయోగించవలసిన కాలం.

మూ. 1. ప్రభూతం మే భృతబలమ్, అల్పం చ మౌలబలమ్ ఇతి, పరస్యాల్పం విరక్తం వా మౌలబలమ్, ఫల్గుప్రాయమసారం వా భృతసైన్యమ్ ఇతి, మన్త్రేణ యోద్ధవ్యమల్పవ్యాయామేన ఇతి. హ్రస్వో దేశః కాలో వా తనుక్షయవ్యయః ఇతి, అల్పసంపాతం,శాన్తోపజాపమ్, విశ్వస్తం వా మే సైన్యమ్ ఇతి, పరస్యాల్పః ప్రసారః హన్తవ్యః ఇతి - భృతబలకాలః.

2. ప్రభూతం మే శ్రేణీబలం శక్యం మూలే యాత్రాయాం చాధాతుమ్ ఇతి, హ్రస్వప్రవాసః, శ్రేణీబలప్రాయః ప్రతియోద్ధా మన్త్రవ్యాయామాభ్యాం ప్రతియోద్ధుకామః, దణ్డబలవ్యవహారః ఇతి - శ్రేణీబలకాలః.

వ్యా. 1. నా భృతబలం అత్యధికంగా ఉన్నది, మౌలబలం అల్పంగా ఉన్నది అనుకొన్నప్పుడు, శత్రువుయొక్క మౌలబలం అల్పంగాను విర్తకంగాను (వానియందు ప్రేమ లేనిది గాను) ఉన్నది లేదా వాని భృతసైన్యం చాలవరకు అతినీచులతో కూడినదై సారం లేనిదిగా ఉన్నది అనుకొన్నప్పుడు, లేదా ఎక్కువ సైన్యప్రయోగం చేయకుండా మంత్రంచేతనే యుద్ధం చేయడం మంచిది అనుకొన్నప్పుడు లేదా కాలమూ దేశమూ

కూడ అల్పంగా ఉన్నది క్షయవ్యయాలు కూడ స్వల్పంగానే ఉంటాయి అనుకొన్నప్పుడు, లేదా నా సైన్యంలోని శత్రువుల గూఢచారుల ప్రవేశం అత్యల్పం అవడంచేత దీనిలో ఉపజాతం తగ్గిపోయింది అందుచేత ఈ సైన్యం విశ్వాసయోగ్యమైనది అనుకొన్నప్పుడు అడ్డగించదగిన శత్రువుయొక్క ప్రసారం (తృణకాష్ఠాదుల సరఫరా) చాల అల్పమైనది అనుకొన్నప్పుడు అది భృతబలాన్ని వినియోగించవలసిన కాలం.

2. అత్యధికంగా ఉన్న నా శ్రేణీబలం మూలస్థానంలోను, యుద్ధయాత్రయందు కూడ వినియోగించడానికి శక్యమైనది, లేదా ప్రవాసం చిన్నది, లేదా శత్రువు సైన్యంలో శ్రేణీబలమే అధికంగా ఉంది, లేదా శత్రువు మంత్రంచేత సైన్యవ్యాయామం (ప్రయోగం) చేతా కూడ యుద్ధం చేయగోరుచున్నాడు, లేదా ఇది ఆయుధాలు ధరించిన సైన్యాన్ని వినియోగించవలసిన సమయం అనుకొన్నప్పుడు అది శ్రేణీబలాన్ని వినియోగించవలసిన కాలం.

మూ. 1. ప్రభూతం మే మిత్రబలం శక్యం మూలే యాత్రాయాం చాధాతుమ్, అల్పః ప్రవాసః, మన్త్రయుద్ధాచ్చ భూయో వ్యాయామయుద్ధమ్ ఇతి, మిత్రబలేన వా పూర్వమటవీం నగరీస్థానమ్ ఆసారం వా యోధయిత్వా పశ్చాత్ స్వబలేన యోధయిష్యామి, మిత్రసాధారణం వా మే కార్యమ్, మిత్రాయత్తా వా మే కార్యసిద్ధిః, ఆసన్న మనుగ్రాహ్యం వా మే మిత్రమ్, అత్యావాపం వాస్య సాధయిష్యామి ఇతి మిత్రబలకాలః.

2. ప్రభూతం మే శత్రుబలం శత్రుబలేన యోధయిష్యామి నగరస్థానమ్ అటవీం వా. తత్ర మే శ్వవరాహయోః కలహే చణ్డాలస్యేవ అన్యతర సిద్ధిర్భవిష్యతి ఆసారాణామటవీనాం వా కణ్టకమర్దనమేతత్ కరిష్యామి. అత్యుపచితం వా కోపభయాన్నిత్యమాసన్న మరిబలం వాసయేదన్యత్రాభ్యన్తరకోపశఙ్కాయాః శత్రుయుద్ధావరయుద్ధకాలశ్చ ఇతి అమిత్రబలకాలః.

వ్యా. 1. నా మిత్రసైన్యం అత్యధికంగా ఉంది, అందుచేత దానిని మూలస్థానంలోను యుద్ధయాత్రలోను కూడ వినియోగించవచ్చును, లేదా ప్రవాసం చాల స్వల్పమైనది, మంత్రయుద్ధంకంటె వ్యాయామయుద్ధం (సైన్యంతో యుద్ధం) అధికంగా చేయవలసి ఉన్నది, లేదా ముందుగా అడవిలోను, నగరస్థానంలోను,

ఆసారంతోను (శత్రువుయొక్క మిత్రసైన్యంతోను) మిత్రసైన్యంచేత యుద్ధం చేయించి తరవాత నా సైన్యంచేత యుద్ధం చేయిస్తాను, లేదా ఈ పని నాకూ నా మిత్రునికీ కూడ సాధారణమే (సమానమే) లేదా నా కార్యసిద్ధి మిత్రునిమీద ఆధారపడి ఉంది. లేదా, నాకు దగ్గరగా ఉన్న నా మిత్రునికి నేను ఉపకారం చెయ్యాలి. ఇతని సైన్యంలో ఉన్న అత్యావాపాన్ని (దూష్యులు ఎక్కువ కలిసి ఉండడాన్ని) సాధిస్తాను అనగా ఆ దూష్యుల్ని తొలగిస్తాను అనుకొన్నప్పుడు అది మిత్రబలాన్ని ఉపయోగించే కాలం.

2. అత్యధికంగా ఉన్న నా శత్రుబలాన్ని (మరొక శత్రువునుండి తీసికొన్న బలాన్ని) ఈ శత్రుబలంతో నగరస్థానంలో గాని, అడవిలో కాని యుద్ధం చేయిస్తాను. అలా జరిగిన యుద్ధంలో కుక్కకీ వరాహానికీ యుద్ధం జరిగినప్పుడు చండాలునికి వలె (వాటిలో ఏది చచ్చినా చండాలునికి ఆహారలాభమే) నాకు ఏదో ఒక ఫలం సిద్ధిస్తుంది. లేదా ఈ శత్రుసైన్యాన్ని నా మిత్రుని సైన్యంలో గాని ఆటవికసైన్యంలో గాని ఉన్న కంటకాలను (నాకు వ్యతిరేకంగా ఉన్నవాళ్లను) మర్దించే టట్లు చేస్తాను అనుకొన్నప్పుడు లేదా చాలా పెరిగిన ఈ శత్రువుసైన్యాన్ని దూరంగా ఉంచుతే దానిలో కోపం కలగవచ్చు, అందుచేత అభ్యంతరకోపం కలగవచ్చుననే భయం (మంత్ర్యాదులలో కోపం కలగవచ్చు అనే భయం) ఉంటే తప్ప దానిని నిత్యమూ నా దగ్గరనే ఉంచుకోవాలి అనుకొన్నప్పుడు లేదా శత్రువుకు నా శత్రువుతో యుద్ధం జరిగిన పిమ్మటనే నేను యుద్ధంలోనికి దిగవలసి ఉంటుంది అనుకొన్నప్పుడు అది అమిత్రబలాన్ని వినియోగించే కాలం.

మూ. 1. తేన అటవీబలకాలో వ్యాఖ్యాతః.

2. మార్గదేశికం, పరభూమియోగ్యమ్, అరియుద్ధప్రతిలోమమ్ అటవీబలప్రాయః శత్రుర్వా బిల్వం బిల్వేన హన్యతామ్,అల్పః ప్రసారో హన్తవ్యః ఇత్యటవీబలకాలః.

3. సైన్యమనేకమ్ అనేకజాతీయస్థమ్, ఉక్తమనుక్తం వా విలోపార్థం యదుత్తిష్ఠతి తదౌత్సాహికమ్. భక్తవేతనవిలోపవిశిష్టప్రతాపకరం భేద్యం పరేషామ్, అభేద్యం తుల్యదేశజాతిశిల్పప్రాయం సంహతం మహత్. ఇతి బలోపాదానకాలాః.

4. తేషాం కుప్యభృతమ్ అమిత్రాటవీబలం విలోపభృతం వా కుర్యాత్.

వ్యా. 1. అమిత్రబలానికి చెప్పినదానిచేత అటవీబలం కూడా వ్యాఖ్యానింప బడినట్లే. అనగా అమిత్రబలాన్ని వినియోగించడానికి చెప్పబడిన కారణాలు ఆటవిక బలవినియోగానికి కూడా ఉపయోగిస్తాయి అని అర్థం. అయితే మరి కొన్ని విశేషాలు క్రింద చెపుతున్నాడు-

2. అటవీబలం మార్గం చూపుతుంది అని గాని,శత్రుభూమిలో ఉపయోగించడానికి యోగ్యమైన దని గాని, శత్రువు అవలంబించే యుద్ధవిధానాన్ని ఎదిరించడానికి సమర్థమైన దని గాని, ఎక్కువగా ఆటవికబలాన్ని ఉపయోగిస్తున్న శత్రువును ఆటవికసైన్యాన్నే ఉపయోగించి మారేడు పండును మరొక మారేడు పండుతో పగలగొట్టి నట్లు నశింపచేయవచ్చును అని గాని, శత్రువుయొక్క అల్పమైన తృణకాష్ఠాదిప్రసారాన్ని మాత్రమే అడ్డగించాలి, అందుకు ఆటవికసైన్యం చాలు నని అనుకొన్నప్పుడు అది ఆటవికసైన్యాన్ని వినియోగించవలసిన కాలం.

3. ఔత్సాహికసైన్యం (Voluntary army)అనే ఏడవరకం సైన్యంకూడ గ్రహించదగినదే అని చెపుతున్నాడు - ఒక సంఘంగా (unit) లేనిది (కాంగ్లే), ఒక నాయకుడు లేనిది, అనేకసంఘాలుగా ఉన్నదీ, అనేక జాతులవాళ్లు ఉన్నదీ అయిన ఏ సైన్యం పిలిచినా పిలవకపోయినా కూడ శత్రువును దోచుకొనడంకోసం యుద్ధం చేయడానికి సిద్ధంగా ఉంటుందో అది ఔత్సాహికసైన్యం. ఈ సైన్యానికి అన్నం కాని జీతం కాని ఇవ్వడం ఉండదు. శత్రురాజ్యం మీద పడి దోచుకొనడమే దీని పని. అ యా పనులు, సాహసకృత్యాలు చేస్తూ ఉంటుంది. దీనిని శత్రువులు అనాయాసంగా భేదింపచేస్తారు. కాని ఒకే దేశానికి, జాతికి చెందినవాళ్లు ఒకే శిల్పం ఉన్నవాళ్లు ఈ సైన్యంలో అధికంగా ఉంటే మాత్రం ఇది బలం కలదై, సంహతమై (బాగా కలసి ఉంటూ) శత్రువుల భేదోపాయానికి లొంగదు. ఇంతవరకు ఆ యా బలాలను వినియోగించే కాలాలు చెప్పబడ్డాయి.

4. ఈ ఏడు విధాలైన సైన్యాలలో అమిత్రబల-ఆటవికబలాలకి వస్త్రాస్తరణాదికములైన కుప్యాలు జీతంగా ఇవ్వాలి. లేదా శత్రురాజ్యంనుంచి దోచుకొన్న ద్రవ్యాన్ని వాళ్లకి భృతిగా ఇవ్వాలి.

మూ. 1. అమిత్రస్య వా బలకాలే ప్రత్యుత్పన్నే శత్రుబలమవగృహ్ణీయాత్, అన్యత్ర వా ప్రేషయేత్, అఫలం వా కుర్యాత్.

విక్షిప్తం వా వాసయేత్. కాలే వా అతిక్రాన్తే విసృజేత్. పరస్య చైతద్ బలసముద్దానం విఘాతయేత్. ఆత్మనః సంపాదయేత్.

2. పూర్వపూర్వం చైషాం శ్రేయః సంనాహయితుమ్.

3. తద్భావభావిత్వాత్ నిత్యసత్కారానుగమాచ్చ మౌలబలం భృతబలాచ్ఛ్రేయః.

వ్యా. 1. అమిత్రబలం విషయంలో చెపుతున్నాడు-అమిత్రుడు సైన్యాన్ని సంనద్ధం చేయవలసినప్పుడు (తన దగ్గర ఉన్న) ఆ శత్రువు సైన్యాన్ని (శత్రువుదగ్గరికి వెళ్లకుండా) నిరోధించాలి. లేదా మరొకచోటికి పంపివేయాలి. ఏ పనీ చేయజాలనిదానినిగా చెయ్యాలి. లేదా చెల్లాచెదరు చేసి ఒకచోట ఉండకుండా చెయ్యాలి. శత్రువు తలపెట్టిన పని అయిపోయిన తరవాత ఆ సైన్యాన్ని విడిచిపెట్టాలి. శత్రువు చేసే సైన్యసంనాహానికి విఘాతం కల్పించి తన సైన్యసంనాహాన్ని సంపాదించాలి.

2. మౌలం మొదలు ఔత్సాహికం వరకు ఉన్న ఏడు విధాల సైన్యాలలో పూర్వపూర్వసైన్యం సన్నద్ధం చేయడం శ్రేయస్కరం. అనగా ఔత్సాహికం కంటె ఆటవికం, దానికంటె అమిత్రబలం ఇత్యాదివిధంగా శ్రేయస్కరం.

3. మౌలబలం భృతబలం కంటె మంచిది; ఎందువల్ల ననగా రాజు బాగుంటే ఆ బలం బాగుంటుంది. నిత్యమూ సత్కారాలను అవిచ్ఛిన్నంగా పొందుతూఉంటుంది.

మూ. 1. నిత్యానన్తరం క్షిప్రోత్థాయి వశ్యం చ భృతబలం శ్రేణీ బలాచ్ఛ్రేయః.

2. జానపదమేకార్థోపగతం తుల్యసంఘర్షామర్షసిద్ధిలాభం చ శ్రేణీబలం మిత్రబలాచ్ఛ్రేయః. అపరిమితదేశకాలమ్ ఏకార్థోపగమాచ్చ మిత్రబలమ్ అమిత్రబలాచ్ఛ్రేయః.

3. ఆర్యాధిష్ఠితమ్ అమిత్రమ్ అటవీబలాచ్ఛ్రేయః. తదుభయం విలోపార్థమ్. అవిలోపే వ్యసనే చ తాభ్యామహిభయం స్యాత్.

4. బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రసైన్యానాం తేజఃప్రాధాన్యాత్ పూర్వ పూర్వం శ్రేయః సంనాహయితుమ్ ఇత్యాచార్యాః.

5. నేతి కౌటల్యః. ప్రణిపాతేన బ్రాహ్మణబలం పరోఽభిహారయేత్.

ప్రహరణవిద్యావినీతం తు క్షత్రియబలం శ్రేయః. బహులసారం వా వైశ్యశూద్రబలమితి.

వ్యా. 1. భృతబలం ఎల్లప్పుడు దగ్గరనే ఉంటుంది. శీఘ్రంగా సన్నద్ధం అవుతుంది. అధీనంలో ఉంటుంది. అందుచేత ఇది శ్రేణీబలంకంటె మంచిది.

2. జానపదశ్రేణీబలం స్వామికి ఏ ప్రయోజనమో అదే తన ప్రయోజనంగా గ్రహించి పని చేస్తుంది. సంఘర్షంలోను, అమర్షంలోను, కార్యసిద్ధిలోను, లాభంలోను స్వామితో తుల్యంగా ఉంటుంది. అందుచేత అది (జానపదమైన శ్రేణీబలం) మిత్రబలం కంటె మంచిది. ఇంత దేశం, ఇంత కాలం అనే లెక్క లేకుండా ఒకే ప్రయోజనాన్ని ఉద్దేశించి పని చేసే మిత్రబలం శత్రుబలంకంటె మంచిది.

3. సద్గుణవంతుడైన మంచి నాయకు డున్న అమిత్రబలం అటవీబలంకంటె మంచిది. అమిత్రబల-అటవీబలాలు రెండూ కూడ శత్రురాజ్యంలో పడి దోచుకోవడానికి ఉపయోగిస్తాయి. అలా దోచుకొనే అవకాశం లేకపోయినప్పుడూ, కష్టసమయాలలోను ఈ రెండు సైన్యాలవల్ల అహిభయం (ఇంట్లో ఉంచుకొన్న సర్పంవల్ల కలిగే భయం వంటి భయం) ఉంటుంది.

4. బ్రాహ్మణసైన్య - క్షత్రియసైన్య - వైశ్యసైన్య - శూద్రసైన్యాలలో తేజస్సుకు ప్రాధాన్యం ఉండడంవల్ల పూర్వ పూర్వ సైన్యం యుద్ధసంనద్ధం చేయడానికి మంచిది అని ఆచార్యులన్నారు. అనగా శూద్రసైన్యంలోకంటె వైశ్యసైన్యంలోను, వైశ్యసైన్యంలోకంటె క్షత్రియసైన్యంలోను, దానికంటె బ్రాహ్మణసైన్యంలోను తేజస్సుకు ప్రాధాన్యం ఉంటుంది. అని అర్థం. ఇక్కడ తేజస్సు అనగా శౌర్యం కాదు. బ్రాహ్మణునిలో శౌర్యం ఉండదు కదా, అందుచేత ఇక్కడ తేజస్సనగా ధార్మికత్వం, కృతజ్ఞత్వం మొదలైన గుణాలు అని గ.శా.

5. అది యుక్తం కాదు. శత్రువు నమస్కారం చేసి బ్రాహ్మణబలాన్ని వశం చేసుకొంటాడు, ఆయుధవిద్యలో శిక్షితమైన క్షత్రియబలం మంచిది; లేదా అధికసంఖ్యలో వీరు లున్న వైశ్యశూద్రబలమైనా శ్రేయస్కరమే అని కౌటిల్యు డంటాడు.

మూ. 1. తస్మాద్ "ఏవంబలః పరః, తస్యైతత్ ప్రతిబలమ్" ఇతి బలసముద్దానం కుర్యాత్.

2. హస్తియన్త్రశకటగర్భకున్తప్రాసహాటకవేణుశల్యవత్ హస్తిబలస్య ప్రతిబలమ్.

3. తదేవ పాషాణలగుడావరణాఙ్కుశకచగ్రహణీ ప్రాయం రథబలస్య ప్రతిబలమ్.

4. తదేవాశ్వానాం ప్రతిబలమ్.

5. వర్మిణో వా హస్తినః అశ్వా వా వర్మిణః కవచినో రథాః ఆవరణినః పత్తయః చతురఙ్గబలస్య ప్రతిబలమ్.

వ్యా. 1. అందువల్ల "శత్రువుబలం ఈ విధంగా ఉంది; దానికి ఇది ప్రతిబలం - (ఎదుర్కొనే సైన్యం) అని నిర్ణయించుకొని సైన్యంయొక్క ఏర్పాటు చెయ్యాలి.

2. శత్రువుయొక్క హస్తిబలాన్ని ఎదిరించడానికి తగినది, ఏనుగులు, యంత్రాలు, మధ్యభాగంలో శకటాలు(బండ్లు) కుంతాలు, ప్రాసాలు, హాటకాలు, వెదుళ్లు, ఇనుప శల్యాలు ఉన్న బలం.

3. రాళ్లు, కఱ్ఱలు, ఆవరణాలు (కవచాలు) అంకుశాలు, కచగ్రహణి (చివర అంకుశం బిగించిన పొడవైన వెదురుకఱ్ఱ) ఇవి కూడ అధికంగా గల పైన చెప్పిన హస్తిబలప్రతిబలమే రథబలానికి ప్రతిబలం.

4. ఇదే అశ్వబలానికి కూడ ప్రతిబలం.

5. కవచాలు తొడిగిన గజాలు, కవచాలు తొడిగిన గుఱ్ఱాలు, కవచాలు కప్పిన రథాలు, ఆవరణలు ధరించిన కాలిబంట్లు చతురంగబలానికి ప్రతిబలం.

శ్లో. ఏవం బలసముద్దానం పరసైన్యనివారణమ్,
విభవేన స్వసైన్యానాం కుర్యాదఙ్గవికల్పశః.

ఇతి కౌటలీయార్థశాస్త్రే అభియాస్యత్కర్మణి నవమేఽధికరణే ద్వితీయోఽధ్యాయః, బలోపాదానకాలాః,సంనాహగుణాః ప్రతిబలకర్మ ఆదితః త్రయోవింశతిశతతమోఽధ్యాయః.

వ్యా. ఈ విధంగా సైన్యాంగాల వికల్పాన్ని పట్టి అనగా శత్రువు ఏ సైన్యాంగాలను ఉపయోగిస్తున్నాడో దానిని పట్టి, మౌలం మొదలైన స్వసైన్యాల బలాన్ని అనుసరించి విజిగీషువు పరసైన్యాలను అడ్డుకొనే సైన్యసముద్దానం (సైన్యాల మోహరింపు) చెయ్యాలి.

"బాలానందిని" అను కౌటలీయార్థశాస్త్రాంధ్రవ్యాఖ్యానంలో అభియాస్యత్కర్మ అనే నవమాధికరణంలో, బలోపదానకాలాలు,సంనాహగుణాలు, ప్రతిబలం చేయవలసిన పని అనే రెండవ అధ్యాయం, ప్రారంభంనుండి నూటఇరవైమూడవ అధ్యాయం సమాప్తం.

# అథ తృతీయోఽధ్యాయః

## చత్వారింశచ్ఛతతమం ప్రకరణమ్ - పశ్చాత్కోపచిన్తా.

## ఏకచత్వారింశచ్ఛతతమం ప్రకరణం - బాహ్యాభ్యన్తర ప్రకృతికోపప్రతీకారః.

మూ. అల్పః పశ్చాత్కోపో మహాన్ పురస్తాల్లాభ ఇతి- అల్పః పశ్చాత్కోపో గరీయాన్. అల్పం పశ్చాత్కోపం ప్రయాతస్య దూష్యామిత్రాటవికాః హి సర్వతః సమేధయన్తి; ప్రకృతికోపో వా. లబ్ధమపి చ మహాన్తం పురస్తాల్లాభమ్ ఏవం భూతే భృత్యమిత్రక్షయవ్యయాః గ్రసన్తే. తస్మాత్ సహస్రైకీయః పురస్తాల్లాభస్యా యోగః, శతైకీయో వా పశ్చాత్కోప ఇతి న యాయాత్. సూచీముఖ్యా హ్యనర్థా ఇతి లోకప్రవాదః.

వ్యా. వెనక కలిగే అల్పమైన కోపం (తిరుగుబాటు మొదలైనది) గొప్పదా, యుద్ధయాత్రకు వెడితే ముందు కలిగే అత్యధికమైన లాభం గొప్పదా అన్నప్పుడు అల్పమైన పశ్చాత్కోపమే గొప్పది. యుద్ధయాత్రకు రాజు ముందుకు వెళ్లగానే అల్పమే అయినా పశ్చాత్కోపాన్ని దూష్యులు, అమిత్రులు, ఆటవికులూ గాని, మంత్రిపురోహితాది ప్రకృతికోపం గాని వృద్ధి పొందిస్తుంది. ఇట్టి పరిస్థితిలో అగ్రంలో లభించిన అత్యధికలాభాన్ని కూడ భృత్యమిత్రక్షయవ్యయాలు, అనగా భృత్యుల విషయంలోను మిత్రుల విషయంలోను కలిగిన క్షయవ్యయాలు, మ్రింగివేస్తాయి. అందువల్ల పశ్చాత్కోపం ఉన్నప్పుడు ముందుకు వెళ్లడం వల్ల వచ్చే లాభం వెయ్యికి ఒక పాలైనా లేదా నూటికి ఒక పాలైనా కూడ యుద్ధయాత్రకు వెళ్లగూడదు. ఎందువల్ల ననగా అనర్థాలు ప్రారంభంలో సూది బెజ్జం అంత మాత్రమే ఉంటాయి అని లోకంలో చెప్పుకోవడం ఉంది.

మూ. 1. పశ్చాత్కోపే సామదానభేదదణ్డాన్ ప్రయుఞ్జీత. పురస్తాల్లాభే సేనాపతిం కుమారం వా దణ్డచారిణం కుర్వీత.

2. బలవాన్ వా రాజా పశ్చాత్కోపావగ్రహసమర్థః పురస్తాల్లాభమాదాతుం యాయాత్. అభ్యన్తరకోపశఙ్కాయాం శఙ్కితానాదాయ యాయాత్, బాహ్యకోపశఙ్కాయాం వా పుత్రదారమేషామ్.

3. అభ్యన్తరావగ్రహం కృత్వా శూన్యపాలమ్ అనేకబలవర్గమ్, అనేకముఖ్యం చ స్థాపయిత్వా యాయాత్,న వా యాయాత్. "అభ్యన్తరకోపో బాహ్యకోపాత్ పాపీయాన్" ఇత్యుక్తం పురస్తాత్.

వ్యా. 1. పశ్చాత్కోపం శమింపచేయడానికి సామ-దాన-భేద-దండోపాయాలు ప్రయోగించాలి. ముందు (యుద్ధానికి వెడితే) లాభం ఉంటుంది అనే పక్షంలో సేనాపతిని గాని, యువరాజును గాని సైన్యంతో పంపాలి.

2. లేదా రాజు బలవంతుడై పశ్చాత్కోపాన్ని అదుపుచేయడానికి సమర్థుడైతే, ముందు లాభం గ్రహించడానికి స్వయంగానే వెళ్లాలి. అభ్యంతరకోపం కలగవచ్చును అనే శంక ఉన్నట్లైతే ఎవరివిషయంలో ఈ శంక ఉన్నదో వాళ్లని కూడా తీసికొని వెళ్లాలి. బాహ్యకోపం (అనగా రాష్ట్రముఖ్యులు, అంతపాలులు, ఆటవికులు మొదలైనవాళ్లనుండి కోపం) కలుగుతుందేమో అన్న శంక ఉన్నప్పుడు వాళ్ల పుత్రులను భార్యలను తన వెంట తీసికొని యుద్ధయాత్రకు వెళ్లాలి.

3. అభ్యంతరకోపాన్ని అణచివేసి తాను లేని సమయంలో శూన్యంగాఉన్న రాజధానిని రక్షించడానికి అనేకవిధాలైన సేనావర్గాలు, అనేకులు నాయకులు ఉన్న సైన్యాన్ని ఉంచి తాను యుద్ధానికి వెళ్లాలి. లేదా యానం మానుకోవాలి. బాహ్యకోపంకంటె అభ్యంతరకోపం అధికంగా పాప మైనది అని వెనుక చెప్పబడింది.

మూ. 1. మన్త్రిపురోహితసేనాపతియువరాజానామ్ అన్యతమకోపః అభ్యన్తరకోపః. తమాత్మదోషత్యాగేన పరశక్త్యపరాధవశేన వా సాధయేత్.

2. మహాపరాధేఽపి పురోహితే సంరోధనమ్, అవస్రావణం వా సిద్ధిః. యువరాజే సంరోధనం, నిగ్రహో వా గుణవత్యన్యస్మిన్ సతి పుత్రే.

3. తాభ్యాం మన్త్రిసేనాపతీ వ్యాఖ్యాతౌ.

4. పుత్రం, భ్రాతరమన్యం వా కుల్యం రాజ్యగ్రాహిణముత్సాహేన సాధయేత్. ఉత్సాహాభావే గృహీతానువర్తనసంధికర్మభ్యా మరిసంధానభయాత్. అన్యేభ్యస్తద్విధేభ్యో వా భూమిదానైర్విశ్వాసయేదేనమ్. తద్విశిష్టం స్వయంగ్రాహం దణ్డం వా ప్రేషయేత్, సామన్తాటవికాన్ వా. తైర్విగృహీతమతి సందధ్యాత్. అవరుద్ధాదానం పారగ్రామికం వా యోగమాతిష్ఠేత్.

5. ఏతేన మన్త్రిసేనాపతీ వ్యాఖ్యాతౌ.

వ్యా. 1. మంత్రి, పురోహితుడు, సేనాపతి, యువరాజు - వీళ్లలో ఒకని కోపం (ఎదురు తిరగడం) అభ్యంతరకోపం. ఆ కోపం తన దోషంవల్ల కలిగితే ఆ దోషాన్ని విడిచి శమింపచేయాలి. లేదా పరుని (కోపించినవాని) శక్తిని, అపరాధాన్నీ పట్టి శమింపచెయ్యాలి.

2. పురోహితుడు మహాపరాధం చేసినా వానికి దండం బంధించడం లేదా దేశంనుంచి బహిష్కరించడం. యువరాజు మహాపరాధం చేసి నప్పుడు వానికి దండం బంధనం లేదా మరణం. అయితే ఈ విధమైన దండం గుణవంతుడైన మరొక పుత్రుడుంటేనే ఇవ్వాలి.

3. వీళ్లిద్దరిచేతా మంత్రిసేనాపతులను కూడ వ్యాఖ్యానించినట్లే. అనగా వాళ్లకు కూడ ఇలాంటి దండమే ఇవ్వాలి.

4. పుత్రుడు గాని,సోదరుడు గాని, తన వంశానికి చెందిన మరొకడు ఎవడైనాగాని రాజ్యం గ్రహించా లని అనుకుంటూంటే వానిని ఉత్సాహంచేత వశం చేసుకోవాలి. అలాంటి ఉత్సాహం లేకపోతే. అతడు గ్రహించిన భూమ్యాదికాన్ని అనుమతించడంచేత లేదా వానితో సంధి చేసుకొనడంచేత వశం చేసుకోవాలి. అలా చేసుకొనకపోతే అతడు వెళ్లి శత్రువుతో సంధి చేసుకొనే ప్రమాదం ఉంటుంది. అలాంటివాళ్లు ఇతరు లెవరైనా ఉంటే వాళ్లకి భూమి ఇచ్చి వీనికి (పుత్రాదులకు) విశ్వాసం కలిగించాలి, లేదా అలా తిరుగుబాటు చేసినవాని మీదికి వానికంటె అధికబలం గల స్వయంగ్రాహదండాన్ని (ఏది దొరికితే దానిని తీసికొనవచ్చును అని అనుజ్ఞ ఇచ్చిన సైన్యాన్ని) గాని, ఆటవికులను గాని పంపాలి. అతడు వాళ్లతో యుద్ధం చేస్తున్నప్పుడు తాను వానిని ఓడించాలి. లేదా వాని విషయంలో అవరుద్ధాదానం (ఎదురు తిరిగిన కుమారుణ్ణి వశం చేసుకొనే విధానంలో చెప్పిన) అనే ఉపాయం గాని, పారగ్రామికయోగం (శత్రునగరాన్ని పట్టుకొనే పద్ధతి) గాని ఉపయోగించాలి.

5. దీనిచేత మంత్రిసేనాపతుల విషయం కూడ వివరించినట్లే.

మూ. 1. మన్త్ర్యాదివర్గానామన్తరమాత్యానామ్ అన్యతమకోపః అన్తరమాత్యకోపః. తత్రాపి యథార్హముపాయాన్ ప్రయుఞ్జీత.

2. రాష్ట్రముఖ్యాన్తపాలాటవికదణ్డోపనతానామన్యతమకోపః బాహ్యకోపః. తమన్యోన్యేనావగ్రాహయేత్. అతిదుర్గప్రతిస్తబ్ధం వా సామన్తమ్ ఆటవిక తత్కులీనావరుద్ధానామ్ అన్యతమేన అవగ్రాహయేత్, మిత్రేణోపగ్రాహయేద్వా యథా నామిత్రం గచ్ఛేత్.

3. అమిత్రా ద్వా సత్రీ భేదయేదేనమ్ - "అయం త్వాం యోగపురుషం మన్యమానః భర్తర్యేవ విక్రమయిష్యతి. అవాప్తార్థః దణ్డచారిణమ్ అమిత్రాట వికేషు కృచ్ఛ్రే వా ప్రవాసే యోక్ష్యతి, విపుత్రదారమన్తే వా వాసయిష్యతి, ప్రతిహృతవిక్రమం త్వాం భర్తరి పణ్యం కరిష్యతి. త్వయా వా సంధిం కృత్వా భర్తారమేవ ప్రసాదయిష్యతి, మిత్రముపకృష్టం వాస్య గచ్ఛేత్" ఇతి.

4. ప్రతిపన్నమిష్టాభిప్రాయైః పూజయేత్.

వ్యా. 1. మంత్రిపురోహితాదులు తప్ప మిగిలిన అన్తరమాత్యుల (రాజుకు దగ్గరగా ఉండే అమాత్యుల) కోపం అంతరమాత్యకోపం. ఆ కోపానికి కూడ ఉపాయాలచేత తగువిధంగా ప్రతిక్రియ చేసుకోవాలి.

2. రాష్ట్రముఖ్యులు, అంతపాలులు, ఆటవికులు, దండోపనతులు - వీళ్లలో ఎవరైనా కోపించడం బాహ్యకోపం. ఆ బాహ్యకోపాన్ని ఒకరి కోపాన్ని మరొకరిచేత శమింపచెయ్యాలి. ప్రబలమైన దుర్గం ఆశ్రయించి మొండితనంతో ఉన్నవానిని సామంతులచేత గాని, ఆటవికులచేత గాని, అతని వంశానికే చెందినవానిచేత గాని అవరుద్ధుని (తన కెదురు తిరిగిన తన పుత్రుని) చేత గాని బంధింపచెయ్యాలి. అతడు తన అమిత్రుని పక్షానికి వెళ్లకుండా తన మిత్రునితో కలపాలి.

3. అతడు అమిత్రుని దగ్గరికి వెళ్లిన పక్షంలో గూఢపురుషుడు వానిని అమిత్రుని నుండి ఈ విధంగా చెప్పి విడదీయాలి - "ఇతడు నిన్ను గూఢపురుషుడ వని అనుకొని రాజు మీదికే యుద్ధానికి పంపుతాడు. తన పని సఫలం అయిన తరవాత తన శత్రువుతో గాని లేదా ఆటవికులతో గాని యుద్ధం చేయడానికి సైన్యానికి అధిపతినిగా చేసి పంపుతాడు. లేదా కష్టమైన ప్రవాసానికి పంపుతాడు. లేదా నిన్ను భార్యాపుత్రాదులకు దూరం చేసి రాజ్యం సరిహద్దులలో నివసించే టట్లు చేస్తాడు. నీ పరాక్రమం ప్రతిహత మైపోయినప్పుడు నిన్ను రాజు పణ్యంగా చేస్తాడు. అనగా నీ పరాక్రమం అంతా వ్యర్థం అయిపోయిన తరవాత నిన్ను రాజుకు పణ్యంగా (షరతు ప్రకారం అప్పగించవలసిన ఒక వస్తువునుగా) అప్పగిస్తాడు. నీ ద్వారా సంధి చేసుకొని రాజును అనుగ్రహింప చేసుకుంటాడు. లేదా నిన్ను పణ్యంగా చేసి రాజుయొక్క మరొక మిత్రునితో ఇతడు స్నేహం చేసుకొనవచ్చును.

4. ఈ భేదోపదేశానికి అతడు అంగీకరించిన ట్లయితే అతనికి ఇష్టమైన ప్రయోజనాలను అందించడం ద్వారా అతనిని పూజించాలి.

మూ. 1. అప్రతిపన్నస్య సంశ్రయం భేదయేత్- అసౌ తే యోగపురుషః ప్రణిహితః ఇతి.

2. సత్రీ చైనమ్ అభిత్యక్తశాసనైః ఘాతయేత్, గూఢపురుషైర్వా. సహప్రస్థాయినో వాస్య ప్రవీరపురుషాన్ యథాభిప్రాయకరణేన ఆవాహయేత్. తేన ప్రణిహితాన్ సత్రీ బ్రూయాత్. ఇతి సిద్ధిః. పరస్య చైనాన్ కోపానుత్థాపయేత్. ఆత్మనశ్చ శమయేత్.

3. యః కోపం కర్తుం శమయితుం వా శక్తః తత్రోపజాపః కార్యః. యః సత్యసంధః శక్తః కర్మణి ఫలావాప్తౌ చానుగ్రహీతుం, వినిపాతే చ త్రాతుం తత్ర ప్రతిజాపః కార్యః. తర్కయితవ్యశ్చ - కల్యాణబుద్ధిరుతాహో శఠ ఇతి.

వ్యా. 1. ఈ విధంగా భేదోపాయానికి అతడు లొంగకపోయిన ట్లయితే అప్పుడు వానికి ఆశ్రయం ఇచ్చిన శత్రువు దగ్గరికి వెళ్లి "ఇతడు నీ దగ్గరకు గూఢపురుషుడుగా పంపబడ్డాడు" అని చెప్పి వానిని భేదింపచెయ్యాలి (విడదీయాలి).

2. సత్రి (గూఢపురుషుడు) శత్రువు పక్షానికి వెళ్లిన వీనిని అభిత్యక్తుల (అనగా చంపదగినవారుగా నిశ్చయింపబడిన పురుషుల) ద్వారా పంపబడిన లేఖల సహాయంతో (ఇతడు నిన్ను చంపడానికే నీ దగ్గరికి చేరినాడు అని ఆ శత్రువుకు వ్రాసిన దొంగ ఉత్తరాల ద్వారా) గాని, లేదా గూఢపురుషులచేత గాని చంపించాలి. లేదా అతనితో కలిసి శత్రువుపక్షానికి వెళ్లడానికి సిద్ధమైన మంచి వీరులైన పురుషులను, వాళ్ల కిష్టమైన పనులు చేస్తామని చెప్పి రప్పించాలి. అప్పుడు సత్రి "వీళ్లు వానిచేత (శత్రువు వైపు వెళ్లిపోయినవానిచేత) గూఢచారులుగా పంపబడ్డారు అని చెప్పాలి. ఈ విధంగా కోపానికి ప్రతీకారం చెప్పబడింది. ఈ విధమైన కోపాలను శత్రువు రాజ్యంలో కలిగించాలి. తన రాజ్యంలో కలిగిన కోపాలను శాంతింపచెయ్యాలి.

3. ఎవడు కోపాన్ని కలిగించడానికి, దానిని శాంతింపచేయడానికి సమర్థుడో ఆతని ద్వారానే ఉపజాపం (తిరుగుబాటు చేయించే లేని పోని విషయాలు కల్పించడం) చెయ్యాలి. అలాంటివానిచేతనే రాజుకు ఎదురుగా తిరుగుబాటు చేయించాలి. (ప్రతిజాపం అనగా ఉపజాపానికి అనుకూలంగా ప్రవర్తించడం), ఎవడు సత్యసంధుడో, పని చేయడానికి, ఫలం పొందడానికీ సమర్థుడో, అనుగ్రహించడానికీ, ఆపద వచ్చినప్పుడు

రక్షించడానికీ సమర్థుడో వాని విషయంలో ప్రతిజాపం చెయ్యాలి. అనగా ఎవడు ఉపజాపం చేస్తాడో వాని ఉపజాపానికి అనుకూలంగా ప్రవర్తించాలి. ఇతడు సద్బుద్ధి కలవాడేనా లేక శఠుడా అని ఊహించి తెలుసుకోవాలి. (ఈ రెండు వాక్యాలలో శత్రురాజ్యంలో కొందరిని దగ్గరకు తీసుకొని వాళ్ల ద్వారా కోపం కలిగించడానికి ప్రయత్నించే గూఢచారులకు, వాళ్లు చెప్పిన ప్రకారం కోపం కలిగించడానికి అంగీకరించే వాళ్లకు సలహా ఇవ్వబడింది.

మూ. 1. శఠో హి బాహ్యః అభ్యన్తరమేవముపజపతి- భర్తారం చేద్ధత్వా మాం ప్రతిపాదయిష్యతి శత్రువధో భూమిలాభశ్చ మే ద్వివిధో లాభః భవిష్యతి, అథవా శత్రురేనమాహనిష్యతి, హతబన్ధుపక్షః తుల్యదోషదణ్డేన వా ఉద్విగ్నశ్చ, మే భూయాన్ కృత్యపక్షో భవిష్యతి, తద్విధే వాన్యస్మిన్నపి శఙ్కితో భవిష్యతి, అన్యమన్యం చాస్య ముఖ్యమభిత్యక్తశాసనేన ఘాతయిష్యామి ఇతి.

2. అభ్యన్తరో వా శఠో బాహ్యమేవముపజపతి- కోశమస్య హరిష్యామి. దణ్డం వాస్య హరిష్యామి. దుష్టం వా భర్తారమనేన ఘాతయిష్యామి. ప్రతిపన్నం బాహ్యమమిత్రాటవికేషు విక్రమయిష్యామి, చక్రమస్య సజ్జతాం, వైరమస్య ప్రసజ్యతాం, తతః స్వాధీనో మే భవిష్యతి, తతో భర్తారమేవ ప్రసాదయిష్యామి, స్వయం వా రాజ్యం గ్రహీష్యామి, బద్ధ్వా వా బాహ్యభూమిం భర్తృభూమిం చోభయమవాప్స్యామి. విరుద్ధం వా వాహయిత్వా బాహ్యం విశ్వస్తం ఘాతయిష్యామి. శూన్యం వాస్య మూలం హరిష్యామి ఇతి.

వ్యా. 1. బైట నున్న శఠుడు (దుష్టబుద్ధి గలవాడు) అభ్యంతరుడైన (మంత్రి మొదలైనవానిని) ఈ అభిప్రాయంతో అభిజాపం చేస్తాడు- "ఇతడు రాజును చంపి నన్ను రాజును చేసిన ట్లయితే నాకు శత్రువధ, రాజ్యలాభం అనే రెండు విధాలైన లాభం కలుగుతుంది. అలా కాక శత్రువే (రాజే) వీనిని చంపివేసిన పక్షంలో చంపబడినవాని బంధుపక్షానికి చెందినవాళ్లు, సమానమైన దోషానికి (ఇలాంటి అపరాధానికి) తమకు కూడ దండం లభిస్తుందేమో అని భయపడే వాళ్లు- వీళ్లందరూ నాకు అత్యధికమైన కృత్యపక్షం (రాజుకు వ్యతిరేకంగా నాకు అనుకూలంగా మార్చడానికి శక్యమైన వాళ్ల

పక్షం) గా లభిస్తారు. రాజు ఇలాంటి ఇతర అభ్యంతరపురుషుని విషయంలో కూడ శంకితు డైతే అలాంటి ఇతరుడైన ప్రతిముఖ్యపురుషుణ్ణి కూడ అభిత్యక్తుల ద్వారా పంపిన దొంగ ఉత్తరాల ద్వారా చంపిస్తాను".

2. దుష్టబుద్ధి గల అభ్యంతరుడు బాహ్యుణ్ణి ఈ అభిప్రాయంతో ఉపజాపం చేస్తాడు- "వీని కోశాన్ని హరిస్తాను. లేదా వీని దండాన్ని హరిస్తాను, వీనిచేత దుష్టుడైన రాజును చంపిస్తాను. నేను చెప్పి నట్లు అంగీకరించిన ఈ బాహ్యుణ్ణి అమిత్రులమీదకు, ఆటవికులమీదకు యుద్ధానికి పంపుతాను. అలా చేయడం చేత వీని సైన్యచక్రం యుద్ధంలో లగ్నమై ఉండుగాక, వీని వైరం పెరుగు గాక. అప్పుడు ఇతడు నాకు లొంగిపోతాడు. తరవాత రాజునే అనుగ్రహింపచేసుకుంటాను. లేదా స్వయంగా బాహ్యుని రాజ్యం ఆక్రమిస్తాను. లేదా వానిని (బాహ్యుని) బంధించి ఆ బాహ్యుని రాజ్యం, రాజుయొక్క రాజ్యం రెండూ పొందుతాను. లేదా వీని ఎవడైన శత్రువును పిలిపించి విశ్వాసంతో ఉన్న ఈ బాహ్యుణ్ణి చంపిస్తాను. అతని మూలస్థానం శూన్యంగా (రక్షణశూన్యంగా) ఉన్నప్పుడు దానిని హరిస్తాను".

మూ. 1. కల్యాణబుద్ధిస్తు సహజీవీ అర్థముపజపతి. కల్యాణబుద్ధినా సందధీత. శఠం తథా ఇతి ప్రతిగృహ్య అతిసందధ్యాత్. ఇతి

2. ఏవ ముపలభ్య-

శ్లో. పరే పరేభ్యః స్వే స్వేభ్యః స్వే పరేభ్యః స్వతః పరే,
రక్ష్యాః స్వేభ్యః పరేభ్యశ్చ నిత్యమాత్మా విపశ్చితా.

ఇతి కౌటలీయార్థశాస్త్రే అభియాస్యత్కర్మణి నవమాధికరణే తృతీయోధ్యాయః
పశ్చాత్కోపచిన్తా, బాహ్యాభ్యన్తరప్రకృతికోపప్రతీకారశ్చ, ఆదితశ్చతుర్వింశతితమః.

వ్యా. 1. సద్బుద్ధికలవాడైతే, కూడా కలిసి జీవించే స్వభావం కలవాడై హితమైన విషయాన్ని గూర్చియే ఉపజాపం చేస్తాడు. అందుచేత కల్యాణబుద్ధి కలవానితో సంధి చేసుకోవాలి. శఠుణ్ణి మాత్రం "సరే సరే" అంటూ అంగీకరిస్తూ వంచించాలి.

2. ఈ విధంగా విషయం గ్రహించి-

బుద్ధిమంతు డైన రాజు పరులను పరులనుండి, తనవాళ్లను తనవాళ్లనుండి, తనవాళ్లను పరులనుండి, పరులను తనవాళ్లనుండి రక్షించాలి. తనవాళ్లనుండి పరులనుండీ కూడ తనను రక్షించుకోవాలి.

"బాలానందిని" అను కౌటలీయార్థశాస్త్రాంధ్రవ్యాఖ్యానంలో అభియాస్యత్కర్మ అను నవమాధికరణంలో పశ్చాత్కోపచింత, బాహ్యాభ్యన్తరప్రకృతికోపప్రతీకారం అనే తృతీయాధ్యాయం ప్రారంభంనుంచి నూటఇరవైనాల్గవ అధ్యాయం సమాప్తం.

## అథ చతుర్థోఽధ్యాయః

### ద్విచత్వారింశచ్ఛతతమం ప్రకరణమ్ - క్షయవ్యయలాభవిపరిమర్శః

మూ. 1. యుగ్యపురుషాపచయః క్షయః. హిరణ్యధాన్యాపచయో వ్యయః.

2. తాభ్యాం బహుగుణవిశిష్టే లాభే యాయాత్.

3. ఆదేయః, ప్రత్యాదేయః, ప్రసాదకః, ప్రకోపకః, హ్రస్వకాలః, తనుక్షయః, అల్పవ్యయః, మహాన్, వృద్ధ్యుదయః, కల్యః, ధర్మ్యః, పురోగశ్చేతి లాభసంపత్.

4. సుప్రాప్యానుపాల్యః పరేషామప్రత్యాదేయ ఇతి ఆదేయః.

5. విపర్యయే ప్రత్యాదేయః. తమాదదానః తత్రస్థో వా వినాశం ప్రాప్నోతి.

వ్యా. 1. యుగ్యాలు (వాహనాలు), పనులు చేయగలిగిన పురుషులు తగ్గిపోవడం క్షయం. ధనం, ధాన్యం తగ్గిపోవడం వ్యయం.

2. లాభం ఈ క్షయవ్యయాలకంటె చాల రెట్లు అధికంగా ఉంటుందనుకొన్నప్పుడు లేదా ఆదేయత్వం మొదలైన పన్నెండు గుణాలు ఉన్నది అనుకొన్నప్పుడు యుద్ధయాత్రకి వెళ్లాలి.

3. ఆదేయం, ప్రత్యాదేయం, ప్రసాదకం, ప్రకోపకం, హ్రస్వకాలం, తనుక్షయం, అల్పవ్యయం, గొప్పది, వృద్ధ్యుదయం, కల్యం, ధర్మ్యం, పురోగం అని ఇవి లాభసంపదలు, లాభంలోని గుణాలు.

4. అనాయాసంగా పొంద శక్య మైనది, శ్రమ లేకుండా రక్షించుకొనడానికి కూడ శక్యమైనది, పరులకు తిరిగి ఇవ్వవలసిన పని లేనిది అయిన లాభం ఆదేయం.

5. దీనికి విరుద్ధంగా ఉన్న లాభం ప్రత్యాదేయం. ప్రత్యాదేయమైన భూమ్యాదిలాభాన్ని గ్రహించినవాడు, దానిమీదనే జీవించేవాడు నశిస్తాడు.

మూ. 1. యది వా పశ్యేత్- ప్రత్యాదేయ మాదాయ కోశదణ్డనిచయ రక్షావిధానాన్యవస్రావయిష్యామి, ఖనిద్రవ్యహస్తివనసేతుబన్ధవణిక్పథానుద్ధృతసారాన్ కరిష్యామి, ప్రకృతీరస్య కర్శయిష్యామి అవాహయిష్యామి, అయోగేనారాధయిష్యామి వా, తాః పరః ప్రతియోగేన కోపయిష్యతి. ప్రతిపక్షే వాస్య పణ్యమేనం కరిష్యామి, మిత్రమవరుద్ధం వాస్య ప్రతిపాదయిష్యామి, మిత్రస్య స్వస్య వా దేశస్య పీడామత్రస్థః తస్కరేభ్యః పరేభ్యశ్చ ప్రతికరిష్యామి, మిత్రమాశ్రయం వాస్య వైగుణ్యం గ్రాహయిష్యామి, తదమిత్రవిరక్తం తత్కులీనం ప్రతిపత్స్యతే. సత్కృత్య వాస్మై భూమిం దాస్యామి ఇతి, సంహితసముత్థితం మిత్రం మే చిరాయ భవిష్యతి" ఇతి ప్రత్యాదేయమపి లాభమాదదీత. ఇత్యాదేయప్రత్యాదేయౌ వ్యాఖ్యాతౌ.

వ్యా. కాని ప్రత్యాదేయాన్ని తీసికొని నేను శత్రువుయొక్క కోశవిధానాన్ని, దండవిధానాన్ని నిచయ (వ్రీహ్యాదులను సేకరించి నిల్వచేయడం) విధానాన్ని హీనంగా అయిపోయేటట్లు చేస్తాను. గనులు, ద్రవ్యవనాలు, హస్తివనాలు, సేతుబంధాలు, వణిక్పథాలు- వీటి సారం తగ్గిపోయే టట్లు చేస్తాను. వీని ప్రకృతులను కృశింపచేస్తాను. లేదా ఆ ప్రకృతులను వాని దగ్గరనుండి తీసికొన్న భూమిలో నివసింపచేస్తాను. లేదా ఆ భూమిలో సేకరించిన వస్తువులు ఇచ్చి వాళ్లను సంతోషపెడతాను, ఆ భూమిని వెనుకకు తీసికొన్న తరవాత శత్రువు వాళ్లని ఆ ద్రవ్యాలను అనుభవించనీయకపోవడంచేత వాళ్లకు కోపం కలిగిస్తాడు, లేదా వానిని వీని మరొక శత్రువుకు పణ్యంగా చేస్తాను (అప్పగిస్తాను), భూమిని తీసుకొనడంచేత దుర్బలు డైపోయిన వీని రాజ్యంలో నా మిత్రుణ్ణి కాని, అవరుద్ధుణ్ణి (వీని కోపానికి పాత్రుడైన వీని పుత్రుణ్ణి గాని) స్థాపిస్తాను, వీని దగ్గరనుండి తీసికొన్న భూమిలో నివసిస్తూ దొంగలవల్లా శత్రువుల వల్లా నా దేశానికి గాని, నా మిత్రుని దేశానికి గాని కలుగుతున్న పీడకు ప్రతిక్రియ చేస్తాను, ఈ భూమిలో నివసిస్తూ వీని మిత్రునికి గాని, వీనికి ఆశ్రయభూతుడైన మధ్యస్థునికి గాని వీనిలో ఉన్న లోపాలను తెలుపుతాను, ఆ విధంగా అతని లోపాలను చెప్పడంచేత వీని మిత్రుడు నా శత్రువైన వీనిమీద వైముఖ్యం చెంది వీని కులానికి చెందిన

(రాజ్యాకాంక్షియైన) మరొకని వైపు వెళ్లిపోతాడు; లేదా వీనిని కన్యాదానాదులచేత సత్కరించి వీనినుంచి తీసికొన్న భూమిని తిరిగి ఇచ్చి వేస్తాను. ఇలా చేయడంచేత ఇతడు నాకు చాల కాలం పాటు నాతో కలిసి యుద్ధాదికార్యాలు చేసే మిత్రుడుగా ఉంటాడు" అని అనుకున్నట్లయితే ప్రత్యాదేయమైన లాభాన్ని కూడ తీసికొనవచ్చును. ఇట్లు ఆదేయ-ప్రత్యాదేయాలు వివరించబడినవి.

మూ. 1. అధార్మికాత్ ధార్మికస్య లాభః లభ్యమానః స్వేషాం పరేషాం చ ప్రసాదకో భవతి. విపరీతః ప్రకోపక ఇతి. మన్త్రిణాముపదేశాత్ లాభః అలభ్యమానః కోపకో భవతి- "అయమస్మాభిః క్రయవ్యయౌ గ్రాహితః" ఇతి. దూష్యమన్త్రిణామనాదరాల్లాభో లభ్యమానః కోపకో భవతి- "సిద్ధార్థోఽయమస్మాన్ వినాశయిష్యతి" ఇతి విపరీతః ప్రసాదకః. ఇతి ప్రసాదక- కోపకౌ వ్యాఖ్యాతౌ.

2. గమనమాత్రసాధ్యత్వాత్ హ్రస్వకాలః. 3. మన్త్రసాధ్యత్వాత్ తనుక్షయః. 4.భక్తమాత్రవ్యయత్వాత్ అల్పవ్యయః. తదాత్వవైపుల్యాత్ మహాన్. అర్థానుబన్ధకరత్వాద్ వృద్ధ్యుదయః.

వ్యా. 1. అధార్మికునినుంచి ధార్మికుడైన రాజుకు లభించే లాభం తన వాళ్లకి, ఇతరులకీ కూడ ఆనందకరంగా ఉంటుంది. గాన అది "ప్రసాదకలాభం". దీనికి విపరీతమైనది "ప్రకోపకలాభం". మంత్రులు సలహా ఇచ్చిన తరవాత కూడ లభించని లాభం 'కోపకలాభం' అవుతుంది; ఎందువల్ల ననగా "మన మూలాన ఇతడు క్షయవ్యయాలు పొందినాడు" అని మంత్రులు అనుకుంటారు. దూష్యులైన మంత్రుల అనాదరంవల్ల, వాళ్లు సరియైన సలహా ఇవ్వకపోవడంచేత, లభించే లాభం 'కోపకలాభం' అవుతుంది. "ఇతడు తన పని సాధించుకొన్న తరవాత మనల్ని నశింపచేస్తాడు" అని వాళ్లు అనుకుంటారు. ఇందుకు విపరీతమైనది ప్రసాదకలాభం. ఈ విధంగా ప్రసాదక-కోపకలాభాలు వివరించబడినవి.

2. వెళ్లడమే తడవుగా లభించే లాభం "హ్రస్వకాలలాభం". 3. మంత్రంచేత (ఆలోచనచేత) సాధించబడే లాభం 'తనుక్షయం'. దాని కొరకు యుద్ధం చేయవలసిన పని లేదు గాన క్షయం చాల తక్కువ ఉన్నది. 4. కేవలం అన్నం మాత్రం పెట్టి సాధించతగిన దవడంచేత ఆ లాభం "అల్పవ్యయలాభం". 5. వెంటనే అత్యధికంగా

లభించినది 'మహాలాభం'. 6. వెనువెంటనే మరి కొన్ని ప్రయోజనాలు కూడా ఉండే లాభం 'వృద్ధ్యుదయలాభం'.

మూ. 1. నిరాబాధకత్వాత్ కల్యః, 2. ప్రశస్తోపాదానాత్ ధర్మ్యః, 3. సామయికానా మనిర్బన్ధగామిత్వాత్ పురోగః ఇతి.

2. తుల్యే లాభే దేశకాలౌ, శక్త్యుపాయౌ, ప్రియాప్రియౌ, జవాజవౌ, సామీప్యవిప్రకర్షౌ, తదాత్వానుబన్ధౌ, సారత్వసాతత్యే, బాహుల్య బాహుగుణ్యే చ విమృశ్య బహుగుణయుక్తం లాభమాదదీత.

3. లాభవిఘ్నాః- కామః, కోపః, సాధ్వసమ్, కారుణ్యం, హ్రీః, అనార్యభావః, మానః, సానుక్రోశతా, పరలోకాపేక్షా, దామ్భికత్వమ్, అత్యాశిత్వం, దైన్యమ్, అసూయా, హస్తగతావమానః, దౌరాత్మ్యకమ్, అవిశ్వాసః, భయమ్, అనికారః శీతోష్ణవర్షాణా మక్షామ్యం, మఙ్గలతిథినక్షత్రేష్టిత్వమ్ ఇతి.

వ్యా. 1. భవిష్యత్తులో ఏ విధమైన ఉపద్రవాలు తెచ్చిపెట్టని లాభం "కల్య లాభం". 2. ప్రశస్తమైన ప్రకాశయుద్ధాదులచేత లభించినది "ధర్మ్యలాభం". 3. సామవాయికుల నిర్బంధం ఏదీ లేకుండా లభించేది "పురోగలాభం".

4. లాభం తుల్యంగానే ఉన్నప్పుడు దేశ-కాలాలను, శక్తి-ఉపాయాలను, ప్రియాప్రియాలను, వేగాన్నీ మాంద్యాన్నీ, సామీప్యాన్నీ దూరత్వాన్నీ, తాత్కాలికత్వాన్ని రాబోయేకాలంలో కూడ అనువర్తించడాన్నీ, శ్రేష్ఠత్వాన్నీ నిరంతరం ఉండడాన్నీ, అధికత్వాన్నీ అల్పత్వాన్నీ, విమర్శించి అనేక గుణా లున్న లాభాన్ని స్వీకరించాలి.

5. లాభానికి విఘ్నాలు ఇవి- కామం, కోపం, పిరికితనం, జాలి, లజ్జ, క్రూరత్వం, అహంకారం, ఎక్కువ దయ కలిగి ఉండడం, పరలోకదృష్టి అనగా అతిగా పాపభీతి, దాంభికత్వం (నమ్మినవాళ్లని వంచించడం), న్యాయంగా లభించేదానికంటె ఎక్కువగా తినడం, దైన్యం, అసూయ, చేతిలో ఉన్నదాని విషయంలో చిన్న చూపు, చెడ్డ బుద్ధి, విశ్వాసం లేకపోవడం, భయం, తిరస్కరించదగినవానిని తిరస్కరించకపోవడం, శీత-ఉష్ణ-వర్షాలు సహించలేకపోవడం, ప్రతిపనికీ ముందు మంగళకరమైన తిథులను, నక్షత్రాలను పరీక్షిస్తూండడం- ఇవి లాభానికి విఘ్నాలు.

శ్లో. నక్షత్రమతిపృచ్ఛన్తం బాలమర్థోఽతివర్తతే,
అర్థో హ్యర్థస్య నక్షత్రం కిం కరిష్యన్తి తారకాః.

వ్యా. మూఢుడు ఏ నక్షత్రం మంచిది? ఏది కాదు? అని అంటూ నక్షత్రాన్ని గూర్చి అతిగా అడుగుతూంటే పని కాస్తా చేజారిపోతుంది. అర్థానికి నక్షత్రం అర్థమే. అనగా ఏదైనా ఒక కార్యాన్ని సాధించడానికి కావలసినది ధనాదికమే. అంతేనే కాని నక్షత్రాలు ఏం చేస్తాయి?

శ్లో. నాధనాః ప్రాప్నువన్త్యర్థాన్ నరా యత్నశతైరపి,
అర్థైరర్థాః ప్రబధ్యన్తే గజాః ప్రతిగజైరివ.

ఇతి కౌటలీయార్థశాస్త్రే అభియాస్యత్కర్మణి నవమాధికరణే చతుర్థోఽధ్యాయః
క్షయవ్యయలాభవిపరిమర్శః; ఆదితః పఞ్చవింశశతతమః.

వ్యా. ధనం లేనివాళ్లు వందల కొలది ప్రయత్నాలు చేసినా కార్యాలను సాధించజాలరు. ఏనుగులను ఇతరగజాల సహాయంతో బంధించి నట్లు అర్థాలను బంధించాలంటే అర్థాలే కావాలి.

"బాలానందిని" అను కౌటలీయార్థశాస్త్రాంధ్రవ్యాఖ్యానంలో అభియాస్యత్కర్మ అనే నవమాధికరణంలో క్షయవ్యయలాభవిమర్శ అనే నాల్గవ అధ్యాయం, ప్రారంభంనుంచి నూటఇరవైయైదవ అధ్యాయం సమాప్తం.

## అథ పఞ్చమోఽధ్యాయః

### త్రిచత్వారింశచ్ఛతతమం ప్రకరణమ్ - బాహ్యాభ్యన్తరాశ్చాపదః

(వెలుపనుండివచ్చే ఆపదలు, రాజ్యంలోనే ఏర్పడే ఆపదలు)

మూ. 1. సంధ్యాదీనామ్ అయథోద్దేశావస్థాపనమ్ అపనయః. తస్మాదాపదః సంభవన్తి.

2. బాహ్యోత్పత్తిః అభ్యన్తరప్రతిజాపా. అభ్యన్తరోత్పత్తిః బాహ్యప్రతిజాపా. బాహ్యోత్పత్తిః బాహ్యప్రతిజాపా. అభ్యన్తరోత్పత్తిః అభ్యన్తరప్రతిజాపా ఇత్యాపదః.

3. యత్ర బాహ్యా అభ్యన్తరానుపజపన్తి, అభ్యన్తరా బాహ్యాన్ తత్ర ఉభయయోగే ప్రతిజపతః సిద్ధిర్విశేషవతీ. సువ్యాజా హి ప్రతిజపితారః భవన్తి నోపజపితారః. తేషు ప్రశాన్తేషు నాన్యాన్ శక్నుయుః ఉపజపితుమ్ ఉపజపితారః;

కృచ్ఛ్రోపజాపా హి బాహ్యానామభ్యన్తరాః తేషామితరే వా. మహతశ్చ ప్రయత్నస్య వధః పరేషామ్, అర్థానుబన్ధశ్చాత్మనః ఇతి.

4. అభ్యన్తరేషు ప్రతిజపత్సు సామదానే ప్రయుఞ్జీత. స్థానమాన కర్మ సాన్త్వమ్. అనుగ్రహపరిహారౌ కర్మస్వాయోగః వా దానమ్.

వ్యా. 1. సంధివిగ్రహాదిషడ్గుణాలను ఎక్కడ ఎట్లు ప్రయోగించాలో అక్కడ అట్లు ప్రయోగించకపోవడం అపనయం. ఆ అపనయంవల్ల ఈ అపదలు కలుగుతాయి.

2. ఈ ఆపదలు (1) బాహ్యోత్పత్తి అభ్యంతరప్రతిజాపకుడు కలది, (2) అభ్యంతరోత్పత్తి బాహ్యప్రతిజాపకుడు గలది, (3) బాహ్యోత్పత్తి బాహ్యప్రతిజాపకుడు కలది, (4) అభ్యంతరోత్పత్తి అభ్యంతరప్రతిజాపకుడు కలది అని నాల్గువిధాలు. బాహ్యులనగా బైటవారు; రాష్ట్రముఖ్యులు మొదలైనవారు, అభ్యంతరులు అనగా లోపలివారు; రాజుకు చాల దగ్గరగా ఉండే అమాత్యపురోహితాదులు (గ.శా) బాహ్యులనగా ఇతర ప్రాంతాలలోని, రాజ్యాలలోనివారు, అభ్యంతరు లనగా తన రాజ్యంలోనివాళ్లు (కాంగ్లే). ఉపజాపకుడు అనగా రాజ్యంలోని ఒక వ్యక్తిని ఎవరినైనా పట్టుకొని, వాని ద్వారా లేనిపోని వదంతులు మొదలైనవి కల్పించి రాజ్యంలో కలతలు అలజళ్లు సృష్టించేవాడు. ఆ ఉపజాపకుడు బాహ్యుడు కావచ్చును; అభ్యంతరుడు కావచ్చును. ప్రతిజాపకు డనగా ఆ ఉపజాపకుడు చెప్పిన విధంగా చేసి కలతలు సృష్టించేవాడు. ఇతడు కూడ బాహ్యుడు కావచ్చును అభ్యంతరుడు కావచ్చును.

3. బాహ్యులు, అభ్యంతరులను ఉపజపించినప్పుడు లేదా అభ్యంతరులు బాహ్యుల్ని ఉపజపించినప్పుడు, ఉభయులకు అగా బాహ్య-అభ్యంతరులకు ఇద్దరికీ సంబంధం ఉన్న ఆపదలలో ప్రతిజాపకుణ్ణి సామాదులచేత వశంచేసుకోవడంవల్ల ఎక్కువ ప్రయోజనం ఉంటుంది. ఎందువల్ల ననగా ప్రతిజాపకులు మంచి వంచనానైపుణ్యంకలవారై ఉంటారు. కాని ఉపజాపకులు అట్టివారు కారు. అందుచేత ప్రతిజపితను ఏదో విధంగా పట్టుకొని వశం చేసుకోవడం చాల అవసరం అని అర్థం. వీళ్లు అణగిపోయిన తరవాత ఉపజాపకులు మరెవర్నీ ఉపజపించజాలరు. ఎందువల్ల ననగా బాహ్యులు అభ్యంతరులను గాని, అభ్యంతరులు బాహ్యుల్ని కాని ఉపజపించడం అంత సులభమైన పని కాదు. ఉపజాపం చేసిన ఇతరుల గొప్ప ప్రయత్నం విఫలం అయిపోతుంది; తనకు (రాజుకు) అర్థానుబంధం (నిరంతరమైన సత్ప్రయోజనం) కలుగుతుంది.

4. ప్రతిజాపకులైన అభ్యంతరుల విషయంలో సామదానాలు ఉపయోగించాలి. విశిష్టమైన అధికారం ఇచ్చి సన్మానించడం సాంత్వం (సామం). అనుగ్రహం (ధనాదికం ఇవ్వడం), పరిహారం (ఆతనినుండి తీసికొనవలసిన పన్నులు మొదలైనవాటిని) తీసికొనకపోవడం), ఏవైన మంచి పనులలో నియోగించడం - ఇవి దానం.

మూ. 1. బాహ్యేషు ప్రతిజపత్సు భేదదణ్డౌ ప్రయుఞ్జీత. సత్రిణో మిత్రవ్యఞ్జనా వా బాహ్యానాం చారమేషాం బ్రూయుః- "అయం వో రాజా దూష్యవ్యఞ్జనైః అతిసంధాతుకామః, బుధ్యధ్వమ్" ఇతి. దూష్యేషు వా దూష్యవ్యఞ్జనాః ప్రణిహితాః దూష్యాన్ బాహ్యైః భేదయేయుః, బాహ్యాన్ వా దూష్యైః. దూష్యాననుప్రవిష్టా వా తీక్ష్ణాః శస్త్రరసాభ్యాం హన్యుః. ఆహూయ వా బాహ్యాన్ ఘాతయేయుః ఇతి.

వ్యా. బాహ్యులు ప్రతిజాపకులుగా ఉన్నప్పుడు వాళ్ల విషయంలో భేదదండాలను ప్రయోగించాలి. లేదా సత్రులు (రహస్యంగా రాజు పక్షాన పని చేసేవాళ్లు) బాహ్యుల దగ్గరికి వాళ్లమిత్రులనే వంకతో వెళ్లి వాళ్లకు రాజుచేసే రహస్యప్రయోగాన్ని గూర్చి (అనగా రాజు మీ విషయంలో రహస్యప్రయోగం చేస్తున్నాడు అని) "ఈ రాజు దూష్యవ్యంజనులచేత (అనగా తన అభ్యంతరులు దూష్యులు కాకపోయినా దూష్యులని పైకి చూపుతూ వాళ్ల ద్వారా) మిమ్మల్ని మోసగించే ప్రయత్నంలో ఉన్నాడు'. ఈ రహస్యం తెలుసుకొనండి;" అని చెప్పాలి. లేదా - ప్రతిజాపం చేస్తూన్న అభ్యంతరులైన దూష్యుల దగ్గరికి తాము (రాజుకు) దూష్యులనే వంకతో గూఢచారులు వెళ్లి బాహ్యులకీ వాళ్లకీ మధ్య భేదం కల్పించాలి; లేదా ప్రతిజాపకులు బాహ్యులైతే వాళ్లకీ అభ్యంతరులకీ మధ్య భేదం కల్పించాలి. లేదా తీక్ష్ణులు దూష్యుల మధ్య ప్రవేశించి శస్త్రాలచేత రసంచేత వాళ్లను చంపించివేయాలి.

మూ. 1. యత్ర బాహ్యా బాహ్యానుపజాపన్తి,అభ్యన్తరాన్ అభ్యన్తరా వా తత్రైకాన్తయోగ ఉపజపితుః సిద్ధిర్విశేషవతీ. దోషశుద్ధౌ హి దూష్యా న విద్యన్తే. దూష్యశుద్ధౌ హి దోషః పునరన్యాన్ దూషయతి.

2. తస్మాద్ బాహ్యేషూపజపత్సు భేదదణ్డౌ ప్రయుఞ్జీత. సత్రిణో మిత్రవ్యఞ్జనా వా బ్రూయుః- "అయం వో రాజా స్వయమాదాతుకామః,

విగృహీతాః స్థ అనేన రాజ్ఞా; బుధ్యధ్వమ్" ఇతి. ప్రతిజపితుర్వా తతో దూత దణ్డానను ప్రవిష్టాః తీక్ష్ణాః శస్త్రరసాదిభిః ఏషాం ఛిద్రేషు ప్రహరేయుః. తతః సత్రిణః ప్రతిజపితారమ్ అభిశంసేయుః.

3. అభ్యన్తరానభ్యన్తరేషు ఉపజపత్సు యథార్హ ముపాయం ప్రయుఞ్జీత.

వ్యా. 1. బాహ్యులు బాహ్యుల్ని ఉపజపించినపుడు, అభ్యంతరులు అభ్యంతరులను ఉపజపించినప్పుడు -ఈ విధమైన ఏకాంతయోగంలో అనగా ఇద్దరూ బాహ్యులు కాని ఇద్దరూ అభ్యంతరులు కాని అయినప్పుడు, ఉపజాపకుణ్ణి వశం చేసుకొనడంలో విశేషం ఉంటుంది. వానిని వశం చేసుకొనడం మంచిది అని అర్థం. ఎందువల్ల ననగా దోషానికి అనగా ఉపజాపానికి, శుద్ధి (ప్రతిక్రియ) చేస్తే దూష్యులే ఉండరు కదా. అలా కాకుండా దూష్యులకు (ప్రతిజాపకులకు) శుద్ధి (ప్రతిక్రియ) చేసినా ఆ దోషం (ప్రతిజాపకత్వం) మరొకళ్లని దూషిస్తుంది. అనగా ఉపజాపకుని వశం చేసుకొనడానికి బదులు ప్రతిజాపకుణ్ణి వశంచేసుకొన్నప్పుడు ఉపజాపకు డున్నంతవరకు ఆ ప్రతిజాపకుడు కాకపోతే మరొక ప్రతిజాపకుడు ఏర్పడతాడు అని భావం.

2. అందువల్ల ఉపజాపం చేసే బాహ్యుల విషయంలో భేదదండోపాయాలు ప్రయోగించాలి. సత్రులు మిత్రులుగా అభినయిస్తూ ఉపజాపకుల దగ్గరికి వెళ్లి " ఈ రాజు మిమ్మల్నే (ప్రతిజాపకుని ద్వారా) పట్టుకోవాలని అనుకుంటున్నాడు. మీరు ఈ రాజుతో విరోధం కలిగి ఉన్నారు. తెలుసుకొనండి" అని చెప్పి భేదం కలిగించాలి. లేదా ఉపజాపిత పక్షాన మాటలాడడంకోసం ప్రతిజాపకుని దగ్గరికి వెడుతూన్న దూతలలోను, సైనికులలోను తీక్ష్ణులు కలిసిపోయి, వీళ్ల ఛిద్రాలలో శస్త్రరసాదులచేత వీళ్లని చంపివేయాలి. తరవాత సత్రులు ప్రతిజాపకుణ్ణి అభిశంసించాలి. అనగా ఇతడే వీళ్లని చంపించాడు అని నిందించాలి.

3. అభ్యంతరులు అభ్యంతరులను ఉపజాపం చేస్తూన్నప్పుడు తగు సామం మొదలైన ఉపాయాలు ప్రయోగించాలి. నిజానికి సంతుష్టుడు కాకపోయినా పైకి సంతుష్టుడు వలె కనబడేవాని విషయంలోను,నిజానికి సంతుష్టుడే అయినా అసంతుష్టుడుగా కనబడే వాని విషయంలోను సామం ప్రయోగించాలి.

మూ. 1. శౌచసామర్థ్యాపదేశేన వ్యసనాభ్యుదయాపేక్షణేన వా ప్రతిపూజనమితి దానమ్.

2. మిత్రవ్యఞ్జనో వా బ్రూయాదేతాన్- "చిత్తజ్ఞానార్థముపధాస్యతి వో రాజా. తదస్యాఖ్యాతవ్యమ్" ఇతి. పరస్పరాద్వా భేదయేదేనాన్- అసౌ చాసౌ చ వః రాజన్యేవముపజపతి. ఇతి భేదః.

3. దాణ్డకర్మికవచ్చ వధః.

4. ఏతాసాం చతసృణామాపదామభ్యన్తరామేవ పూర్వం సాధయేత్. "అహిభయాదభ్యన్తరకోపో బాహ్యకోపాత్ పాపీయాన్" ఇత్యుక్తం పురస్తాత్.

వ్యా. 1. శౌచం గాని, సామర్థ్యం గాని వంకగా చేసికొని అనగా "మీరు మంచి శౌచం (నిజాయితీ) సామర్థ్యం ఉన్నవాళ్లు" అని ప్రశంసిస్తూ గాని లేదా వాళ్లకు ఏదైన వ్యసనం కలిగినప్పుడు గాని, అభ్యుదయం కలిగినప్పుడు గాని ఏమైనా ఇచ్చి సత్కరించడం దానం.

2. లేదా సత్రి మిత్రుని వలె అభినయిస్తూ - "రాజు మీ చిత్తం తెలుసుకొనడం కోసం మిమ్మల్ని పరీక్షిస్తాడు. అందుచేత మీరు చిత్తాన్ని (అభిప్రాయాలను) అతనికి స్పష్టం చెయ్యాలి" అని చెప్పాలి. లేదా-"ఫలానా ఫలానా వాళ్లు మిమ్మల్ని గూర్చి రాజు చెవిలో ఇలా ఇలా చెపుతున్నారు" అని చెప్పి వాళ్లలో వాళ్లకి భేదం కల్పించాలి. ఇది వాళ్ల విషయంలో ఉపయోగించవలసిన భేదోపాయం.

3. దాండకర్మికవిధానంలో చెప్పినట్లు ఉపాంశుదండం ప్రయోగించాలి.

4. ఈ నాలుగు విధాలైన ఆపదలలో ముందుగా అభ్యంతరాపదకే ప్రతిక్రియ చేసుకోవాలి. "అభ్యంతరకోపం ఇంటిలో ఉన్న సర్పం వల్ల భయం వంటిది; బాహ్యకోపం కంటె చాల చెడ్డది"అని వెనుక చెప్పబడింది.

శ్లో. పూర్వాం పూర్వాం విజానీయాల్లఘ్వీమాపదమాపదామ్,
ఉత్థితాం బలవద్భ్యో వా గుర్వీం లఘ్వీం విపర్యయే.

ఇతి కౌటలీయార్థశాస్త్రే అభియాస్యత్కర్మణి నవమాధికరణే పఞ్చమోఽధ్యాయః
బాహ్యాభ్యన్తరాశ్చాపదః, ఆదితః షడ్వింశతితమః.

వ్యా. పైన చెప్పిన నాలుగు విధాల ఆపదలలో పూర్వపూర్వ ఆపద ఉత్తరోత్తరమైన ఆపదకంటె లఘువైనది. బలవంతులనుండి కలిగిన ఆపద పెద్దది; దుర్బలుల నుండి కలిగినది లఘువైనది.

"బాలానందిని" అను కౌటలీయార్థశాస్త్రాంధ్రవ్యాఖ్యానంలో అభియాస్యత్కర్మ అను నవమాధికరణంలో బాహ్యాపదలు అభ్యంతరాపదలు అను పంచమాధ్యాయం, ప్రారంభంనుండి నూట ఇరవైఆరవ అధ్యాయం సమాప్తం.

# అథ షష్ఠోఽధ్యాయః

## చతుశ్చత్వారింశచ్ఛతతమం ప్రకరణమ్ - దూష్యశత్రుసంయుక్తా (ఆపదః)

(దూష్యులనుండి శత్రువులనుండి వచ్చే ఆపదలు)

మూ. 1. దూష్యేభ్యః శత్రుభ్యశ్చ ద్వివిధాః శుద్ధాః.

2. దూష్యశుద్ధాయాం పౌరేషు జానపదేషు వా దణ్డవర్జానుపాయాన్ ప్రయుఞ్జీత. దణ్డో హి మహాజనే క్షేప్తుమశక్యః, క్షిప్తో వా తం చార్థం న కుర్యాత్. అన్యం చానర్థముత్పాదయేత్. ముఖ్యేషు త్వేషాం దాణ్డకర్మికవత్ చేష్టేతేతి.

3. శత్రుశుద్ధాయాం యతః శత్రుః ప్రధానః కార్యో వా తతః సామాదిభిః సిద్ధిం లిప్సేత.

వ్యా. 1. కేవలం దూష్యులనుండి కలిగినవి, కేవలం శత్రువులనుండి కలిగినవి అని శుద్ధమైన ఆపదలు రెండు విధాలు.

2. దూష్యులనుండి వచ్చిన శుద్ధమైన ఆపదలో పౌరుల విషయంలోను, జానపదుల విషయంలోను దండం తప్ప మిగిలిన ఉపాయాలను ప్రయోగించాలి. మహాజనుల విషయంలో అనగా పౌరజానపదుల సముదాయం మీద, దండం ప్రయోగించడం కష్టం. ప్రయోగించినా అది కావలసిన ఫలితాన్ని ఇవ్వదు. మరొక అనర్థాన్ని కలిగిస్తుంది. అయితే పౌరజానపదుల నాయకుల విషయంలో మాత్రం దాండకర్మికవిధానంలో చెప్పిన దండం విధించాలి.

3. శత్రువునుండి శుద్ధమైన ఆపద వచ్చినప్పుడు ప్రధానుడు కాని, అప్రధానుడు కాని అయిన శత్రువు ఎక్కడ ఉంటాడో అక్కడ సామాదులచేత కార్యసిద్ధిని పొందడానికి ప్రయత్నించాలి.

మూ. 1. స్వామిన్యాయత్తా ప్రధానసిద్ధిః, మన్త్రిషు ఆయత్తా ఆయత్తసిద్ధిః; ఉభయాయత్తా ప్రధానాయత్తసిద్ధిః.

2. దూష్యాదూష్యాణా మామిశ్రితత్వా దామిశ్రా, అమిశ్రాయామ దూష్యతః సిద్ధిః. ఆలమ్బనాభావే హ్యాలమ్బితా న విద్యతే. మిత్రామిత్రాణామేకీ భావాత్ పరమిశ్రా. పరమిశ్రాయాం మిత్రతః సిద్ధిః. సుకరో హి మిత్రేణ సన్ధిః నామిత్రేణేతి.

3. మిత్రం చేన్న సంధిమిచ్ఛేత్, అభీక్ష్ణముపజపేత్. తతః సత్రిభిరమిత్రాత్ భేదయిత్వా మిత్రం లభేత. మిత్రామిత్రసంఘస్య వా యోఽన్తస్థాయీ తం లభేత. అన్తస్థాయిని లబ్ధే మధ్యస్థాయినో భిద్యన్తే. మధ్యస్థాయినం వా లభేత. మధ్యస్థాయిని వా లబ్ధే నాన్తఃస్థాయినః సంహన్యన్తే. యథా చైషామాశ్రయభేదః తానుపాయాన్ ప్రయుఞ్జీత.

వ్యా. 1. ప్రధానుణ్ణి సాధించడం స్వామిమీద ఆధారపడి ఉంటుంది. ఆయత్తుల విషయంలో (ఇతరాధీనులైన మంత్రులు మొదలైనవారి విషయంలో) సిద్ధి మంత్రులమీద ఆధారపడి ఉంటుంది. ప్రధానులను ఆయత్తులను సాధించడం అనేది స్వామ్యమాత్యు లిద్దరి మీదా ఆధారపడి ఉంటుంది.

2. దూష్యులు అదూష్యులు కలిసి చేసిన ఉపజాపంవల్ల కలిగిన ఆపద అమిశ్రాపద. అమిశ్రాపదలో అదూష్యులను తన వశం చేసికొనడంవల్ల కార్యసిద్ధి (ఉపజాపాన్ని అణచివేయడం) కలుగుతుంది. ఆలంబనం లేకపోతే ఆలంబితులు ఉండరు కదా. అనగా దూష్యులు ఏ అదూష్యులను ఆలంబనంగా చేసికొని (కూడగట్టుకొని) ఉపజాపం ప్రారంభించారో ఆ అదూష్యులను తన వైపు తిప్పుకుంటే వాళ్లమీద ఆధారపడిన దూష్యులు తమంతట తామే శాంతిస్తారు. మిత్రులు అమిత్రులు కలిసి కల్పించిన ఆపద "పరమిశ్రాపద'. పరమిశ్రాపదలో మిత్రుణ్ణి వశం చేసుకొనడంచేత కార్యం సిద్ధిస్తుంది. ఎందువల్ల ననగా మిత్రునితో సంధి చేసుకొనడం సులభం కాని అమిత్రునితో చేసుకొనడం సులభం కాదు.

3. మిత్రుడు సంధికి అంగీకరించకపోయినట్లయితే ఆతని విషయంలో మిక్కిలి అభిజాపం చెయ్యాలి. తరవాత సత్రులచేత అమిత్రునికీ అతనికీ మధ్య భేదభావం కల్పించి అతనిని తనవైపు త్రిప్పుకోవాలి. ఏ రాజు మిత్రామిత్రసంఘానికి చివర ఉంటాడో అనగా సరిహద్దులోనివాడు, అమిత్రుడు, వాని తరువాతివాడు ఇత్యాదిరీతిలో ఉన్న మిత్రరాజులలో ఏ రాజు చివరి రాజ్యంలో ఉన్నాడో అతనిని తన వైపు త్రిప్పుకోవాలి. అతడు వశం అయితే మధ్యనున్న వాళ్లందరూ విడిపోతారు. లేదా మధ్యనున్నవానిని వశం చేసుకోవాలి. మధ్యనున్న వానిని వశంచేసుకుంటే చివర ఉన్నవాళ్లు కలిసి ఉండరు. ఈ రాజులందరికీ ఆశ్రయమైనదానిలో ఏ విధంగా భేదం కలుగుతుందో ఆ ఉపాయాలన్నీ ప్రయోగించాలి.

మూ. 1. ధార్మికం జాతికులవృత్తస్తవేన సంబన్ధేన పూర్వేషాం, త్రైకాల్యోప కారానపకారాభ్యాం వా సాన్త్వయేత్.

2. నివృత్తోత్సాహం, విగ్రహశ్రాన్తం, ప్రతిహతోపాయం, క్షయ వ్యయాభ్యాం ప్రవాసేన చోపతప్తం, శౌచేనాన్యం లిప్సమానమ్, అన్యస్మాద్వా శఙ్కమానం మైత్రీప్రధానం వా కల్యాణబుద్ధిం సామ్నా సాధయేత్.

3. లుబ్ధం తీక్ష్ణం వా తపస్విముఖ్యావస్థాపనాపూర్వం దానేన సాధయేత్.

4. తత్ పఞ్చవిధమ్- దేయవిసర్గః, గృహీతానువర్తనమ్, ఆత్తప్రతి దానమ్, స్వద్రవ్యదానమపూర్వమ్, పరస్వేషు స్వయంగ్రాహదానం చేతి దానకర్మ.

వ్యా. 1. ధార్మికుడైన రాజును వాని జాతిని, కులాన్ని, విద్యను నడవడికను స్తుతిస్తూ తమ పూర్వికులకు పరస్పరమూ ఉన్న సంబంధం గుర్తు చేస్తూ మూడు కాలాలలోను (భూతభవిష్యద్వర్తమానాలలో) ఉపకారమే చేసుకొనడం మన మధ్య ఉంది కాని అపకారం చేసుకొనడం లేదు అని చెపుతూ మంచి చేసుకోవాలి.

2. ఉత్సాహం సన్నగిలినవాడూ, విరోధంచేత ఆలసిపోయినవాడు, ఉపాయాలన్నీ వ్యర్థం అయిపోయినవాడూ, ప్రవాసంచేత బాధ చెందినవాడు, నిజాయతీ ఉన్నవా డనే కారణంచేత మరొకని దగ్గరికి వెళ్లదలచుచున్నవాడు, ఇతరుని శంకిస్తున్నవాడు

లేదా మైత్రియే ప్రధానంగా కలవాడు అయిన సద్బుద్ధి గల రాజును సామంచేత సాధించాలి.

3. లుబ్ధుడు లేదా ఆర్థికంగా క్షీణించినవాడు అయిన రాజును, ఎవరైన మునిని కాని, ముఖ్యాధికారిని గాని జామీనుగా ఉంచి దానంచేత సాధించాలి. దానం అయిదు విధాలు - తనకు అతడు ఇవ్వవలసినదానిని విడిచివేయడం, అతడు పూర్వం తీసుకొని అనుభవిస్తున్న భూమి మొదలైన దానిని అలాగే అనుభవించే టట్లు అనుమతించడం, తీసుకొన్నదానిని తిరిగి ఇచ్చివేయడం, క్రొత్తగా తన ద్రవ్యం ఇవ్వడం, శత్రుధనం స్వయంగ్రహదానం అనగా యుద్ధంలో నీకు ఏది దొరికితే అది నీకే అని అంగీకరించడం- ఇది దానకర్మ.

మూ. 1. పరస్పరద్వేషవైరభూమిహరణశఙ్కితమ్ అతోఽన్యతమేన భేదయేత్. భీరుం వా ప్రతిఘాతేన- "కృతసంధిరేష త్వయి కర్మ కరిష్యతి, మిత్రమస్య నిసృష్టమ్, సంధౌ వా నాభ్యన్తరః" ఇతి.

2. యస్య వా స్వదేశాదన్యదేశాద్వా పణ్యాని పణ్యాగారతయా గచ్ఛేయుః, తాన్యస్య "యాతవ్యాల్లబ్ధాని" ఇతి సత్త్రిణశ్చారయేయుః. బహులీభూతే శాసనమ్ అభిత్యక్తేన ప్రేషయేత్- "ఏతత్ తే పణ్యం పణ్యాగారం వా మయా తే ప్రేషితమ్, సామవాయికేషు విక్రమస్వ, అపగచ్ఛ వా, తతః పణశేషమవాప్స్యసి" ఇతి. తతః సత్త్రిణః గ్రాహయేయుః "ఏతద్ అరిప్రద త్తమ్" ఇతి.

వ్యా. మిత్రామిత్రులలో పరస్పరద్వేషంచేత శంకితుడు, లేదా పరస్పర వైరం చేత శంకితుడు లేదా పరస్పరభూమిహరణంచేత శంకితుడు అయినవానిని ఈ మూడింటిలో ఏదో ఒకదానిచేత భేదింపచెయ్యాలి. (తాత్కాలికాపకారంవల్ల కలిగినది ద్వేషం. చాల కాలనుండి జరుగుతున్న అపకారాలవల్ల నిరంతరమూ కొనసాగుతున్నది వైరం). పిరికివానిని- "ఇతడు విజిగీషువుతో సంధి చేసికొని తరవాత నీ విషయంలో కర్మ చేస్తాడు (నిన్ను నిర్మూలిస్తాడు). సంధికోసం ఇతని మిత్రుడు పంపబడి ఉన్నాడు సంధిలో నిన్ను చేర్చుకొనలేదు" అని చెప్పి విడదీయాలి.

2. మిత్రామిత్రులలో ఎవనికైనా పణ్యాలు స్వదేశంనుండి గాని, అన్యదేశంనుంచి గాని పణ్యాగారంగా (పణ్యరూపంలో ఉన్న కానుకలుగా) వచ్చినప్పుడు

"ఈ పణ్యాలు ఇతనికి యాతవ్యుడు సంధి చేసికొని పంపాడు" అని సత్రులు పుకారులు సృష్టించాలి. ఈ విధమైన పుకారులు అంతటా వ్యాపించిన తరవాత అభిత్యక్తుని ద్వారా (మరణదండం విధించిన వ్యక్తి ద్వారా)- నీకు ఈ పణ్యాన్ని లేదా పణ్యాగారాన్ని పంపినాను, సామవాయికుల విషయంలో పరాక్రమించుము, లేదా ఆ సామవాయికుల నుంచి విడిపొమ్ము. తరవాత మనం అనుకున్న మిగిలిన పణం పంపుతాను" అని అసత్యమైన లేఖ వ్రాసి పంపాలి. పిమ్మట సత్రులు "ఇది శత్రువే ఇతనికి ఇచ్చాడు" అని ఇతరులకు చెప్పాలి.

మూ. 1. శత్రుసంఘాతం వా పణ్యమవిజ్ఞాతం విజిగీషుం గచ్ఛేత్.తదస్య వైదేహకవ్యఞ్జనాః శత్రుముఖ్యేషు విక్రీణీరన్. తతః సత్రిణః పరేషు గ్రాహయేయుః- "ఏతత్ పణ్యమరిదత్తమ్" ఇతి.

2. మహాపరాధానర్థమానాభ్యామ్ ఉపగృహ్య వా శస్త్రరసాగ్నిభిరమిత్రే ప్రణిదధ్యాత్. అథైకమమాత్యం నిష్పాతయేత్. తస్య పుత్రదారముపగృహ్య రాత్రౌ హతమితి ఖ్యాపయేత్. అథామాత్యః శత్రోస్తానేకైకశః ప్రరూపయేత్. తే చేద్ యథోక్తం కుర్యుః, న చైతాన్ గ్రాహయేత్. అశక్తిమతో వా గ్రాహయేత్. ఆప్తభావోపగతో ముఖ్యాదస్యాత్మానం రక్షణీయం కథయేత్. అథామిత్రశాసనం ముఖ్యోపఘాతాయ ప్రేషితముభయవేతనో గ్రాహయేత్.

వ్యా. 1. సామవాయికులలో ఒకడైన శత్రువుయొక్క సొత్తుగా ప్రసిద్ధమైన ఏదైన ఒక పణ్యం (రత్నాదికం) ఎవరికీ తెలియకుండా విజిగీషువు దగ్గరికి చేరాలి(చేర్చాలి). దానిని వర్తకులవేషంలో ఉన్న గూఢచారులు ఆ సామయికులలోని శత్రువుల ముఖ్యులకు అమ్మాలి. అప్పుడు సత్రులు "ఈ పణ్యాన్ని విజిగీషువుకు (మీలో ఒకడైన) వాని శత్రువే ఇచ్చాడు" అని ఇతరులకు తెలపాలి.

2. లేదా విజిగీషువు తన విషయంలో మహాపరాధం చేసిన కొందరిని ధనం చేత, సత్కారాలచేత వశం చేసుకొని వాళ్లను "శస్త్రరసాదులచేత శత్రువును చంపండి" అని చెప్పి గూఢచారులనుగా పంపాలి. ముందు ఒక అమాత్యుణ్ణి పంపాలి. వాని పుత్రభార్యలను దాచివేసి "వాళ్లు రాత్రి చంపబడ్డారు" అని అసత్యమైన ప్రవాదం పుట్టించాలి. (దీనివల్ల తన దగ్గరికి వచ్చినవాడు విజిగీషువుకు నిజంగా ద్వేషపాత్రుడే అని

శత్రువుకు నమ్మకం కుదురుతుంది). అలా ముందు శత్రువు దగ్గరికి చేరిన అమాత్యుడు మిగిలినవాళ్లని కూడ శత్రువుదగ్గరికి ఒక్క రొక్కరినే (ఇతడు కూడ విజిగీషువుకు ద్వేష్యుడే అని నమ్మకం కలిగించి) చేర్చాలి. ఇలా పంపబడిన అమాత్యులు తాను చెప్పిన విధంగా (శస్త్రరసాదిప్రయోగం) చేస్తే వాళ్లని పట్టించకూడదు. వాళ్లు ఆ పని చేయడానికి అశక్తు లైతే పట్టించాలి. శత్రువుకు ఆప్తుడుగా అయిన విజిగీషువుయొక్క అమాత్యుడు- "నువ్వు సామవాయికముఖ్యునినుండి నిన్ను రక్షించుకోవాలి" అని అతనికి చెప్పాలి. తరవాత ఉభయవేతనుడు ముఖ్యుని చంపివేయా లని అమిత్రుడు వ్రాసినట్లు ఒక దొంగలేఖను అతనికి ఇవ్వాలి.

మూ. 1. ఉత్సాహశక్తిమతో వా ప్రేషయేత్- "అముష్య రాజ్యం గృహాణ, యథాస్థితో నః సంధిః" ఇతి. తతః సత్రిణః పరేషు గ్రాహయేయుః.

2. ఏకస్య స్కన్ధావారం వివిధమాసారం వా ఘాతయేయుః, ఇతరేషు మైత్రీం బ్రువాణాః తం సత్రిణః "త్వమేషాం ఘాతయితవ్యః" ఇత్యుపజపేయుః.

3. యస్య వా ప్రవీరపురుషో, హస్తీ, హయో వా మ్రియేత, గూఢపురుషైః హన్యేత, హ్రియేత వా తం సత్రిణః పరస్పరోపహతం బ్రూయుః. తతః శాసనమభిశస్తస్య ప్రేషయేత్- "భూయః కురు, తతః పణశేషమవాప్స్యసి" ఇతి. తదుభయవేతనా గ్రాహయేయుః.

4. భిన్నేష్వన్యతమం లభేత.

5. తేన సేనాపతికుమారదణ్డచారిణో వ్యాఖ్యాతాః.

6. సాంఘికం చ భేదం ప్రయుఞ్జీత. ఇతి భేదకర్మ.

వ్యా. 1. లేదా- "ఫలానావాని రాజ్యం ఆక్రమించుము. మన సంధి అనుకొన్న విధంగానే ఉంటుంది" అని ఉత్సాహశక్తిమంతునికి ఒక దొంగ ఉత్తరం వ్రాసి పంపాలి. తరవాత సత్రులు దానిని మిగిలినవాళ్లకు అందచెయ్యాలి.

2. లేదా గూఢపురుషులు ఆ సామవాయికులలో ఒకని సేనానివేశాన్ని, ఆహారాదుల రాకను, మిత్రసేనాగమనాన్ని నశింపచెయ్యాలి. ఇతరు లందరూ మైత్రితో ఉన్నారు అని చెప్పుతూ సత్రులు "వీళ్లు నిన్ను నశింపచెయ్యా లని చూస్తున్నారు" అని ఆతనికి రహస్యంగా చెప్పిపెట్టాలి.

3. సామవాయికులలో ఏ ఒకనికో చెందిన వీరపురుషుడు గాని, ఏనుగుగాని, అశ్వం గాని స్వయంగా మరణించి నప్పుడు లేదా గూఢపురుషులచేత చంపబడి నప్పుడు లేదా హరించబడి నప్పుడు సత్రులు ఆ రాజు దగ్గరికి వెళ్లి సామవాయికులలోని ఇతరులే చంపి నట్లు చెప్పాలి. తరవాత అభిశస్తుడు (ఎవడు ప్రవీరాదుల్ని చంపినట్లు చెప్పబడ్డాడో అతడు) వ్రాసి నట్లు "మళ్లీ ఇలాగే చెయ్యి; మిగిలిన పణాన్ని పొందగలవు" అని కూటలేఖ పంపాలి. దానిని ఉభయవేతనులు పట్టించాలి.

4. పైన చెప్పిన భేదోపాయాలచేత సామవాయికులలో భేదం పుట్టించిన తరవాత అలా భిన్నులైన వాళ్లలో ఒకనిని (విజిగీషువు) వశం చేసుకోవాలి.

5. దీనిచేత సేనాపతికుమారదణ్డచారులు కూడ వ్యాఖ్యానింపబడినట్లే అనగా వాళ్లలో భేదం కలిగించడానికి పైన చెప్పిన భేదోపాయాలలో ఏదో ఒకటి ప్రయోగించాలి.

6. సంఘవృత్తాధికరణంలో చెప్పనున్న భేదాన్ని కూడ ప్రయోగించాలి. ఇది భేదోపాయం.

మూ. 1. తీక్ష్ణ ముత్సాహినం వ్యసనినం స్థితశత్రుం వా గూఢపురుషాః శస్త్రాగ్నిరసాదిభిః సాధయేయుః. సౌకర్యతో వా తేషామన్యతమః. తీక్ష్ణో హ్యేకః శస్త్రరసాదిభిః సాధయేత్. అయం సర్వసన్దోహకర్మ విశిష్టం వా కరోతి. ఇత్యుపాయచతుర్వర్గః.

2. పూర్వః పూర్వశ్చాస్య లఘిష్ఠః. సాన్త్వమేకగుణమ్. దానం ద్విగుణం సాన్త్వపూర్వమ్. భేదస్త్రిగుణః సాన్త్వదానపూర్వః. దణ్డశ్చతుర్గుణః సాన్త్వదాన భేదపూర్వః.

వ్యా. 1. చాల తీక్ష్ణమైన స్వభావం కల శత్రువును, లేదా మృగయాదివ్యసనాలు ఉన్నవానిని (లేదా కష్టాలలో ఉన్నవానిని) లేదా స్థితశత్రువును (దుర్గంలో ఉన్న శత్రువును) గూఢపురుషులు అందరూ కలిసి శస్త్ర - అగ్ని- రసాదులచేత చంపివెయ్యాలి. లేదా గూఢపురుషులలో ఒకడు సౌకర్యాన్ని పట్టి అలాంటివానిని చంపివేయాలి. ఎందువల్ల ననగా ఒక్క తీక్ష్ణుడే (ఇక్కడ ఒక విధమైన గూఢపురుషు డని అర్థం) శస్త్రరసాగ్నులచేత చంపివేయగలడు. ఇతడు అందరూ కలిసి చేయగలిగిన పని, అంతకంటె అధికమైన పనీ కూడ చేయగలడు. ఇది నాలుగు ఉపాయాల వర్గం.

2. వీటిలో పూర్వపూర్వం లఘు వైనది అనగా అనాయాసంగా ప్రయోగించశక్య మైనది. సామంలో ఒకే గుణం ఉంది. సామపూర్వకమైన దానం రెండు రెట్లు అయినది. సామ-దానపూర్వకమైన భేదం మూడు రెట్లైనది. సామ-దాన-భేదపూర్వకమైన దండం నాలుగు రెట్లైనది. (సామపూర్వకమైన దానం అనగా ముందు సామాన్ని ప్రయోగించి తరవాత ప్రయోగించబడిన దానం అని అర్థం. ఇట్లే ఇతరస్థలాలలో కూడ. దండంకంటె భేదం లఘువు, దానికంటె దానం లఘువు, దాని కంటె సామం లఘువు అని అర్థం)

మూ. 1. ఇత్యభియుఞ్జానేషూక్తమ్. స్వభూమిష్ఠేషు తు త ఏవ ఉపాయాః. విశేషస్తు- స్వభూమిష్ఠానామన్యతమస్య పణ్యాగారైరభిజ్ఞాతాన్ దూతముఖ్యాన్ అభీక్ష్ణం ప్రేషయేత్. త ఏనం సంధౌ పరహింసాయాం వా యోజయేయుః. అప్రతిపద్యమానం కృతో నః సంధిః ఇత్యావేదయేయుః. తమితరేషాముభయవేతనాః సంక్రామయేయుః- అయం వో రాజా దుష్ట ఇతి.

2. యస్య వా యస్మాద్భయం వైరం ద్వేషో వా తం తస్మాత్ భేదయేయుః- "అయం తే శత్రుణా సందత్తే. పురా త్వామతిసంధత్తే క్షిప్రతరం సంధీయస్వ.నిగ్రహే చాస్య ప్రయతస్వ" ఇతి.

3. ఆవాహవివాహాభ్యాం వా కృత్వా సంయోగమ్ అసంయుక్తాన్ భేదయేత్.

4. సామన్తాటవికతత్కులీనావరుద్ధైశ్చైషాం రాజ్యం నిఘాతయేత్. సార్థవ్రజాటవీర్వా. దణ్డం వాభిసృతమ్. పరస్పరాపాశ్రయాశ్చైషాం జాతిసంఘాః ఛిద్రేషు ప్రహరేయుః. గూఢాశ్చాగ్నిరసశస్త్రేణ.

వ్యా. 1. ఒక యాతవ్యుని మీదికి మిత్రామిత్రులు కొందరు కలిసి యుద్ధానికి వెళ్లుచున్నప్పుడు ప్రయోగించవలసిన ఉపాయాలు చెప్పబడినవి. వాళ్లు స్వభూమిష్ఠులై నప్పుడు (ఇంకా యుద్ధానికి బయలుదేరకుండా తమ తమ భూములలో ఉన్నప్పుడు) కూడ ఆ ఉపాయాలే ప్రయోగించాలి. విశేషం మాత్రం ఇది- విజిగీషువు స్వభూమిష్ఠులలో ఒకని దగ్గరికి అందరు గుర్తించదగిన తన దూతలను రత్నాది పణ్యాలతో (పారితోషికాలతో) మాటిమాటికీ పంపుతూ ఉండాలి. ఆ దూతలు ఇతనిని (విజిగీషువుతో) సంధి

చేసుకొనడానికి గాని, శత్రువులను హింసించడానికి గాని ప్రోత్సహించాలి. అతడు సంధిచేసుకొనడానికి అంగీకరించకపోయినా కూడ "మేం సంధి చేసికొన్నాం" అని అందరికీ చాటి చెప్పాలి. ఈ విషయాన్ని ఉభయవేతనులు మిగిలిన మిత్రామిత్రులకు తెలిపి "మీలో చేరి ఉన్న రాజు చాల దుష్టుడు" అని చెప్పాలి.

2. లేదా - గూఢపురుషులు ఎవనికి ఎవనినుండి భయమో, ఎవనితో వైరం కాని ద్వేషం కాని ఉన్నాయో వానిని వానినుండి విడదీయాలి. "ఇతడు శత్రువుతో సంధి చేసుకుంటున్నాడు, నిన్ను మోసం చేయబోతున్నాడు, శీఘ్రంగా (మా రాజుతో) సంధి చేసుకో, ఇతనిని నిగ్రహించడానికి ప్రయత్నించుము" అని చెప్పి భేదం కల్పించాలి.

3. లేదా ఆవాహం (కన్యను స్వీకరించడం) వివాహం (కన్యను ఇవ్వడం) - వీటిచేత వాళ్లలోని ఒక రాజుతో సంబంధం ఏర్పరచుకొని, అలాంటి సంబంధం లేనివాళ్లని విడదీయాలి. (ఇది భేదోపాయం)

4. తనమీదికి యుద్ధానికి రాదలచిన ఆ మిత్రామిత్రుల రాజ్యాన్ని సామంతులచేత, ఆటవికులచేత. వాళ్ల (రాజుల) దాయాదులచేత, అవరుద్ధులచేత (ద్వేషపాత్రులైన వాళ్ల పుత్రులచేత) నశింపచెయ్యాలి. లేదా వాళ్ల వర్తకసంఘాల మార్గాలను, పశుస్థానాలను, అడవులను నశింపచెయ్యాలి. లేదా సహాయం చెయ్యడానికి బైలుదేరిన సైన్యాన్ని నశింపచెయ్యాలి. జాతిసంఘాలు ( ఆ యా వర్గాల సంఘాలు) ఒకదానితో ఒకటి సహాయం చేసుకొంటూ ఈ రాజులను వాళ్ల ఛిద్రాలలో (ప్రమాదస్థానాలలో) దెబ్బ తీయాలి. గూఢపురుషులు అగ్ని-రస-శస్త్రాలచేత నశింపచెయ్యాలి.

శ్లో. వితంసగిలవచ్చారీన్ యోగైరాచరితైః శఠః,
ఘాతయేత్ పరమిశ్రాయాం విశ్వాసేనామిషేణ చ.

ఇతి కౌటలీయార్థశాస్త్రే అభియాస్యత్కర్మణి నవమాధికరణే షష్ఠోఽధ్యాయః
దూష్యశత్రుసంయుక్తాః, ఆదితః సప్తవింశతిశతతమః.

వ్యా. పరమిశ్రాపదలో (అనగా శత్రువులు, మిత్రులు కలిసి తన మీదికి యుద్ధానికి రావడంవల్ల ఏర్పడిన ఆపదలో) విజిగీషువు శఠుడై (రహస్యంగా ప్రవర్తిస్తూ) వితంసమూ, గిలమూ వంటి ఈ యోగాలను ప్రయోగించి, శత్రువులను, విశ్వాసం కలిగించడం ద్వారా, ఆమిషం (ఎర) చూపడం ద్వారా నశింపచెయ్యాలి.

పక్షులను పట్టేవాడు పక్షులకు నమ్మకం కలిగించడం కోసమై ఆ యా పక్షుల బొమ్మలు చిత్రించిన వస్త్రం కప్పుకొని అరణ్యంలో సంచరిస్తాడు. ఆ వస్త్రానికి 'వితంసం' అని పేరు. 'గిలం' అనగా మింగడానికి పెట్టిన ఎర.

"బాలానందిని" అను కౌటలీయార్థశాస్త్రాంధ్రవ్యాఖ్యానంలో అభియాస్యత్కర్మ అను నవమాధికరణంలో దూష్యశత్రుసంయుక్తాపదలు అను ఆరవ అధ్యాయం, ప్రారంభంనుంచి నూట ఇరవైఏడవ అధ్యాయం సమాప్తం.

## అథ సప్తమో ఽధ్యాయః

### పఞ్చచత్వారింశచ్ఛతతమం ప్రకరణమ్ - అర్థానర్థసంశయయుక్తాః ఆపదః
### షట్చత్వారింశచ్ఛతతమం ప్రకరణమ్ - తాసాముపాయవికల్పజాః సిద్ధయః.

మూ. 1. కామాదిరుత్సేకః స్వాః ప్రకృతీః కోపయతి. అపనయో బాహ్యాః; తదుభయమాసురీవృత్తిః. స్వజనవికారః కోపః. పరవృద్ధి హేతుస్త్వాపదర్థః, అనర్థః, సంశయ ఇతి.

2. యో ఽర్థః శత్రువృద్ధిమప్రాప్తః కరోతి, ప్రాప్తః ప్రత్యాదేయః పరేషాం భవతి. ప్రాప్యమాణో వా క్షయవ్యయోదయో భవతి, స భవత్యాపదర్థః. యథా సామన్తానా మామిషభూతః సామన్తవ్యసనజో లాభః, శత్రుప్రార్థితో వా స్వభావాధిగమ్యో లాభః, పశ్చాత్కోపేన పార్ష్ణిగ్రాహేణ వా విగృహీతః పురస్తాల్లాభః, మిత్రోచ్ఛేదేన సంధివ్యతిక్రమేణ వా మణ్డలవిరుద్ధో లాభః ఇత్యాపదర్థః.

వ్యా. 1. కామక్రోధాదికమైన దోషాధిక్యం తన ప్రకృతులను ప్రకోపింపచేస్తుంది. అపనయం బాహ్యప్రకృతులను ప్రకోపింపచేస్తుంది. కామాదికం, అపనయం అనే ఈ ఉభయమూ కూడ ఆసురప్రవృత్తి. స్వజనులలో వికారం కలగడమే కోపం. పరుల వృద్ధికి హేతువు లైనవాటిలో ఆపదర్థం (ఆపద్రూపమైన అర్థం), అనర్థం, సంశయం అనేవి ఉంటాయి. (అర్థం అనగా ప్రయోజనం, లాభం అని అర్థం).

2. ఏ అర్థం తన చేతికి అందకుండా శత్రువులకు అభివృద్ధిని కలిగిస్తుందో,

చేతికి అందినా కూడ పరులచేత తిరిగి తీసికొనబడేదిగా ఉంటుందో, పొందబడినా కూడ క్షయవ్యయాలు కలిగించేదిగా ఉంటుందో అది ఆపదర్థం, ఎట్లనగా- సామంతులకు (సరిహద్దు రాజులకు) ఆమిషం (తినబడేది) అయినది (అది తన చేతికి అందకుండా సామంతులకు భోగ్యం అవుతుంది అని అర్థం), సామంతులు కష్టాలలో ఉండడంవల్ల లభించిన లాభం (ఆ కష్టాలనుంచి గట్టెక్కగానే ఆ సామంతుడు తిరిగి తీసివేసుకుంటాడు), సహజంగా తనకు చెందవలసినదే అయినా శత్రువుచేత కోరబడేది, పశ్చాత్కోపంచేత (తాను యాతవ్యునిమీదికి యుద్ధానికి వెళ్లినప్పుడు తన రాజ్యంలో కలిగిన ప్రకోపంచేత) గాని, పార్ష్ణిగ్రాహునిచేత గాని బాధించబడిన (ఏమీ మిగలకుండా చేయబడిన) పురస్తాల్లాభం (ముందుకు వెళ్లి యాతవ్యుని జయించడంవల్ల కలిగిన లాభం), మిత్రుణ్ణి నిర్మూలించడంచేత గాని, సంధిని పాటించకపోవడంచేత గాని లభించిన, మండలానికి విరుద్ధమైన లాభం- ఇవి ఆపదర్థం.

మూ. 1. స్వతః పరతో వా భయోత్పత్తిరిత్యనర్థః.

2. తయోః అర్థో న వేతి, అనర్థో న వా ఇతి, అర్థోఽనర్థః ఇతి, అనర్థః అర్థః ఇతి సంశయః.

3. శత్రుమిత్రముత్సాహయితుమనర్థో న వేతి సంశయః. బలవత్సామన్తాం భూమిమాదాతుమర్థోఽనర్థో వేతి సంశయః. జ్యాయసా సంభూయ యానమ్ అనర్థః అర్థః ఇతి సంశయః.

4. తేషామర్థసంశయముపగచ్ఛేత్.

వ్యా. 1. తనవాళ్లనుండి గాని శత్రువులనుండి గాని భయం కలగడం అనర్థం.

2. ఈ అర్థానర్థాలలో "అర్థం అవునా కాదా?" అని, "అనర్థమా కాదా?" అని, "అర్థమా అనర్థమా?"అని, "అనర్థమా అర్థమా?" అని ఇవి సంశయాలు.

3. (ఉదాహరణకి) "శత్రువుయొక్క మిత్రుణ్ణి ఆతనిమీదికి యుద్ధానికి ప్రోత్సహించడం అర్థమేనా కాదా?" అనేది సంశయం. "శత్రుసైన్యాన్ని ధనం, గౌరవం ఇచ్చి రప్పించడం అనర్థమేనా కాదా?" అనేది సంశయం. "బలవంతుడైన సామంతుడు గల భూమిని గ్రహించడం అర్థమా అనర్థమా?" అనేది సంశయం. బలవంతునితో కలిసి మరొకని మీదికి యుద్ధానికి వెళ్లడం అనర్థమా అర్థమా?" అనేది సంశయం.

4. ఈ వివిధసంశయాలలో "అర్థమా కాదా" అనే సంశయం కలిగినా ముందుకు సాగవచ్చును.

మూ. 1. అర్థోఽర్థానుబన్ధః, అర్థో నిరనుబన్ధః. అర్థోఽనర్థానుబన్ధః, అనర్థోఽర్థానుబన్ధః, అనర్థో నిరనుబన్ధః, అనర్థోఽనర్థానుబన్ధః ఇత్యనుబన్ధషడ్వర్గః.

2. శత్రుముత్పాట్య పార్ష్ణిగ్రాహాదానమ్ అర్థః అర్థానుబన్ధః.

3. ఉదాసీనస్య దణ్డానుగ్రహః ఫలేన అర్థో నిరనుబన్ధః.

4. పరస్యాన్తరుచ్ఛేదనమ్ అనర్థః అనర్థానుబన్ధః.

5. శత్రుప్రవేశస్య అనుగ్రహః కోశదణ్డాభ్యామ్ అనర్థః అర్థానుబన్ధః.

6. హీనశక్తిముత్సాహ్య నివృత్తిరనర్థో నిరనుబన్ధః.

7. జ్యాయాంసముత్థాప్య నివృత్తిః అనర్థః అనర్థానుబన్ధః.

8. తస్య పూర్వ పూర్వః శ్రేయానుపసంప్రాప్తుమ్. ఇతి కార్యావస్థాపనమ్.

వ్యా. 1. (అనుబంధం అనగా ఒక దాని తరవాత దానిని వెన్నంటి వచ్చేది అని అర్థం). అర్థానుబంధం అయిన (వెన్నంటి వచ్చే అర్థం గల) అర్థం, నిరనుబంధమైన( అనుబంధం ఏదీ లేని) అర్థం, అనర్థానుబంధం అయిన అర్థం, నిరనుబంధమైన అనర్థం, అనర్థానుబంధమైన అనర్థం అని ఇవి అనుబంధషడ్వర్గం (ఆరు విధాలైన అనుబంధాల సముదాయం).

2. శత్రువును నిర్మూలించి పార్ష్ణిగ్రాహుణ్ణి పట్టుకొనడం అర్థానుబంధమైన అర్థం. శత్రునిర్మూలనం అనే అర్థానికి వెనువెంటనే పార్ష్ణిగ్రాహాదానం అనే మరొక అర్థం లభించింది గాన ఇది అర్థానుబంధార్థం.

3. ధనాదిరూపమైన ఫలాన్ని ఉద్దేశించి ఉదాసీనునికి సైన్యం ఇవ్వడం నిరనుబంధమైన అర్థం. (ధనాదికం తప్ప దీని తరవాత మరొక అర్థం గాని అనర్థం కాని ఉండదు).

4. శత్రువుకూ తనకూ మధ్య నున్న రాజును (అంతర్ధిని) నిర్మూలించడం, అనర్థానుబంధమైన అర్థం. (శత్రువుకూ తనకూ అడ్డుగా ఉన్నవాడు పోవడంతో అనర్థం కలగవచ్చును).

5. కోశదండా లిచ్చి శత్రువుయొక్క సరిహద్దుదారునికి సహాయం చేయడం అర్థానుబంధమైన అనర్థం.

6. హీనశక్తియైన రాజును (నేను నీ వెంట ఉంటాను అని చెప్పి) యుద్ధానికి ప్రోత్సహించి వెనుకకు జారుకొనడం నిరనుబంధమైన అనర్థం.

7. బలవంతుణ్ణి యుద్ధానికి ప్రోత్సహించి తాను వెనుకంజ వేయడం అనర్థానుబంధమైన అనర్థం.

8. ఈ ఆరింటిలో ఉత్తరోత్తరంకంటె పూర్వపూర్వం అవలంబించడానికి యోగ్యమైనది. (ఉదాహరణకి నిరనుబంధమైన అర్థంకంటె అర్థానుబంధమైన అర్థం మంచిది. ఈ విధంగా చూచుకోవాలి). ఇది కార్యములైన అర్థానర్థాల స్వరూపనిరూపణం.

మూ. 1. సమన్తతో యుగపదర్థోత్పత్తిః సమన్తతోఽర్థాపద్ భవతి.

2. సైవ పార్ష్ణిగ్రాహవిగృహీతా సమన్తతోఽర్థసంశయాపద్ భవతి.

3. తయోర్మిత్రాక్రన్దోపగ్రహాత్ సిద్ధిః.

4. సమన్తతః శత్రుభ్యః భయోత్పత్తిః సమన్తతోఽనర్థాపద్ భవతి.

5. సైవ మిత్రవిగృహీతా సమన్తతోనర్థసంశయాపద్ భవతి.

6. తయోశ్చలమిత్రాక్రన్దోపగ్రహాత్ సిద్ధిః, పరమిత్రాప్రతీకారో వా.

7. ఇతో లాభస్తతో లాభ ఇతి ఉభయతోర్థాపద్ భవతి. తస్యాం సమన్తతోర్థాయాం చ లాభగుణయుక్తమర్థమాదాతుం యాయాత్. తుల్యే లాభగుణే ప్రధానమాసన్నమనతిపాతినమ్, ఊనో వా యేన భవేత్ తమ్ ఆదాతుం యాయాత్.

వ్యా. 1. అన్ని వైపులనుండి ఒకే మాటు అర్థం కలగడం (అర్థం లభించే అవకాశం కలగడం) సమంతతోర్థాపద్. నాలుగుప్రక్కలనుండీ ఒకే మారు అర్థం (లాభం) కలిగే అవకాశం ఉన్నప్పుడు దేనిని ఎట్లు గ్రహించాలి అనే విషయం నిర్ణయించడం కష్టం అవడంచేత ఇది ఆపద అని చెప్పబడింది.

2. దానినే పార్ష్ణిగ్రాహుడు అడ్డుకొన్నప్పుడు అది సమంతతోర్థసంశయాపద అవుతుంది.

3. మిత్రుని (ముందున్న మిత్రుని) సహాయం, ఆక్రందుని (వెనుకనున్న

మిత్రుని సహాయం) తీసికొని పై రెండు ఆపదలను దాటవచ్చును.

4. అన్ని వైపులనుండి శత్రువుల భయం కలగడం సమంతతోనర్థాపద.

5. దానినే తన మిత్రుడు అడ్డుకున్నట్లయితే అది సమంతతోనర్థసంశయాపద అవుతుంది.

6. చలమిత్రుని (దుర్గంలేని మిత్రుని) సహాయం, ఆక్రందుని సహాయం పొందుతే దీనికి ప్రతిక్రియ జరుగుతుంది. లేదా పరమిత్రాపదకు వెనుక చెప్పిన ప్రతీకారమే దీనికి కూడ చేయవచ్చును.

7. ఇటునుండి లాభం కలుగుతుంది, మరొక ప్రక్కనుండి లాభం కలుగుతుంది అన్నట్లు ఉన్నప్పుడు అది ఉభయతోర్థాపద అవుతుంది. ఈ ఉభయతోర్థాపదలోను, సమంతతోర్థాపదలోను కూడ ఏ లాభంలో ఎక్కువ గుణాలు ఉంటాయో (ఏది మంచి లాభమో) ఆ లాభాన్ని పొందడానికి వెళ్లాలి. ఆ రెండింటిలోను లేదా అన్నింటిలోను లాభగుణం సమంగానే ఉన్నప్పుడు ఏది ప్రధానమైనదో, ఏది సమీపంలో ఉంటుందో, దేని విషయంలో ఆలస్యం చేయకూడదో, ఏది లేకపోతే తనకు లోటు కలుగుతుందో ఆ లాభాన్ని గ్రహించడంకోసం వెళ్లాలి.

మూ. 1. ఇతోఽనర్థః ఇతరతోఽనర్థ ఇత్యుభయతోఽనర్థాపత్. తస్యాం సమన్తతోఽ నర్థాయాం చ మిత్రేభ్యః సిద్ధిం లిప్సేత.

2. మిత్రాభావే ప్రకృతీనాం లఘీయస్యా ఏకతోఽనర్థాం సాధయేత్, ఉభయతోఽనర్థాం జ్యాయస్యా. సమన్తతోఽనర్థాం మూలేన ప్రతికుర్యాత్. అశక్యే సర్వముత్సృజ్య అపగచ్ఛేత్. దృష్టా హి జీవతా పునరాపత్తిః, యథా సుయాత్రోదయనాభ్యామ్.

3. ఇతో లాభ ఇతరతో రాజ్యామర్శ ఇత్యుభయతోఽర్థానర్థాపద్ భవతి. తస్యామనర్థసాధకో యోఽర్థః తమాదాతుం యాయాత్, అన్యథా హి రాజ్యాభిమర్శం వారయేత్.

4. ఏతయా సమన్తతోఽర్థానర్థాపద్ వ్యాఖ్యాతా.

వ్యా. 1. ఇటు వైపునుండి అనర్థం, ఈ వైపునుండి కూడ అనర్థం అన్నప్పుడు అది ఉభయతోనర్థాపద. అలాంటి ఆపదను, సమంతతోనర్థాపదను మిత్రసహాయం చేత అధిగమించడానికి ప్రయత్నించాలి.

2. మిత్రులు లేకపోతే ప్రకృతులలో చిన్నదైన ప్రకృతిచేత, (అనగా చిన్నదైన ప్రకృతిని త్యజించడంచేత) ఏకతోనర్థాపదను (ఒక వైపునుండి అనర్థం కలిగే ఆపదను) తప్పించుకోవాలి. ఉభయతోనర్థాపదను పెద్దదైన ప్రకృతిని త్యజించి తప్పించుకోవాలి. సమంతతోనర్థాపదను మూలాన్ని (మూలస్థానాన్ని) విడిచి తప్పించుకోవాలి. అలా అయినా శక్యం కాకపోతే అంతా విడిచి దూరంగా వెళ్లిపోవాలి. ఎందువల్ల ననగా రాజ్యం కోల్పోయినా తనను రక్షించుకొనడంవల్ల, సుయాత్ర(నల) ఉదయనుల వలె, పోయిన రాజ్యాన్ని మళ్లీ సంపాదించుకొనడం కనబడుతున్నది కదా?

3. ఇటు లాభం, మరొక వైపు తన జనపదాన్ని (ఇతరులు) ఆక్రమించుకొనడం అన్నప్పుడు అది ఉభయతోర్థానర్థసంపద అవుతుంది. అలాంటి ఆపదలో అనర్థానికి ప్రతిక్రియ చేయగలిగిన అర్థాన్ని గ్రహించడంకోసం వెళ్లాలి. అర్థం అనర్థప్రతిక్రియ చేయకలిగినది కాని పక్షంలో ముందుగా రాజ్యాక్రమణం కాకుండా చూచుకోవాలి.

4. దీనిచేత సమంతతోర్థానర్థాపదను గూర్చి కూడ చెప్పినట్లే.

మూ. 1. ఇతోఽనర్థః ఇతరతః అర్థసంశయః ఇతి ఉభయతోఽనర్థార్థసంశయా. తస్యాం పూర్వమనర్థం సాధయేత్; తత్సిద్ధావర్థ సంశయమ్.

2. ఏతయా సమన్తతోఽనర్థార్థసంశయా వ్యాఖ్యాతాః.

3. ఇతోఽర్థః, ఇతరతః అనర్థసంశయః ఇత్యుభయతోఽర్థానర్థ సంశయాపత్.

4. ఏతయా సమన్తతోఽర్థానర్థసంశయా వ్యాఖ్యాతాః.

5. తస్యాం పూర్వాం పూర్వాం ప్రకృతీనా మనర్థసంశయా న్మోక్షయితుం యతేత. శ్రేయో హి మిత్రమనర్థసంశయే తిష్ఠన్ న దణ్డః, దణ్డో వా న కోశ ఇతి.

వ్యా. 1. ఈ ప్రక్క అనర్థం, మరొక ప్రక్క అర్థసంశయం ఉన్నది ఉభయతో నర్థార్థసంశయాపద. దానిలో ముందుగా అనర్థాన్ని తొలగించుకొని, అది (తొలగించడం) సిద్ధించిన తరవాత అర్థసంశయం విషయం చూచుకోవాలి.

2. దీనిచేత సమంతతోనర్థార్థసంశయాలు వ్యాఖ్యానింపబడినవి. ముందుగా సమతంతోనర్థాలు తొలగించుకొని తరవాత సమంతతోర్థసంశయాల విషయం చూచుకోవాలి అని అర్థం.

3. ఇటుప్రక్క అర్థం మరొకవైపు అనర్థసంశయం అనేది ఉభయతోర్థానర్థసంశయసంపద.

4. దీనిచేత సమంతతోర్థానర్థసంశయాలు వ్యాఖ్యానింపబడినట్లే.

5. ఉభయతోర్థానర్థసంశయాపదలో స్వామ్యమాత్యజనపదదుర్గకోశదణ్డమిత్రులనే ప్రకృతులలో పూర్వపూర్వప్రకృతిని (స్వామ్యమాత్యులకు అనర్థసంశయం కలిగినప్పుడు ముందు స్వామిని, తరవాత అమాత్యుని ఇత్యాదివిధంగా) అనర్థసంశయంనుంచి విడిపించడానికి ప్రయత్నించాలి. ఎందువల్ల ననగా మిత్రుడు అనర్థసంశయంలో ఉన్నా మంచిదే కాని దండం (సైన్యం) అనర్థసంశయంలో ఉండడం మంచిది కాదు. అట్లే దండకోశాలలో దండం అనర్థసంశయంలో ఉన్నా పరవా లేదు గాని కోశం అనర్థసంశయంలో ఉండడం మంచిది కాదు.

మూ. 1. సమగ్రమోక్షణాభావే ప్రకృతీనామవయవాన్ మోక్షయితుం యతేత. తత్ర పురుషప్రకృతీనాం చ బహులమనురక్తం వా తీక్ష్ణ లుబ్ధవర్జమ్. ద్రవ్యప్రకృతీనాం సారం మహోపకారం వా. సంధినా ఆసనేన ద్వైధీభావేన వా లఘూని, విపర్యయైః గురూణి.

2. క్షయస్థానవృద్ధీనాం చోత్తరోత్తరం లిప్సేత. ప్రాతిలోమ్యేన వా క్షయాదీనామ్. ఆయత్యాం విశేషం పశ్యేత్. ఇతి దేశావస్థాపనమ్.

వ్యా. 1. ప్రకృతులను అన్నింటినీ విడిపించడం శక్యం కాని పక్షంలో ఆ ప్రకృతుల కొన్ని అవయవాలను (భాగాలను) విడిపించడానికి ప్రయత్నించాలి. అందులో కూడ పురుషప్రకృతులలో అధికసంఖ్యలో ఉన్న వారిని గాని, అనురాగం గలవారిని గాని విడిపించాలి; అయితే తీక్ష్ణులను లుబ్ధులను విడిపించకూడదు. ద్రవ్యరూపప్రకృతులలో శ్రేష్ఠమైనదానిని గాని, చాల ఉపకారం చేసేదానిని గాని విడిపించాలి. లఘుద్రవ్యాలను సంధి, ఆసనం, ద్వైధీభావం అనే గుణాలు ప్రయోగించి విడిపించాలి. పెద్ద ద్రవ్యాలను పై గుణాలకు విపరీతమైన విగ్రహ-యాన-సమాశ్రయాలచేత విడిపించాలి.

2. క్షయ (శక్తిసిద్ధులు తరిగిపోవడం), స్థాన(వాటి సమత్వం) - వృద్ధులలో తరువాతి తరువాతిదానిని (క్షయంచేత స్థానాన్నీ దానిచేత వృద్ధినీ) పొందడంకోసం ప్రయత్నించాలి. లేదా క్షయాదుల ప్రాతిలోమ్యంచేత అనగా వృద్ధిచేత స్థానాన్ని, స్థానం చేత క్షయాన్నీ పొందగోరాలి. ఇలా చేయడంలో భవిష్యత్తులో విశేషం ఉంటుంది అనే

విషయం చూచుకోవాలి. ఈ విధంగా దేశనిమిత్తకములైన ఆపదల వ్యవస్థ చెప్పబడింది.

మూ. 1.ఏతేన యాత్రాదిమధ్యాన్తేషు అర్థానర్థసంశయానాముప సంప్రాప్తిర్వ్యాఖ్యాతా.

2. నిరన్తరయోగిత్వాచ్చార్థానర్థసంశయానాం యాత్రాదావర్థః శ్రేయా నుపసంప్రాప్తుం, పార్ష్ణిగ్రాహాసారప్రతిఘాతే క్షయవ్యయ ప్రవాసదేయమూల రక్షణేషు చ భవతి. తత్రానర్థః సంశయో వా స్వభూమిష్ఠస్య విషహ్యో భవతి.

3. ఏతేన యాత్రామధ్యే అర్థానర్థసంశయానాముపసంప్రాప్తిః వ్యాఖ్యాతా.

వ్యా. 1. దీనిచేత యాత్రయొక్క ఆది-మధ్య-అంతాలలో కలిగిన అర్థ-అనర్థ సంశయాలను గూర్చి వివరించినట్లే. వాటికి కూడ ఈ విధంగానే ప్రతిక్రియ చేసుకోవాలి అని అర్థం.

2. అర్థ-అనర్థ-సంశయాలు ఒకదాని తరవాత ఒకటి కలుగుతూనే ఉంటాయి. యుద్ధయాత్రాప్రారంభంలో అర్థం లభించడం మంచిది. దానివల్ల పార్ష్ణిగ్రాహుణ్ణి, అసారుణ్ణి (యాతవ్యుని మిత్రుణ్ణి) అడ్డుకొనడానికీ, క్షయ-వ్యయ-ప్రవాసాలయందు, యాతవ్యుని దగ్గరనుండి తీసికొనవలసిన భూమ్యాదికం విషయం లోను, మూలస్థానాన్ని రక్షించడానికీ ఉపకరిస్తుంది. యాత్రాదులలో తన రాజ్యంలో ఉన్నవానికి అనర్థం లేదా సంశయం సహించడానికి శక్యంగా ఉంటుంది.

3. దీనిచేత యాత్రామధ్యలో అర్థ-అనర్థ-సంశయాలు కలగడం విషయంలో కూడ వివరించినట్లే.

మూ. 1. యాత్రాన్తే తు కర్శనీయముచ్ఛేదనీయం వా కర్శయిత్వా ఉచ్ఛేదం వా అర్థః శ్రేయాన్ ఉపసంప్రాప్తుమ్, నానర్థః సంశయో వా, పరాబాధభయాత్.

2. సామవాయికానామపురోగస్య తు యాత్రామధ్యాన్తగోఽనర్థః సంశయో వా శ్రేయానుపసంప్రాప్తుమ్; అనిబన్ధగామిత్వాత్.

3. అర్థో ధర్మః కామః ఇతి అర్థత్రివర్గః, తస్య పూర్వః పూర్వః శ్రేయానుపసంప్రాప్తుమ్.

4. అనర్థః, అధర్మః, శోకః ఇత్యనర్థత్రివర్గః. తస్య పూర్వః పూర్వః శ్రేయాన్ ప్రతికర్తుమ్.

5. అర్థోఽనర్థ ఇతి, ధర్మోఽధర్మ ఇతి, కామః శోకః ఇతి సంశయత్రివర్గః. తస్యోత్తరపక్షసిద్ధౌ పూర్వపక్షః శ్రేయానుపసంప్రాప్తుమ్.

6. ఇతి కాలావస్థాపనమ్. ఇత్యాపదః.

వ్యా. 1. యాత్రాంతంలో కృశింపచేయదగినవానిని కృశింపచేసి గాని, నిర్మూలించ దగినవానిని నిర్మూలించి గాని అర్థాన్ని పొందడమే శ్రేయస్కరం. అనర్థం గాని, సంశయం గాని పొందడం మంచిది కాదు. ఎందువల్ల ననగా పరునివలన బాధ కలగవచ్చును.

2. సామవాయికులలో నాయకుడు కాని అప్రధానుడైనవానికి యాత్రామధ్యలో గాని యాత్రాంతంలో గాని, అనర్థం లేదా సంశయం వచ్చినా కూడ అది సామవాయికు లందరికీ చెందుతుంది గాన, మంచిదే.

3. అర్థం, ధర్మం, కామం అని ఇది అర్థత్రివర్గం, అనగా ఇది గ్రహించవలసిన మూడింటి సముదాయం. ఈ త్రివర్గంలో పూర్వపూర్వాన్ని సంపాదించడం మంచిది. అనగా కామం కంటె ధర్మం, ధర్మం కంటె అర్థం శ్రేయస్కరం.

4 అనర్థం, అధర్మం, శోకం అని ఇది అనర్థత్రివర్గం. దీనిలో పూర్వపూర్వానికి ప్రతిక్రియ చేయడం మంచిది.

5. అర్థమా అనర్థమా, ధర్మమా అధర్మమా, కామమా శోకమా అని ఇది సంశయత్రివర్గం. ఈ మూడింటిలోని ఉత్తర (రెండవ) పక్షానికి ప్రతిక్రియ చేసుకొని మొదటిదానిని సంపాదించడం మంచిది. అనగా అనర్థానికి ప్రతిక్రియ చేసుకొని అర్థాన్నీ, అధర్మానికి ప్రతిక్రియ చేసుకొని ధర్మాన్నీ, శోకానికి ప్రతిక్రియ చేసుకొని కామాన్నీ పొందడం శ్రేయస్కరం.

6. ఈ విధంగా యాత్రాది - మధ్య - అంతకాలాలలో కలిగే అర్థాదుల వ్యవస్థ చెప్పబడింది. ఇవి ఆపదలు.

మూ. 1. తాసాం సిద్ధిః:- పుత్రభ్రాతృబన్ధుషు సామదానాభ్యాం సిద్ధిరను రూపా, పౌరజానపదదణ్డముఖ్యేషు దానభేదాభ్యాం, సామన్తాటవికేషు భేదదణ్డాభ్యామ్.

2. ఏషానులోమా. విపర్యయే ప్రతిలోమా. మిత్రామిత్రేషు వ్యామిశ్రా సిద్ధిః. పరస్పరసాధకా హ్యుపాయాః.

3. శత్రోః శఙ్కితామాత్యేషు సాన్త్వం ప్రయుక్తం శేషప్రయోగం నివర్తయతి, దూష్యామాత్యేషు దానమ్. సంఘాతేషు భేదాః శక్తిమత్సు దణ్డ ఇతి.

4. గురులాఘవయోగాచ్చాపదాం నియోగవికల్పసముచ్చయా భవన్తి.

5. అనేనైవోపాయేన నాన్యేన ఇతి నియోగః.

6. అనేన వా అన్యేన వా ఇతి వికల్పః.

7. అనేన అన్యేన చేతి సముచ్చయః.

8. తేషామేకయోగాః చత్వారః, త్రియోగాశ్చ, ద్వియోగాః షట్. ఏకశ్చతుర్యోగ ఇతి పఞ్చదశోపాయాః. తావన్తః ప్రతిలోమాః.

వ్యా. 1. పైన చెప్పిన ఆపదలకు ప్రతిక్రియ ఎట్లనగా - పుత్రులు, సోదరులు, బంధువులు వీళ్ల విషయంలో సామదానాలచేత సిద్ధి (ప్రతిక్రియ చేసుకొనడం) అనురూపంగా ఉంటుంది. పౌరులు, జానపదులు, సైన్యాధికారులు వీళ్ల విషయంలో దానభేదాలచేత, సామంతుల విషయంలోను ఆటవికుల విషయంలోను భేదదండాల చేత సిద్ధి అనురూపంగా ఉంటుంది.

2. పుత్ర - పౌర - సామంతాదివిషయంలో పైన చెప్పిన విధంగా ఉపాయాల ప్రయోగం అనులోమమైనది (అనుకూలమైనది). ఇందుకు విరుద్ధంగా ప్రయోగిస్తే అది ప్రతిలోమం (ప్రతికూలం) అవుతుంది. మిత్ర - అమిత్రుల విషయంలో సిద్ధి సంకీర్ణంగా ఉంటుంది. అనగా ఒకప్పుడు కొన్ని ఉపాయాలు మరొకప్పుడు మరి కొన్ని ఉపాయాలు ప్రయోగించవలసి ఉంటుంది. ఎందువల్ల ననగా ఈ సామాద్యుపాయాలు ఒకదాని కొకటి సాధకాలుగా (ఉపకారకాలుగా) ఉంటాయి.

3. శత్రువుయొక్క శంకితామాత్యుల విషయంలో (శత్రువుకు వ్యతిరేకంగా ఉన్న అమాత్యుల విషయంలో) ప్రయోగించబడిన సామం మిగిలిన ఉపాయాల ప్రయోగాన్ని నివర్తింపచేస్తుంది. అనగా సామంచేతనే పని జరుగుతున్నప్పుడు ఇతరోపాయాల ప్రయోగం అనావశ్యకం అని అర్థం. శత్రువుయొక్క దూష్యామాత్యుల విషయంలో దానప్రయోగం ఇతరోపాయప్రయోగాన్ని నివర్తింపచేస్తుంది. సంఘాల

(unions)విషయంలో భేదోపాయప్రయోగం, శక్తిమంతుల విషయంలో దండోపాయ ప్రయోగం ఇతరోపాయప్రయోగాన్ని నివర్తింపచేస్తుంది.

4. ఆపదలు చాల పెద్దవి లేదా చాల తేలికైనవి అనేదానిని పట్టి (ఉపాయాల విషయంలో) నియోగవికల్పసముచ్చయాలు ఉంటాయి.

5. "ఈ ఉపాయంచేతనే సాధించాలి, మరొక ఉపాయంచేత కాదు" అన్నప్పుడు అది నియోగం.

6. "ఈ ఉపాయంచేత నైనా సాధించవచ్చు; ఆ ఉపాయంచేత నైనా సాధించవచ్చును" అన్నప్పుడు అది వికల్పం.

7. ఈ ఉపాయంచేత మరొక ఉపాయంచేతా కూడ సాధించాలి. అన్నప్పుడు అది సముచ్చయం.

8. వీటిలో ఒకే ఉపాయాన్ని ప్రయోగిస్తే నాలుగు భేదాలు, మూడేసి ఉపాయాలు ప్రయోగిస్తే కూడ నాలుగు భేదాలు, రెండేసి ఉపాయాలు ప్రయోగిస్తే ఆరు భేదాలు, నాలుగూకూడ ఉపయోగిస్తే ఒక ఉపాయం- ఈ విధంగా పదిహేను ఉపాయాలు, వీటిని ప్రతిలోమంగా ఉపయోగిస్తే కూడ అన్నే (15) ఉపాయాలు, నాలుగు ఉపాయాలలో ఒక్కొక్కదానిని మాత్రమే ఉపయోగించినప్పుడు ఒక్క సామం, ఒక్క దానం, ఒక్క భేదం, ఒక్క దండం అని నాలుగు భేదాలు. మూడింటిని ప్రయోగించినప్పుడు కూడ- సామదానభేదాలు, సామదానదండాలు, సామభేదదండాలు, దానభేదదండాలు అని నాలుగు భేదాలు. రెండేసి ప్రయోగించినప్పుడు సామదానాలు, సామభేదాలు, సామదండాలు, దానభేదాలు, దానదండాలు, భేదదండాలు అని ఆరు భేదాలు. నాల్గింటినీ ప్రయోగిస్తే అదొక భేదం. పైన చూపినవి అనులోమప్రయోగాలు, దండ-భేద-దాన-సామాలు ఒక్కొక్కటి చొప్పున నాలుగు. దండభేదదానాలు, దండభేద సామాలు, భేదదానసామాలు, దండదానసామాలు ఇవి నాలుగు. దండభేదాలు, దండదానాలు, దండసామాలు, భేదదానాలు, భేదసామాలు, దానసామాలు- ఇవి ఆరు. దండాదిచతుష్టయం ఒక మారు ప్రయోగిస్తే ఒక భేదం.

మూ. 1. తేషామేకేనోపాయేన సిద్ధిః ఏకసిద్ధిః. ద్వాభ్యాం ద్విసిద్ధిః, త్రిభిః త్రిసిద్ధిః. చతుర్భిః చతుఃసిద్ధిః ఇతి.

2. ధర్మమూలత్వాత్కామఫలత్వాచ్చార్థస్య ధర్మార్థకామానుబన్ధా యార్థస్య సిద్ధిః సా సర్వార్థసిద్ధిః, ఇతి సిద్ధయః.

3. దైవాదగ్నిరుదకమ్, వ్యాధిః, ప్రమాదో, విద్రవో, దుర్భిక్షమ్. ఆసుర సృష్టిః ఇత్యాపదః.

4. తాసాం దైవతబ్రాహ్మణప్రణిపాతతః సిద్ధిః.

వ్యా. 1. వాటిలో ఒక ఉపాయంచేత సాధించిన సిద్ధి ఏకసిద్ధి. రెండింటిచేత సాధించినది ద్విసిద్ధి. మూడింటిచేత సాధించినది త్రిసిద్ధి,నాల్గింటిచేత సాధించినది చతుఃసిద్ధి.

2. అర్థం ధర్మానికి మూలం; అర్థానికి ఫలం కామం. (అర్థం అర్థాన్ని సంపాదిస్తుంది అనే విషయం సర్వవిదితం). అందుచేత ఏ అర్థసిద్ధిని అనుసరించి ధర్మార్థకామాలు వస్తాయో అట్టి అర్థసిద్ధియే సర్వార్థసిద్ధి (సర్వప్రయోజనసిద్ధి), ఇవి సిద్ధులు.

3. దైవంవల్ల, అనగా పూర్వజన్మసంచితకర్మవల్ల, కలిగిన అగ్నిభయం, ఉదకభయం, వ్యాధులు, అంటువ్యాధులు, దేశోపద్రవం (రాష్ట్రం విడిచి పారిపోవడం), దుర్భిక్షం (కరువు), ఆసురసృష్టి (ఎలుకలు, పాములు, భూతపిశాచాదులు) ఇవి ఆపదలు.

4. దేవతలకు బ్రాహ్మణులకు నమస్కరిస్తే ఈ ఆపదలకు ప్రతిక్రియ జరుగుతుంది.

శ్లో. అవృష్టిరతివృష్టిర్వా సృష్టిర్వా యాసురీ భవేత్,
తాసామాథర్వణం కర్మ సిద్ధారమ్భాశ్చ సిద్ధయః.

ఇతి కౌటలీయార్థశాస్త్రే అభియాస్యత్కర్మణి నవమేఽధికరణే సప్తమోఽధ్యాయః అర్థానర్థసంశయయుక్తాః తాసాముపాయవికల్పజాః సిద్ధయశ్చ, ఆదితః ఆష్టావింశతిశతతమః.

ఏతావతా కౌటలీయస్యార్థశాస్త్రస్య అభియాస్యత్కర్మ నవమమధికరణం సమాప్తం.

వ్యా. అవృష్టి, అతివృష్టి, లేదా ఆసురసృష్టి- వీటి అన్నింటికీ అథర్వవేదోక్తమైన కర్మలు, తపఃసిద్ధులైన మహాత్ములు చేసే శాంతికర్మలు ప్రతిక్రియలు.

"బాలానందిని" అను కౌటలీయార్థశాస్త్రాంధ్రవ్యాఖ్యానంలో, అభియాస్యత్కర్మ అనే నవమాధికరణంలో అర్థానర్థసంశయయుక్తాపదలు, వాటికి ఉపాయవికల్పాలచేత చేయదగిన ప్రతిక్రియలు అనే సప్తమాధ్యాయం, ప్రారంభంనుండి నూట ఇరవైయెనిమిదవ అధ్యాయం సమాప్తం.

ఇంతటితో కౌటలీయార్థశాస్త్రంలోని అభియాస్యత్కర్మ అనే తొమ్మిదవ అధికరణం సమాప్తం.

## అథ సాంగ్రామికమ్ - దశమమధికరణమ్

## ప్రథమో ఒధ్యాయః

### సప్తచత్వారింశచ్ఛతతమం ప్రకరణమ్ - స్కన్ధావారనివేశః

(సేనానివేశం Setting up the camp)

మూ. వాస్తుకప్రశస్తే వాస్తుని నాయకవర్ధకిమౌహూర్తికాః స్కన్ధావారం వృత్తం, దీర్ఘం, చతురశ్రం వా, భూమివశేన వా చతుర్ద్వారం, షట్పథం, నవ సంస్థానం మాపయేయుః, ఖాతవప్రసాలద్వారాట్టాలకసంపన్నం భయే స్థానే చ.

వ్యా. సేనానాయకుడు, స్థపతి (గృహాదినిర్మాత), ముహూర్తజ్ఞుడైన జ్యోతిశ్శాస్త్రవేత్త, వాస్తుశాస్త్రంలో ప్రవీణుడైనవానిచేత ప్రశంసించబడిన ప్రదేశంలో వృత్తాకారంలో గాని, దీర్ఘాకారంలో గాని, చతురశ్రంగా గాని, ఆ భూమిని పట్టి మరొక ఆకారంలో గాని స్కంధావారం (యుద్ధభూమికి దగ్గరగా సేనను నిలిపే స్థానాన్ని) నిర్మింపచేయాలి. దానికి నాలుగు దిక్కులందు నాలుగు ద్వారాలు, తూర్పుపడమరలకు మూడు, దక్షిణోత్తరాలకి మూడు, మొత్తం ఆరు మార్గాలు, తొమ్మిది విభాగాలు ఉండాలి. శత్రుభయం ఉన్నప్పుడు లేదా చాలకాలం అక్కడ ఉండవలసి ఉంటుంది అనుకొన్నప్పుడు దాని చుట్టూ పరిఖ, వప్రం (ప్రాకారమూలం), ప్రాకారం, ద్వారాలు, బురుజులు కూడ ఏర్పరచాలి.

మూ. మధ్యమస్యోత్తరే నవభాగే రాజవాస్తుకం, ధనుఃశతాయామమర్ధ విస్తారం, పశ్చిమార్ధే తస్యాన్తఃపురమ్. అన్తర్వంశికసైన్యం చ అన్తే నివిశేత. పురస్తాదుపస్థానం, దక్షిణతః కోశశాసనకార్యకరణాని, వామతో రాజౌపవాహ్యానాం హస్త్యశ్వరథానాం స్థానమ్. అతో ధనుఃశతాన్తరాః చత్వారః శకటమేథీప్రతతిస్తమ్భసారపరిక్షేపాః. ప్రథమే పురస్తాన్మన్త్రిపురోహితౌ, దక్షిణతః కోష్ఠాగారం మహానసం చ. వామతః కుప్యాయుధాగారమ్. ద్వితీయే మౌలభృతానాం స్థానమ్ అశ్వరథానాం సేనాపతేశ్చ. తృతీయే హస్తినః, శ్రేణ్యః ప్రశాస్తా చ. చతుర్థే విష్టిర్నాయకః మిత్రామిత్రాటవీబలం స్వపురుషాధిష్ఠితమ్

వణిజో రూపాజీవాశ్చ అనుమహాపథమ్. బాహ్యతః లుబ్ధకశ్వగణినః సతూర్యాగ్నయః గూఢాశ్చారక్షాః.

వ్యా. ఆ వాస్తువుయొక్క (ప్రదేశంయొక్క) మధ్యమభాగానికి ఉత్తరంగా ఉన్న తొమ్మిదవ విభాగంలో నూరు ధనస్సుల పొడవు (దాదాపు రెండువందల గజాల పొడవు) దానిలో సగం వెడల్పు ఉన్న రాజవాస్తుకం (రాజనివాసస్థానం), దాని పశ్చిమార్ధభాగంలో రాజాంతఃపురం ఉండాలి. అంతఃపురాన్ని రక్షించే సైన్యం దాని దగ్గరనే విడిసి ఉండాలి.దానిముందు ఉపస్థానం (రాజదర్శనానికి వచ్చే వాళ్లను రాజు చూచే స్థానం), కుడి వైపున కోశం, శాసనాలు (ఆజ్ఞలు) ఇచ్చే స్థానాలు, కార్యాలు చేసే స్థానాలు ఉండాలి. ఎడమ వైపున రాజు స్వారీ చేసే ఏనుగులు, అశ్వాలు, రథాలు ఉండే స్థానం ఏర్పరచాలి. రాజు వాస్తుకం తరవాత ఒకదానికి ఒకదానికీ మధ్య నూరు ధనస్సుల వ్యవధానంతో బండ్లతోను, ముళ్లపొదలతోను, కఱ్ఱస్తంభాలతోను, ప్రాకారంతోను పరిక్షేపాలు (చుట్టూ ఆవరణలు enclosures) ఉండాలి. వాటిలో మొదటిదైన శకట పరిక్షేపంలో తూర్పున మంత్రిపురోహితులు, దక్షిణాన కోష్ఠాగారం, వంట ఇల్లూ, ఎడమ వైపున కుప్యాలు, ఆయుధాలు ఉంచే స్థానం ఉండాలి. రెండవదైన మేథీ ప్రతతిపరిక్షేపంలో మూలసైన్యాలు, భృతసైన్యాలు, అశ్వాలు, రథాలు, సేనాపతీ ఉండే స్థానం ఏర్పరచాలి. మూడవదైన స్తంభపరిక్షేపంలో గజాలు, శ్రేణిబలాలు, ప్రశాస్త (కంటకశోధనాధ్యక్షుడు) ఉండాలి.నాల్గవదైన ప్రాకారంలో కర్మకారుల సముదాయం, సేనానాయకుడు, తమ తమ నాయకుల పర్యవేక్షణలో ఉన్న మిత్రబలం, అమిత్రబలం, ఆటవికబలం ఉండాలి. వర్తకులు, వేశ్యలు మహాపథం వెంబడే ఉండాలి. అన్నింటికి బైట బోయవాళ్లు, కుక్కలను పెంచేవాళ్లు, శత్రువు రాకను సూచించడంకోసం తూర్యధ్వనులు చేసేవాళ్లు, మంటలచేత పొగలచేత శత్రువుల సూచనలు చేసేవాళ్లు, గొల్లవాళ్లు మొదలైన సాధారణుల వేషాలలో ఉండే ఆరక్షకులు (రక్షకభటులు) ఉండాలి.

మూ. 1. శత్రూణామాపాతే కూపకూటావపాతకణ్టకినీశ్చ స్థాపయేత్. అష్టాదశవర్గాణామారక్షవిపర్యాసం కారయేత్. దివాయామం చ కారయేత్ అపసర్పజ్ఞానార్థమ్.

2. వివాదసౌరికసమాజద్యూతవారణం చ కారయేత్ ముద్రారక్షణం చ.

3. సేనానివృతమ్ ఆయుధీయమశాసనం శూన్యపాలః అను బధ్నీయాత్.

వ్యా. 1. శత్రువులు వచ్చే మార్గంలో గడ్డి మొదలైనవాటితో కప్పిన నూతులు, గోతులు, ముళ్ల ఇనుపతీగలు లేదా ఇనుపమేకులు నాటిన బల్లలు ఉంచాలి. సైన్యంలోని పద్దెనిమిది విధాల వర్గాల ఆరక్షకులను మారుస్తూ ఉండాలి. (మౌల-భృతక-శ్రేణీ-మిత్ర-అమిత్ర-ఆటవీబలా లనే ఆరువిధాల సైన్యాలకు పదిక-సేనాపతి-నాయకు లనే మూడు విధాలైన అధికారులతో సంబంధంవల్ల పద్దెనిమిది విధాల సేనాసముదాయాలు ఏర్పడతాయి అని గ.శా.) పగటియందు కూడ జనుల సంచారం విషయంలో నిఘా వేసి ఉంచాలి. గూఢచారుల సంచారాన్ని తెలుసుకొనడం కోసం ఇది ఆవశ్యకం.

2. సైనికు లెవరూ ఒకరితో ఒకరు వాగ్వివాదానికి దిగడం, మద్యపానం చేయడం, జూదం ఆడడం ఇలాంటి వేమీ చేయకుండా నివారించాలి. మనుష్యుల రాకపోకలు రాజముద్రానుసారం జరిగే టట్లు చెయ్యాలి. ఎవరైనా లోపలికి వచ్చినా, బైటకు వెళ్ళినా రాజముద్ర ఉన్న అనుమతి పత్రం ఉండే టట్లు చూడాలి.

3. శాసనం (అనుమతిపత్రం) లేకుండా సేననుంచి తిరిగి వచ్చిన యోధుణ్ణి శూన్యపాలుడు నిర్బంధించాలి. రాజు స్కంధావారంలో ఉన్నప్పుడు ఆ రాజు లేని స్థానాన్ని రక్షిస్తూ ఉండేవాడు శూన్యపాలుడు.

శ్లో. పురస్తాదధ్వనః సమ్యక్ ప్రశాస్తా రక్షణాని చ,
**యాయాద్వర్ధకివిష్టిభ్యాముదకాని చ కారయేత్.**

ఇతి కౌటలీయార్థశాస్త్రే సాంగ్రామికే దశమేఽధికరణే ప్రథమోఽధ్యాయః
స్కన్ధావారనివేశః, ఆదితః ఏకోనత్రింశచ్ఛతతమః.

వ్యా. రాజు సపరివారంగా బయలుదేరక ముందు కంటకశోధనాధ్యక్షుడు స్థపతితోను, కర్మకరాధ్యక్షునితోను కలిసి వెళ్లి మార్గంలో కావలసిన రక్షణలు, నీటి సదుపాయాలు ఏర్పాటు చెయ్యాలి.

"బాలానందిని" అను కౌటలీయార్థశాస్త్రాంధ్రవ్యాఖ్యానంలో, సాంగ్రామికం అనే దశమాధికరణంలో స్కంధావారనివేశం అనే ప్రథమాధ్యాయం, ప్రారంభంనుంచి నూటఇరవైతొమ్మిదవ అధ్యాయం సమాప్తం.

# అథ ద్వితీయోఽధ్యాయః

## అష్టాచత్వారింశచ్ఛతతమం ప్రకణమ్ - స్కన్ధావార్ప్రయాణమ్

## ఏకోనపఞ్చాశచ్ఛతతమం ప్రకరణమ్ - బలవ్యసనావస్కన్దకాలరక్షణమ్

(బలవ్యసనాలనుండి, ఆక్రమణకాలాలనుండి సైన్యాన్ని రక్షించడం.)

మూ. 1. గ్రామారణ్యానామధ్వని నివేశాన్ యవసేన్ధనోదకవశేన పరిసంఖ్యాయ స్థానాసనగమనకాలం చ యాత్రాం యాయాత్. తత్ప్రతీకారద్విగుణం భక్తోపకరణం వాహయేత్. అశక్తో వా సైన్యేష్వాయోజయేత్. అన్తరేషు వా నిచినుయాత్.

2. పురస్తాన్నాయకః. మధ్యే కలత్రం స్వామీ చ, పార్శ్వయోరశ్వా బాహూత్సారః. చక్రాన్తేషు హస్తినః. ప్రసారవృద్ధిర్వా సర్వతః. వనాజీవః ప్రసారః. స్వదేశానన్వాయతిర్వీవధః. మిత్రబలమాసారః.కలత్రస్థానమపసారః. పశ్చాత్సేనాపతిః యాయాన్నివిశేత.

వ్యా. 1. గ్రామాలమీదుగాను అరణ్యాలమీదుగాను వెళ్లే మార్గంలో పశువుల ఆహారం, ఇంధనం (కట్టెలు) ఉదకం లభించడాన్ని పట్టి ఎక్కడ ఎంత కాలం నివేశం (మకాం) చేయవచ్చును అనే విషయాన్ని లెక్క చూచుకొని, స్థానానికి (నిలిచి ఉండడానికి camping) ఆసనానికి (నిరీక్షిస్తూ ఉండడానికి), గమనానికి అవసరమైన కాలం కూడ పరీక్షించి ముందుగానే లెక్క చూచుకొని యుద్ధయాత్రకు వెళ్లాలి. ఎంతకాలం పడుతుందో అంతకి సరిపడే దానికంటె రెట్టింపు ఆహారమూ ఇతర సామగ్రీ పట్టించుకొని వెళ్లాలి. ఇతరవాహనాదుల ద్వారా భక్తోపకరణాలు పట్టించుకొని వెళ్లడానికి కుదర నప్పుడు సైనికులచేతనే వాటిని మోయించుకొని వెళ్లాలి. లేదా మధ్య మధ్య నివాసం చేసే చోట్ల ముందుగానే వాటిని చేర్చి ఉంచుకోవాలి.

2. నాయకుడు (సేనానాయకుడు) ముందు, మధ్య రాజు, అంతఃపురాదికము, సైన్యం ఇరుప్రక్కలా శత్రుసైన్యాగమనాన్ని బాహువులచేత గెంటివేసి నట్లు గెంటివేయగలిగిన అశ్వసైన్యం, సేన చివరిభాగాన ఏనుగులు వెళ్లాలి. అన్ని వైపులా ప్రసారం అతిసమృద్ధిగా ఉండాలి. వనంలో లభించే ధాన్యతృణాదికమైన జీవనాధారద్రవ్యం

"ప్రసారం", స్వదేశంనుంచి అవిచ్ఛిన్నంగా ఆజీవద్రవ్యాల రాక (supply) "వీవధం". మిత్రసైన్యం "ఆసారం". కలత్రస్థానం (అంతఃపురం) "అపసారం". గజసైన్యానికి కూడ వెనుక సేనాపతి నడవాలి; నివేశం (మధ్య మధ్య మకాం) చేస్తూండాలి.

మూ. 1. పురస్తాద్ అభ్యాఘాతే మకరేణ యాయాత్, పశ్చాత్ శకటేన. పార్శ్వయోః వజ్రేణ; సమన్తతః సర్వతోభద్రేణ. ఏకాయనే సూచ్యా.

2. పథి ద్వైధీభావే స్వభూమిగతో యాయాత్. అభూమిష్ఠానాం హి స్వభూమిష్ఠాః యుద్ధే ప్రతిలోమా భవన్తి. యోజనమధమా. అధ్యర్ధం మధ్యమా ద్వియోజనముత్తమా సంభావ్యా వా గతిః.

3. ఆశ్రయకారీ, సంపన్నఘాతీ, పార్ష్ణిః, ఆసారః, మధ్యమః, ఉదాసీనో వా ప్రతికర్తవ్యః, సంకటో మార్గః శోధయితవ్యః, కోశో దణ్డో మిత్రామిత్రాటవీబలం, విష్టిః, ఋతుర్వా ప్రతీక్ష్యాః; కృతదుర్గకర్మనిచయరక్షా క్షయః క్రీతబలనిర్వేదః, మిత్రబలనిర్వేదశ్చ ఆగమిష్యతి, ఉపజపితారో వా నాతిత్వరయన్తి, శత్రురభిప్రాయం వా పూరయిష్యతి ఇతి శనైర్యాయాత్. విపర్యయే శీఘ్రమ్.

వ్యా. 1. ఎదుటినుండి శత్రువు ఆక్రమించే భయం ఉన్నప్పుడు మకరవ్యూహంలో ప్రయాణం చెయ్యాలి. వెనుకనుండి ఆక్రమణం జరుగుతుం దనే భయం ఉన్నప్పుడు శకటవ్యూహంలోను, పార్శ్వాలనుండి ఆక్రమణభయం ఉన్నప్పుడు వజ్రవ్యూహంలోను, నలువైపులనుండి ఆక్రమణభయం ఉన్నప్పుడు సర్వతోభద్రవ్యూహంలోను, ఒక్కొక్కళ్లు మాత్రమే వెళ్లడానికి వీలైన మార్గంలో సూచీవ్యూహంలోను ప్రయాణం చెయ్యాలి.

2. రెండు మార్గాలలో వెళ్లడానికి అవకాశం ఉన్నప్పుడు స్వభూమిమీద, అనగా తనకు అనుకూలమైన మార్గాన, యానం చెయ్యాలి. స్వభూమిలో ఉన్నవాళ్లు ఆ భూమిలో ఉన్నవాళ్లకు (అనుకూలంగా లేని భూమిమీద ఉన్నవాళ్లకు) ప్రతికూలులు అవుతారు, అనగా వాళ్లని అనాయాసంగా ఎదుర్కొనకలుగుతారు. రోజుకు ఒక యోజనం ప్రయాణిస్తే అది అధమగతి (కనీసపు గమనం). ఒకటిన్నరయోజనాలు ప్రయాణిస్తే మధ్యమగతి. రెండుయోజనాలు ప్రయాణిస్తే అది ఉత్తమగతి. లేదా దేశకాలాదులను పట్టి వీలైనంతదూరం ప్రయాణం చెయ్యాలి.

3. శత్రువుకు ఆశ్రయం ఇచ్చేవాడు లేదా సంపన్నమైన తన భూమిని నశింపచేసేవాడు అయిన పార్ష్ణిగాని, ఆసారుడు గాని, మధ్యముడు గాని, ఉదాసీనుడు

గాని ఆక్రమణం చేయకుండా ప్రతిక్రియ చేసుకొనవలసి ఉన్నప్పుడు, కష్టమైన మార్గాన్ని శోధించవలసి ఉన్నప్పుడు, కోశదండాలు, మిత్రబల-అమిత్రబల-ఆటవీబలాలు, కర్మకారులు వచ్చేవరకు, తగిన ఋతువు వచ్చేవరకు నిరీక్షించవలసి ఉన్నప్పుడు, శత్రువు చేసికొని ఉన్న దుర్గసంస్కారకర్మ, ధాన్యాదుల సంచయం (కూడబెట్టుకొనడం) రక్షణవిధానం ఇవి అచిరకాలంలో క్షీణిస్తాయి, వాని క్రీతబల (కొన్నసైన్యం) నిర్వేదం (నిరుత్సాహం) మిత్రబలనిర్వేదం కలగబోతున్నాయి అనుకొన్నప్పుడు, శత్రురాజ్యంలో కోపం కలిగించడానికి తనచేత పంపబడిన ఉపజాపకులు తొందరచేయనప్పుడు, శత్రువు నా అభిప్రాయాన్ని పూరిస్తాడు అనుకొన్నప్పుడు మెల్లగా వెళ్లాలి. ఇందుకు విరుద్ధమైన పరిస్థితులలో శీఘ్రంగా ప్రయాణం చెయ్యాలి.

మూ. 1. హస్తిస్తమ్భసంక్రమసేతుబన్ధనౌకాష్ఠవేణుసంఘాతైః, అలాబు చర్మకణ్డదృతిప్లవగణ్డికావేణికాభిశ్చ ఉదకాని తారయేత్.

2. తీర్థాభిగ్రహే హస్త్యశ్వైః అన్యతః రాత్రావుత్తార్య సత్రం గృహ్ణీయాత్.

3. అనుదకే చక్రిచతుష్పదం చాధ్వప్రమాణేన శక్త్యా ఉదకం వాహయేత్.

వ్యా. 1. ఏనుగులచేత, స్తంభాలమీద కట్టిన వంతెనలచేత, సేతుబంధాలచేత, నావలచేత, దగ్గరగా చేర్చికట్టిన కట్టెలు, వెదుళ్లు వీటిచేత, ఎండిన ఆనపకాయలచేత, చర్మతో చేసిన పాత్రలచేత, తిత్తులచేత, తెప్పలచేత, ఈతకు సహాయపడే కఱ్ఱలచేత, త్రాళ్లచేత సైనికులను ఉదకం (నది) దాటించాలి.

2. తీర్థాలను (నదులలోనికి దిగే స్థానాలను) శత్రువు అడ్డుకుంటా డనే సందేహం ఉన్నప్పుడు రాత్రి మరొక ప్రదేశంలో ఏనుగుల సహాయంచేత అశ్వాల సహాయంచేత నదిని దాటి సత్రం గ్రహించాలి (పొంచి ఉండాలి lay ambush).

3. ఉదకం లభించని ప్రదేశంలో బళ్లమీదా, ఎద్దులు మొదలైన చతుష్పాజ్జంతువుల మీదా, మార్గం దూరాన్ని, వాటి శక్తినీ పట్టి నీరు మోయించుకొని వెళ్లాలి.

మూ. 1. దీర్ఘకాన్తారమనుదకం, యవసేన్ధనోదకహీనం వా కృచ్ఛ్రాధ్వానమ్ అభియోగప్రస్కన్నం, క్షుత్పిపాసాధ్వక్లాన్తం, పఙ్కతోయగభీరాణాం వా నదదరీశైలానాముద్యానాపయానే వ్యాసక్తం ఏకాయనమార్గే శైలవిషమే సంకటే వా బహులీభూతం, నివేశే ప్రస్థితే విసన్నాహం, భోజనవ్యాసక్తమ్,

ఆయతగతపరిశ్రాన్తమ్,అవసుప్తం, వ్యాధిమరకదుర్భిక్షపీడితం, వ్యాధితపత్త్యశ్వ ద్విపమ్, అభూమిష్ఠం వా, బలవ్యసనేషు వా స్వసైన్యం రక్షేత్. పరసైన్యం చాభిహన్యాత్.

2. ఏకాయనమార్గప్రయాతస్య సేనానిశ్చారగ్రాసాహారశయ్యాప్రస్తారాగ్ని నిధానధ్వజాయుధసంఖ్యానేన పరబలజ్ఞానమ్. తదాత్మనో గూహయేత్.

వ్యా. 1. దీర్ఘమైన ఉదకంలేని అడవి దాటవలసి ఉన్నది, యవసం ఇంధనం ఉదకం లేనిది, కష్టమైన మార్గంలో ఉన్నది, ఆక్రమణంచేత చిందరవందర యైనది, ఆకలిదప్పులచేత దీర్ఘప్రయాణంచేత అలసిపోయినది, లోతైన బురదనీరు ఉన్న ప్రదేశాలను గాని, నదులను లోయలను పర్వతాలను ఎక్కడంలోను దిగడంలోను వ్యగ్రమై ఉన్నది, ఒక్కొక్కరే వెళ్లవలసిన మార్గంలో గాని, పర్వతాలచేత విషమంగా ఉన్న మార్గంలో గాని, ఇరుకైన మార్గంలో గాని అధికసంఖ్యలో చేరి ఉన్నది, సేనానివేశం ముందుకు కదలి నప్పుడు శస్త్రావరణాదులు ధరించి సిద్ధంగా లేనిది, భోజనం చేయడంలో లగ్నమై ఉన్నది, దీర్ఘగమనంచేత అలసిపోయినది. నిద్రిస్తున్నది, వ్యాధులచేత, మారకవ్యాధులచేత (అంటురోగాలచేత), దుర్భిక్షంచేత పీడించబడినది, జబ్బుపడిన కాలిబంట్లు, ఏనుగులు, గుఱ్ఱాలు గలది, అనుకూలం కాని భూమిలో ఉన్నది అయిన తన సైన్యాన్ని పైన చెప్పిన బలవ్యసనాలలో రక్షించుకోవాలి. శత్రుసైన్యం ఇలాంటి బలవ్యసనాలలో ఉన్నప్పుడు దానిని నశింపచెయ్యాలి.

2. ఏకాయనమార్గం (ఒక్క వరస మాత్రమే రావడానికి వీలుగా ఉండే మార్గం)లో శత్రువు బయలుదేరి వస్తున్నప్పుడు వాని సేన ఎంత వస్తున్నదో, గ్రాసం (గజాదుల ఆహారం), ఆహారం (సైనికుల ఆహారం), శయనించే ఆస్తరణలు, వంటసామగ్రి, ధ్వజాలు, ఆయుధాలు ఎన్ని వస్తున్నాయో లెక్కపెట్టి ఆ శత్రుబలాన్ని గూర్చి తెలుసుకోవాలి. తన సైన్యానికి సంబంధించిన ఆ విషయా లన్నీ రహస్యంగా ఉంచుకోవాలి.

శ్లో. పార్వతం వనదుర్గం వా సాపసారప్రతిగ్రహమ్,
స్వభూమౌ పృష్ఠతః కృత్వా యుధ్యేత నివిశేత చ.

ఇతి కౌటలీయార్థశాస్త్రే సాంగ్రామికే దశమాధికరణే
ద్వితీయోఽధ్యాయః,స్కన్ధావారప్రయాణం బలవ్యసనావస్కన్దరక్షణం చ,
ఆదితస్త్రింశచ్ఛతతమః.

వ్యా. అపసారం (పారిపోయే మార్గం), ప్రతిగ్రహం (సైనికవ్యాయామానికి తగిన స్థానం) ఉన్న పార్వతదుర్గాన్ని గాని, వనదుర్గాన్ని గాని, వెనుక సిద్ధంగా ఉంచుకొని, అనుకూలమైన భూమిలో నిలిచి యుద్ధం చెయ్యాలి. సేనానివేశం ఏర్పరచుకోవాలి.

"బాలానందిని" అను కౌటలీయార్థశాస్త్రాంధ్రవ్యాఖ్యానంలో సాంగ్రామికం అనే దశమాధికరణంలో, స్కంధావారప్రయాణం, బలవ్యసనావస్కందనకాలరక్షణం అనే రెండవ అధ్యాయం, ప్రారంభంనుంచి నూటముప్పయవ అధ్యాయం సమాప్తం.

# అథ తృతీయో ఽధ్యాయః

## పఞ్చాశచ్ఛతతమం ప్రకరణమ్ - కూటయుద్ధవికల్పాః

## ఏకపఞ్చాశచ్ఛతతమం ప్రకరణమ్ - స్వసైన్యోత్సాహనమ్

## ద్విపఞ్చాశచ్ఛతతమం ప్రకరణమ్ - స్వబలాన్యబలవ్యాయోగః

(శత్రుసైన్యాన్ని ఎదిరించడానికి తన సైన్యం నింపడం)

మూ. 1. బలవిశిష్టః కృతోపజాపః ప్రతివిహితర్తుః స్వభూమ్యాం ప్రకాశయుద్ధమ్ ఉపేయాత్. విపర్యయే కూటయుద్ధమ్.

2. బలవ్యసనావస్కన్దకాలేషు పరమభిహన్యాత్. అభూమిష్ఠం వా స్వభూమిష్ఠః. ప్రకృతిప్రగ్రహో వా స్వభూమిష్ఠమ్. దూష్యామిత్రాటవీబలైర్వా భఙ్గం దత్త్వా విభూమిప్రాప్తం హన్యాత్. సంహతానీకం హస్తిభిర్భేదయేత్.

3. పూర్వం భఙ్గప్రదానేన అనుప్రలీనం భిన్నమభిన్నం ప్రతినివృత్య హన్యాత్. పురస్తాదభిహత్య ప్రచలం విముఖం వా పృష్ఠతః హస్త్యశ్వేనాభి హన్యాత్. పృష్ఠతః అభిహత్య ప్రచలం విముఖం వా పురస్తాత్ సారబలేనాభిహన్యాత్.

4. తాభ్యాం పార్శ్వాభిఘాతౌ వ్యాఖ్యాతౌ యతో వా దూష్యఫల్గుబలం తతో ఽభిహన్యాత్.

వ్యా. 1. సైన్యంచేత శత్రువుకంటె ఆధిక్యంతో ఉన్నవాడు, శత్రువు విషయంలో

చేయబడిన ఉపజాపం కలవాడు, యుద్ధానికి తగిన ఋతువు (కాలం) కలవాడు అయిన విజిగీషువు స్వభూమిలో (అనుకూలమైన భూమిలో) ప్రకాశయుద్ధం చెయ్యాలి. అట్టి పరిస్థితులలో లేనివాడు కపటయుద్ధం చెయ్యాలి.

2. శత్రుసైన్యాలు వ్యసనాలలో ఉన్నప్పుడు, ఆక్రమణానికి తగిన కాలాలలో శత్రువును కొట్టాలి. స్వభూమిలో ఉన్నవాడు ఆ భూమియందు (అనుకూలం కాని భూమియందు) ఉన్నవానిని కొట్టాలి. శత్రువు స్వభూమియందు ఉన్నాకూడ తన ప్రకృతులు వశంలో ఉన్నవాడు ఆ శత్రువును కొట్టాలి. లేదా దూష్యబలాలచేత అమిత్రబలాలచేత, అటవీబలాలచేత ఓడించబడి నట్లు అభినయించి, తరవాత శత్రువు అనువుకాని భూమిలో ఉన్నప్పుడు వానిని చంపివేయాలి. శత్రువు తన సైన్యాన్ని అంతనీ ఒక చోట చేర్చికొని ఉన్నప్పుడు ఆ సైన్యాన్ని ఏనుగులచేత ఛిన్నాభిన్నం అయే టట్లు చెయ్యాలి.

3. ముందు భగ్నమైపోవడంచేత చెదిరిపోయి అణగి ఉన్న శత్రుసైన్యాన్ని విజిగీషుసైన్యం ఒక్కుమ్మడిగా తిరిగివచ్చి చంపివేయాలి. ముందునుంచి శత్రుబలాన్ని ఆక్రమించి, అది వెనుదిరిగి విముఖమై వెళ్లి పోతున్నప్పుడు వెనుకనుంచి గజబలంచేత అశ్వబలంచేత దానిని చంపివేయాలి. దానిని వెనుక నుండి కొట్టి, అది విముఖమై కదలి వెళ్లిపోతున్నప్పుడు దానిని ముందునుంచి శ్రేష్ఠమైన బలంచేత చంపివేయాలి.

4. వీటిచేత ప్రక్కలనుండి ఆక్రమించే పద్ధతికూడ వ్యాఖ్యానించబడి నట్లే. శత్రువు యొక్క అల్పమైన దూష్యబలం ఎటు వైపు ఉంటుందో అటువైపునుండి చంపాలి.

మూ. 1. పురస్తాద్విషమాయాం పృష్ఠతోఽభిహన్యాత్. పృష్ఠతో విషమాయాం పురస్తాదభిహన్యాత్. పార్శ్వతో విషమాయామ్ ఇతరతోఽభిహన్యాత్.

2. దూష్యామిత్రాటవీబలై ర్వా పూర్వం యోధయిత్వా శ్రాన్తమశ్రాన్తః పరమభిహన్యాత్. దూష్యబలేన వా స్వయం భఙ్గం దత్త్వా జితమితి విశ్వస్తమ్ అవిశ్వస్తః సత్త్రాపాశ్రయః అభిహన్యాత్. సార్థవ్రజస్కన్ధావారసంవాహవిలోపప్రమత్తమ్ అప్రమత్తోఽభిహన్యాత్. ఫల్గుబలావచ్ఛన్నః సారబలో వా పరవీరాననుప్రవిశ్య హన్యాత్. గోగ్రహణేన శ్వాపదవధేన వా పరవీరా నాకృష్య సత్త్రచ్ఛన్నో ఽభిహన్యాత్.

వ్యా. 1. ఎదుట నున్న భూమి విషమంగా (ఎగుడు దిగుడుగా) ఉన్నప్పుడు వెనకనుంచి కొట్టాలి. వెనక ఉన్న భూమి విషమంగా ఉన్నప్పుడు ముందునుంచి కొట్టాలి. ఒక ప్రక్క భూమి విషమంగా ఉన్నప్పుడు రెండవ ప్రక్కనుంచి కొట్టాలి.

2. ముందుగా శత్రువును దూష్యబలాలతోను, ఆటవికబలాలతోను యుద్ధం చేయించి తాను అలసిపోకుండా ఉంటూ, అలసిపోయిన ఆ శత్రువును చంపాలి. ముందుగా తన దూష్యబలాన్ని యుద్ధం చేయించి అది ఓడిపోయేటట్లు చేసి, "జయించాను" అని విశ్వాసంతో ఉన్న శత్రువును తాను మాత్రం విశ్వసించకుండా జాగరూకుడై ఉంటూ సత్రాన్ని అవలంబించి చంపివేయాలి. (సత్రం అనగా ఏమో ముందు చెప్పనున్నాడు). లేదా శత్రువు వర్తకసంఘాన్ని, వ్రజాన్ని (పశుసంఘాన్ని) స్కంధావారాన్ని, రవాణాలను దోచుకుంటూ ప్రమత్తుడుగా ఉన్నప్పుడు తాను అప్రమత్తుడుగా ఉంటూ వానిని నశింపచేయాలి. లేదా శ్రేష్ఠమైన సైన్యంతో కూడినవాడై, పైకి మాత్రం నిస్సారమైన సైన్యం ఉన్నట్లు కనబడుతూ శత్రువీరుల మధ్య ప్రవేశించి వాళ్లను చంపాలి, లేదా పరవీరులను గోవులను అపహరించడంచేత గాని, క్రూరమృగాలను చంపడంచేత గాని శత్రువీరుల దృష్టి మరొక వైపు మరల్చి సత్రంచేత రహస్యంగా ఉంటూ (concealed in an ambush)వాళ్లను చంపాలి.

మూ. 1. రాత్రావవస్కన్దేన జాగరయిత్వా నిద్రాక్లాన్తాన్, అవసుప్తాన్ వా దివా హన్యాత్. సపాదచర్మకోశైర్వా హస్తిభిః సౌప్తికం దద్యాత్. అహఃసన్నాహ పరిశ్రాన్తాన్ అపరాహ్ణేఽభిహన్యాత్. శుష్కచర్మవృత్తశర్కరాకోశైః గోమహిషోష్ట్ర యూథైర్వా త్రస్నుభిః అకృతహస్త్యశ్వం భిన్నమభిన్నః ప్రతినివృత్తం హన్యాత్. ప్రతిసూర్యవాతం వా సర్వమభిహన్యాత్.

2. ధాన్వనవనసంకటపఙ్కశైలవిషమనావః గావః శకటవ్యూహో నీహారో రాత్రిరితి సత్రాణి.

3. పూర్వే చ ప్రహరణకాలాః కూటయుద్ధహేతవః.

వ్యా. 1. లేదా రాత్రి ఆక్రమించడం ద్వారా సైనికులను మెలకువగా ఉండేటట్లు చేసి నిద్ర లేకపోవడంచేత అలసిపోయి నిద్రపోతున్న వాళ్లను పగలు చంపివేయాలి. లేదా పాదాలకి చర్మకోశాలు (చర్మతో చేసిన సంచులు) కట్టిన ఏనుగులచేత సౌప్తికం

(నిద్రపోతున్నవాళ్లని చంపించడం) చెయ్యాలి. పగలు సంనద్ధం అవడంచేత అలసిపోయిన వాళ్లని అపరాహ్ణంలో (సాయంకాలానికి కొంచెం ముందు) చంపివేయాలి. లేదా ఎండిపోయిన చర్మతో తయారుచేసిన సంచులలో గులకరాళ్లు పోసి ఆ సంచులు ఎద్దులు, దున్నపోతులు వీటిగుంపులకు కట్టి వాటిని శత్రుసైన్యంమీదికి వదలగా, ఆ చప్పుడుకు అవి భయపడి అటూ ఇటూ పరుగెత్తి శత్రుసైన్యంలో ఉన్న ఏనుగులూ గుఱ్ఱాలూ చెల్లాచెదరైపోయే టట్లు చేస్తాయి. దానితో చెల్లాచెదరైన సైన్యంకూడ మెల్లగా కూడగట్టుకొని కలిసి వచ్చి నప్పుడు తాను మాత్రం చెదిరిపోకుండా ఉండి ఆ సైన్యాన్ని చంపాలి. లేదా శత్రువులు సూర్యునికి గాలికి ఎదురుగా ఉన్నప్పుడు వాళ్లను చంపివేయాలి.

2. మరుదుర్గం, వనదుర్గం, ప్రవేశించడానికి శక్యంకాని ఇరుకైన ప్రదేశం, బురదతో నిండిన ప్రదేశం, కొండలు, గోతులు, ఎగుడుదిగుడు ప్రదేశాలు; పడవలు, ఎద్దులు, శకటవ్యూహం, పొగమంచు, రాత్రి-ఇవి సత్రాలు,

3. పైన చెప్పిన యుద్ధకాలాలు కూటయుద్ధం చేయడానికి తగిన కారణాలు.

మూ. 1. సంగ్రామస్తు నిర్దిష్టదేశకాలో ధర్మిష్ఠః.

2. సంహత్య దణ్డం బ్రూయత్- "తుల్యవేతనోఽస్మి భవద్భిః సహ భోగ్యమిదం రాజ్యమ్; మయాభిహితః పరోఽభిహన్తవ్యః" ఇతి. "వేదేష్వప్యనుశ్రూయతే సమాప్తదక్షిణానాం యజ్ఞానామవభృథేషు-"సా తే గతిర్యా శూరాణామ్" ఇతి. అపీహ శ్లోకౌ భవతః-

శ్లో. "యాన్ యజ్ఞసంఘైస్తపసా చ విప్రాస్స్వర్గైషిణః పాత్రచయైశ్చ యాన్తి,
క్షణేన తానప్యతియాన్తి శూరాః ప్రాణాన్ సుయుద్ధేషు పరిత్యజన్తః."

శ్లో. నవం శరావం సలిలస్య పూర్ణం సుసంస్కృతం దర్భకృతోత్తరీయమ్,
తత్తస్య మా భూన్నరకం చ గచ్ఛేద్యో భర్తృపిణ్డస్య కృతే న యుధ్యేత్.

ఇతి మన్త్రిపురోహితాభ్యాముత్సాహయేద్యోధాన్.

వ్యా. 1. సంగ్రామం మాత్రం ఏ ప్రదేశంలో, ఏ సమయంలో జరగాలో నిర్దేశింపబడి ధర్మసమ్మతమై ఉంటుంది.

2. ఒక చోట చేరి ఉన్న సైన్యంతో రాజు "నేను కూడా మీవలెనే జీతం తీసుకుంటున్నవాడనే. ఈ రాజ్యాన్ని నేను మీతో కలిసి అనుభవించాలి. నేను ఏ శత్రువును చంప మంటే ఆ శత్రువును మీరు చంపాలి." అని చెప్పాలి. రాజు తాను సైనికులను పైన చెప్పిన విధంగా ప్రోత్సహించి మంత్రిపురోహితులచేత కూడ ఈ మాటలతో ప్రోత్సహింపచెయ్యాలి- "ఇవ్వవలసిన దక్షిణలన్నీ ఇచ్చివేసి యజ్ఞాలు పూర్తిచేసి అవభృథస్నానం (యజ్ఞదీక్ష మొదలైన దీక్షల చివర చేసిన స్నానం "అవభృథ స్నానం") చేసే సమయంలో చదివే వేదమంత్రంలో "యుద్ధంలో ప్రాణాలు పరిత్యజించే శూరులకు ఏ సద్గతి కలుగుతుందో అలాంటి సద్గతియే నీకు కూడ కలుగుగాక" అని చెప్పబడింది. ఈ విషయమే ప్రతిపాదించే రెండు శ్లోకాలు కూడ ప్రసిద్ధంగా ఉన్నాయి- "స్వర్గం కావాలని కోరుకునే బ్రాహ్మణులు అనేకయజ్ఞాలచేత, తపస్సుచేత, సత్పాత్రల కిచ్చిన దానాలచేత ఏ లోకాలకు వెడతారో ఆ లోకాలకంటె కూడ ఉత్కృష్టమైన లోకాలకు యుద్ధంలో ప్రాణపరిత్యాగం చేసే శూరులు వెడతారు".

"ప్రభువు పెట్టిన అన్నం తిన్నందుకు ఎవడు యుద్ధం చేయడో అతనికి నీటితో నింపి, పైన దర్భలు కప్పి సంస్కరించిన క్రొత్త కుండమూకుడు లభించదు. (అనగా మరణానంతరం వానికి శ్రాద్ధంలో ఈ విధమైన మూకుడు లభించదు; వాని కివ్వకూడదు అని అర్థం). అతడునరకానికి కూడ వెడతాడు".

ఈ రెండవ శ్లోకం భాసుని ప్రతిజ్ఞాయౌగంధరాయణంలో కూడ ఉంది. "అపీహ శ్లోకౌ భవతః" మొదలు "ఉత్సాహయేద్యోధాన్"వరకు ఉన్న భాగం ప్రక్షిప్తం అయి ఉంటుంది. పాఠకుడు పుస్తకం మార్జిన్‌లో వ్రాసుకున్న విషయం కూడ తరవాతివాళ్లు గ్రంథలో చేర్చివేసి ఉంటారు అని కాంగ్లే అభిప్రాయం.

మూ. 1. వ్యూహసంపదా కార్తాన్తికాదిభిశ్చాస్య వర్గః సర్వజ్ఞదైవసంయోగ ఖ్యాపనాభ్యాం స్వపక్షముద్ధర్షయేత్. పరపక్షం చోద్వేజయేత్. శ్వః యుద్ధమ్ ఇతి కృతోపవాసః శస్త్రవాహనం చానుశయీత. అథర్వభిశ్చ జుహుయాత్. విజయయుక్తాః స్వర్గీయాశ్చ ఆశిషః వాచయేత్. బ్రాహ్మణేభ్యశ్చాత్మాన మతిసృజేత్.

2. శౌర్యశిల్పాభిజనానురాగయుక్తమ్, అర్థమానాభ్యామవిసంవాది తమ్ అనీకగర్భం కుర్వీత. పితృపుత్రభ్రాతృకాణామ్ ఆయుధీయానామ్

అధ్వజం ముణ్డానీకం రాజస్థానం హస్తీ రథో వా రాజవాహనమశ్వానుబన్ధే. యత్ప్రాయః సైన్యో యత్ర వా వినీతః స్యాత్ తదధిరోహయేత్. రాజవ్యఞ్జనో వ్యూహాధిష్ఠానమాయోజ్యః.

3. సూతమాగధాః శూరాణాం స్వర్గమ్, అస్వర్గం భీరూణాం, జాతిసంఘకులకర్మవృత్తస్తవం చ యోధానాం వర్ణయేయుః. పురోహితపురుషాః కృత్యాభిచారం బ్రూయుః. సత్రివర్ధకిమౌహూర్తికాః స్వకర్మసిద్ధిమ్, అసిద్ధిం పరేషామ్.

వ్యా. 1. రాజుకు సంబంధించిన జ్యోతిషికులు మొదలైనవాళ్ల సముదాయం రాజు చేసిన వ్యూహరచన చాల మంచి దని, తమకు అన్నీ తెలుసును, దేవతల సాక్షాత్కారం కూడ ఉంది అని చెపుతూ తన పక్షంవాళ్లని ప్రోత్సహించాలి; శత్రుపక్షం వాళ్లకి భయం పుట్టించాలి. "రేపే యుద్ధం ప్రారంభం" అని చెప్పి రాజు ఉపవాసదీక్ష వహించి ఆయుధాల ప్రక్కన, వాహనాల ప్రక్కన శయనించాలి. అథర్వమంత్రాలతో హోమాలు చెయ్యాలి. విజయం ఘోషించేవి, స్వర్గాన్ని చూపించేవి అయిన ఆశీర్వాదాలు చదివించాలి. రాజు తన రక్షణకోసం తనను తాను బ్రాహ్మణులకు అప్పగించాలి. అనగా స్వరక్షణ కోసం హోమాదులు శ్రద్ధగా చేయించాలి.

2. శౌర్యం, శిల్పం, ఉత్తమవంశం, అనురాగం ఇవన్నీ ఉన్నది, ధనంచేత సంమానంచేత తనకు అనుకూలంగా ఉండేది అయిన సైన్యాన్ని సేనామధ్యంలో రాజరక్షణం కోసం ఉంచాలి. పరస్పరం తండ్రులు, పుత్రులు, సోదరులు అయిన యోధు లున్న, రాజచిహ్నా లేవీ లేని (అనగా రాజు అక్కడ ఉన్నాడు అని గుర్తించడానికి తగిన ధ్వజాదులు ఏవీ లేని) ముండానీకం (బోడిసేన=గుర్తులేవీ లేని సేన) రాజు ఉండవలసిన స్థానం. ఏనుగు గాని రథం గాని రాజుకు వాహనంగా ఉండాలి. చుట్టు ప్రక్కల రాజరక్షణకోసం అశ్వసైన్యం ఉండాలి.లేదా రాజు ఉన్న సైన్యంలో ఏ విధమైన సైన్యం అధికంగా ఉంటుందో ఆ వాహనం కాని, ఏ వాహనం ఎక్కడానికి రాజుకు మంచి అభ్యాసం ఉన్నదో ఆ వాహనాన్ని కాని రాజు ఎక్కాలి. రాజు వేషంలో ఉన్న ఒక పురుషుడు సైన్యవ్యూహం శిరోభాగంలో ఉండాలి.

3. సూతమాగధులు శూరులకు స్వర్గం వస్తుం దనీ, పిరికివాళ్లకి స్వర్గం రాదనీ చెపుతూ అక్కడ ఉన్న యోధుల జాతి -సంఘ-కుల-కర్మలను, వాళ్ల చరిత్రను

స్తుతించాలి. పురోహితుని పురుషులు శత్రుసేనాసంహారంకొరకు పురోహితుడు కృత్యాదేవతను సృష్టించడం ద్వారా అభిచారం చేస్తున్నాడు అని అందరికీ చెప్పాలి. సత్రికులు, వర్ధంగులు,జ్యౌతిషికులు తమ పని సఫలం అవుతుం దనీ, శత్రుకర్మ విఫలం అవుతుం దనీ చెప్పాలి.

మూ. 1. సేనాపతిరర్థమానాభ్యామ్ అభిసంస్కృతమనీకమభిభాషేత- శతసాహస్రో రాజవధః. పఞ్చాశత్సాహస్రః సేనాపతికుమారవధః. దశసాహస్రః ప్రవీరముఖ్యవధః. పఞ్చసాహస్రో హస్తిరథవధః, సాహస్రోఽశ్వవధః. శత్యః పత్తిముఖ్యవధః. శిరో వింశతికమ్; భోగద్వైగుణ్యం స్వయంగ్రాహశ్చ. తదేషాం దశవర్గాధిపతయో విద్యుః.

2. చికిత్సకాః శస్త్రయన్త్రాగదస్నేహవస్త్రహస్తాః, స్త్రియశ్చ అన్నపానరక్షిణ్యః పురుషాణాముద్ధర్షణీయానాం పృష్ఠతస్తిష్ఠేయుః.

వ్యా. 1. సేనాపతి సైన్యాన్ని ధన-సన్మానాలచేత ఆదరించి- "రాజును చంపిన వానికి లక్ష సువర్ణాల బహుమానం, సేనాపతిని గాని, రాజకుమారుణ్ణి గాని చంపినవానికి యాభైవేల సువర్ణాలు, వీరులలో ముఖ్యుణ్ణి చంపినవానికి పదివేల సువర్ణాలు; ఏనుగును గాని, రథికుణ్ణి గాని, చంపినవానికి ఐదు వేల సువర్ణాలు, గుఱ్ఱాన్ని చంపినవానికి వెయ్యి సువర్ణాలు, కాలిబంట్లలో ముఖ్యుణ్ణి చంపినవానికి నూరు సువర్ణాలు,ఒక యోధుని శిరస్సు నరికి తీసికొని వచ్చిన వానికి ఇరవై సువర్ణాలు బహుమానం. ఇంతే కాకుండా యుద్ధంలో పాల్గొన్నవాళ్ల కందరికీ రెట్టింపు భోగం (బత్తెం, వేతనం) స్వయంగ్రాహమూ కూడ. అనగా శత్రువునుంచి ఏ యోధుడు ఏది దోచుకుంటాడో అది వానికే ఇచ్చివేయబడుతుంది"అని ఘోషించాలి. ఈ విషయాన్ని వాళ్ల సైనికుల దశ వర్గాధిపతులు (ముందు చెప్పబోయే పదిక-సేనాపతి-నాయకాదులు) కూడా తెలుసుకొని ఉండాలి. ఈ విషయం వాళ్లు తమ క్రింద నున్న సైనికులకు తెలపాలి అని అర్థం.

2. శస్త్రచికిత్సకు కావలసిన శస్త్రాలు, యంత్రాలు, మందులు, నూనెలు, వస్త్రాలు సిద్ధంగా ఉంచుకొన్న వైద్యులు, అన్నపానాలను రక్షిస్తూ పురుషులకు ఉత్సాహం కలిగించే స్త్రీలు యుద్ధరంగం వెనుకభాగంలో ఉండాలి.

మూ. 1. అదక్షిణాముఖం, పృష్ఠతః సూర్యమ్, అనులోమవాతమనీకం స్వభూమౌ వ్యూహేత. పరభూమివ్యూహే చ అశ్వాంశ్చారయేయుః.

2. యత్ర స్థానం ప్రజవశ్చ అభూమిః వ్యూహస్య తత్ర స్థితః ప్రజవితశ్చ ఉభయథా జీయేత. విపర్యయే జయతి ఉభయథా స్థానే ప్రజవే చ.

3. సమా విషమా వ్యామిశ్రా వా భూమిరితి, పురస్తాత్ పార్శ్వాభ్యాం, పశ్చాచ్చ జ్ఞేయా. సమాయాం దణ్డమణ్డలవ్యూహాః, విషమాయాం భోగసంహత వ్యూహాః, వ్యామిశ్రాయాం విషమవ్యూహాః.

4. విశిష్టబలం భఙ్క్త్వా సంధిం యాచేత. సమబలేన యాచితః సందధీత. హీనమను హన్యాత్. న త్వేవ స్వభూమిప్రాప్తం త్యక్తాత్మానం వా.

వ్యా. 1. సైన్యాన్ని అనుకూలమైన భూమియందు దక్షిణాభిముఖం కాకుండగా, సూర్యుడు వెనుకకు ఉండే టట్లుగా గాలి అనుకూలంగా ఉండే టట్లు వ్యూహం చేసి నిలపాలి. శత్రువుకు అనుకూలమైన భూమియందు వ్యూహంలో (శత్రువు వ్యూహం చేసుకోకుండా ఉండడం నిమిత్తం) తన అశ్వాల్ని నడిపించాలి.

2. ఏ ప్రదేశంలో వ్యూహం చాల కాలం ఉండడానికి గాని, శీఘ్రంగా పని చేయడానికి గాని భూమి అనువైనది కాదో అక్కడ చాల కాలం ఉన్నా, వేగంగా పనిచేసినా, రెండు విధాలా కూడ శత్రువుచేత జయించబడతాడు. స్థానం విషయంలోను, ప్రజవం విషయంలోను భూమి ఇందుకు విపరీతంగా ఉంటే (అనగా అనుకూలంగా ఉంటే) తానే జయిస్తాడు.

3. ముందు, రెండు ప్రక్కలా, వెనకా ఉన్న భూమి సమభూమి, విషమభూమి, వ్యామిశ్రభూమి అని మూడు విధా లుంటుంది. సమభూమియందు దండమండల వ్యూహాలు, విషమభూమియందు భోగసంహతవ్యూహాలు, వ్యామిశ్రభూమియందు విషమవ్యూహాలు ఏర్పరచాలి (ఈ వ్యూహాలను గూర్చి ముందు చెప్పనున్నాడు).

4. తనకంటె అధికమైన బలం కలవానిని ఓడించినట్లయితే వానితో సంధి చేసుకోవాలి. సమబలుడు కోరితే వానితో సంధి చేసుకోవాలి. హీనబలుడు ఓడిపోయినప్పుడు వానిని వెంబడించి కొట్టాలి. అయితే హీనుడు కూడ తన భూమిలో ఉన్నా, లేదా ప్రాణాలను విడవడానికి సిద్ధంగా ఉన్నా వానిని పీడించకూడదు.

శ్లో. పునరావర్తమానస్య నిరాశస్య చ జీవితే,
అధార్యో జాయతే వేగః తస్మాద్ భగ్నం న పీడయేత్.

ఇతి కౌటలీయార్థశాస్త్రే సాంగ్రామికే దశమాధికరణే తృతీయోఽధ్యాయః, కూటయుద్ధవికల్పాః, స్వసైన్యోత్సాహనమ్, స్వబలాన్యబలవ్యాయోగశ్చ, ఆదితః ఏకత్రింశచ్ఛతతమః.

వ్యా. జీవితంలో నిరాశుడై ఓడిపోయిన తరవాత కూడ తిరిగి యుద్ధానికి వచ్చేవాని వేగాన్ని తట్టుకొనడం కష్టం. అందుచేత ఓడిపోయినవాణ్ణి పీడించకూడదు.

"బాలానందిని" అనే కౌటలీయార్థశాస్త్రాంధ్రవ్యాఖ్యానమునందు సాంగ్రామికం అనే దశమాధికరణంలో కూటయుద్ధవికల్పాలు, స్వసైన్యోత్సాహనం, స్వబలాన్యబలవ్యాయోగం అనే మూడవ అధ్యాయం, ప్రారంభంనుంచి నూటముప్పై ఒకటవ అధ్యాయం సమాప్తం.

## అథ చతుర్థోఽధ్యాయః

### త్రిపఞ్చాశచ్ఛతతమం ప్రకరణమ్ - యుద్ధభూమయః

### చతుష్పఞ్చాశచ్ఛతతమం ప్రకరణమ్ - పత్త్యశ్వరథహస్తికర్మాణి

మూ. 1. స్వభూమిః పత్త్యశ్వరథద్విపానామిష్టా యుద్ధే నివేశే చ.

2. ధాన్వనవననిమ్నస్థలయోధినాం ఖనకాకాశ దివారాత్రియోధినాం చ పురుషాణాం నాదేయపార్వతానూపసారసానాం చ హస్తినామశ్వానాం చ యథాస్వమిష్టా యుద్ధభూమయః కాలాశ్చ.

3. సమా స్థిరా అభికాశా నిరుత్ఖాతినీ అచక్రఖురా, అనక్షగ్రాహిణీ, అవృక్షగుల్మప్రతతిస్తమ్భకేదారశ్వభ్రవల్మీకసికతా అపఙ్కభఙ్గురా దరణహీనా చ రథభూమిః.

వ్యా. 1. కాలిబంట్లకు, అశ్వాలకు,రథాలకు, ఏనుగులకు కూడ యుద్ధానికైనా, వాటిని నివేశింపచేయడానికైనా స్వభూమి, అనగా అనుకూలమైన భూమి,అవసరం.

2. మరుభూములలోను, వనాలలోను, నీళ్లలోను, మెట్టప్రదేశాలలోను యుద్ధంచేసేవాళ్లు, పగలు యుద్ధం చేసేవాళ్లు, రాత్రులందు యుద్ధం చేసేవాళ్లు

అయిన పురుషులకు, నదులకు, పర్వతాలకు, జలప్రాయభూములకు, సరస్సులకు సంబంధించిన అనగా అక్కడ ఉండి యుద్ధం చేయకలిగిన, గజాశ్వాలకు వాటి వాటికి అనుకూలమైన భూములు, కాలాలు అవసరం. అనగా ధాన్వనులకు మరుప్రదేశాలు, నాదేయులకు నదులు మొదలైనవి అనుకూలంగా ఉంటాయి గాన వాళ్లచేత, వాటిచేత అక్కడనే యుద్ధం చేయించాలి అని అర్థం.

3. ఎత్తుపల్లాలు లేనిది, ప్రాంతాలలో స్థిరంగా (గట్టిగా) ఉండేది, చుట్టు ప్రక్కల చెట్లు మొక్కలు మొదలైనవి లేకుండా ఉన్నదీ, గతుకులు లేనిది, చక్రాలు, గుఱ్ఱాల డెక్కలూ క్రిందికి దిగిపోనిదీ, రథం ఇరుసు తిరగకుండా చేయనిదీ, చెట్లు, పొదలు, తీగలు, స్తంభాలు, పొలాలు, గోతులు,పుట్టలు, ఇసుక, బురద, వంకర లేనిదీ, బీటలు లేనిదీ అయిన భూమి రథసంచారానికి తగిన భూమి.

మూ. 1. హస్త్యశ్వయోః మనుష్యాణాం చ సమే విషమే హితా యుద్ధే నివేశే చ.

2. అణ్వశ్మవృక్షా, హ్రస్వలఙ్ఘనీయశ్వభ్రా మన్దదరణదోషా చ అశ్వభూమిః.

3. స్థూలస్థాణ్వశ్మవృక్షప్రతతివల్మీకగుల్మా పదాతిభూమిః. గమ్యశైలనిమ్నవిషమా, మర్దనీయవృక్షా, భేదనీయప్రతతిః, పఙ్కభఙ్గురదరణ హీనా చ హస్తిభూమిః.

4. అకణ్టకినీ, అబహువిషమా, ప్రత్యాసారవతీతి పదాతీనామతిశయః.

5. ద్విగుణప్రత్యాసారా, కర్దమోదకఖఞ్జనహీనా, నిఃశర్కరేతి వాజినామతిశయః.

6. పాంసుకర్దమోదకనలశరాధానవతీ శ్వదంష్ట్రాహీనా మహావృక్ష శాఖాఘాతవియుక్తేతి హస్తినామతిశయః.

వ్యా. 1. ఈ రథభూమి, మామూలు పరిస్థితులలోను, విషమపరిస్థితులలోను కూడ హస్తి-అశ్వ-మనుష్యులు యుద్ధం చేయడానికీ, విడిసి ఉండడానికీ కూడ అనుకూల మైనది.

2. చిన్న రాళ్లు చెట్లు ఉన్నది, అనాయాసంగా దాటదగిన గోతులు గలది,

బీటలు వారడం అనే దోషం తక్కువగా ఉన్నదీ అయిన భూమి అశ్వాలకు అనుగుణ మైన భూమి.

3. పెద్ద రాతిబండలు,రాళ్లు, చెట్లు, తీగలు, పుట్టలు, పొదలు ఉన్న భూమి కాలిబంట్లకు అనుకూలమైన భూమి. నడవడానికి వీలైన కొండలు, జలాలు, విషమప్రదేశాలు ఉన్నది, అనాయాసంగా విరచివేయదగిన చెట్లు ఉన్నది, ఛేదించదగిన తీగలు గలది, బురద, కంకరలు, బీటలు లేనిది అయిన భూమి ఏనుగులకు అనువైన భూమి.

4. పదాతుల భూమిలో ముళ్లు లేకపోవడం, ఎక్కువ విషమంగా ఉండకపోవడం, తిరిగి వెళ్లిపోయే మార్గం ఉండడం అనేది అధికమైన సౌకర్యం.

5. అశ్వభూమి ప్రవేశించడానికి తగిన దారికంటె వెనుకకు తిరిగి వెళ్లడానికి రెట్టింపు అనువైన మార్గం గలదై ఉండడం, బురద నీళ్లు లేనిదై ఉండడం, ఖంజనం (రాళ్లమట్టి) లేనిదై ఉండడం అనేది అధికమైన సౌకర్యం.

6. హస్తిభూమిలో పరాగం, బురదనీరు, నలం (ఒక పొడవైన గడ్డి), శరం (రెల్లుగడ్డి) బాగా మొలిచి ఉండడం, శ్వదంష్ట్ర (కుక్క కోరలవంటి ముళ్లు ఉండే మొక్కలు) లేకపోవడం, పెద్దచెట్ల కొమ్మల అడ్డు లేకపోవడం అనేది అధికసౌకర్యం.

మూ. 1. తోయాశ్రయవతీ, నిరుత్ఖాతినీ, కేదారహీనా, వ్యావర్తనసమర్థేతి రథానామతిశయః. ఉక్తా సర్వేషాం భూమిః.

2. ఏతయా సర్వబలనివేశా యుద్ధాని చ వ్యాఖ్యాతాని భవన్తి.

3. భూమివాసవననిచయః అవిషమతోయతీర్థవాతరశ్మిగ్రహణం, వీవధాసారయోః ఘాతః రక్షా వా, విశుద్ధిః స్థాపనా చ బలస్య ప్రసారవృద్ధిః, బాహూత్సారః, పూర్వప్రహారః, వ్యావేశనమ్, వ్యావేధనమ్, ఆశ్వాసః, గ్రహణమ్, మోక్షణం, మార్గానుసారవినిమయః, కోశకుమారాభిహరణం, జఘన కోట్యభిఘాతః, హీనానుసారణమ్, అనుయానమ్, సమాజకర్మేత్యశ్వకర్మాణి.

వ్యా. 1. రథభూమిలో తోయాధారాలు (గుఱ్ఱాలకి స్నానం చేయించడానికి తగిన ఉదకం ఉన్న చిన్న చెరువులు), విశ్రమస్థానాలు ఉండడం గతుకులు లేకపోవడం, పొలాలు లేకపోవడం, మళుపులు తిరగడానికి అనువుగా ఉండడం. అనేవి అధికసౌకర్యాలు, ఇంతవరకు వివిధసైన్యాలకు తగిన భూమిని గూర్చి చెప్పబడింది.

2. దీనిచేత అన్ని విధాల సైన్యాల నివేశాలు, యుద్ధాలు కూడ వివరించినట్లే.

3. భూమిని, నివాసస్థానాలను (సేనానివేశం చేయదలచిన స్థానాలను), అడవులను (అనుకూలంగా ఉన్నాయా లేదా అని) పరిశీలించడం, ముందుగానే తమ సైన్యానికి అనుగుణమైన విషమం కాని భూమిని, ఉదకాన్ని, నదులను దాటే స్థానాలను, వాయువును, సూర్యకిరణాలను చూచుకొని ఉంచడం, పరుల వీవధాసారాలను అడ్డుకొనడం తమ వీవధాసారాలను రక్షించడం (ఆహారాదులు అవిచ్ఛిన్నంగా రావడం 'వీవధం', మిత్రబలాలు రావడం 'ఆసారం'). సైన్యంలో రహస్యంగా శత్రుసైనికులు ప్రవేశించకుండా చూచుకొనడం, దానిని స్థిరంగా నిలబెట్టడం, ఆక్రమణాన్ని ముందుకు నడిపించడం, శత్రువుల ఆక్రమణాన్ని చేతులతో గెంటివేసి నట్లు వెనుకకు నెట్టివేయడం, శత్రువుమీద ముందుగా ఆక్రమణం చేయడం, శత్రుసైన్యంలోనికి దూసుకొని పోవడం, దానిని పీడించడం, తన సైన్యానికి ప్రోత్సాహం ఇవ్వడం, శత్రుసైనికులను పట్టుకొనడం, తనవాళ్లని విడిపించడం, శత్రుమార్గాన్ని అనుసరించడంకోసం వెళ్లడం, శత్రువుల కోశాన్ని, రాజకుమారుణ్ణి వాళ్లు చూస్తూండగానే హరించడం, శత్రుసైన్యం వెనుక చివరి బాగాల్లోను దెబ్బతీయడం, ఓడిపోయినవానిని వెంబడించడం, పారిపోతున్న శత్రుసైన్యాన్ని తరమడం, చెల్లాచెదరైన తమ సైన్యాన్ని ఒక చోటకు చేర్చడం-ఇవి అశ్వసైన్యం చేయవలసిన పనులు.

మూ. పురోయానమ్, అకృతమార్గవాసతీర్థకర్మ, బాహూత్సారః, తోయ తరణావతరణే స్థానగమనావతరణం, విషమసంబాధప్రవేశః, అగ్నిదానశమ నమ్, ఏకాఙ్గవిజయః, భిన్నసంధానమ్, అభిన్నభేదనమ్, వ్యసనే త్రాణమ్, అభిఘాతః, విభీషికా, త్రాసనమ్, ఔదార్యం, గ్రహణం, మోక్షణం, సారద్వారా ట్టాలకభఞ్జనమ్, కోశవాహనాపవాహనమ్ ఇతి హస్తికర్మాణి.

వ్యా. ముందు నడవడం, పూర్వం చేసి ఉండని మార్గాలు, నివాసస్థానాలు, రేవులు చేయడం, పరసైన్యాన్ని చేతులతో గెంటివేసినట్లు గెంటివేయడం, నద్యాదుల జలాలు దాటడం, లోతు తెలియడంకోసం నీటిలో దిగడం, విషమంగాను ఇరుకుగాను ఉన్న ప్రదేశాలలో ప్రవేశించడం, శత్రుబలాక్రమణంకోసం పంక్తిగా నిలబడడం, ముందుకు నడవడం, ఎత్తుప్రదేశాలనుంచి దిగడం, శత్రుశిబిరంలో అగ్నిని ముట్టించడం, తమ శిబిరంలో ఆర్పివేయడం, అశ్వాద్యంగాలు లేకుండా ఒక్క హస్తిరూపమైన అంగం చేతనే విజయం సాధించడం, చెదిరిపోయిన సైన్యాలను ఒకచోట చేర్చడం, చెదరని

శత్రుసైన్యాలను చెదరగొట్టడం, వ్యసనంలో రక్షించడం, ఎదురుముట్టడి చేయడం, చూచినంతమాత్రంచేతనే భయం కలిగేటట్లు ఉండడం, భయపెట్టడం, ఔదార్యం (హుందాతనం showing magnificience), పట్టుకొనడం, విడిపించడం, ప్రాకారద్వారాలు కోటబురుజులు విరగకొట్టడం, కోశాన్ని వాహనాలను లాగికొనిపోవడం-ఇవి హస్తి సైన్యం చేయవలసిన పనులు.

మూ. 1. స్వబలరక్షా, చతురఙ్గబలప్రతిషేధః, సంగ్రామే గ్రహణం, మోక్షణం, భిన్నసంధానమ్, అభిన్నభేదనం, త్రాసనమ్, ఔదార్యం, భీమఘోషశ్చేతి రథకర్మాణి.

2. సర్వదేశకాలశస్త్రవహనం వ్యాయామశ్చేతి పదాతికర్మాణి.

3. శిబిరమార్గసేతుకూపతీర్థశోధనకర్మ యన్త్రాయుధావరణోపకరణగ్రాసవహనమ్, ఆయోధనాచ్చ ప్రహరణావరణప్రతివిద్ధాపనయనమితి విష్టికర్మాణి.

వ్యా. 1. తమ సైన్యాన్ని రక్షించడం, శత్రువుల చతురంగ బలాన్ని అడ్డుకొనడం, యుద్ధంలో శత్రువుల్ని పట్టుకొనడం, తమవాళ్లని విడిపించడం, చెదిరపోయినవాళ్లని కూడదీసికొనడం, కలిసికట్టుగా ఉన్న శత్రుసైనికులను చెల్లాచెదరు అయే టట్లు చేయడం, భయపెట్టడం, ఔదార్యం,భయంకరమైన శబ్దం ఇవి రథకర్మలు.

2. అన్ని దేశాలలోను, అన్ని కాలాలలోను శస్త్రాలు ధరించి యుద్ధం చేయడం కాలిబంట్లు చేసే పని.

3. గుడారాలు, మార్గాలు, సేతువులు, నూతులు, రేవులు శోధించడం, యంత్రాలు, ఆయుధాలు, కవచాలు, ఇతరసాధనాలు,పశుగ్రాసం మోసికొని పోవడం, యుద్ధభూమినుండి అక్కడ పడి ఉన్న ఆయుధాలను కవచాలను దెబ్బతిన్న యోధులను తొలగించడం ఇవి విష్టులు (ఆయుధధారులు కాని కర్మకరులు) చేయవలసిన పనులు.

శ్లో. కుర్యాద్గవాశ్వవ్యాయోగం రథేష్వల్పహయో నృపః,
ఖరోష్ట్రశకటానాం వా గర్భమల్పగజస్తథా.

ఇతి కౌటలీయార్థశాస్త్రే సాంగ్రామికే దశమాధికరణే చతుర్థోఽధ్యాయః,
యుద్ధభూమయః, పత్త్యశ్వరథహస్తికర్మాణి, ఆదితః ద్వాత్రింశచ్ఛతతమః.

వ్యా. అశ్వాలు తక్కువ ఉన్న రాజు రథాలకు గుఱ్ఱాలను ఎద్దులను కలిపి కట్టాలి. అట్లే ఏనుగులు తక్కువ ఉన్నవాడు సైన్యమధ్యంలో గాడిదలను, ఒంటెలను, బండ్లను ఉంచుకోవాలి.

"బాలానందిని" అను కౌటలీయార్థశాస్త్రాంధ్రవ్యాఖ్యానంలో సాంగ్రామికం అనే దశమాధికరణంలో యుద్ధభూములు, పత్త్యశ్వరథహస్తికర్మలు అను నాల్గవ అధ్యాయం, ప్రారంభంనుండి నూటముప్పైరెండవ అధ్యాయం సమాప్తం.

## అథ పఞ్చమో ఽధ్యాయః

### పఞ్చపఞ్చాశచ్ఛతతమం ప్రకరణమ్ - సారఫల్గుబలవిభాగః

సప్తపఞ్చాశచ్ఛతతమం ప్రకరణమ్ - పత్త్యశ్వరథహస్తియుద్ధాని (ఉన్న మొత్తం సైన్యాన్ని) పట్టి పక్షాలయందు (ముందు ఇరుప్రక్కలా) కక్షాలయందు (మధ్య ఇరుప్రక్కలా), ఉరఃస్థానంలోను (మధ్యభాగంలోను) సైన్యవ్యూహం నిర్మించడం. సారవంతమైన సైన్యం నిఃసారమైన సైన్యం అనే విభాగం.

మూ. 1. ధనుఃపఞ్చశతావకృష్టదుర్గమవస్థాప్య యుద్ధముపేయాత్; భూమివశేన వా. విభక్తముఖ్యామ్, అచక్షుర్విషయే మోక్షయిత్వా సేనాం సేనాపతినాయకౌ వ్యూహేయాతామ్.

2. శమాన్తరం పత్తిం స్థాపయేత్; త్రిశమాన్తరమశ్వమ్; పఞ్చశమాన్తరం రథం హస్తినం చ. ద్విగుణాన్తరం త్రిగుణాన్తరం చ వ్యూహేత. ఏవం యథాసుఖమ్ అసంబాధం యుధ్యేత.

వ్యా. 1. స్కంధావారం యుద్ధభూమినుంచి ఐదువందల ధనస్సుల దూరంలో కాని, భూమిని పట్టి కొంచెం ఎక్కువతక్కువ దూరంలో గాని ఏర్పరచుకొని యుద్ధభూమికి వెళ్లాలి. సేనాపతి, సేనానాయకుడు సేనలో ఆ యా స్థానాలలో ఉండవలసిన సైనికముఖ్యులను అక్కడ ఉంచి, శత్రువులకు కనబడకుండా సేనను వ్యూహాలుగా ఏర్పరచాలి.

2. కాలిబంటుకీ కాలిబంటుకీ మధ్య ఒక శమం (పద్నాలుగు అంగుళాలు గ.శా.) దూరం ఉండే టట్లు, అశ్వానికీ అశ్వానికీ మధ్య మూడు శమాల దూరం

ఉండేటట్లు, రథానికీ రథానికీ మధ్య, ఏనుగకూ ఏనుగకూ మధ్య ఐదు శమాల దూరం ఉండే టట్లు నిలబెట్టాలి. లేదా రెట్టింపు వ్యవధానం కాని మూడురెట్లు గాని ఉండే టట్లు నిలబెట్టాలి. ఈవిధంగా సుఖంగా ఉండేటట్లు, ఇరుకు లేకుండా ఉండేటట్లు యుద్ధం చెయ్యాలి.

మూ. 1. పఞ్చారత్ని ధనుః.తస్మిన్ ధన్వినం స్థాపయేత్. త్రిధనుష్యశ్వమ్. పఞ్చధనుషి రథం హస్తినం వా. పఞ్చధనురనీకసంధిః పక్షకక్షోరస్యానామ్.

2. అశ్వస్య త్రయః పురుషాః ప్రతియోద్ధారః. పఞ్చదశ రథస్య హస్తినో వా పఞ్చ చాశ్వాః. తావన్తః పాదగోపాః వాజిరథద్విపానాం విధేయాః.

3. త్రీణి త్రికాణ్యనీకం రథానామురస్యం స్థాపయేత్.తావత్ కక్షం పక్షం చోభయతః.పఞ్చచత్వారింశత్ ఏవం రథా వ్యూహే భవన్తి.

4. ద్వే శతే పఞ్చవింశతిశ్చాశ్వాః, షట్‌శతాని పఞ్చసప్తతిశ్చ పురుషాః ప్రతియోద్ధారః. తావన్తః పాదగోపాః వాజిరథద్విపానామ్.

వ్యా. 1. ఐదు అరత్నులు ఒక ధనస్సు. ఒక ధనుస్సులో దనుర్ధరుణ్ణి నిలబెట్టాలి. గుఱ్ఱాన్ని మూడు ధనస్సుల దూరంలో నిలపాలి. రథాన్ని, ఏనుగును, ఐదు ధనుస్సుల దూరంలో నిలబెట్టాలి. పక్ష-కక్ష-ఉరస్యాల సేనల సంధి ఐదు ధనస్సుల దూరం ఉండాలి.

2. ఒక్కొక్క అశ్వానికి ముందు ముగ్గురేసి పురుషులు ప్రతియోద్ధలుగా (శత్రువును ఎదిరించి యుద్ధం చేసే వాళ్లుగా) ఉండాలి. రథం ముందు, ఏనుగు ముందు పదిహేనుగురు చొప్పున పురుషులు, ఐదు గుఱ్ఱాలు ఉండాలి.అశ్వరథగజాలకు అంతేమంది పాదరక్షకులు, అనగా అశ్వాలకు ముగ్గురు, రథ-గజాలకి పదిహేనుగురు చొప్పునా, ఉండాలి.

3. మధ్య నున్న సైన్యంలో రథాల మూడు త్రికాలను నిలబెట్టాలి. అనగా వరసకు మూడేసి రథాల చొప్పున మూడు వరసలు నిలపాలి. రెండు కక్షాలలోను, రెండు పక్షాలలోను అన్నే రథత్రికాలు ఉంచాలి. ఈ విధంగా వ్యూహంలో నలభైయైదు రథాలుండాలి. (మధ్య తొమ్మిది, రెండు కక్షాలలో పద్దెనిమిది, పక్షాలలో పద్దెనిమిది

ఉండాలి.

4. గుణ్ణాలు రెండు వందల ఇరవైయైదు ప్రతియోద్ధలైన పురుషులు ఆరు వందల డెబ్భైఐదుగురు ఉంటారు. అశ్వ-రథ-గజాల పాదరక్షకులైన పురుషులు కూడ అంతేమంది ఉంటారు.

మూ. 1. ఏష సమవ్యూహః. తస్య ద్విరథోత్తరా వృద్ధిః ఆ ఏకవింశతిరథాదిత్యేవమోజా దశసమవ్యూహప్రకృతయో భవన్తి.

2. పక్షకక్షోరస్యానాం మిథో విషమసంఖ్యానే విషమవ్యూహః. తస్యాపి ద్విరథోత్తరా వృద్ధిః ఆ ఏకవింశతిరథాదిత్యేవమోజా దశ విషమవ్యూహప్రకృతయః భవన్తి.

3. అతః సైన్యానాం వ్యూహశేషమావాపః కార్యః. రథానాం ద్వౌ త్రిభాగౌ అఙ్గేష్వావాపయేత్. శేషమురస్యం స్థాపయేత్. ఏవం త్రిభాగోనో రథానామావాపః కార్యః. తేన హస్తినామశ్వానామ్ ఆవాపో వ్యాఖ్యాతః.

వ్యా. 1. ఇది సమవ్యూహం. వ్యూహంలోని ఐదు భాగాలలోను మూడురథత్రికాలు సమంగా ఉండడంచేత ఇది సమవ్యూహం అని అర్థం. సమవ్యూహంలో ఉన్న రథత్రికానికి ఆ రథాల సంఖ్య ఇరవైఒకటి అయే వరకు రెండేసి రథాలు పెంచుకొంటూ పోతే అప్పుడు సమవ్యూహప్రకృతులైన అనగా సమవ్యూహాన్ని ఆధారంగా చేసికొని ఏర్పరచిన,పది బేసి సంఖ్య గల వ్యూహాలు అవుతాయి. అనగా (1) మూడు రథత్రికాలకి రెండు రథత్రికాలు చేరిస్తే ఐదు రథత్రికాలు(పంచకం) ఏర్పడుతుంది. (2) పంచకానికి రెండు చేరిస్తే సప్తకం. (3) దానికి రెండు చేరిస్తే నవకం. (4) దానికి రెండుచేరిస్తే ఏకాదశకం. (5) దానికి రెండుచేరిస్తే త్రయోదశకం. (6) దానికి రెండు చేరిస్తే పంచదశకం. (7) దానికి రెండు చేరిస్తే సప్తదశకం. (8) దానికి రెండు చేరిస్తే ఏకోనవింశతికం.(9) దానికి రెండు చేరుస్తే ఏకవింశతికం. ఈ విధంగా సమవ్యూహంలో ఉన్న పక్షద్వయ-కక్ష్యద్వయ-ఉరఃస్థానాలు అనే ఒక్కొక్కభాగంలో 9 రథాలు, 15, 21, 23, 25, 27, 29, 31, 33, 35, 37, 39, 41, 43, 45, 47, 49, 51, 53, 55, 57, 59, 61, 63 చొప్పున రథాలు ఉంటాయి. మొత్తం వ్యూహంలో 45, 75, 105, 145 ఇత్యాదివిధంగా 315 వరకు ఉంటాయి. రథాల సంఖ్య పెరిగిన కొలదీ అశ్వాల సంఖ్య,

పదాతుల సంఖ్య పెరుగుతుంది. ఈ విధంగా చాల పెద్దదైన వ్యూహంలో మొత్తం 315 రథాలు, 1573 అశ్వాలు, 9450 మంది పదాతులు ఉంటారు.

2. పక్ష-కక్ష-ఉరస్యాలలోని రథాల (రథత్రికాల) సంఖ్య వేరు వేరుగా ఉంటే,ఉదాహరణకి - ఉరస్యంలో తొమ్మిది, పక్షాలలో పదిహేనూ, కక్షాలలో పదిహేడు ఇత్యాది రీతిలో ఉంటే, అది విషమవ్యూహం. దీనికి కూడా ఒక్కొక్క దానికి రేండేసి రథత్రికాలు ఇరవైఒకటివరకూ పెంచుకొంటూ వెడితే బేసిసంఖ్యలో పది విషమవ్యూహప్రకృతులు ఏర్పడతాయి.విషమవ్యూహప్రకృతులు-అనగా విషమవ్యూహం మూలకారణంగా కలవి అని అర్థం. వీటిని కూడా పెంచుకొంటూ వెడితే మొత్తం వ్యూహంలో ఉండే రథాదుల సంఖ్య అత్యధికంగా ఉంటుంది.

3. తరవాత సైన్యాల వ్యూహం ఏర్పరచగా మిగిలినవాటి ఆవాపం చెయ్యాలి. (ఆవాపం అనగా మిగిలిపోయినవాటిని అక్కడక్కడ సర్దడం) మిగిలిపోయిన రథాలు మూడు భాగాలు చేసి వాటిలో రెండు భాగాలు అంగాలలో (పక్షకక్షాలలో) ఆవాపం చెయ్యాలి. మిగిలిన ఒక భాగం ఉరస్యసైన్యంలో చేర్చాలి. ఈ విధంగా రథాల ఆవాపం అక్కడ ముందుగానే ఎన్ని ఉన్నాయో వాటి మూడవవంతుకు తక్కువగా చెయ్యాలి. దీనిచేత ఏనుగుల ఆవాపం అశ్వాల ఆవాపం కూడ వ్యాఖ్యానించ బడింది.అనగా వాటి ఆవాపం కూడ రథావాపం వలెనే చెయ్యాలి.

మూ. 1. యావదశ్వరథద్విపానాం యుద్ధసంబాధం న కుర్యాత్ తావదావాపః కార్యః.

2. దణ్డబాహుల్యమావాపః. పత్తిబాహుల్యం ప్రత్యావాపః. ఏకాఙ్గబాహుల్యమ్ అన్వావాపః. దూష్యబాహుల్యమ్ అత్యావాపః.

3. పరావాపాత్ ప్రత్యావాపాత్ ఆచతుర్గుణాత్ అష్టగుణాదితి వా విభవతః సైన్యానామావాపః కార్యః.

వ్యా. 1. యుద్ధంలో అశ్వరథగజాలకు ఇరుకు కలగని విధంగా (అశ్వరథగజాల) ఆవాపం చెయ్యాలి.

2. వ్యూహరచన చేసిన తరవాత కూడ సైన్యం మిగిలిపోవడం (మిగిలిన సైన్యం చేర్చి వృద్ధి పొందించడం) ఆవాపం. కాలి బంట్ల బాహుల్యం ప్రత్యావాపం. ఏదైన

ఒక అంగం (అశ్వాదికం) అధికంగా ఉండడం అన్వావాపం. దూష్యసైన్యం అధికంగా ఉండడం అత్యావాపం.

3. శత్రువు తన సైన్యంలో చేసిన ఆవాపంకంటె గాని, ప్రత్యావాపంకంటె గాని, నాలుగు రెట్లు గాని, ఎనిమిది రెట్లు గాని, తన సామర్థ్యానుసారం గాని, సైన్యాల ఆవాపం చెయ్యాలి.

మూ. 1. రథవ్యూహేన హస్తివ్యూహో వ్యాఖ్యాతః. వ్యామిశ్రో వా హస్తిరథాశ్వానామ్, చక్రాన్తయోర్హస్తినః, పార్శ్వయోరశ్వముఖ్యాః, రథా ఉరస్యే హస్తినాముర‌స్యం రథానాం కక్షా, అశ్వానాం పక్షావితి మధ్యభేదీ. విపరీతో ఽన్తర్భేదీ.

2. హస్తినామేవ తు శుద్ధః.సాన్నాహ్యానాముర‌స్యమ్. ఔపవాహ్యానాం జఘనమ్. వ్యాలానాం కోట్యావితి.

3. అశ్వవ్యూహో వర్మిణాముర‌స్యం, శుద్ధానాం కక్షపక్షావితి.

4. పత్తివ్యూహః - పురస్తాదావరణినః, పృష్ఠతో ధన్విన ఇతి శుద్ధః.

వ్యా. 1. రథవ్యూహంచేత హస్తివ్యూహం (ఏనుగులు ప్రధానంగా ఉండే వ్యూహం) వ్యాఖ్యానించబడినది. అనగా హస్తివ్యూహాన్ని రథవ్యూహం వలెనే ఏర్పరచాలి. దీనిని పట్టి పైన చెప్పిన రథవ్యూహంలో ఏనుగులు ఉండ వని స్పష్టం అవుతున్నది (కాంగ్లే) లేదా ఏనుగులు, రథాలు, అశ్వాలు కలిసిన వ్యూహం ఏర్పరచాలి. సైన్యానికి ఈ చివరా ఆ చివరా ఏనుగులు, రెండు ప్రక్కలా ముఖ్యమైన అశ్వాలు, ఉరస్యంలో రథాలు నిలపాలి. ఏనుగులను ఉరస్యంలోను, రథాలను కక్షాలలోను, అశ్వాలను పక్షాలలోను ఉంచినట్లైతే అది మధ్యభేది వ్యూహం. ఇందుకు విపరీతం అన్తర్భేదివ్యూహం.అనగా కక్షాలలో గజాలు, పక్షాలలో రథాలు, ఉరస్యంలో అశ్వాలు ఉంటే అంతర్భేది వ్యూహం.

2. లేదా కేవలం ఏనుగులను మాత్రమే ఉపయోగించిన వ్యూహం శుద్ధవ్యూహం.ఉరస్యంలో సాంనాహ్యగజాలు (యుద్ధయోగ్యాలైన గజాలు), జఘనంలో (వెనుకటి లోపలి పార్శ్వంలో) ఔపవాహ్యాలు (రాజవాహనగజాలు), పక్షాలలో దుష్టగజాలు ఉంచాలి.

3. ఉరస్యంలో కవచాలు తొడిగిన అశ్వాల్లో కక్షపక్షాలలో కవచాలు లేని అశ్వాలు ఉంచిన ట్లయితే అది శుద్ధాశ్వవ్యూహం.

4. ముందు కవచధారులైన కాలిబంట్లు, వెనుక ధనుర్ధారులైన కాలిబంట్లు ఉన్నది శుద్ధపత్తివ్యూహం. ఇవి శుద్ధవ్యూహాలు.

మూ. 1. పత్తయః పక్షయోః, అశ్వాః పార్శ్వయోః, హస్తినః పృష్ఠతః, రథాః పురస్తాత్, పరవ్యూహవశేన వా విపర్యాస ఇతి ద్వ్యఙ్గబలవిభాగః. తేన త్ర్యఙ్గబలవిభాగో వ్యాఖ్యాతః.

2. దణ్డసంపత్ సారబలం పుంసామ్. హస్త్యశ్వయోర్విశేషః-కులం, జాతిః, సత్త్వం, వయఃస్థతా, ప్రాణో, వర్ష్మ, జవః, తేజః, శిల్పమ్, స్థైర్యమ్, ఉదగ్రతా, విధేయతా, సువ్యఞ్జనాచారతేతి.

వ్యా. 1. పక్షాలలో కాలిబంట్లు, పార్శ్వాలలో అశ్వాలు, (ఇదొక ద్వ్యంగబల విభాగం), ఏనుగులు వెనక, రథాలు ముందు ఉండాలి. (ఇదొక ద్వ్యంగబలవిభాగం) లేదా శత్రువు చేసిన వ్యూహాన్ని పట్టి వీటిని మార్చాలి. ఇది ద్వ్యంగబలవిభాగం. దీనిచేత త్ర్యంగబలవిభాగం కూడ చెప్పబడినట్లే.

2. ప్రకృతిసంపత్ప్రకరణంలో "పితృపైతామహః, నిత్యః, వశ్యః" ఇత్యాదివాక్యాలలో చెప్పిన సారం కలిగి ఉండడం కాలిబంట్లకు సంబంధించినంతవరకు, దండసంపద. గజాశ్వాల విషయంలో ఈ విశేషం ఉండాలి - కులం, జాతి, ధైర్యం, మంచి వయస్సులో ఉండడం, ప్రాణశక్తి, శరీరప్రమాణం, వేగం, తేజస్సు, పనిలో నేర్పు,స్థిరత్వం, తల ఎత్తికొని ఉండడం, చెప్పిన పని చేయడం, మంచి లక్షణాలు, చేష్టలు కలిగి ఉండడం. (ఇవి అశ్వగజాల కుండవలసిన విశేషలక్షణాలు).

మూ. 1. పత్త్యశ్వరథద్విపానాం సారత్రిభాగమ్ ఉరస్యం స్థాపయేత్, ద్వౌ త్రిభాగౌ కక్షం, పక్షం చోభయతః, అనులోమమనుసారమ్. ప్రతిలోమం తృతీయసారమ్. ఫల్గు ప్రతిలోమమ్. ఏవం సర్వముపయోగం గమయేత్.

2. ఫల్గుబలమన్తేష్వవధాయ వేగాభిహూలికో భవతి. సారబలమగ్రతః కృత్వా కోటీష్వనుసారం కుర్యాత్. జఘనే తృతీయసారమ్, మధ్యే ఫల్గుబలమ్, ఏతత్ సహిష్ణు భవతి.

వ్యా. 1. పత్తి-అశ్వ-రథ-ద్విపాలలో చాల శ్రేష్ఠమైనవాటి మూడవ భాగం ఉరస్యంగా (మధ్యలో) ఉంచాలి. మిగిలిన రెండు మూడవ భాగాలు (సగం సగం చేసి) రెండు కక్షాల లోను రెండు పక్షాలలోను ఉంచాలి. అనుసారాన్ని (వాటికంటె తక్కువ సారం గలవాటిని) వాటి వెనకాల ఉంచాలి. తృతీయసారాన్ని (అనుసారంకంటె తక్కువ సారం గల వాటిని) ఉత్తమసారం గల దానిముందు ఉంచాలి. ఫల్గుసైన్యాన్ని (చాల తక్కువ సారం గల నాసిరకం సైన్యాన్ని) తృతీయసారసైన్యం ముందు ఉంచాలి. ఈ విధంగా అన్ని విధాల సైన్యాన్నీకూడ ఉపయోగించుకోవాలి.

2. ఫల్గుబలాన్ని చివర్ల ఉంచడంచేత శత్రువుయొక్క బలాన్ని వేగంగా అడ్డుకొనకలుగుతాడు. సారబలాన్ని ముందు ఉంచి, అనుసారబలాన్ని చివర్లయందు ఉంచాలి. తృతీయసారాన్ని జఘనంలోను, ఫల్గుబలాన్ని మధ్యయందు ఉంచినా ఈ వ్యూహం కూడ శత్రువు తాకిడికి తట్టుకొంటుంది.

మూ. 1. వ్యూహం తు స్థాపయిత్వా పక్షకక్షోరస్యానామేకేన ద్వాభ్యాం వా ప్రహరేత్. శేషైః ప్రతిగృహ్ణీయాత్.

2. యత్ పరస్య దుర్బలం వీతహస్త్యశ్వం, దూష్యాత్మకం కృతోపజాపం వా, తత్ ప్రభూతసారేణాభిహన్యాత్. యద్వా పరస్య సాధిష్ఠం తద్ ద్విగుణసారే ణాభిహన్యాత్.యదఙ్గమల్పసారమాత్మనః తద్ బహునా ఉపచినుయాత్. యతః పరస్పరాపచయః తతో వ్యూహేత, యతో వా భయం స్యాత్.

వ్యా. 1. వ్యూహాన్ని పన్ని పక్ష-కక్ష-ఉరస్సులలో ఒక సైన్యంచేత కాని, రెండింటిచేత గాని, శత్రుసైన్యంమీదికి దాడి చెయ్యాలి. మిగిలిన సైన్యాలచేత శత్రువు చేసే దాడిని ఎదుర్కోవాలి.

2. శత్రువుయొక్క ఏ సైన్యం హస్త్యశ్వాలు లేనిదై దూష్యులు అధికంగా ఉండి లేదా ఉపజాపం చేయబడి దుర్బలంగా ఉంటుందో దానిని అత్యధికమైన సారం గల తన సైన్యంచేత నశింపచెయ్యాలి. పరుని ఏ సైన్యం చాల సారం కలదై ఉంటుందో దానిని రెట్టింపుసారం ఉన్న స్వసైన్యంచేత నశింపచెయ్యాలి. తన సైన్యంలో ఏ అంగం తక్కువ సారం గలదిగా ఉంటుందో దానికి ఎక్కువ సంఖ్య చేర్చి వృద్ధిచెయ్యాలి. ఎటువైపు శత్రువు దుర్బలంగా ఉంటాడో లేదా ఎటువైపునుండి భయానికి అవకాశం

ఉంటుందో, దానిదగ్గర వ్యూహం పన్నుకోవాలి.

మూ. 1. అభిసృతం, పరిసృతమ్, అతిసృతమ్, అపసృతమ్, ఉన్మథ్యావధానమ్, వలయః, గోమూత్రికా, మణ్డలమ్, ప్రకీర్ణికా, వ్యావృత్తపృష్ఠమ్, అనువశమ్ అగ్రతః పార్శ్వాభ్యాం పృష్ఠతో భగ్నరక్షా, భగ్నానుపాతః ఇత్యశ్వయుద్ధాని.

2. ప్రకీర్ణికావర్జా న్యేతాన్యేవ చతుర్ణామఙ్గానాం వ్యస్తసమస్తానాం వా ఘాతః, పక్షకక్షోరస్యానాం చ ప్రభఞ్జనమవస్కన్దః, సౌప్తికం చేతి హస్తియుద్ధాని.

3. ఉన్మథ్యావధానవర్జాని ఏతాన్యేవ స్వభూమౌ అభియానాపయానస్థిత యుద్ధానీతి రథయుద్ధాని.

4. సర్వదేశకాలప్రహరణమ్ ఉపాంశుదణ్డశ్చేతి పత్తియుద్ధాని.

వ్యా. 1. అభిసృతం (ముందుగానే స్వసైన్యంనుంచి పరసైన్యంలోనికి చొచ్చుకొని పోవడం), పరిసృతం (శత్రుసైన్యానికి ముందు, వెనుక,పార్శ్వాలలోను దెబ్బతీసి చుట్టూ తిరగడం), అతిసృతం(పరసైన్యాన్ని మధ్యలో భేదించి సూదివలె అటువైపుకు వెళ్లడం), అపసృతం (ఆ మార్గంచేతనే తిరిగి వెనుకకు రావడం), చాలా అశ్వాలు వెళ్లి శత్రుసైన్యాన్ని ఇటూ అటూ మథించివేసి మళ్లీ ఒక చోట నిలబడడం అనే ఉన్మథ్యావధానం, వలయం (సూది గ్రుచ్చినట్లు రెండు మార్గాలలో వెళ్లి ఎదిరించడం), గోమూత్రిక (ఎద్దు నడుస్తూ మూత్రం విసర్జించినప్పుడు దాని ధార నేలమీద వంకరటింకరగా ఉన్నట్లు వంకరటింకరగా నడవడం), మండలం (శత్రుసైన్యంలో ఒక భాగాన్ని వేరుచేసి దానిని చుట్టి ఉండడం), ప్రకీర్ణిక (అన్ని గతులను కలిపి ప్రయోగించడం), వ్యావృత్తపృష్ఠం (దూరంగా వెళ్లిపోయి మళ్లీ తిరిగి వెనుకకు రావడం), అనువంశం (శత్రుబలానికి అభిముఖంగా ఉన్న స్వబలం వెనుకనే ఉండడం, యుద్ధం చేస్తూ చేస్తూ తిరిగి తమ సైన్యంలో ప్రవేశించడం అనువంశం అని కొందరు), తమ సైన్యం ఓడిపోతూన్నప్పుడు దానిముందూ, ప్రక్కలా, వెనకా తిరుగుతూ రక్షించడం, భగ్నానుపాతం (ఓడిపోయిన శత్రుసైన్యాన్ని వెన్నంటడం) ఇవి అశ్వసైన్యం చేసే యుద్ధవిధానాలు.

2. ప్రకీర్ణిక తప్ప పైన చెప్పిన అశ్వయుద్ధవిధానాలు, సైన్యానికి సంబంధించిన

నాలుగు అంగాలను, అవి కలిసి ఉన్నా, విడి విడిగా ఉన్నా,చంపడం, శత్రువుయొక్క పక్ష-కక్ష-ఉరస్యసైన్యాలను మర్దించడం, అవకాశం లభించగానే ఆక్రమించడం, శత్రుసైన్యం నిద్రపోతూన్నప్పుడు త్రొక్కి చంపివేయడం ఇవి హస్తియుద్ధవిధానాలు.

3. ఉన్మథ్యావధానం తప్ప మిగిలిన హస్తియుద్ధవిధానాలు,స్వభూమియందు (అనుకూలమైన నేలమీద) శత్రుబలాన్ని ఆక్రమించడం, ఆక్రమించి వెనుకకు తిరిగి రావడం, ఒకే చోట శత్రువు కోట చుట్టూ నిలచి యుద్ధం చేయడం ఇవి రథయుద్ధాలు.

4. అన్ని దేశాలలోను అన్ని కాలాలలోను శత్రువులను సంహరించడం, ఉపాంశుదండం (రహస్యోపాయాలచేత చంపడం) ఇవి పత్తియుద్ధవిధానాలు.

శ్లో. ఏతేన విధినా వ్యూహానోజాన్ యుగ్మాంశ్చ కారయేత్,
విభవో యావదఙ్గానాం చతుర్ణాం సదృశో భవేత్.

వ్యా. ఈ విధంగా తన నాలుగు సేనాంగాల సామర్థ్యాన్ని పట్టి సరిసంఖ్యలోను, బేసిసంఖ్యలోను వ్యూహాలను పన్నాలి.

శ్లో. ద్వే శతే ధనుషాం గత్వా రాజా తిష్ఠేత్ ప్రతిగ్రహే,
భిన్నసంఘాతనం తస్మాన్న యుధ్యేతాప్రతిగ్రహః.

ఇతి కౌటలీయార్థశాస్త్రే సాంగ్రామికే దశమాధికరణే పఞ్చమోఽధ్యాయః,
పక్షకక్షోరస్యానాం బలాగ్రతో వ్యూహవిభాగః,
సారఫల్గుబలవిభాగః,పత్త్యశ్వరథహస్తియుద్ధాని చ, ఆదితః త్రయస్త్రింశచ్ఛతతమః.

వ్యా. రాజు రెండు వందల ధనస్సుల దూరం వెళ్లి ప్రతిగ్రహంలో (సైన్యం వెనుకభాగంలో) ఉండాలి. అలా చేయడంచేత ఓడిపోయిన తన సైనికుల్ని మళ్లీ ఒక చోటికి చేర్చడం కుదురుతుంది. ప్రతిగ్రహం లేకుండా యుద్ధం చేయగూడదు.

"బాలానందిని" అను కౌటలీయార్థశాస్త్రాంధ్రవ్యాఖ్యానంలో సాంగ్రామికం అనే దశమాధికరణంలో
పక్షకక్షోరస్యాలను బలాగ్రంలో వ్యూహంగా విభజించడం, సారఫల్గుబలవిభాగం,
పత్త్యశ్వరథహస్తియుద్ధాలు అనే పంచమాధ్యాయం, ప్రారంభంనుండి నూటముప్పైమూడవ
అధ్యాయం సమాప్తం.

# అథ షష్ఠోఽధ్యాయః

## అష్టపఞ్చాశచ్ఛతతమం ప్రకరణమ్-దణ్డభోగమణ్డలాసంహతవ్యూహ వ్యూహనమ్. ఏకోనషష్టిశతతమం ప్రకరణమ్ - తస్య ప్రతివ్యూహస్థాపనమ్.

(దండాకారంలోను, సర్పాకారంలోను మండలాకారంలోను సైన్యాన్ని వ్యూహం పన్నడం, ఏ వ్యూహం లేకుండా ఉండడం ఈవ్యూహానికి ప్రతివ్యూహం పన్నడం.)

మూ. 1. పక్షౌ, ఉరస్యం, ప్రతిగ్రహః ఇత్యౌశనసో వ్యూహవిభాగః. పక్షౌ, కక్షౌ ఉరస్యం, ప్రతిగ్రహః ఇతి బార్హస్పత్యాః.

2. ప్రపక్షకక్షోరస్యా ఉభయోః దణ్డభోగమణ్డలాసంహతాః ప్రకృతివ్యూహాః.తత్ర తిర్యగ్వృత్తిర్దణ్డః. సమస్తానాన్వావృత్తిః భోగః. సరతాం సర్వతోవృత్తిః మణ్డలః. స్థితానాం పృథగనీకవృత్తిరసంహతః.

వ్యా. 1. వ్యూహంలో రెండుపక్షాలు, ఉరస్యం (మధ్యప్రదేశం), ప్రతిగ్రహం (సైన్యపృష్ఠదేశం) ఈ నాలుగు అవయవాలు ఉంటాయి అని శుక్రాచార్యసంమతమైన వ్యూహవిభాగం. రెండు పక్షాలు, రెండు కక్షాలు, ఉరస్యం, ప్రతిగ్రహం అని ఆరు అవయవాలు ఉంటాయి అని బృహస్పతిసంమతమైన వ్యూహవిభాగం.

2. ఆ ఇద్దరు ఆచార్యుల మతం ప్రకారం కూడ విడివిడిగా ఉన్న పక్షాలు, కక్షాలు, ఉరస్యాలు ఉండే దండ-భోగ-మండల-అసంహతా లనే నాలుగు విధాలైన వ్యూహాలు ప్రకృతివ్యూహాలు, ఇతరవ్యూహాలకు మూలమైన వ్యూహా లని అర్థం. ఈ నాలుగు విధాల వ్యూహాలలో అడ్డంగా పన్నినది దండవ్యూహం. పక్షాదుల చతుష్టయం లేదా షట్కం ఒక దాని తరవాత ఒకటి కూర్చబడిన ట్లయితే అది భోగవ్యూహం. మెలికలు తిరిగిన సర్పశరీరం వలె ఉండడంచేత దీని కా పేరు. శత్రుసైన్యానికి అభిముఖంగా సమస్తసైన్యాలూ కలిసి ఒక్కుమ్మడిగా అన్ని వైపులా ప్రసరించడం మండలం. నిలచిన సైన్యాలు వేరు వేరుగా పని చేయడం అసంహతం.

మూ. పక్షకక్షోరస్యైః సమం వర్తమానః దణ్డః. స కక్షాభిక్రాన్తః ప్రదరః. స ఏవ పక్షాభ్యాం ప్రతిక్రాన్తః దృఢకః. స ఏవాతిక్రాన్తః పక్షాభ్యామ్ అసహ్యః. పక్షావవస్థాప్య ఉరస్యాభిక్రాన్తః శ్యేనః. విపర్యయే చాపం చాపకుక్షిః, ప్రతిష్ఠః, సుప్రతిష్ఠశ్చ. చాపపక్షః సఞ్జయః. స ఏవోరస్యాతిక్రాన్తః విజయః. స్థూలకర్ణ

పక్షః స్థూలకర్ణః, ద్విగుణపక్షస్థూలః విశాలవిజయః. వ్యభిక్రాన్తపక్షః చమూముఖః. విపర్యయే ఝషాస్యః. ఊర్ధ్వరాజిర్దణ్డః సూచీ. ద్వౌ దణ్డౌ వలయః. చత్వారో దుర్జయః ఇతి దణ్డవ్యూహాః.

వ్యా. పక్షాలు, కక్షాలు, ఉరస్యం ఇవన్నీ సమంగా (ఉండవలసిన చోట) ఉంటే అది దండవ్యూహం. (ఇది పైన చెప్పిన నాలుగు ప్రకృతివ్యూహాలలో మొదటిది. దీనిలోనే కొన్ని మార్పులు చేయడంచేత ఏర్పడే వ్యూహాలు చెపుతున్నాడు). ఆ దండవ్యూహంలోని కక్షాలు శత్రుబలానికి ఎదురుగా వెడితే ప్రదరవ్యూహం అవుతుంది. ఆ దండంలోని పక్షాలు కక్షంవైపు వస్తున్న శత్రుబలాన్ని ఎదుర్కొనడం కోసం వెనుకకు వస్తే అది దృఢకవ్యూహం. ఆ దృఢకంలోని పక్షాలు శత్రుబలంలోనికి చొచ్చుకొని పోతే అది అసహ్యవ్యూహం. రెండు పక్షాలను వాటి స్థానంలో ఉంచి ఉరస్యం శత్రుబలం వైపు ముందుకు వెడితే అది శ్యేనవ్యూహం. పైన చెప్పిన నాలిగింటికీ విపరీతంగా ఉంటే అవి వరసగా చాప - చాపకుక్షి - ప్రతిష్ఠ - సుప్రతిష్ఠ వ్యూహాలు. అనగా - దండవ్యూహంలోని కక్షాలు వెనకకి వెడితే చాపవ్యూహం. పక్షాలు శత్రుబలం వైపు ముందుకు వెడితే అది చాపకుక్షి వ్యూహం. పక్షాలు వెనుక వైపుకు వెడితే అది ప్రతిష్ఠావ్యూహం. ఉరస్యం పక్షాలు కూడ ముందుకు నడిస్తే అది సుప్రతిష్ఠవ్యూహం. ధనురాకారంలో పక్షాలు ఉన్నది సంజయవ్యూహం. ఉరస్యంతో ముందుకు చొచ్చుకొని పోయి శత్రుబలంలో ప్రవేశించిన దండవ్యూహం "విజయవ్యూహం". పక్షాల చెవులు స్థూలంగా ఉన్నది స్థూలకర్ణవ్యూహం. 'స్థూణాకర్ణం' అని పాఠాన్తరం. పక్షాలలో విజయం కంటె రెట్టింపు స్థూలమైనది "విశాలవిజయవ్యూహం". కక్షం మొదలైన మూడింటినీ పక్షాలు దాటి ఉన్నది "చమూముఖం". ఉరస్యం పక్షకక్షాలని దాటి ఉన్నా, కక్షాలు ఉరస్యపక్షాలను దాటి ఉన్నా అది "ఝషాస్యవ్యూహం". పైభాగంలోని పంక్తి శత్రుబలానికి అభిముఖంగా ఉంటే అది 'సూచీవ్యూహం'. పక్ష-కక్ష-ఉరస్యాలకు అడ్డంగా రెండు దండ వ్యూహాలున్నది "వలయవ్యూహం". నాలు గున్నది దుర్జయవ్యూహం. ఇవి దండవ్యూహాలు. అనగా ఇవన్నీ దండవ్యూహంలోనే కొంచెం మార్పులు చేస్తే ఏర్పడిన వ్యూహాలు.

మూ. 1. పక్షకక్షోరస్యైః విషమం వర్తమానః భోగః. స సర్పసారీ గోమూత్రికా వా. స యుగ్మోరస్యో దణ్డపక్షః శకటః, విపర్యయే మకరః. హస్త్యశ్వరథైః వ్యతికీర్ణః శకటః పరిపన్తకః. ఇతి భోగవ్యూహాః.

2. పక్షకక్షోరస్యానామ్ ఏకీభావే మణ్డలః. స సర్వతోముఖః సర్వతోభద్రః. అష్టానీకో దుర్జయః. ఇతి మణ్డలవ్యూహాః.

3. పక్షకక్షోరస్యానామ్ అసంహితావసంహతః. స పఞ్చానీకానామాకృతి స్థాపనాత్ వజ్రః, గోధా వా. చతుర్ణాముద్యానకః కాకపదీ వా. త్రయాణా మర్ధచన్ద్రికః కర్కటశృఙ్గీ వా. ఇత్యసంహతవ్యూహాః.

వ్యా.1. పక్ష-కక్ష-ఉరస్యాలు ఎగుడుదిగుడుగా నిలచినా అలా ఉండి యుద్ధంలో పాల్గొన్నా అది "భోగవ్యూహం". అది సర్పం వలె ఏకాకారంలో ఉండవచ్చు లేదా గోమూత్రిక వలె వంకరటింకరగా (క్రిందికీ పైకీ) ఉండవచ్చు. ఆ భోగవ్యూహంలోని ఉరస్యం రెండు దండాలుగాను, పక్షాలు రెండేసి దండాలుగాను విభజించబడి ఉన్నట్లయితే అది "శకటవ్యూహం". దీనికి విరుద్ధంగా ఉంటే అనగా ఉరస్యం ఏకదండాకారంలోను పక్షాలు రెండేసి దండాల ఆకారాలలోను ఉంటే అది "మకరవ్యూహం". శకటవ్యూహంలో హస్త్యశ్వరథాలు ఎక్కువగా కలిపితే అది "పారిపంతకవ్యూహం". ఇవి భోగవ్యూహం అనే ప్రకృతివ్యూహం నుండి ఏర్పడిన దాని అవాంతరభేదాలు; వికృతులు.

2. పక్షాలు, కక్షాలు, ఉరస్యాలు చాల దగ్గర దగ్గరగా ఉంటే "అది మండల వ్యూహం". అన్ని వైపులనుండీ శత్రువును ఆక్రమిస్తే ఆ మండలవ్యూహానికే "సర్వతోభద్రవ్యూహం" అని పేరు. రెండు ఉరస్యాలు, నాలుగు పక్షాలు, రెండు కక్షాలు ఉన్నది దుర్జయం. ఇవి మండలవ్యూహాలు.

3. పక్ష - కక్ష - ఉరస్యాలు దగ్గరగా కలవకుండా ఉంటే (దూరదూరంగా ఉంటే) అది "అసంహతవ్యూహం". ఈ ఐదు అనీకాలను (పక్ష - కక్ష - ఉరస్యాలను) వజ్రాకారంలో నిలిపితే అది "వజ్రవ్యూహం". ఉడుము ఆకారంలో నిలిపితే అది "గోధావ్యూహం". నాలుగు అనీకాలను అనగా పక్ష - కక్ష - ఉరస్య - ప్రతిగ్రహాలను కాకి పాదం ఆకారంలో నిలిపితే దానికి "ఉద్యానకం" లేదా "కాకపదీవ్యూహం" అని పేరు. మూడు అనీకాలను (రెండు పక్షాలను ప్రతిగ్రహోరస్యాలలో ఒక దానిని ఒక విధమైన ఆకారంలో (వంకరగా) నిలబెడితే అది "అర్ధచంద్రికవ్యూహం" లేదా "కర్కటశృంగి వ్యూహం". ఇవి అసంహతవ్యూహాలు.

మూ. 1. రథోరస్యో హస్తికక్షః, అశ్వపృష్ఠః అరిష్టః.

2. పత్తయః, అశ్వాః, రథాః, హస్తినశ్చ అనుపృష్ఠమచలః.

3. హస్తినః, అశ్వాః, రథాః, పత్తయశ్చ అనుపృష్ఠమప్రతిహతః.

4. తేషాం ప్రదరం దృఢకేన ఘాతయేత్; దృఢకమసహ్యేన; శ్యేనం చాపేన; ప్రతిష్ఠం సుప్రతిష్ఠేన; సంజయం విజయేన; స్థూలకర్ణం విశాలవిజయేన; పారిపతన్తకం సర్వతోభద్రేణ; దుర్జయేన సర్వాన్ ప్రతివ్యూహేత.

5. పత్త్యశ్వరథద్విపానాం పూర్వం పూర్వమ్ ఉత్తరేణ ఘాతయేత్. హీనాఙ్గమ్ అధికాఙ్గేన చేతి.

వ్యా. 1. ఉరస్యంలో రథాలు, కక్షాలలో ఏనుగులు, పృష్ఠభాగంలో అశ్వాలు (పక్షాలలో పదాతులు) ఉన్న సైన్యం "అరిష్టం".

2. పదాతులు, అశ్వాలు, రథాలు, ఏనుగులు - ఇవి ఒకదాని వెనుక ఒకటి ఉంటే అది "అచలబలం".

3. ఏనుగులు, అశ్వాలు, రథాలు, పదాతులు-ఇవి ఒకదాని తరవాత ఒకటి ఉంటే అది "అప్రతిహతబలం".

4. పైన చెప్పిన వ్యూహాలలో ప్రదరవ్యూహాన్ని దృఢకవ్యూహంతో ఎదుర్కోవాలి. దృఢకవ్యూహాన్ని అసహ్యవ్యూహంతోను, "శ్యేనవ్యూహాన్ని చాపవ్యూహంతోను, ప్రతిష్ఠవ్యూహాన్ని సుప్రతిష్ఠవ్యూహంతోను, సంజయవ్యూహాన్ని విజయవ్యూహంతోను, స్థూలకర్ణవ్యూహాన్ని విశాలవిజయవ్యూహంతోను, పారిపతంతకవ్యూహాన్ని సర్వతోభద్ర వ్యూహంతోను ఎదిరించాలి. అన్ని వ్యూహాలకు ఎదురుగా దుర్జయవ్యూహం పన్నాలి.

5. పదాతులు, అశ్వాలు, రథాలు, ఏనుగులు - వీటిలో పూర్వపూర్వాన్ని తరవాతిదానిచేత నశింపచెయ్యాలి. అనగా అశ్వాలచేత పదాతిదళాన్ని, రథసైన్యంచేత అశ్వసైన్యాన్ని, హస్తిసైన్యంచేత రథసైన్యాన్నీ నశింపచెయ్యాలి. తక్కువ అంగాలు ఉన్న సైన్యాన్ని అధికమైన అంగాలు గల సైన్యంచేత నశింపచెయ్యాలి.

మూ. 1. అఙ్గదశకస్య ఏకః పతిః పతికః. పతికదశకస్య ఏకః సేనాపతిః. తద్దశకస్య ఏకః నాయకః ఇతి. స తూర్యఘోషధ్వజపతాకాభిః వ్యూహాఙ్గానాం సంజ్ఞాః స్థాపయేత్, అఙ్గవిభాగే, సంఘాతే,స్థానే, గమనే, వ్యావర్తనే, ప్రహరణే చ.

2. సమే వ్యూహే దేశకాలసారయోగాత్ సిద్ధిః.

వ్యా. 1. అంగం అనగా ఒక చిన్న విభాగం (unit). ఒక రథం లేదా ఒక ఏనుగు,

ఐదు గుల్మాలు, ముప్పైమంది కాలిబంట్లు - ఇవి ఒక అంగం. పది అంగాల నాయకుడు పతికుడు (పదికుడు. గ.శా.). పదిమంది పతికులమీద ఒక నాయకుడు సేనాపతి. పదిమంది సేనాపతుల మీద ఒక నాయకుడు నాయకుడు. ఆ నాయకుడు వ్యూహాలలోని అంగాలను విభజించడానికి (వేరువేరుగా నిలబడే టట్లు చేయడానికి), కలపడానికి, నిలపడానికి, ముందు నడవడానికి, వెనుకకు మరలడానికి, యుద్ధం చేయడానికి వాద్యఘోషాలచేత, ధ్వజాలచేత, పతాకలచేత సంకేతాలు ఏర్పరచాలి. అనగా ఈ విధమైన తూర్యఘోషం చేస్తే ఆగాలి, ఈ విధంగా చేస్తే ముందుకు నడవాలి, ఈ ధ్వజం కాని పతాక (చిన్న జండా) కాని చూపుతే దగ్గరికి రావాలి, ఈ విధమైనవి చూపితే దూరదూరంగా నిలబడాలి ఇత్యాదివిధంగా సంకేతాలు ఏర్పరచాలి అని అర్థం.

2. తన వ్యూహాలు, శత్రువ్యూహాలు, సమంగా ఉన్నప్పుడు దేశాన్ని పట్టి, కాలాన్ని పట్టి, సారాన్ని పట్టి విజయం లభిస్తుంది.

శ్లో. యన్త్రైరుపనిషద్యోగైః తీక్ష్ణైర్వ్యాసక్తఘాతిభిః,
మాయాభిర్దైవసంయోగైః శకటైర్హస్తిభూషణైః,
దూష్యప్రకోపైర్గోయూథైః స్కన్ధావారప్రదీపనైః,
కోటీజఘనఘాతైర్వా దూతవ్యఞ్జనభేదనైః,
"దుర్గం దగ్ధం హృతం వా తే కోపః కుల్యః సముత్థితః,
శత్రురాటవికో వే" తి పరస్యోద్వేగమాచరేత్.

వ్యా. యంత్రాలచేత (ఔపనిషదికాధికరణంలో చెప్పబోయే) రహస్యవిషప్రయోగాదులచేత, ఇతరకార్యాలలో మగ్నులైనవాళ్లని చంపే తీక్ష్ణులచేత, ఇంద్రజాలాది విద్యలచేత, దేవతాసంబంధాలచేత (రాజుకు దేవతాసాక్షాత్కారం ఉంది అని చెప్పడంచేత), ఏనుగులకు వేసే వేషభూషణాదులచేత కప్పబడిన బండ్లచేత (గ.శా.) బండ్లచేత, 'హస్తిభీషణైః' అనే పాఠం గ్రహించి ఏనుగులచేత భయపెట్టడంచేత (కాంగ్లే) దూష్యులను ప్రకోపింపచేయడాలచేత, యుద్ధాగ్రంలో ఆవుల గుంపులు ఉంచడంచేత స్కంధావారాలను కాల్చివేయడంచేత, హటాత్తుగా పక్షాలను, కక్షాలను ఆక్రమించడంచేత, దూతల వేషాలలో ఉన్న గూఢచారుల ద్వారా భేదం కలిగించడంచేత, శత్రువుకు భయం కలిగించాలి. "నీ దుర్గం కాల్చబడింది; నీ దుర్గం హరించబడింది; నీ వంశంవాళ్ల ప్రకోపం చెలరేగింది, నీ శత్రువు దండెత్తి వస్తున్నాడు, ఆటవికులు దండెత్తి వస్తున్నారు" అని చెప్పడంచేత శత్రువుకు భయం కలిగించాలి.

శ్లో. ఏకం హన్యాన్న వా హన్యాదిషుః క్షిప్తో ధనుష్మతా,
ప్రాజ్ఞేన తు మతిః క్షిప్తా హన్యాద్గర్భగతానపి.

ఇతి కౌటలీయార్థశాస్త్రే సాంగ్రామికే దశమాధికరణే షష్ఠోఽధ్యాయః,
దణ్డభోగమణ్డలాసంహత వ్యూహవ్యూహనం తస్య ప్రతివ్యూహస్థాపనం చ,
ఆదితః చతుస్త్రింశచ్ఛతతమః.

ఏతావతా కౌటలీయార్థశాస్త్రస్య సాంగ్రామికం దశమమధికరణం సమాప్తమ్.

వ్యా. ధానుష్కుడు విడచిన బాణం ఒకనిని చంపవచ్చును, చంపకపోవచ్చును. కాని బుద్ధిమంతుడు విసిరిన మతి (ఆలోచన) మాత్రం గర్భంలో ఉన్నవాళ్లని కూడ చంపివేస్తుంది.

"బాలానందిని" అను కౌటలీయార్థశాస్త్రాంధ్రవ్యాఖ్యానంలో సాంగ్రామికం అనే దశమాధికరణంలో దండ-భోగ-మండల-అసంహతవ్యూహాలు పన్నడం, వ్యూహానికి ప్రతివ్యూహం పన్నడం అనే ఆరవ అధ్యాయం ప్రారంభంనుంచి నూటముప్పైనాల్గవ అధ్యాయం సమాప్తం.

ఇంతటితో కౌటలీయార్థశాస్త్రంలోని సంగ్రామికం అనే దశమాధికరణం సమాప్తం.

## అథ సంఘవృత్తమ్ - ఏకాదశమధికరణమ్

సంఘరాజ్యాల (oligarchies) విషయంలో ప్రవర్తన - పదకొండవ అధికరణం

## ప్రథమోఽధ్యాయః

### షష్టిశతతమం ప్రకరణమ్ - భేదోపాదానాని (భేదభావాలు పుట్టించడం)

### ఏకషష్టిశతతమం ప్రకరణమ్ - ఉపాంశుదణ్డాః (రహస్యదండనవిధానాలు)

సూ. 1. సంఘలాభో దణ్డమిత్రలాభానాముత్తమః. సంఘా హి సంహతత్వాత్ అధృష్యాః పరేషామ్. తాననుగుణాన్ భుఞ్జీత సామదానాభ్యామ్, విగుణాన్ భేదదణ్డాభ్యామ్.

2. కామ్బోజసురాష్ట్రక్షత్రియశ్రేణ్యాదయః వార్తాశస్త్రోపజీవినః. లిచ్ఛవిక వ్రజిక మల్లక మద్రక కుకుర కురుపాఞ్చాలాదయః రాజశబ్దోపజీవినః.

వ్యా. 1. సంఘరాజ్యం సహాయం లభించడం దండలాభంకంటె మిత్రలాభంకంటె

కూడ మంచిది. ఎందువల్ల ననగా - సంఘాలు బాగా కలిసి కట్టుదనంతో ఉండడంచేత వాటిని శత్రువులు ఎదుర్కొనజాలరు. ఆ సంఘాలు తనకు అనుకూలంగా ఉన్నప్పుడు (విజిగీషువు) వాటిని సామదానాలచేత అనుభవించాలి (స్వాధీనం చేసుకోవాలి). అవి ప్రతికూలంగా ఉంటే భేదదండాలచేత స్వాధీనం చేసుకోవాలి.

2. కాంబోజ-సురాష్ట్రదేశాలలోని క్షత్రియశ్రేణ్యాదులు (వైశ్యాదిశ్రేణులు కూడ) వార్త (కృషివాణిజ్యపశుపాలనల) మీద ఆయుధాలమీద ఆధారపడి ఉంటాయి. (గ.శా.). కాంబోజులు, సురాష్ట్రులు, క్షత్రియులు, శ్రేణులు మొదలైనవారు వార్తాశస్త్రోపజీవులు (కాంగ్లే). లిచ్ఛవిక-వ్రజిక-మల్లక-మద్రక-కుకుర-కురు-పాంచాలదేశాలలోనివాళ్లు కేవలం రాజులం అని చెప్పుకొంటూ సంఘాలమీద ఆధారపడి జీవిస్తూంటారు (గ.శా.) లిచ్ఛవికులు మొదలైనవాళ్లు 'రాజా' అని బిరుదులు పెట్టుకుంటారు (కాంగ్లే).

మూ. 1. సర్వేషామాసన్నాః సత్రిణః సంఘానాం పరస్పరన్యఙ్గద్వేషవైర కలహస్థానాన్యుపలభ్య క్రమాభినీతం భేదముపచారయేయుః- "అసౌ త్వా విజల్పతి" ఇతి. ఏవముభయతః బద్ధరోషాణాం విద్యాశిల్పద్యూతవైహారికేషు ఆచార్యవ్యఞ్జనా బాలకలహానుత్పాదయేయుః. వేశశౌణ్డికేషు వా ప్రతిలోమ ప్రశంసాభిః సంఘముఖ్యమనుష్యాణాం తీక్ష్ణాః కలహానుత్పాదయేయుః, కృత్యపక్షోపగ్రహేణ వా.

2. కుమారకాన్ విశిష్టచ్ఛన్దికయా హీనచ్ఛన్దికానుత్సాహయేయుః.

వ్యా. 1. ఈ సంఘాలన్నింటికీ దగ్గరగా చేరిన సత్రులు సంఘాల మధ్య ఉన్న పరస్పరనిందావచనాలు, ద్వేషం (వాక్పారుష్యంవల్ల కలిగిన రోషం ద్వేషం), వైరం (అపకారాదులవల్ల కలిగిన ద్రోహచిన్తనం వైరం), కలహించుకొనడానికి తగిన విషయాలు -వీటి నన్నింటినీ తెలుసుకొని క్రమంగా నమ్మకం కలిగించడం ద్వారా సాధించబడిన భేదోపాయాన్ని ప్రవర్తింపచేస్తూ "ఇతడు నిన్ను నిందిస్తున్నాడు" అని చెప్పాలి. రెండు వైపులవాళ్లూ పరస్పరం రోషంతో ఉన్నప్పుడు ఆచార్యుల (ఉపాధ్యాయుల) వేషాలలో ఉన్న గూఢచారులు విద్య, శిల్పం, ద్యూతం, విహారవిషయాలు -వీటిలో బాలుల మధ్య కలహాలు సృష్టించాలి. లేదా తీక్ష్ణులు, వేశ్యాగృహాలలోను, మద్యగృహాలలోను సంఘంలోని ముఖ్యులకు చెందిన మనుష్యుల శత్రువులను ప్రశంసించి గాని, వాళ్ల కృత్యపక్షాన్ని (వాళ్ల విషయంలో కోపం కలవాళ్లు, లుబ్ధులు, భీతులు, అవమానితులు - వీళ్ల పక్షాన్ని) బలపరచడం ద్వారా గాని కలహాలు సృజించాలి.

2. తక్కువ ఛందికలు (భోగాలు) గల చిన్న చిన్న రాజకుమారులను మీకు అధికమైన భోగ్యవస్తువులు ఏర్పరుస్తాం అని చెప్పి ప్రోత్సహించాలి.

మూ. విశిష్టానాం చైకపాత్రం వివాహం హీనేభ్యో వారయేయుః, హీనాద్వా విశిష్టైరేకపాత్రే వివాదే వా యోజయేయుః. అవహీనాన్వా తుల్యభావోపగమనే కులతః పౌరుషతః, స్థానవిపర్యాసతో వా. వ్యవహారమవస్థితం వా ప్రతిలోమస్థాపనేన నిశామయేయుః. వివాదపదేషు వా ద్రవ్యపశుమనుష్యఘాతేన రాత్రౌ తీక్ష్ణాః కలహానుత్పాదయేయుః. సర్వేషు చ కలహస్థానేషు హీనపక్షం రాజా కోశదణ్డాభ్యాముపగృహ్య ప్రతిపక్షవధే యోజయేత్, భిన్నానపవాహయేద్వా. ఏకదేశే సమస్తాన్వా నివేశ్య భూమౌ చైషాం పఞ్చకులీం దశకులీం వా కృష్యాం నివేశయేత్. ఏకస్థా హి శస్త్రగ్రహణసమర్థాః స్యుః. సమవాయే చైషామత్యయం స్థాపయేత్.

వ్యా. వాళ్లు (తీక్ష్ణులు) విశిష్టులకు హీనులతో భోజనాలూ వివాహసంబంధాలూ లేకుండా చెయ్యాలి. లేదా హీనులకు విశిష్టులతో కలిసి నిర్బంధపూర్వకంగా భోజనాలు వివాహసంబంధాలు ఏర్పరచాలి. బాగా తక్కువవాళ్లని కులంచేత, పౌరుషంచేత స్థానవిపర్యాసంచేత (ఉత్తమస్థానం పొందడంచేత change of status) విశిష్టులతో సములమే అని పోటీపడే టట్లు చెయ్యాలి. లేదా ఏదైన ఒక వ్యవహారం ఒక పద్ధతిలో సంఘముఖ్యులచేత నిర్ణయించబడినప్పుడు దానికి (ఆ నిర్ణయానికి) విరుద్ధమైన నిర్ణయాన్ని లేవనెత్తి దానిని స్థాపించడానికి ప్రయత్నించాలి. ఎవరికైనా పరస్పరం వివాదాలు ఏర్పడినప్పుడు తీక్ష్ణులు రాత్రులందు ఆ వివాదాలకి హేతువు లైన ద్రవ్యపశుమనుష్యాదులను చంపివేసి కలహాలు పుట్టించాలి. కలహస్థానా లన్నింటిలోను రాజు హీనపక్షంవానిని కోశ-సైన్యాలచేత తన ప్రక్కకు తిప్పుకొని ప్రతిపక్షులను చంపడానికి ప్రేరేపించాలి. లేదా విడగొట్టబడినవాళ్లని సంఘంలో చేరకుండా దూరంగా తీసికొనిపోవాలి. వాళ్లను అందరినీ ఒక ప్రదేశంలో నివసింపచేసి ఒక భూమియందు పంచకులిని (ఐదు కుటుంబాలను) గాని, దశకులిని గాని ఏర్పరచి వ్యవసాయంలో పెట్టాలి. ఎందువల్ల ననగా ఒక్క చోట ఉన్నవాళ్లు అవసరం వచ్చినప్పుడు శస్త్రగ్రహణం చేయడానికి సమర్థులుగా ఉంటారు. అక్కడ వాళ్లందరూ ఒక సంఘంగా ఏర్పడితే వాళ్లమీద అత్యయం (సాముహికదండనం) విధించాలి.

మూ. 1. రాజశబ్దిభిః అవరుద్ధమ్, అవక్షిప్తం వా కుల్యమభిజాతం రాజపుత్రత్వే స్థాపయేత్. కార్తాన్తికాదిశ్చాస్య వర్గః రాజలక్షణ్యతాం సంఘేషు ప్రకాశయేత్. సంఘముఖ్యాంశ్చ ధర్మిష్ఠానుపజపేత్- "స్వధర్మమముష్య రాజ్ఞః పుత్రే భ్రాతరి వా ప్రతిపద్యధ్వమ్" ఇతి. ప్రతిపన్నేషు కృత్యపక్షోపగ్రహార్థ మర్థం దణ్డం చ ప్రేషయేత్. విక్రమకాలే శౌణ్డికవ్యఞ్జనాః పుత్రదారప్రేతాపదేశన నైషేచనికమ్ ఇతి మదనరసయుక్తాన్ మద్యకుమ్భాన్ శతశః ప్రయచ్ఛేయుః.

2. చైత్యదైవతద్వారరక్షాస్థానేషు చ సత్రిణః సమయకర్మనిక్షేపం సహిరణ్యాభిజ్ఞానముద్రాణి హిరణ్యభాజనాని చ ప్రరూపయేయుః; దృశ్యమానేషు చ సంఘేషు రాజకీయాః ఇత్యావేదయేయుః. అథావస్కన్దం దద్యాత్.

వ్యా. 1. సంఘరాజ్యంలో రాజశబ్దోపజీవులచేత నిరోధించబడిన లేదా అవమానించబడిన ఉత్తమకులసంజాతుడు, సద్గుణవంతుడూ అయినవానిని "ఇతడు రాజపుత్రుడు" అని నిలబెట్టాలి. ఇతనికి సంబంధించిన జ్యోతిషికులు మొదలైనవాళ్లు అతనిలో రాజలక్షణా లున్నాయి అని సంఘాలలో ప్రచారం చెయ్యాలి. ధర్మిష్ఠులైన సంఘముఖ్యులకు "మీరు రాజపుత్రుని విషయంలో లేదా రాజసోదరుని విషయంలో మీ ధర్మం పాటించాలి" అని రహస్యంగా చెప్పిపెట్టాలి. వాళ్లు అందుకు అంగీకరించిన తరవాత కృత్యపక్షాన్ని (క్రుద్ధ-లుబ్ధ-భీతాదుల పక్షాన్ని) పట్టించడంకోసం ధనం సైన్యం కూడా పంపాలి. పరాక్రమం చూపే కాలంలో మద్యవిక్రేతల వేషాలలో ఉన్న గూఢచారులు "మా పుత్రుడు లేదా భార్య మరణించడంచేత వాళ్ల ప్రేతకార్యం సందర్భంలో వాళ్ల తృప్తికోసం ఇచ్చే పానీయం" అని పేరు పెట్టి మత్తు కలిగించే రసం కలిపిన మద్యం వందలకొలది కుండలలో వాళ్లకి ఇవ్వాలి.

2. సత్రులు చైత్యాల దగ్గర, దేవాలయప్రాంగణాలలోను, రక్షాస్థానాలలోను, ధనంతో నింపిన, అభిజ్ఞానముద్రలు (గుర్తించే సీళ్లు) కూడ ఉన్న ధనపాత్రలను సమయకర్మ పూర్వకంగా (ఒక షరతు ప్రకారం) తెచ్చిన నిక్షేపం (ఉంచబడిన ధనం) అని చెప్పాలి. సంఘానికి సంబంధించిన అక్కడ ఉన్నవాళ్లను నిర్దేశిస్తూ వీళ్లందరూ రాజకీయులే అనగా రాజుతో ఒప్పందం చేసుకొని ఈ ధనం తీసికొనడానికి వచ్చినవాళ్లే అని ఇతరులకు చెప్పాలి. (ఈ విధంగా చేయడంచేత వీళ్లందరూ రాజునుంచి లంచం

తీసికొని వాని పక్షానికి వెళ్లుచున్నారు అనే అభిప్రాయంతో సంఘంలోని ఇతరసభ్యులకు వాళ్లమీద ద్వేషం కలుగుతుంది అని భావం). అప్పుడు ఆక్రమణం చెయ్యాలి.

మూ. 1. సంఘానాం వా వాహనహిరణ్యే కాలికే గృహీత్వా సంఘముఖ్యాయ ప్రఖ్యాతం ద్రవ్యం ప్రయచ్ఛేత్. తదేషాం యాచితే 'దత్తమముష్మై ముఖ్యాయ' ఇతి బ్రూయాత్.

2. ఏతేన స్కన్ధావారాటవీభేదో వ్యాఖ్యాతః.

3. సంఘముఖ్యపుత్రమ్ ఆత్మసంభావితం వా సత్రీ గ్రాహయేత్- "అముష్య రాజ్ఞః పుత్రః త్వం శత్రుభయాదిహ న్యస్తోఽసి" ఇతి. ప్రతిపన్నం రాజా కోశదణ్డాభ్యామ్ ఉపగృహ్య సంఘేషు విక్రమయేత్. అవాప్తార్థస్తమపి ప్రవాసయేత్.

4. బన్ధకీపోషకాః ప్లవకనటనర్తకసౌభికాః వా ప్రణిహితాః స్త్రీభిః పరమయౌవనాభిః సంఘముఖ్యానున్మాదయేయుః. జాతకామానామ్ అన్యతమస్య ప్రత్యయం కృత్వా అన్యత్ర గమనేన ప్రసభహరణేన వా కలహానుత్పాదయేయుః. కలహే తీక్ష్ణాః కర్మ కుర్యుః- "హతోఽయమిత్థం కాముకః" ఇతి.

వ్యా. 1. సంఘాల వాహనాలు, ధనం కాలికంగా (ఇంత కాలానికి ఇవ్వవలసిన ఋణంగా) తీసికొని ఆ ద్రవ్యం అందరికీ తెలిసే టట్లు సంఘముఖ్యునికి ఇవ్వాలి. ఆ సంఘంలోనివాళ్లు వచ్చి అప్పుతీసికొన్న వాహనహిరణ్యాలు ఇమ్మని అడిగి నప్పుడు "ఫలానా ముఖ్యునికి ఇచ్చివేశాను" అని చెప్పాలి. దీనితో సంఘానికి ముఖ్యునికీ మధ్య భేదం ఏర్పడుతుంది అని భావం.

2. దీనిచేత స్కంధావారంలోను, ఆటవికులలోను భేదం పుట్టించే పద్ధతి వ్యాఖ్యానించినట్లే.

3. సత్రి సంఘముఖ్యుని పుత్రుడి దగ్గరికిగాని, ఆత్మసంభావితుణ్ణి (తాను చాల గొప్పవాడ నని అనుకొనే మరొక వ్యక్తి దగ్గరకు) గాని వెళ్లి- "నువ్వు ఫలానా రాజు పుత్రుడవు; నిన్ను శత్రుభయంచేత ఇక్కడ ఉంచారు" అని చెప్పి నమ్మించాలి. అతడు

నమ్మి అంగీకరించిన తరవాత రాజు కోశదండాలు అతనికి ఇచ్చి సంఘాలను ఎదిరించే టట్లు చెయ్యాలి. అనుకొన్న పని పూర్తి అయిన తరవాత వానిని కూడ బైటకు పంపివేయాలి. (లేదా చంపివేయాలి).

4. కులటలను పోషించేవాళ్లు గాని, ప్లవక-నట-నర్తక-సౌభికులు గాని గూఢచారులుగా వెళ్లి మంచి సౌందర్యం యౌవనం ఉన్న స్త్రీల చేత సంఘముఖ్యు లకు ఉన్మాదం (తీవ్రమైన కోరిక) కలిగేటట్లు చెయ్యాలి. ఆ విధంగా స్త్రీల విషయంలో కామం కలిగిన సంఘముఖ్యులలో ఒకని దగ్గరకు ఒక స్త్రీ వెళ్లగలదు అనే నమ్మకం కలిగించి (ఏర్పాటు చేసి), మరొకసంఘముఖ్యుని దగ్గరికి ఆమెను పంపి, నీ దగ్గరికి వస్తూన్న ఆమెను అతడు బలాత్కారంగా హరించుకొనిపోయాడు అని చెప్పి ఆ ముఖ్యుల మధ్య కలహం పుట్టించాలి. కలహం కలిగిన తరవాత తీక్ష్ణులు తాము చేయ వలసిన పని చేసి (ఒకనిని చంపివేసి) "ఈ కాముకుడు ఈ విధంగా చంపబడ్డాడు, అనగా ఈ ఇద్దరి మధ్యా కలహం రావడంచేత వీనిని చంపివేశారు" అని అందరికీ చెప్పాలి.

మూ. 1. విసంవాదితం వా మర్షయమాణమ్ అభిసృత్య స్త్రీ బ్రూయాత్ - "అసౌ మాం ముఖ్యః త్వయి జాతకామాం బాధతే. తస్మిన్ జీవతి నేహ స్థాస్యామి" ఇతి ఘాతమస్య ప్రయోజయేత్.

2. ప్రసహ్యాపహృతా వా వనాన్తే క్రీడాగృహే వా అపహర్తారం రాత్రౌ తీక్ష్ణేన ఘాతయేత్. స్వయం వా రసేన. తతః ప్రకాశయేత్ - "అమునా మే ప్రియో హతః" ఇతి.

3. జాతకామం వా సిద్ధవ్యఞ్జనః సాంవననికీభిః ఓషధీభిః సంవాస్య రసేనాతిసంధాయాపగచ్ఛేత్. తస్మిన్నతిక్రాన్తే సత్రిణః పరప్రయోగమభిశం సేయుః.

వ్యా.1. వస్తానని వెళ్లకపోయినా సహించి ఉన్న గణముఖ్యుని దగ్గరికి ఆ స్త్రీ స్వయంగానే వెళ్లి- "నీమీద ఎంతో ప్రేమతో ఉన్న నన్ను ఫలానా ముఖ్యుడు బాధిస్తున్నాడు; అతడు జీవించి ఉండగా నేను ఇక్కడ ఉండను" అని చెప్పి అతడు వానిని చంపి వేసే టట్లు చెయ్యాలి.

2. లేదా ఒకని దగ్గరికి వస్తా నని చెప్పిన స్త్రీ మరొకనిచేత బలాత్కారంగా అపహరించబడితే వనాంతంలో కాని, క్రీడాగృహంలో గాని (నేటి అఫిషల్ గెస్ట్‌హౌస్‌ల

వంటివి) ఆ అపహరించిన వానిని తీక్ష్ణునిచేత చంపించాలి; లేదా తానే విషం ఇచ్చి చంపివేయాలి. తరవాత "నా ప్రియుణ్ణి ఫలానా ప్రతికాముకుడు చంపివేశాడు" అని అందరికీ చెప్పాలి.

3. లేదా మంత్రసిద్ధి ఉన్నవాని వేషంలో ఉన్న సత్రి ఒక స్త్రీ విషయంలో అభిలాష పుట్టినవానికి వశీకరణౌషధులను విషంకలిపి ఇచ్చి చంపివేసి వెళ్లిపోవాలి. అతడు వెళ్లిపోయిన తరవాత "ఇదంతా శత్రువులు చేసిన ప్రయోగం" అని సత్రులు చెప్పాలి.

మూ. 1. ఆఢ్యవిధవాః, గూఢాజీవాః, యోగస్త్రియో వా దాయనిక్షేపార్థం వివదమానాః సంఘముఖ్యానున్మాదయేయుః ఇతి. అదితిస్త్రియః, కౌశిక స్త్రియః, నర్తకీగాయనా వా. ప్రతిపన్నాన్ గూఢవేశ్మసు రాత్రిసమాగమప్రవిష్టాన్ తీక్ష్ణాః హన్యుః, బద్ధ్వా హరేయుర్వా.

2. సత్రీ వా స్త్రీలోలుపం సంఘముఖ్యం ప్రరూపయేత్- "అముష్మిన్ గ్రామే దరిద్రకులమపసృతమ్; తస్య స్త్రీ రాజార్హా; గృహాణైనామ్" ఇతి. గృహీతాయామర్ధమాసాన్తరం సిద్ధవ్యఞ్జనో దూష్యః సంఘముఖ్యమధ్యే ప్రక్రోశయేత్- "అసౌ మే ముఖ్యాం భార్యాం, స్నుషాం, భగినీం, దుహితరం వా అధిచరతి" ఇతి. తం చేత్ సంఘో నిగృహ్ణీయాత్ రాజైనముపగృహ్య విగుణేషు విక్రమయేత్. అనిగృహీతే సిద్ధవ్యఞ్జనం హి రాత్రౌ తీక్ష్ణాః ప్రవాసయేయుః.తతస్తద్వ్యఞ్జనాః ప్రక్రోశేయుః- "అసౌ బ్రహ్మహా బ్రాహ్మణీ జారశ్చ" ఇతి.

వ్యా. 1. ధనవతులైన విధవలు గాని, భర్త ఉన్నా కూడ వ్యభిచారం జీవనోపాధిగా చేసుకొన్న దరిద్రస్త్రీలు గాని, యోగస్త్రీలు (స్త్రీవేషంలో ఉన్న పురుషులు) గాని, దాయం, నిక్షేపం మొదలైనవాటికోసం సంఘముఖ్యుల ఎదుట పోట్లాడుకొంటూ ఆ సందర్భంలో చేష్టావిశేషాలచేత వాళ్లని మోహింపచెయ్యాలి. లేదా అదితిస్త్రీలు (దేవతల చిత్రాలను చూపించడం వృత్తిగా గ్రహించిన స్త్రీలు) గాని, కౌశికస్త్రీలు (పాములు పట్టే స్త్రీలు) గాని, నర్తకస్త్రీలు గాని గాయనస్త్రీలు గాని, వాళ్లని మోహింపచెయ్యాలి. వాళ్లు అంగీకరించి రాత్రి సమాగమం కోసం రహస్యగృహాలకు వచ్చినప్పుడు తీక్ష్ణులు వాళ్లను చంపివేయాలి. లేదా బంధించి తీసికొనిపోవాలి.

2. లేదా స్త్రీవ్యసనం ఉన్న సంఘముఖ్యుని దగ్గరికి సత్రి వెళ్లి- "ఫలానాగ్రామానికి ఒక దరిద్రకుటుంబం వలస వచ్చింది. వాని భార్య రాజుకు తగిన స్త్రీ. ఆమెను నువ్వు గ్రహించు" అని చెప్పాలి. అతడు ఆ స్త్రీని గ్రహించిన తరవాత పదిహేను రోజులలోనే సిద్ధవేషంలో ఉన్న దూష్యుడు సంఘముఖ్యుల మధ్య- "ఇతడు నా ముఖ్యురాలైన భార్యను, లేదా కోడలిని, లేదా సోదరిని లేదా పుత్రికను బలాత్కరించి అనుభవిస్తున్నాడు" అని గొడవపెట్టాలి. అలా చేసిన (స్త్రీని గ్రహించిన) ఆ సంఘముఖ్యుణ్ణి సంఘం నిగ్రహిస్తే అప్పుడు రాజు వానిని తన దగ్గరకు చేరదీసి తనకు ఇష్టం కానివాళ్లమీదికి వానిని యుద్ధానికి పంపాలి. అతడు నిగ్రహింపబడకపోయి నట్లయితే ఆ సిద్ధవ్యంజనుడైన దూష్యుణ్ణి (సంఘముఖ్యుల ఎదట గొడవపెట్టినవానిని) రాత్రి తీక్ష్ణులు చంపివేయాలి. తరవాత సిద్ధవ్యంజనులైన మరికొందరు వచ్చి "ఈ (నిగ్రహింపబడని) సంఘముఖ్యుడు బ్రహ్మహత్య (సిద్ధుడైన బ్రాహ్మణుని హత్య) చేశాడు, బ్రాహ్మణ స్త్రీజారుడు కూడ" అని నిందిస్తూ గొడవపెట్టాలి.

మూ. 1. కార్తాన్తికవ్యఞ్జనో వా కన్యామన్యేన వృతామన్యస్య ప్రరూపయేత్- "అముష్య కన్యా రాజపత్నీ, రాజప్రసవినీ చ భవిష్యతి. సర్వస్వేన ప్రసహ్య వా ఏనాం లభస్వ" ఇతి. అలభ్యమానాయాం పరపక్షమ్ ఉద్ధర్షయేత్, లబ్ధాయాం సిద్ధః కలహః.

2. భిక్షుకీ వా ప్రియభార్యం ముఖ్యం బ్రూయాత్- "అసౌ తే ముఖ్యో యౌవనోత్సిక్తో భార్యాయాం మాం ప్రాహిణోత్. తస్యాహం భయాత్ లేఖ్యమాభరణం గృహీత్వా యాతాస్మి. నిర్దోషా తే భార్యా. గూఢమస్మిన్ ప్రతికర్తవ్యమ్, అహమపి తావత్ ప్రతిపత్స్యామి" ఇతి, ఏవమాదిషు కలహస్థానేషు, స్వయముత్పన్నే వా కలహే, తీక్ష్ణైరుత్పాదితే వా హీనపక్షం రాజా కోశదణ్డాభ్యామ్ ఉపగృహ్య విగుణేషు విక్రామయేత్, అపవాహయేద్వా.

3. సంఘేష్వేవమేకరాజో వర్తేత. సంఘాశ్చాపి ఏవమేకరాజా దేతేభ్యః అతిసంధానేభ్యః రక్షయేయుః.

వ్యా. 1. జ్యౌతిషికుని వేషంలో ఉన్న గూఢచారి సంఘముఖ్యులలో ఒకడు వరించిన కన్యను గూర్చి మరొక సంఘముఖ్యునికి - "ఫలానావాని కన్య రాజపత్ని కాని, రాజమాత కాని కాగలదు. అందుచేత సర్వస్వమైనా ఇచ్చివేసి, లేదా బలప్రయోగం చేసి

ఈమెను పొందుము" అని బోధించాలి. అతడు ప్రయత్నించినా కూడ ఆమె లభించని పక్షంలో రెండవ పక్షం వానిని వీనిమీదికి ఉసిగొల్పాలి. ఆమె లభించినదా ఆ ముఖ్యులిద్దరి మధ్యా కలహం ఎలాగూ తప్పదు.

2. భార్య అంటే చాల ఇష్టం గల సంఘముఖ్యుని దగ్గరికి వెళ్లి, సంన్యాసిని- "యౌవనమదంలో ఉన్న ఫలానా ముఖ్యుడు నీ భార్యకోసం నన్ను పంపాడు. అతనికి భయపడి నేను వాని లేఖ, ఆభరణాలు తీసికొని వచ్చాను. అయితే నీ భార్యలో ఏమీ దోషం లేదు. నువ్వు రహస్యంగా వీని విషయంలో ప్రతిక్రియ చెయ్యాలి; నేను కూడ తగిన ఉపాయం ఆలోచిస్తాను" అని చెప్పాలి. ముఖ్యుల మధ్య ఏర్పడిన ఇలాంటి కలహస్థానాలలోను, లేదా స్వయంగా కలహం ఏర్పడినప్పుడు, లేదా తీక్ష్ణులు కలహాలు పుట్టించినప్పుడు రాజు దుర్బలమైన పక్షం కల ముఖ్యుణ్ణి కోశదండాలు ఇచ్చి తన వైపు మళ్లించుకొని తన శత్రువులపై అతడు ఆక్రమణం చేసే టట్లు చెయ్యాలి. లేదా అతనిని (ఆ గణరాజ్యంనుంచి) దూరంగా తీసికొనిపోవాలి.

3. ఏకరాజు (ఒక రాజ్యానికి ఒక రాజు అనే పద్ధతిలో ఒక రాజ్యానికి రాజుగా ఉన్నవాడు) తన సరిహద్దులలో ఉన్న సంఘరాజ్యాలతో ఈ విధంగా ప్రవర్తించాలి.సంఘరాజ్యాలు కూడ ఏకరాజు పన్నే ఈ పన్నాగాలనుండి తమను రక్షించుకోవాలి.

శ్లో. సంఘముఖ్యశ్చ సంఘేషు న్యాయవృత్తిర్హితః ప్రియః,
దాన్తో యుక్తజనస్తిష్ఠేత్ సర్వచిత్తానువర్తకః.

ఇతి కౌటలీయార్థశాస్త్రే సంఘవృత్తే ఏకాదశాధికరణే ప్రథమోఽధ్యాయః,
భేదోపాదానాని, ఉపాంశుదణ్డశ్చ, ఆదితః పఞ్చత్రింశచ్ఛతతమః.

ఏతావతా కౌటలీయార్థశాస్త్రస్య సంఘవృత్తమేకాదశం ప్రకరణం సమాప్తమ్.

వ్యా. 1. సంఘముఖ్యుడు కూడ సంఘసభ్యుల విషయంలో, న్యాయవృత్తి కలవాడై, వాళ్ల హితాన్ని ఆచరిస్తూ, వాళ్లకు ప్రియుడై, ఇంద్రియనిగ్రహవంతుడై ప్రజలను తనతో కలుపుకొని అందరి మనస్సులనూ అనువర్తిస్తూ ఉండాలి.

"బాలానందిని" అను కౌటలీయార్థశాస్త్రాంధ్రవ్యాఖ్యానంలో సంఘవృత్తం అనే పదకొండవ అధికరణంలో భేదోపాయాలు, ఉపాంశుదండం అనే ప్రథమాధ్యాయం, ప్రారంభంనుంచి నూటముప్పైయైదవ అధ్యాయం సమాప్తం.

ఇంతటితో కౌటలీయార్థశాస్త్రంలోని సంఘవృత్తం అనే పదకొండవ అధికరణం సమాప్తం.

# అథ ఆబలీయసమ్ - ద్వాదశమధికరణమ్

## ప్రథమో ఽధ్యాయః

### ద్విషష్టిశతతమం ప్రకరణమ్ - దూతకర్మ

ఆబలీయసం (దుర్బలుడైన రాజును గూర్చినది) - పన్నెండవ అధికరణమ్

మూ. 1. బలీయసాభియుక్తో దుర్బలః సర్వత్రానుప్రణతః వేతసధర్మా తిష్ఠేత్. "ఇన్ద్రస్య హి స ప్రణమతి, యో బలీయసో నమతి", ఇతి భారద్వాజః.

2. "సర్వసందోహేన బలానాం యుధ్యేత; పరాక్రమో హి వ్యసనమపహన్తి, స్వధర్మశ్చైష క్షత్రియస్య యుద్ధే జయః పరాజయో వా" ఇతి విశాలాక్షః.

3. నేతి కౌటల్యః. సర్వత్రానుప్రణతః కులైడక ఇవ నిరాశో జీవితే వసతి. యుధ్యమానశ్చాల్పసైన్యః సముద్రమివ అప్లవః అవగాహమానః సీదతి. తద్విశిష్టం తు రాజానమాశ్రితః దుర్గమవిషహ్యం వా చేష్టేత.

వ్యా. 1. "బలవంతుడైన రాజుచేత ఎదిరింపబడిన దుర్బలుడైన రాజు నీటి ప్రబ్బలి తీగ వలె అన్ని విధాలా వంగి అణగి మణగి ఉండాలి. (వేతసం నీటి ప్రవాహం ఎటువైపు వెడితే అటు వైపు వంగుతుంది. ప్రవాహాన్ని ఎదిరించి నిలబడదు). బలవంతునికి నమస్కరిస్తున్నవాడు ఇంద్రునకే (ఇంద్రుడు బలానికి అధిష్ఠానదేవత) నమస్కరిస్తు న్నట్లు" అని భారద్వాజు డన్నాడు.

2. "మొత్తం సైన్యం అంతా కూడ గట్టుకొని యుద్ధం చెయ్యాలి. పరాక్రమం వ్యసనాన్ని (ఆపదను) తొలగిస్తుంది కదా? యుద్ధంలో జయం పొందడమో పరాజయం పొందడమో - ఇది క్షత్రియుని ధర్మం" అని విశాలాక్షు డన్నాడు.

3. అది యుక్తం కాదు అంటాడు కౌటిల్యుడు. అన్ని విధాలా వంగి ఉండేవాడు మందలోనుంచి చెదిరి వచ్చిన ఇంటి పెంపుడు గొఱ్ఱె వలె జీవితం విషయంలో నిరాశుడై ఉండవలసివస్తుంది. అల్పసైన్యంతో యుద్ధం చేసేవాడు తెప్ప లేకుండా సముద్రంలోనికి దిగినవాడు వలె నశిస్తాడు. అందువల్ల ఎవరైనా బలవంతుడైన

రాజును గాని, భేదింప శక్యం కాని దుర్గాన్ని కాని ఆశ్రయించి ఉండి తాను చేయదలచిన పని చెయ్యాలి.

మూ. 1. త్రయోఽభియోక్తారః- ధర్మలోభాసురవిజయిన ఇతి. తేషామభ్యవపత్త్యా ధర్మవిజయీ తుష్యతి. తమభ్యవపద్యేత పరేషామపి భయాత్. భూమిద్రవ్యహరణేన లోభవిజయీ తుష్యతి. తమర్థేన అభ్యవపద్యేత. భూమిద్రవ్యపుత్రదారప్రాణహరణేన అసురవిజయీ.తం భూమిద్రవ్యాభ్యా ముపగృహ్య అగ్రాహ్యః ప్రతికుర్వీత.

2. తేషాముత్తిష్ఠమానం సంధినా మన్త్రయుద్ధేన కూటయుద్ధేన వా ప్రతివ్యూహేత. శత్రుపక్షమస్య సామదానాభ్యాం; స్వపక్షం భేదదణ్డాభ్యామ్. దుర్గం రాష్ట్రం స్కన్ధావారం వాస్య గూఢాః శస్త్రరసాగ్నిభిః సాదయేయుః.

3. సర్వతః పార్ష్ణిమస్య గ్రాహయేత్. అటవీభిర్వా రాజ్యం ఘాతయేత్. తత్కులీనావరుద్ధాభ్యాం వా హారయేత్.

వ్యా. 1. అభియోక్తలు (దండెత్తి వచ్చేవాళ్లు) ధర్మవిజయి, లోభవిజయి, అసురవిజయి అని మూడు విధాలుగా ఉంటారు. వాళ్లలో ధర్మవిజయి "నేను నీవాడను" అని లొంగిపోతే సంతోషిస్తాడు. పరులవల్ల కలిగే భయంవల్ల కూడా ధర్మవిజయికి (పైన చెప్పినట్లు) లొంగిపోవాలి. అనగా ఆ విధంగా లొంగిపోతే ధర్మవిజయి ఇతరులనుండి కూడా ఏమీ భయం రాకుండా రక్షిస్తాడు అని భావం. లోభవిజయి భూమిని, ద్రవ్యాన్ని హరించి సంతోషిస్తాడు. వానికి ధనం ఇచ్చి అనుకూలుణ్ణి చేసుకోవాలి. అసురవిజయి భూమిని, ద్రవ్యాన్ని, పుత్రుల్ని, భార్యలను, ప్రాణాలను హరించి సంతోషిస్తాడు. అలాంటివానికి భూమి, ద్రవ్యం అర్పించి తాను మాత్రం పట్టుబడకుండా ప్రతిక్రియ చెయ్యాలి.

3. ఈ మూడు విధాలైన అభియోక్తలలో తనమీదికి రావడానికి సిద్ధంగా ఉన్నవానికి సంధిచేత గాని మంత్రయుద్ధంచేత గాని, కూటయుద్ధచేత గాని అపకారం చెయ్యాలి. వాని శత్రుపక్షాన్ని సామదానాలచేత తనకు అనుకూలం చేసుకోవాలి. అతని పక్షాన్ని భేదదండాలచేత తనకు అనుకూలం చేసుకోవాలి (ఇది మంత్రయుద్ధం). గూఢపురుషులు, శస్త్రవిషాగ్నులను ప్రయోగించి వాని దుర్గాన్ని గాని, రాష్ట్రాన్ని గాని, స్కంధావారాన్ని గాని, నశింపచెయ్యాలి (ఇది కూటయుద్ధం).

4. వాని వెనుక భాగాన్ని అన్ని వైపులనుండీ ఆక్రమింపచెయ్యాలి. లేదా

ఆటవికులచేత వాని రాజ్యాన్ని నశింపచెయ్యాలి. లేదా వాని వంశానికి చెందినవాడు గాని, అతనికి అప్రియుడైన పుత్రుడుగాని, రాజ్యాన్ని ఆక్రమించే టట్లు చెయ్యాలి.

మూ. 1. అపకారాన్తేషు చాస్య దూతం ప్రేషయేత్. అనపకృత్య వా సంధానమ్.

2. తథాప్యభిప్రయాన్తం కోశదణ్డయోః పాదోత్తరమ్, అహోరాత్రోత్తరం వా సంధిం యాచేత.

3. స చేద్దణ్డసంధిం యాచేత కుణ్ఠమస్మై హస్త్యశ్వం దద్యాత్, ఉత్సాహితం వా గరయుక్తమ్.

4. పురుషసన్ధిం యాచేత దూష్యామిత్రాటవీబల మస్మై దద్యాత్, యోగపురుషాధిష్ఠితమ్, తథా కుర్యాద్యథోభయవినాశః స్యాత్. తీక్ష్ణబలం వాస్మై దద్యాత్ యదవమానితం వికుర్వీత. మౌలమనురక్తం వా యదస్య వ్యసనే అపకుర్యాత్.

వ్యా. 1. ఇలాంటి అపకారాలు చేసిన తరవాత వానివద్దకు సంధికై దూతలను పంపాలి. లేదా అపకారా లేవీ చేయకుండానే సంధి చేసుకోవాలి.

2. ఇలా చేసినా దండెత్తి వస్తున్నవానిని కోశదండాలలో ఒక పాదం అధికంగా చేసి గాని అహోరాత్రాలు అధికంగా చేసికాని సంధి కోరాలి. అనగా ఒక లక్ష సువర్ణాలు, ఒక వంద అశ్వాదులు ఇస్తా నని చెప్పినా కూడ అతడు దండెత్తి వస్తున్నప్పుడు ఒక పాదం పెంచి ఒక లక్షా ఇరవైయైదు వేలు సువర్ణాలు, నూటఇరవైయైదు అశ్వాదులు ఇస్తా నని చెప్పి సంధికి ఒప్పించాలి అని అర్థం. అయినా అంగీకరించని పక్షంలో మరొక పాదం చొప్పున పెంచాలి. అట్లే ఈ పని ఇన్ని రోజులలో చేస్తాను అని చెప్పినప్పుడు అతడు అంగీకరించని పక్షంలో ఇంకా కొన్ని పగళ్లు రాత్రులు పెంచుకొంటూ పోయి సంధికి ఒప్పించాలి.

3. అతడు దండసంధి (సైన్యం ఇవ్వాలి అనే షరతుమీద సంధి) కోరినట్లయితే వానికి పనికిరాని ఏనుగులు, గుఱ్ఱాలు ఇవ్వాలి. లేదా ఒకటి రెండు మాసాలలో చంపే విషం పెట్టిన మంచి ఉత్సాహం ఉన్న హస్త్యశ్వాలు ఇవ్వాలి.

4. అతడు పురుషసంధి కోరిన ట్లయితే వానికి యోగపురుషులు (విషాదులచేత దూష్యాదిబలాన్ని చంపగలిగిన వాళ్లు) ఉన్న దూష్యబలం, అమిత్రబలం, ఆటవికబలం

ఇవ్వాలి. దూష్యాదిబలాలు, శత్రుబలం ఈ రెండు పక్షాల వాళ్లూ కూడ ఏ విధంగా నశిస్తారో ఆ విధంగా చెయ్యాలి. లేదా వానికి చాల పొగరుబోతుతనం ఉన్న సైన్యం ఇవ్వాలి. అలాంటి సైన్యం అతడేమైనా అవమానం చేస్తే, ఎదురుతిరుగుతుంది. లేదా తనయందు భక్తిగల మౌలబలాన్ని ఇవ్వాలి. అది శత్రు వేదైన ఆపదలో ఉన్నప్పుడు వానికి అపకారం చేస్తుంది.

మూ. 1. కోశసంధిం యాచేత సారమస్మై దద్యాత్ యస్య క్రేతారం నాధిగచ్ఛేత్, కుప్యమయుద్ధయోగ్యం వా.

2. భూమిసంధిం యాచేత-ప్రత్యాదేయాం, నిత్యామిత్రామ్, అనపాశ్రయాం, మహాక్షయవ్యయనివేశాం వా అస్మై భూమిం దద్యాత్.

3. సర్వస్వేన వా రాజధానీవర్జేన సంధిం యాచేత బలీయసః.

వ్యా. 1. అతడు కోశసంధిని కోరిన ట్లయితే వానికి అతిశ్రేష్ఠమైన కోశం ఇవ్వాలి, అలాంటిదానిని కొనగలిగినవాడు ఎవడూ అతనికి దొరకడు. లేదా యుద్ధానికి ఉపయోగించని కుప్యాన్ని ఇవ్వాలి.

2. భూమిసంధి కోరితే వానికి తిరిగి తీసికొనడానికి వీలైనది, ఎల్లప్పుడు శత్రువులు దగ్గరగా ఉన్నది, దుర్గం లేనిదీ, నగరాదులను ఏర్పరచడానికి చాల క్షయవ్యయాలు కలిగించేదీ అయిన భూమిని ఇవ్వాలి.

3. లేదా రాజధాని మినహాయించి సర్వస్వాన్నీ ఇచ్చివేసి అయినా బలవంతునితో సంధి కోరాలి.

శ్లో. యత్ ప్రసహ్య హరేదన్యస్తత్ ప్రయచ్ఛేదుపాయతః,
రక్షేత్ స్వదేహం న ధనం కా హ్యనిత్యే ధనే దయా.

ఇతి కౌటలీయార్థశాస్త్రే అబలీయసే ద్వాదశేఽధికరణే ప్రథమోఽధ్యాయః,
దూతకర్మణి సంధియాచనమ్, ఆదితః షట్త్రింశచ్ఛతతమః.

వ్యా. శత్రువు దేనిని బలాత్కారంగా లాగికొంటాడో దానిని ఉపాయం ద్వారా, అనగా సంధి అనే వంక మీద ఇవ్వాలి. తన దేహాన్ని రక్షించుకోవాలి గాని, ధనాన్ని కాదు, అనిత్యమైన ధనం విషయంలో దయ ఏమిటి!

"బాలానందిని" అను కౌటలీయార్థశాస్త్రాంధ్రవ్యాఖ్యానంలో అబలీయసం అనే పన్నెండవ అధికరణంలో దూతకర్మలో సంధి కోరడం అనే మొదటి అధ్యాయం, ప్రారంభంనుంచి

నూటముప్పై ఆరవ అధ్యాయం సమాప్తం.

# అథ ద్వితీయోఽధ్యాయః

## త్రిషష్టిశతతమం ప్రకరణమ్ - మన్త్రయుద్ధమ్

## చతుఃషష్టిశతతమం ప్రకరణమ్ - సేనాముఖ్యవధః, ప్రథమో భాగః

మూ. 1. స చేత్సంధౌ నావతిష్ఠేత, బ్రూయాదేనమ్ - "ఇమే షడ్వర్గవశగాః రాజానః వినష్టాః; తేషామనాత్మవతాం నార్హసి మార్గమనుగన్తుమ్. ధర్మమర్థం చావేక్షస్వ. మిత్రముఖా హ్యమిత్రాస్తే యే త్వాం సాహసమ్, అధర్మమ్, అర్థాతిక్రమం చ గ్రాహయన్తి. శూరైస్త్యక్తాత్మభిః సహ యోద్ధుం సాహసమ్. జనక్షయముభయతః కర్తుమధర్మః. దృష్టమర్థం మిత్రమదుష్టం చ త్యక్తుమర్థాతిక్రమః. మిత్రవాంశ్చ స రాజా భూయశ్చైతేన అర్థేన మిత్రాణ్యుద్యోజయిష్యతి, యాని త్వా సర్వతః అభియాస్యన్తి. న చ మధ్యమోదాసీనయోర్మణ్డలస్య వాపరిత్యక్తః, భవాంస్తు పరిత్యక్తః యే త్వాం సముద్యుక్తముపప్రేక్షన్తే- "భూయః క్షయవ్యయాభ్యాం యుజ్యతామ్. మిత్రాచ్చ భిద్యతామ్; అథైనం పరిత్యక్తమూలం సుఖేనోచ్ఛేత్స్యామః" ఇతి. స భవాన్ నార్హతి మిత్రముఖానామమిత్రాణాం శ్రోతుమ్, మిత్రాణ్యుద్వేజయితుమ్, అమిత్రాంశ్చ శ్రేయసా యోక్తుమ్. ప్రాణసంశయమనర్థం చ ఉపగన్తుమ్" ఇతి యచ్ఛేత్.

2. తథాపి ప్రతిష్ఠమానస్య ప్రకృతికోపమస్య కారయేత్. యథా సంఘవృత్తే వ్యాఖ్యాతం, యోగవామనే చ. తీక్ష్ణరసదప్రయోగం చ. యదుక్తమాత్మరక్షితకే రక్ష్యం తత్ర తీక్ష్ణాన్ రసదాంశ్చ ప్రయుఞ్జీత.

వ్యా. 1. అతడు సంధికి అంగీకరించకపోయినట్లయితే అతనికి ఇలా చెప్పాలి- (కొంతమంది పేర్లు చెప్పి) 'ఈ రాజులు (ఫలానా ఫలానా రాజులు)' కామ-క్రోధ-లోభ-మోహ-మద-మాత్సర్యాలనే అరిషడ్వర్గానికి వశులైపోయి నశించారు. నువ్వు ఇంద్రియాలను అదుపులో పెట్టుకొనలేకపోయిన వాళ్ల మార్గంలో వెళ్లవద్దు. ధర్మార్థాలను

చేయడం సాహసం. రెండు పక్షాలలోను జనక్షయం కలిగించడం అధర్మం. స్పష్టంగా ఎదుట కనబడుతూన్న అర్థాన్ని దుష్టుడు కాని మిత్రుణ్ణీ విడిచిపెట్టడం అర్థాతిక్రమం. ఆ రాజుకు చాలమంది మిత్రు లున్నారు. అతడుఈ ధనంతో (సంధిచేసికో మని కోరుతూ నీకు ఇస్తూన్న, నీవు నిరాకరించిన ధనంతో) తన మిత్రులను నీతో యుద్ధంచేసే టట్లు ఏర్పరచుకుంటాడు. వాళ్లు నిన్ను నలు దిక్కులనుండీ ముట్టడిస్తారు. అతనిని మధ్య మోదాసీనులు గాని, మండలం గాని విడిచివేయలేదు. నువ్వు వాళ్లచేత విడవబడినావు. నువ్వు యుద్ధానికి సన్నద్ధుడవై ఉండడం చూచి వాళ్లు- "ఇంకా ఇతనికి క్షయవ్యయాలు కలగాలి, మిత్రునినుండి దూరం అవాలి. ఈ విధంగా మూలం విడచిన ఇతనిని అనాయాసంగా ఉన్మూలిద్దాం" అని అనుకొంటూ వేచి ఉన్నారు. అందుచేత నువ్వు మిత్రులుగా పైకి కనబడే అమిత్రుల మాటలు వినడం, మిత్రుల్ని కలత పెట్టడం, అమిత్రులకు మంచి కలిగే టట్లు చేయడం యుక్తం కాదు, ప్రాణాలకే సంశయం ఉన్న అనర్థం పొందడం కూడ మంచిది కాదు" అని ఈ విధంగా చెప్పి వానిని ముందుకు సాగకుండా నిలపాలి.

2. ఇంత ఇలా చెప్పినాకూడ అతడు యుద్ధానికి బయలుదేరితే సంఘవృత్తాధికరణంలో చెప్పినట్లు యోగవామనాధికరణంలో చెప్ప నున్నట్లు వాని ప్రకృతులలో కోపం (తిరుగుబాటు) కలిగించాలి. తీక్ష్ణులను, విషం ఇచ్చేవాళ్లనూ కూడ పంపాలి. ఆత్మరక్షితాధికరణంలో, ఏది రక్షింపదగిన దని చెప్పబడిందో ఆ రక్ష్యాన్ని నశింపచేయానికి తీక్ష్ణులను, రసదులను పంపాలి.

మూ. 1. బన్ధకీపోషకాః పరమరూపయౌవనాభిః స్త్రీభిః సేనాముఖ్యాను న్మాదయేయుః. బహూనామేకస్యాం ద్వయోర్వా ముఖ్యయోః కామే జాతే తీక్ష్ణాః కలహానుత్పాదయేయుః. కలహే పరాజితపక్షం పరత్రాపగమనే యాత్రా సాహాయ్యదానే వా భర్తుః యోజయేయుః.

2. కామవశాన్ వా సిద్ధవ్యఞ్జనాః సాంవననికీభిః ఓషధీభిః అతిసంధా నాయ ముఖ్యేషు రసం దాపయేయుః.

3. వైదేహకవ్యఞ్జనో వా రాజమహిష్యాః సుభగాయాః ప్రేష్యామాసన్నాం కామనిమిత్తమర్థేన అభివృష్య పరిత్యజేత్. తస్యైవ పరిచారకవ్యఞ్జనోపదిష్టః సిద్ధవ్యఞ్జనః సాంవననికీమ్ ఓషధీం దద్యాత్- వైదేహకశరీరే అవధాతవ్యా

ఇతి. సిద్ధే సుభగాయా అప్యేనం యోగముపదిశేత్- రాజశరీరే అవధాతవ్యా ఇతి. తతో రసేనాతిసందధ్యాత్.

వ్యా. 1. కులటలను పోషించేవాళ్లు మంచి సౌందర్యము, యౌవనమూ ఉన్న స్త్రీలమీద సేనాముఖ్యులకు మోహం కలిగే టట్లు చెయ్యాలి. చాలామంది సేనాముఖ్యులకు ఒక స్త్రీమీద గాని, ఇద్దరు స్త్రీలమీద గాని, మోహం కలిగి నప్పుడు తీక్ష్ణులు వాళ్ల మధ్య కలహం పుట్టించాలి. కలహంలో ఓడిపోయిన పక్షాన్ని మరొక రాజు దగ్గరికి వెళ్లిపోయే టట్లు చెయ్యాలి, లేదా తమ రాజుకు యాత్రలో సహాయంగా ఉండే టట్లు చెయ్యాలి.

2. లేదా మంత్రసిద్ధుల వేషంలో ఉన్న గూఢచారులు కామపరవశులైన సేనాముఖ్యులను మోసం చేయడం కోసం వశీకరణములైన ఓషధులతో పాటు విషం ఇప్పించాలి.

3. లేదా వర్తకుని వేషంలో ఉన్న గూఢచారి సుందరియైన రాజభార్యయొక్క (పట్టమహిషియొక్క) చాల దగ్గరిదైన పరిచారికకు కామంకోసం అత్యధికమైన ధనం వర్షించి విడిచివెయ్యాలి. ఆమెను ఒక్కసారి మాత్రమే కలిసి మళ్లీ కలవకూడదు అని అర్థం. ఆ వర్తకుని పరిచారకుని వేషంలో ఉన్న ఒక పురుషుడు ఆ రాజభార్యయొక్క పరిచారికకు ఒకనిని చూపి ఇతడు మంత్రసిద్ధి పొందినవాడు అని చెప్పాలి. అప్పుడు అతడు ( ఆ వర్తకుణ్ణి వశం చేసుకొనడం కొరకు) ఆమెకు ఒక ఓషధి ఇచ్చి "దీనిని ఆ వర్తకుని శరీరం మీద ఉంచాలి" అని చెప్పాలి. అప్పుడు ఆ వర్తకుడు మళ్లీ ఆమెను కలుసుకొని ఆమెకు వశు డైపోయినట్లు నటించాలి. ఆ పరిచారిక ద్వారా సౌందర్యవతియైన రాజభార్యకు కూడ ఆ వశీకరణయోగం ఉపదేశించి "దీనిని రాజు శరీరంమీద ఉంచాలి' ' అని చెప్పాలి. తరవాత విషం కూడ కలిపి ఇచ్చి మోసగించాలి.

మూ. 1. కార్తాన్తికవ్యఞ్జనో వా మహామాత్రం "రాజలక్షణసంపన్నం" క్రమాభినీతం బ్రూయాత్. భార్యామస్య భిక్షుకీ బ్రూయాత్- 'రాజపత్నీ రాజప్రసవినీ వా భవిష్యసి' ఇతి.

2. భార్యావ్యఞ్జనా వా మహామాత్రం బ్రూయాత్-"రాజా కిల మామవరోధయిష్యతి. తవాన్తికాయ పత్రలేఖ్యమాభరణం చేదం పరివ్రాజికయా ఆహృతమ్" ఇతి.

3. సూదారాలికవ్యఞ్జనో వా రసప్రయోగార్థం రాజవచనమర్థం చాస్యలోభనీయమభినయేత్. తదస్య వైదేహికవ్యఞ్జనః ప్రతిసందధ్యాత్. కార్యసిద్ధిం చ బ్రూయాత్. ఏవమేకేన ద్వాభ్యాం త్రిభిరిత్యుపాయైః ఏకైకమస్య మహామాత్రం విక్రమాయాపగమనాయ వా యోజయేదితి.

వ్యా. 1. లేదా జ్యౌతిషికుని వేషంలో ఉన్న గూఢచారి రాజలక్షణా లున్న మహామాత్రునితో మెల్ల మెల్లగా పరిచయం చేసుకొని "నువ్వు రాజు అవుతావు" అని చెప్పి నమ్మించాలి. భిక్షుకి వీని భార్యతో "నువ్వు రాజభార్యవు గాని, రాజమాతవు కాని అవుతావు" అని చెప్పాలి.

2. లేదా వేశ్య ఒక మహామాత్రునికి భార్యగా అయి వానితో- "రాజు నన్ను తన అంతఃపురంలో నిరోధిస్తాడట. పరివ్రాజిక ద్వారా ఈ లేఖ, అభరణాలు పంపాడు" అని చెప్పాలి.

3. లేదా వంటవానివేషంలో గాని, భక్ష్యాలు తయారుచేసేవాని వేషంలో గాని ఉన్న గూఢచారి మహామాత్రునితో రాజు నీకు విషం పెట్టమని నాకు చాల ధనం ఇచ్చాడు అని చెప్పాలి. అతడు చెప్పిన మాటలను వర్తకుని (విషం అమ్మేవాని) వేషంలో ఉన్న గూఢచారి ధ్రువీకరించాలి. (నిజమే ఇతడు నావద్ద విషం కొన్నాడు అని చెప్పాలి). ఇది తింటే వెంటనే మరణిస్తారు అని కూడ చెప్పాలి. ఈ విధంగా ఒక ఉపాయంచేత గాని, రెండు ఉపాయాలచేత గాని, మూడు ఉపాయాలచేత గాని, ఆ రాజుయొక్క ఒక్కొక్క మహామాత్రుణ్ణి ఆతనికి ఎదురుతిరిగే టట్లు గాని, వానిని విడిచివెళ్లిపోయే టట్లు గాని చెయ్యాలి.

మూ. 1. దుర్గేషు చాస్య శూన్యపాలాసన్నాః సత్రిణః పౌరజానపదేషు మైత్రీనిమిత్తమావేదయేయుః- శూన్యపాలేనోక్తా యోధాశ్చ అధికరణస్థాశ్చ - "కృచ్ఛ్రగతో రాజా జీవన్నాగమిష్యతి వా న వా; ప్రసహ్య విత్తమార్జయధ్వమ్; అమిత్రాంశ్చ హత" ఇతి. బహులీభూతే తీక్ష్ణాః పౌరాన్ నిశాస్వాహారయేయుః; ముఖ్యాంశ్చాభిహన్యుః-"ఏవం క్రియన్తే యే శూన్యపాలస్య న శుశ్రూషన్తే" ఇతి. శూన్యపాలస్థానేషు చ సశోణితాని శస్త్రవిత్తబన్ధనాని ఉత్సృజేయుః. తతః సత్రిణః- "శూన్యపాలః ఘాతయతి, విలోపయతి చ" ఇత్యావేదయేయుః. ఏవం జనపదాన్ సమాహర్తుః భేదయేయుః.

వ్యా. 1. లేదా వీని (శత్రువుయొక్క) దుర్గాలలో శూన్యపాలునికి (రాజు యుద్ధానికి బైటకు వెళ్లినప్పుడు రాజశూన్యమైన దుర్గాన్ని రక్షించడం కోసం నియుక్తుడు శూన్యపాలుడు) చాలా దగ్గరవాళ్లం అని చెప్పుకొంటూ సత్రులు శూన్యపాలుని విషయంలో పౌరజానపదులకు మైత్రి కలిగించడంకోసం వాళ్లతో- "రాజు కష్టాలలో ఉన్నాడు; ప్రాణాలతో తిరిగివస్తాడో రాడో. అందుచేత మీరు బలాత్కారంగా ధనం సంపాదించండి; శత్రువులను చంపివేయండి" అని శూన్యపాలుడు యోధులతోను ఆ యా శాఖాధ్యక్షులతోను చెప్పాడు" అని చెప్పాలి. ఈ ప్రవాదం బాగా వ్యాపించగానే తీక్ష్ణులు రాత్రులలో పౌరులనుండి బలాత్కారంగా ధనం తీసుకోవాలి. "శూన్యపాలుని మాట విననివాళ్లకి ఇదే గతి పడుతుంది" అని అంటూ పౌరముఖ్యుల్ని చంపివేయాలి. శూన్యపాలుని నివాసస్థానాలలో రక్తంతో కూడిన శస్త్రాలు, ధనం, బంధనాలు (కట్టే త్రాళ్లు) ఉంచాలి. అప్పుడు సత్రులు- "శూన్యపాలుడు చంపిస్తున్నాడు, లూటీలు చేయిస్తున్నాడు" అని అందరికీ చెప్పాలి. ఈ విధంగానే సమాహర్తనుంచి జానపదులను విడదీయాలి.

మూ. 1. సమాహర్తృపురుషాంస్తు గ్రామమధ్యేషు రాత్రౌ తీక్ష్ణా హత్వా బ్రూయుః- "ఏవం క్రియన్తే యే జనపదమధర్మేణ బాధన్తే" ఇతి.

2. సముత్పన్నే దోషే శూన్యపాలం సమాహర్తారం వా ప్రకృతికోపేన ఘాతయేయుః, తత్కులీనమవరుద్ధం వా ప్రతిపాదయేయుః.

వ్యా. 1. తీక్ష్ణులు సమాహర్తయొక్క పురుషుల్ని రాత్రి చంపివేసి "జనపదాన్ని అధర్మంగా బాధించేవాళ్లకి ఇదే గతి పడుతుంది" అని ప్రచారం చెయ్యాలి.

2. ఈ విధంగా దోషం అంతటా ప్రచారంలోనికి రాగానే ప్రజలలో తిరుగుబాటు కలిగించి శూన్యపాలుణ్ణి, సమాహర్తను చంపించివేయాలి. వాని కులానికి చెందినవానిని గాని, అప్రియుడైన పుత్రుణ్ణి గాని పరిపాలకుణ్ణిగా నిలబెట్టాలి.

శ్లో. అన్తఃపురపురద్వారద్రవ్యధాన్యపరిగ్రహాన్,
దహేయుస్తాం శ్చ హన్యుర్వా బ్రూయురస్యార్తవాదినః.

ఇతి కౌటలీయార్థశాస్త్రే అబలీయసే ద్వాదశేఽధికరణే ద్వితీయోఽధ్యాయః, దూతకర్మణి మన్త్రయుద్ధమ్ (సేనాముఖ్యవధః ప్రథమో భాగశ్చ), ఆదితః సప్తత్రింశచ్ఛతతమః.

వ్యా. 1. శత్రువుయొక్క అంతఃపురం, పురద్వారం, ద్రవ్యాలు, ధాన్యాలు నిలవచేసే ఇళ్లు కాల్చివేయాలి. అక్కడ ఉండే అధికారులను చంపివేయాలి. అయ్యో! అయ్యో! అని ఏడుస్తూ ఆ శూన్యపాలుడు లేదా సమాహర్త ఇలా చేశా డని పౌరులకు చెప్పాలి.

"బాలానందిని" అని కౌటలీయార్థశాస్త్రాంధ్రవ్యాఖ్యానంలో ఆబలీయసం అనే పన్నెండవ అధికరణంలో దూతకర్మలో మంత్రయుద్ధం అనే (సేనాముఖ్యవధ అనే ప్రథమభాగం) రెండవ అధ్యాయం, ప్రారంభంనుండి నూటముప్పైఏడవ అధ్యాయం సమాప్తం.

# అథ తృతీయోఽధ్యాయః

## చతుష్షష్టిశతతమం ప్రకరణమ్ - సేనాముఖ్యవధః (ద్వితీయో భాగః)

## పఞ్చషష్టిశతతమం ప్రకరణం - మణ్డలప్రోత్సాహనమ్.

మూ. 1. రాజ్ఞో రాజవల్లభానాం చ ఆసన్నాః సత్రిణః పత్త్యశ్వరథద్విప ముఖ్యానాం "రాజా క్రుద్ధః" ఇతి సుహృద్విశ్వాసేన మిత్రస్థానీయేషు కథయేయుః. బహులీభూతే తీక్ష్ణాః కృతరాత్రిచారప్రతీకారాః గృహేషు "స్వామివచనేన ఆగమ్యతామ్"ఇతి బ్రూయుః. తాన్ నిర్గచ్ఛత ఏవ అభిహన్యుః. స్వామిసన్దేశః ఇతి చాసన్నాన్ బ్రూయుః. యే చ ప్రవాసితాస్తాన్ సత్రిణో బ్రూయుః- "ఏతత్తద్ యదస్మాభిః కథితమ్, జీవితుకామేన అపక్రాన్త వ్యమ్" ఇతి.

2. యేభ్యశ్చ రాజా యాచితో న దదాతి తాన్ సత్రిణో బ్రూయుః- "ఉక్తః శూన్యపాలో రాజ్ఞా- "అయాచ్యమర్థమసౌ చాసౌ చ యాచతే; మయా ప్రత్యాఖ్యాతాః శత్రుసంహితాః; తేషాముద్ధరణే ప్రయతస్వ" ఇతి. తతః పూర్వవదాచరేత్.

వ్యా. 1. శత్రురాజుకు రాజవల్లభులకు (రాజుకు ఇష్టమైనవాళ్లకు) దగ్గరగా ఉన్న సత్రులు స్నేహంచేత ఏర్పడిన విశ్వాసంతో అనగా మీ క్షేమంకోరే స్నేహితులం గాన ఈ విషయం చెపుతున్నాం అని విశ్వసింపచేసి, పత్త్యశ్వరథద్విపసేనలలోని

ముఖ్యుల మిత్రులైనవారితో "రాజు ఈ మధ్య ఈ ముఖ్యులమీద కోపంతో ఉన్నాడు" అని చెప్పాలి. ఈ ప్రవాదం నాలుగుమూలలా పాకిన తరవాత తీక్ష్ణులు రాత్రి సంచరించడంలో ఉన్న అడ్డులకు ప్రతిక్రియ చేసుకొని (ముందుగా రాత్రి సంచరించడానికి అనుమతి తీసికొని) పత్తిముఖ్యాదుల ఇళ్లకు వెళ్లి "రాజు రమ్మంటున్నాడు రండి" అని బైటకు రప్పించి వాళ్లు బైటకు వస్తూండగానే చంపివేయాలి. "ప్రభువు ఆజ్ఞ ప్రకారం ఇలా చేశాం" అని పక్కవాళ్లతో చెప్పాలి. చంపబడని ముఖ్యులతో సత్రులు- "చూచారా మేం చెప్పిన విషయం ఇదే. ప్రాణాలు దక్కించుకోవా లంటే ఇక్కడినుండి వెళ్లిపోవాలి' ' అని చెప్పాలి.

2. రాజు ఎవరికి అడిగినదానిని ఇవ్వడో వాళ్లతో సత్రులు - "రాజు శూన్యపాలునితో- 'ఫలనా ఫలనావాళ్లు నన్ను అడగకూడని ద్రవ్యాదు లిమ్మని అడుగుతున్నారు. నేను ఇవ్వననడంతో వీళ్లు శత్రువుతో కలిసిపోయారు. వీళ్లను నిర్మూలించడానికి ప్రయత్నించు) అని చెప్పాడు". తరవాత పైన చెప్పినట్లు చెయ్యాలి.

మూ. 1. యేభ్యశ్చ రాజా యాచితో దదాతి తాన్ సత్రిణో బ్రూయుః- "ఉక్తః శూన్యపాలో రాజ్ఞా- 'అయాచ్యమర్థమసౌ చాసౌ చ మాం యాచతే. తేభ్యో మయా సోఽర్థః విశ్వాసార్థం దత్తః, శత్రుసంహితాః, తేషాముద్ధరణే యతస్వ' ఇతి". తతః పూర్వవదాచరేత్.

2. యే చైనం యాచ్యమర్థం న యాచన్తే తాన్ సత్రిణః బ్రూయుః- "ఉక్తః శూన్యపాలో రాజ్ఞా- 'యాచ్యమర్థమసౌ చాసౌ చ మాం న యాచతే, కిమన్యత్, స్వదోషశఙ్కితత్వాత్. తేషాముద్ధరణే ప్రయతస్వ ఇతి" తతః పూర్వవదాచరేత్.

3. ఏతేన సర్వః కృత్యపక్షో వ్యాఖ్యాతః.

4. ప్రత్యాసన్నో వా రాజానం సత్రీ గ్రాహయేత్- 'అసౌ చాసౌ తే మహామాత్రః శత్రుపురుషైః సంభాషతే'; ఇతి. ప్రతిపన్నే దూష్యానస్య శాసనహరాన్ దర్శయేత్- "ఏతత్తత్" ఇతి.

5. సేనాముఖ్యప్రకృతిపురుషాన్ వా భూమ్యా హిరణ్యేన వా లోభయిత్వా స్వేషు విక్రమయేత్. అపవాహయేద్వా. యోఽత్ర పుత్రః సమీపే

దుర్గే వా ప్రతివసతి తం సత్త్రిణోపజాపయేత్- "ఆత్మసంపన్నతరస్త్వమ్, తథాప్యన్తర్హితః. తత్ కిముపేక్షసే? విక్రమ్య గృహాణ. పురా త్వా యువరాజో వినాశయతి" ఇతి.

వ్యా. 1. రాజు ఎవరికైతే అడిగిన ద్రవ్యం ఇస్తాడో వాళ్ల దగ్గరికి వెళ్లి సత్రులు- "రాజు శూన్యపాలునితో -'ఫలానా ఫలానావాళ్లు అడగకూడని ద్రవ్యం అడుగుతున్నారు. అయితే వాళ్లకు విశ్వాసం కలిగించడంకోసం నేను ఆ ద్రవ్యం వాళ్ల కిచ్చాను, కాని వాళ్లందరూ శత్రువుతోకలిసి ఉన్నారు. వాళ్లని నిర్మూలించడానికి ప్రయత్నించు' అని చెప్పాడు" అని చెప్పాలి. తరవాత వెనుక చెప్పినట్లు చెయ్యాలి.

2. రాజును అడగవలసిన ద్రవ్యం అడగని వాళ్ల దగ్గరికి వెళ్లి సత్రులు- "రాజు శూన్యపాలునితో ఫలానా ఫలానావాళ్లు అడగవలసిన ద్రవ్యం అడగడంలేదు. తాము చేసిన ఏదో దోషానికి తామే శంకించుకొనడమే ఇందుకు కారణం. వేరే కారణం ఏముంటుంది? వాళ్లని నిర్మూలించడానికి ప్రయత్నించు" అని చెప్పాలి. తరవాత వెనుక వలెనే చెయ్యాలి.

3. దీనిచేత కృత్యపక్షం కూడ వ్యాఖ్యానించబడినది. అనగా ముఖ్యుల విషయంలో చెప్పిన ఈ భేదోపాయాలు క్రుద్ధ-లుబ్ధ-భీతు లనే కృత్యుల పక్షంలో కూడ ప్రయోగించాలి.

4. లేదా శత్రురాజుకు సంనిహితుడుగా చేరిన సత్రి రాజుతో- "నీ ఫలానా ఫలానా మహామాత్రులు శత్రుపురుషులతో మాటలాడుతున్నారు" అని చెప్పాలి. అతడు నమ్మకం చూపగానే లేఖలు తీసికొనివచ్చిన దూష్యులను ఆతనికి చూపి "ఇదే నేను చెప్పినది" అని చెప్పాలి.

5. లేదా సేనాముఖ్యులను గాని, ప్రకృతిపురుషులను గాని భూమిచేత, ధనం చేత లోభపెట్టి వాళ్లు వారిమీద పరాక్రమించేటట్లు గాని, రాజ్యం విడిచి వెళ్లిపోయేటట్లు గాని చెయ్యాలి. లేదా దగ్గరనే గాని, అంతపాలదుర్గంలో గాని ఉన్న ఆ శత్రురాజు పుత్రుని విషయంలో సత్రుల ద్వారా ఉపజాపం చేయించాలి- "నువ్వు మంచి సద్గుణాలు ఉన్నవాడవు, అయినా కూడ నిన్ను నీ తండ్రి దూరంగా ఉంచుతున్నాడు, నువ్వు ఇలా ఎందుకు ఊరకుంటావు? పరాక్రమం చూపి రాజ్యం గ్రహించు. అలా చేయకపోతే యువరాజు నిన్ను నశింపచేస్తాడు" (అని చెప్పించాలి).

మూ. 1. తత్కులీనమవరుద్ధం వా హిరణ్యేన ప్రతిలోభ్య బ్రూయాత్-

"అన్తర్బలం ప్రత్యన్తస్కన్ధమ్, అన్యం వాస్య ప్రమృద్నీహి" ఇతి.

2. ఆటవికానర్థమానాభ్యాముపగృహ్య రాజ్యమస్య ఘాతయేత్.

3. పార్ష్ణిగ్రాహం వాస్య బ్రూయాత్- "ఏష ఖలు రాజా మాముచ్ఛిద్య త్వాముచ్ఛేత్స్యతి. పార్ష్ణిమస్య గృహాణ. త్వయి నివృత్తస్యాహం పార్ష్ణిం గ్రహీష్యామి"- ఇతి. మిత్రాణి వాస్య బ్రూయాత్- "అహం వః సేతుః మయి విభిన్నే సర్వానేష వో రాజా ఆప్లావయిష్యతి" ఇతి. "సంభూయ వాస్య యాత్రాం విహనామ" ఇతి. తత్ సంహతానామసంహతానాం చ ప్రేషయేత్- "ఏష ఖలు రాజా మాముత్పాట్య భవత్సు కర్మ కరిష్యతి. యుధ్యధ్వమ్; అహం వః శ్రేయానభ్యవపత్తుమ్" ఇతి.

వ్యా. 1. ఆ శత్రురాజు వంశానికి చెందినవానిని గాని, వాని అవరుద్ధపుత్రుణ్ణి గాని ధనంచేత లోభపెట్టి- "వీని మౌలబలాన్ని గాని, దేశం సరిహద్దులలో ఉన్న సైన్యాన్ని గాని, మరేదైనా సైన్యాన్ని గాని మర్దించుము" అని వానిని ప్రోత్సహించాలి.

2. లేదా ధన-మానాలచేత ఆటవికులను తన వైపు త్రిప్పుకొని వాని రాజ్యం నశింపచెయ్యాలి.

3. లేదా వాని పార్ష్ణిగ్రాహునితో- "ఈ రాజు నన్ను నిర్మూలించి నిన్ను కూడ నిర్మూలిస్తాడు, అందుచేత వీనిని వెనుకనుంచి ఆక్రమించుము. ఇతడు నీ వైపు తిరగగానే నేను వీని వెనుక భాగాన్ని ఆక్రమిస్తాను" అని చెప్పాలి. లేదా వాని మిత్రులతో - నేను మీకు ఈ రాజుకు మధ్య సేతువు వలె ఉన్నాను. నేను బ్రద్దలైపోతే ఈ రాజు మిమ్మల్నందరినీ ముంచేస్తాడు" అని చెప్పాలి. లేదా "మనం అందరం కలిసి వీని యుద్ధయాత్రను అడ్డగించుదాం" అని వాళ్లతో చెప్పాలి. ఆ శత్రువుతో కలిసినవాళ్లకీ కలవనివాళ్లకీ కూడ- "ఈ రాజు నన్ను పెకిలించివేసి మీమీద పడతాడు, యుద్ధం చెయ్యండి. నన్ను రక్షించడం మీకు శ్రేయస్కరం" అని వార్తలు పంపాలి.

శ్లో. మధ్యమస్య ప్రహిణుయాదుదాసీనస్య వా పునః,
యథాసన్నస్య మోక్షార్థం సర్వస్వేన తదర్పణమ్.

ఇతి కౌటలీయార్థశాస్త్రే ఆబలీయసే ద్వాదశేఽధికరణే తృతీయోఽధ్యాయః, సేనాముఖ్యవధః మణ్డలప్రోత్సాహనం చ, ఆదితః అష్టాత్రింశచ్ఛతతమః.

వ్యా. మధ్యమునికి గాని, ఉదాసీనునికి గాని, ఎవడు దగ్గరగా ఉంటే వానికి, తనను ఈ బలవంతునినుండి వచ్చిన ఆపదనుండి రక్షించ మని కోరుతూ, సర్వస్వాన్నీ ఇచ్చి అయినా తనను వానికి అర్పించాలి.

"బాలానందిని" అను కౌటలీయార్థశాస్త్రాంధ్రవ్యాఖ్యానంలో అబలీయసం అనే పన్నెండవ అధికరణంలో సేనాముఖ్యవధ, మండలప్రోత్సాహనం అనే మూడవ అధ్యాయం, ప్రారంభం నుంచి నూటముప్పైయెనిమిదవ అధ్యాయం సమాప్తం.

# అథ చతుర్థోఽధ్యాయః

## షట్‌షష్టిశతతమం ప్రకరణమ్ - శస్త్రాగ్నిరసప్రణిధయః (రహస్యంగా శస్త్రాలు, అగ్ని, విషం ప్రయోగించడం) సప్తషష్టితమం ప్రకరణమ్ - వీవధాసారప్రసారవధః(శత్రువుయొక్క ఆహారాదుల సరఫరాలను, మిత్రసేనల ఆగమనాన్ని, సైన్యం కదలికను అడ్డుకొనడం)

మూ. 1. యే చాస్య దుర్గేషు వైదేహకవ్యఞ్జనాః గ్రామేషు గృహపతివ్యఞ్జనాః జనపదసంధిషు గోరక్షకతాపసవ్యఞ్జనాః, తే సామన్తాటవికతత్కులీనావరుద్ధానాం పణ్యాగారపూర్వం ప్రేషయేయుః- "అయం దేశో హార్యః" ఇతి. ఆగతాంశ్చైషాం దుర్గే గూఢపురుషానర్థమానభ్యామ్ అభిసత్కృత్య ప్రకృతిచ్ఛిద్రాణి ప్రదర్శయేయుః తేషు తైః సహ ప్రహరేయుః.

2. స్కన్ధావారే వాస్య శౌణ్డికవ్యఞ్జనః పుత్రమభిత్యక్తం స్థాపయిత్వా అవస్కన్దకాలే రసేన ప్రవాసయిత్వా 'నైషేచనికమ్' ఇతి మదనరసయుక్తాన్ మద్యకుమ్భాన్ శతశః ప్రయచ్ఛేత్. శుద్ధం వా మద్యం పాద్యం వా మద్యం దద్యాదేకమహః, ఉత్తరం రససిద్ధం ప్రయచ్ఛేత్.

3. దణ్డముఖ్యవ్యఞ్జనో వా "పుత్రమభిత్యక్తమ్" ఇతి సమానమ్.

వ్యా. 1. శత్రువుయొక్క దుర్గాలలో వర్తకుల వేషాలలో ఉన్న గూఢచారులు, గ్రామాలలో గృహస్థుల వేషాలలో ఉన్నవాళ్లు, జనపదాల సంధులలో గోరక్షకుల

వేషాలలోను తాపసవేషాలలోను ఉన్నవాళ్లు సామంతులకు, ఆటవికులకు, రాజకులంవాళ్లకు, అవరుద్ధులకు (శత్రురాజుకు అప్రియులైన వాని కుమారులకు) మార్గమధ్యంలో కావలసిన వస్తుసామగ్రి కూడా ముందుగానే పంపుతూ "మీరు ఈ దేశాన్ని హరించాలి" అని కబురు పంపాలి. దుర్గంలోనికి వచ్చిన వాళ్ల గూఢపురుషులను ధనసన్మానాదులచేత సత్కరించి, ప్రకృతులలో ఉన్న ఛిద్రాలు (లోపాలు) వాళ్లకు తెలిపి వాళ్లతో కలిసి ఆ ఛిద్రాలలో ప్రకృతులమీద దెబ్బతీయాలి.

2. మద్యవిక్రేత వేషంలో శత్రురాజుయొక్క స్కంధావారంలో ఉన్నవాడు అభిత్యక్తుణ్ణి (మరణదండం విధించినవానిని ఒకనిని) తన పుత్రు డని చెప్పి ఉంచి, ఆక్రమణకాలంలో వానిని విషంచేత చంపివేసి "ఇది శ్రాద్ధంలో భాగంగా ఇచ్చేది" అని చెపుతూ విషం కలిపిన వందలకొలది మద్యకుంభాలను స్కంధావారంలోనివాళ్లకి ఇవ్వాలి. లేదా శుద్ధమైన మద్యం కాని, చంపడానికి అవసరమైన విషంలో నాల్గవ వంతు మాత్రమే కలిపిన మద్యం కాని ఒక రోజు ఇచ్చి, తరవాత విషం కలిపిన మద్యం ఇవ్వాలి. లేదా సైన్యంలోని ముఖ్యులకు శుద్ధమైన మద్యం ఇచ్చి వాళ్లు మత్తులో ఉన్నప్పుడు విషం కలిపిన మద్యం ఇవ్వాలి.

3. లేదా సైన్యంలో ముఖ్యుడు అనే వేషంలో ఉన్న సత్రి అభిత్యక్తుణ్ణి తన పుత్రు డని చెప్పి స్కంధావారంలో ఉంచి పైన చెప్పిన విధంగా చెయ్యాలి.

మూ. 1. పక్వమాంసికౌదనికశౌణ్డికాపూపికవ్యఞ్జనా వా పణ్యవిశేషమవ ఘోషయిత్వా పరస్పరసంఘర్షేణ కాలికం సమర్ఘతరమితి పరానాహూయ రసేన స్వపణ్యాన్యపచారయేయుః.

2. సురాక్షీరదధిసర్పిస్తైలాని వా తద్వ్యవహర్తృహస్తేషు గృహీత్వా స్త్రియః బాలాశ్చ రసయుక్తేషు స్వభాజనేషు పరికిరేయుః; అనేనార్ఘేణ విశిష్టం వా భూయో దీయతామ్ ఇతి తత్రైవ అవకిరేయుః.

3. ఏతాన్యేవ వైదేహకవ్యఞ్జనాః పణ్యవిక్రయేణాహర్తారో వా. హస్త్యశ్వానాం విధాయ వసేషు రసమాసన్నా దద్యుః.

వ్యా. 1. పక్వమాంసం అమ్మేవాళ్లు, అన్నం అమ్మేవాళ్లు, మద్యం అమ్మేవాళ్లు, పిండివంటలు అమ్మేవాళ్లు- వీళ్ల వేషాలలో ఉన్న గూఢచారులు తమ తమ దగ్గర ఉన్న ఆ యా పణ్యాలను గూర్చి చాటి చెప్పి ఒకరితో ఒకరు పోటీ పడుతూ, ఇది చాల తక్కువ ధరకి ఇస్తున్నాం, దీని మూల్యం కొంత కాలం తరవాత ఇవ్వవచ్చును అని శత్రువులను

పిలిచి విషం కలిపిన ఆవస్తువులను వాళ్లు తీసుకొనే టట్లు చెయ్యాలి.

2. స్త్రీలు గాని, బాలులు గాని, మద్యం, పాలు, పెరుగు, నెయ్యి, నూనె అమ్మేవాళ్ల నుండి వాటిని తీసుకొని, విషం ఉన్న తమ పాత్రలలో పోయించుకొని, "ఆ మూల్యానికి కాదు ఇంత మూల్యానికి ఇయ్యి, లేదా ఇంతకంటె మంచిది ఇయ్యి" అని అంటూ ఆ పదార్థాలు వాళ్ల పాత్రలలోనికి వంచివెయ్యాలి.

3. వర్తకుల వేషాలలో ఉన్న గూఢచారులు, లేదా పణ్యాలను అమ్మడంకోసం స్కంధావారంలోనికి తెచ్చేవాళ్లు పైన చెప్పిన వస్తువులలో విషం కలిపి అక్కడివాళ్లకి ఇవ్వాలి. దగ్గరగా ఉన్న గూఢచారులు ఏనుగుల ఆహారాలలోను, గుఱ్ఱాల గడ్డిలోను విషం ఇవ్వాలి.

మూ. 1. కర్మకరవ్యఞ్జనా వా రసాక్తయవసముదకం వా విక్రీణీరన్. చిరసంసృష్టా వా గోవాణిజకాః గవామ్ అజావీనాం వా యూథాన్యవస్కన్దకాలేషు పరేషాం మోహస్థానేషు ప్రముఞ్చేయుః. అశ్వఖరోష్ట్రమహిషాదీనాం దుష్టాంశ్చ తద్వ్యఞ్జనాః చుచున్దరీశోణితాక్తాక్షాన్; లుబ్ధకవ్యఞ్జనా వా వ్యాలమృగాన్ పఞ్జరేభ్యః ప్రముఞ్చేయుః, సర్పగ్రాహా వా సర్పానుగ్రవిషాన్, హస్తిజీవినో వా హస్తినః. అగ్నిజీవినో వా అగ్నిమవసృజేయుః.

2. గూఢపురుషా వా విముఖాన్ పత్త్యశ్వరథద్విపముఖ్యాన్ అభిహన్యుః. ఆదీపయేయుర్ముఖ్యావాసాన్. దూష్యామిత్రాటవికవ్యఞ్జనాః ప్రణిహితాః పృష్ఠాభిఘాతమవస్కన్దప్రతిగ్రహం వా కుర్యుః. వనగూఢా వా ప్రత్యన్తస్కన్ధముపనిష్కృష్య అభిహన్యుః.

వ్యా. 1. లేదా పనివాళ్ల వేషాలలో ఉన్న గూఢచారులు విషం కలిపిన పశువుల ఆహారం, నీరు అమ్మాలి. స్కంధావారంతో చాలా కాలంనుంచి సంబంధం ఉన్న పశువుల వర్తకులు ఆక్రమణసమయాలలో శత్రువులు ఏమి చెయాలో తెలియని పరిస్థితులలో ఉన్నప్పుడు (వాళ్లని ఇంకా కంగారు పెట్టడం కోసం) ఎద్దు, మేకలు, గొఱ్ఱెలు- వీటి మందలను ఆ సైనికు లున్న ప్రదేశాలలోనికి వెళ్లేటట్లు విడిచిపెట్టాలి. అశ్వాదులు అమ్మే వర్తకుల వేషాలలో ఉన్నవాళ్లు గుఱ్ఱాలు, గాడిదలు, ఒంటెలు, దున్నపోతులు-వీటిలో పొగరుమోతులను, వాటి కళ్లలో చుంచు రక్తం పూసి ఆ సైన్యం మీదికి విడిచిపెట్టాలి. లేదా వేటగాళ్ల (ఆటవికుల) వేషాలలో ఉన్నవాళ్లు క్రూరమృగాలను

పంజరాలనుంచి విడిచిపెట్టాలి. లేదా సర్పాలు పట్టుకొనేవాళ్లు ఉగ్రమైన విషం గల సర్పాలను విడిచిపెట్టాలి లేదా ఏనుగులను అమ్మి జీవించేవాళ్లు ఏనుగులను వాళ్ల మీదికి విడిచిపెట్టాలి. లేదా అగ్నిచేత జీవించేవాళ్లు అగ్నిని విడిచిపెట్టి దహించాలి.

2. లేదా గూఢపురుషులు యుద్ధంనుండి వెనుతిరిగి వస్తూన్న పత్త్యశ్వరథహస్తి ముఖ్యులను చంపివేయాలి. లేదా ముఖ్యుల నివాసాలకు నిప్పు అంటించాలి. దూష్యులు, అమిత్రులు, ఆటవికులు- వీళ్ల వేషాలలో ఉన్న ప్రణిహితులు (గూఢచారులు) శత్రువులను వెనకనుండి చంపడం గాని, పరబలంతో యుద్ధం చేస్తూన్న దుర్బలునికి సహాయం కాని చెయ్యాలి. లేదా అడవులలో దాగినవాళ్లు సరిహద్దులలో ఉన్నవాళ్లు సరిహద్దులలో ఉన్న స్కంధావారాన్ని తమ దగ్గరికి రానిచ్చి నశింపచెయ్యాలి.

మూ. 1. ఏకాయనే వీవధాసారప్రసారాన్ వా.

2. ససంకేతం వా రాత్రియుద్ధే భూరితూర్యమాహత్య బ్రూయుః- "అనుప్రవిష్టాః స్మ, లబ్ధం రాజ్యమ్" ఇతి. రాజావాసమనుప్రవిష్టా వా సంకులేషు రాజానం హన్యుః.

3. సర్వతో వా ప్రయాతమేనం మ్లేచ్ఛాటవికదణ్డచారిణః సత్రాపాశ్రయాః, స్తమ్భవాటాపాశ్రయా వా హన్యుః.

4. లుబ్ధకవ్యఞ్జనా వా అవస్కన్దసంకులేషు గూఢయుద్ధహేతుభిః అభిహన్యుః.

5. ఏకాయనే వా శైలస్తమ్భవాటఖఞ్జనాన్తరుదకే వా స్వభూమిబలేన అభిహన్యుః. నదీసరస్తటాకసేతుబన్ధభేదవేగేన వా ఆప్లావయేయుః. ధాన్వనవ ననిమ్నదుర్గస్థం వా యోగాగ్నిధూమాభ్యాం నాశయేయుః.

6. సంకటగతమ్ అగ్నినా, ధాన్వనగతం ధూమేన, నిధానగతం రసేన, తోయావగాఢం దుష్టగ్రాహైః ఉదకచరణైర్వా తీక్ష్ణాః సాధయేయుః.

వ్యా. 1. లేదా ఒక్కరు మాత్రమే నడవడానికి వీలైన ఇరుకైన మార్గంలో వీవధాన్ని (ఆహారం సంరఫరాను) ఆసారాన్ని (మిత్రసైన్యాగమనాన్ని), ప్రసారాన్ని (తృణకాష్ఠాదుల రాకను) అడ్డుకొనాలి.

2. లేదా రాత్రియుద్ధంలో సంకేతపూర్వకంగా అధికంగా తూర్యాలు మ్రోగించి- "ప్రవేశించివేశాం; రాజ్యం పట్టుబడింది" అనాలి. లేదా సంకులపరిస్థితిలో రాజనివాసంలో ప్రవేశించి రాజును చంపివేయాలి.

3. లేదా యుద్ధభూమినుండి వెళ్లిపోతూన్న శత్రురాజును ధాన్వనం, వనం, సంకటం మొదలైన సత్రాన్ని ఆశ్రయించి గాని, స్తంభాలు పాతిన ఆవరణలో ఉండి గాని, మ్లేచ్ఛసేనానాయకులు, ఆటవికసేనానాయకులు చంపివేయాలి.

4. లేదా లుబ్ధకుల (వేటగాళ్ల) వేషాలలో ఉన్నవాళ్లు ఆక్రమణసమయంలో ఉన్న సంకులాలలో (కంగారు పరిస్థితులలో) కూటయుద్ధవికల్పప్రకరణంలో చెప్పిన ఉపాయాలచేత చంపివేయ్యాలి.

5. ఇరుకైన మార్గంలో గాని, రాళ్లు, స్తంభాలు, క్రింద నీళ్లు ఉన్న ప్రదేశాలు- వీటిలో గాని, తమకు అనుకూలమైన భూమిలో ఉండి శత్రువులను చంపివేయాలి. లేదా నదులకు, సరస్సులకు పెద్ద చెరువులకు, తటాకాలకు (చిన్న చెరువులకు) కట్టిన సేతువులు బ్రద్దలుకొట్టి ఆ జలవేగం వాళ్లని ముంచెత్తే టట్లు చెయ్యాలి. లేదా ధాన్వనదుర్గంలోను, వనదుర్గంలోను, జలదుర్గంలోను ఉన్న శత్రువును కపటోపాయాలచేత సృష్టించిన అగ్నిచేత, ధూమంచేత నశింపచెయ్యాలి.

6. ఇరుకైన ప్రదేశంలో ఉన్న శత్రువును అగ్నిచేత, మరుభూమిలో ఉన్నవానిని ధూమంచేత, గూఢమైన కోశస్థానంలో ఉన్నవానిని విషంచేత, నీటిలో ఉన్నవానిని దుష్టములైన జలజంతువులచేత గాని, (ముందుచెప్పబోవు) ఉదకచరణాలచేత (ఉదకంలో సంచరించే విధానాలు) గాని చంపివేయాలి.

మూ. 1. ఆదీప్తావాసాత్ నిష్పతన్తం వా-

శ్లో. యోగవామనయోగాభ్యాం యోగేనాన్యతమేన వా,

అమిత్రమతిసందధ్యాత్ సక్తముక్తాసు భూమిషు.

ఇతి కౌటలీయార్థశాస్త్రే అబలీయసే ద్వాదశేఽధికరణే చతుర్థోఽధ్యాయః,
శస్త్రాగ్నిరసప్రణిధయః వీవధాసారప్రసారవధశ్చ, ఆదిత ఏకోనచత్వారింశచ్ఛతతమః.

వ్యా. మండుతూన్న నివాసంనుంచి బైటకు వచ్చి వెనుక చెప్పిన ధాన్వనాది భూములలో దాగి ఉన్న శత్రువును యోగవామనం (దుర్గలంభోపాయంలో చెప్పనున్నదాని) చేత, యోగాతిసంధానాధ్యాయంలో చెప్పనున్న యోగంచేత, లేదా పూర్వం చెప్పిన పరాతిసంధానోపాయాలలో ఏదైనా ఒక ఉపాయంచేత జయించాలి.

"బాలానందిని" అను కౌటలీయార్థశాస్త్రాంధ్రవ్యాఖ్యానంలో ఆబలీయసం అనే పన్నెండవ అధికరణంలో శస్త్రాగ్నిరసప్రణిధులు, వీవధాసారప్రసారవధ అనే నాల్గవ అధ్యాయం, ప్రారంభంనుంచి నూట నలభైఒకటవ అధ్యాయం సమాప్తం.

# అథ పఞ్చమోఽధ్యాయః

## అష్టషష్టిశతతమం ప్రకరణమ్ - యోగాతిసంధానమ్ (శత్రువును కపటోపాయంచేత జయించడం) ఏకోనసప్తతిశతతమం ప్రకరణమ్ - దణ్డాతిసంధానమ్ (సైన్యబలంచేత జయించడం) సప్తతిశతతమం ప్రకరణమ్ - ఏకవిజయః (ఒక రాజు యొక్క విజయం)

మూ. 1. దైవతేజ్యాయాం యాత్రాయామమిత్రస్య బహూని పూజ్యాగమస్థానాని భక్తితః. తత్రాస్య యోగమ్ ఉబ్జయేత్.

2. దేవతాగృహప్రవిష్టస్యోపరి యన్త్రమోక్షణేన గూఢభిత్తిం శిలాం వా పాతయేత్. శిలాశస్త్రవర్షమ్ ఉత్తమాగారాత్, కవాటమవపాతితం వా, భిత్తిప్రణిహితమేకదేశబన్ధం వా పరిఘం మోక్షయేత్. దేవతాదేహస్థప్రహరణాని వా అస్యోపరిష్టాత్ పాతయేత్. స్థానాసనగమనభూమిషు వా అస్య గోమయప్రదేహేన, గన్ధోదకావసేకేన వా రసమతిచారయేత్, పుష్పచూర్ణోపహారేణ వా. గన్ధప్రతిచ్ఛన్నం వాస్య తీక్ష్ణం ధూమమతినయేత్ శూలకూపమ్ అవపాతనం వా శయనాసనస్యాధస్తాత్ యన్త్రబద్ధతలమేనం కీలమోక్షణేన ప్రవేశయేత్. ప్రత్యాసన్నే వా మిత్రే జనపదాత్ జనమవరోధక్షమమతినయేత్. దుర్గాచ్చానవరోధక్షమమ్ అపనయేత్. ప్రత్యాదేయం అరివిషయం వా ప్రేషయేత్. జనపదం చైకస్థం శైలవననదీదుర్గేషు అటవీవ్యవహితేషు వా పుత్రభ్రాతృపరిగృహీతం స్థాపయేత్.

3. ఉపరోధహేతవో దణ్డోపనతవృత్తే వ్యాఖ్యాతాః.

వ్యా. 1. శత్రువు దేవతాపూజ నిమిత్తం గాని, దేవతోత్సవయాత్రయందు గాని, దేవభక్తిచేత అనేక పూజ్యస్థానాలకి వెడుతూంటాడు. అక్కడ వీని విషయంలో కపటోపాయాన్ని ప్రయోగించాలి.

2. అతడు దేవతాగృహంలో ప్రవేశించినప్పుడు అక్కడ అమర్చిన యంత్రం కదిపి రహస్యమైన గోడను గాని, బండరాయి గాని వానిమీద పడేటట్లు చెయ్యాలి. లేదా ఇంటి పైభాగంనుంచి శిలాశస్త్రాలు వర్షించాలి. లేదా తలుపు వానిమీద పడవేయాలి.

లేదా గోడలో ఒక ప్రక్కమాత్రమే అమర్చిన పరిఘను వానిమీద పడవెయ్యాలి. లేదా దేవతల చేతులలో ఉన్న ఆయుధాలు వీనిమీద పడే టట్లు చెయ్యాలి. అతడు నిలిచే ప్రదేశాలలోను, కూర్చుండే ప్రదేశాలలోను, నడిచే ప్రదేశాలలోను గోమయంతో అలికినచోట, గంధోదకం చల్లిన చోట విషం కలపాలి. విషం కలిపిన గోమయాదులతో అలకాలి అని అర్థం. లేదా దేవతాప్రసాదంగా ఇచ్చే పుష్పాలలోను, కుంకుమాదిచూర్ణాలలోను విషం కలపాలి. వానిమీద పైకి సుగంధం కలదిగా ఉన్న తీక్ష్ణమైన ధూమాన్ని ప్రసరింపచెయ్యాలి. లేదా వాని మంచంక్రింద, ఆసనం క్రింద యంత్రం అమర్చి దాని కీలం (మేకు) కదపడం ద్వారా శూలాలు ఉన్న నూతిలోను, గోతిలోను పడేటట్లు చెయ్యాలి. లేదా శత్రువు దగ్గరికి వచ్చివేసినప్పుడు వానిని ఎదిరించడానికి తగిన సామర్థ్యం గల జనాన్ని జనపదంనుంచి కోటలోనికి చేర్చాలి. ఎదిరించడానికి తగిన సామర్థ్యం లేని జనాన్ని కోటనుంచి తొలగించాలి, లేదా తిరిగి తీసికొనడానికి శక్యమైన శత్రురాజ్యంలోని ప్రాంతానికైనా పంపివేయాలి. జనపదంలోని జనులను అందరినీ ఒకచోట చేర్చి పుత్రుని అధీనంలో కాని, సోదరుని అధీనంలో కాని వాళ్లను మధ్య అడవి అడ్డంగా ఉన్న శైలదుర్గంలోనో, వనదుర్గంలోనో, నదీదుర్గంలోనో ఉంచాలి.

3. ప్రబలుడైన శత్రువును అడ్డగించే మరి కొన్ని పద్ధతులు వెనుక దండోపనతవృత్తంలో చెప్పబడినవి.

**మూ.** 1. తృణకాష్ఠమ్ ఆయోజనాత్ దాహయేత్. ఉదకాని చ దూషయేత్, అవస్రావయేచ్చ, కూటకూటావపాతకణ్టకినీశ్చ బహిరుబ్జయేత్.

2. సురుఙ్గామమిత్రస్థానే బహుముఖీం కృత్వా విచయముఖ్యానభిహార యేత్, అమిత్రం వా. పరప్రయుక్తాయాం వా సురుఙ్గాయాం పరిఖాముదకాన్తికీం ఖానయేత్, కోశశాలామనుసాలం వా. తోయకుమ్భాన్ కాంస్యభాణ్డాని వా శఙ్కాస్థానేషు స్థాపయేత్ ఖాతాభిజ్ఞానార్థమ్. జ్ఞాతే సురుఙ్గాపథే ప్రతిసురుఙ్గాం కారయేత్, మధ్యే భిత్త్వా ధూమముదకం వా ప్రయచ్ఛేత్.

వ్యా. 1. ఒక యోజనం దూరంవరకు ఉన్న గడ్డి కాష్ఠాలు కాల్చివేయాలి. జలం విషాదులచేత చెడిపోయే టట్లు చెయ్యాలి. నీరు బైటకు పోయే టట్లు చెయ్యాలి. ప్రాకారం బైట కూటకూపాలు (పైకి కనబడని నూతులు) కూటావపాతాలు (గడ్డి కప్పిన

గోతులు) ముళ్ల ఇనుపతీగలు ఏర్పరచాలి.

2. శత్రువు ఉన్న చోటిదాకా చాలా ముఖాలు గల సురంగం త్రవ్వించి దాని ద్వారా వివిధవస్తువుల సముదాయాల అధిపతులను గాని, శత్రువునే గాని అపహరింపచెయ్యాలి. లేదా శత్రువు సురంగం త్రవ్వించి నట్లయితే దాని ప్రక్కనే నీళ్లు వచ్చేటంత లోతుగా పరిఖ త్రవ్వించాలి. లేదా ప్రాకారాన్ని అనుసరించి (వెంబడి) కూపాల శాలను (పంక్తిని) నిర్మించాలి. శంక కలిగిన చోట్ల (సురంగం ఎటువైపు ఉంది అనే సందేహం ఉన్నచోట్ల) నీళ్ల కుండలు గాని, కంచు పాత్రలు గాని, తవ్విన చోటు గుర్తించడం కోసం ఉంచాలి. సురంగమార్గం తెలిసిన తరవాత దాని వెంబడి మరొక సురంగం తవ్వించాలి. మధ్యలో దానిని బ్రద్దలుకొట్టి శత్రువు త్రవ్వించిన సురంగంతో కలిపి దాని ద్వారా పొగ గాని నీళ్లు గాని దానిలోనికి పంపాలి.

మూ. 1. ప్రతివిహితదుర్గో వా మూలే దాయాదం కృత్వా ప్రతిలోమామస్య దిశం గచ్ఛేత్- యతో వా మిత్రైః, బన్ధుభిః ఆటవికైర్వా సంసృజ్యేత, పరస్పరమిత్రైః దూష్యైర్వా మహద్భిః; యతో వా గతోఽస్య మిత్రైర్వియోగం కుర్యాత్, పార్ష్ణిం వా గృహ్ణీయాత్; రాజ్యం వాస్య హారయేత్. వీవధాసారప్రసారాన్ వారయేత్. యతో వా శక్నుయాత్ ఆక్షికవదపక్షేపేణాస్య ప్రహర్తుం; యతో వా స్వం రాజ్యం త్రాయేత, మూలస్యోపచయం వా కుర్యాత్ యతః సంధిమభిప్రేతం లభతే తతో వా గచ్ఛేత్.

2. సహప్రస్థాయినో వాస్య ప్రేషయేయుః- "అయం తే శత్రు రస్మాకం హస్తగతః. పణ్యం విప్రకారం వాపదిశ్య హిరణ్యమన్తఃసారబలం ప్రేషయస్వ. ఏనమర్పయేమ బద్ధం ప్రవాసితం వా" ఇతి. ప్రతిపన్నే హిరణ్యం సారబలం చాదదీత.

వ్యా. 1. లేదా దుర్బలుడైన రాజు దుర్గరక్షణకు ఉపాయాలన్నీ చేసి, పుత్రుణ్ణి దుర్గంలో ఉంచి, ఏ దిక్కుకు వెడితే శత్రువుకు ప్రతికూలంగా ఉంటుందో ఆ దిక్కుకు గాని, ఎటు వైపు వెడితే మిత్రులు, బంధువులు, ఆటవికులు కలుస్తారో ఆ వైపుకు గాని, ఎటువైపు శత్రువుయొక్క చాలమంది శత్రువులు, దూష్యులు కలుస్తారో అటువైపు గాని, ఎటు వైపు వెడితే శత్రువుయొక్క మిత్రుల్ని వాని నుండి విడదీయకలుగుతాడో ఆ

దిక్కునకు గాని, ఎటు వైపు శత్రువు యొక్క వెనకభాగాన్ని ఆక్రమిస్తాడో ఆ వైపునకు గాని, ఎటు వైపు వెడితే వాని రాజ్యాన్ని హరించవచ్చునో ఆ వైపుకు గాని, వాని వీవధాసారప్రసారాలు అడ్డుకొనడానికి తగిన దిక్కునకు గాని, ఎటువైపు వెడితే జూదరి వలె కపటప్రయోగంచేత శత్రువుమీద దెబ్బకొట్టకలుగుతాడో ఆ వైపునకు గాని, ఎటు వైపు వెడితే తన రాజ్యం రక్షించబడుతుందో ఆ వైపునకు గాని, ఏ వైపు వెడితే మూలబలాన్ని పెంచుకొనకలుగుతాడో లేదా తన మూలస్థానాన్ని బలపరచు కొనకలుగుతాడో ఆ వైపునకు గాని, ఏ వైపుకు వెడితే తనకు ఇష్టమైన విధంగా సంధి చేసికొనకలుగుతాడో ఆ వైపునకు గాని వెళ్లాలి.

2. ఈ విధంగా శత్రువుకు ప్రతిలోమంగా వెళ్లిన ఆ దుర్బలునితో కలిసి వెళ్లిన వాళ్లు (గూఢపురుషులు) శత్రువుకు- "నీ శత్రువు ఇప్పుడు మా చేతిలో ఉన్నాడు, పణ్యాలకోసం ధనమూ ఏదైన తిరుగుబాటు జరిగితే అణచివేయడానికి మంచి సారం గల సైన్యాన్నీ పంపుము. ఇతనిని బంధించి గాని, చంపివేసి గాని నీకు అప్పగిస్తాం" అని కబురు పంపాలి. అతడు అంగీకరించి ధనసారసైన్యాలు పంపగా వాటిని స్వాధీనం చేసుకోవాలి.

మూ. 1. అన్తపాలో వా దుర్గసంప్రదానేన బలైకదేశమతినీయ విశ్వస్తం ఘాతయేత్.

2. జనపదమేకస్థం వా ఘాతయితుమమిత్రానీకమావాహయేత్. తదవరుద్ధదేశమ్ అతినీయ విశ్వస్తం ఘాతయేత్.

3. మిత్రవ్యఞ్జనో వా బాహ్యస్య ప్రేషయేత్- "క్షీణమస్మిన్ దుర్గే ధాన్యమ్, స్నేహాః, క్షారం, లవణం, వా. తదముష్మిన్ దేశే కాలే చ ప్రవేక్ష్యతి. తదుపగృహాణ" ఇతి. తతో రసవిద్ధం ధాన్యం, స్నేహం, క్షీరం, లవణం వా దూష్యామిత్రాటవికాః ప్రవేశయేయుః; అన్యే వా అభిత్యక్తాః.

4. తేన సర్వభాణ్డవీవధగ్రహణం వ్యాఖ్యాతమ్.

వ్యా. 1. లేదా సీమాంతపాలుడు తన దుర్గాన్ని అధీనం చేస్తున్నానని చెప్పి శత్రుబలంలో కొంత భాగాన్ని లోనికి ప్రవేశపెట్టి వాళ్లకి విశ్వాసం కలిగిన తరవాత వాళ్లను నశింపచేయాలి.

2. లేదా ఒక చోట చేర్చబడి ఉన్న జనపదజనులను చంపడానికి శత్రుసైన్యాన్ని కపటోపాయం చేత రప్పించాలి. ఆ సైన్యాన్ని బైటకు వెళ్లడానికి కష్టమైన ప్రదేశంలోనికి రానిచ్చి, విశ్వాసంతో ఉన్నప్పుడు దానిని రూపుమాపాలి.

3. లేదా మిత్రుడని అభినయిస్తూన్న గూఢచారి శత్రువుకు - "ఈ దుర్గంలో ధాన్యం లేదా తైలాలు, లేదా క్షారం, లేదా లవణం అలభ్యం అయిపోయాయి. ఫలానా దేశంలో, ఫలానా కాలంలో వాటిని కోటలోనికి తీసికొనివస్తారు. నువ్వు దానిని పట్టుకొనుము" అని కబురు పంపాలి. తరవాత దూష్య-అమిత్ర-ఆటవికులు గాని, అభిత్యక్తులైన (చంపదగిన) ఇతరులు గాని ఆ ధాన్యంలో లేదా స్నేహంలో లేదా క్షీరంలో లేదా లవణంలో విషం కలిపి దుర్గానికి తీసికొని వెళ్లాలి. వాటిని శత్రువు గ్రహించగా అవి తిన్న వాని పక్షంవాళ్లు నశిస్తారు అని అర్థం.

4. దీనిచేత సమస్తభాండాల (సరుకుల)ను, వీవధాన్ని పట్టుకొనే విధానం చెప్పబడినట్లే.

మూ. 1. సంధిం కృత్వా హిరణ్యైకదేశమస్మై దద్యాత్. విలమ్బమానః శేషమ్.తతో రక్షావిధానాన్యవస్రావయేత్; అగ్నిరసశస్త్రైర్వా ప్రహరేత్. హిరణ్యప్రతిగ్రాహిణో వాస్య వల్లభాననుగృహ్ణీయాత్.

2. పరిక్షీణో వాస్మై దుర్గం దత్త్వా నిర్గచ్ఛేత్ సురుఙ్గయా. కుక్షిప్రదరేణ వా ప్రాకారభేదేన నిర్గచ్ఛేత్.

3. రాత్రావవస్కన్దం దత్త్వా సిద్ధస్తిష్ఠేత్; అసిద్ధః పార్శ్వేన అపగచ్ఛేత్. పాషణ్డచ్ఛద్మనా మన్దపరివారః నిర్గచ్ఛేత్. ప్రేతవ్యఞ్జనో వా గూఢైః నిర్హ్రియేత. స్త్రీవేషధారీ వా ప్రేతమనుగచ్ఛేత్.

4. దైవతోపహారశ్రాద్ధప్రహవణేషు వా రసవిద్ధమన్నపానమవసృజ్య కృతోపజాపః దూష్యవ్యఞ్జనైర్నిష్పత్య గూఢసైన్యః అభిహన్యాత్.

వా. 1. లేదా శత్రువుతో సంధి చేసికొని కొంత ధనం ఇవ్వాలి. మిగిలినది ఆలస్యం చేసి ఇవ్వాలి. తరవాత అతడు (విశ్వాసం కలిగి) తన రక్షావిధానాలు సడలించే టట్లు చెయ్యాలి. లేదా అగ్నిచేత గాని, విషంచేత గాని, శస్త్రాలచేత గాని నశింపచెయ్యాలి. శత్రువుకు ఇష్టులైనవాళ్ల ధనం లంచంగా తీసికొనే వాళ్లకి లంచాలు ఇవ్వాలి.

2. బాగా అలసిపోయిన ట్లయితే వానికి దుర్గం విడిచిపెట్టివేసి సురుంగం ద్వారా బైటకు వెళ్లిపోవాలి. లేదా ప్రాకారం గర్భంలో ఉన్న రహస్యమైన పెద్ద బీట ద్వారా బైటకు వెళ్లిపోవాలి.

3. రాత్రి నిద్రపోతూన్న శత్రుసేనలమీద ఆక్రమణంచేసి ఆ పనిలో సఫలుడైతే ఉండాలి. సాఫల్యం లభించకపోతే ఏదో ఒక వక్రోపాయంతో పారిపోవాలి. పాషండుని వేషం ధరించి తక్కువ పరివారంతో వెళ్లిపోవాలి. లేదా శవం వలె అభినయిస్తూ గూఢపురుషులచేత దూరంగా మోయించుకొనబడి వెళ్లిపోవాలి. లేదా స్త్రీవేషం ధరించి శవం వెనుక వెళ్లాలి.

4. లేదా దేవతలకు నైవేద్యాలు గాని, శ్రాద్ధభోజనాలు గాని ప్రహవణాలు (ఉద్యానభోజనాలు) గాని ఏర్పరచి అక్కడ విషం కలిపిన అన్నపానాలు ఉంచి వెళ్లిపోవాలి. ఉపజాపం చేసి దూష్యులనే వేషాలలో ఉన్నవాళ్లతో (దూష్యులుగా అభినయించేవాళ్లతో) శత్రుపక్షంలో ప్రవేశించి గూఢమైన సైన్యంతో కూడినవాడై శత్రువును హతమార్చాలి.

మూ. 1. ఏవం గృహీతదుర్గో వా ప్రాశ్యప్రాశం చైత్యముపస్థాప్య దైవతప్రతిమాచ్ఛిద్రం ప్రవిశ్యాసీత, గూఢభిత్తిం వా దైవతప్రతిమాయుక్తం భూమిగృహమ్. విస్మృతే సురుఙ్గయా రాజవాసమనుప్రవిశ్య సుప్తమమిత్రం హన్యాత్. యన్త్రవిశ్లేషణం వా విశ్లేష్య అధస్తాదవపాతయేత్. రసాగ్నియోగేనావ లిప్తం గృహం జతుగృహం వా అధిశయానమ్ అమిత్రమ్ ఆదీపయేత్.

2. ప్రమదవనవిహారాణామన్యతమే వా విహారస్థానే ప్రమత్తం భూమిగృహసురుఙ్గాగూఢభిత్తిప్రవిష్టాః తీక్ష్ణాః హన్యుః; గూఢప్రణిహితా వా రసేన.స్వపతో వా నిరుద్ధే దేశే గూఢాః స్త్రియః సర్పరసాగ్నిధూమానుపరి ముఞ్చేయుః.

3. ప్రత్యుత్పన్నే వా కారణే యద్యదుపపద్యేత తత్తదమిత్రేఽన్తః పురగతే గూఢసంచారగతః ప్రయుఞ్జీత: తతో గూఢమేవాపగచ్ఛేత్. స్వజనసంజ్ఞాం చ ప్రరూపయేత్.

వ్యా. 1. ఈ విధంగా శత్రువుచేత ఆక్రమించబడిన దుర్గం గల దుర్బలుడు అధికంగా అహారపదార్థా లున్న దేవాలయం చేరి దేవతాప్రతిమలో ఉన్న రంధ్రంలో

ప్రవేశించి కూర్చోవాలి. లేదా గూఢమైన గోడవెనుక గాని, దేవతాప్రతిమ ఉన్న భూగృహంగాని ప్రవేశించాలి. అందరూ ఆదమరపుగా ఉన్నప్పుడు రాత్రి రాజగృహంలోనికి సురుంగం ద్వారా ప్రవేశించి నిద్రిస్తున్న శత్రువును చంపివేయాలి. లేదా విడదీయడానికి వీలైన యంత్రాన్ని ఊడగొట్టి క్రింద (శత్రువుమీద పడేటట్లు) పడవేయాలి. లేదా శత్రువు నిద్రపోతున్నప్పుడు అగ్నిని మండింపచేయడానికి ఉపకరించే యోగంచేత పూయబడిన లక్క ఇల్లుకు నిప్పు అంటించాలి.

2. ఉద్యానవనంలో గాని, ఇతరవిహారస్థానాలలో గాని, ఏదైనా ఒక చోట విహారస్థానంలో గాని, ఏమరిపాటుతో ఉన్న శత్రువును భూమిగృహంలోను సురుంగంలోను లేదా గోడలోను దూరి ఉన్న తీక్ష్ణులు చంపివెయ్యాలి, లేదా గూఢంగా పంపబడిన పురుషులు విషంచేత చంపాలి. ఎవరూ రాకుండా అడ్డుపెట్టబడిన ప్రదేశంలో నిద్రపోతున్న శత్రువుమీద ఆతని సేవలో ఉన్న గూఢచారిస్త్రీలు సర్పాలను, విషం, అగ్ని, ధూమం విడవాలి.

3. ఆ సమయానికి ఏ యే నిమిత్తం కనబడుతుందో దానిని పురస్కరించుకొని, తాను గూఢంగా సంచరిస్తూ, అంతఃపురంలో ఉన్న శత్రువుమీద తగిన ఉపాయం ప్రయోగించి రహస్యంగానే అక్కడినుంచి పారిపోవాలి. అక్కడ గూఢచారులుగా ఉంటూన్న తన వాళ్లందరికీ బైటకు రావడానికి సంకేతం ఇవ్వాలి.

శ్లో. ద్వాఃస్థాన్ వర్షవరాంశ్చాన్యాన్ నిగూఢోపహితాన్ పరే,
తూర్యసంజ్ఞాభిరాహూయ ద్విషచ్ఛేషాణి ఘాతయేత్.

ఇతి కౌటలీయార్థశాస్త్రే ఆబలీయసే ద్వాదశాధికరణే పఞ్చమోఽధ్యాయః,
యోగాతిసంధానం, దణ్డాతిసంధానమ్, ఏకవిజయశ్చ, ఆదితశ్చత్వారింశచ్ఛతతమః.
ఏతావతా కౌటలీయార్థశాస్త్రస్య ఆబలీయసం ద్వాదశమధికరణం సమాప్తమ్.

వ్యా. శత్రువు దగ్గర రహస్యంగా ఉంచబడిన ద్వారపాలకులను, కంచుకులను, ఇతరులను, తూర్యధ్వనుల సంకేతాల ద్వారా పిలచి శత్రువుయొక్క మిగిలిన పరివారాన్ని చంపించివేయాలి.

"బాలానందిని" అను కౌటలీయార్థశాస్త్రాంధ్రవ్యాఖ్యానంలో ఆబలీయసం అనే పన్నెండవ అధికరణంలో వంచనచేత జయించడం, సైన్యంచేత జయించడం, ఒకని విజయం అనే ఐదవ అధ్యాయం, ప్రారంభం నుంచి నూటనలభైయవ అధ్యాయం సమాప్తం.

దీనితో కౌటలీయార్థశాస్త్రంలోని ఆబలీయసం అనే పన్నెండవ అధికరణం సమాప్తం.

## అథ దుర్గలమ్భోపాయః - త్రయోదశమధికరణమ్

## ప్రథమో ఽధ్యాయః

### ఏకసప్తతిశతతమం ప్రకరణమ్ - ఉపజాపః

శత్రుదుర్గాన్ని ఆక్రమించడానికి ఉపాయం - పదమూడవ అధికరణం - ఉపజాపం - (ఏవేవో ఉపాయాలు చేసి కలిసి ఉన్నవాళ్లు విడిపోయే టట్లు, తిరగబడేటట్లు చేయడం. Sedition)

మూ. 1. విజిగీషుః పరగ్రామమవాప్తుకామః సర్వజ్ఞదైవతసంయోగ ఖ్యాపనాభ్యాం స్వపక్షముద్ధర్షయేత్ పరపక్షం చోద్వేజయేత్.

2. సర్వజ్ఞఖ్యాపనం తు - గృహగుహ్యప్రవృత్తిజ్ఞాపనేన ప్రత్యాదేశో ముఖ్యానామ్; కణ్టకశోధనాపసర్పాగమేన ప్రకాశనం రాజద్విష్టకారిణామ్, విజ్ఞాప్యోపాయనఖ్యాపనమ్ అదృష్టసంసర్గవిద్యాసంజ్ఞాదిభిః, విదేశప్రవృత్తి జ్ఞానం తదహరేవ గృహకపోతేన ముద్రాసంయుక్తేన.

3. దైవతసంయోగఖ్యాపనం తు - సురుఙ్గాముఖేనాగ్ని చైత్యదైవతప్రతి మాఛిద్రానుప్రవిష్టైః అగ్నిచైత్యదైవతవ్యఞ్జనైః సంభాషణం పూజనం చ; ఉదకాదుత్థితైర్వా నాగవరుణవ్యఞ్జనైః సంభాషా, పూజనం చ; రాత్రావన్తరుదకే సముద్రవాలుకాకోశం ప్రణిధాయ అగ్నిమాలాదర్శనమ్, శిలాశిక్యావగృహీతే ప్లవకే స్థానమ్, ఉదకవస్తినా జరాయుణా వా శిరోవగూఢనాసః, పృషతాన్త్రకులీర నక్రశింశుమారోద్రవసాభిర్వా శతపాక్యం తైలం నస్తః ప్రయోగః. తేన రాత్రిగణ శ్చరతి ఇత్యుదకచరణాని, తైర్వరుణనాగకన్యావాక్యక్రియా సంభాషణం చ; కోపస్థానేషు ముఖాదగ్నిధూమోత్సర్గః.

వ్యా. 1. శత్రువు గ్రామనగరాదులను ఆక్రమించాలనే కోరిక గల విజిగీషువు తనకు అన్నీ తెలుసు ననీ, దేవతలతో తనకు ప్రత్యక్షసంబంధం ఉన్నదనీ చాటి తన పక్షంవాళ్లని ప్రోత్సహించాలి, శత్రుపక్షం వాళ్ళకి భయం కలిగించాలి.

2. తన సర్వజ్ఞత్వాన్ని చాటుకొనడం ఎట్లనగా - గూఢచారుల ద్వారా

ముఖ్యాధికారుల ఇండ్లలోని చెడునడతలు మొదలైన వాటిని తెలుసుకొని వాళ్లకు ఆ విషయాలు చెప్పడం, కంటకశోధనప్రకరణంలో చెప్పిన విధంగా గూఢచారుల ద్వారా రాజుకు వ్యతిరేకంగా ప్రవర్తించే వాళ్ల విషయాలన్నీ తెలుసుకొని అవి బైటపెట్టడం, పైకి కనబడని సంసర్గవిద్యాసంజ్ఞలచేత (పరస్పర సంబంధాలను గూర్చి చర్చించే శాస్త్రంలోని సంజ్ఞల - గుర్తుల - చేత) తన (రాజు) వద్దకు ఏ విజ్ఞాపనలు రాబోతున్నాయో, ఏ కానుకలు రాబోతున్నాయో చెప్పడం, పెంపుడు పావురాలు తీసికొని వచ్చిన ముద్రలు వేసిన లేఖల ద్వారా విదేశాలలోని వార్తలు తెలుసుకొని ఆ రోజునే వాటిని ప్రకటించడం (ఇలాంటి పనులు చెయ్యాలి).

2. దేవతలతో సంబంధాన్ని చెప్పడం ఎట్లనగా - సురుంగం ద్వారా అగ్నిగృహంలోని దేవతాప్రతిమల ఛిద్రాలలో ప్రవేశించిన, అగ్నిచైత్యదేవతలం అని చెప్పుకొనేవాళ్లతో మాటలాడడం, వాళ్లకు పూజలు జరపడం, నాగదేవతలము, వరుణుడను అని చెపుతూ ఉదకం నుంచి లేచిన వాళ్లతో మాటలాడడం, వాళ్లకు పూజలు జరిపించడం, కదలకుండా గట్టిగా బిగించి ఇసుకతో తయారు చేసిన లేదా ఇసుక నింపిన కోశాలను (సంచులను) తటాకజలాదులలో ఉంచి రాత్రులందు అగ్ని జ్వాలల మాలలు చూపడం, (ఈ విధానం ఏమిటో స్పష్టం కాలేదు. సముద్రం నురగమీద తైలం చల్లి అంటిస్తే మండుతుం దని ముందు చెప్పనున్నాడు. అది కావచ్చును. కాని ఇక్కడ పదాలకు ఆ అర్థం రాదు అని కాంగ్లే); జలప్రవాహంలో పెద్ద రాతి బండకి కట్టి కదలకుండా చేసిన ఉట్టెలో ప్రవాహానికి కొట్టుకొని పోకుండా ఉండడం ఇలాంటి పనులు చెయ్యాలి. నీళ్లు లోపలికి వెళ్లని సంచీతో గాని, మావితో కాని ముక్కు తప్ప మిగిలిన తల కప్పివేసికొని ముక్కులో చుక్కలలేడి పేగులు లేదా పీతలు, మొసళ్లు, శింశుమారాలనే జలజంతువులు, పిల్లులు వీటి వస వేసి వందసార్లు కాచిన తైలం వేసికొని చాల రాత్రులు నీటిలో తిరగకలుగుతాడు. ఇవి ఉదకంలో సంచరించే పద్ధతులు. వాళ్లు వరుణుడు, నాగకన్యలు చెప్పినట్లు చేస్తూ వాళ్లతో మాటలాడాలి (అలా అభినయించాలి). కోపం వచ్చినప్పుడు ఔషధయోగమాయచేత ముఖంనుంచి అగ్నిని ధూమాన్ని విడవాలి.

మూ. 1. తదస్య స్వవిషయే కార్తాన్తిక నైమిత్తిక మౌహూర్తిక పౌరాణికే క్షణికగూఢపురుషాః సాచివ్యకరాః తద్దర్శినశ్చ ప్రకాశయేయుః. పరస్య విషయే దైవతదర్శనం దివ్యకోశదణ్డోత్పత్తిం చ అస్య బ్రూయుః. దైవతప్రశ్న

నిమిత్తవాయసాఙ్గవిద్యాస్వప్న మృగపక్షి వ్యాహారేషు చాస్య విజయం బ్రూయుః. విపరీతమమిత్రస్య సదున్దుభిమ్. ఉల్కాం చ పరస్య నక్షత్రే దర్శయేయుః.

2. పరస్య ముఖ్యాన్ మిత్రత్వేనాపదిశన్తః దూతవ్యఞ్జనాః స్వామి సత్కారం బ్రూయుః. స్వపక్షబలాధానం పరపక్షప్రతిఘాతం చ తుల్యయోగక్షేమ మమాత్యానామ్ ఆయుధీయానాం చ కథయేయుః. తేషు వ్యసనాభ్యుదయా వేక్షణమ్, అపత్యపూజనం చ ప్రయుఞ్జీత.

వ్యా. 1. రాజుకు సర్వజ్ఞదైవతసంయోగం ఉన్న దనే విషయాన్ని తన దేశంలో దైవజ్ఞులు, శకునాలు తెలిసినవాళ్లు, ముహూర్తజ్ఞులు, పౌరాణికులు, ప్రశ్నలు చెప్పే వాళ్లు, గూఢపురుషులు, వాళ్లకు సహాయం చేసేవాళ్లు, అవి చూచిన వాళ్లు అందరికీ ప్రకటించాలి. శత్రుదేశానికి వెళ్లి ఇతనికి (తమ రాజుకు) దేవతాదర్శనం జరిగిం దనీ, దివ్యములైన కోశదండాలు లభించా యనీ చెప్పాలి. దేవతాప్రశ్నలలోను, భావిని సూచించే నిమిత్తాలలోను, కాకుల ప్రవర్తనలలోను, అంగవిద్యయందు (శరీరాన్ని స్పృశించి శుభాశుభాలను చెప్పడం అంగవిద్య) స్వప్నాలలోను, మృగాల అరుపులలోను, పక్షుల కూతలలోను తమ రాజుకే విజయం కలిగే సూచనలు ఉన్నా యనీ, శత్రువుకు విపరీతఫలాలు సూచించబడుతున్నాయని దుందుభిధ్వనితో చాటింపు వేసి చెప్పాలి. శత్రువు నక్షత్రంలో ఉల్క ఉందని, అనగా శత్రువు జన్మనక్షత్రాన్ని ఒక ప్రకాశించే అగ్ని పిండం వంటిది ఆక్రమించి ఉన్నదని చూపాలి.

2. శత్రువుయొక్క ముఖ్యాధికారులకు మిత్రులుగా చెప్పుకొంటూ దూత లనే వంక గల గూఢచారులు తమ ప్రభువుకు వాళ్ల విషయంలో చాల గౌరవభావం ఉందని చెప్పాలి. తమ పక్షం (విజిగీషువు పక్షం) బలం పెరుగుతున్న దనీ, శత్రుబలం క్షీణిస్తూన్న దనీ కూడ చెప్పాలి. మీ యోగక్షేమాలు మామూలుగా వెనుకటివలెనే ఉంటాయి అని అమాత్యులకు, యోధులకు చెప్పాలి. (అనగా మీరు రాజుపక్షానికి వచ్చిన ట్లయితే మీకేమీ లోటు ఉండదు. ఇప్పుడు ఎలాంటి యోగక్షేమా లున్నాయో అలాంటివే ఉంటాయి అని చెప్పాలి అని అర్థం. వాళ్లకు వ్యసనాలు కలిగినా, అభ్యుదయం కలిగినా తగిన సహాయాదులు చేస్తూ వాళ్ల పుత్రాదులను ఆదరంతో చూస్తూ ఉండాలి.

మూ. 1. తేన పరపక్షముత్సాహయేత్ యథోక్తం పురస్తాత్. భూయశ్చ వక్ష్యామః - సాధారణగర్దభేన దక్షాన్, లకుటశాఖాహననాభ్యాం దణ్డచారిణః, కులైలకేన చోద్విగ్నాన్, అశనివర్షేణ విమానితాన్, విదులేన అవకేశినా వాయసపిణ్డేన కైతవజమేఘేనేతి విహతాశాన్, దుర్భగాలఙ్కారేణ ద్వేషిణేతి పూజాఫలాన్, వ్యాఘ్రచర్మణా మృత్యుకూటేన చోపహితాన్, పీలువిఖాదనేన కరకయోష్ట్ర్యా గర్దభీక్షీరాభిమన్థనేనేతి ధ్రువా (వో) పకారిణః ఇతి.

వ్యా. ఈ విధంగా వెనుక చెప్పినట్లు శత్రుపక్షంవాళ్లని శత్రువుకు ఎదురు తిరిగేటట్లు ప్రోత్సహించాలి. ఇంకా కొన్ని పద్ధతులు చెపుతాం- చాల సామర్థ్యంతో శ్రద్ధతో పని చేసేవాళ్ల దగ్గరికి వెళ్లి "గాడిదల వలె ఎవరి లాభంకోసమో ఇంత శ్రమపడతా రెందుకు?" అని చెప్పాలి. సైన్యంలో ఉన్న వాళ్లతో మీరు కఱ్ఱ వలె, శాఖలు నరికే గొడ్డళ్లవలె ఉన్నారు; అనగా కఱ్ఱలు, గొడ్డళ్లూ చేసిన పనికి ఫలం ఇతరులే అనుభవిస్తారు; మీరు కూడా అలాంటివాళ్లే అని చెప్పాలి. ఏదో కారణంచేత రాజుకు భయపడి ఉన్నవాళ్లతో "మీ పరిస్థితి ఇంటిలో పెంచే గొఱ్ఱె పరిస్థితి వలె ఉన్న దని, అనగా ఏ సమయంలో మిమ్మల్ని చంపివేస్తారో తెలియదు" అనీ చెప్పాలి. అవమానించబడినవాళ్లతో- "మీమీద పిడుగుల వర్షం కురుస్తూన్నది" (అవమానం పిడుగులవంటిది అని భావం) అని చెప్పాలి. ఏదో రాజు ఇస్తాడని ఆశించి చివరికి నిరాశులైనవాళ్ల దగ్గరికి వెళ్లి- "మీ రాజు పువ్వులు పూసి కాయలు కాయడానికి సిద్ధంగా కనబడే కాయలు కాయని విదుల అనే లత వంటివాడు; బోడిచెట్టువంటివాడు; మీకు అతడు ఇచ్చేది కాకికి వేసే పిండం వంటిది; అతడు ఇంద్రజాలంతో సృష్టించిన (వర్షం కురవని) మేఘం వంటివాడు" అని చెప్పాలి. రాజునుంచి ఏవైన సత్కారాలు పొందినవాళ్లతో- "మీకు రాజు ఇచ్చినది ఇష్టం లేని భర్త దౌర్భాగ్యవంతురాలైన (భర్తప్రేమ చూరకొనని) స్త్రీకి ఇచ్చిన అలంకారం వంటిది" అని చెప్పాలి. ఉపహితుల (ఉపధలచేత మోసగించబడినవాళ్ల) దగ్గరికి వెళ్లి "రాజు వ్యాఘ్రచర్మ వంటివాడు (క్రూరుడు), కూటమృత్యువు" అని చెప్పాలి. రాజుకు నిత్యమూ ఉపకారం చేస్తున్నవాళ్ల దగ్గరికి వెళ్లి "మీరు చేస్తూన్న పని శరీరానికి మంచిది కాని పుల్లగా ఉండె పీలువృక్షం పండు తినడం వంటిది, వడగళ్లు తినడం వంటిది, ఉష్ట్రి అనే చేదు ఓషధి తినడం వంటిది, గాడిద పాలు చిలకడం వంటిది" అని చెప్పాలి.

మూ. 1. ప్రతిపన్నాన్ అర్థమానాభ్యాం యోజయేత్. ద్రవ్యభక్తచ్ఛిద్రేషు చైనాన్ ద్రవ్యభక్తదానైరనుగృహ్ణీయాత్. అప్రతిగృహ్ణతాం స్త్రీకుమారాలఙ్కారాన్ అభిహరేయుః.

2. దుర్భిక్షస్తేనాటవ్యుపఘాతేషు చ పౌరజానపదానుత్సాహయన్తః సత్రిణో బ్రూయుః- రాజానమనుగ్రహం యాచామహే. నిరనుగ్రహాః పరత్ర గచ్ఛామః ఇతి.

వ్యా. 1. ఈ విధంగా చెప్పిన మాటలు నమ్మినవాళ్లకు ధనం ఇచ్చి సన్మానం చెయ్యాలి. వాళ్లకి ఏదైనా ద్రవ్యాల లోటు వచ్చినప్పుడు ఆహారానికి లోటు వచ్చినప్పుడు అవి ఇచ్చి అనుగ్రహించాలి. వాళ్లు అవి తీసికొనకపోతే వాళ్ల స్త్రీలకు పిల్లలకు ఏవైనా అలంకారాలు తీసికొనివచ్చి బహూకరించాలి.

2. దుర్భిక్షంవల్ల, దొంగలవల్ల, ఆటవికులవల్ల బాధలు కలిగి నప్పుడు సత్రులు పౌరుల్నీ జానపదుల్నీ ప్రోత్సహింపచేసి " మనకు ఈ బాధ కలిగినందుకు రాజు దగ్గరికి అనుగ్రహం (exgratia payment) అడుగుదాం. ఆయన ఏమీ ఇవ్వకపోతే మరొక రాజ్యానికి వెళ్లిపోదాం" అని చెప్పాలి.

శ్లో. తథేతి ప్రతిపన్నేషు ద్రవ్యధాన్యపరిగ్రహైః,
సాచివ్యం కార్యమిత్యేతదుపజాపాద్భుతం మహత్.

ఇతి కౌటలీయార్థశాస్త్రే దుర్గలమ్భోపాయే త్రయోదశేఽధికరణే ప్రథమోఽధ్యాయః
ఉపజాపః, ఆదితః ఏకచత్వారింశచ్ఛతతమః.

వ్యా. వాళ్లు ఇందుకు సరే అని అంగీకరిస్తే ద్రవ్యాలు, ధాన్యం ఇచ్చి సహాయం చెయ్యాలి. ఇది చాల అద్భుతమైన ఉపజాపం.

"బాలానందిని" అను కౌటలీయార్థశాస్త్రాంధ్రవ్యాఖ్యానంలో దుర్గలంభోపాయం అనే పదమూడవ అధ్యాయంలో ఉపజాపం అనే ప్రథమాధ్యాయం; ప్రారంభంనుంచి నూట నలభైఒకటవ అధ్యాయం సమాప్తం.

# అథ ద్వితీయోఽధ్యాయః

## ద్విసప్తతిశతతమం ప్రకరణమ్ - యోగవామనమ్

### (కపటోపాయం ద్వారా శత్రువుచేత దుర్గం కాళీచేయించడం)

మూ. ముణ్డో జటిలో వా పర్వతగుహావాసీ చతుర్వర్షశతాయుః బ్రువాణః ప్రభూతజటిలాన్తేవాసీ నగరాభ్యాశే తిష్ఠేత్. శిష్యాశ్చాస్య మూలఫలోప గమనైః అమాత్యాన్ రాజానం చ భగవద్దర్శనాయ యోజయేయుః. సమాగతశ్చ రాజ్ఞా పూర్వరాజదేశాభిజ్ఞానాని కథయేత్- "శతే శతే చ వర్షాణాం పూర్ణే అహమగ్నిం ప్రవిశ్య పునర్బాలో భవామి. తదిహ భవత్సమీపే చతుర్థమగ్నిం ప్రవేక్ష్యామి. అవశ్యం మే భవాన్ మానయితవ్యః, త్రీన్ వరాన్ వృణీష్వ" ఇతి. ప్రతిపన్నం బ్రూయాత్- "సప్తరాత్రమిహ సపుత్రదారేణ ప్రేక్షాప్రహవణపూర్వం వస్తవ్యమ్" ఇతి. వసన్తమవస్కన్దేత.

వ్యా. "నాలుగు వందల సంవత్సరాల వయస్సు కలవాడను" అని చెప్పుకొనే బోడితలవాడు లేదా జటాధారి అయిన పర్వతగుహలో నివసించేవాడు జటాధారులైన చాలమంది శిష్యులతో శత్రువు నగరసమీపంలో నివసించాలి. అతని శిష్యులు మూలాలు, ఫలాలు (గురువుకు) అందిస్తూ మెల్లమెల్లగా అమాత్యుల్ని రాజును కూడ భగవద్దర్శనం (ఆ పూజ్యుని దర్శనం) చేయడానికి వచ్చే టట్లు చెయ్యాలి. రాజుతో కలిసిన ఆతడు ఆ రాజుకు పూర్వరాజులను గూర్చి, వాళ్ల దేశాలను గూర్చి, వారి వారి గుర్తులను గూర్చి (తాను అన్నీ తెలిసినవాడినని నిరూపించుకొనడం కోసం) చెప్పాలి. "వందేసి సంవత్సరాలు నిండగానే నేను అగ్నిలో ప్రవేశించి మళ్లీ బాలుణ్ణి అవుతాను. ఇప్పుడు నీ దగ్గర నాల్గవ అగ్నిప్రవేశం చేస్తాను. నువ్వు తప్పకుండా గౌరవించతగినవాడవు. మూడు వరాలు కోరుకో" అని చెప్పి అతడు అందుకు అంగీకరించగానే- "నువ్వు నీ భార్యాపుత్రాదులు ఇక్కడ ఏడు రోజులు నాటకాదిప్రదర్శనలు, విందులు ఏర్పాటు చేసి ఉండాలి" అని చెప్పాలి. అతడు ఆ విధంగా అక్కడికి వచ్చి ఉన్నప్పుడు చంపివెయ్యాలి.

మూ. 1. ముణ్డో వా జటిలో వా స్థానికవ్యఞ్జనః ప్రభూతజటిలాన్తేవాసీ వస్తశోణితదిగ్ధాం వేణుశలాకాం సువర్ణచూర్ణేనావలిప్య వల్మీకే నిదధ్యాత్

ఉపజిహ్వికానుసరణార్థమ్; స్వర్ణనాలికాం వా. తతః సత్త్రీ రాజ్ఞః కథయేత్- "అసౌ సిద్ధః పుష్పితం నిధిం జానాతి" ఇతి. స రాజ్ఞా పృష్టః 'తథా' ఇతి బ్రూయాత్. తచ్చాభిజ్ఞానం దర్శయేత్. భూయో వా హిరణ్యమన్తరాధాయ బ్రూయాచ్చైనమ్- "నాగరక్షితో ఽయం నిధిః ప్రణిపాతసాధ్యః" ఇతి. ప్రతిపన్నం బ్రూయాత్ 'సప్తరాత్రమ్' ఇతి సమానమ్.

వ్యా. స్థానికుని (స్థానాలలోపల ఉన్న వస్తువులను తెలుసుకొనగలవాని) వేషంలో ఉన్న ఒక బోడితలవాడు లేదా జడదారి చాలామంది జటిలు లైన శిష్యులతో కలిసి ఉంటూ మేక రక్తం పూసిన వెదురుబద్దకు బంగారు చూర్ణం కూడ పూసి దానిని గాని, బంగారుగొట్టం గాని, చెదపురుగులు లోపలకు వెళ్లడానికి ఒక పుట్టలో ఉంచాలి. తరవాత సత్త్రి శత్రురాజు దగ్గరికి వెళ్లి "ఇతనికి తీయడానికి సిద్ధంగా ఉన్న నిధులను గూర్చి తెలుసును" అని చెప్పాలి. రాజు అడిగి నప్పుడు అతడు "ఔను, నాకు తెలుసును" అని చెప్పాలి. ఆ గుర్తు చూపించాలి లేదా ఇంకా కొంత ధనం ఆ పుట్టలో వేసి ఆ రాజుతో- "ఈ నిధిని సర్పం రక్షిస్తూన్నది. పూజలు చేస్తేనే దీనిని సాధించకలుగుతాం" అని చెప్పాలి. అతడు అందుకు అంగీకరించగానే పైన చెప్పిన విధంగా "ఏడు రాత్రులు నువ్వు ఇక్కడ ఉండాలి..." మొదలైనది చెప్పి వానిని చంపివేయాలి.

మూ. 1. స్థానికవ్యఞ్జనం వా రాత్రౌ తేజనాగ్నియుక్తమేకాన్తే తిష్ఠన్తం సత్త్రిణః క్రమాభినీతం రాజ్ఞః కథయేయుః- "అసౌ సిద్ధః సామేధికః" ఇతి. తం రాజా యమర్థం యాచేత తమస్య కరిష్యమాణః, 'సప్తరాత్రమ్' ఇతి సమానమ్.

2. సిద్ధవ్యఞ్జనో వా రాజానం జమ్భకవిద్యాభిః ప్రలోభయేత్ "తం రాజా" ఇతి సమానమ్.

3. సిద్ధవ్యఞ్జనో వా దేశదేవతామభ్యర్హితామాశ్రిత్య ప్రహవణైః అభీక్ష్ణం ప్రకృతిముఖ్యానభిసంవాస్య క్రమేణ రాజానమతిసందధ్యాత్.

4. జటిలవ్యఞ్జనమన్తరుదకవాసినం వా సర్వశ్వేతం తటసురుఙ్గా భూమిగృహాపసరణం వరుణం నాగరాజం వా సత్త్రిణః క్రమాభినీతం రాజ్ఞః కథయేయుః 'తం రాజా' ఇతి సమానమ్.

వ్యా. 1. తేజనాగ్నితో కూడిన, (తేజనయోగం అనే యోగంచేత తన శరీరం మీద

అగ్ని ప్రజ్వలిస్తూన్నట్లు కనబరచే) స్థానికుడు రాత్రులందు ఏకాంతస్థానంలో ఉంటూండాలి. మెల్ల మెల్లగా సత్రులు వానిని గూర్చి రాజుకు - "ఈ సిద్ధపురుషుడు సామేధికుడు, అనగా రాబోయే ధనసమృద్ధిని గూర్చి చెప్ప గల శక్తి ఉన్నవాడు," అని చెప్పాలి. రాజు వచ్చి అతనిని ఏది కావాలని కోరుతాడో అది చేస్తా నని చెప్పి- మిగిలిన దంతా 'సప్తరాత్రమ్' ఇత్యాదికం వలెనే.

2. మంత్రసిద్ధుని వేషంలో ఉన్నవాడు శత్రురాజును మాయావిద్యలు చేస్తా నని చెప్పి లోభపెట్టాలి. "తం రాజా" ఇత్యాదికం వెనుకటివలెనే.

3. లేదా మంత్రసిద్ధుని వేషంలో ఉన్నవాడు పూజ్యమైన (అందరికీ విశ్వాసం ఉన్న) దేశదేవతను ఆశ్రయించి మంచి విందులు ఏర్పరచి తద్ద్వారా ప్రకృతిముఖ్యులను లొంగదీసికొని క్రమంగా రాజును కూడ మోసగించాలి.

4. లేదా ఎల్లప్పుడూ ఉదకంలో నివసించే జటాధారి యైన పూర్తిగా తెల్లగా ఉన్నవాడు ఒడ్డుమీద ఉన్న సురుంగం ద్వారా గాని భూమిగృహం ద్వారా గాని వస్తూ పోతూ ఉండాలి. అతడు వరుణుడు లేదా నాగరాజు అని సత్రులు ప్రథ పుట్టించి క్రమంగా ఈ విషయం రాజుకు చెప్పాలి. "తం రాజా" ఇత్యాదికం వెనక చెప్పినట్లే.

మూ. 1. జనపదాన్తేవాసీ సిద్ధవ్యఞ్జనో వా రాజానం శత్రుదర్శనాయ యోజయేత్. ప్రతిపన్నం బిమ్బం కృత్వా శత్రుమావాహయిత్వా నిరుద్ధే దేశే ఘాతయేత్.

2. అశ్వపణ్యోపయాతాః వైదేహకవ్యఞ్జనాః పణ్యోపాయననిమిత్తమాహూయ రాజానం పణ్యపరీక్షాయామాసక్తమ్, అశ్వవ్యతికీర్ణం వా హన్యుః, అశ్వైశ్చ ప్రహరేయుః.

3. నగరాభ్యాశే వా చైత్యమారుహ్య రాత్రౌ తీక్ష్ణాః కుమ్భేషు నాలీన్ వా విదలాని ధమన్తః- "స్వామినం ముఖ్యానాం వా మాంసాని భక్షయిష్యామః; పూజా నో వర్తతామ్", ఇత్యవ్యక్తం బ్రూయుః. తదేషాం నైమిత్తికమౌహూర్తి కవ్యఞ్జనాః ఖ్యాపయేయుః.

4. మఙ్గల్యే వా హ్రదే తటాకమధ్యే వా రాత్రౌ తేజనతైలాభ్యక్తాః నాగరూపిణః శక్తిముసలాన్యయోమయాని నిష్పేషయన్తః తథైవ బ్రూయుః.

ఋక్షచర్మకఞ్చుకినో వా అగ్నిధూమోత్సర్గయుక్తాః రక్షోరూపం వహన్తః త్రిః అపసవ్యం నగరం కుర్వాణాః శ్వశృగాలవాశితాన్తరేషు తథైవ బ్రూయుః. చైత్యదేవతాప్రతిమాం వా తేజనతైలేన అభ్రపటలచ్ఛన్నేన అగ్నినా వా రాత్రౌ ప్రజ్వాల్య తథైవ బ్రూయుః; తదన్యే ఖ్యాపయేయుః.

వ్యా. 1. లేదా దేశం సరిహద్దులో నివసిస్తూన్న మంత్రసిద్ధుని వేషంలో ఉన్నవాడు నీకు నీ శత్రువును చూపిస్తాను అని చెప్పి అందుకు ఒప్పించాలి. తరవాత శత్రువు బొమ్మ ఒకటి తయారు చేసి దానిమీద శత్రువును ఆవాహనం చేసి చూడడానికి వచ్చిన రాజును ఏకాంతప్రదేశంలో చంపివేయాలి. (అనగా ఆవాహనం చేయగా వచ్చిన శత్రువే వానిని చంపి వేసి నట్లు ఇతరులను నమ్మించాలి.)

2. లేదా వర్తకుల వేషంలో ఉన్నవాళ్లు గుఱ్ఱాలను అమ్మకానికి తీసికొనివచ్చి పణ్యాశ్వాలలో కొన్నింటిని ఉపాయనంగా ఇస్తామని రాజును ఆహ్వానించి, అతడు పణ్యాశ్వాలను పరీక్షించడంలో అత్యాసక్తచిత్తుడై గుఱ్ఱాల గుంపులో ఉన్నప్పుడు వానిని అశ్వాలచేత చంపివేయించాలి.

3. తీక్ష్ణులు రాత్రులందు నగరం దగ్గర ఉన్న చైత్యవృక్షం ఎక్కి కుండలలోనికి గడ్డి గొట్టాలు కాని, వెదురు గొట్టాలు గాని ఊదుతూ "రాజును గాని, ముఖ్యుల మాంసాలు గాని తినివేస్తాం; మాకు పూజలు జరపాలి" అని అస్పష్టంగా పలకాలి. ఈ విషయం శకునాలు చెప్పేవాళ్ల వేషాలలోను, మౌహూర్తికుల వేషాలలోను ఉన్నవాడు ప్రచారం చెయ్యాలి.

4. లేదా లోతైన చెరువులో గాని, తటాకమధ్యంలో కాని మెరిసే తైలం ఒంటికి పూసుకొన్న సర్పరూపధారులు ఇనుప శక్తులను, రోకళ్లను ఒకదానితో ఒకటి కొట్టి చప్పుళ్లు చేస్తూ పైన చెప్పిన విధంగానే చెప్పాలి. లేదా ఎలుగు చర్మలు కప్పుకొని రాక్షసులరూపంలో ఉన్నవాళ్లు నోళ్లనుండి నిప్పు పొగా కక్కుతూ నగరం చుట్టూ అప్రదక్షిణంగా తిరుగుతూ కుక్కల నక్కల అరుపుల మధ్యలలో పైన చెప్పినట్లు చెప్పాలి. లేదా చైత్యంలో ఉండే దేవతాప్రతిమకు మండే తైలం పూసిగాని, అభ్రకం పొర కప్పిన అగ్నిచేత గాని, రాత్రులందు ప్రజ్వలింపచేసి పైన చెప్పినట్లు చెప్పాలి. ఈ విషయం ఇతరులు ప్రచారం చెయ్యాలి.

మూ. 1. దైవతప్రతిమానా మభ్యర్హితానాం వా శోణితేన ప్రస్రావ మతి

మాత్రం కుర్యుః. తదన్యే దైవరుధిరసంస్రావే సంగ్రామే పరాజయం బ్రూయుః.

2. సంధిరాత్రిషు శ్మశానముఖే ,వా చైత్యమూర్ధ్వభక్షితైర్మనుష్యైః ప్రరూపయేయుః. తతో రక్షోరూపీ మనుష్యం యాచేత. యశ్చాత్ర శూరవాదికః అన్యతమో వా ద్రష్టుమాగచ్ఛేత్ తమన్యే లోహముసలైర్హన్యుః, యథా రకోభిర్హత ఇతి జ్ఞాయేత. తదద్భుతం రాజ్ఞః తద్దర్శినః సత్రిణశ్చ కథయేయుః. తతో నైమిత్తికమౌహూర్తికవ్యఞ్జనాః శాన్తిం ప్రాయశ్చిత్తం బ్రూయుః- "అన్యథా మహదకుశలం రాజ్ఞో, దేశస్య చ" ఇతి. ప్రతిపన్నమ్ "ఏతేషు సప్తరాత్రమ్ ఏకైకమన్త్రబలిహోమం స్వయం రాజ్ఞా కర్తవ్యమ్" ఇతి బ్రూయుః.తతః సమానమ్.

వ్యా. 1. లేదా చాల ఆదరించబడే దేవతాప్రతిమలనుండి చాల ఎక్కువగా రక్తం స్రవిస్తూన్నట్లు చెయ్యాలి. అప్పుడు మిగిలినవాళ్లు "దేవతావిగ్రహాలనుండి రక్తం స్రవిస్తూన్నది; యుద్ధంలో పరాజయం కలుగుతుంది" అని అందరికీ చెప్పాలి.

2. పర్వదినాల రాత్రులలో శ్మశానంలోని ప్రధానస్థానంలో చైత్యంమీద శరీరం పైభాగం తినేసిన మనుష్యులు నిలబడి ఉన్నట్లు చూపించాలి. తరవాత రాక్షసవేషంలో ఉన్న ఒకడు నాకు మనుష్యుణ్ణి ఆహారంగా ఇవ్వాలి అని అడగాలి. శూరుడ నని చెప్పుకొనేవాడు గాని, మరెవడైనా కాని అక్కడికి వచ్చినప్పుడు వానిని ఇతరులు ఇనుపరోకళ్లతో మర్దించి చంపివేసి రాక్షసులచేత చంపబడి నట్లు అందరికీ తెలిసే టట్లు చెయ్యాలి. అది చూసిన వాళ్లు, సత్రులు ఆ అద్భుతాన్ని రాజుకు తెలపాలి. తరవాత నైమిత్తికుల వేషంలోను మౌహూర్తికవేషంలోను ఉన్నవాళ్లు "దీనికి పెద్ద శాంతి, ప్రాయశ్చిత్తమూ చెయ్యాలి. అలా చేయకపోతే రాజుకూ దేశానికీ గొప్ప ఆపద సంభవి స్తుంది" అని చెప్పాలి. అందుకు అంగీకరించిన రాజుతో- ఇలాంటి దుర్నిమిత్తాలు కనబడి నప్పుడు రాజే స్వయంగా ఏడు రాత్రులు ఒక్కొక్క దుఃశకునానికి ఒక్కొక్క రోజున మంత్రాలతోను బలితోను హోమం చెయ్యాలి" అని చెప్పాలి. తరవాత చేయవలసిన దంతా వెనక చెప్పి నట్లే.

మూ. 1. ఏతాన్ వా యోగానాత్మని దర్శయిత్వా ప్రతికుర్వీత పరేషామ్ ఉపకారార్థమ్. తతః ప్రయోజయేత్ యోగాన్. యోగదర్శనప్రతీకారేణ వా కోశాభిసంహరణం కుర్యాత్.

2. హస్తికామం వా నాగవనపాలాః హస్తినా లక్షణ్యేన ప్రలోభయేయుః. ప్రతిపన్నం గహనమేకాయనం వా అతినీయ ఘాతయేయుః. బద్ధ్వా వాపహరేయుః.

3. తేన మృగయాకామో వ్యాఖ్యాతః.

4. ద్రవ్యస్త్రీలోలుపమ్ ఆఢ్యవిధవాభిర్వా పరమయౌవనాభిః స్త్రీభిః దాయాదనిక్షేపార్థమ్ ఉపనీతాభిః సత్రిణః ప్రలోభయేయుః. ప్రతిపన్నం రాత్రౌ సత్రిచ్ఛన్నాః సమాగమే శస్త్రరసాభ్యాం ఘాతయేయుః.

వ్యా. 1. లేదా (విజిగీషువు) ఈ యోగా లన్నీ తనలోనే (తన రాజ్యంలోనే) చూపించి శత్రువులకు నమ్మకం కలిగించడంకోసం వాటికి పరిహారం కూడా చేసుకోవాలి. తరవాత ఆ యోగాలను శత్రురాజ్యంలో ప్రయోగింపచెయ్యాలి. లేదా యోగాలు (దుశ్శకునాలు) కనబడినందుకు ప్రతిక్రియ చేసికొని తన కోశాన్ని అభివృద్ధి చేసుకోవాలి. (అలా చేయడంవల్ల శత్రువుకు నమ్మకం కలుగుతుంది అని భావం).

2. లేదా ఏనుగులమీద ఎక్కువ మక్కువ ఉన్న శత్రురాజును, హస్తివనపాలకులు మంచి లక్షణా లున్న ఏనుగ ఒకటి ఉన్న దని లోభపెట్టాలి. అందుకు అతడు అంగీకరిస్తే వానిని ఒకే దారి ఉన్న అరణ్యంలోనికి తీసికొనివెళ్లి చంపించాలి. లేదా బంధించి అపహరించాలి.

3. దీనిచేత వేటయందు ఆసక్తికలవాని విషయం కూడ చెప్పినట్లే.

4. లేదా శత్రురాజు ద్రవ్యంమీద లోభం ఉన్నవాడైనా స్త్రీచాపల్యం ఉన్నవాడైనా సత్రులు ఆతని వద్దకు ధనం ఉన్న విధవాస్త్రీలను గాని, మంచి సౌందర్యయౌవనా లున్న స్త్రీలను గాని తీసికొనివచ్చి వానిని లోభపెట్టాలి. అంగీకరించినవానిని రాత్రి సమాగమస్థానంలో సత్రులచేత రహస్యంగా ఉంచబడినవాళ్లు శస్త్రవిషాలచేత చంపివేయాలి.

మూ. సిద్ధప్రవ్రజితచైత్యస్తూపదైవతప్రతిమానామ్ అభీక్ష్ణాభిగమనేషు వా భూమిగృహసురుఙ్గాగూఢభిత్తిప్రవిష్టాః పరమభిహన్యుః.

వ్యా. శత్రురాజు సిద్ధపురుషుల దగ్గరికీ, సంన్యాసుల దగ్గరికీ, చైత్య-స్తూప-దేవతాప్రతిమల దగ్గరికీ తరచుగా వెడుతున్నట్లయితే వానిని భూగృహాలలోను, సురుంగాలలోను, రహస్యమైన గోడలలోను దాగి ఉన్న తీక్ష్ణులు చంపివేయాలి.

శ్లో. యేషు దేశేషు యాః ప్రేక్షాః ప్రేక్షతే పార్థివః స్వయమ్,
యాత్రావిహారే రమతే యత్ర క్రీడతి వామ్భసి.
ధిగుక్త్యాదిషు సర్వేషు యజ్ఞప్రహవణేషు వా,
సూతికాప్రేతరోగేషు ప్రీతిశోకభయేషు వా.
ప్రమాదం యాతి యస్మిన్ వా విశ్వాసాత్ స్వజనోత్సవే,
యత్రాస్యారక్షిసఞ్చారో దుర్దినే సంకులేషు వా.
విప్రస్థానే ప్రదీప్తే వా ప్రవిష్టే నిర్జనేఽపి వా,
వస్త్రాభరణమాల్యానాం ఫేలాభిః శయనాసనైః.
మద్యభోజనఫేలాభిః తూర్యైర్వాభిహతైః సహ,
ప్రహరేయురరీం స్త్రీక్ష్ణాః పూర్వప్రణిహితైః సహ.

వ్యా. శత్రురాజు తాను ఏ ప్రదేశాలలో ఏ నాటకాదులను చూస్తాడో అక్కడ, ఎక్కడ విహారయాత్రలో విహరిస్తాడో అక్కడ, ఎక్కడ జలక్రీడ చేస్తాడో అక్కడ, ఎవరిమీద నైనా కోపంతో నిందించడం మొదలైన పనులు చేస్తున్న చోట, యజ్ఞాలు, విందులు జరిగేచోట, ప్రసవం, మరణం, రోగం ఈ సందర్భాలలోను, ఆనంద-శోక-భయసమయాలలోను ఎక్కడ ఉంటాడో అక్కడ స్వజనులకు సంబంధించిన ఉత్సవంలో ఎక్కడ విశ్వాసంతో ఏమరిపాటుతో ఉంటాడో అక్కడ, అంగరక్షకులు లేకుండా ఎక్కడ తిరుగుతాడో అక్కడ, దుర్దినంలోను (సూర్యుడు కనబడని వర్షాకాలదినంలోను), జనసమూహాలలోను, మార్గం కాని మార్గంలో వెడుతున్నప్పుడు, అగ్నిదాహసమయంలోను, నిర్జనప్రదేశంలో ప్రవేశించినప్పుడు తీక్ష్ణులు వస్త్ర-ఆభరణ-మాలికల మూటలతోను, శయన-ఆసనాలతోను, మద్యభోజనాల భాండాలతోను, తూర్యధ్వనులతోను, ముందుగానే అక్కడక్కడ ఉంచబడిన గూఢచారులతో కలిసి చంపివేయాలి.

శ్లో. యథైవ ప్రవిశేయుశ్చ ద్విషతః సత్రహేతుభిః,
తథైవ చాపగచ్ఛేయురిత్యుక్తం యోగవామనమ్.

ఇతి కౌటలీయార్థశాస్త్రే దుర్గలమ్భోపాయే త్రయోదశాధికరణే ద్వితీయోఽధ్యాయః యోగవామనమ్, ఆదితో ద్విచత్వారింశచ్ఛతతమః.

వ్యా. శత్రువును రహస్యంగా ముట్టడించడంకొరకై సత్రులు ఏ విధంగా శత్రువులలోనికి వెడతారో ఆ విధంగానే బైటకు వచ్చివేయాలి. ఈ విధంగా యోగవామనం చెప్పబడింది.

"బాలానందిని" అను కౌటలీయార్థశాస్త్రంలో దుర్గలంభోపాయం అనే పదమూడవ అధికరణంలో యోగవామనం అనే రెండవ అధ్యాయం, ప్రారంభంనుంచి నూటనలభైరెండవ అధ్యాయం సమాప్తం.

# అథ తృతీయోఽధ్యాయః

## త్రిసప్తతిశతతమం ప్రకరణమ్ - అపసర్పప్రణిధిః

### (గూఢచారులను అక్కడక్కడ ఉంచడం)

మూ. శ్రేణీముఖ్య మాప్తం నిష్పాతయేత్. స పరమాశ్రిత్య పక్షాపదేశేన స్వవిషయాత్ సాచివ్యకరణసహాయోపాదానం కుర్వీత. కృతాపసర్పోపచయో వా పరమనుమాన్య స్వామినో దూష్యగ్రామం వీతహస్త్యశ్వం దూష్యామాత్యం దణ్డమాక్రన్దం వా హత్వా పరస్య ప్రేషయేత్. జనపదైకదేశం శ్రేణీమటవీం వా సహాయోపాదానార్థం సంశ్రయేత. విశ్వాసముపగతః స్వామినః ప్రేషయేత్. తతః స్వామీ హస్తిబన్ధనమటవీఘాతం వా అపదిశ్య గూఢమేవ ప్రహరేత్. ఏతేనామాత్యాటవికాః వ్యాఖ్యాతాః.

వ్యా. విజిగీషువు తనకు విశ్వాసపాత్రుడైన ఒక శ్రేణీముఖ్యుణ్ణి ఆతనితో ఏదో విరోధం వచ్చిన దని వంక బెట్టి దేశంనుంచి బహిష్కరించాలి. ఆ శ్రేణీముఖ్యుడు శత్రువును ఆశ్రయించి శత్రుపక్షంలో పనిచేస్తున్నట్లు నటిస్తూ వాళ్లందరూ తనవాళ్లే అని చెప్పి, తన దేశంనుంచి, అందుకు సహాయపడేవాళ్లని అక్కడికి రప్పించుకోవాలి. ఈ విధంగా అపసర్పులను (గూఢపురుషులను) తన చుట్టూ చేర్చుకొని శత్రువు అనుమతి తీసికొని తన ప్రభువు (విజిగీషువు) రాజ్యంలోని దూష్యులు అధికంగా ఉన్న గ్రామం గాని, అసారమైన ఏనుగులు, గుఱ్ఱాలు ఉన్న లేదా హస్త్యశ్వాలు లేని దూష్యులైన మంత్రులు గల సైన్యాన్ని గాని, ఆక్రందుణ్ణి (వెనుక ఉన్న మిత్రరాజును గాని) ఆక్రమించి వశం చేసుకొని శత్రువుకు ఆ విషయం తెలపాలి. తన ప్రభువుకు (విజిగీషువుకు) సహాయం చేయడంకొరకు శత్రురాజుకు సంబంధించిన జనపదంలోని

ఒక భాగం గాని, శ్రేణిని గాని, ఆటవికులను గాని రహస్యంగా ఆశ్రయించాలి. వాళ్లు సహాయం చేస్తా రనే విశ్వాసం ఏర్పడిన తరవాత వాళ్లని తన ప్రభువు దగ్గరికి పంపాలి. తరవాత విజిగీషువు తన ఏనుగులను శత్రువు బంధించా డని గాని, అడవులకు నష్టం కలిగించా డని గాని వంక పెట్టి లేదా తాను ఏనుగులను పట్టడానికి గాని, ఆటవికులను నశింపచేయడానికి గాని వస్తున్నట్లు వంకతో శత్రువును రహస్యంగా చంపివెయ్యాలి. దీనిచేత అమాత్యులను గూర్చి, ఆటవికులను గూర్చి కూడ చెప్పినట్లే. శ్రేణీముఖ్యుణ్ణి ప్రణిధిగా పంపి నట్లు అమాత్యులను గాని, ఆటవికులను గాని పంపాలి అని అర్థం.

మూ. 1. శత్రుణా మైత్రీం కృత్వా అమాత్యానవక్షిపేత్. తే తచ్ఛత్రోః ప్రేషయేయుః- "భర్తారం నః ప్రసాదయ" ఇతి. స యం దూతం ప్రేషయేత్ తముపాలభేత- "భర్తా తే మామమాత్యైర్భేదయతి; న చ పునరిహాగన్తవ్యమ్" ఇతి. అథైకమమాత్యం నిష్పాతయేత్. స పరమాశ్రిత్య యోగాపసర్పాపరక్తదూష్యానశక్తిమతః స్తేనాటవికాన్ ఉభయోపఘాతకాన్వా పరస్యోపహరేత్. ఆప్తభావోపగతః ప్రవీరపురుషోపఘాతమస్యోపహరేత్. అన్తపాలమాటవికం దణ్డచారిణం వా "దృఢమసౌ చ తే శత్రుణా సన్ధత్తే" ఇతి. అథ పశ్చాదభిత్యక్త శాసనైరేనాన్ ఘాతయేత్.

2. దణ్డబలవ్యవహారేణ వా శత్రుముద్యోజ్య ఘాతయేత్.

వ్యా. 1. విజిగీషువు శత్రువుతో మైత్రి చేసికొని (మైత్రి చేసికొన్నట్లు అభినయిస్తూ) తన అమాత్యులను ధిక్కరించాలి. ఆ అమాత్యులు- "మా రాజు మా మీద కోపంగా ఉన్నాడు; అతని కోపం శాంతించే టట్లు మీరు చెయ్యాలి" అని ఆ శత్రురాజుకు వార్త పంపాలి. అతడు పంపిన దూతతో విజిగీషువు - "మీ రాజు నా అమాత్యులు నామీద తిరగబడే టట్లు చేస్తున్నాడు; నువ్వు మళ్లీ ఇక్కడికి రావద్దు" అని చెప్పి వానిని దూషించాలి. తరవాత ఒక అమాత్యుణ్ణి దేశంనుంచి వెడలగొట్టాలి. ఆ అమాత్యుడు శత్రువును ఆశ్రయించి, దుర్బలులైన మోసం చేసే గూఢచారులను, ఆ రాజు మీద ద్వేషభావంతో ఉన్నవాళ్లను, దూష్యులనుగూర్చి ఆతనికి తెలపాలి. (అది సత్యమే అవడంచేత ఆ రాజుకు నమ్మకం ఏర్పడుతుంది). ఈ విధంగా విశ్వాసపాత్రుడై మంచి వీరులైన వాళ్ల అపరాధాలు కూడ ఆ రాజు దృష్టికి తీసికొనిరావాలి. సరిహద్దులో

రక్షకుడుగా ఉన్నవానిని గాని, ఆటవికనాయకుణ్ణి గాని, సేనానాయకుణ్ణి గాని, గూర్చి "ఈ ఫలానా ఫలానావాళ్లు నీ శత్రువుతో కలుస్తున్నారు" అని చెప్పాలి. తరవాత అభిత్యక్తుల ద్వారా, (మరణదండం అనుభవించవలసి ఉన్నవాళ్ల ద్వారా) రాజశాసనం రహస్యంగా పంపి వాళ్లందరినీ చంపించివెయ్యాలి.

2. లేదా శత్రువుయొక్క మరొక శత్రువుకు, నీకు సైన్యం ఇస్తానని చెప్పి ఆ విధంగా ఇచ్చి వాని ద్వారా శత్రువును నశింపచెయ్యాలి.

మూ. కృత్యపక్షోపగ్రహేణ వా పరస్యామిత్రం రాజానమాత్మన్యపకార యిత్వా అభియుఞ్జీత. తతః పరస్య ప్రేషయేత్- "అసౌ తే వైరీ మమాపకరోతి; తమేహి, సంభూయ హనిష్యావః. భూమౌ హిరణ్యే తే పరిగ్రహః" ఇతి. ప్రతిపన్నమభిసత్కృత్య అగతమవస్కన్దేన ప్రకాశయుద్ధేన వా శత్రుణా ఘాతయేత్. అభివిశ్వాసనార్థం భూమిదానపుత్రాభిషేకరక్షాపదేశేన వా గ్రాహయేత్. అవిషహ్య ముపాంశుదణ్డేన వా ఘాతయేత్. స చే ద్దణ్డం దద్యాత్ న స్వయ మాగచ్ఛేత్. తమస్య వైరిణా ఘాతయేత్. దణ్డేన వా ప్రయాతుమిచ్ఛేత్ న విజిగీషుణా; తథాప్యేనముభయతః సంపీడనేన ఘాతయేత్. అవిశ్వస్తో వా ప్రత్యేకశః యాతుమిచ్ఛేత్; రాజ్యైకదేశం వా యాతవ్యస్య ఆదాతుకామః; తథాప్యేనం వైరిణా సర్వసన్దోహేన వా ఘాతయేత్. వైరిణా వా సక్తస్య దణ్డోపనయేన మూలమన్యత్ హారయేత్.

వ్యా. 1. లేదా శత్రువుయొక్క కృత్యపక్షాన్ని (క్రుద్ధలుబ్ధభీతాదులను) తనకు అనుకూలులనుగా చేసికొని, శత్రువుకు శత్రువైన రాజు తన విషయంలో అపకారం చేసే టట్లు చేసి, వానిని ఎదుర్కొనాలి. తరవాత తన శత్రువుకు- "నీ ఫలానా శత్రువు నాకు అపకారం చేస్తున్నాడు. వానిమీదికి యుద్ధానికి రమ్ము. మనం ఇద్దరం కలిసి వానిని చంపుదాం. భూమిలో కాని, ధనంలో కాని నీకు వాటా ఉంటుంది" అని కబురు పంపాలి. అతడు అందుకు అంగీకరించి తన మాటను గౌరవించి వచ్చినప్పుడు వానిని శత్రువుచేత (వాని శత్రువుచేత) నిద్రలో చంపడం ద్వారా గాని, ప్రత్యక్షయుద్ధం చేత గాని చంపించాలి. శత్రువు, తాను ఇద్దరూ కలిసి శత్రువును జయించిన పక్షంలో తన శత్రువుకు విశ్వాసం కలిగించడంకొరకు వానికి భూమి ఇస్తా నని కాని, తన పుత్రునికి అభిషేకం చేస్తా నని గాని, రక్షణం ఏర్పరచా లని గాని వంక పెట్టి వానిని పట్టించాలి.

లేదా రహస్యోపాయాలచేత చంపించాలి. అతడు తాను స్వయంగా రాకుండా సైన్యాన్ని పంపిన పక్షంలో ఆ సైన్యాన్ని శత్రువుచేత (శత్రువుయొక్క శత్రువుచేత) చంపించాలి. కలిసి నీ శత్రువుతో యుద్ధం చేద్దాం అని పిలవబడిన శత్రువు తనతో (విజిగీషువుతో) కలవకుండా తానే సైన్యంతో కలిసి శత్రువుమీదికి వెళ్లిన ట్లయితే అప్పుడు వానిని రెండు ప్రక్కలనుండీ పీడించి చంపివేయాలి. అతడు తన విషయంలో (విజిగీషువు విషయంలో) విశ్వాసం లేక శత్రువు మీదికి తానొక్కడు మాత్రమే దండెత్తి వెళ్లా లనుకొన్నా, ఆ యాతవ్యుని రాజ్యంలో ఒక భాగాన్ని కాజేయాలనే అభిప్రాయంతో ఉన్నా, అప్పుడు కూడ శత్రువుచేత గాని, తన సమస్తసైన్యాన్నీ ఉపయోగించి గాని చంపించాలి. లేదా అతడు వాని శత్రువుతో యుద్ధం చేస్తూన్నప్పుడు తన సైన్యం పంపి వాని మూలస్థానాన్ని వశం చేసుకోవాలి.

మూ. 1. శత్రుభూమ్యా వా మిత్రం పణేత; మిత్రభూమ్యా వా శత్రుమ్. తతః శత్రుభూమిలిప్సాయాం మిత్రేణాత్మన్యపకారయిత్వా అభియుఞ్జీత. ఇతి సమానాః పూర్వేణ సర్వ ఏవ యోగాః.

2. శత్రుం వా మిత్రభూమిలిప్సాయాం ప్రతిపన్నం దణ్డేన అనుగృహ్ణీయాత్. తతో మిత్రగతమతిసందధ్యాత్. కృతప్రతివిధానో వా వ్యసనమాత్మనః దర్శయిత్వా, మిత్రేణ అమిత్రముత్సాహయిత్వా ఆత్మానమభియోజయేత్. తతః సంపీడనేన ఘాతయేత్. జీవగ్రాహేణ వా రాజ్యవినిమయం కారయేత్. మిత్రేణాహూతశ్చేచ్ఛత్రుః అగ్రాహ్యే స్థాతుమిచ్ఛేత్ సామన్తాదిభిర్మూలమస్య హారయేత్. దణ్డేన వా త్రాతుమిచ్ఛేత్. తమస్య ఘాతయేత్.

వ్యా. 1. శత్రువునుండి భూమిని జయించి ఇస్తా నని మిత్రునితో ఒప్పందం కుదుర్చుకోవాలి. లేదా మిత్రుని భూమి ఇస్తా నని శత్రువుతో ఒప్పందం కుదుర్చుకోవాలి. తరవాత శత్రుభూమిని పొందాలనే కోరిక గలిగిన మిత్రుడు తన విషయంలో ఏదైన అపకారం చేసే టట్లు చేసికొని వానిమీదకు యుద్ధానికి వెళ్లాలి. మిగిలిన ఉపాయా లన్నీ వెనుక చెప్పినట్లే.

2. లేదా శత్రువుకు మిత్రుని భూమిని గ్రహించా లనే కోరిక కలిగి నప్పుడు వానికి (శత్రువు) సైన్యం ఇచ్చి సహాయం చెయ్యాలి. తరవాత అతడు మిత్రుని మీదికి వెళ్లినప్పుడు వానిని ఓడించాలి. లేదా యుద్ధం వచ్చినా కూడ రక్షించుకొనడానికి తగిన

ఏర్పాటు లన్నీ చేసికొని, తానేవో కష్టాలలో ఉన్నట్లు పైకి చూపి తన మిత్రునిచేత శత్రువును ప్రోత్సహింపచేసి తనమీదికి వచ్చే టట్లు చెయ్యాలి. తరవాత దిగ్బంధం చేసి చంపింపచెయ్యాలి. లేదా వానిని ప్రాణాలతో పట్టుకొని రాజ్యవినిమయం చేసేటట్లు అనగా ప్రాణాలకు బదులు రాజ్యం ఇచ్చే టట్లు చెయ్యాలి. మిత్రునిచేత ఆహ్వానించబడిన శత్రువు పట్టుబడని విధంగా ఉండాలని కోరుకొని ఆ విధంగా ఉంటే వాని మూలస్థానాన్ని సామంతాదులచేత హరింపచెయ్యాలి. అతడు ఆ మూలస్థానాన్ని సైన్యంచేత రక్షించాలని కోరితే అతని ఆ సైన్యాన్ని నశింపచెయ్యాలి.

మూ. తౌ చేన్న భిద్యేయాతాం ప్రకాశమేవ అన్యోన్యస్య భూమ్యా పణేత. తతః పరస్పరం మిత్రవ్యఞ్జనోభయవేతనాః వా దూతాన్ ప్రేషయేయుః- "అయం తే రాజా భూమిం లిప్సతే శత్రుసంహితః" ఇతి. తతః అన్యతరః జాతాశఙ్కారోషః పూర్వవచ్చేష్టేత.

2. దుర్గరాష్ట్రదణ్డముఖ్యాన్ వా కృత్యపక్షహేతుభిరభివిఖ్యాప్య ప్రవ్రాజయేత్. తౌ యుద్ధావస్కన్దావరోధవ్యసనేషు శత్రుమతిసందధ్యుః. భేదం వాస్య స్వవర్గేభ్యః కుర్యుః. అభిత్యక్తశాసనైః ప్రతిసమానయేయుః.

వ్యా. 1. ఆ మిత్రశత్రువుల మధ్య భేదం కలిగించడానికి శక్యం కాకపోతే ప్రత్యక్షంగానే అనగా అందరికీ తెలిసే విధంగానే వాళ్లకు పరస్పరమూ భూమిచేత పణం పెట్టాలి. అనగా వాని భూమిలో నీకు వాటా ఇస్తాను అని ఇద్దరితోనూ చెప్పాలి. తరవాత మిత్రుల మని చెప్పుకొనేవారు గాని, ఉభయవేతనులు (ఇద్దరిదగ్గరినుండీ ధనం తీసికొనేవారు గాని) ఆ మిత్రశత్రువు లిద్దరివద్దకు దూతలను పంపి- "ఈ రాజు శత్రువుతో కలిసి నీ భూమిని హరించాలని చూస్తున్నాడు" అని చెప్పించాలి. వాళ్లలో ఒకడు మనస్సులో ఆశంక కోపమూ కలిగి వెనుక చెప్పినట్లు చెయ్యాలి, అనగా తన శత్రువును జయించాలి.

2. లేదా దుర్గప్రధానులను, రాష్ట్రప్రధానులను, సేనాప్రధానులను, వాళ్లు రాజద్రోహులకు సహాయం చేస్తున్నా రని అందరికీ తెలిసేటట్లు చాటి దేశంనుంచి వెడలగొట్టాలి. వాళ్లు శత్రురాజు పక్షంలో చేరి యుద్ధం, హటాత్తుగా ఆక్రమణం, ముట్టడింపు, వ్యసనాలు, కలిగిన సమయాలలో ఆ శత్రువును మోసం చేసి ఓడించాలి. లేదా ఆ శత్రువుకూ వాని పక్షంవాళ్లకీ మధ్య భేదం (కలతలు) సృష్టించాలి. అభిత్యక్తుల

ద్వారా (మరణదండం విధించినవాళ్ల ద్వారా) లేఖలు పంపి తాము చేసిన పను లన్నింటికీ ప్రమాణాలు చూపాలి.

మూ. లుబ్ధకవ్యఞ్జనా వా మాంసవిక్రయేణ ద్వాఃస్థాః దౌవారికాపాశ్ర యాశ్చోరాభ్యాగమం పరస్య ద్విస్త్రిరితి నివేద్య లబ్ధప్రత్యయా భర్తురనీకం ద్విధా నివేశ్య గ్రామవధే అవస్కన్దే చ ద్విషతో బ్రూయుః- "ఆసన్న శ్చోరగణః, మహాంశ్చాక్రన్దః; ప్రభూతం సైన్య మాగచ్ఛతు" ఇతి. త దర్పయిత్వా గ్రామఘాతదణ్డస్య సైన్య మితర దాదాయ రాత్రౌ దుర్గద్వారేషు బ్రూయుః సిద్ధయాత్రమిదం సైన్యమాగతమ్, ద్వారమపావ్రియతామ్" ఇతి. పూర్వప్రణి హితా వా ద్వారాణి దద్యుః, తైః సహ ప్రహరేయుః.

వ్యా. లేదా వేటగాళ్ల వేషాలలో ఉన్న గూఢచారులు మాంసం అమ్ముతూ కోటద్వారం దగ్గర మకాం ఏర్పరచుకొని ద్వారపాలకుల ద్వారా స్థానం సంపాదించాలి. దొంగల ముఠా దండెత్తి రాబోతూన్నది అని రెండు మూడు సార్లు హెచ్చరించి శత్రురాజుకు, వానికి సంబంధించినవారికీ నమ్మకం కలిగించాలి. తమ ప్రభువుయొక్క సైన్యాన్ని గ్రామవినాశం చేయడం కోసం, హటాత్తుగా ఆక్రమణ చేయడంకోసం రెండు భాగాలుగా ఏర్పరచి ఉంచుకొని శత్రువుతో- "దొంగల ముఠా దగ్గరికి వచ్చివేసింది. చాలా గొడవలు అవుతున్నాయి. అందుచేత పెద్ద సైన్యం రావాలి" అని చెప్పాలి. ఆ సైన్యాన్ని గ్రామవినాశం చేయడంకోసం ఏర్పరచిన సైన్యానికి అప్పగించి, హటాత్తుగా ఆక్రమణం చేయడానికి ఏర్పరచిన సైన్యంతో రాత్రి దుర్గద్వారాల దగ్గరికి వచ్చి- "దొంగల ముఠా చంపివేయబడింది. సైన్యం తన యాత్ర సఫలం చేసికొని తిరిగి వచ్చింది; ద్వారం తెరవండి" అని చెప్పాలి. లేదా ముందుగానే అక్కడ ఉంచబడిన గూఢచారులు ద్వారాలు తెరిచి వాళ్లతో (సైనికులతో, కలిసి కోటలో ఉన్నవాళ్లమీద దెబ్బతీయాలి.

మూ. 1. కారుశిల్పిపాషణ్డకుశీలవవైదేహకవ్యఞ్జనాయుధీయాన్ వా పరదుర్గే ప్రణిదధ్యాత్. తేషాం గృహపతికవ్యఞ్జనాః కాష్ఠతృణధాన్యపణ్యశకటైః ప్రహరణావరణాని అవహరేయుః; దేవధ్వజప్రతిమాభిర్వా. తతస్తద్వ్యఞ్జనాః ప్రమత్తవధమ్, అవస్కన్దప్రతిగ్రహమ్, అభిప్రహరణం పృష్ఠతః శఙ్ఖదున్దుభిశబ్దేన వా ప్రవిష్టమిత్యావేదయేయుః. ప్రాకారద్వారాట్టాలకాదానమ్, అనేకభేదం ఘాతం వా కుర్యుః.

2. సార్థగణవాసిభిరాతివాహికైః, కన్యావాహికైః, అశ్వపణ్యవ్యవహారిభిః, ఉపకరణహారకైః, ధాన్యక్రేతృవిక్రేతృభిర్వా, ప్రవ్రజితలిఙ్గైః దూతైశ్చ దణ్డాతినయనం, సంధికర్మ విశ్వాసనార్థమ్.ఇతి రాజాపసర్పాః.

వ్యా. 1. లేదా కొందరు యుద్ధభటులను కారు-శిల్పి-పాషండ-కుశీలవుల వేషాలలో, వర్తకుల వేషాలలో శత్రుదుర్గంలో గూఢచారులనుగా ఉంచాలి. గృహస్థుల వేషాలలో ఉన్నవాళ్లు కఱ్ఱలు, గడ్డి, ధాన్యం, ఇతరపణ్యాలు తీసికొని వచ్చే బళ్లమీద రహస్యంగా ఆయుధాలు, కవచాలు తెచ్చి వాళ్లకి అందించాలి. లేదా దేవతల ధ్వజాలలోను, ప్రతిమలలోను దాచి ఆయుధాలు వాళ్లకు అందించాలి. తరవాత కారువులు మొదలైనవాళ్ల వేషాలలో ఉన్న యుద్ధభటులు ఏమరిపాటుతో ఉన్న వాళ్లని చంపివేస్తూ, హటాత్తుగా అక్రమణలు చేస్తూ, అంతటా హత్యలు చేస్తూ శంఖదుందుభిధ్వనులతో "శత్రుసైన్యం ప్రవేశించింది" అని చెప్పాలి. ఈ తొందరలో ప్రాకారం, ద్వారాలు, కోట బురుజులు తెరచివేసి శత్రుసైన్యాన్ని విడదీయాలి. లేదా దానిని నశింపచెయ్యాలి.

2. వర్తకుల సంఘాల ఆతివాహికులతోను (వర్తకులను ఒకచోటినుండి మరొక చోటికి తీసికొని వెళ్లే రక్షకభటులు), కన్యలను తీసికొనివెళ్లే వాళ్లతోను, గుఱ్ఱాల వ్యాపారం చేసేవాళ్లతోను, ఇతరములైన ఉపకరణాలను తీసికొనివెళ్లేతోను, ధాన్యాలను కొనే వాళ్లతోను,అమ్మేవాళ్లతోను, సంన్యాసివేషాలలో ఉండేవాళ్లతోను, దూతలతోను కలిసి సైన్యాలు శత్రుదుర్గంలో ప్రవేశించాలి. ఆ సమయంలో అక్కడ ఉన్నవాళ్లకి విశ్వాసం కలగడం కోసం సంధి చేసుకోవాలి. (ప్రశాంతంగా ఉండాలి). ఇవి రాజు విషయంలో ప్రయోగించే గూఢచారి ప్రయోగాలు.

మూ. 1. ఏత ఏవ అటవీనామపసర్పాః కణ్టకశోధనోక్తాశ్చ. వ్రజమట వ్యాసన్నమపసర్పాః సార్థం వా చోరైర్ఘాతయేయుః. కృతసంకేతమ్ అన్నపానం చాత్ర మదనరసవిద్ధం వా కృత్వా అపగచ్ఛేయుః. గోపాలకవైదేహకాశ్చ తతః చోరాన్ గృహీతలోప్త్రభారాః మదనరసవికారకాలే అవస్కన్దేయుః. సంకర్షణదైవ తీయో వా ముణ్డజటిలవ్యఞ్జనః ప్రహవణకర్మణా మదనరసయోగాభ్యామ్ అతిసందధ్యాత్. అథావస్కన్దం దద్యాత్. శౌణ్డికవ్యఞ్జనో వా దైవతప్రేతకార్యో

త్సవసమాజేష్వాటవికాన్ సురావిక్రయోపాయననిమిత్తం మదనరసయోగాభ్యామ్ అతిసందధ్యాత్. అథావస్కన్దం దద్యాత్.

వ్యా. ఆటవికుల విషయంలో కూడ ఇవే అపసర్పప్రయోగాలు (గూఢచారి ప్రయోగాలు), కంటకశోధనప్రకరణంలో చెప్పిన ప్రయోగాలు చెయ్యాలి. అపసర్పులు అరణ్యానికి దగ్గర ఉన్న గొల్లపల్లెను (గోనివాసస్థానాన్ని) గాని, వర్తకసమూహాన్ని గాని దొంగలచేత కొల్లగొట్టించాలి. లేదా నిర్ణీతస్థానాలలో ఏర్పరచిన అన్నపానాలలో మాదకద్రవ్యాలు కలపాలి. చోరులు మాదకద్రవ్యంవల్ల కలిగిన మత్తులో ఉన్నప్పుడు దొంగసొత్తుతో ఉన్న ఆ చోరులను గోపాలకులు, వర్తకులు ఆక్రమించాలి. లేదా మద్యప్రియుడైన బలరాము డనే దేవత భక్తుడుగా నటించే బోడితలవాడు లేదా జటాధారి పెద్ద విందు ఏర్పాటు చేసి ఆహారంలో మాదకద్రవ్యవిషాలు కలిపి శత్రువులకు సంబంధించినవాళ్లను వశం చేసుకోవాలి. అటుపైన ఆక్రమణం చెయ్యాలి. లేదా మద్యవిక్రయం చేసేవాని వేషంలో ఉన్నవాడు దేవతోత్సవం, ప్రేతకార్యం, ఇతరోత్సవాలు జరిగే టప్పుడు ఆటవికులకు కల్లు అమ్మి, లేదా వాళ్లకు ఉపాయనంగా ఇచ్చి దానిలో మాదకద్రవ్యం విషం కలిపి మోసగించి వశం చేసుకోవాలి. తరవాత ఆక్రమించాలి.

శ్లో. గ్రామఘాతప్రవిష్టాం వా విక్షిప్య బహుధాటవీమ్,
ఘాతయేదితి చోరాణామపసర్పాః ప్రకీర్తితాః.

ఇతి కౌటలీయార్థశాస్త్రే దుర్గలమ్భోపాయే త్రయోదశాధికరణే తృతీయోఽధ్యాయః, అపసర్పప్రణిధిః, ఆదితస్త్రిచత్వారింశచ్ఛతతమః.

వ్యా. గ్రామాలను కొల్లగొట్టడంకోసం వస్తొండే ఆటవికులను చాలాచోట్లకు చెల్లాచెదరై పోయే టట్లు చేసి వాళ్లను నశింపచెయ్యాలి. ఈ విధంగా చోరుల విషయంలో ప్రయోగించవలసిన అపసర్పులు చెప్పబడినారు.

"బాలానందిని" అను కౌటలీయార్థశాస్త్రాంధ్రవ్యాఖ్యానంలో దుర్గలంభోపాయం అనే పదమూడవ అధికరణంలో అపసర్పప్రణిధి అను మూడవ అధ్యాయం ప్రారంభంనుండి నలభై మూడవ అధ్యాయం సమాప్తం.

# అథ చతుర్థోఽధ్యాయః

## చతుఃసప్తతిశతతమం ప్రకరణమ్ - పర్యుపాసనకర్మ (కోట ముట్టడించడం) పఞ్చసప్తతిశతతమం ప్రకరణమ్ - అవమర్దః (కోట ధ్వంసంచేయడం).

మూ. 1. కర్శనపూర్వం పర్యుపాసనకర్మ. జనపదం యథానివిష్టమ్ అభయే స్థాపయేత్. ఉత్థితమనుగ్రహపరిహారాభ్యాం నివేశయేదన్యత్రాపసరతః. సమగ్రమ్ అన్యస్యాం భూమౌ నివేశయేదేకస్యాం వా వాసయేత్. న హ్యజనో జనపదో రాజ్యమజనపదం వా భవతీతి కౌటల్యః.

2. విషమస్థస్య ముష్టిం సస్యం వా హన్యాత్ వీవధప్రసారౌ చ.

3. శ్లో. ప్రసారవీవధచ్ఛేదాన్ముష్టిసస్యవధాదపి,
వమనాద్గూఢఘాతాచ్చ జాయతే ప్రకృతిక్షయః.

వ్యా. 1. పర్యుపాసనకర్మకు (కోట ముట్టడించడానికి) ముందు కర్శనం (కోశదండ-అమాత్యాదులను దుర్బలులను చేయడం)చెయ్యాలి. జనపదాన్ని (పల్లెప్రాంతాన్ని) మాత్రం ఉన్నదానిని ఉన్నట్లుగా అభయస్థితిలో ఉంచాలి. వ్యవసాయాదులలో ఉద్యుక్తమైన జనపదాలకు ధనం ఇవ్వడం మొదలైన అనుగ్రహం, పన్నులు తీసికొనకపోవడం వంటి పరిహారం ఇచ్చి వాటిని నివేశింపచేయాలి (స్థిరంగా నెలకొల్పాలి). ఐతే జనులు జనపదాన్ని విడిచి వెళ్లిపోతున్నప్పుడు మాత్రం అనుగ్రహ పరిహారాలు ఇవ్వవలసిన పని లేదు. అవసరాన్ని పట్టి మొత్తం జనపదాన్ని తీసికొనిపోయి వేరు వేరు ప్రదేశాలలో నివేశింపచేయాలి. లేదా ఒకే ప్రదేశంలో నివేశింపచెయ్యాలి. జనం లేకపోతే జనపదం (పల్లె ప్రాంతం) ఏమిటి? జనపదాలు లేకపోతే రాజ్యం ఏమిటి? అంటాడు కౌటల్యుడు.

2. శత్రురాజు కష్టాలలో ఉన్నప్పుడు అతని విత్తనాలు చల్లడాన్ని, లేదా సస్యాన్ని నశింపచెయ్యాలి. వీవధాన్ని (ధాన్యతైలాదుల ప్రవేశాన్ని), ఆసారాన్ని (కాష్ఠతృణాదుల ప్రవేశాన్ని గ.శా.) మిత్రసైన్యప్రవేశాన్ని. (కాంగ్లే) అడ్డుకోవాలి.

3. ప్రసారవీవధాలను అడ్డుకొనడంవల్ల, విత్తనాలు చల్లడం, సస్యం వీటిని

నశింపచేయడంవల్ల , జనుల్ని మరొకచోటికి తరలింపచేయడంవల్ల ప్రకృతుల క్షయం కలుగుతుంది.

మూ. 1. "ప్రభూతగుణవద్ధాన్యకుప్యయన్త్రశస్త్రావరణవిష్టిరశ్మిసమగ్రం మే సైన్యమృతుశ్చ పురస్తాత్, అపర్తుః పరస్య వ్యాధిదుర్భిక్షనిచయరక్షాక్షయః క్రీతబలనిర్వేదః మిత్రబలనిర్వేదశ్చ" ఇతి పర్యుపాసీత.

2. కృత్వా స్కన్ధావారస్య రక్షాం వీవధాసారయోః పథశ్చ, పరిక్షిప్య దుర్గం ఖాతసాలాభ్యాం, దూషయిత్వోదకమ్, అవస్రావ్య పరిఖాః సంపూర యిత్వా వా, సురుఙ్గాబలకుటికాభ్యాం వప్రప్రాకారౌ హారయేత్; దారం చ గుడేన.

3. నిమ్నం వా పాంసుమాలయా అచ్ఛాదయేత్. బహులారక్షం యన్త్రైః ఘాతయేత్. నిష్కరాదుపనిష్కృష్య అశ్వైశ్చ ప్రహరేయుః. విక్రమాన్తరేషు చ నియోగవికల్పసముచ్చయైశ్చ ఉపాయానాం సిద్ధిం లిప్సేత.

వ్యా. 1. "నా సైన్యం అత్యధికమైన గుణాలు గల ధాన్యంతోను, కుప్యంతోను, యంత్రాలతోను, ఆయుధాలతోను, కవచాలతోను, కర్మకరులతోను, కళ్లాలతోను, పరిపూర్ణంగా ఉంది. కాలం కూడ అనుకూలంగా ఉంది. శత్రువుకు కాలం ప్రతికూలంగా ఉంది. వ్యాధులచేత, దుర్భిక్షాలచేత కూడబెట్టినది అంతా క్షీణించిపోయింది; రక్షణం కూడ క్షీణించింది. ధనం ఇచ్చి కొనిన సైన్యం, వాని మిత్రసైన్యం కూడ నిరుత్సాహంగా ఉంది"- ఇలా అనుకొన్నప్పుడు శత్రువు కోటను ముట్టడించాలి.

2. తన స్కంధావారానికి తగు రక్షణం ఏర్పాటుచేసి, వీవధాసారాల మార్గాల రక్షణం కూడ చేసికొని, శత్రువు కోటయొక్క అగడ్త, ప్రాకారం, వీటిని అనుసరించి సైన్యం నిలిపి, నీళ్లు విషాదులచేత చెడిపోయే టట్లు చేసి, పరిఖలలోని నీళ్లు బైటకు పోయేటట్లు చేసి, లేదా వాటిని పూడ్చి వేసి, సురంగాల ద్వారా, సైన్యాక్రమణల ద్వారా కూడ వప్రాన్ని (చిన్నప్రాకారాన్ని), పెద్దప్రాకారాన్ని ఆక్రమించాలి. మధ్యనున్న లోయను ఏనుగుల సహాయంతో ఆక్రమించాలి.

3. పల్లాలను మట్టితో పూడ్చివేయాలి. అధికంగా ఉన్న రక్షణను యంత్రాలచేత పగుల కొట్టించాలి. యోధులను పారిపోయే మార్గాలనుంచి బైటకు లాగి అశ్వసైన్యంచేత

4. ఎండిన చేపల పొట్టలలో గాని, ఎండిన మాంసం మధ్య గాని, అగ్నిని (అగ్నియోగాన్ని) ఉంచి దానిని కాకులు తినడంకోసం పట్టుకొనిపోయే టట్లు చెయ్యాలి.

5. సరల-దేవదారువృక్షాల కఱ్ఱతో చేసిన గుళికలు (బంతి వంటి గుండ్రని వస్తువులు) పూతితృణం అనే గడ్డితో చేసినవి, గుగ్గులు, సరలవృక్షం జిగురు, సర్జరసం, లక్క వీటితో చేసిన గుళికలు, గాడిదలు, ఒంటె, మేక, గొఱ్ఱె-వీటి లద్దెలు అగ్నిని ఉంచడానికి తగినవి. అనగా వీటిలో అగ్నిని ఉంచి అవి కోటలో పడే టట్లు చెయ్యాలి అని అర్థం.

మూ. 1. ప్రియాలచూర్ణమ్, అవల్గుజమషీమధూచ్ఛిష్టఖరోష్ట్రగోలణ్డమి త్యేష క్షేపోఽగ్నియోగః.

2. సర్వలోహచూర్ణమ్ అగ్నివర్ణం వా కుమ్భీసీసత్రపుచూర్ణం వా, పారిభద్రకపలాశపుష్పకేశమషీతైలమధూచ్ఛిష్టకశ్రీవేష్టకయుక్తః అగ్నియోగః విశ్వాసఘాతీ వా. తేన అవలిప్తః శణత్రపుసవల్కవేష్టితో బాణ ఇత్యగ్నియోగః.

3. న త్వేవ విద్యమానే పరాక్రమే అగ్నిమవసృజేత్. అవిశ్వాస్యో హ్యగ్నిః దైవపీడనం చ అప్రతిసంఖ్యాతప్రాణిధాన్యపశుహిరణ్యకు ప్యద్రవ్యక్షయకరః. క్షీణనిచయం చ అవాప్తమపి రాజ్యం క్షయాయైవ భవతి. ఇతి పర్యుపాసనకర్మ.

వ్యా. 1. ప్రియాలచూర్ణం, అవల్గు అనే ఓషధి కాల్చగా వచ్చిన మసి, మైనం, ఈ మూడూ, గుఱ్ఱం, గాడిద, ఒంటె, ఎద్దు వీటి పేడ - వీటి సహాయంతో దూరంనుంచి దుర్గంలోనికి అగ్నిని విసరవచ్చు. ఇది ఒక అగ్నియోగం.

2. అన్ని లోహాల చూర్ణాలు, అగ్నివర్ణం, కుంభీ అనే ఓషధి చూర్ణం, సీసం చూర్ణం, తగరం చూర్ణం, వీటిని పారిభద్రక పలాశపుష్పాలతోను, వెండ్రుకలు కాల్చిన మసితోను, నూనె, మైనం, శ్రీవేష్టకం అనే ఓషధి చూర్ణం- వీటితో కలిపితే అది అగ్నియోగం. దీని పేరు విశ్వాసఘాతి; అనగా ఏమీ కాదని ఆ వస్తువులను పట్టుకుంటే అగ్ని మండి వాళ్లని చంపివేస్తుంది అని అర్థం. బాణానికి ఈ అగ్నియోగం పూసి, శణం అనే గడ్డి లేదా త్రపుసం అనే చెట్టు బెరడు చుట్టి ప్రయోగిస్తే అది అగ్నిని పుట్టిస్తుంది. ఇది అగ్నియోగం.

3. పరాక్రమం ఉన్న పక్షంలో అగ్నిప్రయోగం చేయగూడదు. ఎందువల్ల ననగా అగ్ని నమ్మదగినది కాదు. అనగా కాల్చకూడని వాటిని కూడా కాల్చివేస్తుంది. ఇది దైవంవల్ల కలిగే ఆపద క్రిందికి వస్తుంది. లెక్క లేనన్ని ప్రాణులను, ధాన్యాలను, పశువులను, ధనాన్ని, కుప్యాన్నీ, ఇతరవస్తువులను నశింపచేస్తుంది. రాజ్యంలో ఉన్న నిలవ లన్నీ నశించిన తరవాత ఆ రాజ్యం లభించినా కూడ అది క్షయానికే దారితీస్తుంది. ఇది పర్యుపాసనకర్మ.

మూ. 1. సర్వారమ్భోపకరణవిష్టిసంపన్నోఽస్మి, వ్యాధితః పరః. ఉపధావిరుద్ధప్రకృతిః అకృతదుర్గకర్మనిచయః వా నిరాసారః, సాసారో వా పురా మిత్రైః సంధత్తే" ఇత్యవమర్దకాలః.

2. స్వయమగ్నౌ జాతే సముత్థాపితే వా ప్రహవణే ప్రేక్షానీకదర్శనసంగ సౌరికకలహేషు నిత్యయుద్ధశ్రాన్తబలే, బహులయుద్ధప్రతివిద్ధప్రేతపురుషే జాగరణక్లాన్తసుప్తజనే దుర్దినే నదీవేగే వా నీహారసంప్లవే వా అవమృద్నీయాత్.

3. స్కన్ధావారముత్సృజ్య వా వనగూఢః శత్రుం నిష్క్రాన్తం ఘాతయేత్.

వ్యా. 1. "అన్ని పనులకు కావలసిన సాధనసామగ్రి, పని చేసేవాళ్లు తదితరమైనవి నాకు పుష్కలంగా ఉన్నాయి, శత్రువు అనారోగ్యంగా ఉన్నాడు. ప్రకృతుల విషయంలో రహస్యపరీక్షలు చేయడంచేత వాళ్లు వానికి ప్రతికూలంగా ఉన్నారు. దుర్గరక్షణాదికము, వస్తువుల నిలవలు అతడు చేసికొనలేదు. ఆసారం (సరుకులు తెచ్చి నింపుకొనుట) ఉన్నా లేకపోయినా మిత్రులతో సంధి చేసికొన బోతున్నాడు. (ఇంకా చేసికొనలేదు) అని అనుకొన్నప్పుడు అది ఆక్రమణం చేసే కాలం.

2. యాదృచ్ఛికంగా అగ్నిప్రమాదం జరిగినప్పుడు లేదా అగ్నిప్రమాదం కలిగింప చేయబడినప్పుడు, ఉత్సవసమయాలలోను, సైనికులు నాట్యాదిప్రదర్శనలు చూడడంలో వ్యగ్రులైనప్పుడు, మద్యం త్రాగడంవల్ల కలహాలు జరుగుతున్నప్పుడు, సైన్యం నిత్యమూ యుద్ధాలు చేసి అలిసిపోయి ఉన్నప్పుడు, చాలా యుద్ధాలలో దెబ్బలు తిని పురుషులు మరణించి నప్పుడు, మేల్కొని ఉండడంచేత అలసి పోయిన జనులు నిద్రపోతూన్నప్పుడు, రోజంతా వర్షం కురుస్తూన్నప్పుడు, వరదలు వచ్చినప్పుడు, దట్టంగా మంచు కురుస్తూన్నప్పుడూ, ఇలాంటి సమయాలలో కోటమీద దాడి చెయ్యాలి.

3. లేదా స్కంధావారం విడిచి వనంలో దాగి ఉండి శత్రువు బైటకు వచ్చినప్పుడు చంపించాలి.

మూ. మిత్రాసారముఖ్యవ్యఞ్జనో వా సంరుద్ధేన మైత్రీం కృత్వా దూత మభిత్యక్తం ప్రేషయేత్ - "ఇదం తే ఛిద్రమ్, ఇమే దూష్యాః, సంరోద్ధుర్వా ఛిద్రమ్. అయం తే కృత్యపక్షః" ఇతి. తం ప్రతిదూతమాదాయ నిర్గచ్ఛన్తం విజిగీషుర్గృహీత్వా దోషమభివిఖ్యాప్య ప్రవాస్య అపగచ్ఛేత్తతః. మిత్రాసార వ్యఞ్జనో వా సంరుద్ధం బ్రూయాత్ - "మాం త్రాతుముపనిర్గచ్ఛ, మయా వా సహ సంరోద్ధారం జహి" ఇతి. ప్రతిపన్నమ్ ఉభయతః సంపీడనేన ఘాతయేత్. జీవగ్రాహేణ వా రాజ్యవినిమయం కారయేత్. నగరం వాస్య ప్రమృద్నీయాత్. సారబలం వాస్య వమయిత్వా అభిహన్యాత్. తేన దణ్డోపనతాటవికా వ్యాఖ్యాతాః.

వ్యా. మిత్రుడ నని కాని, మిత్రసైన్యముఖ్యుడను అని గాని చెప్పుకుంటూ ఒకడు ముట్టడించబడిన రాజుతో స్నేహం చేసికొని అభిత్యక్తుణ్ణి వానివద్దకు దూతగా పంపి - నీ ఛిద్రం (నీలో ఉన్న లోపం, దుర్బలస్థానం) ఇది. వీళ్లు నీకు దూష్యులు. లేదా ముట్టడించినవాని ఛిద్రం ఇది. ఇది నీకు ఉపకరించే కృత్యపక్షం. అనగా వీళ్లు నీ శత్రువు విషయంలో పగతో ఉండి నీకు సహాయం చేయడానికి సిద్ధంగా ఉన్నవాళ్లు) అని కబురు పంపాలి. ఆ దూత తిరుగు కబురు తీసికొని వస్తున్నప్పుడు విజిగీషువు వానిని పట్టుకొని, "వీడు ఈ దోషం చేశాడు" అని చాటి చెప్పి, వానిని చంపివేసి, అక్కడినుంచి వెళ్లిపోవాలి. అప్పుడు మిత్రుడుగా గాని, సహాయకుడుగా గాని అభినయిస్తున్నవాడు ముట్టడించినవానితో - "నన్ను రక్షించడానికి రమ్ము, లేదా మనం ఇద్దరం కలిసి ముట్టడించినవానిని సంహరిద్దాం" అని చెప్పాలి. అందుకు అంగీకరించి అతడు వచ్చి నప్పుడు రెండువైపుల నుంచి పీడించి చంపించాలి. లేదా ప్రాణాలతో పట్టుకొని ప్రాణాలకు బదులు రాజ్యం ఇచ్చే టట్లు చెయ్యాలి. లేదా వాని నగరాన్ని ధ్వంసం చెయ్యాలి. లేదా వాని సైన్యంలో శ్రేష్ఠమైన దానిని పైకి రప్పించి దానిని నశింపచెయ్యాలి. దీని చేత సైన్యంతోపాటు లొంగిపోయినవాని విషయము, ఆటవికుల రాజు విషయము వివరించబడినట్లే.

మూ. 1. దణ్డోపనతాటవికయోరన్యతరో వా సంరుద్ధస్య ప్రేషయేత్

- "అయం సంరోద్ధా వ్యాధితః, పార్ష్ణిగ్రాహేణాభియుక్తః. ఛిద్రమన్యదుత్థితమ్. అన్యస్యాం భూమౌ ఉపయాతుకామః" ఇతి. ప్రతిపన్నే సంరోద్ధా స్కన్ధావారమాదీప్య అపయాయాత్. తతః పూర్వవదాచరేత్.

2. పణ్యసంపాతం వా కృత్వా పణ్యేనైనం రసవిద్ధేన అతిసందధ్యాత్.

3. ఆసారవ్యఞ్జనో వా సంరుద్ధస్య దూతం ప్రేషయేత్ - "మయా బాహ్యమభిహతమ్; ఉపనిర్గచ్ఛ అభిహన్తుమ్" ఇతి. ప్రతిపన్నం పూర్వవదాచరేత్.

4. మిత్రం బన్ధుం వాపదిశ్య యోగపురుషాః శాసనముద్రాహస్తాః ప్రవిశ్య దుర్గం గ్రాహయేయుః.

5. ఆసారవ్యఞ్జనో వా సంరుద్ధస్య ప్రేషయేత్ - "అముష్మిన్ దేశే కాలే చ స్కన్ధావారమభిహనిష్యామి; యుష్మాభిరపి యోద్ధవ్యమ్" ఇతి. ప్రతిపన్నం యథోక్తమభ్యాఘాతసంకులం దర్శయిత్వా రాత్రౌ దుర్గాన్నిష్క్రాన్తం ఘాతయేత్.

వ్యా. 1. లేదా దండోపనత (సైన్యంతో లొంగిపోయినవాడు) ఆటవికులలో ఒకడు ముట్టడించబడిన రాజుకు - "ముట్టడించిన ఈ రాజు అనారోగ్యంగా ఉన్నాడు; లేదా పార్ష్ణిగ్రాహునిచేత ఆక్రమించబడినాడు. లేదా ఏదో మరొక ఛిద్రం (అపాయస్థానం) ఏర్పడినది. మరొక చోటికి వెళ్లిపోవా లని అనుకొనుచున్నాడు" అని వార్త పంపాలి. అతడు ఆ విషయం నమ్మిన ట్లయితే ముట్టడించినవాడు తన స్కంధావారానికి నిప్పుపెట్టి అక్కడినుండి వెళ్లిపోవాలి. తరవాత వెనుక చెప్పినట్లు రెండు వైపులనుంచీ పీడించి ఓడించాలి.

2. శత్రువు కోటలోనికి అనేకవిధాలైన పణ్యాలను సరఫరా చేసి ఆ రాజును విషం కలిపిన పణ్యంతో మోసగించి చంపాలి.

3. లేదా సహాయం చేసేవాడుగా అభినయించేవాడు ముట్టడించబడినవానికి దూత ద్వారా - "నేను బైటనుండి ఆక్రమించి ఉన్న శత్రువును నశింపచేయడానికి బయలుదేరి రమ్ము" అని వార్త పంపాలి. అందుకు అంగీకరించి వచ్చిన వానిని వెనుక చెప్పినట్లు చెయ్యాలి.

4. లేదా కొందరు యోగపురుషులు (గూఢపురుషులు) తమ బంధువును

గాని మిత్రుని కాని చూడాలని చెప్పి కపటలేఖలతోను, కపటముద్రలతోను (పాస్‌పోర్టు) దుర్గంలో ప్రవేశించి మెల్లిగా దానిని (దుర్గాన్ని) పట్టింపచేయాలి.

5. లేదా సహాయకు డనే వ్యంజనంతో (మిషతో) ఉన్నవాడు ముట్టడించబడిన వానికి - "ఫలానా ప్రదేశంలో, ఫలానా సమయంలో నీ శత్రువుయొక్క స్కంధావారంమీద దాడి చేస్తాను. మీరు కూడ యుద్ధం చెయ్యాలి" అని వార్త పంపాలి. అలా అంగీకరించిన వానికి ఏదో సంకులమైన యుద్ధం జరుగుతున్నట్లు చూపించి, దుర్గంనుంచి బైటకు వచ్చిన వానిని రాత్రి చంపివేయించాలి.

మూ. 1. యద్వా మిత్రమ్ ఆవాహయేత్, ఆటవికం వా. తముత్సాహయేత్ - "విక్రమ్య సంరుద్ధే భూమిమస్య ప్రతిపద్యస్వ" ఇతి. విక్రాన్తం ప్రకృతిభిః దూష్యముఖ్యావగ్రహేణ వా ఘాతయేత్. స్వయం వా రసేన. మిత్రఘాతకోఽయ మిత్యవాప్తార్థః.

2. విక్రమితుకామం వా మిత్రవ్యఞ్జనః పరస్యాభిశంసేత్; ఆప్తభావోపగతః ప్రవీరపురుషానస్య ఉపఘాతయేత్.

3. సంధిం వా కృత్వా జనపదమేనం నివేశయేత్. నివిష్టమన్యజనపదమ్ అవిజ్ఞాతో హన్యాత్.

4. అపకారయిత్వా దూష్యాటవికేషు వా బలైకదేశమతినీయ దుర్గమవస్కన్దేన హారయేత్.

5. దూష్యామిత్రాటవికద్వేష్యప్రత్యపసృతాశ్చ కృతార్థమానసంజ్ఞాచిహ్నాః పరదుర్గమవస్కన్దేయుః.

వ్యా. 1. లేదా శత్రువుయొక్క మిత్రుణ్ణి గాని, ఆటవికుణ్ణి గాని పిలిపించి - "నువ్వు పరాక్రమించి ముట్టడించబడిన ఈ రాజుయొక్క భూమిని తీసికొనుము" అని ప్రోత్సహించాలి. ఆ విధంగా విక్రమించిన వానిని, ప్రకృతులచేత గాని, దూష్యులలోని ప్రముఖులను చేరదీసి గాని చంపించాలి. లేదా తానే విషంచేత చంపివేయాలి. తాను అనుకొన్న శత్రువుకు పీడ కలిగించడం అనే పని పూర్తి అవగానే "ఇతడు (ముట్టడించబడిన రాజు) మిత్రఘాతకుడు" అని ప్రచారం చెయ్యాలి.

2. లేదా ముట్టడించబడిన శత్రువుకు మిత్రుడు అనే వ్యంజనం కలవాడు

(మిత్రుడుగా అభినయిస్తున్నవాడు) "ఇతడు (ముట్టడించిన విజిగీషువు లేదా నీ మిత్రుడు లేదా ఆటవికుడు) నీ మీద పరాక్రమించా లని అనుకుంటున్నాడు" అని వానికి చెప్పాలి. ఆతనికి ఆప్తుడుగా అయి వాని ప్రవీరులైన పురుషులను చంపించాలి.

3. లేదా సంధి చేసికొని వానిచేత మరొక జనపదం నివేశింపచెయ్యాలి. ఆ విధంగా నివేశింపచేయబడిన మరొక జనపదాన్ని వానికి తెలియకుండా నశింపచెయ్యాలి.

4. లేదా వానిచేత దూష్యుల విషయంలోను, ఆటవికుల విషయంలోను అపకారం చేయించి, వాళ్లను అణచివేయడంకొరకు సైన్యంలో కొంత భాగం మరొక చోటికి పంపేటట్లు చేసి దుర్గాన్ని ఆక్రమించి హరించాలి.

5. శత్రువుయొక్క దూష్యులు, అమిత్రులు, ఆటవికులు, వాని ద్వేషానికి పాత్రులైనవారు, వానిని విడిచి వెళ్లిపోయినవాళ్లు వీళ్లందరికీ ధనం ఇచ్చి సన్మానం చేసి ఏ సమయంలో ఎలా ఆక్రమించాలో గుర్తులు చెప్పగా వాళ్లు దుర్గాన్ని ఆక్రమించాలి.

మూ. 1. పరదుర్గమవస్కన్ద్య స్కన్ధావారం వా పతితపరాఙ్ముఖాభిపన్నముక్తకేశశస్త్రభయవిరూపేభ్యశ్చ అభయమ్ అయుధ్యమానేభ్యశ్చ దద్యుః. పరదుర్గమవాప్య విశుద్ధశత్రుపక్షః కృతోపాంశుదణ్డప్రతీకారమ్ అన్తర్బహిశ్చ ప్రవిశేత్.

2. ఏవం విజిగీషురమిత్రభూమిం లబ్ధ్వా మధ్యమం లిప్సేత. తత్సిద్ధావుదాసీనమ్. ఏష ప్రథమో మార్గః పృథివీం జేతుమ్.

3. మధ్యమోదాసీనయోరభావే గుణాతిశయేనారిప్రకృతీః సాధయేత్. తత ఉత్తరాః ప్రకృతీః. ఏష ద్వితీయో మార్గః. మణ్డలస్యాభావే శత్రుణా మిత్రమ్, మిత్రేణ వా శత్రుమ్ ఉభయతః సంపీడనేన సాధయేత్. ఏష తృతీయో మార్గః.

4. శక్యమేకం వా సామన్తం సాధయేత్. తేన ద్విగుణో ద్వితీయమ్. త్రిగుణస్తృతీయమ్. ఏష చతుర్థో మార్గః పృథివీం జేతుమ్.

వ్యా. 1. శత్రువుయొక్క దుర్గం గాని, స్కంధావారం గాని ఆక్రమించి, యుద్ధంలో దెబ్బ తిని పడిపోయినవాళ్లకు, వెనుకకు తిరిగి పారిపోయే వాళ్లకు, కష్టంలో ఉన్నవాళ్లకు, జుట్టు విరబోసుకున్నవాళ్లకు, శస్త్రభయంచేత వికృతమైన ఆకారం పొందినవాళ్లకు, యుద్ధం చేయనివాళ్లకు అభయం ఇవ్వాలి. శత్రుదుర్గం ఆక్రమించుకొని, శత్రుపక్షా

న్నంతనీ నశింపచేసి, రహస్యంగా తనకు కలగడానికి అవకాశం ఉన్న ఆపదలనుండి ప్రతిక్రియ చేసికొని లోపల బైటా కూడ ప్రవేశించాలి.

2. విజిగీషువు ఈ విధంగా శత్రురాజ్యాన్ని వశంచేసికోవాలి. తరవాత మధ్యముని రాజ్యం పొందడానికి ప్రయత్నించాలి. అది లభించిన తరవాత ఉదాసీనుని రాజ్యం కొరకు ప్రయత్నించాలి. భూమిని జయించడానికి ఇది మొదటి మార్గం.

3. మధ్యమోదాసీనులు లేని పక్షంలో శత్రువుయొక్క గుణాలను మించిన సద్గుణాలచేత శత్రువుయొక్క అమాత్యాదిప్రకృతులను వశం చేసుకోవాలి. తరవాత మిగిలిన ప్రకృతులను వశం చేసుకోవాలి. ఇది రెండవ మార్గం.

4. రాజమండలం లేని పక్షంలో శత్రువుచేత మిత్రుణ్ణి, మిత్రునిచేత శత్రువును రెండు వైపులనుండీ పీడించి వశం చేసుకోవాలి. ఇది మూడవ మార్గం.

5. లేదా ఓడించడానికి శక్యమైన ఒక సామంతుణ్ణి ముందుగా ఓడించాలి. దానితో రెట్టింపు బలం కలవాడై రెండవ సామంతుణ్ణి, మూడు రెట్లు బలం కలవాడై మూడవ సామంతుణ్ణీ జయించాలి. ఇది భూమిని జయించడానికి నాల్గవ మార్గం.

మూ. 1. జిత్వా చ పృథివీం విభక్తవర్ణాశ్రమాం స్వధర్మేణ భుఞ్జీత.

2. శ్లో. ఉపజాపోఽపసర్పో వా వామనం పర్యుపాసనమ్,
అవమర్దశ్చ పఞ్చైతే దుర్గలమ్భస్య హేతవః.

ఇతి కౌటలీయార్థశాస్త్రే దుర్గలమ్భోపాయే త్రయోదశాధికరణే చతుర్థోఽధ్యాయః,
పర్యుపాసనకర్మ అవమర్దశ్చ, ఆదిత శ్చతుశ్చత్వారింశచ్ఛతతమః.

వ్యా. 1. ఈ విధంగా భూమిని జయించి, వర్ణాశ్రమాలను చక్కగా విభజించిన ఆ భూమిని స్వధర్మానుసారం అనుభవించాలి.

2. ఉపజాపం, అపసర్పం, వామనం, పర్యుపాసనం, అవమర్దం - ఈ ఐదూ దుర్గాన్ని సాధించడానికి ఉపాయాలు.

"బాలానందిని" అను కౌటలీయార్థశాస్త్రాంధ్రవ్యాఖ్యానంలో దుర్గలంభోపాయం అనే పదమూడవ అధికరణంలో, పర్యుపాసనకర్మ, అవమర్దం అనే నాల్గవ అధ్యాయం, ప్రారంభం నుంచి నూటనలభై నాల్గవ అధ్యాయం సమాప్తం.

# అథ పఞ్చమో ఽధ్యాయః

## షట్సప్తతిశతతమం ప్రకరణమ్ - లబ్ధప్రశమనమ్

(జయించిన రాజ్యంలో శాంతి నెలకొల్పడం.)

మూ. 1. ద్వివిధం విజిగీషోః సముత్థానమ్ - అటవ్యాదికమ్ ఏక గ్రామాదికం చ.

2. త్రివిధశ్చాస్య లమ్భః - నవః, భూతపూర్వః, పిత్ర్యః ఇతి.

3. నవమవాప్య లమ్భం పరదోషాన్ స్వగుణైః ఛాదయేత్, గుణాన్ గుణద్వైగుణ్యేన. స్వధర్మకర్మానుగ్రహ పరిహార దానమానకర్మభిశ్చ ప్రకృతి ప్రియహితాన్యనువర్తేత. యథాసంభాషితం చ కృత్యపక్షముపగ్రాహయేత్. భూయశ్చ కృతప్రయాసమ్. అవిశ్వాస్యో హి విసంవాదకః స్వేషాం పరేషాం చ భవతి, ప్రకృతివిరుద్ధాచారశ్చ. తస్మాత్ సమానశీలవేషభాషాచారతా ముపగచ్ఛేత్, దేశదైవతసమాజోత్సవవిహారేషు చ భక్తిమనువర్తేత.

వ్యా. 1 విజిగీషువు ప్రయత్నం చేసి సంపాదించవలసినది రెండు విధాలు; ఒకటి అడవులు మొదలైనవి. రెండు ఒక గ్రామం, ఒక నగరం మొదలైనవి.

2. క్రొత్తది, భూతపూర్వం (కొంతకాలం తన వశంలో ఉండి కొంత కాలం తననుంచి పోయి మళ్ళీ వచ్చినది), తండ్రి ద్వారా సంక్రమించినది అని లాభం అనగా పొందబడిన భూమ్యాదికం కూడ మూడు విధాలు.

3. విజిగీషువు క్రొత్త రాజ్యం సంపాదించిన తరవాత అంతవరకు ఆ రాజ్యాన్ని పాలించిన శత్రువుయొక్క దోషాలను తన గుణాలచేత, వాని గుణాలను వాటికంటె అధికమైన తన రెట్టింపు గుణాలచేత కప్పివేయాలి. అనగా వానికంటె తాను చాల మంచివా డనిపించుకోవాలి. వాళ్ల వాళ్ల ధర్మాలను కర్మలను అనుగ్రహించడం అన్న ఎవరి ధర్మం వాళ్లు, ఎవరి కర్మలు వాళ్లు అనుసరించడానికి అనుమతించడం, పన్ను మొదలైనవాటిలో మినహాయింపు లివ్వడం, ధనం ఇవ్వడం, గౌరవించడం మొదలైన పనులచేత ప్రకృతులకు ప్రియములు, హితములు అయిన వాటిని అనుసరించాలి. శత్రువుయొక్క కృత్యపక్షంవాళ్లను అనగా ఆతనికి ద్వేషపాత్రులై తనకు సహాయం చేసినవాళ్లను ముందుగా వాళ్లతో కుదుర్చుకున్న ఒప్పందం ప్రకారం ధనాదికంచేత

సంతోషింపచెయ్యాలి. తనకోసం శ్రమపడినవాళ్ళకు అధికంగా సత్కారాదులు చెయ్యాలి. ఎందువల్ల ననగా-ముందుగా అనుకొన్న విధంగా చేయనివాడు తనవాళ్లకు ఇతరులకూ కూడ విశ్వాసపాత్రుడు కానివాడు అవుతాడు; ప్రకృతులకు విరుద్ధంగా ఉండే ఆచారవేష భాషాదులచేత కూడ వాళ్లకు అవిశ్వాస్యు డవుతాడు. అందువల్ల ఆ రాజ్యంలోని జనులతో సమానమైన శీలం, వేషం, భాష, ఆచారం అవలంబించాలి. ఆ దేశానికి సంబంధించిన ఉత్సవాలలోను, దేవతోత్సవాలలోను, సమాజోత్సవాలలోను విహారాలలోను (ఆటపాటలు మొదలైన వాటిలోను) శ్రద్ధాసక్తులు చూపాలి.

మూ. దేశగ్రామజాతిసంఘముఖ్యేషు చాభీక్ష్ణం సత్రిణః పరస్యాపచారం దర్శయేయుః; మాహాభాగ్యం భక్తిం చ తేషు స్వామినః స్వామిసత్కారం చ విద్యమానమ్. ఉచితైశ్చైనాన్ భోగపరిహారరక్షావేక్షణైః భుఞ్జీత. సర్వదేవతా శ్రమపూజనం చ, విద్యావాక్యధర్మశూరపురుషాణాం చ భూమిద్రవ్యదాన పరిహారాన్ కారయేత్. సర్వబన్ధనమోక్షణమనుగ్రహం దీనానాథవ్యాధితానాం చ. చాతుర్మాస్యేష్వర్ధమాసికమఘాతం, పౌర్ణమాసీషు చ చాతూరాత్రికం, రాజదేశనక్షత్రేషు ఏకరాత్రికమ్, యోనిబాలవధం, పుంస్త్వోపఘాతం చ ప్రతిషేధయేత్. యచ్చ కోశదణ్డోపఘాతికమ్. అధర్మిష్ఠం వా చరిత్రం మన్యేత తదపనీయ ధర్మ్యవ్యవహారం స్థాపయేత్. చోరప్రభృతీనాం, మ్లేచ్ఛజాతీనాం చ స్థానవిపర్యాసమనేకస్థం కారయేత్; దుర్గరాష్ట్రదణ్డ ముఖ్యానాం చ. పరోపగృహీతానాం చ మన్త్రిపురోహితాదీనాం పరస్య ప్రత్యన్తేషు అనేకస్థం వాసం కారయేత్. అపకారసమర్థాన్, అనుక్షియతో వా భర్తృవినాశమ్ ఉపాంశుదణ్డేన ప్రశమయేత్. స్వదేశీయాన్ వా పరేణ వావరుద్ధాన్ అపవాహితస్థానేషు స్థాపయేత్.

వ్యా. పూర్వం ఈ రాజ్యం పాలించిన రాజు మీ విషయంలో చాల చెడ్డగా ప్రవర్తించేవాడు అని సత్రులు దేశ - జాతి - సంఘాల ముఖ్యులకు చెపుతూ ఉండాలి. ఆ రాజును జయించి ఇప్పుడు రాజ్యం చేస్తూన్న ప్రభువు మహాభాగ్యవంతు డనీ, వాళ్లమీద ఆతనికి చాల స్నేహభావం ఉన్న దనీ, అతడు వాళ్ల నందరినీ సత్కరిస్తూ ఉంటాడనీ చెప్పాలి. ఈ ముఖ్యులందరికి తగు విధమైన భోగాలు, శుల్కపరిహారాదులు ఇస్తూ రక్షణ, పర్యవేక్షణ చేస్తూ వాళ్లను అనుభవించాలి, అనగా వాళ్లచేత పనులు

చేయించుకోవాలి. సమస్తమైన దేవతలను, ఆశ్రమాలను పూజిస్తూ ఉండాలి. విద్యాశూరులు, వాక్యశూరులు, ధర్మశూరులు అయిన పురుషులకు భూదాన ద్రవ్యదానాలు చేస్తూ నష్టపరిహారాదులు ఇస్తూ ఉండాలి. అందరు ఖైదీలను విడిచివేయాలి. దీనులను, అనాథులను, వ్యాధితులను ఆదుకోవాలి. నాలుగేసి మాసాలకు పదిహేను రోజులపాటు, పౌర్ణమాసులు వచ్చినప్పుడు నాలుగు రోజులపాటు, రాజనక్షత్ర - దేశనక్షత్రాలలో ఒక రోజుపాటు ప్రాణివధ నిషేధించాలి. గుడ్లు పెట్టకలిగి ఉన్న కోళ్లు, చిన్న జంతువులు చంపకూడ దని శాసించాలి. పశువుల పుంస్త్వాన్ని పోగొట్టకూడదని నిషేధించాలి. ఏ వ్యవహారంవల్ల కోశానికి, సైన్యానికి దెబ్బ తగులుతుందో, ఏది ధర్మవిరుద్ధమో ఆ పనిని నిషేధించి ధర్మసంమతమైన వ్యవహారం నెలకొల్పాలి. దొంగతనం చేసే స్వభావం ఉన్నవాళ్లనూ, మ్లేచ్ఛజాతులకు చెందినవాళ్లనూ ఒక చోటునుంచి మరొక చోటికి మారుస్తూ వాళ్లిద్దరూ ఒకే ప్రదేశంలో ఉండకుండా చూడాలి. దుర్గ - రాష్ట్ర - దండప్రధానులను కూడ ఒక చోటినుండి మరొక చోటికి పంపుతూ వాళ్లందరి నివాసాలు ఒక చోట ఉండకుండా చూడాలి. శత్రువు క్రింద పని చేసిన అమాత్యపురోహితాదులకు శత్రురాజ్యం సరిహద్దులలో వేరు వేరు స్థానాలలో నివాసాలు ఏర్పరచాలి. అపకారం చేసే సామర్థ్యం ఉన్నవాళ్లను, తమ ప్రభువుతో పాటు నశించడానికి సిద్ధ మయే వాళ్లను రహస్యంగా చంపించివేయాలి. కొందరు అధికారులను తొలగించడంచేత ఖాళీ అయిన స్థానాలలో తన దేశానికి చెందినవాళ్లను, శత్రువుచేత నిగ్రహించబడినవాళ్లను నియమించాలి.

మూ. 1. యశ్చ తత్కులీనః ప్రత్యాదేయమాదాతుం శక్తః ప్రత్యన్తాటవీస్థో వా ప్రబాధితుమభిజాతః తస్మై విగుణాం భూమిం ప్రయచ్ఛేత్. గుణవత్యాః చతుర్భాగం వా కోశదణ్డదానమవస్థాప్య, యదుపకుర్వాణః పౌరజానపదాన్ కోపయేత్. కుపితైస్తైరేనం ఘాతయేత్, ప్రకృతిభిరుపక్రుష్టమ్ అపనయేత్; ఔపఘాతికే వా దేశే నివేశయేదితి.

2. భూతపూర్వే యేన దోషేణ అపవృత్తః తం ప్రకృతిదోషం ఛాదయేత్. యేన చ గుణేనోపావృత్తః తం తీవ్రీకుర్యాదితి.

3. పిత్ర్యే పితృదోషాన్ ఛాదయేత్; గుణాంశ్చ ప్రకాశయేదితి.

వ్యా. 1. శత్రువు వంశానికి చెందిన వాడెవడైనా తన రాజ్యం (తాను జయించిన

రాజ్యం) తిరిగి తీసికొనడానికి సమర్థుడు అని కాని, సరిహద్దులలోని అడవులలో నివసించే ఉత్తమకులప్రసూతుడు తన రాజ్యంలోని కొంత భాగం ఆక్రమించుకొనడానికి సమర్థు డని కాని శంక కలిగినప్పుడు వానికి ఎందుకూ పనికి రాని భూమి ఇవ్వాలి. లేదా ప్రతిసంవత్సరము ఇంత ధనం, ఇంత సైన్యం ఇవ్వాలని నియమం పెట్టి మంచి భూమిలో నాల్గవ భాగం వాని కివ్వాలి. ఆ కోశదండదానం ఎంత ఉండా లనగా అది సంపాదించడానికి పౌరజానపదులను పీడించవలసి ఉండే టట్లు ఉండాలి. వాళ్లు ఆ విధంగా కోపించినప్పుడు వాళ్లచేతనే వానిని చంపించి వేయాలి. ప్రకృతులచేత అతడు నిందింపబడితే వానిని తొలగించాలి; లేదా అధికంగా అపాయాలు ఉండే దేశంలో వానికి నివాసం ఏర్పరచాలి.

2. భూతపూర్వలంభం (పూర్వం కొంతకాలం తన క్రింద ఉన్న దేశం) విషయంలో - అది తనలోని ఏ దోషంచేత తన చేయి జారిపోయినదో ఆ ప్రకృతిదోషాన్ని కప్పివెయ్యాలి. ఏ గుణంచేత తిరిగి అది తనచేతికి వచ్చినదో దానిని తీవ్రం చెయ్యాలి.

3. పిత్ర్యలంభం (తండ్రి ద్వారా లభించిన దేశం) విషయంలో - తండ్రిలో ఉన్న దోషాలను కప్పిపుచ్చాలి. అనగా ఆ దోషాలు తను చేయగూడదు. తండ్రి గుణాలను ప్రకాశింప చెయ్యాలి. విస్తరింపచెయ్యాలి.

శ్లో. చరిత్రమకృతం ధర్మ్యం కృతం చాన్యైః ప్రవర్తయేత్,
ప్రవర్తయేన్న చాధర్మ్యం కృతం చాన్యైర్నివర్తయేత్.

ఇతి కౌటలీయార్థశాస్త్రే దుర్గలమ్భోపాయే త్రయోదశాధికరణే పఞ్చమోఽధ్యాయః, లబ్ధప్రశమనమ్, ఆదితః పఞ్చచత్వారింశచ్ఛతతమః. ఏతావతా కౌటలీయార్థశాస్త్రస్య దుర్గలమ్భోపాయః త్రయోదశమధికరణం సమాప్తమ్.

వ్యా. అంతకు పూర్వం ఆచరించబడని ధర్మసంమతమైన వ్యవహారాన్నీ, ఇతరులచేత ఆచరించబడుతూన్న ధర్మసంమతమైన వ్యవహారాన్నీ ప్రవర్తింప చెయ్యాలి. ధర్మసంమతం కాని చరిత్రను ప్రవర్తింపచేయకూడదు. ఇతరు లెవరైనా అధర్మచరిత్ర ఆచరిస్తూంటే దానిని నివర్తింపచెయ్యాలి.

"బాలానందిని" అను కౌటలీయార్థశాస్త్రాంధ్రవ్యాఖ్యానంలో దుర్గలంభోపాయం అనే పదమూడవ అధికరణంలో లబ్ధప్రశమనం అనే ఐదవ అధ్యాయం, ప్రారంభంనుంచి నూటనలభై ఐదవ అధ్యాయం సమాప్తం. ఇంతటితో కౌటలీయార్థశాస్త్రంలోని దుర్గలంభోపాయం అనే పదమూడవ అధికరణం సమాప్తం.

# అథ ఔపనిషదికం చతుర్దశమ్ అధికరణమ్

## ప్రథమోఽధ్యాయః

### సప్తసప్తతిశతతమం ప్రకరణమ్ - పరబలఘాతప్రయోగః

(శత్రుసైన్యసంహారప్రయోగం)

మూ. 1. చాతుర్వర్ణ్యరక్షార్థమ్ ఔపనిషదికమ్ అధర్మిష్ఠేషు ప్రయుఞ్జీత.

2. కాలకూటాదిర్విషవర్గః, శ్రద్ధేయదేశవేషశిల్పభాషాభిజనాపదేశైః కుబ్జవామనకిరాతమూకబధిరజడాన్ధచ్ఛద్మభిః మ్లేచ్ఛజాతీయైః అభిప్రేతైః స్త్రీభిః పుమ్భిశ్చ పరశరీరోపభోగేష్వాధాతవ్యః.

3. రాజక్రీడాభాణ్డనిధానద్రవ్యోపభోగేషు గూఢాః శస్త్రనిధానం కుర్యుః, సత్రాజీవినశ్చ రాత్రిచారిణః అగ్నిజీవినశ్చ అగ్నినిధానమ్.

వ్యా. 1. నాలుగు వర్ణాలవారి రక్షణంకొరకు అధర్మాత్ముల విషయంలో ఔపనిషదికాన్ని (రహస్యవిషాదికాన్ని) ప్రయోగించాలి.

2. వేషం, శిల్పం, భాష, వంశం - వీటిని విశ్వసించదగిన రీతిలో చెప్పుకొనే గూనివాళ్లు, పొట్టివాళ్లు, కిరాతులు, మూగవాళ్లు, చెవిటివాళ్లు, తెలివితక్కువవాళ్లు, గ్రుడ్డివాళ్లు అనే వంకగల (శత్రురాజుకు) ఇష్టులైన మ్లేచ్ఛజాతికి చెందిన స్త్రీలచేత, పురుషులచేతా కూడ శత్రువు శరీరంమీద ఉపయోగించే వస్త్రచందనాదులలో కాలకూటం మొదలైన విషవస్తువులను ఉంచే టట్లు చెయ్యాలి.

3. రాజు క్రీడించే వస్తువులు, అలంకారాలు ఉంచే చోటులలోను, అతడు ఉపయోగించే వస్తువులలోను గూఢచారులు ఆయుధాలు ఉంచాలి. రహస్యంగా ద్రోహకార్యాలు చేసేవాళ్లు, అగ్నితో జీవించేవాళ్లు రాత్రులందు తిరుగుతూ అగ్నిని ఉంచుతూండాలి. అనగా అగ్నిని ప్రయోగించి గృహాదులను దగ్ధం చెయ్యాలి.

మూ. 1. చిత్రభేకకౌణ్డిన్యకకృకణపఞ్చకుష్ఠ,శతపదీచూర్ణమ్, ఉచ్చిదిఙ్గకమ్బలిశతకన్దేధ్మకృకలాసచూర్ణం, గృహగౌలికాన్ధాహికకృకణపూతికీట

గోమారికాచూర్ణం భల్లాతకావల్గుకారసంయుక్తం సద్యః ప్రాణహరమ్, ఏతేషాం వా ధూమః.

2. శ్లో. కీటో వాన్యతమస్తప్తః కృష్ణసర్పప్రియఙ్గుభిః,
శోషయేదేష సంయోగః సద్యః ప్రాణహరో మతః.

3. ధామార్గవయాతుధానమూలం భల్లాతకపుష్పచూర్ణయుక్త మార్ధమాసికః.

4. వ్యాఘాతకమూలం భల్లాతకపుష్పచూర్ణయుక్తం కీటయోగో మాసికః. కలామాత్రం పురుషాణాం, ద్విగుణం ఖరాశ్వానాం, చతుర్గుణం హస్త్యుష్ట్రాణామ్.

5. శతకర్దమోచ్చిదిఙ్గకరవీరకటుతుమ్బీమత్స్యధూమో మదనకోద్రవ పలాలేన హస్తికర్ణపలాశపలాలేన వా ప్రవాతానువాతే ప్రణీతః యావచ్చరతి తావన్మారయతి.

వ్యా. (కాంగ్లే చెప్పినట్లు ఈ అధికరణంలో చెప్పినవి ఓషధులా, ఏవైనా ప్రాణులా అని చాలా చోట్ల స్పష్టంగా తెలియదు. వాటి స్వరూపం అసలే తెలియదు. అనువాదంలో కూడ చాలవరకు మూలంలోని పదాలనే ఉపయోగించి సంతోషపడాలి. వృక్షశాస్త్రజంతుశాస్త్రరసాయనశాస్త్రజ్ఞులు కలిసి పరిశోధించవలసిన విషయం ఇది).

1. చిత్రవర్ణాలు ఉన్న కప్ప, కౌండిన్యకం (మలమూత్రాలలో విషం ఉండే ఒక పురుగు), కృకణం(ఒక పక్షి), కుష్ఠం అనే ఒక ఓషధియొక్క బెరడు, ఆకులు, పువ్వులు, ఫలాలు, మూలం అనే ఐదు అవయవాలు, జెఱ్ఱి, వీటి చూర్ణము, అలవిషం అనే ఒక కీటకము, కంబలి అనే ఒక కృమి, శతమూలి అనే ఓషధి, కందం (గండూరం), పలాశసమిధ, తొండ -వీటి చూర్ణము, బల్లి, అంధాహిక అనే చేప, పూతికీటం (దుర్గంధం గల ఒక పురుగు), గోమారిక అనే ఓషధి- వీటి చూర్ణము వీటిని భల్లాతక- అవల్గుక వృక్షాల రసంతో కలిపి నట్లయితే వెంటనే ప్రాణాలు హరిస్తాయి. వీటి ధూమం కూడ ప్రాణహరమే.

2. పైన చెప్పిన కీటాలలో ఏదైన ఒకదానిని కాల్చి వాసనచూడడం వంటిది ఏదైనా చేస్తే అది మనిషిని ఎండిపోయేటట్లు చేస్తుంది. కాల్చిన కీటాన్ని (చంపిన) త్రాచుపాముతోను, ప్రియంగువు అనే చెట్టు ఆకుల రసంతోను కలిపి ఉడికించి వాడితే వెంటనే ప్రాణాలు హరిస్తుంది.

3. తెల్లపూలు కల ఆవడచెట్టు, యాతుధానం అనే ఓషధి వేరు భల్లాతకపుష్పాల చూర్ణంతో కలిపి నట్లయితే అది వాడినవారిని పదిహేను రోజులలో చంపివేస్తుంది.

4. భల్లాతకపుష్పచూర్ణంతో వ్యాఘాతకం అనే మొక్క వేళ్లు కలిపి కీటాన్ని కాలిస్తే అది ఒక మాసంలో చంపే కీటయోగం. మనుష్యులకు తక్కువ మోతాదు, గాడిదలకు గుఱ్ఱాలకు రెట్టింపు మోతాదు, ఏనుగులకు ఒంటెలకు నాలుగు రెట్లు మోతాదు ఇవ్వాలి.

5. ఉమ్మెత్తగింజల పొల్లు, కొఱ్ఱల పొల్లు, వీటితో గాని, కొత్తిమ్మిరి (ధనియాల) పొల్లు, పలాశం (కచ్చోరం) పొల్లు వీటితోగాని శతకర్దమ- ఉచ్చిదింగ- కరవీర- కటుతుంబీ-మత్స్యాల చూర్ణాల పొగ బాగా గాలి వీచుతున్నప్పుడు, గాలికి అనుకూలంగా ప్రసరించే టట్లు వేస్తే అది ఎంతవరకు వ్యాపిస్తుందో అంతవరకు మనుష్యులను చంపివేస్తుంది. శతకర్దమం అనగా యక్షకర్దమం; కరవీరం అనగా హమారం అనే ఒక ఓషధి. కటుతుంబీ అనగా ఇక్ష్వాకువు. మదనం అనగా ధుత్తూరం అనగా ఉమ్మెత్త, హస్తికర్ణం అనగా కుస్తుంబురు.

మూ. 1. పూతికీటమత్స్యకటుతుమ్బీశతకర్దమేధ్మేన్ద్రగోపచూర్ణం పూతికీటక్షుద్రారాలాహేమవిదారీచూర్ణం వా బస్తశృఙ్గఖురచూర్ణయుక్తమ్ అన్ధీకరో ధూమః.

2. పూతికరఞ్జపత్రహరితాలమనశ్శిలాగుఞ్జారక్తకార్పాసపలాలాని ఆస్ఫోటకా చ గోశకృద్రసపిష్టమన్ధీకారో ధూమః.

3. సర్పనిర్మోకం గోశ్వపురీషమ్ అన్ధాహికశిరశ్చ అన్ధీకారో ధూమః.

4. పారావతప్లవకక్రవ్యాదానాం హస్తినరవరాహాణాం చ మూత్రపురీషం కాసీసహిఙ్గుయవతుషకణతణ్డులాః, కార్పాసకుటజకోశాతకీనాం చ బీజాని,

గోమూత్రికాభాణ్డీమూలం, నిమ్బశిగ్రుఫణిజ్జకాక్షీబపీలుకభఙ్గః, సర్పశఫరీచర్మ హస్తినఖశృఙ్గచూర్ణమిత్యేష ధూమో మదనకోద్రవపలాలేన హస్తికర్ణపలాశపలాలేన వా ప్రణీతః ప్రత్యేకశః యావచ్చరతి తావన్మారయతి.

వ్యా. 1. పూతికీటకాలు, మత్స్యం, కటుతుంబి, శతకర్దమం, పలాశం, ఇంద్రగోపం అనే కీటకం- వీటి చూర్ణం, లేదా పూతికీటకం, క్షుద్రం (కంటకారి అనే ఓషధి), అరాల (యక్షధూపం అనే జిగురు), ఉమ్మెత్త, విదారి (ఇక్షుగంధ) వీటి చూర్ణం, మేక కొమ్ముల డెక్కల చూర్ణంతో కలిపితే ఆ ధూమం గ్రుడ్డితనాన్ని కలిగిస్తుంది.

2. పూతికరంజం (పూతిక అనే ఒక చెట్టు), దానిని ఆకులు, అరదలం, మణిశిల, బండిగురివింద, ఎఱ్ఱని పత్తి, వీటి గింజల పొల్లులను, ఆస్ఫోటం (రక్తార్కం), కాచం (ఒక లవణం), ఎద్దుపేడ వీటి రసంతో కలిపి నూరినట్లయితే దాని ధూమం కూడ గుడ్డితనాన్ని కలిగిస్తుంది.

3. పాము కుబుసం, ఎద్దుల పేడ, గుఱ్ఱాల లద్దె, అంధాహికం అనే చేప తల- వీటి ధూమం కూడ అంధత్వాన్ని కలిగిస్తుంది.

4. పావురము, ప్లవకం అనే పక్షి, గ్రద్ద ఈ మూడింటి మూత్రపురీషాలు, ఏనుగు, మనిషి, కోతి ఈ మూడింటి మూత్రపురీషాలు, కాసీసం అనే ఒక ధాతువు, ఇంగువ, యవల పొల్లు, నూక, తండులాలు ఇవి, పత్తి గింజలు, గోరింట గింజలు, బీర గింజలు- ఈ మూడు, గోమూత్రిక అనే గడ్డి, యోజనవల్లి ఈ రెండింటి వ్రేళ్లు, వేప, ములగ, ఫణిజ్జం అనే ఒకరకం నిమ్మకాయ, కాక్షీబం(ఒక రకం ములగ), పీలువృక్షం వీటి ముక్కలు, పాము చర్మ, శఫరి అనే మత్స్యం యొక్క చర్మ ఏనుగుల గోళ్ల దంతాల చూర్ణం వేసి మదనకోద్రవాల పొల్లుతోగాని, హస్తికర్ణపలాశాల పొల్లుతో గాని ధూమం వేస్తే పైన చెప్పినవాటిలో ఒక్కొక్కదాని (ఒక్కొక్క సముదాయంయొక్క) ధూమం ఎంతవరకు వ్యాపిస్తుందో అంతవరకు ప్రాణుల్ని చంపివేస్తుంది.

మూ.1.కాలీకుష్ఠనడశతావరీమూలం, సర్పప్రచలాకకృకణపఞ్చకుష్ఠచూర్ణం వా ధూమః పూర్వకల్పేన ఆర్ద్రే శుష్కపలాలే వా ప్రణీతః సంగ్రామావతరణావస్కన్దనసంకులేషు కృతతేజనోదకాక్షిప్రతీకారైః ప్రణీతః సర్వప్రాణినాం నేత్రఘ్నః.

2. శారికాకపోతబకబలాకాలణ్డమ్ అర్కాక్షిపీలుకస్నుహిక్షీరపిష్ట మన్ధీకరణమ్ అఞ్జనమ్ ఉదకదూషణం చ.

3. యవకశాలిమూలమదనఫలజాతీపత్రనరమూత్రయోగాః ప్లక్షవిదారీమూలయుక్తో మూకోదుమ్బరమదనకోద్రవక్వాథయుక్తో హస్తికర్ణపలాశక్వాథయుక్తో 'వా మదనయోగః. శృఙ్గిగౌతమవృక్షకణ్టకారమయూరపదీయోగః, గుఞ్జాలాఙ్గలీవిషమూలికేఙ్గుదీయోగః, కరవీరాక్షిపీలుకార్క మృగమారణీయోగః మదనకోద్రవక్వాథయుక్తః హస్తికర్ణపలాశక్వాథయుక్తో వా మదనయోగః సమస్తా వా యవసేన్ధనోదకదూషణాః.

వ్యా. 1. కాలి, కుష్ఠం, నడం, శతావరి అనే మొక్కల వ్రేళ్ల చూర్ణంతో కాని, సర్పం, నెమలిపింఛం, కృకణం, పంచకుష్ఠం-వీటి చూర్ణంతో కాని పైన చెప్పిన విధంగా తడిగా ఉన్న లేదా ఎండిన కట్టెలమీద ధూమం పుట్టించిన ట్లయితే, యుద్ధానికి దిగే టప్పుడు, ఆక్రమించినప్పుడు, దొమ్మియుద్ధంలోను తేజనోదకంచేత తమ నేత్రాల కేమీ అపాయం కలగకుండా ముందుగా జాగర్త తీసికొన్నవాళ్లు ఈ ధూమాన్ని ప్రయోగిస్తే, అది సర్వప్రాణుల దృష్టిని నశింపచేస్తుంది.

2. గోరింకలు, పావురాలు, కొంగలు, తెల్ల కొంగలు వీటి రెట్టలను జిల్లేడు, అక్షి అనే చెట్టు, పీలకం అనే చెట్టు, స్నుహి అనే మొక్క వీటి పాలతో నూరిన ట్లయితే దానితో చేసిన కాటుక అంధత్వాన్ని కలిగిస్తుంది; నీటిని కూడ పాడుచేస్తుంది.

3. యవకం అనే మొక్క, వరివేళ్లు, మదనఫలం, జాజి ఆకులు, నరమూత్రం-వీటి మిశ్రణాలను, రావి వేళ్లతోను, విదారిచెట్టు బెరడుతోను కలిపినా, లేక మూకం, ఉదుంబరం, మదనవృక్షం వీటి పండ్లు, కొఱ్ఱలు వేసి తయారు చేసిన కషాయంతో కలిపినా, లేదా హస్తికర్ణపలాశవృక్షాల కషాయంతో కలిపినా అది మదనయోగం; అనగా మత్తు కలిగించే యోగం. శృంగి అనే చేప కొవ్వు, లోధ్రవృక్షం; బూరుగుచెట్టు, మయూరపది అనే ఓషధి, వీటి మిశ్రణం, గురివింద, పృథక్పర్ణి అనే ఓషధి, విషమూలిక, ఇంగుది అనే చెట్టు (వీటి పువ్వులు లేదా బెరడు మొ.) వీటి మిశ్రమం, కరవీర-అక్షి-పీలుక-అర్కవృక్షాలు, మృగమారణి(ఒక ఓషధి) వీటి యోగం (మిశ్రణం) వీటిలో దేనినైనా మదన-కోద్రవాల కషాయంతో గాని, హస్తికర్ణపలాశాల కషాయంతో గాని

కలిపితే అది మదనయోగం. పైన చెప్పిన మూడు మిశ్రణాలు కలిపితే పశువుల ఆహారాన్నీ, నీటినీ దూషింపచేస్తాయి, అనగా విషపూరితం చేస్తాయి.

మూ. 1. కృతకణ్ఠలకృకలాసగృహగౌలికాన్ధాహిధూమో నేత్రవధమ్, ఉన్మాదం చ కరోతి.

2. కృకలాసగృహగౌలికాయోగః కుష్ఠకరః.

3. స ఏవ చిత్రభేకాన్త్రయుక్తః ప్రమేహమాపాదయతి. మనుష్యలోహిత యుక్తః శోషమ్.

4. దూషీవిషం మదనకోద్రవచూర్ణమ్ ఉపజిహ్వికాయోగః; మాతృవాహకాఞ్జలికారప్రచలాకభేకాక్షిపీలుకయోగః విషూచికాకరః.

5. పఞ్చకుష్ఠకకౌణ్డిన్యకరాజవృక్షపుష్పమధుయోగః జ్వరకరః.

6. భాసనకులజిహ్వాగ్రన్థికాయోగః ఖరీక్షీరపిష్టః మూకబధిరకరః మాసార్ధమాసికః. కలామాత్రం పురుషాణామితి సమానం పూర్వేణ.

వ్యా. 1. కండరాలు బాగా పెరిగిన తొండలు, బల్లులు, అంధాహి అనే చేప- వీటి ధూమం చూపును పోగొడుతుంది; పిచ్చి కలిగిస్తుంది.

2. తొండలతో బల్లులతో చేసిన మిశ్రమం కుష్ఠరోగాన్ని కలిగిస్తుంది.

3. ఆ మిశ్రణంలోనే రంగురంగుల కప్ప ప్రేగులు, తేనె కలిపితే ప్రమేహం అనే రోగం కలిగిస్తుంది. మనిషిరక్తంతో కలిపితే శోషరోగం కలిగిస్తుంది.

4. దూషీవిషం (ఔషధాదులచేత వీర్యం తగ్గించిన విషం) మదన-కోద్రవాల చూర్ణం ఇవి కలిపితే ఉపజిహ్వికాయోగం (నాలుకకు పక్షవాతం కలిగించే యోగం). మాతృవాహకం అనే పక్షి, అంజలికారం అనే ఓషధి, నెమలిపింఛం, కప్ప, అక్షి అనే చెట్టు, పీలువృక్షం వీటితో చేసిన మిశ్రణం మశూచిని కలిగిస్తుంది.

5. పంచకుష్ఠకాలు, కౌండిన్యకం అనే చెట్టు, రాజవృక్షం (ఆరగ్వధం), మధూకపుష్పం వీటి మిశ్రణం జ్వరం కలిగిస్తుంది.

6. భాసపక్షి, ముంగిస, మంజిష్ఠ అనే ఔషధం; పిప్పలి వ్రేళ్లు వీటి మిశ్రణాన్ని గాడిదపాలతో నూరితే అది మాసంలో కాని, అర్ధమాసంలో కాని మూగతనం, చెవుడు కలిగిస్తుంది. మనుష్యులకు చిన్న మోతాదు, గాడిదలకు గుఱ్ఱాలకు దానికి రెట్టింపు మోతాదు, ఏనుగులకు ఒంటెలకు నాలుగు రెట్లు మోతాదు అని వెనుక చెప్పినట్లే.

మూ. 1. భఙ్గక్వాథోపనయనమ్ ఔషధానామ్, చూర్ణం ప్రాణభృతామ్. సర్వేషాం వా క్వాథోపనయనమ్. ఏవం వీర్యవత్తరం భవతి, ఇతి యోగసంపత్.

2. శాల్మలీవిదారీధాన్యసిద్ధో మూలవత్సనాభసంయుక్తః చుచున్దరీ శోణితప్రలేపేన దిగ్ధః బాణః యం విధ్యతి, స విద్ధః అన్యాన్ దశ పురుషాన్ దశతి, తే దష్టాః దశాన్యాన్ దశన్తి పురుషాన్.

3. భల్లాతకయాతుధానాపామార్గబాణానాం పుష్పైః ఏలకాక్షిగుగ్గులు హాలాహలానాం చ కషాయం బస్తనరశోణితయుక్తం దంశయోగః. తతో ఽర్ధధరణికో యోగః సక్తుపిణ్యాకాభ్యాముదకే ప్రణీతః ధనుః శతాయామముదకాశయం దూషయతి. మత్స్యపరమ్పరాహ్యేతేన దష్టా అభిమృష్టా వా విషీభవతి, యశ్చైతదుదకం పిబతి స్పృశతి వా.

వ్యా. 1. పైన చెప్పిన యోగాలలో కొన్ని ఓషధులు (చెట్లు, మొక్కలు, తీగలు, మొ.), కొన్ని ప్రాణులు చెప్పబడినవి. వాటిలో ఓషధుల ముక్కల కషాయం ప్రాణుల చూర్ణం ఉపయోగించాలి. లేదా అన్నింటితోను కషాయం తయారు చేయిస్తే దాని వీర్యం అధికంగా ఉంటుంది. ఇది యోగసంపద.

2. బూరుగ గింజలు, విదారీ అనే చెట్టు గింజలు, ధనియాలు వీటితో సిద్ధం చేయబడినది (అనగా వీటిని నూరి దానిని పైన అంటించినది), పిప్పలి వ్రేళ్లతోను వత్సనాభం అనే విషంతోను కూడిన బాణానికి చుంచురక్తం పూసిన ట్లయితే ఆ బాణం తగిలి గాయపడ్డవాడు ఇతరులను పదిమందిని కరుస్తాడు. ఆ పదిమంది ఒక్కొక్కరు పదేసిమందిని కరుస్తారు.

3. భల్లాతక-యాతుధాన-అపామార్గ-బాణవృక్షాల పుష్పాలతోను, ఏలకులు, అక్షి అనే చెట్టు గింజలు, గుగ్గులు, హాలాహలం అనే వాటితోను కషాయం తయారుచేసి

దానిలో మేకనెత్తురు మనిషినెత్తురు కలిపితే అది 'దంశయోగం' (కరిచే టట్లు చేసే యోగం). ఆ యోగంనుంచి ధరణికం ప్రమాణంలో సగం ప్రమాణం గల యోగం తీసి దానితో పేలాల పిండి, తెలకపిండి కలిపి నీటిలో కలిపితే అది నూరు ధనస్సుల వైశాల్యం ఉన్న జలాశయాన్ని కలుషితం చేస్తుంది. దీనిచేత కరవబడిన అనగా ఈ నీరు త్రాగిన, లేదా ఈ నీరు స్పృశించిన చేపల పరంపర విషం అయిపోతుంది. ఉదకం త్రాగినవాడు, స్పృశించినవాడూ కూడ విషం అయిపోతాడు.

మూ.1. రక్తశ్వేతసర్షపైః గోధాత్రిపక్షముష్టికాభ్యాం భూమౌ నిఖాతాయాం నిహితా వధ్యేనోద్ధృతా యావత్ పశ్యతి తావన్మారయతి. కృష్ణః సర్పో వా.

2. విద్యుత్ప్రదగ్ధః అఙ్గారః అజ్వాలో వా విద్యుత్ప్రదగ్ధైః కాష్ఠైః గృహీతశ్చ అనువాసితః కృత్తికాసు భరణీషు వా రౌద్రేణ కర్మణా అభిహుతః అగ్నిః ప్రణీతశ్చ నిష్ప్రతీకారో దహతి.

వ్యా. 1. ఉడుమును (ఉడుము శరీరాన్ని) మట్టిమూకుడులో ఎఱ్ఱ ఆవాలతోను తెల్ల ఆవాలతోను, ఉంచి, ఆ మూకుడు మూడు పక్షాలపాటు (నలభైఐదు రోజులు) భూమిలో పాతిపెట్టగా, వధ్యుడు (ఎవనినైతే చంపా లనుకుంటారో వాడు) దానిని పైకి తీసి చూసీ చూడగానే మరణిస్తాడు. ఉడుముకు బదులు నల్లత్రాచు శరీరం ఉంచవచ్చు.

2. పిడుగు పడి కాలిన బొగ్గులను, పిడుగు పడి కాలిన కట్టెలతో తీసి ప్రజ్వలింప చేసి ఆ అగ్ని కృత్తికానక్షత్రం ఉన్న రోజున గాని, భరణీనక్షత్రం ఉన్న రోజున గాని రుద్రుడు దేవతగా గల కర్మచేత (అనగా రుద్రునికి ప్రీతికరములైన మంత్రాలు పఠిస్తూ చేసిన కర్మచేత హోమాదులు చేసి) ఆ అగ్నిని శత్రుదుర్గంలోనికి పంపుతే దానికి ఎలాంటి ప్రతిక్రియా చేయడం కుదరదు; అది అడ్డు లేకుండా కాల్చివేస్తుంది.

శ్లో. కర్మారాదగ్నిమాహృత్య క్షౌద్రేణ జుహుయాత్ పృథక్,
సురయా శౌణ్డికాదగ్నిం మార్గతోఽగ్నిం ఘృతేన చ.
మాల్యేన చైకపత్న్యగ్నిం పుంశ్చల్యగ్నిం చ సర్షపైః,
దధ్నా చ సూతికాస్వగ్నిమాహితాగ్నిం చ తణ్డులైః.
చణ్డాలాగ్నిం చ మాంసేన చితాగ్నిం మానుషేణ చ,

సమస్తాన్ వస్తవసయా మానుషేణ ధ్రువేణ చ.
జుహుయాదగ్నిమన్త్రేణ రాజవృక్షకదారుభిః,
ఏష నిష్ప్రతికారోఽగ్నిర్ద్విషతాం నేత్రమోహనః.

అదితే! నమస్తే! అనుమతే! నమస్తే! సరస్వతి నమస్తే, దేవసవితః! నమస్తే, అగ్నయే స్వాహా; సోమాయ స్వాహా; భూః స్వాహా; భువః స్వాహా.

ఇతి కౌటలీయార్థశాస్త్రే ఔపనిషదికే చతుర్దశాధికరణే ప్రథమోఽధ్యాయః పరఘాతయోగః; ఆదితః షట్చత్వారింశదుత్తరశతతమః.

వ్యా. కంచరివానినుంచి అగ్ని తీసికొని వచ్చి దానిలో తేనెతో హోమం చేసి దానిని వేరుగా ఉంచాలి. కల్లు అమ్మేవానినుంచి అగ్ని తీసికొనివచ్చి దానిలో కల్లుతో హోమం చేసి దానిని, మార్గంనుండి అగ్నిని తీసికొనివచ్చి నేతితో హోమం చేసి దానిని, పతివ్రతనుండి అగ్నిని తీసికొనివచ్చి దానిలో పుష్పమాలలతో హోమం చేసి దానిని, కులట ఇంటినుండి తీసికొనివచ్చిన అగ్నిలో ఆవాలతో హోమం చేసి దానిని, పురిటింటి నుంచి తీసికొని వచ్చిన అగ్నిలో పెరుగుతో హోమం చేసి, దానిని, ఆహితాగ్నినుండి తీసికొనివచ్చిన అగ్నిలో బియ్యంతో హోమం చేసి దానిని, చండాలునినుండి తీసికొని వచ్చిన అగ్నిలో మాంసాలతో హోమం చేసి దానిని, చితాగ్నిలో మనుష్యమాంసం హోమం చేసి దానినీ, వేరుగా ఉంచాలి. వేరు వేరుగా ఉంచిన ఆ తొమ్మిది అగ్నులూ కలిపి, అగ్నిమంత్రాలతో, మేకవస, మనిషి మాంసం లేదా రక్తం, రాజవృక్షం సమిధలు వీటితో హోమం చెయ్యాలి. ఈ అగ్నిని శత్రువుల దుర్గంలోనికి పంపితే దానికి ప్రతిక్రియ ఏదీ ఉండదు. ఆ అగ్నిని చూచినవాళ్లకు మోహం (మూర్ఛ) కూడ కలుగుతుంది.

హోమాలు చేసేటప్పుడు "అదితే! నమస్తే" ఇత్యాదిమంత్రాలు పఠించా లని ఆ మంత్రాలలోని కొన్ని వాక్యాలు ఇక్కడ చూపబడ్డాయి.

"బాలానందిని" అను కౌటలీయార్థశాస్త్రాంధ్రవ్యాఖ్యానంలో ఔపనిషదికం అనే పద్నాల్గవ అధికరణంలో పరఘాతప్రయోగం అనే ప్రథమాధ్యాయం, ప్రారంభంనుంచి నూట నలభైఆరవ అధ్యాయం సమాప్తం.

# అథ ద్వితీయోఽధ్యాయః

## అష్టసప్తతిశతతమం ప్రకరణమ్ ప్రలమ్భనమ్. తత్ర అద్భుతోత్పాదనమ్

(మోసగించడంలో అద్భుతాలను సృష్టించడం)

మూ. 1. శిరీషోదుమ్బరశమీచూర్ణం సర్పిషా సంహృత్య అర్ధమాసి క క్షుద్యోగః.

2. కశేరుకోత్పలకన్దేక్షుమూలబిసదూర్వాక్షీరఘృతమణ్డసిద్ధః మాసికః.

3. మాషయవకులత్థదర్భమూలచూర్ణం వా క్షీరఘృతాభ్యాం, వల్లీక్షీరఘృతం వా సమసిద్ధం సాలపృశ్నిపర్ణీమూలకల్కం పయసా పీత్వా, పయో వా తత్సిద్ధం మధుఘృతాభ్యామ్ అశిత్వా మాసముపవసతి.

4. శ్వేతబస్తమూత్రే సప్తరాత్రోషితైః సిద్ధార్థకైః సిద్ధం తైలం కటుకాలాబౌ మాసార్ధమాసస్థితం చతుష్పద్ద్విపదానాం విరూపకరణమ్.

5. తక్రయవభక్షస్య సప్తరాత్రాదూర్ధ్వం శ్వేతగర్దభస్య లణ్డయవైః సిద్ధం గౌరసర్షపతైలం విరూపకరణమ్.

వ్యా. 1. శిరీషవృక్షం, ఉదుంబరవృక్షం, జమ్మిచెట్టు వీటి చూర్ణం నేతితో కలిపి సేవిస్తే పదిహేను రోజులపాటు ఆకలి ఉండదు.

2. కశేరుకం (వృష్యకందం), కలవదుంప, చెరుకు వ్రేళ్లు, తామరతూడు, దూర్వలు, పాలు, నెయ్యి, మీగడ వీటితో తయారుచేసినది ఒక మాసం పాటు ఆకలి లేకుండా చేస్తుంది.

3. మినుములు, యవలు, ఉలవలు, దర్భల వ్రేళ్లు వీటి చూర్ణం పాలతోను నేతితోను సేవించినా, వల్లి, పాలు, నెయ్యి సమానమైన పాళ్లలో ఉడికించి సేవించినా, మద్దిచెట్టు, పృశ్నిపర్ణిచెట్టు వేళ్లు వీటి కల్కాన్ని (ఉడికించి తయారు చేసిన ముద్దగా ఉండే పదార్థం) పాలతో సేవించినా, లేదా ఆ కల్కాన్ని పాలలో ఉడికించి దానిని తేనెతోను నేతితోను సేవించినా ఒక మాసం పాటు ఆహారం లేకుండా ఉండగలడు.

4. తెల్లమేక మూత్రంలో ఏడు రోజులు నాననిచ్చిన తెల్ల ఆవాలనుండి తీసిన నూనెను చేదు ఆనపకాయ బుఱ్ఱలో మాసం కాని అర్ధమాసం కాని ఉంచి వాడితే అది

నాలుగు కాళ్ల జంతువులకు మనుష్యులకు వికృతరూపం కలిగిస్తుంది.

5. మజ్జిగ యవలు ఏడు రోజులు భక్షించినవాడు ఏడు రోజుల తరవాత, తెల్లగాడిద లద్దెలు యవలు వేసి నానబెట్టిన తెల్ల ఆవాల నుండి తీసిన తైలం సేవిస్తే వికృతరూపం కలుగుతుంది.

మూ. 1. ఏతయో రన్యతరస్య మూత్రలణ్డరససిద్ధం సిద్ధార్థకతైలమ్ అర్కతూలపతఙ్గచూర్ణప్రతివాపం శ్వేతీకరణమ్.

2. శ్వేతకుక్కుటాజగరలణ్డయోగః శ్వేతీకరణమ్.

3. శ్వేతబస్తమూత్రే శ్వేతసర్షపాః సప్తరాత్రోషితాః తక్రమ్, అర్కక్షీరమ్, అర్కతూలకటుకమత్స్యవిలఙ్గాశ్చ. ఏష పక్షస్థితో యోగః శ్వేతీకరణమ్.

4. సముద్రమణ్డూకీశఙ్ఖసుధాకదలీక్షారతక్రయోగః శ్వేతీకరణమ్.

5. కదల్యవల్గుజక్షారరసశుక్తాః సురాయుక్తాః తక్రార్కతూలస్నుహి లవణం ధాన్యామ్లం చ పక్షస్థితో యోగః శ్వేతీకరణమ్.

6. కటుకాలాబౌ వల్లీగతే నగరమర్ధమాసస్థితం గౌరసర్షపపిష్టం రోమ్ణాం శ్వేతీకరణమ్.

7. శ్లో. అర్కతూలోఽర్జునే కీటః శ్వేతా చ గృహగౌలికా,
ఏతేన పిష్టేనాభ్యక్తాః కేశాః స్యుః శఙ్ఖపాణ్డరాః.

వ్యా. 1. తెల్లమేకయొక్క లేదా తెల్ల గాడిదయొక్క మూత్ర-మలాల రసంలో ఉంచి సిద్ధం చేసిన తెల్ల ఆవాల తైలంలో జిల్లేడు దూది పతంగాలు వీటి చూర్ణం కలిపితే అది మనిషిని తెల్లగా చేస్తుంది.

2. తెల్లకోడి, కొండచిలువ- వీటి మలాలతో చేసిన యోగం (మిశ్రణం Mixture) తెల్లగా చేస్తుంది.

3. తెల్ల ఆవాలు, మజ్జిగ, జిల్లేడు పాలు, జిల్లేడు దూది, పొట్లకాయ, మత్స్యం, విరంగం అనే ఓషధి ఇవి తెల్ల మేక పాలలో ఏడు రోజులు ఉంచాలి. ఇది ఒక పక్షం వరకు ఉంచుతే శ్వేతీకరణయోగం.

4. సముద్రంలో ఉండే ఆడ కప్ప, శంఖం, సున్నం, అరటి మొదలు కాల్చగా వచ్చే తెల్లని క్షారం, మజ్జిగ వీటి యోగం కూడ తెల్లదనం కలిగిస్తుంది.

5. అరటిచెట్టు నుండి అవల్గు అనే చెట్టునుండి వాటి దుంపలు మాడ్చి తీసిన క్షారం, పాదరసం, ముత్యపు చిప్ప వీటిని కల్లుతో కలిపినా, మజ్జిగ, జిల్లేడు దూది, స్నుహి, లవణం, ధాన్యామ్లం అనగా గంజి ఇవి కలిపి పదిహేనురోజులు నానబెట్టినా ఈ రెండు యోగాలు శ్వేతీకరణయోగాలు.

6. కోయకుండా తీగయందే ఉన్న చేదు అనపకాయ బుఱ్ఱలో పదిహేను రోజులు ఉంచిన శొంఠి, తెల్ల ఆవాల పిష్టం ఇది జుట్టు తెల్లగా చేస్తుంది.

7. జిల్లేడు దూది, అర్జునవృక్షంమీద పుట్టే పురుగులు, తెల్లని బల్లి వీటిని నూరి ఆ పిష్టం కేశాలకు పట్టిస్తే అవి శంఖం వలె తెల్లగా అవుతాయి.

మూ. 1. గోమయేన తిన్దుకారిష్టకల్కేన వా మర్దితాఙ్గస్య భల్లాతకరసాను లిప్తస్య మాసికః కుష్ఠరోగః.

2. కృష్ణసర్పముఖే, గృహగౌలికాముఖే వా సప్తరాత్రోషితాః గుఞ్జాః కుష్ఠయోగః.

3. శుకపిత్తాణ్డరసాభ్యఙ్గః కుష్ఠయోగః.

4. కుష్ఠస్య ప్రియాలకల్కకషాయః ప్రతీకారః.

5. కుక్కుటీ కోశాతకీ శతావరీ మూలయుక్తమాహారమాణః మాసేన గౌరో భవతి.

6. వటకషాయస్నాతః సహచరకల్కదిగ్ధః కృష్ణో భవతి.

7. శకునకఙ్గుతైలయుక్తాః, మరితాలమనఃశిలాః శ్యామీకరణమ్.

8. ఖద్యోతచూర్ణం సర్షపతైలయుక్తం రాత్రౌ జ్వలతి.

వ్యా. 1. గోమయంచేత గాని, తిందుకం అనే చెట్టు అరిష్టంయొక్క కల్కంచేత గాని శరీరం మర్దించిన తరవాత భల్లాతరసం పూస్తే అది ఒక మాసంలో కుష్ఠరోగం కలిగించే యోగం.

2. త్రాచుపాము నోటిలో గాని, బల్లి నోటిలో కాని ఏడు రోజులు ఉంచిన గులివెంత గింజలు కుష్ఠయోగం.

3. చిలుక పొట్టలో ఉండే పిత్తాన్ని దాని గ్రుడ్లలోని రసాన్ని శరీరానికి పూస్తే అది కుష్ఠయోగం.

4. ప్రియాలవృక్షపు కల్కంయొక్క కషాయం కుష్ఠానికి ప్రతిక్రియ.

5. కుక్కుటి, కోశాతకి, శతావరి అనే మొక్కల దుంప ఉన్న ఆహారం తినేవాడు ఒక మాసంలో తెల్లగా అవుతాడు.

6. మఙ్జిచెట్టుకషాయంతో స్నానం చేసి సహచరం అనే చెట్టు కల్కం శరీరానికి పూసుకొనేవాడు నల్లబడతాడు.

7. శకునతైలం కంగుతైలం కలిపిన హరితాలం మనఃశిలా చామనచాయ కలిగిస్తాయి.

8. ఆవనూనెలో కలిపిన మినుగుడు పురుగుల చూర్ణం రాత్రి ప్రకాశిస్తుంది (మండుతుంది).

మూ. 1. ఖద్యోతగణ్డూపదచూర్ణం సముద్రజన్తూనాం భృఙ్గకపాలానాం ఖదిరకర్ణికారాణాం పుష్పచూర్ణం వా శకునకఙ్గుతైలయుక్తం తేజనచూర్ణమ్, పారిభద్రకత్వఙ్మషీమణ్డూకవసయా యుక్తా గాత్రప్రజ్వాలనమగ్నినా.

2. పారిభద్రకత్వగ్వ్రజకదలీతిలకల్కప్రదిగ్ధం శరీరమగ్నినా జ్వలతి.

3. పీలుత్వఙ్మషీమయః పిణ్డః హస్తే జ్వలతి. మణ్డూకవసాదిగ్ధః అగ్నినా జ్వలతి.

4. తేన ప్రదిగ్ధమఙ్గం కుశామ్రఫలతైలసిక్తం సముద్రమణ్డూకీఫేన సర్జరసచూర్ణయుక్తం వా జ్వలతి.

5. మణ్డూకవసాసిద్ధేన పయసా, కులీరాదీనాం వసయా సమభాగం తైలం సిద్ధమభ్యఙ్గో గాత్రాణామగ్నిప్రజ్వాలనమ్. మణ్డూకవసాదిగ్ధః అగ్నినా జ్వలతి.

వ్యా. 1. మినుగుడు పురుగు, గండూపదం అనే పురుగు వీటి చూర్ణంతోను సముద్ర-జంతు-భృంగ-కపాల-ఖదిర-కర్ణికారవృక్షాల పువ్వుల చూర్ణంతోను, శకున-కంగుతైలం కలిపితే అది తేజనచూర్ణం. (అది పూస్తే ఆ వస్తువు చీకట్లో ప్రకాశిస్తుంది అని అర్థం). పారిభద్రకవృక్షం బెరడు కాల్చి తీసిన మసితో కప్ప వస కలిపితే అది అగ్నిచేత అవయవాలు మండే టట్లు చేస్తుంది. అనగా అది ఏ అవయవానికి పూసికొని నిప్పు అంటిస్తారో ఆ అవయవం కాలకుండానే మంటలు వస్తాయి.

2. శరీరానికి పారిభద్రకవృక్షం బెరడు, వజ్రం (శ్రీబేరం), అరటిచెట్టు, నువ్వులు వీటి కల్కం పూసి నట్టయితే పీడ లేకుండా అగ్నిచేత కాలుతుంది (మంటలు వస్తాయి).

3. పీలుచెట్టు బెరడు కాల్చి తీసిన మసి ముద్ద చేతిలో పెట్టుకొని కాల్చవచ్చు. ఆ ముద్దకి కప్ప వస పూస్తే అది అగ్నికి మండుతుంది.

4. పైన చెప్పిన ముద్ద శరీరానికి పూసికొని కుశలనుండి మామిడిపండ్లనుండి తీసిన తైలంతో తడిపినా, లేదా సముద్రంలోని ఆడ కప్ప, నురుగు, సర్జరసం వీటి చూర్ణంతో కలిపినా అది మండుతుంది.

5. కప్ప వసతో ఉడికించిన పాలతోను, పీతలు మొదలైనవాటి వస కలిపిన పాలతోను తైలం సమానమైన పాళ్లలో కలిపి తయారు చేసిన అభ్యంగం (శరీరానికి పూసుకొనే పదార్థం) అవయవాలమీద అగ్నిని ప్రజ్వలింపచేస్తుంది. దానికి కప్ప వస పూస్తే అగ్నికి మండుతుంది.

మూ. 1. వేణుమూలశైవలలిప్తమఙ్గం మణ్డూకవసాదిగ్ధమగ్నినా జ్వలతి.

2. పారిభద్రకప్రతిబలావఞ్జులవజ్రకదలీమూలకల్కేన మణ్డూకవసాదిగ్ధేన తైలేనాభ్యక్తపాదః అఙ్గారేషు గచ్ఛతి.

3.శ్లో. ఉపోదకా ప్రతిబలా వఞ్జులః పారిభద్రకః,
ఏతేషాం మూలకల్కేన మణ్డూకవసయా సహ,
సాధయే త్తైలమేతేన పాదావభ్యజ్య నిర్మలౌ,
అఙ్గారరాశౌ విచరేద్యథా కుసుమసంచయే.

4. హంసక్రౌఞ్చమయూరాణామ్ అన్యేషాం వా మహాశకునీనామ్ ఉదకప్లవానాం పుచ్ఛేషు బద్ధా నలదీపికా రాత్రావుల్కాదర్శనమ్.

5. వైద్యుతం భస్మ అగ్నిశమనమ్.

6. స్త్రీపుష్పపాయితా మాషాః వ్రజకులీమూలం మణ్డూకవసా మిశ్రం చుల్ల్యాం దీప్తాయామపాచనమ్. చుల్లీశోధనం ప్రతీకారః.

వ్యా. 1. వెదురు మొదళ్లతోను, నాచుతోను పూసిన శరీరానికి కప్ప వస పూసినట్లయితే అది అగ్నిచేత మండుతుంది.

2. పారిభద్రక - ప్రతిబలా - వంజుల - వజ్ర - కదలీతరువుల మొదళ్ల కల్కం చేత, కప్పల వస పూసిన తైలంచేత పాదాలు పూసుకొన్నవాడు కణకణలాడుతున్న నిప్పులమీద నడుస్తాడు.

3. ఉపోదక, ప్రతిబల, వంజులం, పారిభద్రకం వీటి మొదళ్లతో తయారు చేసిన కల్కం తోను, కప్పల వసతోను (ఇవి కలిపిన) తైలం తయారు చేసికొని, శుభ్రంగా ఉన్న పాదాలకు ఆ తైలం పూసుకొన్నవాడు పుష్పరాశిమీద నడచినట్లు కణకణలాడుతున్న నిప్పుల రాశిమీద నడవకలుగుతాడు.

4.నలం అనే గడ్డికి నిప్పు అంటించి రాత్రులందు హంసలు, క్రౌంచపక్షులు, నెమళ్లు, నీళ్లల్లో తిరిగే ఇతరమైన పెద్ద పక్షులు - వీటి తోకలకు కట్టి నట్లయితే అది ఉల్కవలె కనబడుతుంది. ఆకాశంనుంచి ఉల్కలు (అగ్నిపిండాలు) ఎగురుతూ క్రిందపడడం అపశకునం. అందుచేత ప్రజలకు భయం కలిగిస్తుంది అని అర్థం.

5. పిడుగు పడి ఏర్పడిన భస్మం అగ్నిని శాంతింపచేస్తుంది.

6. స్త్రీల ఋతుకాలంలో స్రవించే రక్తంలో నానిన మినుములు, గోశాలలో పుట్టిన హింగుది వ్రేళ్లు, కప్ప వస కలిపి పొయ్యిలో ఉంచి నట్లయితే పొయ్యి మండుతున్నా అన్నం ఉడకదు. ఆ పొయ్యిని శుభ్రం చేయడం దీనికి ప్రతిక్రియ.

మూ. 1. పీలుమయో మణిః అగ్నిగర్భః సువర్చలామూలగ్రన్థిః సూత్రగ్రన్థిర్వా పిచుపరివేష్టితః ముఖా దగ్నిధూమోత్సర్గః.

2. కుశామ్రఫలతైలసిక్తః అగ్నిః వర్షప్రవాతేషు జ్వలతి.

3. సముద్రఫేనకః తైలయుక్తః అమ్భసి ప్లవమానో జ్వలతి.

4. ప్లవఙ్గమానామస్థిషు కల్మాషవేణునా నిర్మథితోఽగ్నిః నోదకేన శామ్యతి, ఉదకేన చ జ్వలతి.

5. శస్త్రహతస్య శూలప్రోతస్య వా పురుషస్య వామపార్శ్వపర్శుకాస్థిషు కల్మాష వేణునా నిర్మథితోఽగ్నిః, స్త్రియాః పురుషస్య వా అస్థిషు మనుష్యపర్శుకయా నిర్మథితోఽగ్నిః యత్ర త్రిరపసవ్యం గచ్ఛతి న చాత్ర అన్యోఽగ్నిర్జ్వలతి.

6. శ్లో. చుచున్దరీ ఖఞ్జరీటీ ఖారకీటశ్చ పిష్యతే,
అశ్వమూత్రేణ సంసృష్టా నిగలానాం తు భఞ్జనమ్.

7. అయస్కాన్తో వా పాషాణః కులీరదర్దురఖారకీటవసాప్రదేహేన ద్విగుణః.

వ్యా. 1. పీలుచెట్టు కఱ్ఱతో చేసిన ఒక మణి (గుండ్రని బంతివంటి వస్తువు) లో అగ్ని ఉంచి దానికి చుట్టూ సువర్చల వేళ్లు గాని, దారం గాని చుట్టి దానిపైన దూది చుట్టిన ట్లయితే దాని సహాయంతో ముఖం నుంచి అగ్నినీ ధూమాన్నీ పైకి విడవవచ్చు.

2. అగ్నిని కుశల తైలంతోను, మామిడిపండ్ల తైలంతోను తడిపితే అది వర్షంలోను అత్యధికమైన గాలిలోనూ కూడ ప్రజ్వలిస్తుంది.

3. తైలంతో కూడిన సముద్రపు నురుగు నీటిలో తేలుతూ మండుతుంది.

4. కోతుల ఎముకలమీద చుక్క లున్న వెదురు కఱ్ఱతో రాసి, మథించి, పుట్టించిన అగ్ని నీళ్లు పోసినా శాంతించదు. నీళ్లు పోస్తే మండుతుంది.

5. శస్త్రంచేత చంపబడినవానియొక్క గాని, శూలానికి గ్రుచ్చి చంపబడిన వానియొక్క గాని ఎడమ ప్రక్కల ఎముకలమీద చుక్క లున్న వెదురుకఱ్ఱతో మథించి పుట్టించిన అగ్ని గాని, స్త్రీయొక్క లేదా పురుషునియొక్క ఎముకలమీద మనిషి పక్క ఎముకలచేత మథించి తీసిన అగ్నిగాని ఎక్కడైతే అప్రదక్షిణంగా మూడుసార్లు త్రిప్పబడుతుంతో అక్కడ మరొక అగ్ని మండదు.

6. చుంచు, కాటుకపిట్ట, ఊషరభూమిలో పుట్టిన ఒక రకమైన పురుగు వీటిని అశ్వమూత్రంతో కలిపి నూరి దానిని పట్టించిన ట్లయితే సంకెళ్లు తెగిపోతాయి.

7. లేదా పీత, కప్ప, ఖారకీటం - వీటి వస పూయడంచేత రెట్టింపు బలంగల అయస్కాంతపురాయి సంకెళ్లను తెగగొడుతుంది.

మూ. దారకగర్భః కఙ్కభాసపార్శ్వోత్పలోదకపిష్టః చతుష్పద ద్విపదానాం పాదలేపః. ఉలూకగృధ్రవసాభ్యామ్ ఉష్ట్రచర్మోపానహావభ్యజ్య వటపత్త్రైః ప్రతిచ్ఛాద్య పఞ్చాశద్యోజనాన్యశ్రాన్తో గచ్ఛతి. శ్యేనకఙ్క కాకగృధ్రహంసక్రౌఞ్చవీచిరల్లానాం మజ్జానో రేతాంసి వా యోజనశతాయ. సింహవ్యాఘ్రద్వీపికాకోలూకానాం మజ్జానో రేతాంసి వా సార్వవర్ణికాని గర్భపతనాని. ఉష్ట్రికాయామ్ అభిషూయ శ్మశానే ప్రేతశిశూన్వా తత్సముత్థితం మేదో యోజనశతాయ.

వ్యా. గర్భస్రావం చేయించి బైటకు తీసిన అవుదూడ (కాంగ్లే) పంది గర్భపిండాన్ని కంక - భాసపక్షుల ప్రక్క ఎముకలను పద్మాలను (కాంగ్లే. ఒకానొక చేపను గ.శా) నీళ్లతో పిష్టంగా చేసి నట్లయితే అది నాలుగు కాళ్ల జంతువులకు మనుష్యులకు కూడ పాదలేపంగా ఉపయోగిస్తుంది. ఒంటె చర్మతో తయారుచేసిన చెప్పులకు గుడ్ల గూబ వస, గ్రద్ద వస పూసి, మఱ్ఱి ఆకులతో కప్పిన ట్లయితే ఆ పాదుకలను ధరించినవాడు ఏమీ అలసట లేకుండా యాభై మైళ్లు నడుస్తాడు. ఆ చెప్పులకు డేగ, కంకం, కాకి, గ్రద్ద, హంస, క్రౌంచపక్షి, వీచిరల్లపక్షి - వీటి కొవ్వులను గాని, రేతస్సులను గాని పూసినట్లయితే నూరు యోజనాలు అనాయాసంగా నడవకలుగుతాడు. లేదా సింహం, పెద్దపులి, చిరుతపులి, కాకి, గుడ్లగూబ వీటి వసలను గాని, రేతస్సులను గాని పూసినా, లేదా అన్ని వర్ణాలవాళ్లకీ చెందిన గర్భపాతాలనుండి గాని శ్మశానంలో పాతిపెట్టిన శిశువులనుండి గాని ఉష్ట్రికలోనికి (ఒకరకమైన మట్టి పాత్ర, ఒంటె ఆకారంలో ఉండేది) వాటి సారం తీసి దానినుండి వచ్చిన కొవ్వును పాదుకలకు పూసినా కూడ అనాయాసంగా నూరు యోజనాల దూరం నడవగలడు.

శ్లో. అనిష్టైరద్భుతోత్పాతైః పరస్యోద్వేగమాచరేత్,
ఆరాజ్యాయేతి నిర్వాదః సమానః కోప ఉచ్యతే.

ఇతి కౌటలీయార్థశాస్త్రే ఔపనిషదికే చతుర్దశాధికరణే ద్వితీయోఽధ్యాయః,
ప్రలమ్భనే అద్భుతోత్పాదనమ్, ఆదితః సప్తచత్వారింశచ్ఛతతమః.

వ్యా. ఈ విధంగా అనిష్టం సూచించే ఆశ్చర్యకరాలైన ఉత్పాతాలచేత (దుఃశకునాలచేత) శత్రువు మనస్సులో దిగులు పుట్టించాలి. ఆ రాజ్యం లభించే వరకూ ఇలా చెయ్యాలి. నిందితమైనదైన ఈ విధానం రాజ్యంలో ప్రకోపం వచ్చి నప్పుడు కూడ అనుసరించాలి.

"బాలానందిని" అనే కౌటలీయార్థశాస్త్రాంధ్రవ్యాఖ్యానంలో ఔపనిషదికం అనే పద్నాల్గవ అధికరణంలో 'ప్రలంభనే అద్భుతోత్పాదనం' అనే రెండవ అధ్యాయం, ప్రారంభంనుంచి నూటనలభై ఏడవ అధ్యాయం సమాప్తం.

# అథ తృతీయోऽధ్యాయః

## అష్టసప్తతిశతతమం ప్రకరణమ్ - ప్రలమ్భనమ్. తత్ర భైషజ్యమన్త్రప్రయోగః

(వైద్యమంత్రాల ప్రయోగం)

మూ. 1. మార్జారోష్ట్రవృకవరాహశ్వావిద్వాగులీనప్తృకాకోలూకానామ్ అన్యేషాం వా నిశాచరాణాం సత్త్వానామేకస్య ద్వయోర్బహూనాం వా దక్షిణాని వామాని వాక్షీణి గృహీత్వా ద్విధా చూర్ణం కారయేత్. తతో దక్షిణం వామేన వామం దక్షిణేన సమభ్యజ్య రాత్రౌ తమసి చ పశ్యతి.

2. శ్లో. ఏకామ్లకం వరాహాక్షి ఖద్యోతః కాలశారిబా,
ఏతేనాభ్యక్తనయనో రాత్రౌ రూపాణి పశ్యతి.

3. త్రిరాత్రోపోషితః పుష్యే శస్త్రహతస్య శూలప్రోతస్య వా పుంసః శిరఃకపాలే మృత్తికాయాం యవానావాస్య అవిక్షీరేణ సేచయేత్. తతో యవవిరూఢమాలామాబధ్య నష్టచ్ఛాయారూపః చరతి.

4. త్రిరాత్రోపోషితః పుష్యేణ శ్వమార్జాలోలూకవాగులీనాం దక్షిణాని వామాని చాక్షీణి ద్విధా చూర్ణం కారయేత్. తతః యథాస్వమభ్యక్తాక్షః నష్టచ్ఛాయారూపః చరతి.

5. త్రిరాత్రోపోషితః పుష్యేణ పురుషఘాతినః కాణ్టకస్య శలాకామ్ అఞ్జనీం చ కారయేత్. తతః అన్యతమేన అక్షిచూర్ణేన అభ్యక్తాక్షః నష్టచ్ఛాయారూపశ్చరతి.

వ్యా. 1. పిల్లి, ఒంటె, తోడేలు, పంది, ముళ్లపంది, గులీనం అనే పక్షి, విష్కిరం అనే పక్షి, కాకి, గుడ్లగూబ వీటియొక్క, రాత్రులందు సంచరించే ఇతర జంతువులయొక్క, ఒకదానియొక్క కాని, రెండింటియొక్క గాని, చాలావాటియొక్క గాని కుడి కళ్లు ఎడమ కళ్లు గ్రహించి వాటిని వేరు వేరుగా చూర్ణం చేయించాలి. తరవాత కుడి కన్నుకు ఎడమ కళ్ల చూర్ణం, ఎడమకంటికి కుడికళ్ల చూర్ణం పెట్టుకున్నట్లయితే రాత్రి, చీకట్లోను చూడకలుగుతాడు.

2. ఒక నిమ్మకాయ, పంది కన్ను, మినుగుడు పురుగు, నల్లగా ఉండే భద్ర అనే ఓషధి దీనిని (వీటిచూర్ణం) కంటికి పూసికొన్నవాడు రాత్రి రూపాలు చూడ కలుగుతాడు.

3. మూడు రోజులు ఉపవాసం ఉండి పుష్యనక్షత్రంరోజున ఆయుధంచేత చచ్చినవానియొక్క లేదా శూలానికి గుచ్చబడినవానియొక్క తల పుఱ్ఱెలో మట్టి వేసి, యవలు చల్లి వాటిమీద గొఱ్ఱె పాలు చల్లాలి. తరవాత యవల అంకురాల మాలను ధరించినట్లయితే నీడకాని రూపం కాని ఎవరికీ కనబడకుండా సంచరించకలుగుతాడు.

4. మూడు రోజు ఉపవాసం ఉండి పుష్యమీనక్షత్రం రోజున కుక్క, పిల్లి, గుడ్లగూబ, వాగులి పక్షి, వీటి ఎడమ కళ్లను కుడికళ్లను వేరు వేరుగా చూర్ణం చేయించాలి. తరువాత ఎడమ కంటికి ఎడమ కళ్ల చూర్ణం, కుడి కంటికి కుడి కళ్ల చూర్ణం పట్టించుకొన్నవాడు నీడగాని రూపం గాని ఎవరికీ కనబడకుండా సంచరించ కలుగుతాడు.

5. మూడు రాత్రులు ఉపవాసం ఉండి పుష్యనక్షత్రం రోజున పురుషుణ్ణి చంపిన బాణంతో కాటుకపుల్లను, అంజనం పట్టించే పాత్రనూ చేయించాలి(గ.శా.). పురుషుణ్ణి చంపినవాని తొడ ఎముకతో కాటుక పుల్ల, అంజనపాత్ర చేయించాలి (కాంగ్లే). తరవాత పైన చెప్పిన నేత్రచూర్ణాలలో ఒకదానిని కళ్లకు పూసికొన్నవాడు నీడ గాని రూపం గాని ఎవరికీ కనబడకుండా సంచరిస్తాడు.

మూ. 1. త్రిరాత్రోపోషితః పుష్యేణ కాలాయసీం ఆఞ్జనీం శలాకాం చ కారయేత్. తతో నిశాచరాణాం సత్త్వానామన్యతమస్య శిరః కపాలమఞ్జనేన పూరయిత్వా, మృతాయాః స్త్రియాః యోనౌ నివేశ్య దాహయేత్. తమఞ్జనం పుష్యేణోద్ధృత్య తస్యామఞ్జన్యాం నిదధ్యాత్. తేనాభ్యక్తాక్షః నష్టచ్ఛాయో రూపశ్చరతి.

2. యత్ర బ్రాహ్మణమ్ ఆహితాగ్నిం దగ్ధం దహ్యమానం వా పశ్యేత్ తత్ర త్రిరాత్రోపోషితః పుష్యేణ స్వయంమృతస్య వాససా ప్రసేవం కృత్వా చితాభస్మనా పూరయిత్వా తమాబధ్య నష్టచ్ఛాయారూపశ్చరతి.

3. బ్రాహ్మణస్య ప్రేతకార్యే యా గౌః మార్యతే తస్యాః అస్థిమజ్జాచూర్ణపూర్ణాహిభస్త్రా పశూనామన్తర్ధానమ్.

4. సర్పదష్టస్య భస్మనా పూర్ణా ప్రచలాకభస్త్రా మృగాణామన్తర్ధానమ్.

5. ఉలూకవాగులీపుచ్ఛపురీషజాన్వస్థిచూర్ణపూర్ణా హి భస్త్రా పక్షిణామన్తర్ధానమ్. ఇత్యష్టావన్తర్ధానయోగాః.

వ్యా. 1. మూడు రోజులు ఉపవాసం ఉండి పుష్యమి నక్షత్రం రోజున ఇనుముతో అంజనపాత్ర, కాటుక పుడక చేయించాలి. తరవాత రాత్రులందు సంచరించే జంతువులలో ఏదైన ఒకదాని తల పుఱ్ఱెను అంజనంతో నింపి దానిని మరణించిన స్త్రీయొక్క యోనిలో ప్రవేశపెట్టి కాల్పించాలి. ఆ అంజనం పుష్యనక్షత్రం రోజున పైకి తీసి ఆ అంజనపాత్రలో ఉంచాలి. ఆ అంజనం కంటికి పూసుకొన్నవాడు నీడ గాని రూపం గాని ఇతరులకు కనబడకుండా సంచరించగలడు.

2. ఆహితాగ్ని యైన బ్రాహ్మణుణ్ణి దహించి నట్లుగాని, దహిస్తుండగా గాని ఎక్కడ చూస్తాడో అక్కడ మూడు రాత్రులు ఉపవాసం ఉండి పుష్యనక్షత్రం రోజున తనంతట తానే మరణించినవాని వస్త్రంతో సంచి కుట్టించి, దానిని ఆ బ్రాహ్మణుని చితాభస్మంతో నింపి తన దేహానికి కట్టుకొన్నవాడు నీడ కాని రూపం కాని ఇతరులకు కనబడకుండా సంచరించగలడు.

3. బ్రాహ్మణుని ప్రేతకార్యంలో ఏ గోవును చంపుతారో దాని ఎముకలలోని మజ్జయొక్క చూర్ణంతో నింపిన పాముతోలుతో చేసిన సంచి కట్టి నట్లయితే పశువులు ఇతరులకు కనబడవు.

4. పాము కరచి చనిపోయినవాని భస్మం నింపిన ప్రచలాకం అనే మృగం చర్మంతో చేసిన సంచి మృగాలను కనబడకుండా చేస్తుంది.

5. గుడ్లగూబయొక్క, వాగులీపక్షియొక్క తోక, పురీషం, కాలి ఎముక- వీటి చూర్ణంతో నింపిన పాము చర్మతో చేసిన సంచి పక్షులు కనబడకుండా చేస్తుంది. ఇవి ఎనిమిది అంతర్ధానయోగాలు.

శ్లో. బలిం వైరోచనం వన్దే శతమాయం చ శమ్బరమ్,
భణ్డీరపాకం నరకం నికుమ్భం కుమ్భమేవ చ.
దేవలం నారదం వన్దే వన్దే సావర్ణిగాలవమ్,
ఏతేషామనుయోగేన కృతం మే స్వాపనం మహత్.

వ్యా. (దొంగతనానికి వెళ్లినవాళ్లు అక్కడ ఉన్న వాళ్లందరికీ నిద్ర తెప్పించే నాలుగు యోగాలు చెప్పబోతున్నాడు. ముందుగా అన్నింటికీ సాధారణమైన మంత్రం చెపుతున్నాడు) విరోచనుని కుమారుడైన బలిచక్రవర్తికి, వందల కొలదిమాయలు గల శంబరాసురునికి, భండీరపాకునికి, నికుంభ-కుంభులకు, దేవల-నారదులకు, సావర్ణిగాలవునికి నమస్కరిస్తున్నాను. వీళ్ల అనుమతితో నీకు గొప్ప నిద్ర తెప్పిస్తున్నాను.

శ్లో. యథా స్వపన్త్యజగరాః స్వపన్త్యపి చ మూఖలాః,
తథా స్వపన్తు పురుషాః యే చ గ్రామే కుతూహలాః.

వ్యా. గ్రామంలో ఉన్న పురుషులు, వేడుక గలవారు (వేడుకతో నాటకాదులు చూస్తూ మేల్కొని ఉండేవాళ్లు) కొండ చిలువలు ఎలా నిద్రిస్తాయో, చమూఖలాలు ఎలా నిద్రిస్తాయో ఆ విధంగా నిద్రించెదరుగాక.

శ్లో. భణ్డకానాం సహస్రేణ రథనేమిశతేన చ,
ఇమం గృహం ప్రవేక్ష్యామి తూష్ణీమాసన్తు భణ్డకాః.

వ్యా. నేను అపహరించిన ధనం తీసికొని వెళ్లడానికి ఉపయోగించే వేయి పాత్రలతోను, వంద రథచక్రాంతములతోను ఈ గృహంలో ప్రవేశిస్తున్నాను. ధన పాత్రలు నిఃశబ్దాలుగా ఉండుగాక. నేను ఎంత హడావుడి చేసినా ఎవరికీ మెలకువ రాకుండుగాక అని భావం.

శ్లో. నమస్కృత్వా చ మనవే బద్ధ్వా శునకఫేలకాః,
యే దేవా దేవలోకేషు మానుషేషు చ బ్రాహ్మణాః.
అధ్యయనపారగాః సిద్ధా యే చ కైలాసతాపసాః,
ఏతేభ్యః సర్వసిద్ధేభ్యః కృతం తే స్వాపనం మహత్.
అతిగచ్ఛతి చ మయ్యపగచ్ఛన్తు సంహతాః
అలితే వలితే మనవే స్వాహా.

వ్యా. మనువుకు నమస్కరించి, కుక్కలు నివసించే చిన్న గదులను బంధించి, దేవలోకాలలో ఏ దేవతలు ఉన్నారో, మనుష్యులలో ఏ బ్రాహ్మణు లున్నారో, వేదాధ్యయనం పూర్తి చేసినవారు ఉన్నారో, ఏ సిద్ధపురుషు లున్నారో, కైలాసంలోని మును లున్నారో వారందరికి నమస్కరించి, సిద్ధులైన వీ రందరినుండీ నీకు గొప్ప నిద్ర

తీసికొనిరాబడింది. నేను ముందు ముందుకు వెడుతూండగా అందరూ కలిసి తొలగిపోవుదురు గాక. "అలితే వలితే మనవే స్వాహా" అనేది మంత్రం (నిద్ర కలిగించేది అయి ఉంటుంది).

మూ. 1. ఏతస్య ప్రయోగః- త్రిరాత్రోపోషితః కృష్ణచతుర్దశ్యాం పుష్యయోగిన్యాం శ్వపాకీహస్తాత్ బిలఖావలేఖనం క్రీణీయాత్. తన్మాషైః సహ కణ్డోలికాయాం కృత్వా అసంకీర్ణ ఆదహనే నిఖానయేత్. ద్వితీయస్యాం చతుర్దశ్యాముద్ధృత్య కుమార్యా పేషయిత్వా గులికాః కారయేత్. తతః ఏకాం గులికామభిమన్త్రయిత్వా యత్రైతేన మన్త్రేణ క్షిపతి తత్ సర్వం ప్రస్వాపయతి.

వ్యా. ఈ మంత్రం ప్రయోగించే విధానం ఇది- మూడు రోజులు ఉపవాసం చేసి పుష్యమీ నక్షత్రయుక్తమైన కృష్ణపక్షచతుర్దశియందు చండాలస్త్రీదగ్గరనుండి భూమిలో కన్నం తవ్వే (వాళ్లు తినే) ఒక విధమైన జంతువుయొక్క ముక్క కొనాలి. దానిని మినుములతో ఒక చిన్న పెట్టెలో పెట్టి శ్మశానంలో జనసంమర్దం లేని ప్రదేశంలో భూమిలో పాతిపెట్టాలి. రెండవ చతుర్దశినాడు కన్యకచేత వాటిని నూరించి గులికలు తయారుచేయించాలి. తరవాత ఈ మంత్రంచేత ఒక గులికను అభిమంత్రించి ఎక్కడ దానిని వేస్తాడో అక్కడ ఉన్నవాళ్ల నందరినీ నిద్రింపచేస్తాడు.

మూ. 1. ఏతేనైవ కల్పేన శ్వావిధః శల్యకం త్రికాలం త్రిశ్వేతమ్ అసంకీర్ణే ఆదహనే నిఖనేత్. ద్వితీయస్యాం చతుర్దశ్యాం ఉద్ధృత్య ఆదహన భస్మనా సహ యత్రైతేన మన్త్రేణ క్షిపతి తత్ సర్వం ప్రస్వాపయతి.

2. శ్లో. సువర్ణపుష్పీం బ్రహ్మాణీం బ్రహ్మాణం చ కుశధ్వజమ్,
సర్వాశ్చ దేవతా వన్దే వన్దే సర్వాం శ్చ తాపసాన్.
వశం మే బ్రాహ్మణా యాన్తు భూమిపాలాశ్చ క్షత్రియాః,
వశం వైశ్యాశ్చ శూద్రాశ్చ వశతాం యాన్తు మే సదా.

"స్వాహా అమిలే కిమిలే వసుజారే ప్రయోగే ఫక్కే వయుహ్వే విహాలే దన్తకటకే స్వాహా".

వ్యా. ఈ ప్రయోగంచేతనే ముళ్లపందియొక్క, మూడు చోట్ల నల్లగాను,

మూడు చోట్ల తెల్లగాను ఉన్న ఒక ముల్లు తీసికొని-జనసంచారం లేని శ్మశానంలో పాతిపెట్టాలి. రెండవ చతుర్దశినాడు దానిని బైటకు తీసి శ్మశానంలో ఉన్న చితాభస్మంతో కూడ దానిని ఈ మంత్రంచేత అభిమంత్రించి ఎక్కడ వేస్తాడో అక్కడ అందరినీ నిద్రపోయే టట్లు చేస్తాడు. (ఇది రెండవ ప్రయోగం)

మూడవ ప్రయోగం చెపుతున్నాడు- బంగారుపువ్వులు పుష్పించే బ్రహ్మదేవుని భార్యకు, లేదా సువర్ణపుష్పికి, బ్రహ్మాణికి, బ్రహ్మకు, కుశధ్వజునికి, సమస్తదేవతలకు, సమస్తమునులకు నమస్కరిస్తున్నాను. బ్రాహ్మణులు, భూమిపాలకులైన క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు నాకు ఎల్లప్పుడు వశం అగుదురుగాక, "స్వాహా... స్వాహా" అనేది మంత్రం.

శ్లో. సుఖం స్వపన్తు శునకా యే చ గ్రామే కుతూహలాః,
శ్వావిదః శల్యకం చైతత్ త్రిశ్వేతం బ్రహ్మనిర్మితమ్,
ప్రసుప్తాః సర్వసిద్ధా హి ఏతత్ తే స్వపనం కృతమ్.
యావద్ గ్రామస్య సీమాన్తః సూర్యస్యోద్గమనాదితి,
స్వాహా.

వ్యా. గ్రామంలో ఉన్న కుక్క లన్నీ సుఖంగా నిద్రించుగాక. కుతూహలం కలవాళ్లందరు నిద్రించెదరు గాక. మూడు చోట్ల తెల్లగా ఉన్న ఈ ముళ్లపంది ముల్లు బ్రహ్మచేత నిర్మించబడినది. కార్యాలు సాధించిన వా ళ్లందరూ నిద్రపోతున్నారు. ఈ నిద్రను నీ మీదికి ఆవాహిస్తున్నాను. సూర్యోదయం అయేవరకు గ్రామం పొలిమేరలవరకు ఉన్నవా ళ్లందరూ నిద్రించెదరు గాక, "స్వాహా"

మూ. ఏతస్య ప్రయోగః- శ్వావిధః శల్యాది త్రిశ్వేతాని. సప్తరాత్రో పోషితః కృష్ణచతుర్దశ్యాం ఖాదిరాభిః సమిధాభిః అగ్నిమేతేన మన్త్రేణాష్టశత సంపాతం కృత్వా మధుఘృతాభ్యామ్ అభిజుహుయాత్. తత ఏకమేతేన మన్త్రేణ గ్రామద్వారి గృహద్వారి వా యత్ర నిఖన్యతే తత్ సర్వం ప్రస్వాపయతి.

వ్యా. ఈ మంత్రంయొక్క ప్రయోగం- ముళ్లపందియొక్క మూడు చోట్ల తెల్లగా ఉన్న ముళ్లు తీసికొని పైన చెప్పినట్లు శ్మశానంలో పాతిపెట్టడం మొదలైనవి చెయ్యాలి. ఏడు రోజులు ఉపవాసం ఉండి కృష్ణపక్షచతుర్దశినాడు ఈ మంత్రం పఠిస్తూ

ఖదిరసమిధలతోను, తేనెతోను, నేతితోను నూటఎనిమిది హోమాలు చెయ్యాలి. (తరవాత శ్మశానంలోని భూమినుంచి పైకి తీసిన ముళ్లనుండి) ఒక ముల్లు ఈ మంత్రం చదువుతూ గ్రామద్వారంలో గాని, గృహద్వారంలో గాని పాతిపెడితే అప్పు డది అందరూ నిద్రపోయే టట్లు చేస్తుంది. (ఇది మూడవ యోగం)

శ్లో. బలిం వైరోచనం వన్దే శతమాయం చ శమ్బరమ్,
నికుమ్భం నరకం కుమ్భం తన్తుకచ్ఛం మహాసురమ్.
అర్మాలవం ప్రమీలం చ మణ్డోలూకం ఘటోబలమ్,
కృష్ణకం సోపచారం చ పౌలోమీం చ యశస్వినీమ్,
అభిమన్త్రయిత్వా గృహ్ణామి సిద్ధార్థం శవశారికామ్.

జయతు జయతి చ నమః శలకభూతేభ్యః స్వాహా.

శ్లో. సుఖం స్వపన్తు శునకా యే చ గ్రామే కుతూహలాః,
సుఖం స్వపన్తు సిద్ధార్థాః యమర్థం మార్గయామహే.
యావదస్తమయాదుదయో యావదర్థం ఫలం మమ.

ఇతి స్వాహా.

వ్యా. నాల్గవ యోగం చెపుతున్నాడు- విరోచనుని కుమారుడైన బలిచక్రవర్తికి, వందలకొలది మాయలుగల శంబరాసురునికి, నికుంభ-కుంభ-నరకాసురులకు, మహాసురుడైన తంతుకచ్ఛునికి, అర్మాలవ-ప్రమీల-మండోలూక-ఘటోబల-కృష్ణకంసోపచారులకు, కీర్తిమంతురాలైన శచీదేవికి నమస్కరిస్తున్నాను. తెల్ల ఆవాలు, శారికమృతదేహాన్నీ అభిమంత్రించి తీసికొంటున్నాను. నాకు విజయం కలుగు గాక, విజయం కలుగుతుంది. శలకభూతాలకి నమస్కారం. స్వాహా. గ్రామంలోని కుక్కలు, కుతూహలం కలవాళ్లు సుఖంగా నిద్రించుగాక. సిద్ధమైన పనులు కలవా ళ్లందరూ సుఖంగా నిద్రింతురు గాక. మేము సూర్యాస్తమయం మొదలు ఏ ప్రయోజనం కోరుకుంటున్నామో అది సూర్యోదయం అయే లోగా మాకు లభించుగాక, "ఇతి స్వాహా".

మూ. ఏతస్య ప్రయోగః- చతుర్భక్తోపవాసీ కృష్ణచతుర్దశ్యామ్ అసంకీర్ణే

ఆదహనే బలిం కృత్వా ఏతేన మన్త్రేణ శవశారికాం గృహీత్వా పోత్రీపోట్టలికాం బధ్నీయాత్. తన్మధ్యే శ్వావిధః శల్యకేన విద్ధ్వా యత్రైతేన మన్త్రేణ నిఖన్యతే తత్ సర్వం ప్రస్వాపయతి.

వ్యా. దీని ప్రయోగం- నాలుగు రోజులు ఆహారం తినకుండా ఉపవాసం చేసి కృష్ణపక్షచతుర్దశిరోజున జనసంచారం లేని శ్మశానంలో బలి (పూజ) చేసి, ఈ మంత్రం "బలిం వైరోచనమ్" మొదలు "ఇతి స్వాహా" వరకు ఉన్న మంత్రంచేత శారిక మృతశరీరాన్ని గ్రహించి చిన్న గుడ్డలో పొట్లం కట్టాలి. దాని మధ్య ముళ్లపంది ముల్లు గ్రుచ్చి ఈ మంత్రం చదువుతూ ఎక్కడ పాతిపెడితే అక్కడ అందరూ నిద్రపోయే టట్లు చేస్తాడు.

ఇప్పుడు ద్వారాలు తెరిపించే మంత్రం చెపుతున్నాడు-

శ్లో. ఉపైమి శరణం చాగ్నిం దైవతాని దిశో దశ,
అపయాన్తు చ సర్వాణి వశతాం యాన్తు మే సదా.

ఏతస్య ప్రయోగః- త్రిరాత్రోపోషితః పుష్యేణ శర్కరా ఏకవింశతిసంపాతం కృత్వా మధుఘృతాభ్యాం జుహుయాత్. తతో గన్ధమాల్యేన పూజయిత్వా నిఖానయేత్. ద్వితీయేన పుష్యేణోద్ధృత్య ఏకాం శర్కరామభిమన్త్రయిత్వా కవాటమాహన్యాత్. అభ్యన్తరం చతసృణాం శర్కరాణామ్ ద్వారమపావ్రియతే.

వ్యా. "అగ్నిని, దేవతలను, పది దిక్కులను శరణు పొందుతున్నాను. అన్నీ తొలగిపోవుగాక. ఎల్లప్పుడూ నాకు వశం అయి ఉండుగాక".

దీని ప్రయోగం- మూడు రోజులు ఉపవాసం ఉండి పుష్యమీనక్షత్రం రోజున ఇరవైఒక్క గులకరాళ్లు పోగుచేసి; అగ్నిలో తేనెతోను నేతితోను హోమం చెయ్యాలి. తరవాత ఆ గులకరాళ్లను గంధమాలలతో పూజించి పాతిపెట్టాలి. మళ్లీ పుష్యమీనక్షత్రం వచ్చిన రోజున ఆ గులకరాళ్లు పైకి తీసి ఒక గులకరాయిని ఈ "ఉపైమి" ఇత్యాది మంత్రంచేత అభిమంత్రించి తలుపుమీద కొట్టాలి. నాలుగు గులకరాళ్లు కొట్టేలోగా తలుపు తెరుచుకుంటుంది.

మూ. చతుర్భక్తోపవాసీ కృష్ణచతుర్దశ్యాం భగ్నస్య పురుషస్య అస్థి

ఋషభం కారయేత్, అభిమన్త్రయేచ్చైతేన. ద్విగోయుక్తం గోయానమాహృతం భవతి. తతః పరమాకాశే విక్రామతి. రవిసగన్ధః పరిఘమతిసర్వం పృణాతి.

వ్యా. నాలుగు రోజులు భోజనం లేకుండా ఉపవాసం చేసి కృష్ణపక్షచతుర్దశినాడు విరిగిన మనిషియొక్క ఎముకతో ఎద్దు బొమ్మ తయారుచేయించాలి. దానిని "ఉపైమి శరణం చాగ్నిమ్" ఇత్యాదిమంత్రంచేత అభిమంత్రించాలి. అప్పుడు రెండు ఎడ్లు కట్టిన ఎద్దుల బండి దాని వద్దకు తీసికొనిరాబడుతుంది. అప్పుడు సూర్యునితో సమానుడై ఆకాశంలో పరాక్రమిస్తాడు. అన్ని గడియలను దాటి లోనికి చొచ్చుకొని వెళ్లకలుగుతాడు.

మూ. 1. "చణ్డాలీకుమ్భీతుమ్బకటుకసారౌఘః సనారీ భగోసి; స్వాహా", తాలోద్ఘాటనం స్వాపనం చ.

2. త్రిరాత్రోపోషితః పుష్యేణ శస్త్రహతస్య శూలప్రోతస్య వా పుంసః శిరఃకపాలే మృత్తికాయాం తువరీరావాస్య ఉదకేన సేచయేత్. జాతానాం పుష్యేణైవ గృహీత్వా రజ్జుకాం వర్తయేత్. తతః సజ్యానాం ధనుషాం యన్త్రాణాం చ పురస్తాత్ ఛేదనం జ్యాచ్ఛేదనం కరోతి.

వ్యా. 1. "ఓ గడియా" నీకు చండాలస్త్రీ దగ్గరఉన్న కుండగుమ్మడికాయలో ఉండే చేదైన బలం ఉంది. నీకు స్త్రీభగం ఉంది" అని. ఈ మంత్రం తాళాలను పగలగొటుతుంది. అందర్నీ నిద్రింపచేస్తుంది.

2. మూడు రోజులు ఉపవాసం ఉండి పుష్యమీనక్షత్రం రోజున శస్త్రంచేత చంపబడిన లేదా శూలానికి గుచ్చబడిన పురుషుని పుఱ్ఱెలో మట్టి పోసి, దానిలో తువరి గింజలు పోసి నీళ్లతో తడపాలి. పుట్టిన మొలకలను పుష్యమినక్షత్రంరోజునే తీసి త్రాడు పేనాలి. దానిని, నారి కట్టిన ధనస్సుల ముందు యంత్రాల ముందు ఛేదిస్తే అల్లెత్రాళ్లను (యంత్రావయవాలను) ఛేదిస్తుంది. అనగా అవి వాటంతట అవే తెగిపోతాయి.

మూ. 1. ఉదకాహిభస్త్రామ్ ఉచ్ఛ్వాసమృత్తికయా స్త్రియాః పురుషస్య వా పూరయేత్. నాసికాబన్ధనం ముఖగ్రహశ్చ.

2. వరాహబస్తిమ్ ఉచ్ఛ్వాసమృత్తికయా పూరయిత్వా మర్కట స్నాయునా అవబధ్నీయాత్. ఆనాహకారణమ్.

3. కృష్ణచతుర్దశ్యాం శస్త్రహతాయాః గోః కపిలాయాః పిత్తేన రాజవృక్షమ

యామ్ అమిత్రప్రతిమామ్ అఞ్జ్యాత్. అన్ధీకరణమ్.

4. చతుర్భక్తోపవాసీ కృష్ణచతుర్దశ్యాం బలిం కృత్వా శూలప్రోతస్య పురుషస్య అస్థ్నా కీలకాన్ కారయేత్. ఏతేషామేకః మూత్రే పురీషే వా నిఖాతః ఆనాహం కరోతి. పాదేఽస్యాసనే వా నిఖాతః శోషేణ మారయతి. ఆపణే, క్షేత్రే, గృహే వా వృత్తిచ్ఛేదం కరోతి.

5. ఏతేన కల్పేన విద్యుద్దగ్ధస్య వృక్షస్య కీలకాః వ్యాఖ్యాతాః.

వ్యా. 1. పురుషుడు గాని స్త్రీ గాని విడచిన ఉచ్ఛ్వాసం (ముక్కునుండి విడిచిన గాలి) తగిలిన మట్టిని నీటి పాము చర్మతో చేసిన సంచిలో నింపాలి. దానివల్ల వాళ్ల ముక్కు పూడిపోతుంది; నోరు పడిపోతుంది.

2. ఉచ్ఛ్వాసం తగిలిన మట్టిని పంది చర్మతో చేసిన సంచిలో పోసి కోతి నరాలతో బంధిస్తే అది ఆనాహం కలిగిస్తుంది; అనగా వాళ్లకు మలమూత్రబంధనం చేస్తుంది.

3. కృష్ణపక్షచతుర్దశినాడు శస్త్రంచేత చంపబడిన కపిలగోవునుండి తీసిన పిత్తం రాజవృక్షం కఱ్ఱతో చేసిన శత్రువు బొమ్మకు పూస్తే వానికి అంధత్వం కలిగిస్తుంది.

4. నాలుగు రోజులు ఉపవాసం ఉండి కృష్ణపక్షచతుర్దశిరోజున పూజలు చేసి శూలం గ్రుచ్చి చంపబడిన పురుషుని ఎముకలతో మేకులు తయారుచేయించాలి. వాటిలో ఒకదానిని వాడు మూత్రం విడచిన చోట గాని, వాని మలంలో గాని గ్రుచ్చుతే ఆనాహం కలిగిస్తుంది. అతడు అడుగు వేసిన చోట గ్రుచ్చుతే శోషరోగం చేత చంపుతుంది. వాని దుకాణంలో గాని, పొలంలో గాని, ఇంట్లో గాని గుచ్చుతే వాని వృత్తికి భంగం కలిగిస్తుంది.

5. ఈ పద్ధతి పిడుగుపడి కాలిన చెట్టు కఱ్ఱతో చేసిన మేకుకు కూడ వర్తిస్తుంది.

శ్లో. పునర్నవమవాచీనం నిమ్బః కాకమధుశ్చ యః,
కపిరోమ మనుష్యాస్థి బద్ధ్వా మృతకవాససా.
నిఖన్యతే గృహే యస్య పిష్ట్వా వా యం ప్రపాయయేత్,
సపుత్రదారః సధనః త్రీన్ పక్షాన్నాతివర్తతే.

వ్యా. "పిష్ట్వా వా యం ప్రపాయయేత్"కు బదులు "దృష్ట్వా వా యత్పదం నయేత్" అని కాంగ్లే ఇచ్చిన పాఠం. పునర్నవ మొక్కను తలక్రిందులు చేసి, వేప,

కాకమధువు, కోతిరోమాలు, మనిషి ఎముక వీటిని శవంమీద కప్పిన వస్త్రంతో మూట కట్టి ఎవని ఇంట్లో పాతుతారో లేదా ఎవని అడుగు వేసినచోట చూచి అక్కడ ఉంచుతారో, అతడు భార్యాపుత్రధనాదులతో సహా మూడుపక్షాలు దాటి జీవించడు.

శ్లో. పునర్నవమవాచీనం నిమ్బః కాకమధుశ్చ యః,
స్వయంగుప్తా మనుష్యాస్థి పదే యస్య నిఖన్యతే.
ద్వారే గృహస్య సేనాయా గ్రామస్య నగరస్య చ,
సపుత్రదారః సధనస్త్రీన్ పక్షాన్ నాతివర్తతే.

వ్యా. పునర్నవం మొక్కను తలక్రిందులు చేసి, వేప, కాకమధువు, స్వయంగుప్త అనే ఓషధి, మనిషి ఎముక ఎవని అడుగు వేసిన చోట పాతబడుతుందో, గృహద్వారం వద్ద గాని, సేనాద్వారం వద్ద గాని, గ్రామద్వారం వద్ద గాని, నగరద్వారం వద్ద గాని పాతబడుతుందో అతడు భార్యాపుత్రధనాదులతో సహా మూడు పక్షాలు దాటి జీవించడు.

శ్లో. అజమర్కటరోమాణి మార్జారనకులస్య చ,
బ్రాహ్మణానాం శ్వపాకానాం కాకోలూకస్య చాహరేత్.
ఏతేన విష్ఠావక్షుణ్ణా సద్య ఉత్సాదకారికా.

వ్యా. మేక, కోతి, పిల్లి, ముంగిస, బ్రాహ్మణులు, చండాలులు, కాకులు, గుడ్లగూబ- వీటి రోమాలు తీసికొని వచ్చి ఎవని మలంలో వేసి నూరుతాడో అతడు వెంటనే మరణిస్తాడు.

శ్లో. ప్రేతనిర్మాలికా కిణ్వం రోమాణి నకులస్య చ,
వృశ్చికాల్యహికృత్తిశ్చ పదే యస్య నిఖన్యతే.
భవత్యపురుషః సద్యో యావత్తన్నాపనీయతే.

వ్యా. శవనిర్మాల్యం (శవంమీదనుంచి తీసివేసిన పువ్వులు), మద్యమూలద్రవ్యం, ముంగిస రోమాలు, తేలు, తుమ్మెద, పాము- వీటి చర్మలు, ఎవని అడుగు వేసిన చోట పాతబడతాయో అతడు వెంటనే నపుంసకు డవుతాడు. ఆ పాతినది పైకి తీసేవరకు అలాగే ఉంటాడు.

మూ. త్రిరాత్రోపోషితః పుష్యేణ శస్త్రహతస్య శూలప్రోతస్య వా పుంసః శిరఃకపాలే మృత్తికాయాం గుఞ్జా ఆవాస్య ఉదకేన చ సేచయేత్.

జాతానామ్ అమావాస్యాయాం పౌర్ణమాస్యాం వా పుష్యయోగిన్యాం గుఞ్జావల్లీ ర్గ్రాహయిత్వా మణ్డలికాని కారయేత్. తేష్వన్నపానభాజనాని న్యస్తాని న క్షీయన్తే.

వ్యా. మూడు రోజులు ఉపవాసం ఉండి పుష్యమీనక్షత్రం రోజున, శస్త్రంచేత చంపబడిన లేదా శూలానికి గ్రుచ్చబడిన పురుషుని పుఱ్ఱెలో మట్టి పోసి గులివెంతగింజలు చల్లి నీళ్లతో తడపాలి. తీగలు వచ్చిన తరవాత పుష్యమీనక్షత్రయుక్తమైన అమావాస్యయందు గాని, పౌర్ణమాస్యయందు గాని ఆ గులివెందతీగలు తీయించి గుండ్రని చుట్టలు చుట్టించాలి. ఆ చుట్టల మీద అన్న-పాన-పాత్రలు ఉంచితే అవి క్షీణించవు. అవి ఎల్లప్పుడూ నిండుగానే ఉంటాయి.

మూ. 1. రాత్రిప్రేక్షాయాం ప్రవృత్తాయాం ప్రదీపాగ్నిషు మృతధేనోః స్తనానుత్కృత్య దాహయేత్. దగ్ధాన్ వృషమూత్రేణ పేషయిత్వా నవకుమ్భమన్తర్లేపయేత్. తం గ్రామమపసవ్యం పరిణీయ తత్ర న్యస్తం నవనీతమేషాం తత్ సర్వమాగచ్ఛతీతి.

2. కృష్ణచతుర్దశ్యాం పుష్యయోగిన్యాం శునో లగ్నకస్య యోనౌ కాలాయసీం ముద్రికాం ప్రేషయేత్. తాం స్వయం పతితాం గృహ్ణీయాత్. తయా వృక్షఫలాన్యాకారితాన్యాగచ్ఛన్తి.

వ్యా. 1. రాత్రి నాట్యాదిప్రదర్శనం జరుగుతున్నప్పుడు, మరణించిన ఆవు స్తనాలు పెకిలించి తీసికొని వచ్చి, అక్కడ వెలుగుతూన్న దీపాల అగ్నిలో కాల్చాలి. కాలినవాటిని ఎద్దు మూత్రంతో నలగకొట్టి ముద్ద చేసి దానిని కొత్తకుండ లోపల పుయ్యాలి. ఆ కుండను గ్రామానికి అప్రదక్షిణంగా తీసికొనివెళ్లి ఒక చోట ఉంచినట్లయితే ఆ గ్రామస్థుల ఇళ్లల్లో ఉన్న వెన్న అంతా ఆ కుండలోనికి వస్తుంది.

2. పుష్యమీనక్షత్రయుక్తకృష్ణపక్షచతుర్దశినాడు ఎదగొన్న కుక్క యోనిలోనికి ఇనుప ఉంగరం దూర్చాలి. అది దానంతట అది బైటపడి నప్పుడు దానిని తీసికోవాలి. అది చేతిలో ఉంచుకొని చెట్లమీద ఉన్న పండ్లు క్రిందికి రమ్మనగానే వస్తాయి.

శ్లో. మన్త్రభైషజ్యసంయుక్తా యోగా మాయాకృతాశ్చ యే,
ఉపహన్యాదమిత్రాంస్తైః స్వజనం చాభిపాలయేత్.

ఇతి కౌటలీయార్థశాస్త్రే ఔపనిషదికే చతుర్దశాధికరణే తృతీయోఽధ్యాయః ప్రలమ్భనే భైషజ్యమన్త్రప్రయోగః, ఆదితః అష్టచత్వారింశచ్ఛతతమః.

వ్యా. మంత్రాలతోను, వైద్యంతోను కూడినవి, మాయచేత నిర్మించబడినవి అయిన యోగాలతో శత్రువులను నశింపచెయ్యాలి. తనవాళ్లను పాలించుకోవాలి.

"బాలానందిని" అను కౌటలీయార్థశాస్త్రాంధ్రవ్యాఖ్యానంలో ఔపనిషదికం అనే పద్నాల్గవ అధికరణంలో "ప్రలంభనే భైషజ్యమన్త్రప్రయోగః" అను మూడవ అధ్యాయం, ప్రారంభంనుండి నూటనలభైఎనిమిదవ అధ్యాయం సమాప్తం.

# అథ చతుర్థోఽధ్యాయః

## ఏకోనాశీతిశతతమం ప్రకరణమ్ - స్వబలోపఘాతప్రతీకారః

(తన సైన్యానికి దెబ్బ తగలకుండా ప్రతిక్రియ)

మూ. 1. స్వపక్షే పరప్రయుక్తానాం దూషివిషగరాణాం ప్రతీకారే శ్లేష్మాతకకపిత్థదన్తిదన్తశఠగోజీశిరీషపాటలీబలాస్యోనాకపునర్నవాశ్వేతా వరణక్వాథయుక్తం, చన్దనసాలావృకీలోహితయుక్తం తేజనోదకం రాజోపభోగ్యానాం గుహ్యప్రక్షాలనం స్త్రీణాం సేనాయాశ్చ విషప్రతీకారః.

2. వృషతనకులనీలకణ్ఠగోధాపిత్తయుక్తం మషీరాజిచూర్ణం సిన్దువారితవరణవారుణీతణ్డులీయకశతపర్వాగ్రపిణ్డీతకయోగో మదన దోషహరః.

3. సృగాలవిన్నామదనసిన్దువారితవరణావరణవల్లీమూలకషాయాణా మన్యతమస్య సమస్తానాం వా క్షీరయుక్తం పానం మదనదోషహరమ్.

వ్యా. 1. తన పక్షంమీద శత్రువు ప్రయోగించిన దూషీవిషం, ఇతరమైన విషాలు- వీటికి ప్రతిక్రియ ఈ విధంగా చెయ్యాలి. రాజుచేత అనుభవింపదగిన స్త్రీలమీద, సైనికులమీద దూషీవిషాదిప్రయోగం చేసినప్పుడు స్త్రీలు తేజనోదకంతో తమ గుహ్యప్రదేశం ప్రక్షాళనం చేసుకోవాలి. (సైనికులు బహుశా లోపలికి తీసికోవలసి ఉండవచ్చు, అది స్పష్టం చేయలేదు). శ్లేష్మాతకం, వెలగ, దంతి, దంతశఠం (జంబీరం),

గోజిహ్వా, శిరీషం, పాటలి, బల, స్యోనకం, పునర్నవ, శ్వేతారణం అనే వృక్షాల మొక్కల కషాయంతో కలిపిన, చందనం, ఆడనక్క రక్తం కలిపిన తేజనోదకం ఆ విషాలకి ప్రతిక్రియ.

2. చుక్కలజింక, ముంగిస, నెమలి, ఉడుము- వీటి పిత్తం కలిపిన మషీ-రాజిధాన్యాల చూర్ణం, సిందువారితం, వరణం, దూర్వలు, తండులీయకం అనే శాకం, వెదురు చిగుళ్లు, మరువకం- వీటితో తయారుచేసిన యోగం మదనదోషం పోగొడుతుంది.

3. లేదా సృగాలవిన్న, మదనం, సిందువారితం, వరణ, వల్లి అనే ఐదు ఓషధులు అన్నింటి వేళ్లతోను లేదా ఏదైన ఒకదాని వేళ్లతో తయారుచేసిన కషాయంలో పాలు కలిపి త్రాగిన ట్లయితే అది కూడ మదనదోషం పోగొడుతుంది.

మూ. 1. కైడర్యపూతితిలతైలమున్మాదహరం, నస్తః కర్మ.

2. ప్రియఙ్గునక్తమాలయోగః కుష్ఠహః.

3. కుష్ఠలోధ్రయోగః పాకశోషఘ్నః.

4. కట్ఫలద్రవన్తీవిలఙ్గచూర్ణం నస్తః కర్మ శిరోరోగహరమ్.

5. ప్రియఙ్గు మఞ్జిష్ఠా తగర లాక్షారస మధుక హరిద్రా క్షౌద్రయోగః రజ్జూదకవిషప్రహారపతననిఃసంజ్ఞానాం పునః ప్రత్యానయనాయ.

6. మనుష్యాణామ్ అక్షమాత్రం, గవాశ్వానాం ద్విగుణం, చతుర్గుణం హస్త్యుష్ట్రాణామ్.

7. రుక్మగర్భశ్చైషాం మణిః సర్వవిషహరః.

8. జీవన్తీ శ్వేతాముష్కకపుష్పవన్దాకానామ్ అక్షీబే జాతస్య అశ్వత్థస్య మణిః సర్వవిషహరః.

వ్యా. 1. కట్ఫలం, పూతికరజం, తిలలు వీటి తైలం పిచ్చిని పోగొడుతుంది. ముక్కులోనుండి లోపలికి ఇవ్వాలి.

2. ప్రియంగు-నక్తమాలవృక్షాల అవయవాలతో చేసిన యోగం కుష్ఠం పోగొడుతుంది.

3. కటఫలం, ద్రవంతి, విలంగాల చూర్ణం ముక్కు ద్వారా పీలిస్తే శిరోరోగాలను పోగొడుతుంది.

4. ప్రియంగు, అంజనవల్లిక, తగరం, లత్తుక, మధుకం, పసుపు, తేనె, వీటితో తయారైన యోగం త్రాటితో బంధించడంచేత, నీటిలో ముంచడంచేత, విషవేగంచేత, కొట్టడంచేత, ఎత్తునుంచి క్రిందికి పడడంచేత సంజ్ఞ కోల్పోయినవాళ్లను పూర్వస్థితికి తీసికొనివస్తుంది.

5. మనుష్యులకు అక్షం (పదహారు మాషాలు) ప్రమాణం గల మోతాదు, గోవులకు అశ్వాలకు రెండు అక్షాల మోతాదు, ఏనుగులకు ఒంటెలకు నాలుగు అక్షాల మోతాదు ఇవ్వాలి.

6. పైన చెప్పిన ప్రియంగువు మొదలైనవాటి మణి(గులిక) మధ్య బంగారం ఉంచి ధరిస్తే అది అన్ని విషాలను పోగొడుతుంది.

7. జీవంతీ-శ్వేతా-ముష్కక-పుష్ప-వందాకాల మణి, మహానింబం అనే చెట్టులో మొలచిన రావిచెట్టుయొక్క మణి సమస్తవిషాలు తొలగిస్తుంది.

శ్లో. **తూర్యాణాం తైః ప్రలిప్తానాం శబ్దో విషవినాశనః,**
**లిప్తధ్వజం పతాకాం వా దృష్ట్వా భవతి నిర్విషః.**
**ఏతైః కృత్వా ప్రతీకారం స్వసైన్యానామథాత్మనః,**
**అమిత్రేషు ప్రయుఞ్జీత విషధూమామ్బుదూషణాన్.**

ఇతి కౌటలీయార్థశాస్త్రే ఔపనిషదికే చతుర్దశాధికరణే చతుర్థోఽధ్యాయః
స్వబలోపఘాతప్రతీకారః, ఆదితః ఏకోనపఞ్చాశచ్ఛతతమః.

ఏతావతా కౌటలీయార్థశాస్త్రస్య ఔపనిషదికమ్ చతుర్దశమధికరణం సమాప్తమ్.

వ్యా. జీవంతి మొదలైన ఓషధులతో తయారు చేసిన ఔషధాలు పూసిన తూర్యాల శబ్దం విషాన్ని నశింపచేస్తుంది. వాటిని పూసిన ధ్వజాన్ని కాని, పతాకను గాని చూడగానే విషం లేనివా డవుతాడు.

ఈ ఉపాయాలచేత తనకు, తన సైన్యాలకి ప్రతిక్రియ చేసుకుంటూ శత్రువుల మీద విషం, ధూమం, జలదూషణం ప్రయోగించాలి.

"బాలానందిని" అను కౌటలీయార్థశాస్త్రాంధ్రవ్యాఖ్యానంలో ఔపనిషదికం అనే పద్నాల్గవ అధికరణంలో స్వబలోపఘాతప్రతీకారం అనే నాల్గవ అధ్యాయం, ప్రారంభంనుండి నూటనలభైతొమ్మిదవ అధ్యాయం సమాప్తం.

ఇంతటితో కౌటలీయార్థశాస్త్రంలోని ఔపనిషదికం అనే పద్నాల్గవ అధికరణం సమాప్తం.

# అథ తన్త్రయుక్తిః - పఞ్చదశమధికరణమ్

## అశీతిశతతమం ప్రకరణమ్ - తంత్రయుక్తయః (శాస్త్రపద్ధతులు)

ఈ అధికరణం ఈ శాస్త్రంలో విషయం ప్రతిపాదించడానికి ఏ పద్ధతులు అవలంబిం చబడినవో వాటిని వివరిస్తుంది.

మూ. 1. మనుష్యాణాం వృత్తిః అర్థః, మనుష్యవతీ భూమిరిత్యర్థః. తస్యాః పృథివ్యాః లాభపాలనోపాయః శాస్త్రమ్ అర్థశాస్త్రమ్ ఇతి.

2. తత్ ద్వాత్రింశద్యుక్తియుక్తమ్. అధికరణం, విధానం, యోగః, పదార్థః, హేత్వర్థః, ఉద్దేశః, నిర్దేశః, ఉపదేశః, అపదేశః, అతిదేశః, ప్రదేశః, ఉపమానమ్, అర్థాపత్తిః, సంశయః, ప్రసఙ్గః, విపర్యయః, వాక్యశేషః, అనుమతం, వ్యాఖ్యానం, నిర్వచనం, నిదర్శనమ్, అపవర్గః, స్వసంజ్ఞా, పూర్వపక్షః, ఉత్తరపక్షః, ఏకాన్తః, అనాగతావేక్షణమ్, అతిక్రాన్తావేక్షణమ్, నియోగః, వికల్పః, సముచ్చయః, ఊహ్యమ్ ఇతి.

3. యమర్థమధికృత్య ఉచ్యతే తదధికరణమ్- "పృథివ్యా లాభే పాలనే చ యావన్త్యర్థశాస్త్రాణి పూర్వాచార్యైః ప్రస్థాపితాని ప్రాయశః తాని సంహృత్య ఏకమిదమ్ అర్థశాస్త్రం కృతమ్" (అధి.1. అధ్యా.1) ఇతి.

వ్యా. 1. మనుష్యుల జీవనోపాధి అర్థం. అనగా మనుష్య లున్న భూమి అర్థం అని అర్థం. ఆ భూమిని పొందడానికి, పాలించడానికి తగిన ఉపాయాన్ని చెప్పే శాస్త్రం అర్థశాస్త్రం.

2. ఈ అర్థశాస్త్రంలో ముప్పైరెండు యుక్తులు అనగా విషయాన్ని

ప్రతిపాదించడానికి అవలంబించిన విధానాలు 'అధికరణం' మొదలు 'ఊహ్యం' వరకు ఉన్నాయి. వీటిని అన్నింటినీ సోదాహరణంగా విశదీకరిస్తాడు.

3. ఏదైన ఒక విషయాన్ని ప్రతిపాదించే గ్రంథభాగానికి అధికరణం అని పేరు. అనగా ఒక అధికరణంలో ప్రధానంగా ఒక విషయం చెప్పబడుతుంది, దానికి సంబంధించిన ఇతరవిషయాలు కూడ చెప్పవచ్చు. ఉదాహరణకి- "భూమిని సంపాదించడానికి పాలించడానికి పూర్వాచార్యులు ఎన్ని అర్థశాస్త్రాలు ప్రవర్తింపచేశారో చాలవరకు ఆ శాస్త్రాలను క్రోడీకరించి ఈ అర్థశాస్త్రం రచించబడింది" అని ప్రారంభంలో ఈ గ్రంథంలోనే చెప్పిన వాక్యాన్ని పట్టి ఆ విషయాన్ని ప్రతిపాదించిన గ్రంథభాగం అధికరణం అని చెప్పబడుతుంది. ఇట్లే మిగిలిన అధికరణాల విషయం కూడ.

మూ. 1. శాస్త్రస్య ప్రకరణానుపూర్వ్యే విధానమ్- "విద్యాసముద్దేశః, వృద్ధసంయోగః, ఇన్ద్రియజయః, అమాత్యోత్పత్తిః" (అధి.1. అధ్యా.1.) ఇత్యేవమాదికమితి.

2. వాక్యయోజనా యోగః- "చతుర్వర్ణాశ్రమో లోకః" (అధి.1. అధ్యా.4)ఇతి.

3. పదావధికః పదార్థః- "మూలహరః" ఇతి పదమ్. "యః పితృపైతామహమర్థమ్ అన్యాయేన భక్షయతి స మూలహరః" (అధి.2. అధ్యా.9) ఇత్యర్థః.

4. హేతురర్థసాధకో హేత్వర్థః- "విద్యావినయహేతురిన్ద్రియ జయః" (అధి.1. అధ్యా.6) ఇతి.

5. సమాసవాక్యముద్దేశః- "విద్యావినయహేతురిన్ద్రియజయః" (అధి.1.అధ్యా. 6) ఇతి.

6. వ్యాసవాక్యం నిర్దేశః- "కర్ణత్వగక్షిజిహ్వాఘ్రాణేన్ద్రియాణాం శబ్దస్పర్శరూపరసగన్ధేషు అవిప్రతిపత్తిః ఇన్ద్రియజయః" (అధి.1, అధ్యా. 6) ఇతి.

వ్యా. 1. శాస్త్రంలోని ప్రకరణాలు ఏ క్రమంలో వస్తాయో చెప్పడం 'విధానం'. "విద్యాసముద్దేశం, వృద్ధసంయోగం, ఇంద్రియజయం, అమాత్యోత్పత్తి" అనే ప్రకరణాలు ఏ వరసలో వస్తాయో చెప్పబడింది గాన ఇది 'విధానం'.

2. పదాలను కూర్చి వాక్యం నిర్మించడం 'యోగం'. "నాలుగు వర్ణాలు ఆశ్రయాలు ఉన్నది లోకం". ఇక్కడ పదాలు కూర్చి వాక్యం నిర్మించబడింది. అందుచేత ఇది యోగం.

3. పదానికి మాత్రమే సంబంధించిన అర్థం 'పదార్థం', 'మూలహరః' అనే పదం ఉంది. దాని అర్థమే ఎవడైతే తండ్రితాతలనుండి వచ్చిన ధనాన్ని అన్యాయంగా భక్షిస్తాడో అతడు మూలహరుడు అని చెప్పబడింది.

4. ఒక విషయాన్ని సమర్థించే హేతువు హేత్వర్థం. "ధర్మకామాలకి అర్థమే మూలం కదా" అని ఒక హేతువు చెప్పబడింది.

5. సంక్షిప్తంగా చెప్పడం 'ఉద్దేశం'. "ఇంద్రియజయం విద్యావినయాలకు హేతువు". ఇక్కడ ఇంద్రియాలు ఎన్నో చెప్పకుండా 'ఇంద్రియజయః' అని సంక్షిప్తంగా చెప్పబడింది.

6. విషయాన్ని విస్తరించి చెప్పడం 'నిర్దేశం'. "చెవులు, చర్మ, కళ్లు, నాలుక, ముక్కు అనే ఇంద్రియాలు శబ్ద-స్పర్శ-రూప-రస-గంధాలలో లగ్నం కాకుండా ఉండడం ఇంద్రియజయం" . ఇక్కడ ఇంద్రియజయం అనేది విస్తృతంగా వివరించబడింది.

మూ. 1. ఏవం వర్తితవ్యమిత్యుపదేశః- "ధర్మార్థావిరోధేన కామం సేవేత. న నిఃసుఖః స్యాత్" (అధి.1. అధ్యా. 7) ఇతి.

2. ఏవమసావాహ ఇత్యపదేశః- "మన్త్రిపరిషదం ద్వాదశామాత్యాన్ కుర్వీతేతి మానవాః. షోడశేతి బార్హస్పత్యాః; వింశతిమితి ఔశనసాః, యథాసామర్థ్యమితి కౌటల్యః"(అధి.1, అధ్యా. 15).

3. ఉక్తేన సాధనమతిదేశః. "దత్తస్యాప్రదానమ్ ఋణాదానేన వ్యాఖ్యాతమ్"(అధి.3, అధ్యా. 16) ఇతి.

4. వక్తవ్యేన సాధనం ప్రదేశః- "సామదానభేదదణ్డైర్వా; యథాపత్సు

వ్యాఖ్యాస్యామః" (అధి.7, అధ్యా. 14) ఇతి.

5. దృష్టేన అదృష్టసాధనమ్ ఉపమానమ్- "నివృత్తపరిహారాన్ పితేవ అనుగృహ్ణీయాత్" (అధి.2, అధ్యా.1) ఇతి.

6. యదనుక్తమర్థాదాపద్యతే సార్థాపత్తిః- "లోకయాత్రావిత్ రాజానమ్ ఆత్మద్రవ్యప్రకృతిసంపన్నమ్ ప్రియహితద్వారేణ ఆశ్రయేత" (అధి.5, అధ్యా. 4), "న అప్రియహితద్వారేణాశ్రయేత ఇత్యర్థాదాపన్నం భవతి" ఇతి.

7. ఉభయతో హేతుమాన్ అర్థః సంశయః- "క్షీణలుబ్ధప్రకృతిమ్ అపచరితప్రకృతిం వా" (అధి.7, అధ్యా. 5) ఇతి.

వ్యా. 1. ఈ విధంగా ఉండాలి అని చెప్పడం 'ఉపదేశం', "ధర్మార్థాలకు విరోధం లేకుండా కామాన్ని సేవించాలి. సుఖం అనుభవించకుండా ఉండకూడదు" ఇది ఉపదేశం.

2. ఇతడు ఇలా అంటున్నాడు అని చెప్పడం 'అపదేశం'. "పదిమంది అమాత్యులను మంత్రిపరిషత్తు చెయ్యాలి అని మనువు మతానికి చెందినవారు, పదహారుగురు అని బృహస్పతిమతానికి చెందినవారు. ఇరవైమంది అని శుక్రాచార్యమతానికి చెందినవారు, సామర్థ్యానుసారంగా అని కౌటిల్యుడు" ఇది అపదేశం.

3. ముందుగా చెప్పి ఉన్నదానిచేత చెప్పనిదానిని సాధించడం 'అతిదేశం' "ఇవ్వబడిన దానిని ఇవ్వకపోవడం ఋణం తిరిగి చెల్లించకపోవడంచేత విశదీకరించబడింది". ఇక్కడ ముందుగా చెప్పిన ఋణాదానానికి సంబంధించిన నియమాలు దత్తాప్రదానం విషయంలో విధించబడుతున్నాయి.

4. మున్ముందు చెప్పనున్నదానిచేత ఒక వెనుకటి విషయాన్ని సాధించడం 'ప్రదేశం'. "ఆపదలను గూర్చి వివరించేటప్పుడు చెప్ప నున్నట్లు సామదాన భేదదండాలచేతనైనా" అని చెప్పబోయేదానిని ప్రకృతవిషయానికి సంబంధింప చేయడం జరిగింది.

5. చూచినదానిచేత చూడనిదానిని సాధించడం 'ఉపమానం', "నివృత్తపరిహారులను తండ్రి వలె అనుగ్రహించాలి" అన్నప్పుడు ప్రసిద్ధంగా కనబడుతున్న

తంత్రివ్యవహారంచేత రాజు వ్యవహారం ఎట్లు ఉండాలో చెప్పబడింది.

6. స్పష్టంగా చెప్పబడని ఏది చెప్పినదానిని పట్టి తెలియబడుతుందో అది "అర్థాపత్తి". "లోకవ్యవహారం తెలిసినవాడు ఆత్మప్రకృతి ద్రవ్యప్రకృతు లున్న రాజును ప్రియహితకార్యాలద్వారా ఆశ్రయించాలి" అన్నప్పుడు "అప్రియ-అహితకార్యాల ద్వారా ఆశ్రయించకూడదు" అనే విషయం, అర్థాన్ని పట్టి, చెప్పకపోయినా తెలుస్తూన్నది గాన ఇది 'అర్థాపత్తి'.

7. రెండు పక్షాలకు హేతువు లున్న విషయం 'సంశయం', "క్షీణలుబ్ధ ప్రకృతి యైనవానిని లేదా ప్రకృతుల విషయంలో అపచారం చేసినవానిని" అన్నప్పుడు రెండు పక్షాలకీ తగిన హేతువులు ఉన్నాయి గాన ఇది 'సంశయం'.

మూ. 1. ప్రకరణాన్తరేణ సమానః అర్థః ప్రసఙ్గః- "కృషికర్మప్రవిష్టాయాం భూమావితి సమానం పూర్వేణ" (అధి.1,అధ్యా.11) ఇతి.

2. ప్రతిలోమేన సాధనం విపర్యయః- "విపరీతమతుష్టస్య" (అధి.2, అధ్యా. 16) ఇతి.

3. యేన వాక్యం సమాప్యతే స వాక్యశేషః- "ఛిన్నపక్షస్యేవ రాజ్ఞః చేష్టానాశశ్చేతి"(అధి. 8, అధ్యా. 1) తత్ర శకునేరితి వాక్యశేషః.

4. పరవాక్యమప్రతిషిద్ధమ్ 'అనుమతమ్' - "పక్షౌ ఉరస్యం, ప్రతిగ్రహః ఇతి ఔశనసః వ్యూహవిభాగః" (అధి.10, అధ్యా.6) ఇతి.

5. అతిశయవర్ణనా "వ్యాఖ్యానమ్" - "విశేషతశ్చ సంఘానాం సంఘధర్మిణాం చ రాజకులానాం ద్యూతనిమిత్తో భేదః, తన్నిమిత్తో వినాశ ఇత్యసత్ప్రగ్రహః పాపిష్ఠతమః వ్యసనానాం తన్త్రదౌర్బల్యాత్"- (అధి.8, అధ్యా. 3) ఇతి.

6. గుణతః శబ్దనిష్పత్తిః 'నిర్వచనమ్'- "వ్యస్యత్యేనం శ్రేయస ఇతి వ్యసనమ్". (అధి.8, అధ్యా.1) ఇతి.

వ్యా. 1. మరొక ప్రకరణంలో చెప్పిన విషయంతో సమానమైన విషయం

'ప్రసంగం'- "కృషికర్మకు నిర్దేశించబడిన భూమియందు- అని వెనుక చెప్పినదానితో సమానము".

2. విరుద్ధమైనదానిచేత విషయాన్ని ప్రతిపాదించడం 'విపర్యయం'- "సంతోషించనివానికి వెనుక చెప్పినదానికి విపరీతం జరుగుతుంది". ఇక్కడ వెనుక చెప్పినదానికి విపరీతంగా ఉంటుంది అని చెప్పబడింది గాన ఇది 'విపర్యయం'.

3. ఏది చేర్చడంచేత వాక్యం సమాప్తి చేయబడుతుందో అది 'వాక్యశేషం'- "తెగగొట్టబడిన రెక్కలు కలదానికి వలె రాజుకు చేష్టలు లేకుండా పోతాయి". ఇక్కడ 'భిన్నపక్షస్య' తరవాత 'శకునేః' (పక్షియొక్క) అని చేరిస్తేనే వాక్యం పూర్తి అవుతుంది.

4. ఇతరుల వాక్యం నిషేధించబడకపోతే దానిని అంగీకరించినట్లే అవుతుంది. అది 'అనుమతం'- "పక్షాలు, ఉరస్యం, ప్రతిగ్రహం అని ఔశనసులు అంటారు". ఇక్కడ వీరి మతం నిషేధించలేదు గాన అనుమతం.

5. చెప్పిన విషయాన్ని ఇతరయుక్తులచేత సమర్థిస్తూ విస్తృతంగా చెప్పడం 'వ్యాఖ్యానం'- "సంఘాలకు సంఘాల వంటి రాజవంశాలకు విశేషించి ద్యూతంవల్ల కలిగే భేదం, దానిని నిమిత్తంగా చేసికొని వచ్చే వినాశం కలుగుతాయి. అందుచేత అసత్పురుషులు అనుసరించే ఇది వ్యసనా లన్నింటిలో చాల చెడ్డది. రాజ్యపరిపాలనం దుర్బలం అయిపోతుంది". ఇది విస్తృతవివరణం అవడంచేత 'వ్యాఖ్యానం'.

6. గుణాన్ని పట్టి అనగా అర్థం కుదరడాన్ని పట్టి ఒక శబ్దం ఎలా నిష్పన్నమైనదో చెప్పడం 'నిర్వచనం'- "ఇది వీనిని శ్రేయస్సునుండి దూరం చేస్తుంది గాన వ్యవస నం" ఇది వ్యసనశబ్దానికి అర్థాన్ని పట్టి ఇచ్చిన 'నిర్వచనం'.

మూ. 1. దృష్టాన్తో దృష్టాన్తయుక్తః నిదర్శనమ్-"విగృహీతో హి జ్యాయసా హస్తినా పాదయుద్ధమివాభ్యుపైతి" (అధి.7, అధ్యా.3).

2. అభిప్లుతవ్యపకర్షణమ్ 'అపవర్గః'- "నిత్యమాసన్నమరిబలం వాసయేదన్యత్ర అభ్యన్తరకోపశఙ్కాయాః" (అధి.9, అధ్యా. 2) ఇతి.

3. పరైః అసంమితః శబ్దః స్వసంజ్ఞా- "ప్రథమా ప్రకృతిస్తస్య భూమ్యనన్తరా, ద్వితీయా భూమ్యేకాన్తరా తృతీయా" (అధి.6, అధ్యా.2) ఇతి.

4. ప్రతిషేద్ధవ్యం వాక్యం పూర్వపక్షః- "స్వామ్యమాత్యవ్యసనయోర మాత్యవ్యసనం గరీయః" (అధి.8, అధ్యా.1) ఇతి.

5. తస్య నిర్ణయనవాక్యముత్తరపక్షః- "తదాయత్తత్వాత్. తత్కూట స్థానీయో హి స్వామీ" (అధి.8, అధ్యా. 1) ఇతి.

6. సర్వత్రాయత్తమేకాన్తః- "తస్మాదుత్థానమాత్మనః కుర్వీత" (అధి.1, అధ్యా.19) ఇతి.

7. పశ్చాదేవం విహితమిత్యనాగతావేక్షణమ్- "తులాప్రతిమానం పౌతవాధ్యక్షే వక్ష్యామః" (అధి.2, అధ్యా.13) ఇతి.

వ్యా. 1. మరొక దృష్టాంతం చూపిన దృష్టాంతం 'నిదర్శనం'. "బలవంతునితో విరోధం పెట్టుకొన్నవాడు ఏనుగుతో నేలమీద నిలబడి యుద్ధం చేసినట్లు ఉం టాడు".

2. చెప్పిన ఒక విషయం అన్వయించే దానిని దానినుండి దూరం చేయడం (మినహాయించడం) 'అపవర్గం', "శత్రుబలాన్ని ఎల్లప్పుడు దగ్గరగా ఉంచుకోవాలి; అభ్యంతరకోపం కలిగే శంక ఉంటే మాత్రం ఉంచుకొనకూడదు".ఇక్కడ కొన్ని పరిస్థితులలో మొదట చెప్పినట్లు చేయగూడదు అని చెప్పబడింది గాన ఇది 'అపవర్గం'.

3. ఇతరులు సంకేతంగా గ్రహించని శబ్దం "స్వసంజ్ఞ". "అది ప్రథమప్రకృతి, భూమిసరిహద్దులలో ఉన్నది ద్వితీయప్రకృతి. రాజ్యానికి ఒక రాజ్యం మధ్యలో ఉన్నది తృతీయప్రకృతి". ఇక్కడ 'ప్రథమప్రకృతి' 'ద్వితీయప్రకృతి' మొదలైనశబ్దాలు ఈ శాస్త్రంలో మాత్రమే వాడిన పారిభాషికపదాలు.

4. నిషేధించవలసిన వాక్యం 'పూర్వపక్షం'- "స్వామివ్యసనామాత్యవ్యసనాలలో అమాత్యవ్యసనం గొప్పది" . దీనిని తరవాత ఖండించాడు గాన ఇది పూర్వపక్షం.

5. దానికి నిర్ణయాన్ని బోధించే వాక్యం 'ఉత్తరపక్షం'- "వానిమీద ఆధారపడి ఉండడంవల్ల స్వామి దానికి కూటస్థానంలో ఉన్నవాడు కదా?" ఇది వెనుకటి పక్షాన్ని ఖండించి చెప్పిన ఉత్తరపక్షం, నిర్ణయరూప మైనది.

6. అంతటా, అనగా అన్ని దేశకాలాలలోను ఆచరించదగినది 'ఏకాంతం'- "అందువల్ల తాను కార్యసంసిద్ధుడై ఉండాలి".

7. తరవాత ఇలా విధించబడింది అని చెప్పడం 'అనాగతావేక్షణం'- "తులాప్రతిమానాన్ని గూర్చి పౌతవాధ్యక్షప్రకరణంలో చెపుతాం" అనేది 'అనాగతావేక్షణం'.

మూ. 1. పురస్తాదేవం విహితమిత్యతిక్రాన్తావేక్షణమ్-"అమాత్యసంపదుక్తా పురస్తాత్"(అధి.6, అధ్యా.1) ఇతి.

2. ఏవం నాన్యథేతి నియోగః- "తస్మాద్ధర్మమర్థం చాస్యోపదిశేత్; నాధర్మమనర్థం చ" (అధి.1, అధ్యా.17) ఇతి.

3. అనేన వా అనేన వా ఇతి వికల్పః- "దుహితరో వా ధర్మిష్ఠేషు వివాహేషు జాతాః" (అధి.3, అధ్యా. 5) ఇతి.

4. అనేన చ అనేన చ ఇతి సముచ్చయః- "స్వసంజాతః పితృబన్ధూనాం చ దాయాదః" (అధి.3, అధ్యా. 7) ఇతి.

5. అనుక్తకరణమూహ్యమ్- "యథావద్ దాతా ప్రతిగ్రహీతా చ నోపహ్రాతౌ స్యాతామ్, తథానుశయం కుశలాః కల్పయేయుః" (అధి.3, అధ్యా.16) ఇతి.

వ్యా. 1. వెనుక ఈ విధంగా చెప్పబడింది అని చెప్పడం 'అతిక్రాంతావేక్షణం' - "అమాత్యసంపద వెనక చెప్పబడినది". అని.

2. ఇది ఇట్లే; మరొక విధంగా కాదు అని చెప్పడం 'నియోగం', "అందువల్ల వీనికి ధర్మాన్నీ అర్థాన్నీ ఉపదేశించాలి కాని అధర్మాన్ని అనర్థాన్ని ఉపదేశించకూడదు", అని.

3. దీనిచేత గాని లేదా దీనిచేత గాని అని చెప్పడం 'వికల్పం'- "ధర్మిష్ఠవివాహాలయందు పుట్టిన కుమార్తె లైనా..." ఇది వికల్పం.

4. దానిచేత దీనిచేతా కూడ అని చెప్పడం సముచ్చయం- "తనవల్ల పుట్టినవాడు తండ్రికి, తండ్రిబంధువులకు కూడ దాయాదుడవుతాడు" అని.

5. చెప్పబడని దానిని చేయడం 'ఊహ్యం'- "దాత ప్రతిగ్రహీతా కూడ ఏ విధంగా నష్టపోకుండా ఉంటారో ఆ విధంగా నేర్పరులు అనుశయం కల్పించాలి". ఇక్కడ ఎలా కల్పించాలి అనేది కుశలుల ఊహకు విడిచివేయబడింది. (ఇవి మొత్తం ముప్పైరెండు తంత్రయుక్తుల లక్షణాలు).

శ్లో. ఏవం శాస్త్రమిదం యుక్తమేతాభిస్తన్త్రయుక్తిభిః,
అవాప్తౌ పాలనే చోక్తం లోకస్యాస్య పరస్య చ.

వ్యా. ఈ విధంగా ఈ తంత్రయుక్తులతో కూడిన ఈ శాస్త్రం ఇహలోకపరలోకాలు పొందడానికీ, వాటిని పాలించుకొనడానికీ చెప్పబడింది.

శ్లో. ధర్మమర్థం చ కామం చ ప్రవర్తయతి పాతి చ.
అధర్మానర్థవిద్వేషానిదం శాస్త్రం నిహన్తి చ.

వ్యా. ఈ శాస్త్రం ధర్మాన్ని, అర్థాన్ని, కామాన్ని ప్రవర్తింపచేస్తుంది. అధర్మ-అనర్థ-ద్వేషాలను నశింపచేస్తుంది.

శ్లో. యేన శస్త్రం చ శాస్త్రం చ నన్దరాజగతా చ భూః,
అమర్షేణోద్ధృతాన్యాశు తేన శాస్త్రమిదం కృతమ్.

ఇతి కౌటలీయార్థశాస్త్రే తన్త్రయుక్తౌ పఞ్చదశాధికరణే ప్రథమోఽధ్యాయః
తన్త్రయుక్తయః, ఆదితః పఞ్చాశచ్ఛతతమోధ్యాయః.

ఏతావతా కౌటలీయార్థశాస్త్రస్య తన్త్రయుక్తిః పఞ్చదశమధికరణం సమాప్తమ్.

వ్యా. చాణక్యుడు, విష్ణుగుప్తుడు అను నామాంతరాలు గల ఏ కౌటల్యునిచేత శాస్త్రము, ఆయుధమూ కూడ ఉద్ధరించబడినాయో, కోపంతో నందరాజుల చేతిలో ఉన్న భూమికూడ లాగికొనబడినదో అట్టి కౌటిల్యునిచేత ఈ అర్థశాస్త్రం రచించబడినది.

"బాలానందిని" అను కౌటలీయార్థశాస్త్రాంధ్రవ్యాఖ్యానంలో తంత్రయుక్తి అనే పదిహేనవ అధికరణంలో తంత్రయుక్తయః అను ప్రథమాధ్యాయం సమాప్తం. ప్రారంభంనుండి నూటయాభైయైదవ అధ్యాయం సమాప్తం.

ఇంతటితో కౌటలీయార్థశాస్త్రంలో తంత్రయుక్తి అను పదిహేనవ అధికరణం సమాప్తం.

శ్లో. దృష్ట్వా విప్రతిపత్తిం బహుధా శాస్త్రేషు భాష్యకారాణామ్,
స్వయమేవ విష్ణుగుప్తశ్చకార సూత్రం చ భాష్యం చ.
సమాప్తమిదం కౌటలీయమర్థశాస్త్రమ్.

వ్యా. శాస్త్రాలలో భాష్యకారుల కున్న అనేకవిధాలైన అభిప్రాయభేదాలను చూచి విష్ణుగుప్తుడు స్వయంగానే సూత్రమూ, భాష్యమూ కూడ రచించాడు.

పుల్లెల శ్రీరామచంద్రుడు రచించిన కౌటలీయార్థశాస్త్రాంధ్రవ్యాఖ్య"బాలానందిని" సమాప్తం.

వ్యాఖ్యాం శ్రీమద్గణపతిశాస్త్రిణః సంస్కృతాశ్రయామ్,
ఆఙ్గ్లభాషాశ్రయాం కాంగ్లేవిదుషో వైదుషీజుషః.
వ్యాఖ్యాం దృష్ట్వా, పుల్లెల శ్రీరామచన్ద్రేణ యత్నతః,
రచితాన్ధ్రామియం వ్యాఖ్యా నాతిసూక్ష్మధియా మయా,
యత్కృపాలేశసంసర్గాద్వ్యాఖ్యేయం రచితా మయా
తస్యైవ జానకీజానేః పదయోరియమర్ప్యతే.
దేవతానుగ్రహః పిత్రోస్తపశ్చాచార్యసత్కృపా,
కర్త్రాస్మద్గ్రన్థజాతస్య కరణం కేవలం వయమ్.

శ్రీః శ్రీః శ్రీః శ్రీః శ్రీః

శ్రీః

# అనుబంధము

# కొన్ని పదాలకు అర్థాలు

## అ

అంసపథ (పు.) స్థలమార్గం. A land route. An overland route.

అంసభార (పు.) ఒక మనిషి బుజంమీద లేదా వీపుమీద మోయ కలిగిన బరువు.

అకరద (వి.) పన్ను మినహాయింపు ఉన్న.

అకర్మణ్య (వి.) పనిచేయడానికి ఉపయోగించని.

అకృత (వి.) (1) సేద్యంలోనికి తీసికొని రాబడని. (2) ఏర్పరచబడని Not established (3)అమలులో లేని Not current.

అకృతప్రవేశ (వి.) లోపలికి రావడానికి అనుమతి లేని.

అకృత్య (వి.) రాజవిద్రోహిగా చేయశక్యం కాని. దేశద్రోహి కాని. Not likely to be seduced from loyalty. Not liable to be traitorous.

అకోపక (న.) (రాజుకు) ఎదురుతిరగడానికి ఇష్టపడకపోవుట. A disinclination to revolt.

అకోప్య (వి.) నిందింప లేదా నిరాకరింప శక్యం కాని. Not deserving to be condemned or rejected.

అక్ష (పు.) (1) ఐదు, దానిని గుణించగా వచ్చిన సంఖ్యలు. (2) ఒక బరువు (16 మాషాలు).

అక్షణ (పు.) సంచారం నిషేధించిన రాత్రి సమయాలలో సంచరించడం. అలా సంచరించినందుకు జరిమానా.

అక్షపటల (న.) రికార్డులు జాగ్రత్త చేసే ఆడిట్ చేసే కార్యాలయం. The records of audit office.

అక్షశాలా (సీ.) బంగారపు వస్తువులు, వెండివస్తువులు తయారుచేసే కర్మాగారం. Work shop for making gold and silver articles.

అగ్నిష్ఠ (న.) వంటఇల్లు. A fire place. An oven.

అగ్ర (న.) మొత్తం. కూడగా వచ్చిన మొత్తం లేదా మొత్తం ధనం.

అగ్రాహ్య (వి.) ఆక్రమించకూడని, అరెస్టు చేయకూడని, పట్టుకొనుటకు అందని. (న) ఎదిరింపశక్యం కాని స్థితి.

అఘాత (పు.) జంతువధ నిషేధం.

అఙ్క (పు.) ఒడి దగ్గర.

అఙ్కమ్ ఉపస్థిత (వి.) అందుకొనే టంత దగ్గరగా వచ్చిన.

**అభ్యేకృ.** దగ్గరికి వచ్చేటట్లుచేయుట. పట్టు కొనుట. బంధించుట.

**అభ్యేప్రహృ** దగ్గరికి రాగానే కొట్టుట

**అఙ్గవిద్యా** (స్త్రీ.) శరీరావయవ చేష్టల, సంజ్ఞల అర్థం వివరించే శాస్త్రం.

**అఙ్గుష్ఠసందంశ** (పు.)బొటనవేలు, మధ్య వేలు చేర్చి పట్టకారువలె ఏర్పరచిన ముద్ర.

**అజస్ర** వి ఎల్లప్పుడూ కోరబడు. Constantly in demand.

**అజాత్య** (వి.) (1) సరియైన జాతికి చెందని. Illegitimate. నకిలీది. Spurious, Counterfiet.

**అఞ్జన** (న.) (శరీరం) వంచడం.

**అఞ్జనీ** (స్త్రీ.) కాటుకబరిణె.

**అట్టాలక** (పు.) బురుజు. A tower on the parapet. A watch - tower.

**అణి** (పు.) ఒక మూల.

**అణిద్వార** (న.) పక్కతలుపు.

**అణిహర్మ్య** (న.) పక్కగది. చిన్నగది.

**అతజ్జాత** (వి.) ఒక జాతికి లేదా తరగతికి చెందని Not of a particular class or kind.

**అతికర్షణ** (న) దున్నడంలో రోడ్డును ఆక్రమించడం. ఆ విధంగా మార్గం చిన్నదై పోయేటట్లు చేయడం.

**అతిక్రాన్త** (వి) (1) దాటపెట్టబడిన Passed over. put off (2) వ్యాపించిన. (3) బైటకు నడచిన Marching out.

**అతిగత** (వి.) వ్యాపించిన Gone to

**అతిచార** (పు.) వ్యభిచారం Transgression of marital duties. చెడ్డ నడవడిక Misconduct.

**అతినయన** (పు) రహస్యంగా చేర్చడం. Conveying (of troops, secret agents etc.) secretly smuggling.

**అతినీ** (ధాతువు.) రహస్యంగా చేర్చు; లోనికి ప్రవేశపెట్టు 2. ప్రేరేపించు.

**అతిపత్తి** (స్త్రీ.) దాటబెట్టడం. సకాలంలో చేయవలసినది చేయక పోవడం Lapse.

**అతిపాతన** (న.) దాటబెట్టడం Missing.

**అతియాచ్ఞా** (స్త్రీ.) చాల ఎక్కువగా అడగడం. Making an exorbitant demand.

**అతిలబ్ధ** (వి) చాల తీవ్రమైన చర్య తీసికొన బడిన Treated with great severity. Heavily chastised.

**అతివాహ్** (ప్రేరణార్థక ధాతువు) ఒక కేసు ముందుకు నడిపించడం. ఒక కేసు నిర్ణయించడం to Dispose of (a case).

**అతివాద** (పు.) (1) అత్యధికస్తుతి (2) నిందించుట Reproof; reprimand.

**అతిశయ** (పు.) విశేషగౌరవం A special favour.

**అతిసంధా** (ధాతువు) ఓడించు To over reach; to outwit, to cheat.

**అతిసంధి** (పు.) లాభకరమైన సంధి A pact more advantageous to one self.

**అతిసర్గ** (పు.) (1) విడిచివేయడం Giving up, surrender. (2)అనుమతి ఇవ్వడం Granting permission, allowing.

**అతిసారణ** (న.) ఇతరదేశాలలోనికి తీసికొని వెళ్లడం Smuggling.

**అతిహృ** (ధా.) కేసు కొట్టివేయు To throw out, to dismiss ( a suit).

**అత్యయ** (పు.) (1) పెనాల్టీ Penalty (2) పన్ను Tribute.

**అత్యరాల** (పు.) మదస్రావసమయం దాటిన ఏనుగు.

**అత్యావాప** (పు.) రాజద్రోహులు రహస్యంగా ప్రవేశించడం Infiltration of traitorous elements.

**అత్యాసద్** (ప్రే.ధా) ఎదిరించు, ముట్టడించు.

**అత్యాహిత** (వి.) దూకుడుగా ఉన్న. సాహసికుడు Rash, daring.

**అత్యాహృ** (ప్రే.ధా.) పన్నులు ఎక్కువగా విధించు To over tax; to extort money from.

**అత్యుష్ణోపక్షీణ** (వి) ఎక్కువగా ఉన్న వేడి తగ్గిన.

**అదితికౌశికా** (పు.) ఏదో ఒక దేవతకు సంబంధించిన ధ్వజం ధరించి భిక్షాటనం చేసే, ఒక మతానికి చెందినవాడు.

**అదేవమాతృక** (వి.) వర్షంమీద ఆధారపడకుండా కాలువలు మొదలైనవి ఉన్న పంట భూములున్న దేశం.

**అదేశిక** (వి.) మార్గదర్శకుడు లేని Without a guide.

**అద్వారాసంగ** (పు.) ద్వారం దగ్గర అడ్డుకొనబడని, అడ్డు లేని ప్రవేశం గల.

**అద్వైధ్య** (వి.) మారు అభిప్రాయాలు ఏవీ లేని Not having seperate interest. Not given to duplicity. Not liable to double cross.

**అధికరణ** (న.) (1) కార్యాలయం. ఒక శాఖ (2) ఇనుపదిమ్మ Anvil.

**అధిచర్** (ధా.) వ్యభిచారం చేయు.

**అధిమిహ్** (ధా.) వ్యభిచారం చేయు; చెడ్డగా ప్రవర్తించు.

**అధిశ్రయణ** (న.) వండుట.

**అధిష్ఠాతృ** (పు.) పైనుండి తనిఖీ చేసేవాడు Supervisor.

**అధిష్ఠాన** (న.) (1) మూలాధారం (2) ఉండే స్థానం (3) ప్రధానస్థానం.

**అధ్యక్ష** (పు.) ఒక శాఖకు అధిపతి A departmental head, Director, Superintendent.

**అననుబన్ధ** (వి.) కొనసాగించడం లేని. రావలసిన ఫలితం రాని Without a following or consequence.

**అనన్యదోహీ** (వి.) ఇతరులను పాలు పితకనివ్వని (ఆవు).

**అనపసార** (వి.) సరియైన కారణం లేని Without a valid reason.

**అనపాకర్మన్** (న.) పని ముగించని Not carrying out, non-fulfilment.

**అనభిసార** (వి.) (1) నాది అని చెప్పబడని Unclaimed (2) నిలవలు మొదలైన సహాయంలేని Without help (of reserves, supplies etc).

**అనయ** (పు.) దురదృష్టం, దైవవైపరీత్యం.

**అనర్థ్య** (వి.) అనర్థానికి కారణమైన.

**అనవగ్రహ** (వి.) అడ్డులేని unrestrained.

**అనవద్య** (-రాగ -వర్ణ.) ఎఱ్ఱని.

అనవసిత (వి.) ఉపయోగించని (భూమి) Unoccupied (land) నివసించని(ఇల్లు)
అనవస్థా (స్త్రీ.) అనిశ్చితత్వం.
అనవస్థిత (వి.) స్థిరత్వం లేని.
అనాత్మన్ (వి.) దుష్టుడు, దేశద్రోహి, రాజద్రోహి.
అనాథ (పు.) మరణించినవాడు.
అనాయతి (వి.) ఆదాయంలేని In which there is no income or revenue.
అనాయతివ్యయ (వి.)ఆదాయం వచ్చే మార్గాలు లేకుండా ఖర్చుపెట్టేవాడు.
అనాయుక్త (పు.) నియమించబడనివాడు అధికారం ఇవ్వబడనివాడు One not appointed, an unauthorised person.
అనాశవినాశకరణ (న.) పోయిన సొత్తుకు సంబంధించిన కార్యాలయం.
అనాసార (వి.) మిత్రసహాయం లేని.
అనాస్పద్యత్వ (న.) ఒత్తిడి మొదలైన వాటికి లొంగకపోవడం Unamenability to influ ence etc.
అనిగ్రహేణ (అవ్య.) బలవంతం చేయకుండా Without compulsion.
అనిర్బన్ధగామిన్ (వి.) ఏ అడ్డూ లేకుండా అందరికీ వర్తించే Affecting (all) with out restriction; coming without restrictions.
అనిర్వాహ్య (వి.) విదేశాలకు పంపకూడని Which can not be exported.
అనిఃశ్రావిన్ (వి.) బైట మాటలు విననీయని, బైట మాట లాడుకొననీయని.
అనిష్కాసినీ (స్త్రీ.) ఇంటి గుమ్మం దాటి బైటకి వెళ్లని స్త్రీ.
అనిఃస్రావిశత్రు (వి.) శత్రువు బైటకు జారి పోకుండా చూచేవాడు.
అనిసృష్ట (వి.) అనుమతిలేని Unauthorised, without authority or permission.
అనీకసంధి (పు.) యుద్ధవ్యూహాల మధ్య ఖాళీప్రదేశం.
అనీశ్వర (వి.) అసమర్థుడు.
అను (అవ్య.) పిమ్మట.
అనుక్షి (ధా.) (1) నశించకుండా మిగలడం Survive, (2) (మరణాన్ని గూర్చి) చింతించడం, ఆలోచించడం.
అనుగుణ (వి.) అనుకూలమైన
అనుగ్రహ (పు.) (1) అప్పు ఇవ్వడం, ముందుగా కొంతధనం ఇవ్వడం, కొన్ని రాయతీలు Favour, i.e. loan, advance (2)పాటించడం observance.
అనుత్తబ్ధ (వి.) చేయూత ఇవ్వబడని Unsupported .
అనుత్థాన (న.) ఉత్సాహంగా పనిచేయక పోవడం.
అనుపాత (పు.) (1) కదలిక (2) వెంబడించడం.
అనుపృష్ఠమ్ (క్రి.వి.) ఒకరివెనుక ఒకరు.
అనుప్రవిశ్ (ధా.) నమ్మకం కలిగించడం, విశ్వాసం పుట్టించడం.
అనుప్రవేశ (పు.) దుష్టబుద్ధితో వెళ్లకూడని చోటికి వెళ్లడం Tresspass with criminal intention.

అనుబన్ధ (పు.) (1) అవిచ్ఛిన్నత్వం Con tinuity (2) ఫలితం Consequence, result

అనుయోగ (పు.) (1) ప్రశ్నించడం. పరిశోధించడం Examination, interrogation, investigation. ప్రశ్నలకు సమాధానాలు Replies to interroga tion (2)విధించడం, బోధించడం Prescription. teaching.

అనువంశమ్ (క్రి.వి.) మధ్యరేఖ గుండా Along the centreline.

అనువర్తన(న.) ముందుకు తీసికొని రావడం Bringing forward.

అనువాసన (న.) ఉదరప్రక్షాలనం A stomach - wash.

అనువాసిత (వి.) ఉంచబడిన, సంరక్షించబడిన Maintained, kept.

అనువృత్త (వి.) ముందుకు తీసికొని రాబడిన, ముందుకు నడపబడిన, అమలులో ఉన్న Brought forward, carried on, current in existence.

అనువృత్తి (స్త్రీ.) ముందుకు తీసికొని వెళ్లడం. అవిచ్ఛిన్నంగా ఉండడం Bringing forward, continuity.

అనువేశ (పు.) పక్క ఇంటివాడు The immediate neighbour పక్కింటికి తరవాతి ఇంటివాడు. The next but one neighbour.

అనుశయ (పు.) రద్దుచేయడం. Revocation, annulment.

అనుశాల (పు.) దగ్గర ఉన్న ఆవరణ. An adjoining enclosure. అనుసాల, నగరప్రాకారం దగ్గర ఉన్న ప్రదేశం.

అనుశాస్ (ధా.) తీర్పు చెప్పడం.

అనుశిష్ట (వి.) తీర్పు చెప్పబడిన; నిర్ణయించబడిన

అనుశీ (ధా.) (1) అనుమతి ఇచ్చు To allow, permit. (2) ప్రక్కనపండుకొను.

అనుసార (వి.) అత్యుత్తమమైనదాని తరవాతది. The next best. The second best.

అనేకముఖ (వి.) అనేక ప్రదేశాలలో నడపబడిన.

అన్తఃకోప (పు.) లోపలి తిరుగుబాటు. An insurrection inside the state or capital.

అన్తఃపుర (న.) రాజప్రాసాదం. రాజ నివాసం

అన్తఃపురభాజనీ, అన్తఃపురభాజనీయ (వి.) రాజభవనం లోనికి సరఫరా చేయడం కోసం ఉపయోగించే తూకం లేదా కొలత.

అన్తభేదిన్ (వి.) కక్ష-పక్షాలతో శత్రు సైన్యాన్ని భేదించగల.

అన్తర్ (అవ్య.) రెండు బలం కల రాజ్యాల మధ్య ఉన్న దుర్బలమైన రాజ్యం, A weak state between two powerful states, a buffer state.

అన్తరచక్ర (న.) రాబోయే విషయాలను గూర్చి చేప్పే ఒక రహస్యవిద్య.

అన్తరపతిత (వి.) మిగిలినది. Balance.

అన్తరపర్ణ (న.) అక్కౌంటుపుస్తకంలోని ఒక ఆకు (పేజి).

అన్తరమాత్యకోప (పు.) రాజప్రాసాదానికి చెందిన అధికారుల ప్రకోపం

(తిరుగుబాటు).

అన్తరవక్షా (పు.) లోపల జరిగే విరేచనం.

అన్తరికా (స్త్రీ.) రెండు ఇరుగు పొరుగు ఇళ్ల మధ్య ఉన్న సందు.

అంతర్ధి (పు.) చూ. 'అన్తర్'.

అన్తర్యామికమ్ (క్రి.వి.) రాత్రిజనసంచారం. నిషేధించిన జాములలో .

అన్తర్వంశిక (పు) అంతఃపురరక్షకుల నాయకుడు.

అన్తర్వంశిక సైన్య (న.)అంతఃపురరక్షక సైన్యం.

అన్తఃశిఖ (వి.) లోపలిసరుకుతో కలిపి లెక్కించిన కొలపాత్రల మీద శిఖరంగా ఏర్పడిన సరుకు (ధాన్యం, పిండి మొదలైనవి).

అన్తేవాసిన్ (పు.) కూడా ఉండేవాడు. సహాయకుడు. An attendent, assistant.

అన్యజాత (వి.) చిల్లర మల్లరగా వచ్చినది. Derived from miscella neous sources.

అన్యభావ (వి.) ద్వేషభావం గల.

అన్వయ (పుం.) బలాత్కారంగా తీసికొనే వస్తువు యజమాని అక్కడనే ఉండుట.

అన్వర్థిన్ (పు.) ఆధారపడినవాడు.

అన్వాధి (పు.) (1) ఎవనిదగ్గర ఏదైన ఒక వస్తువు ఉంచబడుతుందో అతడు. (2) మరొకని కిమ్మని ఒకని చేతి కిచ్చిన వస్తువు.

అన్వాయతి (స్త్రీ.) మనుష్యుల, వస్తువుల సరఫరా.

అన్వాయన (న.) అత్తవారింటికి వెళ్లే పెండ్లికూతురుతో పంపే అరణం.

అన్వావాప (పు.) ఎక్కువ ఉన్న సేనాంగాన్ని ఆ సేనాంగంతో కలుపుట.

అన్వావృత్తి (స్త్రీ.) సైన్యవ్యూహాలు ఒకదాని వెనుక ఒకటి కదలడం.

అవక్షేప (పు.) జూదంలో మోసంతో కూడిన ఆట.

అపచర్ (ధా.) చెడ్డగా ప్రవర్తించు. (ప్రేరణార్థకం) కలుపు. కలితీచేయు.

అపచరణ (న.) మోసం.

అపచరిత (వి.) తిరుగుబాటు చేసిన.

అపచార (పు.) మోసం.

అపచ్ఛిన్న (వి.) లాగికొనబడిన.

అపజిహ్వికా (స్త్రీ.) నాలుకను ఊడబెరుకుట లేదా పాడు చేయుట.

అపదాన (న.) చెడునడవడిక, అపరాధం. An offence, crime.

అపదిష్టక (వి.) అపరాధం మోపబడిన, Implicated, charged.

అపదేశ (పు.)వాఙ్మూలం. A statement, a declaration.

అపనయ (పు.) చెడునీతి, Wrong policy.

అపనేయిమన్ తగ్గింపు. Diminution, (పు.) reduction

అపరిగృహీత (వి.) చుట్టూ బంధింపబడని, అలాంటి అరణ్యంలో లేని. Not enclosed, not in a reserved forest (2) సొంతం చేసికొనని Not possessed, not owned.

అపరిపణిత (వి.) ఏ షరతులూ పెట్టని, Without stipulations or conditions.

అపరుద్ధ లేదా అవరుద్ధ (పు.) రాజుకు

అనిష్టుడైన రాజకుమారుడు.

**అపవహ్** (ప్రేరణార్థక.) (1) మోసికొనిపోవు, (2) ఒకనిని దూరంగా పంపివేయు. తనను తాను కనబడకుండా చేసికొను.

**అపవాహన** (న.) లోనికి తీసికొనివచ్చుటకు తీసికొనివచ్చుట, మరొకచోటికి వెళ్లడానికి ప్రోత్సహించుట carrying off so as to bring in, inducing immigra tion.

**అపవాహిత** (వి.)లోభపెట్టి వశం చేసికొన్న, అపహరించుకొని పోబడిన (మనిషి) Enticed; Kidnapped.

**అపవృత్త** (వి.) గెంటివేయబడిన.

**అపవ్యయ్** (ధా.) నిరాకరించు To deny.

**అపవ్యయన** (న.) నిరాకరించుట.

**అపసంధేయ**(వి.) చేసుకొన్న సంధి భంజించదగినవాడు.

**అపసర్ప** (పు.) గూఢచారి A secret agent, spy.

**అపసర్పణ** (న.) (1) గూఢచారిని ప్రయోగించుట, (2) గూఢచారిని నియమించుట, (3) (ఒకనిని)గూఢచారిచర్యలకు గురిచేయుట.

**అపసవ్యమ్** (క్రి.వి.) అప్రదక్షిణంగా.

**అపసార** (పు.) (1) తప్పించుకొనిపోవడం. దూరంగా వెళ్లిపోవడం. (2) తప్పించుకొని పోవడానికి ఉపాయం, (3) వెనుకకి వెళ్లడానికి తగిన ప్రదేశం, (4) నిరపరాధినిగా రుజువు చేసికొనే ఉపాయం. Means of exoneration, an excuse. ఒకడు నిరపరాధి అని రుజువుచేసేవాడు.

**అపసారక** (న.) వర్షానికి తడవని ఒకరకమైన ఉన్ని వస్త్రం.

**అపసారిన్** (వి.) తిరిగి వెళ్లిపోవడానికి తగిన చోటు ఉన్నవాడు.

**అపసృ** (ధా.) (1) తప్పించుకొని పోవు (2) తనను నిరపరాధినిగా చేసుకొను. (ప్రేరణార్థకం) దూరంగా పంపివేయు.

**అపసృత** (వి.) విడచి వెళ్లిపోయిన, మరొకచోటినుండి వచ్చిన.

**అపస్రు** (ధా.) దూరంగా వెళ్లిపోవు.

**అపహ్ను** (ధా.) అన్నమాట వెనుకకు తీసికొను Retract.

**అపాతనీయ** (వి.) కాలం మించిపోనివ్వడానికి తగని. Not to be allowed to lapse, not to be remitted.

**అపార్ష్ణి** (వి.) వెనుక శత్రువు లేని.

**అపాశ్రయ** (పు.) (1) ఆశ్రయం, ఆధారం, (2) ఇంటిపైకప్పు, ఎత్తు.

**అపాశ్రయవత్** (వి.) అధారపడిన, Dependent.

**అపురోగ** (వి.) నాయకుడు కాని.

**అప్రతిరాగిన్** (వి.) రంగు అంటని.

**అప్రతివిద్ధ** (వి.) గుర్తువేయని Unstamped.

**అప్రతిశ్రావిణీ** (వి.) అంగీకరించని.

**అప్రవాసిత** (వి.) చంపబడని.

**అప్రవేశన** (న.) (కోశాగారంలో) ప్రవేశపెట్టకపోవుట.

**అప్రసార** (వి.) సాక్ష్యం ఇవ్వడానికి ముందుకురాని.

**అప్రాప్తక** (వి.) సర్వాంగపూర్ణంగా చేయ

బడని, పరిశుద్ధము కాని. Not perfected; impure.

అప్రాప్తఫలా (స్త్రీ.) రజస్వల కాని.

అప్రార్థనీయ (వి.) ఎదిరించుటకు తగని. Not fit to be attacked.

అభయవన (న.) ఇక్కడ ఉన్న మృగాలను చంపకూడ దని శాసించిన వనం.

అభికాశ (వి.) ప్రకాశిస్తున్న, శుభ్రమైన.

అభిగమ (పు.) అభిగమన (న.) అనుమతిలేని ప్రవేశం. Tresspass.

అభిగృహీత (వి.) బంధించబడిన, అరెస్టు చేయబడిన.

అభిగ్రస్ (ధా.) ఎక్కువగా భయపెట్టు, హడలకొట్టు.

అభిగ్రహ్ (ప్రేరణార్థకం.) సవాల్‌చేయు To challenge.

అభిగ్రహ (పు.) స్వాధీనం చేసికొనుట, నిగ్రహించుట.

అభిచర్ (ధా.) అభిచారప్రయోగంచేయు.

అభిజ్ఞానమ్ (న.) గుర్తింపు కార్డు.

అభిత్యక్త (పు.) మరణశిక్ష విధించిన అపరాధి.

అభినివేశ (పు.) వాఙ్మూలం, A statement, an affidavit.

అభినీ (ధా.) తెలియపరచు To represent, to bring to the notice of, to inform.

అభినీత (వి.) కొట్టవచ్చినట్లు ఆడంబరంగా లేని. అందంగా తయారు చేసిన, Not gaudy, well finished.

అభిపన్న (వి.) లొంగిపోయిన.

అభిప్రజాత (వి.) సంతానం కనిన.

అభిప్రధర్షణ (న.) బ్రద్దలుకొట్టి తెరచుట.

అభిప్రేత (వి.) అనుమతించబడిన, అధికారం ఉన్న, సామర్థ్యం ఉన్న, నేర్పుగల. Approved (or) competent, skilled.

అభిప్లుత (వి.) అందరికీ వర్తించే. Of universal application.

అభిమన్ (ధా.) ఆశించు, దురాశ చూపు Covet, to entertain a sinful desire for.

అభిమన్తృ (పు.) దురాశ గలవాడు.

అభిమృష్ట (వి.) చెడ్డపనికి పురిగొల్పబడిన, మాయచేసి తీసికొనిపోబడిన, అపహరింప బడిన. Seduced, enticed away, abducted.

అభియోగ (పు.) పరిశ్రమ, ప్రయత్నం, దెబ్బకొట్టడం Exersion, assault.

అభిరూప (వి.) (1) మామూలుగా ఉన్న Normal, usual (2) appropriate, suitable.

అభివద్ (ధా.) (1) కేసుపెట్టు, To file a claim. to sue. (2) జుర్మానావేయు To impose as fine.

అభిషుత (వి.) వడగట్టిన Distilled.

అభిష్యన్ద (పు.) (జనాభా) ఎక్కువ పెరిగి పోవుట Overflow, excess of popu lation.

అభిసంవస్ చాల దగ్గరవాడవడం; (ప్రేరణార్థక.) వశం చేసికొనడం.

అభిసార, అభిసారిన్ (వి.) రక్షించడానికి వచ్చిన.

అభిసారక (వి.) ఒకనిమీదికి దూసికొని పోయేవాడు.

అభిసృ (ధా.) రక్షించడానికి వెళ్లు.

అభిసృత (వి.) రక్షించడానికి వెళ్లిన.
అభిహాస్య (వి.) హాస్యాస్పదమైనది.
అభిహూలిక (పు.) (శత్రువును) జయించినవాడు.
అభిహృ (ధా.) రక్షించు (ప్రేరణార్థకం) : తీసికొనిపోవు. తన వైపునకు మరల్చు కొను To winover. అపహరించు kidnap.
అభూతపూర్వ (వి.) పూర్వం ఎవరూ నివసించని లేదా వ్యవసాయం చేయని భూమి. పూర్వం ఉపయోగించని గని.
అభ్యధిగన్తృ (పు.) అనుమతి లేకుండా ప్రవేశించేవాడు. Tress- passer, రహస్యంగా ప్రవేశించేవాడు.
అభ్యన్తర (పు.)లోపల ఉన్న లేదా రాజధానిలో ఉన్న అధికారి.
అభ్యన్తరకోప (పు.) లోపల ఉండే అధికారియొక్క తిరుగుబాటు.
అభ్యవపత్తి (స్త్రీ.) లొంగిపోవుట.
అభ్యాగారిక (పు.) ఇంట్లో పనిచేసే సేవకుడు.
అభ్యాభూ (ధా.) అధికారం కలిగి ఉండు. To have right to.
అభ్యావహ్ (ధా.) బాధ్యతకలవాడగు. To be responsible for; to be liable for.
అభ్యుపపత్తి (స్త్రీ.) సహాయం.
అభ్యుపపద్ (ధా.) సహాయం చేయు.
అభ్రపటల (న.) మైకా. A covering mica.
అమూఢసంజ్ఞ (వి.) తెలివిగా ఉన్న Not unsound of mind.
అమ్బరీష (న.) నిప్పులుపోసిన గుంటకుంపటి.
అమ్లశీధు (న.) పుల్లని మద్యం.
అయ (పు.) మంచి అదృష్టం.
అయుక్త (వి.) పనిలో శ్రద్ధలేని, అధికారి కానివాడు.
అరాజవాచ్య (వి.) రాజుచేత దూషించబడని. రాజానుగ్రహపాత్రుడు.
అరాలా (స్త్రీ.) తోలుపట్టా (జూదంలో ఉపయోగించేది).
అరిభావిన్ (వి.) శత్రుత్వబుద్ధి గలవాడు.
అరిష్ట (న.) ఒక ఓషధి.
అరూపవేలా (స్త్రీ.) మనిషి స్పష్టంగా కనబడని సమయం.
అర్థచర(పు.)ధనంతో వ్యవహరించే అధికారి.
అర్థయుక్తి (స్త్రీ.) (తనకు) లాభం చూచుకొనుట.
అర్థానుశాసన (న.) అభివృద్ధి సంపాదించుట.
అర్థ్య (వి.) లాభకరమైన.
అర్థ్యప్రతీకార (వి) కలిగిన నష్టాన్ని పూడ్చేది.
అర్ధచన్ద్రక (వి.) అర్ధచంద్రాకారంలో ఉన్న.
అర్ధసీతిక (పు.) పంటలో సగం ఇచ్చే ఒప్పందంమీద భూమి దున్నేవాడు.
అల్పావాప (వి.) చాల తక్కువమంది రాజద్రోహం లున్న.
అవక్లప్తిక (వి.) అనుకూలమైన.
అవకేశిన్ (వి.) కాయలు కాయని.
అవక్తవ్యకర (వి.) నిర్దుష్టమని అంగీకరించబడిన, దోషాలు లేనివాళ్లు చేసిన.
అవక్రయ (పు.) అద్దెకు ఇచ్చుట. అద్దె.
అవక్రయిన్ (పు.) అద్దెకు ఉన్నవాడు.

**అవక్రీతక** (వి.) అద్దెకు తీసికొన్న వస్తువు.

**అవక్షిప్** (ధా.) త్రోసిపుచ్చు. డిస్మిస్ చేయు.

**అవక్షిప్త** (వి.) (1) డిస్మిస్ చేయబడిన, (2) ఒకనికి ఒక వస్తువు లేకుండా చేయుట, (3) చేతితో చేసిన మోసం slight of hand.

**అవక్షేపసోపాన** (న.) మెట్లు. క్రిందికి త్రోసి వేయడానికి పైకి లాగడానికీ అనువైన నిచ్చెన.

**అవగూర్ణ** (న:) పీడించుట, కొడతానని బెదిరించుట.

**అవగృహీత** (వి.) నిరోధింపబడిన, అణగ ద్రొక్కబడిన.

**అవగ్రహ్** (ధా.) వశంలో ఉంచుకొను, అణగద్రొక్కు.

**అవగ్రహ** (పు.) అణచివేయుట.

**అవఘట్ట్** (ప్రే.అ.) మరొకనిచేత యుద్ధం చేయించు.

**అవఘుష్** (ధా.) చాటించు.

**అవతారిత** (వి.) సంపాదించబడిన, వసూలుచేయబడిన (పన్ను మొ.).

**అవదాన** (న.) మంచినడవడిక.

**అవధాన** (న.) కలిపి పట్టుకొనుట.

**అవధారణ** (న.)నిబంధన. limitation, restriction.

**అవధృత** (వి.) నిశ్చితమైన, మాటఇచ్చిన Assured, given assurance.

**అవపాత** (పు) క్రిందికి పడుట. దిగిపోవుట.

**అవపాతన** (న.) గొయ్యి (పైకి కనబడనిది). Trap, pit.

**అవమర్ద** (పు.) (కోటను) ముట్టడించుట, హటాత్తుగా ముట్టడించి ఆక్రమించుట.

**అవమర్శభిత్తి** (స్త్రీ.) చిన్నగోడ దాపుగా ఉంచిన గోడ.

**అవమానమ్** (న.) లోతు.

**అవమృష్ట** (వి.) స్పృశించబడిన, తనదిగా చేసికొనబడిన appropriated.

**అవరార్ధ్య** (వి.)కనీసం. Least, minimum.

**అవరుద్ధ** (వి.) బంధించబడిన, చుట్టూ కట్టబడిన, నిర్బంధించబడిన.

**అవరుధ్** (ధా.) బంధించు, అంతఃపురంలో ఉంచు.

**అవరోధ** (పు.) ముట్టడి, బంధించుట.

**అవరోపిత** (వి.) పాతిపెట్టబడిన, శూలాదులమీద గ్రుచ్చబడిన (శరీరం).

**అవలిప్** (ధా.) పైన పూతపూయు.

**అవలీన** (వి.) తప్పిపోయిన, కనబడకుండా పోయిన.

**అవలేప్య** (న.) బంగారం మొదలైన వాటితో పైపూత.

**అవశీర్ణక్రియా** (స్త్రీ) చెడిపోయిన సంబంధాలు బాగుచేయుట.

**అవసిత** (వి.) ఆక్రమించబడిన, ప్రవేశించబడిన, Occupied.

**అవసుత** (వి.) కలపబడిన (ద్రవపదార్థాలు).

**అవస్కన్ద** (పు.) హటాత్తుగా ఆక్రమణం.

**అవస్కన్దిత** (వి.) పారిపోయినవాడు; కనబడకుండ పోయినవాడు absconded.

**అవస్కర** (పు.) పేడకుప్ప.

అవస్తార (పు.)రావలసిన సొమ్ము వసూలుచేయవలసిన సమయం కప్పి పుచ్చుట.

అవస్తృ (ధా.) దాచుట, ధనం అపహరించుట. To misappropriate.

అవస్థ (పు.) జామీను Surety.

అవస్థా (స్త్రీ.) పూచీ ఇచ్చుట Guarantee.

అవస్థాపనా (సీ.) జామీను ఇచ్చుట Giving a surety, appointing as a surety.

అవస్థాయ (అవ్య.) జామీనుఇచ్చి, అది అట్లని ప్రతిపాదించి.

అవస్రావణ (న.) దేశంనుంచి పంపి వేయుట.

అవస్రావ్యుదక (వి.) దేనినుంచి నీరు ప్రవహించేటట్లు చేయబడినదో అది.

అవస్రు (ప్రే..ధా.) (1)ప్రవహింపచేయు, (2) రాజ్యం నుంచి బహిష్కరించు, (3) కనబడకుండచేయు, (4) నశింపచేయు.

అవహీన (వి.) (1) తగ్గిన, (2) చాలనీచుడు, (3) లోటుగల (న) పోయినది.

అవార (పు.) వంతుకానిది.

అవిధేయక (వి.) ఉపయోగించశక్యం కాని. ఎందుకూ ఉపయోగించని.

అవినిపాతిన్ (వి.)నశించని.

అవిప్రతిపత్తి (సీ.) కంగారుపడకపోవడం, అతిగా పనిలో తల దూర్చక పోవడం.

అవిషమమన్త్ర (వి.) పరస్పరవిరుద్ధమైన మాటలు చెప్పక పోవడం.

అవిషహ్య (వి.)(1) సహింపశక్యంకాని, (2) ఎదిరింపశక్యం కాని, (3) తగని, అంగీకారయోగ్యం కాని.

అవిసంవాదక (వి.) మాటతప్పనివాడు.

అవిసంవాదిత (వి) మోసగించబడని, దిగాలుపడని.

అవేదక లేదా ఆవేదక (పు.) ప్రతివాది, Defendent.

అశుశ్రూషా (సీ.) వైవాహికధర్మాలు నిర్వర్తించకపోవడం.

అశ్రాన్తపదతా (సీ.) పదాలు తమ అర్థం స్పష్టంగా చెప్పుట.

అశ్వవాహ (పు.) గుఱ్ఱాల కాపరి.

అశ్వవాహా (సీ.)గుఱ్ఱాలను పోషించడం.

అష్టక (న.) లక్క.

అసంస్కృత (వి.) (1) సరిగా తయారు చేయబడని, (2) చేయబడని లేదా బాగు (రిపేరు) చేయబడని.

అసక్తారమ్భ (వి.) తలపెట్టిన పనులలో ఏ అడ్డంకులూ లేని.

అసంఖ్యాత (వి.) ఫలానా అని నిర్దేశింపబడని.

అసంగ (పు.) అడ్డంకులులేని; ఆలస్యం లేని.

అసత్ప్రగ్రహ (పు.) చెడ్డవాళ్లకి సహాయం చేయుట.

అసమన్త్ర (వి.) సమానమైన ఆలోచన లేని.

అసమిత (వి.) అంగీకరించబడని.

అసంపాత (పు.) కూడబెట్టకపోవుట, జనసంమర్దం లేకపోవుట. జోక్యం కలగచేసికొనకపోవుట.

అసంపాతిన్ (వి.) గుమిగూడని.

అసంపీత (వి.) మెరుస్తూ కనబడడానికి తడపని. అసంవీత (వి) రంగుమాయని.

**అసంప్లుత** (వి.) పార్లిపోని.

**అసంభాషా** (స్త్రీ.) మాటలాడకూడదను నిషేధం, మాటలాడే అవకాశం లేకపోవుట.

**అసంమోష** (పు.) జాగర్తగా రక్షిస్తూ (చూస్తూ) ఉండడం.

**అసార** (వి.) సారంలేని, శూన్యమైన. (పు) దివాళా తీసినవాడు.

**అస్వకరణ** (వి.) తనదని చెప్పడానికి ఆధారాలులేని Who has no title or right to ownership.

**అహంవాదిన్**(వి.) (నేను సాక్ష్యం చెపుతానని) ముందుకు వచ్చేవాడు.

**అహిపృష్ఠ** (న.) శత్రుసైనికులను మోస గించడానికి (To trap) ఒకానొకసాధనం.

**అహిభయ** (న.) ఇంట్లో ఉన్న పాము నుండి కలిగే భయం వంటి భయం.

**అహోరూప** (న.) రోజువారీ లెక్కలు The day to day accounts.

## ఆ

**ఆకరిక** (పు.) గనిలో పనిచేసేవాడు.

**ఆకార** (పు.) ముఖకవళికలు.

**ఆక్రన్ద** (పు.) వెనుక ఉన్న మిత్రరాజు.

**ఆక్రన్దాసార** (పు.) వెనుక ఉన్న మిత్రుని మిత్రుడు.

**ఆక్షిక** (పు.) జూదరి, (న) జూదం మూలాన అప్పు.

**ఆక్షిప్** (ధా.) తీసికొనిపోవు.

**ఆగన్తు** (వి.) బైటనుండి వచ్చిన, విదేశీ యమైన (పు) విదేశీయుడు, క్రొత్తవాడు.

**ఆగన్తుక** (వి.) విదేశీయుడు.

**ఆగమ్** (ప్రే.) నేర్పు, తెలుసుకొను To find out.

**ఆగమ** (పు,) (1) సంపాదించుట. సంపాదిం చిన మార్గము, (2)ఎక్కడినుండి వచ్చినదో ఆ స్థానము Place of origin.

**ఆఙ్గరజ** (వి.) విదిశా - నర్మదా-బ్రహ్మవర్ధన- పారియాత్ర పర్వతాల మధ్య ఉన్న అంగరదేశంలో జన్మించిన.

**ఆచామోదక** (న.) భోజనం తరవాత పుక్కి లించే నీళ్లు.

**ఆచితకపత్ర** (న.) మరొకపాత్రకు అతక డానికి తయారుచేసిన బంగారురేకు.

**ఆజాత** (వి.) రాజుయొక్క అశ్వని వాసాది స్థానాలలో పెరిగిన.

**ఆజీవ** (పు.) (1) జీవనోపాధి, రాబడి, (2) లాభం, (3) నాణాలకు ఉపయో గించే ఒక మిశ్రలోహం.

**ఆజీవక** (పు.) మక్ఖలి గోపాలుడు స్థాపించిన ఒక నాస్తిక సంఘం.

**ఆటవిక** (పు.)అడవిరాజు.

**ఆణి** (పు.) లేదా **ఆణీ** (స్త్రీ.) ఒక మూల లేదా ఒక ప్రక్క.

**ఆణిద్వార** (న.) ప్రక్కద్వారం.

**ఆణిహర్మ్య** (న.) ప్రక్కగది, చిన్నగది.

**ఆతిథ్య** (న.) విదేశవస్తువులమీద పన్ను Duty on foreign goods. excise duty.

**ఆతిపాతిక** (వి.) పాడైపోయే స్వభావం గల Perishable.

**ఆతివాహిక** (పు.) దారిలో రక్షణ ఇచ్చేవాడు An escort for goods or passengers (న.)

ఆవిధంగా రక్షణ ఇచ్చినందుకు రుసుము, Escortcharges, convoy charges.

**ఆత్మసంపత్** (స్త్రీ.) స్వీయగుణసంపద Personal excellences or qualities.

**ఆత్మాధాతృ** (పు.) తననే తాకట్టుపెట్టుకొన్నవాడు.

**ఆత్యయిక** (వి.)చాల తొందర అయిన Pressing, urgent.

**ఆదహన** (న.) శ్మశానం.

**ఆదేశ** (పు.) (1) అప్పగించిన పని, (2) ఇది ఇలా చేయాలని చెప్పి అప్పగించిన విషయం.

**ఆధి** (పు.) (1) తాకట్టు, (2) ఒకపని చేయడానికి కార్మికసంఘం నియమించిన కార్మికుడు, (3) ఆపద, దుఃఖం.

**ఆధికర్ణగ్రహణ** (న.) ఏదైన ఆస్తి తాకట్టు పెట్టి ఋణానికి ఒప్పందం చేసుకొనడం Contracting a debt by mortgaging some property.

**ఆధిపాల** (పు.) తాకట్టుపెట్టినదాని సంరక్షకుడు.

**ఆనాహ** (పు.) మలమూత్రబంధం.

**ఆనీత** (న.) పెండ్లికూతురు తన బంధువర్గమునుండి తీసికొనివచ్చిన ధనాదికం.

**ఆనుగ్రాహిక** (వి.) లాభకరమైన Beneficial.

**ఆనూప** (వి.) జలప్రాయమైన భూమికి సంబంధించిన. జలమార్గంలో ఉన్న.

**ఆనూప్య** (వి.) తడినేలమీద మొలిచేది లేదా పెరిగేది.

**ఆపద్** (స్త్రీ.) (1) గూడుపుఠాణీ, Con spiracy, ఆపద.

**ఆపదర్థ** (పు.)కష్టాలకి దారితీసే లాభం.

**ఆపమిత్యక** (న.) ధాన్యాలు అప్పు తీసి కొనుట.

**ఆపాత** (పు.) ముందుకు వెళ్లే మార్గం.

**ఆపూపిక** (పు.) అప్పాలు, (తినుబండారాలు) అమ్మేవాడు.

**ఆప్యప్రయోగ** (పు.) దేశద్రోహిని వాని బంధువులద్వారా వదల్చుకొనే ఉపాయం.

**ఆప్యాయన** (న.) నింపుట, అభివృద్ధి.

**ఆబన్ధ్య** (న.) అలంకారాలు.

**ఆబలీయస** (న.) దుర్బలుడైన రాజు అనుసరించవలసిన మార్గం.

**ఆబాధ** (పు.) అపాయం. ఇతరుల స్థలం మొదలైనవి ఆక్రమించడం.

**ఆభిగామిక** (వి.) అనాయాసంగా రాజును సమీపించేసేది.

**ఆభ్యన్తర** (వి.) నగరం లేదా రాజధాని నుండి లభించినది.

**ఆమకాశిత** (వి.) తిన్న అన్నం అరగని వాడు.

**ఆమిత్రా** (వి.) రాజద్రోహులు, రాజద్రోహులు కానివాళ్లు చేతులు కలపడం.

**ఆయతి** (స్త్రీ.)(1) రాబడి, (2)భవిష్యత్తు.

**ఆయతిక్షమ** (వి.) భవిష్యత్తులో లాభకరమైన.

**ఆయతిప్రదర్శన** (న.) రాబోవు లాభనష్టాల మీద చూపు.

**ఆయత్త** (వి.) అధీనమైన, ఆధారపడిన.

**ఆయమాన-నీ** (వి.) పన్నులద్వారా వసూలైన వస్తువులను తూచేది.

**ఆయముఖ** (న.) పన్నుల ముఖాలు,

Heads of revenue.

**ఆయశరీర** (న.) మొత్తం పన్ను, The aggregate revenue

**ఆయుక్త** (పు.) అధికారి, An officer.

**ఆయుధీయ** (వి.) సైనికులను ఏర్పరచేది లేదా నిర్వహించేది, Supplying or maintaining troups. (పుం) సైనికుడు.

**ఆయోగ**(పు.) (1) నియామకం, (2) పొందుట, సంపాదించుట,(3)తనవైపు త్రిప్పుకొనే ఉపాయం.

**ఆయోధన** (న.) యుద్ధభూమి.

**ఆరక్ష** (పు.)**ఆరక్షా** (స్రీ.) రక్షణ Protection.

**ఆరక్ష, ఆరక్షక** (పు.) రక్షకుడు Watchman, a guard.

**ఆరక్షిన్**(పు.)రక్షకుడు A guard, a sentinent.

**ఆరాజ్య** (న.) రాజ్యాన్ని గట్టిపరచుకొనుట. Consolidation of the kingdom.

**ఆరాలిక** (పు.) వడ్డన చేయువాడు.

**ఆర్తవాదిన్** (పు.) కష్టాలలో ఉండి చెపుతున్నవాడు.

**ఆర్యప్రాణ** (పు.) అర్యుడైన వ్యక్తి.

**ఆలక్షిత** (వి.)పైకి కనబడు.

**ఆలవన** (న.) (గడ్డి) కోయుట.

**ఆవహ్** (ధా.) లోనికి తీసికొనివచ్చు. లోపల చెల్లించు. (ప్రేరణార్థకం) ఆహ్వానించు, ప్రక్కకు తీసికొనివచ్చు, పోగుచేయు, విదేశా లకు పంపడానికి ప్రోత్సహించు.

**ఆవాప** (పు.) (సైనికులను)దూర్చడం. పెరిగేటట్లు చేయడం.

**ఆవాహ-వివాహ** (పు.) ఆడపిల్లను (వివాహంలో) తీసికొనడం, ఇవ్వడం. వివాహ సంబంధాలు చేసికొనడం.

**ఆవేదక** చూ. **అవేదక**.

**ఆవేశన** (న.) కర్మాగారం. A factory, a workshop.

**ఆవేశనిక** (పు.) అతిథి.

**ఆవేశనిన్** (పు.) కార్మికుడు.

**ఆశాకారిక** (పు.) గుత్తపని చేసే కార్మికుడు.

**ఆశానిర్వేద** (పు.) దిగులు, నిరాశ.

**ఆశానిర్వేదిన్** (పు.) దిగులుచెందినవాడు, ఆశ వదలుకొన్నవాడు.

**ఆశాస్తి** (స్రీ.) ఆశ, Hope.

**ఆశీతిక** (వి.) ఎనభైసంవత్సరాలవాడు.

**ఆశుమృతక** (పు.) హటాత్తుగా మరణించినవాడు.

**ఆసంగ** (పు.) (1) సంబంధం, (2)అడ్డు, (3) ఆసక్తి.

**ఆసన** (న.)ప్రశాంతంగా కూర్చొనడం.

**ఆసార** (న.) మిత్రరాజు. మిత్రుని సైన్యాలు. సైనికుల సహాయం. సైనికబలం పెంచుట.

**ఆస్తరక** (న.) చపటాచేయుట Flooring.

**ఆస్తార** (పు.) చూ.పై.

**ఆస్రు** (ప్రేర.) (1) విడిచేటట్లు చేయు, (2) ప్రవహింపచేయు, కపటోపాయంచే మోసగించి తీసికొనుపోవు.

**ఆహరణీయ** (వి.) లోపలికి తీసికొని రాదగిన, చేర్చదగిన.

**ఆహార్యబుద్ధి** (వి.) మొండితనం ఉన్న

బుద్ధిమంతుడు, బుద్ధిమంతుడే కాని ఇష్టం వచ్చినట్లు చేసేవాడు.

ఆహార్యోదక (వి.) బైటనుండి నీళ్లు తీసికొని రావలసిన.

ఆహితక, (పు.), ఆహితికా తాకట్టుపెట్టిన వ్యక్తి.

ఆహృ (ప్రేర. ధా.) (1) చెల్లించేటట్లు చేయు. తీసికొనిపోవు, జప్తుచేయు. దోచుకొను, (2) తిను.

ఆహ్నిక (న.) రోజుకూలీ.

ఇ

ఇఙ్గిత (న.) అవయవాల చేష్ట. అవయవాలతో సంజ్ఞలు.

ఇన్ద్రకీల (పు.) తలుపు కదలకుండా ఉండడంకొరకు నేలలో పాతిన మేకు లేదా కఱ్ఱ.

ఇన్ద్రకోశ (పు.) ధానుష్కుల రక్షణకు నగరం గోడమీద అమర్చిన, రంధ్రాలున్న, దారుఫలకం.

ఈ

ఈక్షణిక (పు.) జోస్యం చెప్పేవాడు.

ఈశాన (న.) పిడుగుపాటు.

ఈశ్వర (పు.) రాజు.

ఉ

ఉచ్చార (పు.) మలమూత్రవిసర్జన.

ఉచ్ఛిన్న (వి.) దురాక్రమణ చేసిన భూములను ఇచ్చివేయవలసిఉన్న.

ఉచ్ఛుల్క (వి.) పన్ను మినహాయింపు ఉన్న.

ఉచ్ఛేదనీయ(వి.) ఛేదించదగిన, రద్దు చేయదగిన.

ఉత్కర (పు.) (1) ధాన్యరాశి కొలవడం పూర్తి అయిన తరవాత మిగిలినది, (2) చెత్త.

ఉత్కీర్ణికా (వి.) ఒకపక్క చీల్చి తీయబడిన.

ఉత్కుట్(ప్రే.ధా.) కుంటివానినిగా చేయు.

ఉత్కృష్ (ప్రే.ధా.) తీసికొను, తనదిగా చేసికొను. To appropriate.

ఉత్కోచక(పు.) లంచాలు తీసికొనువాడు. బలవంతంగా ధనం తీసికొనువాడు.

ఉత్క్రమ (వి.) వరస తప్పిన.

ఉత్తర (న.) ఏనుగును కట్టే పై గొలుసు.

ఉత్తరపక్ష (పు.) శ్రేష్ఠమైన పక్షం. Superior party.

ఉత్తరాధ్యక్ష (పు.) సూపర్వైజరు.

ఉత్థా (ధా.) ఉత్సాహంతో కర్మశీలుడుగా ఉండు.

ఉత్థాన (న.) ఉత్సాహంతో పని చేయుట Energitic activity.

ఉత్పక్ష్యభావ (పు.) మిగల మగ్గుట, ఎక్కువ ఉడుకుట.

ఉత్పథిక (పు.) మార్గాలు లేని చోట గూఢచారి కార్యం చేసేవాడు.

ఉత్సఙ్గ (పు.) ఉత్సవసమయాలలో తీసికొన్న బహుమతులు.

ఉత్సహ్ (ప్రే.ధా.) ఉత్సాహశక్తి (రాజుకు ఉండవలసినది).

ఉత్సేక (పు.) (1) దర్పం, (2) అత్యధికంగా ఉండడం.

ఉత్సేచక (పు.) నీరు బైటకు విడచువాడు.

ఉదకచరణ (న.) నీటిలో సంచరించే ఒక

పద్ధతి.

ఉదకనాలికా (స్త్రీ.) అపరాధులను పీడించడానికి ఉపయోగించే నీటిగొట్టం.

ఉదకభాగ (పు.) నీటి పన్ను.

ఉదఞ్జర (పు.) పెద్దజలపాత్ర.

ఉదయ (పు.) ఫలితం, లాభం.

ఉదరదాస (పు.)జీవికకోసం దాసుడైనవాడు.

ఉదారక (పు.) ఒక పప్పుదినుసు.

ఉదాసీన (వి.) కోరికలేనివాడు (పు) రాజమండలంలో చాల శక్తిగల రాజు.

ఉదాస్థిత (పు.) వ్రతభ్రష్టుడైన సంన్యాసి.

ఉదితోదిత (వి.) చాల ఉదారస్వభావం గల Very exalted; very noble.

ఉద్ధతార్థ (వి.) గరిష్ఠమూల్యం గల Maximum priced. At a maximum price.

ఉద్ఘాట (పు.) నీరు పెంచుట.

ఉద్ధయ (పు.) లాభం.

ఉధూష్ (ప్రే.ధా.) విద్వేషం కలిగించు.

ఉద్దేశ (పు.) సూచన, గుర్తు.

ఉద్ధర్షణీయ (వి.) ఉత్సాహం పుట్టించుటకు సమర్థుడైన.

ఉద్బన్ధ (పు.) ఉరిదీయుట.

ఉద్భాణ్డీకృత (వి.) ఎక్కువబరువు క్రింద తొట్రుపాటు చెందువాడు, తలమీద బరువు పెట్టుకొని దాగినవాడు.

ఉద్వాప (పు.) భూమిని విత్తనాలు చల్లడానికి సిద్ధం చేయుట.

ఉద్వృత (వి.) ఏరికొనబడిన selected. నిశ్చయింపబడిన.

ఉద్వేగ (పు.) (1) భయం, కంగారు, (2) నియమాతిక్రమణం Violation.

ఉద్వేజనీయ (వి.) భయపెట్టగల.

ఉన్మాన (న.) (1) ఎత్తు, (2) తూకం.

ఉపకణ్ఠీ (వి.) దొంగకంఠం గల, దొంగ మధ్యభాగంగల.

ఉపకరణ (న.) సైనికుని సాధనాలు. Accoutrements.

ఉపకారిన్(పు.) సహాయకుడు An assistant.

ఉపకృష్ట (వి.) దగ్గర ఉన్న.

ఉపక్రుష్ట (వి.) నిందించబడిన.

ఉపగృహీత (వి.) అంగీకరించబడిన, Accepted or favoured.

ఉపగ్రహ్ (ధా.) (1) మిత్రుణ్ణిగా స్వీకరించు, (2) సహాయం చేయు, అనుగ్రహించు, (3) విరోధం తొలగించు, Conciliate, (4) సేకరించు, నిల్వచేయు. To collect, to keep in stock, (5) పట్టుకొను Seize. (ప్రేరణార్థక) (1) అనుగ్రహం చేయు; చేయూత ఇచ్చేటట్లు చేయు, (2) విరోధం విడచేటట్లు చేయు, (3) పట్టించు.

ఉపగ్రహ (పు.) (1)ఆధారం, సహాయం, (2) తనవైపుకు తీసికొనడం, (3) సహాయం సంపాదించటం, రాజీపడటం Conciliation.

ఉపగ్రాహ (పు.) పట్టుకొనుట, నిగ్రహించుట.

ఉపగ్రాహిన్ (పు.) మోసికొని, తీసికొనివెళ్లేవాడు A carrier, a bearer.

ఉపచర్ (ప్రే.ధా.) విషాదులను ఇచ్చు.

ఉపజప్ (ధా.) పురిగొల్పు To suggest, to instigate.
ఉపజా (స్రీ.) పెరుగుదల An addition, an increase.
ఉపజాప (పు.) రహస్యంగా పురిగొల్పుట A secret instigation. Secret over tures, seduction.
ఉపతాప (పు.) బాధపెట్టడం. Harassment.
ఉపతోదన (న.) గుచ్చుట Pricking, goading.
ఉపదా (స్రీ.)పారితోషికం, లంచం.
ఉపద్రష్టృ (పు.) స్వయంగా చూచినవాడు.
ఉపధా (స్రీ.) రహస్యంగా నిజాయితీని పరీక్షించుట.
ఉపధాన (న.) (1)ఒకదానికి బదులు మరొకటి చేర్చుట, (2) కలుపుట.
ఉపనత (వి.) వంచబడిన, ఓడించబడిన.
ఉపనిధి (పు.) ఒకచోట ఉంచినది, Deposit.
ఉపనిపాత (పు.) హటాత్తుగా వచ్చిన ఆపద. A sudden calamity or acci dent.
ఉపనివేశ (పు.) నివేశస్థానం.
ఉపనిషద్ (స్రీ.) రహస్యోపాయం.
ఉపనిషద్యోగ (పు.) రహస్యమైన కలిపిన మందు secret mixture.
ఉపనిష్కృష్ (ధా.) బైటకులాగు. పైకి వచ్చే టట్లు చేయు.
ఉపపద్ (ధా.) ఉపపన్నం అగు To become possible.
ఉపపన్న (వి.)జరిగిన, ఉన్న.
ఉపయుక్త (పు.) క్రింది అధికారి A subordinate officer. A servant.
ఉపనిబద్ధ (పు.) (దోషులను పీడించడానికి) వ్రేలాడదీయుట.
ఉపరుద్ధ (వి.) (1) అడ్డుకొనబడిన, నిరోధించబడిన, (2) వేరుగా ఉంచబడిన segregated, (3) బంధించబడిన, (4) పూర్తిగా ఒకని అధీనంలో ఉన్న, (5) పీడించబడిన harassed, infested.
ఉపరుధ్ (ధా.) నిరోధించు To detain.
ఉపరూఢ (వి.)ఆపదలు మొదలైనవాటిలో చిక్కుకొన్న.
ఉపరోధ (పు.) (1) అడ్డు, (2) కోటలో నిలదొక్కుకొని ఉండుట.
ఉపలిఖ్ (ధా.)సరిగా వ్రాయనిదానిని సరిచేసి వ్రాయుట.
ఉపలిఙ్గన (న.)సూచన, గుర్తు, ప్రమాణం proof.
ఉపవర్ణనా (స్రీ.) సవిస్తరంగా వర్ణించుట.
ఉపవాద (పు.) నింద, చెడ్డపేరు Revailing, calumny.
ఉపవాస (పు.) అద్దెకున్నవాడు. దగ్గర ఉన్నవాడు.
ఉపవిచార (పు.) ఒకదానితోపాటు చేసిన విచారము The accompanying treatment.
ఉపశ్రోతృ (పు.) ప్రత్యక్షంగా విన్న సాక్షి.
ఉపసాల (పు.) చిన్నగోడ, కట్టవ.
ఉపసృష్ట (వి.) పీడింపబడిన, అసమర్థుడుగా

చేయబడిన incapaciated.

**ఉపస్కన్దన పాదుకా** (స్త్రీ.) గంతువేసే పాదుక (మార్గమధ్యంలో ఉంచే ఒక విధమైన మనిషిని పట్టించే సాధనం,(Trap).

**ఉపస్కర** (పు.) గృహోపకరణం, సాధనం.

**ఉపస్థాన** (న.) (1) విశాలమైన శాల a hall, the assembly hall, court hall, (2) దగ్గరసేవకై వేచి ఉండుట, (3) పోగు పడిన లేదా అధికమైన పన్ను Accrued or additional revenue.

**ఉపస్థాయిన్** (పు.) సేవకుడు.

**ఉపస్నేహ** (పు.) తడి, తేమ.

**ఉపహత** (వి.) (1) అపకారం చేయబడినవాడు wronged, injured, (2)ఇతరుణ్ణి పీడించినవాడు.

**ఉపహన్** (ధా.) నశింపచేయు, పాడుచేయు, చెడగొట్టు.

**ఉపహిత** (వి.) (1) రహస్యపరీక్షకు గురి చేయబడిన, (2) (ఇటుకలు మొదలైన వాటితో) కట్టబడిన, చపటా చేయబడిన, (3)ఉంచబడిన.

**ఉపహృ** (ధా.) దృష్టికి తీసికొనివచ్చు, (2) బైటపెట్టు, చెప్పు.

**ఉపాంశుదణ్డ** (పు.) రహస్యంగా శిక్షించడం లేదా చంపడం silent punishment, secret murder.

**ఉపార్ధా** (వి.) దాదాపు సగం.

**ఉపావర్తన** (న.) (1) చుట్టు తిరుగుట, దొర్లుట, (2) (ఆజ్ఞ మొదలైనదానిని) వెనుకకు తీసికొనుట Revocation, annulment.

**ఉపావృత్త** (వి.)తన రాజ్యం తిరిగి తీసికొన్నవాడు.

**ఉపాశంసు** (వి.) (మంచికి) ఎదురు చూచుచున్న Who hopes for, who looks forward.

**ఉపోష్** (ధా.) కాల్చు, నశింపచేయు.

**ఉబ్జ్** (ప్రే.ధా.) (1) అభ్యసించు, వినియోగించు To practise, to employ. (2) ఉంచు, అమర్చు To place, to set.

**ఉభయభావిన్** (వి.) రెండు పక్షాలతో మైత్రిగల.

**ఉభయయోగ** (పు.) గ్రామాలలోను, రాజధానిలోను రెండింటిలోనుఉన్న అధికారుల కలయిక లేదా సంబంధం.

**ఉభయవేతన** (పు.) రెండు ప్రక్కలనుంచీ జీతం తీసికొనే గూఢపురుషుడు.

**ఉరస్య** (న.) సేనానివేశంలోని మధ్య భాగం.

**ఉల్లమ్బన** (న.) (పీడించుటకై అపరాధులను) వ్రేలాడదీయుట.

**ఉల్లిఖ్** (ధా.) తప్పు వ్రాయడం.

**ఉల్లోపికా** (స్త్రీ.)ఆహారవిశేషం.

**ఉష్ట్రగ్రీవీ** (స్త్రీ.) ఒకరకమైన ఒంటె మెడ ఆకారంలో ఉన్న ఆయుధం. ఒక విధమైన పాత్ర.

**ఉష్ట్రికా** (స్త్రీ.) ఒంటె ఆకారంలో ఉన్నపాత్ర.

## ఊ

**ఊరువేష్ట** (పు.) (అపరాధులను పీడించడానికి) తొడ మెలి పెట్టడం.

**ఊర్ధ్వకర** (పు.)ఎత్తికొనిపోవు దొంగ.

ఊర్ధ్వచయ (వి.)పైకి పేర్చబడిన.
ఊష్మన్ (పు.)ఆవిరి. వేడి.

ఋ

ఋతువిభక్త (వి.) వేరు వేరు ఋతువులకు అనుగుణమైన. ఋతువులను బట్టి మార్పుచెందు.
ఋతుసుఖ (వి.)అన్ని ఋతువులలోను సుఖకరమైన.

ఏ

ఏకచర (వి.) ఒంటరిగా సంచరించు, లేదా నివసించు.
ఏకపాత్ర (న.) పై వర్ణాలవాళ్లు క్రింది వర్ణాలవాళ్లు కలిసి భోజనంచేయు.
ఏకప్రగ్రహ (పు.) ఒకే ఒక ఆధారం. The only support.
ఏకముఖ (వి.) ఒకేస్థానంలో నడిపించ బడిన. అమ్మకానికై ఒకేచోటికి తీసికొని రాబడిన.
ఏకరాజ (పు.) ఒకేరాజు, చక్రవర్తి.
ఏకలోష్టవధ (పు.) ఒక మట్టిబెడ్డనువలె నశింపచేయుట.
ఏకవిజయ (పు.) ఒక రాజు విజయం.
ఏకాన్తయోగ (పు.) అధికారులు ఒకచోట కలియుట.
ఏకాన్తసిద్ధి (స్త్రీ.) నిశ్చితమైన విజయం
ఏకాయన (న.) సైనికులు ఒక్కవరసలో మాత్రమే వెళ్లడానికి తగిన స్థానం. (మార్గం).
ఏకార్థ (పు.) అందరికీ సంబంధించిన ప్రయోజనం Common objective.
ఏకైశ్వర్య (న.) ఒకే వంశంలో క్రమంగా వస్తున్న రాజ్యాధికారం.

ఐ

ఐకదేశిక (వి.) ప్రజలలో కొంతమందికి మాత్రమే వర్తించేది.
ఐకపురుషిక (వి.) ఒకడు జీవితాంతం అనుభవించదగినది.

ఔ

ఔత్పత్తిక (వి.) అవసరాన్ని పట్టి చేయబడిన.
ఔత్పాతిక (వి.) దుఃశకునాలకు సంబంధించిన ఆపదలను ఎదుర్కొడానికి తీసికొన్న.
ఔత్సాహిక (వి.) తమంతతాముగా వచ్చిన సైనికులు Voluntary (army).
ఔదనిక (పు.) అన్నం అమ్మేవాడు.
ఔదర్య (పు.) ప్రేగులు మొ.
ఔదార్య (న.) చాల గొప్పగా ఉండుట Magnificience. making a grand show.
ఔద్ర (పు.) ఒకరకమైన తైలం తయారు చేసేవాడు.
ఔపగ్రాహిక (న.) ప్రేమసూచకమైన బహుమానం.
ఔపచారిక (పు.) ఏనుగులను అలంకరించే సేవకుడు.
ఔపనిషదిక (వి.) రహస్యమైన. (న) రహస్యమైన నివారణోపాయాలు.
ఔపపాదిక (పు.) (1) హటాత్తుగా అధికారానికి వచ్చిన వాడు A person suddenly risen to power. an upstart, (2) హటాత్తుగా

జరిగిన ఆశ్చర్యకరమైన సంఘటన.

ఔపవాహ్యా-క (పు.) మోయుటకు తీసికొని వెళ్లుటకు ఉపయోగించేది.

ఔపశాయిక (వి.) మైథునానికి సంబంధించినది. (పు) రాత్రిసేవకుడు.

ఔపస్థాయిక (పు.) సేవకుడు.

ఔపహారిక (న.) బహుమతిగా ఇచ్చే లేదా సమర్పించే, వస్తువులు.

ఔపాయనిక (వి.) బహుమతిగా తీసికొనువాడు (న) బహుమతి Gift, present.

ఔరభ్ర (వి.) గొఱ్ఱెలకు సంబంధించిన.

## క

కక్ష (పు.) యుద్ధవ్యూహంలో ఒక ప్రక్కనున్న భాగం. A flank (in a battle array).

కక్ష్యా (స్త్రీ.) (1) గది, ఇంటిలో ఒక భాగం, (2) నడుముకు కట్టే పట్టిక (band).

కఙ్కట (పు.) కవచం.

కచగ్రహణీ (స్త్రీ.) జుట్టు పట్టుకొనేది, చివర వంకరయైన ఇనుపకొలికి ఉన్న పొడుగైన కఱ్ఱ.

కఞ్చుకిత (వి.) బీటలు వారిన పొరచేత కప్పబడిన.

కటభఙ్గ (పు.) చేతితో ఏరిన ధాన్యం.

కటమాన లేదా కటుమాన (పు.) రత్నం చుట్టూ బంగారం బిగించడం.

కటవానక (న.) పక్కమీద పరిచే ఒక విధమైన ఆచ్ఛాదనం.

కటశర్కరా (స్త్రీ.) ఒక మొక్క పేరు.

కటుకవర్గ (పు.) మసాలదినుసులు.

కటుశర్కరా (స్త్రీ.) గులకరాయి.

కడఙ్కర (పు.) మొక్కల ఆకులు మొదలైనవి.

కణకుణ్డక (న.) నూకల జావ.

కణ్టకప్రతిసర (పు.) ముళ్లతీగ.

కణ్టకశోధన (న.) అపరాధులను అణచివేయుట.

కణ్టకినీ (స్త్రీ.) ముళ్లతీగ.

కణ్డోలీ, కణ్డోలికా (స్త్రీ.) బుట్ట.

కన్యావాహిక (పు.) పెండ్లికుమార్తెతో వెళ్లే జనులతో కలిసి వెళ్లేవాడు.

కపాల (పు.) ఎక్కువగా ఇమ్మని అడిగి చేసికొనే సంధి A treaty in which excessive demands are made.

కపిశీర్షక (న.) గోడమీద అమర్చిన కోతితల ఆకారం గల రాయి.

కరట (వి.) పురుగులు పాడుచేసిన లేదా తినివేసిన.

కరటుకముఖ (న.) కంసాలులు ఉపయోగించే, కొంగమెడ ఆకారంలో ఉండే సాధనం.

కరణ (న.) (1) కార్యాలయం A bureau, an office, (2) ప్రమాణం proof, evidence.

కరణీయ (న.) రాబడి-ఖర్చుల ఉజ్జాయింపు A budget estimate.

కరద (వి.) పన్ను చెల్లించేవాడు.

కరప్రతికర (పు.) పన్నుకు బదులు ఇచ్చే పండిన వస్తువులు.

కరీష (పు.) వర్షాలలో పిడకలు ఎండడానికి తగిన వ్యవధానం.

కర్ణకీలాయస (న.) మూలల్లో స్తంభాలకు

చుట్టిన రాగితీగ. మూలలలో నాటిన ఇనుపమేకులు.

కర్తక (వి.) ఛేదించబడిన, కత్తిరించబడిన.

కర్మక్షాన్త (వి.) బాగా తరిఫీజు పొందిన Fully trained.

కర్మన్ (న.) (1) తరిఫీజు training. (2) శరీరపీడ (అపరాధుల).

కర్మనిషద్యా (స్త్రీ.) కార్మికుల ఇళ్లు.

కర్మనిష్పాక (పు.) పనులు కొనసాగించుట.

కర్మమాస (పు.) కార్మికుల జీతం లెక్క కట్టే మాసం.

కర్మవ్యాపద్ (స్త్రీ.) అభిచారికక్రియలో జరిగిన దుష్పరిణామం.

కర్మాన్త (పు.) కర్మాగారం A work shop. A factory.

కర్మాభిగ్రహ (పు.) చేసిన పనులను పట్టి నిగ్రహించడం.

కర్శన (న.) తగ్గించడం. దుర్బలత్వం కలిగించడం. ఏమీ లేనివానినిగా చేయడం.

కర్శనీయ (వి.) దుర్బలుడుగా చేయ దగిన.

కలత్రగర్భిన్ (వి.) స్త్రీలు కూడా ఉన్న.

కలధౌతక (న.) ఆభరణాలకు ఉపయోగించే వెండి.

కలనీ (స్త్రీ.) ముద్ద pulp.

కల్పనా (స్త్రీ.) (1) ఛేదించే చాకు మొ. (2) ఏర్పాటుచేయుట.

కల్యాణకృత్య (న.) ఉత్సవసమయం Fesitive occasion.

కల్యాణబుద్ధి (వి.) మంచి అభిప్రాయం గల Of honourable intentions.

కాకణీ (స్త్రీ.) (1) (జూదంలో ఉపయోగించే) గవ్వ, (2) పణంలో 64వ వంతైన ఒక రాగి నాణెం.

కాచ (పు.) (1) గాజు. స్ఫటికం, (2) (వస్తువులు తయారు చేసేటప్పుడు) అపహరించే ఒక పద్ధతి, (3)కావడి.

కాచక (న.) బంగారు వస్తువులలో తక్కువ రకం పదార్థాలను అతుకుట.

కాచకర్మన్ (న.) (బంగారు లేదా వెండి) వస్తువులలో కూర్చుట.

కాచమణి (పు.) గాజుపూస.

కాచవ్యవహారిన్ (పు.) గాజుసామాన్లు అమ్మేవాడు.

కాచార్పణ (న.) బంగారం మీద గాని వెండిమీద గాని మణి బిగించుట.

కాఞ్చన (న.) బిగించడానికి ఆధారమైన బంగారం లేదా వెండి.

కాఞ్చనకారు (పు.) మణులు మొదలైనవి బిగించే పని చేసే శిల్పి.

కాణ్డక (న.) కాలి లేదా చేతి ఎముక.

కాణ్డబీజ (న.) కొమ్మపాతితే మొలిచే మొక్క.

కాణ్డరా (స్త్రీ.) నరం.

కాపటిక (పు.) ఒక రకమైన గూఢ పురుషుడు.

కామణ్డులుక (వి.) ఆనపకాయ ఆకారంలో ఉన్న.

కాయభార (పు.) వీపుమీద మోసే బరువు.

కారణిక (పు.) లెక్కలు వ్రాసేవాడు An

accounts officer.

కార్మాన్తిక (పు.) కర్మాలయాల అధికారి A director of factories

కార్మారిక (వి.) కంచరి మొదలైన వాళ్లు తయారు చేసినది.

కార్మిక (పు.) పనులు నడిపించేవాడు A works - manager

కార్య (పు.) క్రింది అధికారి A sub ordinate officer .

కార్వటిక లేదా ఖార్వటిక రెండువందల గ్రామాల ప్రధానస్థానం (head quarters)

కాలిక (వి.) ఇంతకాలం అని నిర్ణయించి ఇచ్చిన అప్పు. అరువు ఇచ్చిన.

కాలేయక (న.) చందనంవలె సుగంధం గల ఒక కఱ్ఱ.

కాష్ఠతులా (స్త్రీ.) కఱ్ఱతక్కెడ.

కిటికా (స్త్రీ.) పేపబెత్తంతో అల్లి చర్మ కప్పి తయారు చేసిన డాలు.

కిట్ట (న.) లోహాదులు కరిగించగా వేరుగా వచ్చిన చిట్టం Dross.

కిణ్వ (న.) మాదకపానీయబీజం A ferment.

కిణ్వబన్ధ (పు.) మాదకద్రవ్యాలు తయారు చేయుట.

కిలాట (పు.) పెరుగుపైన తేలిన నీరు.

కుక్షిప్రదర (వి.) కోటగోడను ప్రక్కనుంచి బ్రద్దలుకొట్టేది.

కుటుమ్బ (న.) వేశ్యాపరివారం An (courtesan's) establishment.

కుట్ట్ (ధా.) దంచు, నలుపు.

కుట్టక (పు.) దంచువాడు.

కుట్టకయన్త్ర (పు.) పిండిమర.

కుట్టనశాలా (స్త్రీ.)దంపుడుపనిచేసేశాల

కుట్టనీ (స్త్రీ.) పిండిమర.

కుట్టాక (పు.) వడ్రంగి, అతికించువాడు.

కుణ్ఠ (వి.) మందమతి, శక్తిహీనుడు, సామర్థ్యం లేనివాడు. పిరికిపంద.

కుప్ (ప్రే.ధా.) (1) నిరాకరించు.To refuse. to sanction, (2)ఎదురు తిరుగుటకు ప్రోత్సహించు.

కుపిత (వి.) ఎదురు తిరిగిన.

కుప్య (న.) అడవిలో లభించే కఱ్ఱ మొదలైన సంపద.

కుప్యోపజీవిన్ (పు.) కుప్యాధికారి The superintendent of forest produce.

కుమారపుర (న.) రాజపుత్రప్రాసాదం.

కుమారీపుర (న.) ఒకవిధమైన నగర ద్వారం.

కుమారీసంగ్రహ (స్త్రీ.) కట్టేస్తంభంమీద వేసిన ఇనుపదూలం.

కుమ్భకుక్షిక (వి.) కుండవంటి పొట్టగల.

కుమ్భీపాక (పు.) పెద్దపాత్రలో సలసల కాచుట.

కురువిన్ద (పు.) ఒక రాయి.

కులనీవీ (స్త్రీ.) కుటుంబంలో దాచు కొన్న ధనం.

కులబన్ధన (న.) మొత్తం కుటుంబానికి వెట్టిచాకిరీ Bondmanship for the whole family.

కులమితికా (స్త్రీ.) ఒకవిధమైన గజనివాసం.

కులసంఘ (పు.)రాజవంశీకు లందరూ సభ్యులుగా ఉన్న సమితి A ruling council consisting of all members

of the royal family.

కులైడక (పు.) మందనుండి తప్పి పోయిన గొఱ్ఱె.

కుల్య (పు.) రాజవంశానికి చెందినవాడు

కుల్యా (స్త్రీ.) పొడవుగా త్రవ్విన గొయ్యి A trench.

కూల్యావాప (వి.) కాలవలమీద వ్యవసాయం జరిగేది.

కుశల (వి.) సమర్థుడు An expert.

కుశీలవ (పు.) పాటలు పాడువాడు. నటుడు.

కుహక (పు.) మాజిక్ చేసేవాడు, పాముల వాడు, బొమ్మలాడించేవాడు.

కూట (పు.) (1) కొమ్ములు విరిగిన ఎద్దు, (2) శిఖరం.

కూటయుద్ధ (న.) మోసంతో కూడిన యుద్ధం.

కూటావపాత (పు.) పైన ఆకులు మొదలైనవి కప్పిన గొయ్యి.

కూర్చికా (స్త్రీ.) గడ్డపెరుగు.

కూర్మక (వి.) తాబేలు ఆకారంలో ఉన్న.

కూలపథ (పు.) సముద్రతీరంగుండా జలమార్గం.

కృతకర్ణికా (వి.) చుక్కలున్న.

కృతక్రియా (వి.) యథావిధిగా వివాహం చేసికొన్న.

కృతక్షేత్ర (న.) కృషియోగ్యంగా చేయబడిన భూమి.

కృతప్రతిఘా తావస్థ (వి.) హింసించకుండా మాట (రక్షణ) ఇవ్వబడినవాడు To whom a guarantee against injury is given.

కృతప్రవేశ (వి.) ప్రవేశించడానికి అనుమతి ఉన్నవాడు.

కృతావరోధా (స్త్రీ.) ఒక్కడు మాత్రమే ఉంచుకొన్న స్త్రీ.

కృతావస్థ (వి.) గారంటీ ఇవ్వబడిన.

కృత్య (వి.) ఎదురు తిరిగేటట్లు చేయదగిన వాడు. దేశద్రోహి అయ్యే అవకాశం ఉన్నవాడు. (న) అభిచారిక హోమాదికం.

కృత్యకర (పు.) ఆస్తి మొదలైనవాటి వ్యవహారాలు చూచేవాడు. An administrator (of property etc.)

కృత్యపక్షీయ (వి.) రాజుకు ఎదురు తిరిగే పక్షానికి (పార్టీకి) చెందినవాడు.

కృసర (పు.) బియ్యం నువ్వులు కలిపి వండిన పులగం.

క్లృప్త (వి.)ఇంత అని నిర్ధారణ చేసిన సొమ్ము.

కోశమణ్డల (న.) గుండ్రంగా ఉండే చోటు.

కోప (పు.) తిరుగుబాటు.

కోపక (వి.) తిరుగుబాటు ప్రోత్సహించువాడు.

కోప్య (వి.) నిరాకరించదగిన.

కోశసంగ (పు.) పన్నుగా తీసికొనడం Appropriation of revenue.

కోశీధాన్య (న.) అపరాలు.

కోష్ఠ (పు.) దేవాలయం, కొట్టము (shed).

కోష్ఠక (పు.) కొట్టము.

కౌచపక (పు.) ఒకరకమైన రగ్గు.

కౌమారభృత్య (పు.) శిశుపోషణలో కుశలుడు.

కౌష్ఠేయక (న.) గోడౌనులనుండి లభించే ధనం.

క్రమాభినీత (వి.) (1) క్రమంగా విశ్వాస పాత్రుడైన, (2) క్రమంగా నమ్మిక కుదిరిన.

క్రిమిజాత (న.) సిల్కు, పట్టు.

క్రిమితాన (న.) పట్టుబట్ట.

క్రియా (స్త్రీ.) (1) ట్రైనింగ్, (2) చికిత్స చేయడం.

క్రియావిపన్న (వి.) ట్రైనింగుపని చేయనివాడు, ట్రైనింగు ఇవ్వడా నికి శక్యం కానివాడు.

క్లిష్ట (వి.) చెడగొట్టబడిన, పాసిపోయిన.

క్షపణ (న.) ఉపవాసం.

క్షార (పు) చెరుకునుండి పుట్టిన బెల్లం మొదలైనవి.

క్షారకర్మన్ (న.) చెరుకురసం తీయుట, బెల్లం మొదలైనవి తయారుచేయుట.

క్షుద్యోగ (పు.) ఆకలి కలగకుండా యోగం.

క్షుద్రక (పు.) సామాన్యుడు A Smallman, Commoner (న)పూసలు చేయడం వంటి చిన్న బంగారం పని.

క్షేత్ర (న) రాజ్యప్రదేశం Domain, territory.

క్షేత్రిక (పు.) భూస్వామి.

క్షేపణ (న.) బంగారంలో గాని వెండిలో కాని కూర్చుట.

## ఖ

ఖచిత (వి.) గ్రుచ్చబడిన, పొదగబడిన, కలపబడిన.

ఖఞ్జన (న.) బురద.

ఖఞ్జనోదక (వి.) బురదనీరు గల.

ఖణ్డ (వి.) బ్రద్దలైన.

ఖణ్డఫుల్ల (న.) మరామత్తులు చేయుట, కొంచెం తెరచుకొనుట.

ఖణ్డసంఘాత్య (వి.) నేయకుండా వదలి వేసిన చాలా దారాలు గల.

ఖరక (వి.) గతుకులుగా ఉన్న, ముతకదైన, Rough in surface.

ఖరపట్ట (వి.) అపరాధుల పీడనవిధానాన్ని చెప్పే ఒక గ్రంథం.

ఖాత (న.) (1) అగడ్త. తవ్విన కాలవ, (2) తవ్విన నేల.

ఖాతప్రావృత్రిమ (వి.)కాలవలద్వారా నీరు అందించేది. (న)నుయ్యి.

ఖురుమ్మ (వి.) చాలవరకు నున్నని రాళ్లతో తయారు చేసినది.

## గ

గణిత (వి.) (1) లెక్క ఉన్నది. (న) లెక్కపెట్టుట.

గణ్డికా (స్త్రీ.) (1) చెట్టుమొదలు (2) కఱ్ఱదిమ్మ.

గర్భభర్మన్ (న.) గర్భభర్మణ్యా (స్త్రీ.) గర్భపోషణము.

గర్భసంస్థా (స్త్రీ.) పురుళ్లు పోసే స్థానం.

గర్భిణికా (వి.) మధ్యభాగంలో పైకి ఉబ్బిన.

గవ్య (వి.) గోవులకు (పశువులకు) హిత మైనది.

గాఢ (వి.) కదలకుండా పాతబడిన.

గాణనిక్య (పు.) లెక్కలు, Accounts.

గాయన (పు.) పాట పాడువాడు.

గుడ (న.) ఏనుగు కవచం.

గుణ (పు.) (1) తాడుకట్టుట, (2) విదేశ విధానంలో ఒక పద్ధతి.

గుప్తి (స్త్రీ.) రక్షణ, కోట నిర్మించుట.

గురుసముత్థ (వి.) పెద్దప్రయత్నంతో లేదా పెద్దప్రమాణంలో సమీకరించిన Mobilising with great effort or on a large scale.

గుల్మ (న.) రాజభటస్థానం, A Police Station.

గుహ్యసధర్మన్ (వి.) రహస్యాన్ని పంచుకొనగల

గూఢ, గూఢ పురుష (పు.) గూఢంగా మారు వేషాలలో తిరుగుతూ పనిచేసేవాడు.

గూఢాజీవ, గూఢాజీవిన్ (పు.)రహస్యమైన ఆదాయం గలవాడు.

గృహేజాత (పు.) ఇంటపుట్టిన దాసుడు.

గృహ్యా (స్త్రీ.) యజమాని ఇంట్లోనే నివసించేది.

గోప (పు.) పన్నులు వసూలుచేసే చిన్న అధికారి A subordinate revenue officer చిన్న నగరాధికారి A sub ordinate city officer.

గోలిజ్ఞ (వి.) ఎద్దులు లాగేది.

గోష్పణ (పు.) రాళ్లు విసిరే చిన్న ఉట్టివంటి త్రాడు.

గ్రన్థిభేద (పు.) ముడులు భేదించేవాడు

గ్రస్ (దొంగ)(1) తినివేయు, (2)(ధా) బాధించు, To harass, (3)ఓడించు, (4) అతిక్రమించు, to surpass.

గ్రామకూట (పు.) గ్రామాధికారి.

గ్రామభృతక (పు.) గ్రామసేవకుడు.

గ్రామస్వామిన్ (పు.) గ్రామానికి యజమాని (owner).

గ్రామిక (పు.) గ్రామాధికారి.

గ్రామ్యసుఖ (న.) అసభ్యమైన సుఖం. A vulgar pleasure.

గ్రాహ్య (వి.) అరెస్టు చేయదగినవాడు.

గ్రైవేయ (న.) ఏనుగ మెడగొలుసు.

## ఘ

ఘటికాస్థాన (న.) పన్ను వసూలు చేసే ద్వారం దగ్గర ఉన్న వస్తువులు ఉంచే స్థానం. A ware - house near the toll-gate or customs house.

ఘాణపిణ్యాక (పు.) గానుగనుండి తెచ్చిన తెలకపిండి.

## చ

చక్రచర (పు.) బండి నడుపువాడు.

చక్రపథ (పు.) చక్రాలమార్గం, బండ్లు నడిచే మార్గం.

చక్రయుక్త (పు.) బండి.

చక్రిన్ (పు.) బండి.

చమసీ (స్త్రీ.) భోజనం.

చమూఖలాః (పు.) దుష్టుల సముదాయం, సైన్యంలోని దుష్టులు.

చర్ (ప్రే.ధా) (1) స్వేచ్ఛగా తిరుగుటకు అనుమతించు, (2)వదంతులు వ్యాపింప చేయు.

చరక (పు.) సేవకుడు (సరక, ఝరక అని కూడ).

చరిత్ర (న.) అలవాటు A custom, a practice, a rule, a regulation.

చర్యా (స్త్రీ.) మార్గం A track.

చలామిత్ర (పు.) కోటలేని శత్రువు. సంచరించే శత్రువు.

చాక్రిక (పు.) తైలయంత్రం నడిపేవాడు. నూనెవర్తకుడు.

చాతురాత్రిక (వి.) నాలుగురోజుల పాటు చార జరుగునది (పు.) (1) గూఢచారిచర్య (2) రహస్యంగా సేకరించిన విషయం (3) గూఢచారి (4) జైలరి.

చార (పు.) బంధించడం. A lock up.

చారరాత్రి (స్త్రీ.) సంచారం విషయంలో నిర్బంధం లేని రాత్రి.

చారిత్ర (న.) చూ. చరిత్ర.

చిక్కణ (వి.) జిగురుగా ఉన్న, ముద్దగా ఉన్న.

చిటచిటాయత (వి.) పళపళావిరిగిపోయిన.

చిమచిమాయిత (వి.) తళతళలాడు.

చుఞ్చువాలుకా (స్త్రీ.) సన్నని ఇసుక.

చూలికా (స్త్రీ.) (1) స్తంభాగ్రభాగం, (2) శిఖరం.

చైత్య (పు.) పవిత్రస్థానం, పూజాస్థానం, పవిత్రమైన వృక్షం.

చోరరజ్జు (ప్ర.) దొంగలను పట్టుకొనడం ద్వారా లభించిన ధనం.

చోరరజ్జు (పు.) దొంగలను పట్టే అధికారి.

ఛ

ఛన్దికా (స్త్రీ.) సుఖం, ఆనందం.

ఛన్నపథ (పు.) భూగర్భమార్గం.

ఛర్ది (స్త్రీ.) వాంతి.

ఛాత్ర (పు.) అభ్యాసం చేస్తున్నవాడు, సహాయకుడు, చిన్నపిల్లవాడు.

ఛాయా (స్త్రీ.) కాలసూచకస్తంభంయొక్క నీడ.

ఛిద్ర (వి.) వ్యవసాయంలో లేని భూమి, కట్టడాలకు అనుకూలం కాని ప్రదేశం.

జ

జఙ్ఘా (స్త్రీ.) ఒక వ్యక్తి An individual.

జఙ్ఘాకారిక (పు.) పరుగెత్తువాడు, శీఘ్రువార్తాహరుడు.

జనపదసంధి (పు.) సరిహద్దు గ్రామం. లేదా సరిహద్దుకోట.

జమ్భకవిద్యా (స్త్రీ.) మాయావిద్య.

జాఙ్గల (పు.) ఎడారుభూమి.

జాఙ్గలీవిద్ (పు.) విషవైద్యనిపుణుడు.

జాతరూప (న.) పరిశుద్ధరూపంలో లభించిన బంగారం.

జాత్య (వి.) (1) ఉత్తమజాతికి చెందిన, of noble birth, legitimate (2) నకిలీ కాని, Genuine, (3) అమూల్యమైన.

జానపద (వి.) దేశానికి సంబంధించిన Native.

జానుభఞ్జనీ (స్త్రీ.) మోకాళ్లు విరగగొట్టేది (శత్రువులను పట్టడానికి రహస్యంగా అమర్చిన ఒక సాధనం).

జోఙ్గనీ (స్త్రీ.) నీళ్లపాత్ర, జల్లెడ, వడగట్టే పాత్ర.

జ్యేష్ఠభాగిన్ (వి.) పెద్దకుమారుని వాటా అయిన.

## డ

డమర (పు.) దొమ్మీ, విప్లవం, తిరుగుబాటు.

డామరిక (పు.) తిరుగుబాటు చేయువాడు.

డిమ్బ (పు.) దొమ్మియుద్ధం.

## త

తజ్జాత (వి.) (1) అందుకోసం పుట్టిన వాడు, వంశాను క్రమంగా ఒక పని చేస్తున్నవాడు, (2) ఆ పనికోసం నిలపబడిన, (3)ఒక తరగతికి చెందిన (4) విశిష్టమైన పుణ్యం గల (5) దాని వలన ఏర్పడిన ప్రత్యేకమైన పరిస్థితి.

తజ్జాతిక (వి.) ఆ తరగతికి, తరహాకు చెందిన.

తత్కులీన (వి.) రాజవంశానికి చెందిన వాడు. సింహాసనంమీద అధికారం ఉన్నట్లు చెప్పుకొనువాడు.

తన్తువిచ్ఛిన్న (వి.) (ఒకవిధమైన చిక్కంవలె ఉండుటకు) దారాలు అన్నీ నేయని.

తన్త్ర (న.) రాజ్యపరిపాలనము.

తన్త్రయుక్తి (స్త్రీ.) విషయప్రతిపాదనపద్ధతి.

తపనీయ (న.) అలంకారాలకోసం ప్రత్యేకంగా తయారుచేసిన బంగారం.

తప్త (న.) అలంకారాల బంగారం

తప్తవ్యాజీ (స్త్రీ.) కాచిన నెయ్యి, నూనె అమ్మినప్పుడు ఇచ్చే కొసరు (Commission).

తర్క (పు.) ఖరీదు ఉజ్జాయింపున నిర్ణయించుట An assessment of value.

తర్కుభ్రామిన్ (వి.) నేసే దారం చుట్టిన పుల్లవలె తిరిగేది.

తల (న.) అంతస్తు (పు.) చెంపదెబ్బ.

తలిచ్ఛక (న.) ఒకరకం జంబుఖానా.

తాడన (న.) శిక్షించడం, Punishment.

తాదాత్విక (వి.) సంపాదించినది సంపాదించినట్లు ఖర్చుపెట్టేవాడు.

తార (న.) వెండి.

తారిత (వి.) పూర్తిచేయబడిన Completed, disposed of.

తార్యాబాధ (వి.) అనాయాసంగా తప్పించుకొనడానికి శక్యమైన అపాయం గలది.

తాలమూల (న.) తాటిమొదలు ఆకారంలో ఉన్న కట్టడం. ఒకరకమైన డాలు.

తాలావచర (పు.) నాట్యం చేసేవాడు.

తాలోద్ఘాటన (న.) తాళాలు పగలకొట్టే సాధనం.

తిథి (స్త్రీ.) పండుగరోజు.

తిరోజనపద (పు.) విదేశీయుడు.

తిరోహిత (వి.) ఒకడు లేనప్పుడు చేర్చబడిన Entered into during one's absence.

తీక్ష్ణ (వి.) (1) క్రూరస్వభావంగల, రౌడీ, (2) విషంతో కూడిన, (3)ధైర్యవంతుడు. చంపేవాడు.

తీర్థ (న.) (1) నది దాటే చోటు, (2) పుణ్యక్షేత్రం, (3) సత్పాత్ర, (4) పెద్దహోదా గల అధికారి, (5) ఋతుకాలం.

తీర్థకర (పు.) మతగురువు.

తీర్థఘాత (పు.) పుణ్యక్షేత్రాలలో దొంగతనం చేసేవాడు.

తుత్థ (న.) లోహాలు కరిగించే మూస, మూసలో వేసి కరిగించుట.

తులామాన (న.) తూచినందుకు ఇవ్వ వలసిన కమిషన్.

తువరీ (సీ.) ఒక పప్పుదినుసు.

తూర్యకర (పు.) సంగీతవాద్యాలు తయారు చేయువాడు.

తూష్ణీందణ్డ (పు.) రహస్యమైన శిక్ష. రహస్యంగా చంపుట.

తూష్ణీంయుద్ధ (న.) రహస్యోపాయాలతో యుద్ధం.

తృతీయసార (తి.) శ్రేష్ఠత్వంలో మూడవది. The third best.

తేజనచూర్ణ (న.) మెరుగుపెట్టే చూర్ణం.

తేజనతైల (న.) మనిషికి మెరుపు ఇచ్చే తైలం.

తేజనాగ్ని (పు.) మంట మండకుండా ప్రకాశించే నిప్పు.

తైలపర్ణిక (న.) కాల్చితే సువాసన కలిగించే ద్రవ్యం.

తోయాన్తికీ (వి.) నీరు ఊరే లోతువరకు వెళ్లేది.

త్యాగ (పు.) బహుమతి ఇవ్వడం.

త్రిపుటక (వి.) త్ర్యస్రం Triangle in shape.

త్రిపౌరుషీ (వి.) మూడు ఛాయాశిలల ప్రమాణం గల.

త్రైకాల్య (న.) మూడు కాలాలు.

త్వష్టృ (పు.) బంగారం పూసేవాడు.

త్వష్టృకర్మన్ (న.) బంగారం పూత.

## ద

దంశనీయ (పు.) ఒక మందు. ఆ మందు తిన్నవాడు పదిమందిని కరుస్తాడు.

దక్షిణాపథ (పు.) దక్షిణభారతం. దక్షిణభారతం వైపు వర్తకమార్గం.

దణ్డఖేదిన్ (వి.)అత్యధికదండనంచేత బాధపడుచున్న.

దణ్డనాయిన్ (వి.) సైన్యం నడపగలవాడు.

దణ్డప్రణీత (వి.) శిక్ష లేదా జరిమానా విధించబడినవాడు.

దణ్డప్రతికర్తృ, దణ్డప్రతికారిణీ (వి.) జరిమానా చెల్లించడానికి బదులు కాయకష్టం చేయువాడు / నది.

దణ్డప్రేషణ (న.) శారీరక (శరీరం పీడించే) దండం విధించడం.

దణ్డబలవ్యవహార (పు.) సైన్యబలప్రయోగం.

దణ్డోపకారిన్ (వి.) (1) జరిమానా చెల్లించడానికి బదులు కాయకష్టం చేయువాడు, (2)సైన్యానికి సహాయకుడుగా ఉండేవాడు.

దణ్డోపనత (పు.) సైన్యంతో లొంగి పోయినవాడు.

దణ్డోనాయిన్ (వి.) శత్రువును బలప్రయోగం చేత లొంగదీసికొనేవాడు.

దమ్య (వి.) శిక్షణ (ట్రైనింగ్)లో ఉన్న, (న) బ్రద్దలు కొట్టి లోన ప్రవేశించుట.

దరణ (న.) బీట.

దర్శన (న.) అభిప్రాయం.

దశతీ (సీ.) పది పశ్వాదుల గుంపు.

దశబన్ధ (వి.) పదిలో ఒకటి.

దశవర్గాధిపతి, దశవర్గిక(పు.) పదిమంది సైనికుల అధికారి.

దాణ్డకర్మిక (న.) రహస్యంగా దండించడం

ద్రాత్ర (న.) చాకు.
దాయాగత (పు.) వంశక్రమాగతుడైన దాసుడు.
దార (పు.) చీలిక, బ్రద్దలగుట.
దురుపరోధిన్ (వి.) ముట్టడించడానికి శక్యం కాని.
దుర్భగా (సీ.) భర్తకు అనిష్టురాలైన స్త్రీ.
దుహితృకా (సీ.) వేశ్యాపుత్రిక.
దుహిలితికా (వి.) బొచ్చుతో నిండిన. బల్లిఆకారంలో ఉన్న.
దూషీవిష (న.) ఒకవిధమైన విషం.
దూష్య (వి.) దేశద్రోహి, రాజద్రోహి.
దేవపథ (పు.) ఆచ్ఛాదనం లేని మార్గం.
దేవరాత్రి (స్త్రీ.) రాత్రిజాతర.
దేవసరస్ (న.) సహజంగా ఏర్పడిన చెరువు.
దేశ (పు.) సాక్ష్యాధారం. స్వామిత్వానికి ప్రమాణం Proof of ownership title.
దేశబన్ధ (పు.) సరిహద్దు నిర్ణయించుట.
దేశవాప (వి.) ప్రదేశం స్వభావంమీద ఆధారపడిన విత్తనాల చల్లిక గల.
దేశిక (పు.) మార్గనిర్దేశం చేసే సామర్థ్యం ఉన్నవాడు.
దైవ (న.) అలౌకికాలైన కొన్ని లక్షణాలకు (గుర్తులకు) అర్థంచెప్పే శాస్త్రం.
దౌరాత్మిక (వి.) దుష్టస్వభావం గల.
దౌర్గకర్మిక (వి.) దుర్గరక్షణానికి ఉపయోగించు.
దౌవారిక (పు.) ప్రధానద్వారపాలుడు.
దౌహృద (న.) చిరకాలవాంఛలు సఫలములగుట.
ద్రవామ్ల (న.) పుల్లని ద్రవపదార్థం.
ద్రవ్యప్రకృతి (సీ.) రాజ్యాంతర్గతమైన పదార్థం (విషయం).
ద్రవ్యవ్యపనయ (పు.) ఒక వ్యవహారం రద్దుచేయుట Annulment of a transaction.
ద్రూణ (పు.) కఱ్ఱతోచేసిన ధనస్సు.
ద్రోణముఖ (న.) నాలుగువందల గ్రామాల ప్రధానస్థానం (Head quarters).
ద్వన్ద్విన్ (వి.) ఒకరితో ఒకరు పోట్లాడుకొనుచున్న.
ద్వాదశాన్తర (వి.) పన్నెండు నిలువుల లోతు.
ద్విపటవాన (న.) జంటనూలుతో నేసినది.
ద్వేష (పు.) (భార్యాభర్తలమధ్య) ప్రేమ లేకపోవడం.
ద్వైధీభావ (పు.) ఒకరాజుతో స్నేహము మరొకనితో విరోధమూ సాగించుట.
ద్వైధీభావిక (వి.) మరొకచోట యుద్ధం చేస్తూ సంధిచేసుకొనడానికి తగినవాడు.
ద్వైరాజ్య (న.) ఇద్దరు రాజులు ఒక రాజ్యాన్ని పరిపాలించడం.

## ధ

ధరక (పు.) తూచేవాడు.
ధర్మ (పు.) నిజంగా అంగీకరించడం, న్యాయశాస్త్రం, ధర్మశాస్త్రం.
ధర్మసేతు (పు.) నిఃశుల్కంగా నీరు ఇచ్చే జలస్థానం. A charitable waterwork.
ధర్మస్థ (పు.) న్యాయాధికారి A Judge.
ధర్మస్థీయ (వి.) న్యాయాధికారికి సంబంధించిన. న్యాయాధికారి పరిధిలో ఉన్న.
ధర్మావసథిన్ (పు.) నిఃశుల్కనివాసగృహం

అధికారి.

ధాన్యకాన్త (వి.) పంటలకు అనుకూలమైన.

ధాన్యవాప (వి.) ధాన్యం చల్లదగిన.

ధాన్యామ్ల (న.) పుల్లని గంజి.

ధారయిష్ణు (వి.) పట్టుదలగల Persevering.

ధారయిష్ణుతా (స్త్రీ.) పట్టుదల.

ధారా (స్త్రీ.) (అశ్వముయొక్క) వేగం.

ధృ (ధా.) జీవించి ఉండు.

ధృతి (స్త్రీ.) దృఢమైన అభిప్రాయం Will.

ధేనుకా (స్త్రీ.) పిల్లకి పాలిచ్చు ఆడఏనుగు.

ధోరణ (వి.) ఎగురుతూ నడిచేది (గుఱ్ఱం).

ధ్యామ (వి.) మట్టికొట్టుకొనిపోయిన.

ధ్వజ (పు.) జండా, ప్రవేశం పన్నులు వసూలుచేసే కార్యాలయం గుర్తు The sign of the customs house.

ధ్వజమూల (న.) ప్రవేశం రుసుము వసూలు చేసే కార్యాలయం. Customs house.

ధ్వజాహృత (పు.) యుద్ధంలో పట్టుకొన బడిన బానిస.

ధ్వస్త (వి.) వదలి వెళ్లిపోయినవాడు.

## న

నదీపథ (పు.) నదీమార్గం.

నదీమాతృక (వి.) నదులద్వారా సాగు జరిగేది.

నయ (పు.) సరియైన విధానం.

నర్మయ్ (నామధాతు.) ఆనందజనకంగా కాలక్షేపం చేయించు To entertain.

నవబుద్ధి (వి.) పరిణతిచెందని బుద్ధి గల.

నస్తః (అవ్య.) ముక్కుద్వారా.

నస్తఃకర్మన్ (న.) ముక్కుద్వారా లోనికి తీసికొన, పీల్చుకొను.

నస్య (న.) (1) ముక్కుత్రాడు తగల్చుట, (2) ముక్కుకొరకు తయారు చేసినది.

నస్యకర్మన్ (న.) నూనెమొదలైనవి ముక్కులో పోయు.

నాగరక (పు.) ధైర్యవంతుడు. A gallant.

నాగరాయణ (న.) కోట ఉన్న నగరాన్ని పీడించడం.

నాగరిక (పు.) నగరాధికారి A city superintendent.

నాగోదరికా (స్త్రీ.) తొడకు కట్టుకొనే కవచం.

నాదేయ (వి.) నదిలో లభించిన. నదిపాడు గునా నివసించే.

నాన్దీ (స్త్రీ.) స్వస్తికచిహ్నం.

నాయక (పు.) యుద్ధభూమిలో సేనా నాయకుడు A Commandant (in the field).

నారోష్ట (వి.) గుర్తులను గుర్తుపట్టు Responding to signals.

నాలికా (స్త్రీ.) కాలం కొలిచే జలనాళిక. The water clock.

నాలీ (స్త్రీ.) నాలి (పు.) గొట్టం. నిప్పు ఊదే గొట్టం.

నాష్టిక (పు.) పోగొట్టుకొన్నవాడు.

నికాయ (పు.) హాలు, గది.

నిక్షిప్ (ధా.) (అపరాధారోపణం లేదా కేసు) ఉపసంహరించుకొనడం.

నిక్షేప (పు.) (1) జాగర్తచేయుటకై ఒకరికిచ్చినది. వస్తువులు తయారు చేయుటకు శిల్పులకు ఇచ్చిన పదార్థం. (2) వస్తువులు ఉంచే పాత్ర ము. నిలవచేసే చోటు.

నిగ్రహ (పు.) మరణం.

నిగ్రహేణ (క్రి.వి.) తప్పనిసరిగా.

నిధాన (న.) (1) నిలవచేయుట, (2) నిలవచేసే స్థానం, (3)నివాసస్థానం.

నిన్దు (సీ.) మరణించిన శిశువును కన్న స్త్రీ.

నిబద్ధ (వి.) వ్రాయబడిన Recorded.

నిబన్ధ (పు.) వ్రాయుట Recording.

నిబన్ధక (పు.) వ్రాసేవాడు The recorder.

నిబన్ధన (న.) షరతుల ప్రకారం బాధ్యుణ్ణి చేయడం. Binding i.e. terms and conditions.

నిబన్ధపుస్తక (న.) వ్రాసే పుస్తకం A record book. a register.

నిమిత్త (న.) శకునశాస్త్రం.

నిమ్న (న.) నీళ్లు, తేమప్రదేశం.

నియమ్ (ధా.) నిర్బంధంలో ఉంచు. శిక్షించు.

నిరన్తరయోగిత్వ (న.) వెంటనే సంబంధించి ఉండుట. వెంటనే అమలులోనికి వచ్చుట.

నిరన్వయ (పు.) పట్టుకొన్న వస్తువుయొక్క యజమాని ఉండకపోవడం (absence).

నిర్ఘాత (పు.) వినాశం, తొలగించుట.

నిర్దిష్ట (వి.) నిశ్చితమైన, Stipulated, fixed.

నిర్దేశ (పు.) విశేషంగా అప్పగించడం. విశిష్టమైన ధనాదిదానం. A special assignment. a special allowance.

నిర్భోగ (పు.) వంకర. ముణుచుకొనిపోవుట.

నిర్యా (ప్రే.ధా.) ప్రచారంలోనికి తీసికొని వచ్చు To send into circulation.

నిర్యామక (పు.) నావమనిషి. ముందు వెళ్లువాడు. A Boatman, Pilot.

నిర్యూహ (పు.) కషాయం. A decoction.

నిర్వహ్ (ప్రే.ధా.) బైటకు (వస్తువులు) పంపు. To export.

నిర్వహణ (న.) (వస్తువులు) బైటకు పంపుట Export.

నిర్వాద (పు.) నిందనీయమైన ప్రవర్తన.

నిర్విభజ్ (ధా.) వాటానుండి వేరుచేయు, To exclude from inheritance.

నిర్విశ్ *(కర్మణిప్రయోగం)* అద్దెకు ఇవ్వబడు లేదా తీసికొనబడు.

నిర్వేశ (పు.) జీతం Wage.

నిర్హార (పు.) బైటకుతీయడం Taking out. disposal.

నిర్హారిన్ (వి.) విస్తృతంగా వ్యాపించే.

నివిష్ట (వి.) నిర్ణయించబడిన, స్థిరీకృతమైన Laid down. fixed.

నివిష్టా (సీ.) పునర్వివాహం చేసుకొన్న స్త్రీ.

నివేశ (పు.) (1) (స్త్రీచేసుకొన్న) పునర్వివాహం, (2) మజిలీ, నివాసం Halting, a halt.

నిశాన్త (న.) రాజనివాసం.

నిశ్సార (పు.) ముందుకు వెళ్లుట Moving out. March out.

నిషద్యా (సీ.) ఇళ్లు Houses. quarters.

నిషిచ్ (ప్రే.ధా.) లోనికి ప్రవేశింపచేయు.

నిషేక (పు.) లోనికి ప్రవేశింప చేయుట.

నిష్కస్ (ధా.) బైటకు వెళ్లు, విడిచివెళ్లు To go out. To leave.

నిష్కసన (న.) బైటకు వెళ్లుట Going out. An exit.

నిష్కాన (పు.) చూ.పై.

నిష్కిర (న.) బైటకు వెళ్లే ద్వారం.

నిష్కిరద్వార (న.) చూ.పై.

నిష్కుట (పు.) గృహోద్యానం.

నిష్క్రయ (పు.) నష్టపరిహారం Compensation. ముదరా ఇచ్చిన సొమ్ము. Redemption amount. ఎవరినైనా విడిపించు కొనడానికి ఇవ్వవలసిన సొమ్ము. ransom. పాడైపోయినందుకు ఇవ్వవలసిన సొమ్ము Demurrage. శారీరకదండంనుంచి (జరిమానా చెల్లించడం ద్వారా) విడుదల redemp tion from corporal punishment by payment of fine.

నిష్క్రామ్య (న.) ఎగుమతి సుంకం Export duty.

నిష్ఠ్యూత (వి.) దూరంగా విసరివేయ బడిన.

నిష్పత్ (ధా.) పారిపోవు, కనబడకుండ వెళ్లిపోవు To run away, to abscond (ప్రే.ధా) తప్పించు కొనేటట్లు సహక రించు To help to escape. to cause to leave or desert. బైటకు త్రోసివేయు. To drive out. to oust.

నిష్పతన (న.) పారిపోవుట, కనబడకుండా పోవుట.

నిష్పతిత (వి.) పారిపోయిన, కనబడ కుండా పోయిన.

నిష్పత్తి (స్త్రీ.) (1) ధాన్యపుపంట The produce. harvest. (2) దోషాన్ని నిరూ పించుట. The proving of a charge.

నిష్పాక (పు.) పూర్తిచేయుట Completion.

నిష్పాత (పు.) చూ. నిష్పతన.

నిష్పాతన (న.) (ఒక వస్తువు) కనబడకుండ చేయుట.

నిసర్గ (పు.) లొంగిపోవుట Surrender.

నిసృష్ట (వి.) అధికారం ఇవ్వబడిన Authorised.

నిసృష్టార్థ (వి.) ఏదైన విషయంలో వ్యవహరించడానికి అధికారం ఇవ్వబడి నవాడు Authorised to negostiate in a matter.వ్యవహరించడానికి సంపూర్ణా ధికారం ఇవ్వబడిన రాజదూత మొద లైనవాడు Plenipotentiary.

నిసృష్టవ్యవహార (వి.) ఇచ్చిపుచ్చుకోవడాలు చేయడానికి అధికారం ఇవ్వబడిన వాడు Authorised to carry out a transaction.

నిసృష్టి (స్త్రీ.) అధికారం ఇచ్చుట Authori sation.

నిస్తబ్ధ (వి.) స్తంభింపచేయబడిన, మూసి వేయబడిన.

నిస్తల (వి.) గుండ్రంగా ఉన్న Perfectly spherical.

నిస్తృ (ప్రే.ధా.) ఆపదనుండి రక్షించు. అందచేయు To deliver.

నీచైర్గత (వి.) మందంగా నడుస్తూన్న (అశ్వం).

నీతివిద్ (పు.) నీతిశాస్త్రజ్ఞుడు An expert in the political science.

నీప్ర (న.) ఇంటిచూరు, ఇంటి కప్పు.

నీప్రాన్తర (న.) ఇంటిచూరుకీ మరొక ఇంటికీ మధ్యనున్న కాళీ.

నీవీ (స్త్రీ.) మిగిలినధనం The balance, దాచిన ధనం Savings.

నేజనోదక (న.) కడగడంకొరకు నీరు.

నేతృ (పు.) నాయకుడు, విజయం పొందనున్నవాడు

నేత్ర (న.) ఒక నాయకుడు అవలంబించు కార్యవిధానం.

నేత్రమోహన (న.) కళ్లను మోసగించేది.

నైవేశనిక (న.) పెండ్లికి ఖర్చుపెట్టిన ధనం.

నైసృష్టిక (వి.) అధికారం అప్పగించుచున్న Conferring authority.

న్యఙ్గ (వి.) కుంటివాడుగా చేయబడిన.

న్యాయ (పు.) రాజాజ్ఞ, రాజశాసనం The Kings's order or edict.

## ప

పక్ష (పు.) సైన్యవ్యూహంలో ఒక ప్రక్క A wing (of the battle array).

పక్షాన్తర (న.) వెనుకభాగం

పక్ష్మన్ (న.) జుట్టు Hair.

పఞ్చవటీ (స్త్రీ.) ఐదు కలశల సముదాయం.

పఞ్చబన్ధ (వి.) ఐదవవంతు.

పటల (న.) (1) పేడకుప్ప, (2) ఆచ్ఛాదనం. పైన కప్పిన రేకు.

పణ్ (ధా.) షరతులు విధించు.

పణ (పు.) (1) ఒక వెండినాణెం, (2) చేతివ్రేళ్లు, (3) షరతు A condition. a stipulation.

పణకర్మన్ (న.) షరతు విధించుట, సంధి చేసికొనుట.

పణన (న.) వస్తువుల మార్పిడి Ex change, వ్యాపారం చేయుట Trade.

పణబన్ధ (పు.) సంధి చేసికొనుట.

పణయాత్రా (స్త్రీ.) నాణాల చలామణీ The circulation of coins, currency.

పణ్డక (పు.) నపుంసకుడు.

పణ్యపత్తన (న.) ఓడలరేవు, A port.

పణ్యపుట (న.) వస్తుసంఘాతం A package of goods.

పణ్యపుటభేదన (న.) దుకాణాల పట్టణం A market town.

పణ్యసంస్థా (స్త్రీ.) అంగడి The market place.

పణ్యాగార (న.) బహుమతిగా ఇచ్చిన వస్తువులు Goods (given as a gift).

పణ్యాగారిక (వి.) బహుమతిగా స్వీకరించబడిన.

పణ్యాధిష్ఠాతృ (పు.) అమ్మకాల అధికారి A sales agent.

పత్తిక (పు.) చిన్న సైన్యాధికారి A subordinate army officer. A lieutenant.

పత్తన (న.) ఓడలరేవు Port.

పత్తనాధ్యక్ష (పు.) రేవు అధికారి A Commissioner of ports.

పత్ర (న.) వాహనంగా ఉపయోగించే జంతువు. అశ్వం మొ.

పత్రక (న.) బుట్ట A basket, a tray, కజ్జిరోలు.

పత్రోర్ణా (స్త్రీ.) ఒక రకమైన పట్టు.

పథిక (పు.) మార్గాలలో సంచరించే గూఢచారి.

పథ్యదన (న.) దారిబత్తెం.

పథ్యనుసరణ (న.) ఒకని భార్య మరొకనితో నడచి వెళ్లుట.

పద (పు.) త్రాసుమీద బరువు సూచించే గుర్తు.

పరమిశ్రా (స్త్రీ.) శత్రువుతో చేతులు కలిపిన.

పరవక్తవ్య (వి.) ఇతరునిచేత తనదిగా చెప్పబడు Claimed by another.

పరాజయ (పు.) కేసులో ఓడిపోవడం.

పరిక్రయ (పు.) కొనడం (ఒకరకమైన సంధి).

పరిక్షేప (పు.) (1) చుట్టుకొలత Circum ference, (2) కట్టవ An enclosure. (3) (ఏనుగు) కాలి గొలుసు.

పరిగృహీత (వి.) (1) చుట్టూ కట్టబడిన enclosed, preserved, (2)వివాహం చేసికొనబడిన.

పరిగ్రహ్ (ధా.) (1) చుట్టూ బంధించు To surround, (2) శపథం చేసి చెప్పించు, హెచ్చరించుTo adjure, to exhort, (3) సహాయం చేయు, ఆలంబనం ఇచ్చు Support.

పరిగ్రహ (పు.) (1) చుట్టూ కట్టవ, పరిరక్షణం, (2)వస్తువుల స్థానం. A store. (3) సొత్తు Possession, property, (4)వాటా(5) కూడా వచ్చే పరివారం Attendents, followers, Retinue, (6) ఉపయోగించుట Employment,use, (7) ఇచ్చుట giving, granting, (8) సంరక్షించడం Maintenance.

పరిఘ (పు.) తానొక్కడు మాత్రమే అమ్మవచ్చును అనే అధికారం తీసికొన్నందుకు చెల్లించవలసిన పన్ను Monopoly tax.

పరిణమ్ (ధా.) ఒకవైపు తిరుగు, ముందుకు సాగు.

పరిదూషణ (న.) దోషం (ఒక విధమైన సంధి).

పరిపణిత (వి.) షరతులతో కూడిన.

పరిబన్ధ (పు.) పరివారం Entourage; Retenue.

పరిభాణ్డ (న.) రత్నాలు మొదలైన వాటిని పొదగడానికి ఉపయోగించే లోహం.

పరిభాషణ (న.) దూషణం, తిట్టడం. A reproof, a reprimand.

పరిమితార్థ (వి.) పరిమితమైన సాధించదగిన ప్రయోజనం గల. With a limited mission.

పరిమృదిత (వి.) బాగా నలిపివేయబడిన.

పరిలీఢ (వి.) కొద్దిగా నలపబడిన.

పరివర్తక (పు.) వస్తువినిమయం Barter, exchange.

పరివస్ (ధా.) రాత్రి ఆగిపోవు (ప్రే.ధా.) అదుపులో ఉంచు, నిగ్రహించు.

పరివాప (పు.) (1) స్వీయవస్తువులు Personal belongings, ఆసనాదికం Furniture, (2) పరివారం Retinue.

పరివార్య (న.) చుట్టూ కట్టిన కట్టవ.

పరివాహ (పు.) (కాలవలో)ప్రవాహం. పార్లి ప్రవహించడం. తోడివేయడం draining.

పరివేలీ (వి.) అసహజంగా ఊగునట్లు చేయబడిన.

పరిశూన (వి.) వాచిన, ఉబ్బిన.

పరిస్తోమ (పు.) ఒకరకమైన దుప్పటి లేదా తివాసీ.

పరిహార (పు.) పన్నులనుండి మినహా యింపు Exemption from taxes.

పరిహారక (వి.) పన్నులనుండి మినహా యింపు ఇవ్వబడిన.

పరిహృ (ధా.) పన్నులనుండి మినహా యించు.

పరీహారలేఖ (పు.) మినహాయింపు ఇస్తూ శాసనం.

పరోక్త (వి.) (1) కేసులో ఓడిపోయిన వాడు, (2) కేసులో లేదా తగాదాలో నష్టమైనది. Which is lost in a suit or dispute.

పర్యగ్ర (న.) మొత్తం సంఖ్య.

పర్యస్ (ధా.) కలుపు.

పర్యాత్త (వి.) గ్రహించబడిన, పట్టు కొన బడిన Taken, seized.

పర్యాదా (ధా.) ఒకని ఆస్తి అంతా వానికి లేకుండా చేయు.

పర్యుపాసన (న.) ముట్టడి.

పర్యుషిత (వి.) (1) చాలాకాలం ఉండి పోయిన outstanding, longstanding. old, (2) రాజు మందలో ఉండిపోయిన.

పర్యేష్ (ధా.) కావాలని కోరు To seek.

పర్యేషణ (న.) పరీక్ష Investigation, examination.

పశ్చాత్కార (పు.) నిరాకరణం.

పశ్చాత్కృత (వి.) (వారంలో) తిరస్కరించ బడిన, సఫలుడు కాని.

పశ్చాహ్న (పు.) అపరాహ్ణం Afternoon.

పష్ఠౌహీ (సీ.) తొలిచూలు ఆవు.

పాంసుధావక (పు.) (గనిలో గాని కంసాలి దుకాణంలో గాని) బూడిద శుభ్రం చేయువాడు.

పాక్యమాంసిక (పు.) వండిన మాంసం అమ్మేవాడు.

పాత్ర (న.) తగిన స్థితి An appropriate position.

పాత్రచయ (పు.) యోగ్యునికి ఇచ్చిన పారితోషికం.

పాదగోప (పు.) గుఱ్ఱపురౌతు మొదలైన వాళ్లకు రక్షకుడుగా ఉన్న కాలిబంటు.

పాదపాశిక (పు) ఏనుగుకాలికి గొలుసు కట్టువాడు.

పాద్య (వి.) నాల్గవవంతు (విషం) ఉన్న.

పాపీయస్ (వి.) క్రింది జాతివాడు.

పాయనార్థా (సీ.) లేగదూడకు పాలిచ్చు.

పారగ్రామిక (వి.) శత్రుగ్రామాన్ని జయిం

చడానికి ఉపయోగించువాడు/చునది.
పారణ్చిక (న.) కీలుతప్పు dislocation.
పారతల్పిక (పు.) పరభార్యాగామి.
పారశమ (పు.) కంచరిగాడిద.
పారాయణ (న.) గుళ్ఞం మొదలైన వాటిని తోలేవాడు.
పారికర్మిక (పు.) అనుచరుడు An attendent.
పారియాణిక (న.) మనుష్యులు ప్రయాణంచేసే బండి.
పారిహీణిక (న.) నష్టపరిహారం Compensation for loss suffered.
పారీక్షిక (న.) పర్యవేక్షణశుల్కం Inspection fee.
పార్శ్వ (న.) (1) ప్రక్కసంపాదన A kind of extra or irregular income. అధికంగా వేసిన పన్ను A special levy, (2)కుయుక్తి A stratagem, a trick.
పార్శ్వాపవృత్త (వి.) ప్రక్కకు ఒరిగిన.
పార్ష్ణి (వి.) సేన వెనుకభాగం.
పార్ష్ణిగ్రాహ (పు.) వెనుకనున్న శత్రువు.
పార్ష్ణిగ్రాహాసార (పు.) వెనుకనున్న శత్రువు యొక్క మిత్రుడు.
పాలిన్ (పు.) మందల కాపరి.
పాలీ (స్త్రీ.) పొలాలమధ్య ఉన్న గట్టు.
పాషణ్డ (పు.) నాస్తికమతభిక్షువు లేదా సంన్యాసి.
పాషణ్డిన్ (పు.) విమతస్థుడు.
పిఙ్క (పు.) (శిల్పి బంగారం మొదలైనది అపహరించడంకొరకు) మరొకదాని మీద అతుకుట.
పిజ్జన (న.) Breaking into yoke.
పిచు (పు.) పత్తి.
పిచ్ఛిల (వి.) నున్నగానున్న, జారిపోయేట్లు ఉన్న.
పిచ్ఛ (పు.) (దుమ్ము దులపడానికి ఉపయోగించే) పింఛం.
పిటక (పు.) పెట్టె, బుట్ట.
పిటకా (స్త్రీ.) అలంకారంలో పొదుగుట.
పిణ్డకర (పు.) (గ్రామాదులనుండి వసూలైన) మొత్తం పన్ను.
పిణ్డగోచరిక (వి.) ఆహారం మాత్రమే పొందేవాడు Receiving only food or maintenance.
పిణ్డవాలుకా (స్త్రీ.) ఇసుకముద్ద లేదా ఇసుక రేణువు.
పిణ్డారక (పు.) గేదెల కాపరి.
పిణ్యాక (పు.) తెలకపిండి.
పీడన (న.) రాజ్యానికి కలిగించిన బాధ.
పీడనీయ (వి.) పీడింపదగిన.
పీతమూర్ఛిత (న.) కాల్చిపొడిచేయబడిన.
పుఞ్జీలగ్రహ (పు.) కట్టలమోపు collection of bundles.
పుట (న.) కట్ట A package.
పుటభేదన (న.) పట్టణం, నగరం.
పుద్గల (పు.) బంగారం లేదా వెండితో చేసిన వస్తువు.
పురశ్చరణ (న.) ముందుగా చేసే పూజాదికం A preparatory rite.
పురుష (న.) చూ.ఛాయాపురుష.

పురోగ (వి.) ముందు వెళ్లేవాడు, నాయకుడు, మార్గదర్శకుడు.

పులాక (పు.) నీళ్లల్లో వేసిన సగం ఉడికిన బియ్యం.

పుష్కరిణీద్వార (న.) ఒకరకమైన నగర ద్వారం.

పుష్పచ్ఛిద్ర (వి.) దోషం ఉన్న (రత్నం) Defective in the bloom (of a gem).

పుష్యరథ (పు.) ఉత్సవసమయాలలో ఉపయోగించే రథం.

పూగ (పు.) ఒకజాతికి చెందినవాళ్ల గుంపు A communal gathering. జనసంఘం

పూతికిట్ట (పు.) చిట్లం Dross.

పూరవేలా (స్త్రీ.) వరదనీటి అవధి The (furthest) limit of the floods.

పూరాస్రావ (పు.) పొంగిపొరలిన నీరు.

పూర్వకృతాపదాన (పు.) పాత అపరాధి A former offender.

పూర్వభుక్తిక (వి.) (ఒక ఆస్తిని) పూర్వం అనుభవించినవాడు. Who was formerly in possession.

పూర్వానువృత్త (వి.) పూర్వంనుంచీ అలవాటులో ఉన్న In existence since old times.

పూర్వాపదాన (న.) పూర్వం చేసిన అపరాధం.

పృథగ్భూత (వి.) వేరు వేరు మాటలు మాట్లాడేవాడు Who makes a divergent statement.

పృషత (న.) బంగారం మొదలైన వాటితో పూసలు తయారు చేయుట, పూస.

పృషతకారు (పు.) పూసలు తయారు

పృష్ఠవాహిన్ (వి.) చేయువాడు.వీపుమీద బరువు మోయువాడు.

పేటక (పు.) పెట్టెలో బంధించుట, మూయుట Boxing, encasing. Enclosing.

పేషక (పు.) నలగకొట్టేవాడు.

పోట్టలిక (న.) సంచి.

పోతవ (న.) కొలతలు, తూనికలు ఒక పద్ధతిలో నిర్ణయించుట standardization of weights and measures. కొలతల తూనికల నియతపద్ధతి The standard of weights and measures.

పోత్రీ (స్త్రీ.) పందిమూతి.

పౌరవ్యావహారిక (పు.) నగరన్యాయాధికారి The city judge or magistrate.

పౌరుష (న.) నిలువుటెత్తు, పొడవు.

పౌరుషీ (స్త్రీ.) కాలసూచకశిలమీద నున్న ఒక కొలత.

పౌరుషేయ (వి.) మనుష్యులకు లాభకరమైన.

పౌర్వపౌరుషిక (వి.) వెనుకటి తరాల వాళ్లకి చెందిన.

ప్రకర (పు.) ప్రోగు A collection, a heap.

ప్రకర్త్రీ (స్త్రీ.) కన్యాదూషకురాలు.

ప్రకర్మన్ (న.) మైథునం. కన్యామానభంగం.

ప్రకామిన్ (పు.) తన ఇష్టం వచ్చినట్లు చేయగలిగినవాడు.

ప్రకృ (ధా.) కన్యను దూషించుట To

violate a maiden మానభంగం చేయు.

ప్రకృతా (వి.) మానభంగం చేయబడిన.

ప్రకృతి (స్త్రీ.) రాజ్యావయవం A constituent of the state.

ప్రకృతిపురుష (పు.) ప్రధానాధికారి A principal officer.

ప్రకృతివైకృత (న.) సహజస్థితిలో మార్పు.

ప్రకృష్ట (వి.) అధికమైన Extensive.

ప్రకోపక (వి.) తిరుగుబాటుకు ప్రోత్సహించు వాడు.

ప్రక్రయ (పు.) అద్దెకు ఇచ్చుట Leasing, letting on rent, Rental.

ప్రక్షేప (పు.) పెట్టుబడి Investment, outlay, capital.

ప్రక్షేపవృద్ధి (స్త్రీ.) ప్రక్షేపం మీద వడ్డీ.

ప్రగ్రహ (పు.) (1) బలం చేకూరుట Supporting, Favouring, (2) Support, favour, honour, (3) తీసికొనివచ్చుట Bringing in recovery, (4) పట్టుకొనుట Holding (as a hostage)

ప్రగ్రహణ (న.) లొంగదీసికొనుట

ప్రగ్రీవ (పు.) లోనికి ప్రవేశించగానే ఉన్న వాకిలి. An entrance hall.

ప్రఘర్ష (పు.) శరీరాదులలో కలిగించే మెలికలు The five astringements. శరీరానికి పూసికొనే సుగంధద్రవ్యాలు.

ప్రచార (పు.) (1) పని Activity, function. Work. movements, (2)పనిచేసే పరిధి. Sphere of activity, (3) మేయుట grazing.

ప్రచ్ఛన్నక (పు.) తిరుగుబోతు A loafer, a stramp.

ప్రజవ (పు.) శీఘ్రసంచారం.

ప్రణయ (పు.) ధాన్యధనాదులు కావాలని అడుగుట A demand for grains money etc.

ప్రణాలీ (స్త్రీ.) బోదికాలవ A channel, a drain.

ప్రణిధాన (న.) ఉపయోగించుట Employment, use.

ప్రణిధి (పు.) (1) ఉపయోగించుట Employment, use, (2)నియమాలు. కార్యాచరణపద్ధతి Rules, regulations, procedure.

ప్రణీత (వి) ఉపయోగించబడిన, కలిగించబడిన used, infliated.

ప్రతాప (పు.) (1) ప్రతాపం Majesty, prestige, making one's majesty felt, (2) శక్తి Might, (3) బలం Valour, heroism.

ప్రతాపన (న.) ఎండలో వెచ్చపెట్టుట.

ప్రతి+అస్ (ధా.) ఒకనికి చెందు To fall to the lot of. To belong to.

ప్రతికర (పు.) పన్నుకు బదులు ఇచ్చేది A substitute for a tax.

ప్రతిక్రుష్ట (వి (1) మొరపెట్టుకొనబడిన Called to rescue, (2) ఎవని ఆస్తి వేలం వేయబడిందో అతడు.

ప్రతిక్రోశ (పు.) వేలంపాట పాడుట.

ప్రతిక్రోష్టృ (పు.) వేలంపాట పాడేవాడు.

ప్రతిగణికా (స్త్రీ.) గణికకు సహాయురాలు A deputy courtesan.

ప్రతిగృహీతా (వి.) అనుగ్రహపాత్రురాలు.

ప్రతిగ్రహ (పు.) (1) గ్రహించుట, (2) జామీనుగా తీసికొనుట Receiving a hostage; hostage, (3) చేరడం, సహాయంచేయడం Joining, meeting, supporting అధికబలం చేకూర్చుట Re inforcement, (4) సైన్యం వెనుకభాగం The rear of an army. reserves of an army.

ప్రతిగ్రహీతృ (వి.) స్వాగతపూర్వకంగా గ్రహించేవాడు Who receives with welcome (పు) (వస్తువులను) గ్రహించేవాడు The receiver of goods.

ప్రతిఘాత (పు.) ఎదురుదెబ్బ. అడ్డు. తగులుట A counter blow, reprisal, retaliation. A hindrance, an obstruction.

ప్రతిజప్ (ధా.) రహస్యంగా రెచ్చగొట్ట డానికి అనుకూలుడుగా ఉండు.

ప్రతిజాప (పు.) రెచ్చగొట్టడానికి అను కూలంగా ఉండుట.

ప్రతిజ్ఞాత (వి.) అంగీకరించబడిన, Ad mitted.

ప్రతిదేశ (పు.) ఆజ్ఞ Direction, instruc tions.

ప్రతిపణ్య (న.) ఒక వస్తువుకు బదులుగా తీసికొనబడిన మరొక వస్తువు.

ప్రతిపత్తి (స్త్రీ.) విషయం అర్థం చేసికొనుట, సమయస్ఫూర్తి Understanding, in telligence; readywittedness.

ప్రతిపద్ (ప్రే.ధా.) 1. చెల్లించు To pay out,to indemnify 2.అంగీకరింప చేయు, తన పక్షానికి త్రిప్పుకొను 3.తీసి కొనివచ్చు to bring over, to fetch 4.(రాజాదిరూపంలో) అంగీకరించు.

ప్రతిపాత (పు.) నష్టపరిహారం Compen- sation for loss.

ప్రతిపాన (న.) (పశువులకిచ్చే) శక్తివర్ధక పానం.

ప్రతిబన్ద్ (ధా.) పరీక్షకు సిద్ధంగా ఉండు To be ready for inspection or audit.

ప్రతిమఞ్చౌ ఒకదానికి ఎదురుగా ఒకటి ఉన్న రెండు అరుగులు.

ప్రతిమాన (న.) బరువు Weight (తూనికరాయి మొ.).

ప్రతియోగ (పు.) విరుద్ధమైన ఉపాయం.

ప్రతియోద్ధృ (పు.) అశ్వాదుల ముందు ఉండే కాలిబంటు.

ప్రతిరవణ (న.) మొరుగుట.

ప్రతిరాగిన్ (వి.) రంగు చూచి బెదరునది Over - sensitive to colour.

ప్రతిరూపక (వి.) పోలిక గల exactly similar.

ప్రతిలేఖ (పు.) ప్రత్యుత్తరం A document in reply.

ప్రతిలేపిన్ (వి.) అంతటా ఆచ్ఛాదించు చున్న.

ప్రతివర్ణక (పు.) మచ్చు A sample.

ప్రతివర్ణికా (స్త్రీ.) A sample; test.

ప్రతివ్యూహ్ (ధా.) ఎదురు ఉపాయం అవలంబించు To take countersteps.

ప్రతిషిధ్ (ప్రే.ధా.) 1. చెప్పినదానిని

ఖండించు To contradict 2. దూరంగా ఉంచు, ఒక పనిచేయ కుండేటట్లు చేయు To keep away, to dissuade 3. తొలగించు To repel, అణగద్రొక్కు to suppress 4. అడ్డగించు, ఎదుర్కొను to resist 5. అంగీకారయోగ్యం కాదని చెప్పు. 6.అనాదరం చూపు to set at nought, to disregard.

ప్రతిషేధ (పు.) 1. నిషేధించుట Prohi bition 2. అదుపులో ఉంచుట controlling 3. తొలగించుట 4. అణచుట.

ప్రతిష్టబ్ధ (వి.) 1. నిలిపివేయబడిన Withheld 2. పాతుకొని ఉన్న entrenched, strongly supported.

ప్రతిసంసర్గ (పు.) సంబంధం Contact, association.

ప్రతిసంస్కార (పు.) బాగుచేయుట Repairing.

ప్రతిసంహృ (ధా.) మళ్లీ ఒక చోట చేర్చు.

ప్రతిసంధా (ధా.) సాక్ష్యాధారాలు చూపు To furnish proof or corroboration.

ప్రతిసంధాన (న.) 1. సాక్ష్యాధారాలు చూపుట Corroboration 2.అభిప్రాయ భేదాలు తొలగి మళ్లీ కలియుట Reconciliation.

ప్రతిసమానీ (ధా.) పోల్చు to compare, to check, to secure corroboration, to prove right

ప్రతిసురుఙ్గా (స్త్రీ.) సురంగం ప్రక్క మరొక సురంగం A counter - tunnel.

ప్రతిస్వద్ (ప్రే.ధా.) ముందుగా రుచి చూసేటట్లు చేయు

ప్రతిస్వాద (పు.) ప్రతిస్వాదన (న) ముందుగా రుచి చూచుట.

ప్రతివాప (పు.) దూర్చుట, కలుపుట.

ప్రతోలీ (స్త్రీ.) ప్రాకారంమీద చిన్న గోపురం A turret on the parapet.

ప్రత్యంశ (పు.) ఒకని భాగం An individual share.

ప్రత్యన్తస్కన్ధ (పు.) సరిహద్దు సైన్యం.

ప్రత్యపసృత (పు.) శత్రువును విడచి వచ్చినవాడు, A deserter from the enemy.

ప్రత్యయ (పు.) (1) నిశ్చితత్వం, Satisfaction, Certainty, (2) గారంటీ guarantee, Surety, (3) ప్రమాణం, Testimony, evidence.

ప్రత్యవరోపిత (వి.)తగ్గించబడిన, Reduced, decreased.

ప్రత్యవసిత (వి.) వెనుకకు త్రిప్పి పంపబడిన Turned away, fallen.

ప్రత్యాదిశ్ (ధా.) (1) తెలుపు, To report, (2) ఘోషించు, Proclaim.

ప్రత్యాదేయ (న.) తిరిగి తీసికొనుట Taking back, Recovery.

ప్రత్యాదేశ (పు.) తెలియబరుచుట Communication.

ప్రత్యాపత్తి (స్త్రీ.) తిరిగివచ్చుట

ప్రత్యాయ (పు.) ఖర్చుపెట్టని ధనం తిరిగి ఇచ్చుట లేదా వచ్చుట.

ప్రత్యారుహ్ (ధా.) ఎదురుదెబ్బకొట్టు To

retaliate.

ప్రత్యావాప (పు.) కాలిబంట్లు అధికంగా ఉండుట Excess of infantry (over other army).

ప్రత్యాసార (పు.) వెనుకంజవేయుట Retreat.

ప్రదిష్ట (వి.) చేయడానికి నిర్దేశించబడిన Assigned.

ప్రదేశ (పు.) చూపుట, సూచించుట, Pointing out indicating.

ప్రదేష్టృ (పు.) అపరాధులను శిక్షించే న్యాయాధికారి Magistrate.

ప్రదోష (పు.) అధికమైన దోషం A serious defect.

ప్రద్వార (న.) ప్రధానద్వారం.

ప్రధాన (పు.) ప్రధానమైనవాడు, నాయకుడు ముఖ్యాధిపతి.

ప్రధారణ (న.) పీడించుటకై అపరాధిని పట్టుకొనుట.

ప్రధావనికా (స్త్రీ.) అగడ్తకీ ప్రాకారానికీ మధ్య కుడ్యరక్షితమైన మార్గం.A run-way protected by a wall (between the rampart and the moat).

ప్రపణిన్ (పు.) వర్తకుడు (ముఖ్యంగా) విదేశీయవర్తకుడు.

ప్రభుశక్తి (స్త్రీ.) The power of material resources.

ప్రమార (పు.) అంటువ్యాధి.

ప్రమృష్టశ్వేత (వి.) తెల్లగా చేయబడిన Bleached white.

ప్రయామ (పు.) (1) ముందుకు జరుపుట Extension. addition, (2) తూకంలో ఆధిక్యం Excess in weight.

ప్రయోగ (పు.) (1) అప్పు ఇచ్చుట, (2) తాకట్టుపెట్టుట.

ప్రయోగ్య (వి.) ఉపయోగానికి తగినది.

ప్రయోజక (పు.) అప్పు ఇచ్చినవాడు.

ప్రరూప (ధా.) చూపు.

ప్రవస్ (ప్రే.ధా.) (1) దేశంనుంచి బైటకు పంపు, (2) చంపివేయు.

ప్రవాస (పు.) దేశబహిష్కరణం.

ప్రవాసన (న.) (1) సంచారిసైన్యశిబిరం, A roving camp, (2)ప్రవాసం, (3) చంపుట.

ప్రవాసిత (వి.)(1) దేశబహిష్కృతుడైన (2) చంపబడిన.

ప్రవివేక చూ. మతిప్రవివేక

ప్రవిష్ట (వి.) జమచేయబడిన Paid in.

ప్రవీర (వి.) శ్రేష్ఠమైన, మంచి పంటనిచ్చు Excellent full of fertility.

ప్రవేశ్య (న.) దిగుమతిసుంకం Import duty.

ప్రవ్రజన (న.) ఇల్లు వదలిపోవుట, బైటకు వెళ్లుట.

ప్రవ్రజితా (స్త్రీ.) ఇల్లు వదలి వెళ్లిపోయిన స్త్రీ.

ప్రవ్రాజన (న.) బైటకు పంపుట.

ప్రశాస్తృ (పు.) సైన్యంలోని కర్మకరుల సంఘం నాయకుడు The director of labour corps in the army, Adminis trator.

ప్రశోధ్య (వి.) తిరిగి తీసికొనదగిన (సొమ్ము) To be cleared, to be recovered.

ప్రసంగ (పు.) అత్యాధికాసక్తి Excessive

attachment, addiction.

ప్రసన్నా (స్త్రీ.) నిర్మలమైన ఒక రకం మద్యం.

ప్రసర్గ (పు.) విడచిపెట్టుట, ఇష్టం వచ్చినట్లు చేయుటకు అనుమతించుట.

ప్రసార (పు.) ముందుగా వెళ్లే రక్షక బలం Advance patrol, A foraging raid.

ప్రసృష్టస్త్రీక (వి.) స్త్రీలకు స్వాతంత్ర్యం ఇచ్చిన.

ప్రసేవ (పు.) సంచి A bag.

ప్రస్తీన (వి.) అతికఠినమైన.

ప్రహవణ (న.) ఉత్సవసమయం, విందు, A festive occasion. a festive party, a picnic.

ప్రాకామ్య (న.) (1) సమృద్ధి Abundance, (2) స్వాతంత్ర్యం Freedom, choice, right.

ప్రాక్షిప్తక (వి.) ముందుకు చొచ్చుకొని వచ్చిన Projecting.

ప్రాణ (పు.)ఒక మనిషి An individual, a person.

ప్రాతిభావ్యబన్ధ (పు.) జామీనుగా ఉండడానికై ఒకనిని నిర్బంధించుట.

ప్రాతివేదనిక (న.) తూనికరాళ్లకు, కొలిచే పాత్రలకు సీళ్లు వేయుట. సీళ్లువేసి నందుకు రుసుము.

ప్రాత్యయిక (వి.) నమ్మదగిన.

ప్రాదానిక (న.) కన్యావివాహం నిమిత్తం ధనం.

ప్రాదీపిక(వి.) దీపంకొరకు ఉపయోగించిన (పు) అగ్నిచేత దహించిన అప రాధం చేసినవాడు.

ప్రాదీపికమ్ (అవ్య.) నిప్పు అంటించుట కొరకు.

ప్రాపాలిక (పు.) చలివెందలిదగ్గర నియుక్తుడైనవాడు An attendant at a water-station.

ప్రాప్తఫలా (స్త్రీ.) ప్రథమరజస్వల ఐన.

ప్రాప్తవ్యవహార (వి.) వ్యవహరించదగిన వయస్సు వచ్చినవాడు. మెజారిటీ వచ్చినవాడు.

ప్రామిత్యక (పు.) ధాన్యం ఇమ్మని కోరు చున్నవాడు.

ప్రార్థ్ (ధా.) ఎదిరించు, To attack.

ప్రావృత్తిక (వి.) శుభవార్త తీసికొనివచ్చిన

ప్రాశ (పు.) ఆహారం.

ప్రాస్తర (వి.) రాళ్లతో నిండిన.

ప్రేక్షా (స్త్రీ.) నాటకాది ప్రదర్శనం.

ప్రేతాభినివేశ (పు.) మరణించినవాని విషయనిర్దేశం. An affidavit of a person (since) diseased.

ప్రోతి (స్త్రీ.) బట్టలునేయు దారం పోగు. A strand in weaving.

ప్రోషితా (స్త్రీ.) ఇల్లువదలిపోయిన స్త్రీ.

ప్లవక (పు.) తాడుమీద ఆడేవాడు.

ఫ

ఫల (న.) పురుషాండం.

ఫలామ్ల (న.) పుల్లని పండ్లరసం.

ఫల్గు (వి.) తక్కువ వెలగల.

ఫల్గుబల (న.) దుర్బలమైన సైన్యం.

ఫణిత (పు.) బెల్లపు పాకం.

ఫేలక (పు.) కుక్కకొరకు ఏర్పరచిన

చిన్న గది Kennel. జంతువులమూతి.
ఫేలా (స్త్రీ.) పెట్టె

బ

బన్ధ (పు.) ఒక భాగం. ఒక వాయిదా A part, an instalment.
బన్ధక (పు.) కంట్రాక్టరు, ప్రధాన కర్మచారి (a foreman).
బన్ధకీపోషక (పు.) పడుపువృత్తి నడిపేవాడు A brothel-keeper.
బన్ధన (న.) (1) తాకట్టుపెట్టుట pledging, (2) మైత్రీసంబంధం (3) కట్టడానికి త్రాళ్లు.
బన్ధువాహన (పు.) వ్యవహారాలలో బంధు బలకుటికా(స్త్రీ.) వులచేత నడపబడు వాడు. సైన్యాన్ని చేర్చుట. గట్టి ఇల్లు.
బలమాస (పు.) సైనికులకు జీతాలిచ్చే మాసం.
బాహిరిక (పు.) దేశాటనం చేసే వాళ్ల సంఘానికి చెందినవాడు.
బాహూత్సార (అవ్య.)చేతితో గెంటివేసినట్లు గెంటివేయు.
బాహ్య (వి.) గ్రామప్రాంతాలనుండి సేకరించిన (పు) (1)రాజప్రాసాదానికి చెందని బైటవాడు, (2)రాజధానినుండి దూరంగా ఉంచబడిన అధికారి, (3) కొత్తవాడు, అపరిచితుడు, (4) ముట్ట డించినవాడు.
బాహ్యకోప (పు.) బైట ప్రాంతానికి చెందిన అధికారి తిరుగుబాటు.
బిమ్బ (న.) (1) బొమ్మ An image, an effigy, (2) ముద్ర. రంగు, (3) ప్రదర్శనం a show, an exhibition.
బిలఖాతలేఖన ఎలుకలు మొదలైనవి చేసిన కన్నాలు.
బీజ (న.) (1) ప్రధానపదార్థం Essence, (2) మిశ్రలోహం An alloy, (3) పెకలించుట.
బీజబన్ధ (పు.) ప్రధానమైనదానిని తయారుచేయుట
బోలన (న.) మాట్లాడుట A talk.
బ్రహ్మదేయ (న.) బ్రాహ్మణులకు చేసిన భూదానం.
బ్రహ్మదేయిక (పు.) దానం తీసికొనే బ్రాహ్మణుడు.

భ

భక్ష్ (ధా.) మ్రింగివేయు, నశింపచేయు.
భక్షోత్సృష్ట-(క.)(వి.) పాడుపడిపోవడంచేత విడిచివేయబడిన.
భఙ్గ (పు.) ఓడిపోవుట.
భఙ్గందా (ధా.) ఓడిపోయినట్లు అభిన యించు.
భఙ్గప్రదాన (న.) ఓడిపోయినట్లు కన బడుట.
భజ్ (ధా.) బాధ్యత కలవాడగు, To be responsible for, to be liable for.
భణ్డక (పు.) పాత్ర.
భణ్డికా (స్త్రీ.) కరిగించిన బంగారం పోసే పాత్ర. సాధనాల పెట్టె a tool box.
భద్ర (వి.) మంచిస్వభావం గల.
భద్రశ్రియ (న.) ఒకానొక సుగంధద్రవ్యం లేదా సుగంధం ఉన్న కఱ్ఱ.

భరుజాః (పు.) వేయించిన బార్లీలు.

భర్మన్ (న.), భర్మణ్యా (సీ.)మనువర్తి. పెంపకం.

భస్త్రా (సీ.) తోలుసంచి, తోలుతిత్తి.

భాజనీ, భాజనీయ (వి.) కూలి ఇచ్చే ఎత్తు లేదా కొలత.

భాటక (న.) అద్దె.

భాణ్ణ (న.) (1) వస్తువు An article, a commodity, (2) తయారుచేసిన వస్తువు a manufactured article, (3) వస్తువులు ఉంచే పాత్ర, (4) మానసాధనం.

భిఙ్గిసీ (సీ.) ఒకరకమైన ఉన్నిబట్ట.

భిన్నకూట (వి.) నాయకుడు లేని.

భూతపూర్వ (వి.) పూర్వమే నిశ్చయించబడిన Which was formerly settled, which was formerly worked, పూర్వం రాజుకు చెందినది.

భూమిచ్ఛిద్రా పిధాన (న.)సాగులో లేని భూమిని సాగుకు తెచ్చుట.

భృ. (ధా.) సహాయంచేయు, To support, to serve, సంరక్షించు To maintain, (2) అద్దెకు తీసికొను లేదా ఇచ్చు.

భృత్యభావిన్ (వి.) ఒకరిమీద ఆధారపడే స్వభావం గల.

భృష్టి (సీ.) గులకరాళ్లు ఇసుక మొదలైన వాటి విస్తృతప్రదేశం.

భోగ (పు.) (1) జీతం, (2) వేశ్యకు విటు డివ్వవలసిన సుంకం, (3)పండినది, తయారైనది Produce, (4) ఉపయోగం, లాభం Service, use, benefit, (5) విస్తారము.

భోగనిగ్రహ (పు.) అనుభవించకుండా అపుట.

భ్రమ (పు.) జలమార్గం. A fountain or a water Course.

భ్రేష్ (ప్రే.ధా.) నష్టం కలిగించు.

భ్రేష (పు.) నష్టం, చెడిపోవుట Deterioration.

## మ

మక్కణ (పు.) దంతాలులేని ఏనుగు.

మఞ్చపృష్ఠ (వి.) మధ్య కొంచెం లోతుగా ఉండి పైన సమంగా ఉన్న. With a flat surface (slightly depressed in the middle).

మణిరాగ (పు.) మణులకు రంగు వచ్చేటట్లు చేయుట.

మణ్డ (పు.) మీగడ.

మణ్డల (న.) లోహపుబంతి.

మతిప్రవివేక (పు.) అభిప్రాయభేదం.

మత్స్యణ్డికా (సీ.) పూర్తిగా తెల్లగా చేయబడని పంచదార లేదా బెల్లం Unrefined sugar.

మదనయోగ (పు.) మనిషిని కదలకుండా చేసే ఏవేవో కలిపిన పదార్థం A stupifying mixture.

మదనరస (పు.) కదలకుండా చేసే పానీయం A stupifying or poisonous drink.

మదిరా (సీ.) దుర్గాదేవికి ఒక పేరు.

మధ్యభేదిన్ (వి.) శత్రుసైన్యమధ్యం

చీల్చగల.

మన్త్రయుద్ధ (న.) రాజతంత్రప్రయోగం ద్వారా యుద్ధం. Diplomatic war.

మయూరపద (న.) తక్కెడ తగల్చిన వక్రదండం. The arch from which a balance is suspended.

మసూరక (వి.) పూర్తిగా గుండ్రంగా లేని

మహాకచ్ఛ (పు.) ఒకదేవత పేరు. వరుణుడు.

మహాకచ్ఛవర్ధన (న.) నీటిలో ఉండుట.మహా కచ్ఛదేవతారాధనం.

మహామాత్రీయ (వి.) పెద్ద అధికారుల అధికారపరిధిలో ఉన్నది. Be longing to the jurisdiction of high state officers.

మాంస (న.) పండులోని కండ.

మాణవ (పు.) దోపిడిదొంగ మొదలైన అపరాధి A criminal such as a decoit, adulterate etc.

మాణవక (పు.) దోపిడిదొంగ.

మాణవవిద్యా (స్త్రీ.) దొంగలు మొదలైన వాళ్లకు ఉపయోగించు రహస్యవిద్యలు Magical arts useful for decoits etc.

మాతృకా (స్త్రీ.) (1) మూలాధారం Source, basic type, (2) వేశ్యమాత.

మాత్స్యన్యాయ (పు.) బలవంతుడు దుర్బలుణ్ణి పీడించే పద్ధతి (పెద్దచేప చిన్న చేపను మింగినట్లు).

మానవ్యాజీ (స్త్రీ.) ఏదైన వస్తువు తూచినా కొలిచినా పైగా ఇచ్చేది. Commission paid when measuring out (articles).

మానస్రావ (పు.) కొలతలో లేదా తూకంలో నష్టం.

మాపక (పు.) కొలతలు తూనికలు పరీక్షించే అధికారి.

మాయక (పు.) కొలిచేవాడు, తూచేవాడు.

మాయాగత (న.) భ్రాంతి కలిగించుట.

మాయాయోగవిద్ (పు.) మాయలలో నేర్పరి.

మార్గ (పు.) అశ్వగమనం.

మార్గణ (న.) విషయపరిశీలనం An inquiry, an investigation.

మార్గయుక (వి.) వేటకు ఉపయోగించు.

మార్గదేశిక (వి.) మార్గం చూపడానికి ఉపయోగించు.

మార్గాపన్న (వి.) సరియైన పద్ధతిలో చేయబడిన.

మాషక (పు.) (1) ఒక బరువు A kind of weight, (2) ఒక రాగినాణెం (పణంలో 16వ వంతు).

మాహానసిక (పు.) ప్రధానపాచకుడు The head cook.

మిత్రభావిన్ (పు.) మైత్రీభావం కలవాడు.

ముఖ (న.) రాబడి ద్వారం The head of (income).

ముఖలవణ (న.) ఒక ఉప్పు. జాతిఉప్పు salt from indus land, rock salt.

ముఖ్య (పు.) ప్రధానాధికారి.

ముణ్డ (పు.) (1) బోడితల సంన్యాసి (2) (వి) బోసిగా ఉన్న. పైన ఏమీలేని

ముణ్డకద్వార (న.) ఒకరకమైన నగరద్వారం

ముద్రా (స్త్రీ.) ముద్ర A stamp. a seal, సీలువేసిన పాస్‌పోర్టు.

మురజక (న.) ప్రకారంగోడమీద నున్న మద్దెల ఆకారంలో ముందుకు పొడుచుకొనివచ్చే రాయి.

ముషుణ్ఠీ (సీ.) గద

ముష్టి (పు.) విత్తనాలు చల్లుట.

ముష్టికా (సీ.) పిడికిలి.

మూకమూషా (సీ.) పుటంవేసే పాత్రమీద ఉంచిన మరొక పాత్ర A dummy crucible.

మూఢగర్భ (వి.) అస్పష్టమైన మధ్యభాగం గల.

మూత (పు.) మూతా (సీ.) గడ్డితో అల్లిన సంచి.

మూర్ఛిత (వి.) బలపర్చబడిన.

మూల (న.) మూలాధారం, వంశానుక్రమంగా వచ్చిన రాజ్యం లేదా రాజధాని. తండ్రితాతల ఆస్తి, ప్రధానాధికారులు.

మూలకర్మన్ (న.) ఓషధిమూలాలతో చేసే అభిచారకర్మ.

మూలవాప (పు.) దుంపలు పాతుట.

మూలహర (వి.) (1) వారసత్వాన వచ్చిన ధనం వ్యర్థంగా ఖర్చు పెట్టేవాడు (2) ఇతరుని రాజ్యభాగాన్ని ఆక్రమించువాడు, ఒకని ఆస్తిని నశింపచేసేది.

మూలాట (పు.) పై మీగడ తీసివేసిన పెరుగు.

మూలాటీ (సీ.) ఒక మొక్క.

మూషికకర (పు.) ఎలుకల రూపంలో పన్ను.

మృత్యుకూట (న.) చంపే రహస్యసాధనం A death trap.

మేణ్ఢక (న.) గొఱ్ఱెతల ఆకారంలో ప్రాకారం గోడకు ముందుకు చొచ్చుకొని వచ్చేరాయి.

మేఢీప్రతతి (సీ.) ముళ్లకొమ్మలు ఉన్న ప్రదేశం.

మేదక (పు.) (1) మేదరి, తవ్వేవాడు (2) ఒకరకమైన మద్యం.

మైరేయ (పు.) మత్తు కలిగించే ఒక రకమైన మద్యం.

మోక్ష (పు.) విడాకులు Divorce.

మోఢ (పు.) చిన్న దంతాలున్న ఏనుగు.

మోహనగృహ (న.) భ్రాంతి కలిగించే ఇల్లు.

మౌఖ (వి.) గురుశిష్యముఖపరంపరచేత వచ్చిన.

మౌల (వి.) తండ్రితాతలనుండి లభించిన.

## య

యత్నోపచార్య (వి.) ప్రయత్నపూర్వకంగా ఉపచారం చేయతగిన.

యన్త్ర (న.) యంత్రం A machine, a machanism.

యన్త్రిక (పు.) యంత్రం నడిపేవాడు.

యమక (వి.) జోడు, దగ్గరగా చేర్చబడిన.

యాతవ్య (పు.) దండెత్తి వెళ్లి ఆక్రమించదగినవాడు.

యాతవ్యా (సీ.) సైన్యప్రయాణం.

యాతృ (పు.) సారథి.

యాత్రా (సీ.) (1) సైన్యయాత్ర, (2) జాతర

యాన (న.) దండెత్తి వెళ్లుట.

యానపాత్ర (న.) నావ .

యాపన (న.) వివాహంలో కన్యను స్వీకరించుట.

యామతూర్య (న.) జాముజాముకీ మ్రోగించే తూర్యం.

యావత్కాలిక (వి.) కొంతకాలం ఉంచదగిన Temporary.

యుక్త (పు.) అధికారి An Officer.

యుగపిజ్ఞన (న.) కాడినుండి విప్పుట.

యుగ్య (వి.) కాడికి కట్టదగిన పశువు.

యోగ (పు.) (1) ఉపయోగం, use, employment, (2) ప్రయోగం Practical application, (3) రహస్యోపాయం A secret remedy. a trick.

యోగదర్శన (న.) మాయచేత తయారు చేయుట.

యోగపాన (న.) విషం కలిపిన మందు కలిపిన పానీయం.

యోగపురుష (పు.) రహస్యంగా పంపబడిన మనిషి Secret agent.

యోగవామన (న.) వంచన చేసి శత్రువును బైటకు వెళ్లేటట్లు చేయుట.

యోగవిక్రయ (పు.) వంచించి అమ్ముట.

యోగవృత్త (న.) రహస్యప్రవర్తన.

యోగసురా (నీ.) మందుకలిపిన మద్యం.

యోగస్త్రీ (సీ.) రహస్యంగా పనులు చేసే గూఢచారచర్యలు చేసే స్త్రీ.

యోగాఞ్జన (న.) విషం కలిపిన కాటుక.

యోగాను విధాయిన్ (వి.) కలపడానికి అనుకూలమైన, మరొకవస్తువుతో కలిపినా సువాసన చెడని.

యోగ్యా (సీ.) ఎక్సర్‌సైజ్ Exercise, drill.

యోగ్యాచార్య (పు.) ట్రైనింగ్ ఇచ్చే గురువు.

యోనిపోషక (పు.) జంతుపోషకుడు. వ్యభిచారగృహం నడిపేవాడు.

యౌన (వి.)వివాహసంబంధంవల్ల ఏర్పడిన.

యౌనానుబన్ధ (పు.) వివాహసంబంధం.

## ర

రక్షా (సీ.) కోట నిర్మించుట.

రక్షిన్ (పు.) రక్షకుడు A guard, a policeman.

రఙ్గోపజీవిన్ (పు.) రంగప్రదర్శనల ద్వారా జీవించేవాడు.

రజ్జు (పు.) త్రాడు, భూమి కొలచుట Land survey

రజ్జుభాణ్డ (న) త్రాళ్లకు ఉపయోగించే ముడి సరుకు.

రజ్జువర్తక (పు.) త్రాళ్లు పేనేవాడు.

రథిక (పు.) రథంతో కూడా ఉండేవాడు.

రథ్య (పు.) రథానికి కట్టదగిన అశ్వం.

రశ్మి (పు.) దారం, త్రాడు.

రస (పు.) (1) విషం, (2) లోహద్రవం.

రసద (పు.) విషం పెట్టేవాడు.

రసపాక (పు.) లోహద్రవాన్ని ఉడికించుట.

రసవిద్ధ (వి.) (1) లోహద్రవంనుంచి తీసిన (2) విషం కలిపిన.

రాఙ్కవ (న.) రంకుమృగం బొచ్చు.

రాజకిల్బిషిన్ (పు.) రాజయక్ష్మరోగి.

రాజువిష యంలో అపరాధం చేసినవాడు.

రాజదాయిక (న.) రాజుకు ఇవ్వవలసిన సొమ్ము.

రాజద్వారిక (పు.) రాజుదగ్గరికి తీసికొని వెళ్లకలిగినవాడు.

రాజద్విష్ట (న.) రాజద్రోహం.

రాజపరిగ్రహ (పు.) రాజుసొత్తు. రాజప్రాసాద భూమి.

రాజప్రణిధి (పు.) రాజు చేయవలసిన నిత్యకృత్యాలు The daily routines or duties of the king.

రాజభాగ్య (న.) రాజునుండి లభించే భాగ్యం.

రాజమణ్డల (న.) రాజుయొక్క ఆదాయ వ్యయశాఖ. The king's exchequer, రాజులమండలం The circle of kings.

రాజవర్ష (న.) రాజు రాజ్యానికి వచ్చిన నాటినుండి లెక్కించే సంవత్సరం.

రాజవాస్తుక (న.) రాజనివాసస్థానం.

రాజవ్యఞ్జన (పు.) రాజువంటి వేషంలో ఉన్నవాడు.

రాజశబ్దిన్ (పు.) రాజు అనే బిరుదు ఉన్నవాడు.

రాజశబ్దోపజీవిన్ (పు.) రాజు అనే పేరుతో బ్రతికేవాడు.

రాజహార (పు.) రాజు తీసికొనే భాగం.

రాత్రిదోష (పు.) రాత్రులలో చేసే అపరాధం.

రాత్రిసత్ర (న.) రాత్రి ఆక్రమణం కోసం పొంచి ఉండడం. (లేదా రాత్రీ, పొంచి ఉండడము) The ambuscade at night (or an ambuscade and night time)

రాధా (స్త్రీ.) పైమెరుగు A false shine or lustre.

రాశిమూల (న.) రాశినుండి తీసికొనిపోగా మిగిలినది.

రాష్ట్ర (న.) దేశం, పల్లెప్రాంతం, పల్లె ప్రాంతంనుండి వసూలైన పన్ను The Country, The Country-side. Revenue derived from the country side.

రూప (న.) (1) వస్తువు (2) జంతువు, పశువు (3) ఎక్కువ రుసుము A sur charge (of 80%) (4) పరీక్షాశుల్కం Inspection fee, (5) నాణెం.

రూపదర్శక (పు.) నాణాలు పరీక్షించే వాడు.

రూపదాసీ (స్త్రీ.) రూపవతియైన దాసి.

రూపాజీవా (స్త్రీ.) వేశ్య.

రూపాభిగ్రహ (పు.)అపహరించని వస్తువులతో నిగ్రహించడం.

రూపిక (న.) నాణాలు తయారుచేయడానికి శుల్కం.

రూప్య (న.) వెండి.

రోచక (పు.) పప్పుదినుసులు నలగ కొట్టువాడు.

రోచకయన్త్ర (న.) పప్పుదినుసులు నలగ గొట్టే యంత్రం.

రోచనీ (స్త్రీ.) మిల్లు Grinding mill.

రోచనీదృషద్ (స్త్రీ.) నలగగొట్టేరాళ్లు The mill- stones.

రోధ (పు.) (1) అడ్డగించుట (2) ముట్టడింపు.

రోమ (న.) జంతువుల బొచ్చుతో తయారు

చేసిన బట్ట.

ల

లక్షణ (న.) చిహ్నశాస్త్రం.

లక్షణ్య (వి.) మంగళకరమైన లక్షణాలు గల.

లక్షిత (వి.) గుర్తు వేయబడిన marked (with a seal)

లగ్నక (వి.) వేడిగా ఉన్న.

లఘుసముత్థ. లఘూత్థాన (వి.) కొంచెం ప్రయత్నం చేతనే సిద్ధంచేయదగిన mobilizing with little effort. or on a small scale.

లజ్జన(వి.) దుముకుటలో తరిఫీజు పొందిన.

లబ్ధప్రశమన (న.) జయించిన రాజ్య భాగాన్ని జాగర్తచేసికొనుట.

లమ్బరా (స్త్రీ.) ఒకరకమైన పక్క వేసు కొనే దుప్పటీ.

లమ్భ (పు.) సంపాదించుట. జయించి సంపాదించుట, (2) లక్ష్యాన్ని కొట్టుట.

లయన (న.) పర్వతగుహ.

లవ (పు.) ఛేదించినా మళ్లీ మొలిచే ఒక మొక్క.

లాభ (పు.) ఆలస్యంగా అందిన లేదా వాయిదాలమీద అందిన సొమ్ము De ferred payment or receipt by instalments.

లేణ్డ (న.) పేడ.

లోప్త్ర (న.) అపహరించిన సొత్తు

వ

వక్తవ్య (వి.) నిందించదగిన. ఉప యోగించని

వణిక్పథ (పు.) వర్తకమార్గం.

వధావధ (పు.) ఏనుగులు మనుష్యాదుల ను తొక్కి, దంతాలతో పొడిచి చంపుట. మనుష్యాదులను పట్టుకొనుట.

వప్ర (పు.) మట్టిప్రాకారం.

వమన (న.) జనులను ఒకచోటి నుండి మరొకచోటికి చేర్చుట.

వరకార (పు.) మంచి పనిచేయుట.

వరణ (న.) వివాహనిశ్చయం.

వరత్రా (స్త్రీ.) త్రాడు.

వర్చ (పు.) మలవిసర్జనస్థానం.

వర్గ (పు.) ఒక తరగతి class, type, రంగు, నాణ్యత Colour or quality.

వర్ణక (పు.) స్పర్శ, ఒకపరిమాణం, ఒక తరగతి Type, variety. రంగుదుప్పటి.

వర్ణికా (స్త్రీ.) మంచితరగతి బంగారం The standard gold.

వర్తన (న.) చుట్టూ తిరుగుట going round.

వర్తనీ (స్త్రీ.) మార్గశుల్కం.

వర్ధకి (పు.) వడ్రంగి.

వర్ధన చూ. మహాకచ్ఛవర్ధన

వర్షవారణ (న.) వర్షం నివారించేది. Rain proof.

వల్గన (న.) గుఱ్ఱం వేగంగా పరుగెత్తడం Moving at a gallop.

వశోపనయన(న.) స్వాధీనం చేసికొనే ఉపాయం.

వసతిభోగ (పు.) రాత్రి ఆగినందుకు

